నకు సిద్ధమగుచున్నవి. యూరపుఖండమునందుగల శేషించినరాజ్యములన్నియును సాయుధపాణులై సంగ్రామమునకు సంసిద్ధములగుచున్నవి. దురాశాగ్రస్తమై దైన్యస్థితికి పాలైనజర్మనుదేశము నిస్సహాయస్థితి ననుభవించుచున్నది. నానాజాతిసమితియందు జేరిన రాజ్యములన్నియును ధర్మసంస్థాపనమును జేయుటకు శక్తిలేక వెనుకాడుచున్నవి. ప్రపంచము నావరించిన దురాశాలోభమోహమదమాత్సర్యములు యథేచ్ఛగా విహరించుచున్నప్పుడు ప్రపంచశాంతి చేకూరుట యసంభవము. యూరపురాజ్యములైదువందల ఏండ్లనుండియును సుఖారాధనమునకు జేసిన విశ్వప్రయత్నములు దుఃఖాంతములైనను జర్మనులమహాదుఃఖానుభవము ప్రత్యక్షముగగన్పించుచున్నను ప్రపంచమునకు జ్ఞానోదయము గలుగని విధమును వర్తమానపరిస్థితులు సహస్రముఖములను విశదముచేయుచున్నవి. పాశ్చాత్యరాజ్యములు చిరకాలము కష్టపడి సంక్షోభమును మహాదుఃఖమును గలుగజేసి రాక్షసబలాధారమున గడించిన మహాసంపదలు నాలుగేండ్లలో మటుమాయమైనవి. పాశ్చాత్యసభ్యత్వాధికారమునను నిర్మితములైన పరిశ్రమలు-వ్యాపారములు - సంపదలస్థితులు - ధర్మసిద్ధాంతములు కూలిపోయి పాశ్చాత్యరాజ్యములన్నియును కర్తవ్యమును కనుగొనలేక పరితపించుచున్నవి. పాశ్చాత్యరాజ్యముల దృష్టి పూర్వమువలెనే పరాక్రమణాయత్తమైనవిధమును వర్సేలు సంధినుండి లాసేను సమావేశమువఱకును జరిగిన రాజ్యవ్యవహారములు వ్యక్తముచేయుచున్నవి. వర్సేలు సంధిసభయందు నాటిన విషబీజములు గతించిన నాలుగేండ్లయందును అనంతములైన విషఫలములను సముత్పన్నమొనర్చినవి. పాశ్చాత్యరాజ్యములు స్వకర్మసంజాతములైన విషఫలముల ఫలము ననుభవించుచున్నను స్వీయసంస్కారమున కనుకూలమైన విషబీజములనే తిరిగి వృద్ధిజేయుచు ప్రపంచమును మహాదుఃఖమార్గమునను నడుపుచున్నవి. పాశ్చాత్యరాజ్యముల దురహంకారము-స్వార్థపరత్వము-రాక్షసబలము - పరస్పరసంహారమునకు వినియోగపడి మహాప్రళయమునందు ధర్మసంస్థాపనార్థము పరమశాంతస్వరూపుఁడవతరించుట జగన్నాటకసూత్రధారియొక్క సంకల్పమై యుండును. ప్రళయబీజములకు ఫలము మహాప్రళయముగాని శాంతి గాజాలదు. భారతేతిహాసపురాణములయందు వర్ణింపబడిన కల్క్యవతారావతరణసమయము మాసన్నమైన దని సంక్షోభాయత్తమైన ప్రపంచపరిస్థితులుసూచించుచున్నవి.

క. భగవంతుం డగు విష్ణుఁడు
జగముల కవ్వేళ రాక్షసవ్యథగలుగం
దగ నవ్వేళలఁ దడయక
యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్.

ప్రపంచ ప్రవృత్తియందు మహాప్రస్థానమునకు సృష్టిస్థితిలయావస్థలు సాధనములైనను కొన్నిసమయములయందు మందశాంతిస్థితికంటెను తీవ్రప్రళయము పరమసాధనము కాగలవిధమును ప్రపంచేతిహాసము లుపదేశించుచున్నవి. ఆ యుపదేశధర్మము సుస్థాపితమగుటకు సన్నిహితమైన ప్రళయావస్థ సాధనమగుట భగవన్నిర్ణయముగ నుండును. ఆ కల్యాణధర్మయుగోదయమునకు సకలజాతులును రక్తాక్షిసంవత్సరమందు ప్రాచీనసంస్కారసంజాతములైన స్వార్థప్రయోజనములను విసర్జించి నవయుగారంభయోగ్యములైన పరార్థప్రయోజనముల స్వీకరించి స్వాగతంబు నొసంగుచు సంసిద్ధములగుటకు భగవంతుఁ డనుగ్రహించుగాక!

మహావిలయమునకు మూలములైన ఇకారాంతసప్తవర్షకమునందును దుందుభి యస్తమించి రుధిరోద్గారి యుదయించినది. ఈ సప్తకమునందు కాళయుక్తికి శుక్రుడు, సిద్ధార్థికి కుజుడు, రౌద్రికి రవి, దుర్మతికి శని, దుందుభికి బుధుడును నేలికలై మహాసంక్షోభముగలుగజేసిన విధమును గతించిన యైదేండ్లదుఃఖానుభవము విశదముచేయుచున్నది. రుధిరోద్గారి సంవత్సరమును గతాబ్దముల దుఃఖసంస్కారానుభవము ననుభవించునని నమ్ముటకు సూచనలు గలవు. రుధిరోద్గారిసంవత్సరమునకు ప్రచండమార్తాండుడు ప్రభువు. ఫలము: యుద్ధము స్వల్పవృష్టి. ప్రజలకు రాజభయము, శస్త్రచోరాగ్నిభయము. శుక్రుడు మంత్రి సేనాధిపతి మేఘాధిపతి గ్రామపాలకుడు. ఫలము: సువృష్టి గోక్షీరాభివృద్ధి వృక్షఫలాభివృద్ధి స్త్రీసంయోగప్రీతి శ్వేతధాన్యాభివృద్ధి. చంద్రుడు సస్యాధిపతి పరీక్షకుడు నీరసాధిపతి పురోహితుడు. ఫలము: వరిపంట క్షీరాభివృద్ధి సస్యసమృద్ధి విద్యాభివృద్ధి వృక్షఫలాభివృద్ధి ధాన్యాభివృద్ధి లోహాభివృద్ధి సువర్ణమౌక్తికాభివృద్ధి వస్త్రాభివృద్ధి. శని ధాన్యాధిపతి. ఫలము: కృష్ణధాన్యాభివృద్ధి సూక్ష్మధాన్యాభివృద్ధి. గురువు అర్ఘాధిపతి దైవజ్ఞాధిపతి ఫలము: సువృష్టి సస్యధనసమృద్ధి నిత్యోత్సవములు రాజ్యనీతి బుద్ధికుశలత.

బుధుడు రసాధిపతి. ఫలము: తైల ఘృత గుడ పిప్పలీ శుంఠి హింగులలకొనాదికాభావము. కుజుడు గణకుడు— ఫలము: విషబాధ అగ్నిబాధ శస్త్రబాధ పరస్పర వైరుధ్యము అపరసస్యనష్టము. కృష్ణుడు పశుపాలకుడు. ఫలము: పశువృద్ధి సుభిక్షము తృణవర్షాభివృద్ధి. సంవత్సరపు సామాన్యఫలము:

శ్లో. ఆహవే నిహతా స్సర్వే భూపాలో౽గ్ని స్తథాజనాః
తథాపి తత్ర జీవంతి రుధిరోద్గారి వత్సరే.

గ్రహములసంయోగమును సమస్తకమును సరిష్టములకు గారణము బగునని దైవజ్ఞులు నిర్ణయించిరి. దైవజ్ఞు లీ యరిష్టరోగములను నిర్ణయించిరి:

శ్లో. రవిమందా వేకరాశౌ నృపాణాం కలహం భవేత్
బుధమందా వేకరాశౌ దుర్భిక్షం వ్యాధిపీడనం.
భౌమేజ్య మందాయది యేకరాశౌ పరస్పరం సప్తభేన్వితాస్స్యుః
సాకేత లంకాపురి మధ్యదేశే క్షుధా భయం శస్త్రభయం నరాణాం.
యావన్మార్తాండసూనుః ప్రవిశతి ధనుషం మీనకస్యేచ రాశౌ
తావ ద్రాజేంద్రపీడా జనపతిమరణ క్షుత్పిపాసాది ఘోరాః.
యద్యేకరాశౌ గురు భార్గవాచేత్ గురోః కళత్రేచ భృగుస్తు వక్రీ
సిద్ధంహి యుద్ధం మనుజాధిపానాం వృష్టిర్వినాశంసమునైత్వితద్వత్.

సంగ్రామము సంక్షోభము విప్లవము విద్వేషము సామాన్యఫలములని గ్రహస్థితి కనుకూలముగ లోకస్థితియును విశదము చేయుచున్నది. యూరపు రాజ్యములకు మహాసంగ్రామానుభవము శ్మశానవైరాగ్యముగ బరిణమించినది. సంగ్రామానలదగ్ధములైన దేశములు దుఃఖవేదనమునను భవించుచున్నను సంగ్రామానల ముపశమనమును బొందక యే దుఃఖసాధనములను నపారముగ నిర్మించుచున్నవి. మహారాజ్యములవలె స్వరాజ్యములును లోభగ్రస్తములై ప్రజలను సంపదలను లోభదేవతకుబలి నిచ్చుచున్నవి. లోభమహాదేవత తన పరివారముతో విహారముచేయుచు నఖండమైనయశాంతిని కలుగజేయుచున్నది. లోకావృతమైన యశాంతస్థితియందు గతకాలాగతములైన ప్రళయసంస్కారబీజములు రుధిరోద్గారిసంవత్సరమందును ప్రళయాకారమును దాల్చుటకు ప్రపంచపరిస్థితులు పరిపక్వముగ నున్నవి. పరిపక్వము లైన ప్రళయబీజముల నుపశమింపజేసి లోకకల్యాణమునకు భగవంతుడు శాంతిని గలుగజేయును గాక.

ఐరోపామహాసంగ్రామ మాసియాఖండమునకు క్షణకాల ముచ్ఛ్వాస నిశ్వాసములను విడుచుటకు భగవదనుగ్రహమువలన గలుగజేసినది.

ఆసియా లబ్ధావకాశము

యూరపు రాజ్యములు పరస్పరసంహారసాధనములను నిర్మించుచు నాసియాదేశముల కాత్మ పరిశోధనమున కవకాశములను గలుగజేసినవి. విజయమును బడసిన రాజ్యములకును పరాజితములైన రాజ్యములకును భాగలబ్ధములను నిర్ణయించుకొనుట దుస్తరమైనది. ఫ్రాంసుదేశమునకును గ్రేటుబ్రిటనునకును గ్రీసుదేశమునకును తురుష్క-రాజ్యగ్రసనము దుర్భరమై అన్యోన్యకలహమును వృద్ధిజేసినది. యూరపుఖండమునందు దండనీతి నవలంబించిన ఫ్రాంసుదేశ మాసియాఖండమునందు దానోపాయ మవలంబించినది. తురుష్కులతో సంధిని జేసి తురుష్కుల ప్రతాపవిజృంభణమున కవకాశము గలుగజేసినది. తలతిరిగి ప్రవర్తించిన గ్రీకుబలములను మూడువారములలో ఆసియాఖండమునుండి వెడలగొట్టి తురుష్కులు నిస్సహాయస్థితియం దుండినను వారికి సహజమైన శౌర్యప్రతాపములను విశదము చేసిరి. తురుష్క-విజయములతో నాసియాఖండప్రతిభయును మహమ్మదీయ ప్రపంచ ప్రతాపమును తలయెత్తినవి. రాక్షసబల ప్రదర్శనమునందైనను పాశ్చాత్యరాజ్యములకుగల ప్రతిభ ప్రాచ్యరాజ్యములకును గలదను సత్యమును జపానీయులు ప్రతిపాదించిన విధముననే తురుష్కులు సయితము ప్రతిపాదించి యాసియాఖండమున కాత్మసంస్మరణమును గలుగజేసిరి. తొంబదికోట్ల ప్రజలకు ప్రబోధము గలిగి ఆత్మబలప్రకర్షమును జేయుటకు తగిన అవకాశము గలుగునపుడు ప్రపంచపరిస్థితులు మాఱగల విధమును ఆసియాఖండ విజయములు విశదము చేసినవి. అనిత్యమైన రాక్షసబలవిసర్జనమునుజేసి ఆత్మబలసాధనమున ప్రపంచ శాంతిని స్థాపింపగల విధమును నాసియాఖండ విజయమును ప్రతిష్ఠింపగల విధమును శిరోభూషణమైన భరతఖండము విశదముచేసినది.

గత సంవత్సరమునందు నిరంకుశాధికారవర్గము నిర్బంధాయుధములను విచ్చలవిడిగ ప్రయోగించి ఆత్మసంరక్షణమును జేసికొన్నవిధమును గత సంవత్సర వ్యవహారములు విశదము జేయుచున్నవి. శాంతిసందేశకరుడగు గాంధిమహాత్ముడు కారాగృహమందు నిర్బంధము ననుభవించుచున్నాడు. వేలకొలది దేశసేవకులు శాంతిసంరక్షణవ్యాజమునను నిర్బంధముల ననుభవించిరి. మత ధర్మసంరక్షణదీక్షను వహించిన అకాలీలు వేలకొలది

నిర్బంధములకు గురియైరి. ప్రజలకు వారి జన్మస్వత్వములను బోధించిన దేశభక్త వేంకటప్పయ్యగారు శ్రీమతి దువ్వూరి సుబ్బమ్మగారు మున్నగు దేశభక్తులు నిర్బంధముల ననుభవించుచున్నారు. దేశమంతయును నిర్బంధాస్త్రమయమై హృదయవేదనమునకు గారణంబైనను ప్రజలు ప్రశాంతస్వభావము గలిగి భారతహృదయమునకు సహజమైన నిగ్రహయోగమును బూని ప్రపంచశాంతికి సాధనమైన ధర్మమార్గమును ప్రదర్శించిరి. లోకప్రియుడైన గాంధిమహాత్ముడు మహానాయకులు బంధుమిత్రాదులు మహాకష్టముల ననుభవించుచున్నను ప్రజలు నిగ్రహపరాయణులై అసహాయోద్యమప్రతాపమును లోకమునకు విశదము చేసి ప్రపంచోద్ధరణమునకు సాధనమైన ధర్మమార్గమును ప్రపంచకల్యాణమునకు సాధనము గాగలవిధమును స్వయందుఃఖానుభవమువలనను విశదముజేసి ధర్మవిజయమును ప్రతిష్ఠించిరి. ఈధర్మవిజయము పరమారిష్టదాయకమైన రుధిరోద్గారి సంవత్సరమందును స్థిరమై వికసించి భారతదేశకల్యాణమునకును ప్రపంచకల్యాణమునకును స్థిరశాంతికిని వినియోగపడుటకై దివ్యమంగళమూర్తి విశ్వేశ్వరుడు తోడ్పడుగాక!

**రుధిరోద్గారి సంచిక**

భగవదనుగ్రహమువలనను ఆంధ్రుల యాదరణపోషణమువలనను ౧౩ సంచికల నాంధ్రప్రపంచమునకు సమర్పించితిమి. పదునాల్గవ సంవత్సరాది సంచికను మొదటిసంచికలవలెనె సకాలమున నాంధ్రలోకమునకు సమర్పించుటకు దోడ్పడిన యాంధ్రమహాజనులకు వందనశతములు. సాధారణ సంవత్సరాదిని ప్రారంభమైన సంవత్సరాది సంచికల ప్రచురణ మీ పదుమూడేండ్లును నిర్విఘ్నముగ ప్రచురణమునకు దోడ్పడిన మహాజనులకు కృతజ్ఞులము. ఈస్వల్పకాలములోనే ప్రపంచమునందు గలిగిన మహాపరివర్తనమును సంచికలు దెలుపుచున్నవి. ఈస్వల్పకాలమునందు రాజ్యాంగములు సంస్కరింపబడినవి. మహాసంగ్రామము మహాబీభత్సమును గలుగజేసినది. సామ్రాజ్యములు రాజ్యములు మాయమైనవి. అన్నిదేశములందును ప్రజాహృదయమునందు స్వాతంత్ర్యదేవత స్థిరాసనమును గైకొన్నది. ప్రపంచావృతమైన మహాప్రబోధము భారతదేశమందు సహజప్రకాశముతో వెలుంగుచున్నది. ఈ మహోత్సవసందర్భమునందు **ఆంధ్రులును యథాశక్తిని ధర్మనిర్వహణమును చేయు**చున్నవిధమును సంవత్సరాదిసంచికలు విశదముచేయుచున్నవి. దేశకాలపాత్రస్థితుల కనురూపముగ సంచికల స్వరూపమును మారినది. సర్వాంగశోభితమైన యాంధ్రత్వమును సంకీర్తనముచేయగలభాగ్య మింకను సంచికకు కలుగలేదు. దైవానుగ్రహమువలనను నాంధ్రుల సహాయమువలనను నీభాగ్య మచిరకాలముననే గలుగునని నమ్ముచున్నాము. సంచికయందు ప్రచురితములైన వ్యాసములు ప్రజాప్రబోధమునకు నిదర్శనములు. దేశమును కలవరపెట్టుచున్న శాసనసభాబహిష్కార విషయమును శాసనోల్లంఘన విషయమును గయాకాంగ్రెసు నిర్ణయించినవిధమును శ్రీయుత పట్టాభిసీతారామయ్యగారి వ్యాసము తెలుపుచున్నది. ప్రజాహృదయమును కలవరపఱచుచున్న రాజకీయపరిస్థితులు-ఖిలాఫత్ జాతీయవిద్య నిర్బంధములు మొదలగు విషయములకు సంబంధించిన వ్యాసములు త్రిలింగదేశము, శరీరవ్యాయామము ఆంధ్రవాఙ్మయనిరీక్షణము సంగీతము మొదలగు వ్యాసములును, కథలును, భావగీతములును పద్యములును ఇందుగలవు. రసభావభరితములైన ఇందలి పద్యములు - గీతములు - నవోద్యమదీపితములైన వ్యాసములు ప్రజాహృదయమునందు వికసించుచున్న యాంధ్రప్రబోధమును విశదము చేయుచున్నవి.

**చిత్రపటములు**

సంచికయందు ముద్రితములైన చిత్రపటముల సందర్శనము నయితము దేశపరిస్థితులకు మహావ్యాఖ్యానముగ నుండగలదు. గాంధియవతారమును స్వరాజ్యవికాసమును పాంచాలీపరాభవమును స్వరాజ్యవృక్షమును దెలిపెడి చిత్రపటముల యవలోకనము ప్రజాహృదయమునందు గాఢముగ నెలకొనిన గాంధిభక్తిని స్వరాజ్యవాంఛను విశదము చేయుచున్నది. పవిత్రమైన గయాక్షేత్రమునందు గూడిన భారతజాతీయ మహాసభకు సంబంధించిన చిత్రపటములనేకములు గలవు. జాతీయమహాసభామంటపమును మంటపద్వారమును మంటపాంతర్భాగములను సభావేదికను, వేదికస్థోపన్యాసకులను దెలిపెడి పటములును గలవు. ప్రపంచోద్ధారకమూర్తియైన బుద్ధదేవుడు బుద్ధత్వమును బడసిన బుద్ధగయాక్షేత్రపటమును బుద్ధదేవుని పటమును గలవు. స్వరాజ్యపురమునకు సంబంధించిన పటములందు ధర్మప్రతిపాలనమునకు రాజ్యవిసర్జనము **చేసిన బుద్ధదేవుని పటమువలెనె అసహాయోద్యమ ధర్మ**

పాలనమునకు రాజ్యమును విసర్జించిన శ్రీగోపాలదాసు దేశాయి దంపతుల చిత్రపటము ముద్రింపబడినది. అసహాయోద్యమప్రస్థానమును ధర్మసంరక్షణమునకై జయప్రదముగ జేసిన అకాలీలపటములును దేశసేవకై శ్రీకృష్ణజన్మస్థానము నలంకరించిన దేశసేవకుల పటములును ఆంధ్రరాష్ట్రీయసభకు సంబంధించిన పటములును ఇందు గలవు. ఏలూరు పురవాసులైన పంచమసోదరుల పటమును పంచమసోదరుల పురోవృద్ధికి నిదర్శనముగ నున్నది. స్థలాభావముచేతను, నితరకారణముల చేతను చేరిన వ్యాసములందును పటములందును కొన్నిటిని ముద్రింపజాలనందులకు ప్రేక్షకులను మన్నింప వేడుచున్నాము.

**ముఖపటము**

ముఖపటమునందు గాంధీమహాత్ముడు నిర్దేశించిన శాంతియుతమైన స్వరాజ్యోద్యమవికాసము చిత్రింపబడినది. లోకరక్షకుడు శ్రీకృష్ణపరమాత్ముడు స్వరాజ్య మంగళాచరణము దివ్యస్థానమునుండి చేయుచున్నాడు. శాంతమూర్తి బుద్ధదేవుడు శాంతమార్గమనను స్వరాజ్యతేజమును ప్రసరింపజేయుచున్నాడు. గాయత్రీదేవి దశహస్తములయందును శాంతిముద్రలను ధరించి స్వరాజ్యమునకును లోకశాంతికిని మహాశక్తిని ప్రసరింపజేయుచున్నది. బుద్ధాలయము హిందూదేవాలయము మహమ్మదీయమసీదు క్రైస్తవచర్చి భిన్నత్వమునకు లక్ష్యములైనను నేకత్వధర్మలక్ష్యమును బోధించుచున్నవి. దేవతాప్రసాదమునకు భాజనుండైన గాంధీమహాత్ముడు నిర్బంధితుడైనను స్వరాజ్యవిజయధ్వజమును హస్తములందు ధరించి స్వరాజ్యప్రాప్తికిని లోకకల్యాణమునకును శాంతిప్రదమైన ధర్మసాధనమును ప్రకటించుచున్నాడు. రాగద్వేషభావభరితమైన ప్రపంచపు కర్ణపుటములయందు శాంతినాదము చొరకున్నది. విశ్వరూపసందర్శనానంతరము విజయుడు వేడిన సౌమ్యస్వరూపసందర్శనమునే చేయుటకు వర్తమానసమయమునందును ప్రపంచము పరితపించుచున్నది. గాంధిమహాత్ముడు నిర్దేశించిన సౌమ్యదీక్షను భారతీయులు వహించి స్వరాజ్యసంరంభమునందు విజయమును శ్రీపరదేవతానుగ్రహమునను బడసి లోకమునందు శాంతి ధర్మవిజయస్థాపనమును జేయుదురుగాక!

## ప్రపంచ ప్రవృత్తి

అనంతకోటిబ్రహ్మాండభరితమైన ప్రపంచప్రవృత్తిని సంభావనచేయుట దుస్తరము. అనంతములైన గోళములు గ్రహతారకాగణములు మహాభూతములు ప్రవృత్తిప్రభావమును విశదము చేయుచున్నవి. మహాప్రవృత్తియందు సృష్టిస్థితిలయములు కాలానుగుణముగ సృష్టిపరిణామమునకు సాధనము లగుచున్నవి. సృష్టియందు స్థితి - స్థితియందు లయము-లయమందు సృష్టి-ప్రపంచప్రవృత్తి పరిపాకమునకు విచిత్రసాధనములు. బ్రహ్మాండభాండమునందొక క్షణమునం దనంతములైన గోళములు జీవజాలములు పుట్టుచు గిట్టుచు నున్నవి. తత్త్వజ్ఞులకీప్రవృత్తిరహస్యము గోచరంబగుచు సత్యగ్రహణమునకు సాధనంబైనను సామాన్యులకు భయసంభ్రమములకు సాధనం బగుచున్నది. సకలజీవములు స్వయంకృతప్రపంచమునందు మునిగితేలుచు ధర్మార్థమును కనుగొనజాలకున్నవి. స్వీయాంతర్గతములైన భావములనే చరాచరప్రపంచమునందంతటను ప్రతిబింబింపజేయుచు జీవజాలములు స్వయంకృతపాశబంధనములను నిర్మించుకొనుచున్నవి. ఈబంధనకల్పనల స్వభావము పరమానర్థములను గలుగజేయుచున్న విధమును ప్రపంచప్రవృత్తి దెలుపుచున్నది. వ్యక్తులందును జాతులందును నీ బంధనమే పరపీడకు గారణం బగుచున్న విధమును దృష్టి నేమరాలకు మఱల్చినను ననంతములైన దృష్టాంతములు గనిపించుచున్నవి. వ్యక్తు లాత్మోత్కర్షను గోరుచున్నవి. జాతు లాత్మప్రతిభను గోరుచున్నవి. ఈ స్వప్రయోజనపరాయణత్వ మాత్మవంచనమునకును పరపీడనమునకును గారణం బగుచున్నను మానవదృష్టి బాహ్యప్రపంచమునుండి ఆత్మనిరీక్షణమునకు మఱలకుండుట సంతాపకరము. పాశ్చాత్యప్రపంచము నావరించిన మమకారాహంకారముల ఫలమిథ్యాత్వార్థములకు మహావ్యాఖ్యానముగ నున్నది. సామ్రాజ్యనిర్మాతలకు మహాసామ్రాజ్యములు సంతృప్తిని గలుగజేయలేదు. కుబేరులకు పరార్థములు సంతృప్తిని గలుగజేయుటలేదు. భోగులకు స్వర్గములు తృప్తిని గలుగజేయుటలేదు. వర్తకశ్రేష్ఠులకు వాణిజ్యాధిపత్యము తృప్తినిగలుగజేయుటలేదు. మతగురువులకు మతవ్యాపనము తృప్తిని గలుగజేయలేదు. పాశ్చాత్యరాజ్యముల రాజ్యవ్యాపనము వ్యాపారవిజృంభణము మతప్రచారము ధనార్జనము ప్రపంచసంక్షో

భమునకును పరస్పరవినాశనమునకును సాధనములుగ పరిణమించినను పాశ్చాత్యనిరీక్షణమునందు భేదము గలుగని విధమును గతసంవత్సరవృత్తాంతము వ్యక్తము చేయుచున్నది. దూరుప్రదేశాక్రమణము లాసేనుసంధినియమములు భారతదేశనిర్బంధములు యూరపురాజ్యముల నావహించిన మహాకారాహంకారములకు పరమప్రమాణములుగ నున్నవి. ప్రపంచవ్యవస్థలను దగ్ధపటలము చేసిన మహాసంగ్రామానంతరమున సైతము రాజ్యలోభము ధనలోభము వ్యాపారలోభము జాతీయాహంకారము యథేచ్ఛగా విహరించుచు మహాసంక్షోభబీజములను వృద్ధిజేయుచున్నవి.

వర్తమాన మహాసంక్షోభమునకు మూలకారణమైన ఐరోపా మహాసంగ్రామము ప్రపంచప్రవృత్తియందు మహామేరువుగ నున్నది. రాజ్యములను

మహాసంగ్రామము

రాజ్యాంగములను సైన్యములను సంపదలను నిర్ణయించుటయందైరోపామహాసంగ్రామము పరమలక్ష్యముగ నున్నది. సకలరాజ్యములకును నాయుధధారణము పరమావసరమైనది. ఆయుధధారణమునకు రాజ్యాదాయ మపారముగ పెరిగి కరగ్రహణము మితిమీరినది. రాజ్యాదాయమును వృద్ధిచేయుటకు వ్యాపారపరిశ్రమములు విపరీతాకృతిం దాల్చినవి. వ్యాపారపరిశ్రమల సంరక్షణమునకు సైన్యాభివృద్ధి నౌకాదళాభివృద్ధి పరదేశాక్రమణము పరపీడనము సహజములుగ నేర్పడినవి ఈ పటాటోపము సుఖస్వరూపమును ప్రత్యక్షము చేయుచున్నను దుఃఖాంతమునకు సాధనం బగుచున్న విధమును మహాసంగ్రామము రుజువుచేసినది. సంగ్రామకాలమునందు గలిగిన మహావైరాగ్యము సంగ్రామముతో నంతము నొందినది యూరపురాజ్యము లన్నియును తిరిగి ఆయుధధారణము జేయుచు మహాసంగ్రామబీజములను నాటుచు ప్రపంచశాంతిని దుర్లభము చేయుచున్నవి. ఈ విషమదశయందు ప్రపంచశాంతికి గాంధిమహాత్ముడు బోధించిన అసహాయోద్యమయోగమే శరణ్యముగ నున్న విధమును భారతదేశవ్యవహారములవలె నితరదేశవ్యవహారములును విశదము చేయుచున్నవి. పరాసులు మహాబలములతో దూరుప్రదేశముల నాక్రమించినపుడు జర్మనులకును నసహాయోద్యమయోగమే శరణ్యమైనది. పశుబలమునకును దుర్బలమునకును సంరంభము గలుగునపుడు దుర్బలులకు విజయమునకు నిగ్రహము శరణ్యమగుచున్నది. నిగ్రహ మజేయమైన యాత్మబలమునకు నిదర్శనముగాని దుర్బలమునకు నిదర్శనము గాదు. బలాంధకారదర్పితములైన పాశ్చాత్యరాజ్యముల పశుబలసంస్కారము నారాధించుచు నాత్మవినాశమును జేసికొనుచున్న విధమును పాశ్చాత్యరాజ్యములు స్థితిగతులు విశదము చేయుచున్నవి. ప్రపంచపరిస్థితులను మానవకల్యాణసాధనములను గనుగొనుటకు యూరపురాజ్యముల స్థితుగతులను దెలిసికొనుట సాధనంబుగ నుండగలదు.

యూరపుమహారాజ్యములు

ప్రపంచస్థితిని నిర్ణయించుటకు వర్తమానకాలమునందు యూరపు మహారాజ్యములు సర్వాధికారమును వహించుచున్నవి. బర్లిను మొదలు హాంకాంగ్ వఱకును గల రాజ్యములు యూరపు రాజ్యాధికారముల ప్రమేయమును గలిగియున్నవి. యూరపురాజ్యముల ధనాధికారమును వ్యాపారాధికారమును బలాధికారమును ఆసియాఖండమును ఆఫ్రికాఖండమును సంపూర్ణముగ నావరించియున్నవి. ఈ ఖండముల వ్యాపారము యూరపురాజ్యములయధీనమునందున్నది. ఈ ఖండముల సంపదలు శుభస్థితి యూరపురాజ్యముల స్వాధీనమునందున్నది. తుర్కీ పారశీకము సౌదాను ఈజిప్టు చీనా సయాము ఇండియా మొదలగు మహాదేశములందు యూరపురాజ్యములు ప్రత్యక్షముగను పరోక్షముగను నధికారమును గలిగియున్నవి. ఈ యధికారమే యూరపురాజ్యముల యహంభావమునకు గారణం బయినది. పరరాజ్యాక్రమణమును పరద్రవ్యానుభవమును జేసి బలిసిన పాశ్చాత్యరాజ్యములు ప్రపంచభారము నంతయును మోయుచున్నట్టులు విఱ్ఱవీగుచున్నవి. ఫ్రాన్సు ఇటలీ గ్రేటుబ్రిటను మొదలగు రాజ్యములు సిరియా ఈజిప్టు ట్యూనిస్ టుర్కీ ఇండియా మొదలగు దేశముల పట్ల వహించుచున్న నిరాదరణస్వభావ మీసత్యమును విశదముజేయుచున్నది. యూరపుఖండము 37 లక్షల చదరపుమైళ్ల విస్తీర్ణమును 40 కోట్ల ప్రజలను గలిగియుండియును 170 లక్షల మైళ్ల విస్తీర్ణమును 91 కోట్ల ప్రజలును గల నాసియాఖండమును స్వాధీనము జేసికొని యధికారమును నడుపుచున్నది. ఈయధికారము స్వప్రయోజనముల కేర్పడినను పరాధీనరాజ్యముల యుద్ధరణమునకు మహాత్యాగము చేయుచున్నట్టులు రాజ్యాధికారులు ప్రకటించుచు నాత్మవంచనమును జేసికొనుచున్నారు. పర

రాజ్యాపహరణము పరద్రవ్యాపహరణము దుఃఖానుభవమునకు మూలమైనవిధమును వర్తమానకాలమునందు ప్రపంచావృతమైన మహాసంక్షోభము విశదముచేయుచున్నది. ప్రపంచావృతమైన మహాసంక్షోభము నాపుటకును శాంతిస్థాపనమును జేయుటకును బ్రిటీషుసామ్రాజ్యమునకుగల మహావకాశములను సామ్రాజ్యపరిస్థితులు విశదముచేయుచున్నవి.

ప్రపంచమునందుగల సామ్రాజ్యములందు బ్రిటిషు సామ్రాజ్య మద్వితీయముగ నున్నది. విస్తీర్ణమునందును, సంపదలయందును జనబాహుళ్యమునందును బ్రిటీషుసామ్రాజ్యమునకుసాటి వేఱొకటిలేదు. బ్రిటీషుసామ్రాజ్యము 13909782 మైళ్ల విస్తీర్ణమును 436752000 జనసంఖ్యను అఖండమైన సంపదలను గలిగి మహాదశ ననుభవించుచున్నది. సామ్రాజ్యాంతర్భాగముల వివరము:

బ్రిటీషు సామ్రాజ్యము

| | చదరపు మైళ్లు | జనసంఖ్య. |
|---|---|---|
| యూరపు | 121,512 | 48000000 |
| ఆసియా | 1824550 | 328158000 |
| ఆఫ్రికా | 4652400 | 47000000 |
| ఉత్తర అమెరికా | 3893920 | 9000000 |
| మధ్య అమెరికా | 8600 | 50000 |
| వెస్టిండీసు | 12300 | 1780000 |
| దక్షిణ అమెరికా | 97800 | 814000 |
| ఆస్ట్రేలియా | 3300000 | 7500000 |
| | 13909782 | 436752000 |

ఈ జనసంఖ్య మతముల ననుసరించి ఈ క్రింది విధముగ నిర్ణయింపబడుచున్నది.

| | |
|---|---|
| హిందువులు | 210000000 |
| మహమ్మదీయులు | 100000000 |
| క్రైస్తవులు | 80000000 |
| బౌద్ధులు | 12000000 |
| ప్రకృతిపూజకులు | 12000000 |
| జైన, సిక్కు, పారసీకులు | 4000000 |
| యూదులు | 740000 |
| ఇతరులు | |
| | 436752000 |

బ్రిటీషు సామ్రాజ్యము ప్రపంచావృతమై విస్తీర్ణమునందును జనసంఖ్యయందును భూగోళమునందు నాల్గవభాగము గలిగి యున్నది. జనసంఖ్యయందు మూడు వంతుల జనులు భరతఖండమునందుగలరు. భిన్నజాతులను భిన్నభాషలను భిన్నములైన మతసాంప్రదాయాచారములను గలిగి ప్రపంచవ్యాప్తమైన బ్రిటిషు సామ్రాజ్య నిర్వాహణభారము దుర్భరముగనున్న విధమును సంతఃకలహములు యుద్ధములు నిర్బంధములు స్పర్ధలు విశదము చేయుచున్నవి. సామ్రాజ్యాంతర్భాగములకు సామ్రాజ్యమునందు సమానప్రతిష్ఠగలిగి సకలభాగములకును సామ్రాజ్యరాజ్యాధికారము గలుగునపుడు బ్రిటీషుసామ్రాజ్యమునకు స్వారాజ్యసామ్రాజ్యాభిధానము అన్వర్థమై లోకమునకు స్థిరశాంతి గలుగగలదు. ప్రస్తుతము సామ్రాజ్యనిర్వహణాధికారులైన కర్జనువర్గము నావరించిన సామ్రాజ్య దురభిమానము సంక్షోభమునకును విలయమునకును సాధనంబగుచున్నవిధమును సామ్రాజ్య వ్యవహారములు విశదముచేయుచున్నవి. ఐర్లాండు ఈజిప్టు మెసపొటేమియా కెనియా ఇండియా మొదలగు దేశములందు దినదిన ప్రవర్థమానమగుచున్న ప్రతిఘటనము సామ్రాజ్యాభిమానులకు గుణపాఠమును నేర్పుటకు తగియున్నను, పీబు ఓడ్వాయరులు కర్జనులు వారి సామ్రాజ్య దురభిమానమును విడువకుండుట మిక్కిలి సంతాపకరము.

బ్రిటీషు సామ్రాజ్యమునకు రాజు పార్లమెంటు పాలకులు. వీరి యనుమతిని ప్రజామోదమునుబడసి నియమింపబడిన మంత్రివర్గము పాలనభారము వహించుచున్నది బ్రిటీషుసామ్రాజ్యమునందు వివిధమైన రాజ్యాధికారముగల రాజ్యములుగలవు. 1 స్వారాజ్యరాజ్యములు: ఈరాజ్యములు స్వపరిపాలనము స్వయంపోషణము స్వయంరక్షణము స్వత్వములను గలిగియున్నవి. ఐర్లాండు కెనడా ఆస్ట్రేలియా ఆఫ్రికా మొదలగునవి. 2. రాజ్యాధీనరాజ్యములు: ఈ రాజ్యములందు శాసనసభలున్నను ప్రధానాధికారులను బ్రిటీషు ప్రభుత్వాధికారులు నియమింతురు. ఈ రాజ్యములకు మొదటితరగతి రాజ్యములకు గల స్వయంరక్షణాధికారముగలుగదు. మాల్టా జెమెయికా సింహళము జూలూలాండు మొదలగునవి. 3. సంరక్షిత రాజ్యములు : కెనియా ఉగాండా మొదలగునవి. 4. అధికారస్థానములు: ఈ స్థలములందు స్వపరిపాలనము లేకపోయి

ప్రభుత్వ విధానము




నను రాజ్యాధికారమునకు ప్రతిభగలదు. 5. శాసక రాజ్యములు: యుద్ధానంతరము జాతిసమితినిర్ణయముల ననుసరించి సంరక్షణాగుల కేర్పరచిన రాజ్యములు. మెసపొటేమియా పలస్థీన్ మొదలగునవి. 6. భారతసామ్రాజ్యము: భరతఖండము స్వాధీనరాజ్యముగ బరిగణింపబడుచున్నది. బ్రిటీషురాజ్యనిర్వాహకులు భరతఖండమునకు ప్రత్యేకస్థితిని నిర్ణయించుచున్నారు. ఆ స్థితిని వర్తమాన సమయమునం దిదమిత్థమని నిర్ణయించుటకు వీలులేదు. జాతిసమితిసభయందు భరతఖండమునకు ప్రత్యేక ప్రాతినిధ్యము లభించుటవలనను వ్యక్తిత్వముగలిగినదని బ్రిటీషు రాజ్యాధికారులును భారతీయ ప్రతినిధులును జేసెడి సిద్ధాంతములు మాత్రము విచిత్రములుగ నున్నవి. సామ్రాజ్యాంతర్భాగములస్థితిని గనుగొనునపుడు సత్యము విదితమగుచున్నది.

సామ్రాజ్యస్థితి

మహాసంగ్రామ వేదన ననుభవించిన రాజ్యముల స్థితిగతులతో బ్రిటీషు రాజ్యస్థితిగతులను బోల్చునపుడు బ్రిటీషురాజ్యస్థితిగతులు సంతృప్తికరముగ నున్నవి. బ్రిటీషుద్వీపములకు 1922 మార్చి మాసాంతమునకు ఇతర రాజ్యములు 201,74,61,000 సవరనులు బాకీపడియున్నవి. గ్రేటుబ్రిటను ఇతర రాజ్యములకు 10,20,64,700 సవరనులు బాకీపడినది. అమెరికాదేశముతో చేసిన యేర్పాటుల వలనను అప్పును నెమ్మదిగ నిచ్చుటకు వీలు గలిగినది. మూడేండ్లలో 50,00,00,000 సవరనుల అప్పును తీర్ప గలిగినది. బ్రిటీషుద్వీపములకు 1922-23 సంవత్సరమునకు 977,50,000 సవరనుల ఆదాయమును 9,10,06,900 వ్యయమును మదింపువేయబడినది. బ్రిటీషురాజ్యాదాయవ్యయములు పదేండ్లలో నేడురెట్లు పెరిగినవి. ఈ యార్థికస్థితి రాజ్యశుభస్థితిని తెలుపుచున్నను యుద్ధానంతరమున సంప్రాప్తమైన మహాసంక్షోభము గ్రేటుబ్రిటనునందును వ్యాపించియున్నది. దేశమునందు 2000000 ప్రజలు పనిపాటులు లేక పరితపించుచున్నారు. వారిసహాయమునకు 300000000 సవరనులు మూడేండ్లలోను వ్యయము చేయబడినవి. గతించిన నాలుగేండ్లయందును సమ్మెకట్టుల వలనను బ్రిటీషుపరిశ్రమల కపారమైన నష్టము సంప్రాప్తమైనది. బ్రిటీషుద్వీపములందు 1921వ సంవత్సరమునందు 108550006 సవరనుల సరకుల దిగుమతి వ్యాపారమును 810318848 సవరనుల సరుకుల యెగుమతి వ్యాపారమును నడచినది. రాజ్యము శుభస్థితియందున్నను పరిశ్రమలు స్తంభితములై ప్రజలు పనిపాటులు లేక పరితపించుచున్నారు. సామ్రాజ్యస్థానము సంపద్భరితమైయున్నను సామ్రాజ్యాంతర్భాగము లశాంతిభూయిష్ఠములై సామ్రాజ్యనిర్వహణము దుస్సహాముగ నున్నది. గత సంవత్సరమునందైర్లాండున కొసంగబడిన స్వరాజ్యశాసన మాంగ్లరాజ్యాంగతంత్ర చరిత్రమునందు నూతనయుగారంభమును సూచించుచున్నది. శాపగ్రస్తమైన అయిర్లాండున కీ శాసనము సైతము దుఃఖానుభవమునకు మూలమైనది. దేశము హత్యలకు నిలయమై దుఃఖవేదన ననుభవించుచున్నది. అయిర్లాండునందు ప్రజ లాత్మహత్యను జేసికొనుచున్నారు. ఈజిప్టునందు ప్రతిఘటనము వృద్ధియగుచున్నది. మెసపొటేమియాయందవిశ్వాసము వ్యాపించుచున్నది. భరతఖండమునందసంతృప్తి వ్యాపించుచున్నది. మహాత్మీయ ప్రతిఘటనము దినదిన ప్రవర్ధమానంబగుచున్నది. యూరపురాజ్యము లన్నియును తిరిగి కలహమునకు కాలు దువ్వుచున్నవి. పునర్నిర్మాణము దుర్లభముగ నున్నది. ఈసంక్షోభస్థితియందు ప్రపంచశాంతిస్థాపనమును జేయవలసిన భారము పరమావకాశములు గల బ్రిటీషు రాజ్యాధికారులమీద గలదు. బ్రిటీషురాజ్యాధికారులు లబ్ధావకాశముల నుపేక్షించి స్వప్రయోజనముల నాశ్రయించిన మహాలయావర్తమునందు సర్వసంహారముగలుగగల విధమును ప్రపంచపరిస్థితులు సూచించుచున్నవి.

యుద్ధానంతరము లాయిడుజార్జి కర్జను చర్చిలు వర్గమవలంబించిన రాజ్యనీతి బ్రిటీషు ప్రజలయందసంతృప్తిని గలుగ జేసినది. లాయడుజార్జిగారు గ్రీకులకుజూపిన సుముఖత్వమును తురుష్కులకుజూపిన విముఖత్వమును సారహీనమైన రాజనీతియును స్వయంప్రకర్షణమును వారి పతనమునకుమూలములైనవి. లాయిడుజార్జిగారితో బోనర్లాపక్షము గలసి పని జేయుటకు నిరాకరించినది. బోనర్లాగారు మంత్రిపదవి నంగీకరించిరి. క్రొత్తగజరిగిన ఎన్నికలయందు కన్సర్వేటివుపక్షము విజయమునొందినది. ఆయెన్నికలందు-

| | |
|---|---|
| కన్సర్వేటివులు | 347 |
| లేబరుపక్షమువారు | 142 |
| లిబరలులు | 59 |
| నేషనలులిబరలులు | 59 |
| నేషనలిష్టులు | 2 |
| సిన్ఫినులు | 1 |
| ఇండిపెండెంటులు | 5 |
| | 615 |

సభ్యులుగ నెన్నుకొనబడిరి. కన్సర్వేటివుల విజయము భరతఖండమునందు నిరంకుశ ప్రస్థానమునకు సాధనంబుగ నున్నది. కార్మికపక్షమునకు గలిగిన విజయము ప్రజా హృదయమునందు గలుగుచున్న భావపరివర్తనమునకు నిదర్శనముగనున్నది. కన్సర్వేటివు పక్షము వారిబలము నే విధముగ వినియోగించునదియును కాలము తెలుపఁగలదు. ప్రాన్సు రాజ్యమునకును బ్రిటీషు రాజ్యాధికారులకును ప్రతిఘటనము వృద్ధిని బొందుచున్న విధమును రూరువ్యవహారములు లాసేనువ్యవహారములు విశదము చేయుచున్నవి. ప్రధానమంత్రి బోనరులాగారీ విషయమును సువ్యక్తము చేసిరి.

ఇతర రాజ్యములు

యూరపుఖండమునందు సంగ్రామమందు విజయమును పొందిన రాజ్యముల స్థితిగతులును పరాజయమునుపొందిన రాజ్యముల స్థితిగతులును పరమ విచారమునకు గారణములగుచున్నవి. విజయమును బొందిన ఫ్రాన్సు రాజ్యమును పరాజితమైన జర్మను రాజ్యమువలె దుఃఖవేదన ననుభవించుచున్నది. ఫ్రాన్సుదేశమును జర్మనుభయము పూర్ణముగ బాధించుచున్నది. ఫ్రాన్సుదేశము యుద్ధము ముగిసినను 1922 సంవత్సరమునందు 600000 సైనికులను సైనికులకు తగినఫిరంగులను గలిగియున్నది. రాఁగల 20 ఏండ్లయందును నౌకాదళమునకు 2400000000 ఫ్రాంకులను వ్యయముచేయుటకు నిర్ణయించినది. యుద్ధవిమానములు 2000 గలవు. వైమానికులు 30,000 గలరు. బలమునకు తగినరీతిని రూరుప్రాంతము నాక్రమించుకొని యూరపుఖండమునందు మహాసంక్షోభబీజములను వికసింపజేయుచున్నది. ఫ్రాన్సుదేశమున రాదాయమును మించి 3600000000 ఫ్రాంకులవ్యయము 1922-3 సంవత్సరమునందు గలుగుచున్నది. ఫ్రాన్సు చేయుచున్న ప్రయత్నములన్నియును భావిసంగ్రామకారణములను సూచించుచున్నవి. యూరపురాజ్యములందు ఫ్రాన్సువలె యుద్ధమునకు సిద్ధముగ నున్న రాజ్యము వేఱొకటిలేదు. యూరపుఖండమునకు తిరిగి నెపోలియనుశకము కెయిజరుశకము సంప్రాప్తముగానున్న విధమును ఫ్రాన్సుపరిస్థితులు విశదము చేయుచున్నవి. మిత్రమండలిసంయోగమునకు మూలములైన కారణము లంతరించుచున్న విధమును ఆంగ్లదేశమునందును అమెరికాయందును గలిగిన వైమనస్యము విశదము చేయుచున్నది. జర్మనుదేశాక్రమణమును జేసినఅమెరికాసైన్యములు స్వదేశమును చేరినవి. బ్రిటీషుసైన్యములు తటస్థభావమును పూనినవి. ఫ్రాన్సుదేశము మాత్రము భయంకరమైన సంగ్రామప్రస్థానమును నిరాటంకముగ జేయుచు జర్మనుసాహారమును సంపూర్ణముగ జేయుచున్నది. ఈ ప్రస్థానమునకు మహాసంగ్రామఫలము గలుగునని విచారశీలురకు విదితమగుచున్నది.

యూరపురాజ్యవ్యవహారములు జర్మనురాజ్యమునందు లగ్నమగుచున్నవి. జర్మనురాజ్యము సమర్పింపవలసిన నష్టపూరణములను జేయుట కశక్తతను దెలిపినది. ఈవిషయనిర్ణయమును జేయుటకు జినీవా హేగులందు గూడినసభలు నిరుపయోగములైనవి. నష్టపూరణములను సమర్పించుటకు జర్మనులు గోరిన గడువు నొసంగుట కాంగ్లేయులంగీకరించినను పరాసులు నిరాకరించిరి. జర్మనురాజ్యమునుండి నష్టపూరణములను గైకొనుటకు పరాసుసైన్యములు జర్మనుదేశము నాక్రమించినవి. నిస్సహాయస్థితియందున్న జర్మను లసహాయోద్యమయోగమును బూని పరాసులను ప్రతిఘటించుచున్నారు. ఈయోగఫలమును భావికాలము నిర్ణయింప నోపును. యూరపుఖండమునందలి సకలరాజ్యములందును ప్రజలు పనిపాటులు లేక పరితపించుచున్నను జర్మను రాజ్యమునందలి ప్రజలు పనిపాటులు గలిగి పరిశ్రములు వికసించుచున్నటులు దేశపరిస్థితులు తెలుపుచున్నవి. యూరపురాజ్యముల భావిపరిస్థితులు జర్మనుల నష్టపూరణసమస్యమీదను, పరాసుల నిగ్రహముమీదను నాధారపడినట్లు యూరపురాజ్య వ్యవహారములు విశదము చేయుచున్నవి.

జర్మనుదేశపరిస్థితులవలె రుష్యాదేశపరిస్థితులును బీభత్సకరములుగ నున్నవి. రుష్యారాజ్యము సోవియటు ప్రభుత్వము క్రిందను క్షీణించుచున్నది. రుష్యాప్రజ లేడేండ్లయందు 210 లక్షలు వినాశనము నొందినటులు గణనములు దెలుపుచున్నవి. ఈయేడేండ్లయందును పరిశ్రమలు సంపదలు నాశమునొంది ప్రజలశుభస్థితికి భంగము గలిగినది. దుర్భరమైన కరగ్రహణవిధానము నిస్సహాయస్థితికి మూలమైనది. నగరములు పురములు నిర్జనములైనవి. ప్రజలు పనిపాటులు లేక పరితపించుచున్నారు. రుష్యాదేశమునందు 1000000 సైనికులున్నను వారు శిక్షణమును నాయుధములను లేక సంగ్రామప్రస్థానమునకు నిరుపయోగముగ నున్నారు. దేశాదాయమునందు 1922 జనవరినుండి అక్టోబరువరకు 150000000000000 రూబుల్సు లోటు కన

బడుచున్నది. పరిశ్రమయుగపరిస్థితులను నిర్మూలము చేసిన రుష్యాదేశమునందు పరిశ్రమయుగఫలము ననుభవింపకను జీవయాత్ర దుస్సాధ్యముగ నున్నది. పరిశ్రమజీవనమునకును వ్యవసాయజీవనమునకును గలిగినసంరంభమునందు జీవనసాధనము స్థిరపడలేదు. దేశావృతమైన విలయావస్థయందు సర్వోత్తమములైన వ్యవస్థలు మాత్రము కాలాంతరమునను నిలువగలవు.

సంగ్రామదావానలసంతప్తములైన రాజ్యములందు ఇటలీదేశము మాత్రము కొంతవివేకమును చూపినది. ఇటలీదేశము సంక్షోభకరమైన శాల్షివిజమునుండియును నిస్సహాయస్థితికి మూలమైన ధనస్వామ్యత్వమునుండియును రక్షణమును బొందినది. దేశమునందు ఫాసిటీ సంఘములు శరపరంపరగ బయలుదేఱి దేశమును సంక్షోభమునుండి సంరక్షించినవి. ఫాసిటీ సంఘములు ప్రత్యక్షాచరణము నవలంబించి అన్నివ్యవహారములందును ప్రమేయమును గల్పించుకొనినవి. ఈ సంఘమునందలి సభ్యులాయుధములను ధరించి దేశసంచారమును జేయుచు శాంతిసంరక్షణమును జేయుచుండిరి. సమ్మెకట్టుల నాపుటయందును సాంఘికవాదులను ప్రతిఘటించుటయందును దుష్టుల దండించుటయందును ఫాసిటీసభ్యులుచూపినసాహసధైర్యములు ప్రజలవిశ్వాసమును గడించినవి. వారినాయకుడు ముసూలినీ గారు మంత్రియై ఇటలీదేశమును శాంతిమార్గమునను నడుపుచున్నను సాంఘికపక్షబలము నిర్మూలము కాలేదు. ఇటలీదేశము ఫ్రాన్సుదేశముతో జేరి జర్మనులసంహారమునకు తనబలమును వినియోగించుచున్నది. ఇటలీదేశమునకు 1922 సంవత్సరమునందు ఆదాయమునకు మించిన 7000000000 లైరులవ్యయము గలిగినది.

యూరపుఖండమునందుగల సకలరాజ్యముల స్థితిగతులును సంక్షోభమయముగ నున్నవని రాజ్యవ్యవహారములు విశదము జేయుచున్నవి. అన్నిరాజ్యములందును పరిశ్రమలకు స్తంభనము గలిగినది. పరదేశవ్యాపారముమీద నాధారపడియున్న రాజ్యముల శుభస్థితికి భంగము గలిగినది. రాజ్యాదాయము తగ్గినది. రాజ్యవ్యయము పెరిగినది. అన్నిదేశములకును అప్పులు మితిమీఱి పెరిగినవి. అన్నిరాజ్యములును సంగ్రామము నేర్పినధర్మోపదేశములను మఱచి తిరిగి సంగ్రామప్రయత్నములను జేయుచు సంక్షోభమార్గమును నిర్మించుచున్నవి. ఫ్రాంసుదేశము యూరపురాజ్యములందు నాయకత్వమును అపేక్షించుచున్నది. యూరపుఖండమునందు మహాబలదుర్బలములు మహాసంపద్దారిద్ర్యములు మహాసంరంభమునందు మునిఁగి తేలుచు సంక్షోభమునకు గారణములగుచున్నవి. యుద్ధము ముగిసి నాలుగేండ్లయినను యూరపురాజ్యములందు శాంతిస్థాపనము గలుగలేదు. ఈనాలుగేండ్లలోను గలిగిన నష్టములు యుద్ధకాలమందు సయితము గలుగలేదని యనుభవజ్ఞులు విశదము జేయుచున్నారు. ఈనష్టపరంపరల నాపుటకు యూరపురాజ్యములు ముఖ్యముగ గ్రేటుబ్రిటను ఫ్రాంసురాజ్యములు నిగ్రహత్యాగములను జూనవలసియున్నవి. నిగ్రహత్యాగములకు మూలములైన సమస్యలు నిర్ణయముకావలసినవి నాలుగు గలవు. 1. సంగ్రామనష్టపరిహారములు 2. మిత్రరాజ్యములఋణవిమోచనమార్గములు 3. ఆయుధధారణనియమములు 4. స్థిరశాంతిసంరక్షణమార్గములు.

అసాధ్యమైన నష్టపరిహారము నిచ్చుటకు జర్మనురాజ్యమునకు శక్తిలేదని తెలిసియును నిర్బంధించుట స్థిరశాంతికి ప్రయోజనకరము గాజాలదు. అన్నిరాజ్యములును నాయుధధారణమునకు సకలసంపదలనువినియోగించుచు శాంతిస్థాపనమును గోరుట బకధ్యానముగ నుండును. అంతర్జాతీయసమితియందు రాబర్టుసిసిలు ప్రభువు సూచించిన విధాన మవలంబితము గానంతవఱకును, యూరపురాజ్యములకును ప్రపంచమునకును శాంతి గగనకుసుమముగ నుండును. యూరపురాజ్యములు ప్రబలరాజ్యభంజననీతి నవలంబించుచున్న విధమును రుష్యాజర్మనీదేశములకు జరిగిన రాపల్లాసంధినియమములును నాంగ్లేయుల యౌదాసీన్యమును విశదముచేయుచున్నవి. ఈవిషమపరిస్థితులందు శాంతిస్థాపనమున కేర్పడిన జాతిసమితియును ధర్మసంస్థాపనమునకు నిరుపయోగమై ప్రబలరాజ్యముల ప్రయోజనసాధనములకు వినియోగపడుచున్నది. మోసూలువిషయమై కర్జను ప్రభువు నానాజాతిసమితినిర్ణయము నంగీకరించుటకు సమ్మతించినను తురుష్కులంగీకరింపకుండుటకు ప్రబలరాజ్యప్రయోజననీతియే ప్రతిబంధకములుగ నున్నవి. నానాజాతిసమితియందు ప్రబలస్వల్పరాజ్యభేదములును, తెల్ల నల్ల పచ్చ జాతిభేదములును పాటింపబడక సకలజాతులకును సమానప్రతిపత్తిగలుగనంతవఱకును ధర్మసంస్థాపనమునకు దీనిప్రయోజనమత్యల్పముగ నుండగలదు. దూరుసమస్యను నానా

జాతిసమితిపరిశీలనమునకు నియోగింపజాలక మోసూలు సమస్యను మాత్రమే నియోగింప నంగీకరించుట యూరపురాజ్యనీతినిర్ణయములను దెలుపుచున్నది.

### ఆసియాఖండము

ప్రపంచప్రవృత్తియందు వర్తమానసమయమునందు సకలదేశములకును దుఃఖానుభవమునందును సుఖానుభవమునందును సన్నిహితసంబంధము గలదు. యూరపురాజ్యముల దుఃఖానుభవము ఆసియాఖండమునకును గలిగినది. వ్యాపారక్షయము వ్యాపారక్షయమునకును, సంపదలక్షయము సంపదలక్షయమునకును, సంగ్రామము సంగ్రామమునకును, ప్రపంచవ్యాప్తమైన బ్రిటీషుసామ్రాజ్యమునందొక భాగమునందు గలిగినసంక్షోభము సామ్రాజ్యాంతర్భాగములందంతటను ప్రతిధ్వనించుచున్నది. ఈ పరిస్థితులం దాసియాఖండసమస్యలకును నైరోపాఖండ సమస్యలకును సన్నిహితమైనసంబంధము గల దని వ్యవహారజ్ఞులకు విశద మగుచున్నది. యూరపుఖండాధీనమైన యాసియాఖండసమస్యయును యూరపుఖండసమస్యకను బంధసమస్యగా నిర్ణయించుటయును సహజమైనవి. ఈ స్థితియం దాసియాఖండసమస్యను విశాలదృష్టితో నవలోకించుట దుస్తర మగుచున్నది.

ఆసియాఖండము వైశాల్యమునందును, జనసంఖ్యయందును, ప్రాచీనసభ్యత్వమునందును, యూరపుఖండమును మీఱియున్నను వర్తమానకాలమునందు సకలవ్యవస్థలకును నాసియాఖండము యూరపుఖండముమీఁద నాధారపడి స్వయంవ్యక్తిత్వమును గోలుపోయినది. యూరపురాజ్యములు మారణయంత్రములను నిర్మించి ఆసియా ఖండమునందు స్వీయాధికారమును వ్యాపింపజేసి ఆసియాఖండవికాసమును స్తంభింప జేసినవి. ప్రజలు నిశ్చేష్టులై సర్వాంగములసంచలనమునకును యూరపురాజ్యములమీఁద నాధారపడుచున్నారు. శరీరపోషణమున కవసరములైన అన్నపానాదులకు యూరపుదేశము లాధారమైనవి. శరీరాచ్ఛాదనమున కవసరములైన వస్త్రాలంకారాదులకు యూరపురాజ్యము లాకరములైనవి. పాదాచ్ఛాదనమున కవసరములైన పాదరక్షణములకు యూరపుదేశములు నిలయములైనవి. మనోవికాసమునకును కళావిద్యాములకును పాశ్చాత్య విద్యాలయములు ప్రమాణములైనవి. ఆత్మవికాసమున కాధారమైన బ్రహ్మజ్ఞానమునకు క్రైస్తవమతస్థులు గురువులయిరి. పాశ్చాత్యసంసర్గమువలనను సకలకోశములందును గలిగిన సమ్మోహమునకు భరతఖండము నిదర్శనముగ నున్నది. రాజకీయసాంఘికనైతికవిద్యావ్యవస్థలకు భరతఖండమునకు బ్రిటీషు సంస్థాపనలు లక్ష్యములై జాతీయప్రవృత్తియందు మహాస్తంభనమును గలుగఁజేసినవి. ఈ సమ్మోహమును నాసియాఖండప్రబోధమును నైరోపామహాసంగ్రామమును బోగొట్టి ఆసియాఖండప్రత్యభిజ్ఞానమునకుఁ దోడ్పడినవి. జపానీయుల విజయములతో నారంభమైన ఆసియాప్రత్యభిజ్ఞానమును నైరోపాసంగ్రామము వికసింపజేసినది. యూరపు రణరంగములందు ఆసియా సైనికులు చూపిన సాహస పరాక్రమములు వారి ప్రతిభను వ్యక్తముచేసినవి. యూరపుప్రజ లారోపించుకొనిన శ్రేష్ఠత్వప్రకర్షణ మర్థరహితమైనది. తురుష్కుల విజయములును కెమల్ పాషా నాయకత్వమును నాసియా ఖండవాసులకు గలిగిన ప్రత్యభిజ్ఞానమును స్థిరతరము చేసినవి. యూరపు సైన్యముల యజేయత్వము మిథ్య యని తేటపడినది ఆసియాఖండవాసులును సమానపరిస్థితులందు యూరపు సైనికులకు రణరంగమునందు గుణపాఠమును నేర్పుటకు సామర్థ్యము గలిగియున్నారని వ్యక్తమైనది. ఆసియాఖండవిమోచనమునకు పాశ్చాత్యులుపయోగించిన బాహుబలము సాధనముగ నున్నను ఆసియాఖండవాసుల దృష్టి యాధ్యాత్మికసాధనమునకు బ్రసరించినది. ఈ యాధ్యాత్మికసాధనమే భరతఖండమునం దసహాయోద్యమయోగరూపమును దాల్చి ప్రపంచమునం దంతటను వ్యాపించినది. ఆసియాఖండసమస్యయం దనేకసమస్య లంతర్గర్భితములై యున్నవి. ఆసియా యూరపుసమస్య - క్రైస్తవ మహమ్మదీయసమస్య - తెల్లనల్ల జాతులసమస్య—ఆధిభౌతి కాధ్యాత్మికసమస్య-ఆసియాసమస్యయందు జేరియున్నవి. భారతీయసమస్యలను సయితము నీసమస్యలతో సమన్వయము జేయునపుడు స్వరాజ్యతత్త్వము విశదము కాగలదు. ప్రపంచోద్ధరణమునకు వర్తమానసందిగ్ధసమయమునం దవసరమైన యాధ్యాత్మికసాధనమును నిర్ణయించుటకు ప్రపంచదృష్టి భారతభూమిపైఁ బ్రసరించుచున్నది. స్వరాజ్యసంరంభమునందు భారతీయు లపూర్వమైన యసహాయోద్యమయోగము నవలంబించుచు స్వరాజ్యప్రస్థానము చేయుచున్న విధమును భరతవర్ష పరిస్థితులు దెలుపుచున్నవి.

**భారత సామ్రాజ్యము**

భారతీయుల ధర్మవిజయము ప్రపంచమున కాదర్శముగ బరిణమింపగలదు. భారతసామ్రాజ్యస్థితి ప్రపంచ చరిత్రమునం దపూర్వముగ నున్నది. ప్రజ్ఞాపరాక్రమసంపన్నులైన ముప్పదికోట్ల ప్రజలు గలరు. ప్రజాపోషణమున కవసరమైన సంపదలు గల విశాలమైనదేశము గలదు. ప్రాక్తనమైన సభ్యత్వము గలదు. ప్రజలకు సాధుప్రవృత్తి గలదు. విశ్వవ్యాప్తములైన మతములు ధర్మసంప్రదాయాచారములు గలవు. దైవదత్తములైన రాజ్యయోగలక్షణములను గలిగియుండియును దేశము దరిద్రగ్రస్తమై పరాధీనస్థితియం దున్నది. ముప్పదికోట్ల ప్రజలను విశాలమైన దేశమును 70,000 సైనికులు 2,000 ఉద్యోగులు 10,000 వర్తకులు స్తంభనమునొందించి పాలించుచున్నారు. పరాధీనములైన రాజ్యవ్యవస్థలు పరిశ్రమలు వ్యాపారము విద్యావిధానము దేశసంరక్షణము దేశము నధోగతిపాలు చేసినవి. ప్రజాహృదయమునందు సహజమైన ప్రతిభ స్తంభితమై నిస్పృహ గలిగినది. పరాధీనస్థితియందును పారతంత్ర్యమునందును పరసేవయందును పరసంస్కారమునందును మునిగియున్న దేశమునకు ప్రత్యభిజ్ఞానము దుస్తరమై యాత్మవిశ్వాసము పోయి పరావలంబనము సహజమైనది. ఈసందిగ్ధస్థితియందు దేశోద్ధరణము సర్వవిధములను దుస్తరం బగుచు కర్తవ్య మగమ్యాగోచరముగనున్నది. ప్రపంచావృతమైన మహాప్రబోధసమయమునందు ధర్మనిర్వాహణము దుర్భరతమముగ నున్నది.

**రాజ్యాంగము**

మహాసంగ్రామసమయమునందు ప్రపంచమునందంతటను స్వాతంత్ర్యమహోదయము గలిగిన సమయమునం దాంగ్ల రాజనీతిజ్ఞులు చేసిన ప్రతిజ్ఞలు భారతహృదయమునందు స్వరాజ్యాశాంకురముల నంకురింపజేసినవి. సంస్కరణ శాసనము 1919 సంవత్సరమునందు నిర్మితమైనది. సంస్కరింపబడిన శాసనసభలు రెండేండ్లనుండియును బనిజేయుచున్నవి. సభ్యులు గంభీరోపన్యాసములను జేయుచు తీర్మానముల నుపపాదించుచున్నారు. మంత్రులుద్యోగసౌఖ్యముల ననుభవించుచు నిరంకుశవర్గమును బోషించుచున్నారు. రాష్ట్రప్రభుత్వములును సామ్రాజ్యప్రభుత్వమును వ్యయసమస్యాతములై దుర్భరములుగ నున్నవి. దేశాదాయమునందు విశేషభాగము సైన్యవ్యవస్థలకును పౌరసేవోద్యోగములకును వినియోగపడుచు దేశాభ్యుదయ మసాధ్యముగ నున్నది. సామ్రాజ్యప్రభుత్వమునందు 1922-3 సంవత్సరమునందు వచ్చిన 124 కోట్ల రూప్యములందును 67 కోట్ల రూప్యములు సైన్యవ్యయమునకు వినియోగింపబడినవి. 1921-2 సంవత్సరమునందు 20 కోట్లును 1922-3 నందు 17½ కోట్లును లోటు రాబడియందు వచ్చినది. సామ్రాజ్యప్రభుత్వమునందువలె రాష్ట్రప్రభుత్వములందును ఆదాయమునకు మించిన వ్యయము 5 కోట్లు సంప్రాప్తమైనది. ఆదాయవ్యయనిర్ణయములను పరిశోధించుటకు రాష్ట్రములం దుపసంఘములు నిర్ణయింపబడినవి. ఆసంఘములు సూచించిన నిర్ణయముల ప్రయోజనము వర్తమానసంవత్సరమునందు వ్యక్తము గాగలదు. సామ్రాజ్య ప్రభుత్వాదాయవ్యయములను పరిశీలించుటకు నియమింపబడిన ఇంచికేపుసంఘము సైనిక వ్యయమునందు 30 వంతునను పరిపాలన వ్యయమునందు 16 వంతునను తగ్గింపును సూచించినది. మొత్తమున 19½ కోట్ల వ్యయమును తగ్గింపును సూచించినది. ఆనిర్ణయముల ఫలము రాగల బడ్జెట్టునందు విశదము గాగలదు. దేశమునందు రెండేండ్లనుండియును సంస్కరణములు వ్యాపకమునందున్నను మంత్రు లధికారము ననుభవించుచున్నను నధికారహృదయమునం దేవిధమైన మార్పును గలుగలేదని రాజ్యాంగవ్యవహారములు చెప్పకయే చెప్పుచున్నవి.

**స్వరాజ్య సమస్య**

స్వరాజ్యసమస్యను నిర్ణయించుటకు స్వయంపోషణము స్వయంరక్షణము స్వయంపరిపాలనము సాధనములుగ నున్నవి. స్వయంపరిపాలనమును స్వయంరక్షణమును లేనిదేశమునకు స్వరాజ్యలక్షణము గలుగజాలదు. భారతదేశపరిపాలన మంతయును పరాధీనస్థితియందున్న విధమును నుద్యోగములును రాజ్యాంగవిధానమును సువ్యక్తము చేయుచున్నవి. భారతదేశపు ప్రభుత్వము బ్రిటీషుప్రభుత్వమున కుపశాఖయని కర్జనుప్రభువు సిగ్గు వదలి ప్రకటించెను. సివ్రెసుసంధి నియమముల నాక్షేపించిన మాంటాగు రీడింగు ప్రభువులకు తిరస్కారము గలిగినది. మాంటాగుగారు మంత్రిపదవిని వదలుకొనవలసివచ్చినది, లాయిడుజార్జిగారు భారతప్రభుత్వమునకు బ్రిటీషు పౌరసేవోద్యోగకవచసంరక్షణావసరమును

సమర్థించెను. బోనర్లా ప్రభుత్వమీసమర్థనమును సార్థకము చేయుచున్నవిధమును రాజ్యవ్యవహారములు విశదముచేయుచున్నవి. భారతీయుల కధికతరముగ నుద్యోగములిచ్చుటకు విషయమునను సామ్రాజ్యాభిమానులు ప్రతిఘటనమును జూపుచున్నారు. అన్ని శాఖలయందును నధికతరముగ నాంగ్లేయోద్యోగులు నియమింపబడుచున్నారు వైద్యశాఖయందు నూతనముగ నాంగ్లేయులకుద్యోగములు కల్పింపబడినవి. సైనికోద్యోగియులకు పౌరసేవోద్యోగము లొసంగబడుచున్నవి. ఆంగ్లేయోద్యోగుల లాభనష్టములను విమర్శించుటకు రాయల్ కమిషను నియమింపబడినది. ఈ నియామకమును భారతీయు లేకగ్రీవముగ ఖండించినను భారత రాజ్యాంగ మంత్రియును భారతాంగ్లప్రభుత్వమును నిరాదరణచూపిరి. సైనికోద్యోగముల వ్యాపన విషయమునను ప్రభుత్వము ప్రతిఘటనమును జూపుచున్నది. పీల్ ప్రభువు రాజ్యాంగసంస్కరణములను వ్యాపింపజేసి రాష్ట్రీయ స్వపరిపాలనమును స్థాపించుటవిషయమై సామ్రాజ్యశాసనసభ చేసిన తీర్మానమును యోచించుటకు సమయము కాదని స్పష్టము చేసెను. ఏవిధమున చూచినను స్వపరిపాలనవిధానము స్వయంరక్షణవిధానము వ్యాపకమును బొందుట లేదని రాజ్యపరిస్థితులు విశదము చేయుచున్నవి. భారత ప్రభుత్వాధికారమంతయును భారతదేశమందు గాక పరదేశమందు గల బ్రిటీషుమంత్రి స్వాధీనమునం దున్నపుడు స్వరాజ్యాధికారము మిథ్యావచనముగ నుండగలదు. సివ్రెసుసంధి రాజకీయోద్యోగములు జాతీయభేద నిర్ణయము ఫిస్కలు కమిషను సైన్యవ్యయము మున్నగువిషయములను నిర్ణయించుటయందు భారత రాజ్యాంగమంత్రి నిర్వహించిన నిరంకుశత్వము భారత రాజ్యాంగముల పరాధీనస్థితిని విస్పష్టము చేయుచున్నది. భారతరాజ్యాంగములకు మూలస్థానమైన సామ్రాజ్యశాసనసభా వ్యవహారములును నీస్థితినే విశదము చేయుచున్నవి. విద్యాశాఖాధికారమును వహించిన సర్ శంకరన్ నాయరును న్యాయాంగాధికారమును వహించిన సర్ తేజబహదూరు సప్రూయును బ్రిటీషుమంత్రియధికార మమితమైనదని వారి యనుభవమును విశదము చేసిరి.

సామ్రాజ్యసభకు స్వాతంత్ర్యస్థితి లేని విధమును సభావ్యవహారములు విశదము చేయుచున్నవి. సైన్యవ్యయభారమును నిర్ణయించుటకు సభకధికారము లేదు. వ్యయభారమును నిర్ణయించుటకు గతసంవత్సరమునందు శాసనసభ చేసిన ప్రయత్నములను ప్రభుత్వము ప్రతిఘటించినది. గత సంవత్సరమునందు సామ్రాజ్యశాసనసభాధికారము నిర్బంధవ్యాపనమునకు వినియోగపడి ప్రజలకష్టములకు గారణమైనది. శాంతిన్యాయసంరక్షణవ్యాజమునను వేలకొలది దేశభక్తులు నిర్బంధముల పాలైరి. రాజ్యాంగవిస్తరణమువిషయమై సభ నిర్ణయించిన ప్రతిపాదనమును పీలు ప్రభువు నిరాకరించెను. సంస్థానాధీశుల సంరక్షణశాసనమువిషయమై ప్రతిపాదితమైన శాసనమును శాసనసభ నిరాకరించినను రీడింగు ప్రభువు తన సమర్థనాధికారమును వినియోగించి శాసనమును గావించెను. శిక్షాస్మృతివిధానమును సవరించుట కేర్పడిన శాసననిర్మాణమునందు శాసనసభ చూపిన యాదాసీన్యము దుర్బలమును వ్యక్తము జేయుచున్నది. క్రిమినలు ప్రొసీజరుకోడువిషయమునందును ఉద్యోగరహస్యశాసనవిషయమునందును నిర్బంధశృంఖలములను నిర్మించుటకు శాసనసభ వినియోగపడుచున్న విధమును సభావ్యవహారములు విశదము చేయుచున్నవి. ప్రభుత్వాధికారసభ్యులు తెలిపెడి బెదరింపులు శాసనసభాదుర్దశకు నిదర్శనములు. శాసనసభకు స్వీయ సంరక్షణమును స్వయంవ్యక్తిత్వమును జేయుట కధికారము లేకపోయినను నిర్బంధపాశబంధములను నిర్మించుటకుమాత్ర మధికారము గలదు. పరాధీనస్థములైన రాజ్యములందు రాజ్యాంగము లన్నియును పరాధీనస్థితిని సంరక్షించుటకు వినియోగపడునటుల స్వాధీనస్థితిని బడయుటకు వినియోగపడజాలవని ప్రపంచానుభవము విశదము చేయుచున్నను సంశయాత్ములకు సత్యార్థస్ఫురణము కలుగకున్నది. స్వాతంత్ర్యసంరంభచరిత్ర మనంతముఖముల నీసత్యమును ప్రకటించుచున్నది. ఇటలీ ఒలాండు ఐర్లాండు ఈజిప్టుదేశముల చరిత్రములు స్వాతంత్ర్యసంరంభపరిణామమును విశదము చేయుచున్నవి. స్వాతంత్ర్యసంరంభమునందు భరతఖండ మవలంబింపవలసిన యోగ్యసాధనమును భారతజాతి నిర్ణయించి యవలంబించి విజయమును బడయవలసియున్నది. పరరాజ్యదానమువలన నేజాతికిని స్వరాజ్యము గలుగదు. గాంధిమహాత్ముడు స్వరాజ్యసంపాదనమున కసహాయోద్యమయోగమును నిర్ణయించి గత

సామ్రాజ్య శాసనసభ

సంవత్సరమునందు ప్రజాహృదయమునందు మహాసంచలనమును గలుగజేసెను. ఆమహాసంచలనమునకు ఫలముగ గాంధిమహాత్ముడును నితరనాయకులును నిర్బంధముల ననుభవించుచున్నారు. మహాత్ముని నిర్బంధము భేదాభిప్రాయములకు గారణంబై స్వరాజ్యసాధనప్రయత్నములందు భేదభావములు గలిగి సనాతనమైన జాతీయదౌర్బల్యము వ్యక్తమైనది. దౌర్బల్యమునకు మూలమైన విభేదములను వదలి ప్రజలు సంయోగమును బూని యాత్మశక్తిని వ్యక్తముచేసి స్వరాజ్యమును సాధించెదరుగాత!

స్వరాజ్య సాధనము

స్వరాజ్యము సకలజాతులకును జన్మస్వత్వమైన గమ్యస్థానము. స్వరాజ్యప్రాప్తికి రాజ్యాంగసంస్కరణములు ప్రయోజనకరములని బ్రిటీషురాజ్యతంత్రజ్ఞులు ప్రతిపాదించుచున్నారు. అతివాదులు మితవాదులు జాతీయవాదులు స్వరాజ్యసంపాదనము వారి యాశయములకు ఫలమని ప్రకటించుచున్నారు. కాని ప్రజలును నాయకులును స్వీయసంస్కారమునకనురూపమైన స్వరాజ్యసాధనముల నవలంబించుచు స్వరాజ్యసంరంభమునందు బనిబూనుచున్నారు. స్వరాజ్యాశయము సకలమతములవారికిని సమానముగ నున్నను ఫలప్రాప్తి మాత్రము ప్రయత్నములమీద నాధారపడియుండును. స్వల్పమైన ప్రయత్నము స్వల్పఫలమును విశాలమైన ప్రయత్నము విశాలఫలమును గలుగజేయుట సహజము. మితవాదులకు శాసనసభలు స్వరాజ్యప్రాప్తికి సాధనములుగ నున్నవి. స్వీయానుభవమువలనను సభలప్రయోజనము తెలిసియున్నను మితవాదులసంస్కారము వారి దృష్టిని సభలమీదను లగ్నము చేయుచున్నది. బెజంటమ్మగారు ఫిబ్రవరి మాసారంభమునందు డిల్లీనగరమునం దొకసభను సమకూర్చి స్వరాజ్యసాధనములను విమర్శించి నిర్ణయించుట కొక యుపసంఘమును నియమించినది. ఆయుపసంఘమునకు సర్ సప్రూ అధిపతి. బెజంటమ్మగారు కార్యదర్శిని. వీరు స్వరాజ్యవిధానమును నిర్ణయించి ఆ నిర్ణయములను నియోజకవర్గామోదమును బడయంజేసి స్వరాజ్యప్రతిష్ఠాపనను జేయ బ్రయత్నింపదలంచునటులు ప్రకటించుచున్నారు. దేశబంధుదాసువర్గమువా రొక స్వరాజ్యవిధానమును సిద్ధముచేసి ప్రచురించిరి. ఎనిమిదధ్యాయములు గల గ్రంథమునందు గ్రామస్వపరిపాలనముతో నారంభమై కేంద్రప్రభుత్వాధికారముతో నంతము నొందెడి స్వరాజ్యనిర్మాణవిధానము నీపక్షమువారు గల్పించిరి. బాబూ భగవానుదాసుగారి విధాన మీ విధానమునందు మేళనమును బొందినది. ఈవిధానమునందు పంచాయతులకు ప్రాముఖ్య మొసంగబడినది. హాజరతు సాభాని గారు సంపూర్ణస్వరాజ్యవిధానమును నిర్ణయించుచు బ్రత్యేక ప్రభుత్వ విధానమును నిర్మాణము చేయం గోరుచున్నారు. పాశ్చాత్యసంస్కారసంభృతులైన నాయకులం దిట్టి భేదభావ ముదయించుట సహజమైనను దేశమునకు సంప్రాప్తమైన దుర్దశ విశదమగుచున్నది. ఈసంకులభావములందు కర్తవ్యము దుర్గ్రాహ్యముగ నున్నను భారతజాతీయమహాసభానిర్దేశ మసందిగ్ధముగ నసహాయోద్యమయోగము నాదేశించుచున్నది. గయాకాంగ్రెసు నిర్ణయించిన ప్రతిపాదనమే భారతజాతి కాచరణయోగ్యమైన సాధనముగ నుండగలదు.

అసహాయయోగము

నిరంకుశ ప్రభుత్వ భంజనమునకును సర్వాజ్యస్థాపనమునకును అసహాయయోగసాధనమును నిర్ణయించిన కాలము నుండియును దేశమునందు మహాసంచలనము గలిగి ప్రజాశక్తి విజృంభించినది. కలకత్తాయందు నిర్ణీతమైన విధానమును నాగపురము అహమదాబాదు కాంగ్రెసులు స్థిరపరచినవి. త్రివిధబహిష్కారములును నసహాయోద్యమ విధానమునకు మూలస్తంభములుగ పరిగణింపబడినవి. బార్డోలీ ప్రతిపాదనము పాఠశాలలబహిష్కరణమును న్యాయస్థానములబహిష్కారమును సడలించినను, శాసనసభలబహిష్కారమును స్థిరము చేసినది. గతసంవత్సరమునందు ప్రజలు వ్యక్తిశాసనోల్లంఘనమును జేసి యాత్మశక్తిని విశదముచేసిరి. గాంధిమహాత్ముని నిర్బంధానంతరము ప్రజలయందు విజృంభించినయుత్సాహము తగ్గినది. గాంధిమహాత్ముడు నిర్బంధము ననుభవింప బోవునపుడు ప్రజలకు శాంతప్రవర్తనము నాదేశించెను. ప్రజల శాంతప్రవర్తనము నిరుత్సాహచిహ్నముగ గ్రహింపబడినది. ప్రజలయందు స్వరాజ్యోద్రేకభావమును గలుగజేయుటకు సాధనముల నన్వేషించుట కొక యుపసంఘమును లక్నోయందు గూడిన జాతీయ సభోపసంఘము నియమించినది. ఆయుపసంఘసభ్యులు దేశమునం దంతటను సంచారముచేసి శాసనోల్లంఘన విధానక్రమ

మును దేశపరిస్థితులను బరీక్షించి దేశము సమష్టిశాసనోల్లంఘనమునకు దగి యుండ దనియును వ్యష్టిశాసనోల్లంఘనమునకు దగి యున్న దని ఈక్రిందివిధమున నను నివేదికయందు దెలిపిరి.

### సమష్టిఆజ్ఞోల్లంఘనము- అర్హురు సేకీభవించుట

దేశమునం దంతటను సమష్టిఆజ్ఞోల్లంఘనమును జరుపుటకు ప్రజలిపుడు సంసిద్ధులుగ నుండలేదు. ఏరాష్ట్రమునగాని మండలమునగాని పన్నులను చెల్లింపకుండుటకు గూడ ప్రజలు సంసిద్ధులై యుండలేదు. ఏరాష్ట్రమునందైనను ఏచట్టముననైన నుల్లంఘించుటకును ఏపన్నునైన నిరాకరించుటకును ఆకస్మికముగ నెట్టి అవసరమైన కలిగినచో నందుల కచటి ప్రజలు సంసిద్ధులైనచో అందునుగూర్చి భారతకాంగ్రెసు సంఘమువారు నిర్ణయించిన నియమము లన్నియును నెరవేర్పబడినయెడల- దౌర్జన్యము జరుగ దను నమ్మకము కలిగినయెడల బాధ్యతను తామే వహించి రాష్ట్రీయకాంగ్రెసు సంఘమువా రనుమతి నీయవచ్చును.

### వ్యష్టిఆజ్ఞోల్లంఘనము

వ్యక్తులు స్వాత్మగుణమునకును వ్యగ్రభావముతోను ఆజ్ఞోల్లంఘనము నేరాష్ట్రమునందైన నొనరింపవచ్చు నని అందఱు నంగీకరించిరి గాన దానినిగూర్చి రాష్ట్రీయసంఘమువారి యనుమతిని ముందుగా బడయవలయును. ఆజ్ఞోల్లంఘనములనుగూర్చి అనుమతినిచ్చుటకు రాష్ట్రీయసంఘములకే అధికార మియ్యబడెను. ప్రభుత్వమువారి అక్రమశాసనములపట్ల ఆజ్ఞోల్లంఘనముతోఁ బనిలేనేలేదు. అట్టి అక్రమశాసనముల నుల్లంఘించుటకు ప్రతివ్యక్తికిని సంపూర్ణస్వాతంత్ర్యము కలదు.

### శాసనసభల ప్రవేశము-అనుకూలుర సూచన

శాసనసభలకు కాంగ్రెసువారు ఎన్నుకొనబడి పంజాబు ఖిలాఫతు అక్రమములను తొలగించుటకును స్వరాజ్యమును బడయుటకును శాసనసభలలోనుండి ప్రయత్నింపవలెనని గయలో దేశీయ మహాజనసభవారును ఖిలాఫతు సభవారును తీర్మానింపవలెనని హకీంజీ, పండిత నెహ్రూ పటేలు గార్లు సూచించిరి. కాంగ్రెసు సభ్యులను హెచ్చుమందిని ప్రజలు ఎన్నుకొనుటకు గట్టిప్రయత్నములను చేయవలెను. సభ జరుపుటకు ముఖ్యముగ నుండవలసినంతమందిగాయైన కోరము నితరకక్షులవారు లేకుండునట్లు లసహాయవాదులే శాసనసభ్యులుగా ఎన్నుకొనబడినచో సభ్యులు తమపదవులు ఖాళీ కాకుండ నపుడపుడు సభలకు వెళ్లుచు, ప్రమాణము చేసినవెంటనే అందరు నొక్కసారిగా సభలలోనుండి లేచిపోవలయును. ఎన్నుకొనబడిన అసహాయవాదులసంఖ్య విస్తారముగానున్నను కోరము లేకుండ చేయజాలనిచో వారు ఆర్థికపత్రము మున్నగు ప్రతిచట్టమునకును ప్రతికూలురుగానే యుండవలెను. పంజాబు ఖిలాఫతుస్వరాజ్యములనుగూర్చి మాత్రమే తీర్మానముల నుపపాదించుచుండవలెను. అసహాయవాదులలో శాసనసభలకు ఎన్నుకొనబడినవారి సంఖ్య మిక్కిలి తక్కువగా నున్నచో వారందఱు నొక్కసారిగా సభలను వదలివేయవలెను. క్రొత్తసభలు 1924 జనవరిమాసమున ఏర్పడవు. కాన 1923 డిసెంబరులో దేశీయ మహాజనసభను మొదటివారమునందే జరుపవలెను. కాని మామూలుప్రకారము కడపటివారమున జరుపగూడదు. ఏలననగా ఎన్నికలఫలితమును గూర్చి సభవారు కడపటి ఉత్తరవు నీయ వీలగును. సంస్కరణముల చట్టముప్రకార మిదివరకు ఎన్నుకొనబడిన శాసనసంఘసభ్యులు ప్రభుత్వమువారితో చేరి క్రొత్తపన్ను ననుమతించిరి. అసహాయోద్యమము నడంచుటకు గూడ నంగీకరించిరి. పంజాబుఖిలాఫతు అక్రమములను తొలగింప వీలులేకుండ జేసిరి. స్వరాజ్యమును నిరోధించిరి. ప్రజలకు చాలబాధలను కలుగజేసిరి. కాన నిపుడు అసహాయవాదులు శాసనసభలకు వెళ్లి శాసనసభలలో నుండియే దౌర్జన్యవిరహితమగు అసహాయోద్యమమును సాగించి ప్రభుత్వమును నిరోధించి స్తంభింపజేయదగు నని పండిత హకీం పటేలుగార్లు ముగ్గురును సూచించిరి.

### శాసనసభలకు ప్రతికూలురు అయ్యంగారు అన్సారీ ఆచారిగార్లు

366 గురు సాక్షులలోను 302 గురు శాసనసభలకు వెళ్లగూడదని తెలిపియున్నారు. శాసనసభలకు వెళ్ళుట ఆత్మగౌరవమునకు భంగకరము. కార్యనిరతికిగూడ గొప్పలోప మగును. మనలో చాలమంది శ్రేష్ఠులగువారు కారాగృహములకు వెళ్లివచ్చుటచే వారిని వోటర్లు ఎన్నుకొన వీలులేదు. శాసనసభలకు వెళ్లినచో నిర్మాణవిధానము నుపేక్షించినవార మగుదుము. కాంగ్రెసు విధానమున నిది వెనుకంజవేయుటయే. దీనివలన ప్రభుత్వమువారి ప్రతిష్ఠ మఱల ప్రబలమగును అని కస్తూరి రంగయ్యంగారు డాక్టరు అన్సారీ రాజగోపాలాచార్యులుగార్లు మొదటి ముగ్గురి సూచనలకును ప్రత్యుత్తర మిచ్చిరి.

### మొదటివారు సమర్థించుట

దొరతనమువారి భావము అన్యాయ్యమును ప్రజాపీడనకరమునై యున్నది. ప్రజలు ప్రభుత్వమువారి పిచ్చిచేష్టలకు లొంగగూడదు. వారి చర్యల నెదిరించుటయందే పౌలితులశక్తియు దీక్షయు వెల్లడియగును. సాక్ష్యమునుబట్టి చూచిన ఎన్నికలలో కాంగ్రెసుసభ్యులే హెచ్చుమంది నెగ్గగలరని మాకు తోచినది. ఈశాసనసభలను రూపుమాపినచో విదేశీయుల దుకోట్లకొలది ధనమును ప్రచారముక్రింద వ్యయపరచుటవలన కలుగు ఫలితముకంటె వేయిరెట్లధికమగు సత్ఫలము చేకూరును. సంస్కరణములను రూపుమాపినచో కోట్లకొలది ధనమును వ్యయపరచి ప్రభుత్వమువారు ప్రపంచమునంతను మోసగించుటకు నిర్మించిన ప్రభుత్వవర్గ మొక్కప్రేటున నేల గూలునని మొదటి వారు ముగ్గురును మఱల సమర్థించిరి.

### మ్యునిసిపాలిటీలు - లోకలుబోర్డులు

నిర్మాణకార్యక్రమమును కొనసాగించుట కధికావకాశములను బడయుటకు అసహాయవాదులు మ్యునిసిపలు సంఘములందును తాలూకా జిల్లాబోర్డులందును ప్రవేశింపవలయును. ఆసభ్యులు మండల రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములతో నాలోచించి ఏకాభిప్రాయములతో పనిచేయుచుండవలెను.

ఉపసంఘ మసహాయోద్యమయోగమునకు సాధనమైన శాసనోల్లంఘనసాధనము నన్వేషించుట కేర్పడి

నను శాసనసభాప్రవేశవిషయమును సయితముపసంహృతము విమర్శించినది. సభాప్రవేశ మసహాయోద్యమమునకు విరుద్ధము గాదనియును ప్రజోత్సాహము నుద్ధరించుట కవసరమనియును శ్రీయుతులు అజ్మలుఖాను మోతీలాలు నెహ్రూ విఠ్ఠలుభాయి పటేలుగార్లు నిర్ణయించిరి. శాసనసభాప్రవేశ మసహాయోద్యమయోగమునకు విరుద్ధమనియును ననర్థదాయకమనియును శ్రీయుత కస్తూరి రంగయ్యంగారు రాజగోపాలాచారి అన్సారీగార్లు నిర్ణయించిరి. దేశబంధుదాసు కేల్కారు జయకరుగారులు మొదలగు వారు నెహ్రూపక్షముతో నేకీభవించిరి. ఈభేదభావము కలకత్తా కాంగ్రెసు కాలమునుండియును నంతర్గర్భితమై యున్నను నిపుడు విజృంభించి బహిర్గతమైనది. నవంబరుమాసాంతమునందు కలకత్తాయందుగూడిన జాతీయసభోపసంఘసమావేశమునం దుభయపక్షములవారును వారిబలాబలములను వ్యక్తముచేసిరి. దాసుపక్షమువారు జాతీయమహాసభాముఖమున గాంధీమహాత్ముడు నిర్ణయించిన అసహాయోద్యమవిధానమును శ్లాఘించుచు నవీనవిధానమును నిర్దేశించుటకు, ఆ విధానమునందు విదేశవస్తుబహిష్కారము నామమాత్రమునకు నిర్ధారణచేయుచు త్రివిధబహిష్కారమును శిథిలముచేసి శాసనసభాప్రవేశమునకు ప్రాముఖ్యమును గల్పించిరి. నిర్మాణ కార్యక్రమమునందు విశ్వాసము ప్రతిపాదింపబడినను కార్యవిధానమునకు ప్రాముఖ్యము తొలగింపబడినది. కలకత్తాయందు గూడినసమావేశమునం దధికసభ్యులు సభాప్రవేశమునకు ప్రతికూలాభిప్రాయమును గలిగి యున్నను విషయనిర్ధారణము గయాకాంగ్రెసునకు నిలుపబడినది. డిసెంబరు మాసాంతమునందు గయయందు గూడిన జాతీయమహాసభ గాంధిమహాత్ముని నిర్ణయమును పునః ప్రతిపాదనమును జేసి ప్రజాధర్మమును ప్రజాశక్తిని విశదము చేసినది.

**గయాకాంగ్రెసు**

పవిత్రమైన గయాక్షేత్రమునందుగూడిన 37-వ జాతీయమహాసభ భారతజాతీయ జీవనమునందు గణనీయముగ నున్నది. నానారాష్ట్రములనుండియును స్వరాజ్యయాత్రాసేవకులు స్వరాజ్యపురమునకు జేరిరి. స్వరాజ్యపురమునందు గూడిన ప్రజానివహములు ప్రజలయుత్సాహమును విశదము చేసినవి. స్వరాజ్యపురమునావరించిన స్వరాజ్యభజనలు గాంధిసంకీర్తనములు స్వరాజ్యోపన్యాసములు సంభాషణములు ప్రజాహృదయము నావరించినస్వాతంత్ర్యాభిలాషను విశదముచేసినవి. విషయనిర్ధారణసభయందును మహాసభయందును విదేశవస్తుబహిష్కారవిషయమునను శాసనసభాప్రవేశవిషయమునను శాసనోల్లంఘనవిధానవిషయమునను ప్రచండమైన సంరంభము గలిగినది. దేశబంధుదాసు మోతీలాలు నెహ్రూ పటేలుగార్ల పక్షవాదమును రాజగోపాలాచార్యులు వల్లభభాయి పటేలు రాజేంద్రప్రసాదు అన్సారీగార్లు ప్రతిఘటించిరి. వాదప్రతివాదములతో కాలహరణమైనను జాతీయమహాసభయం దామోదితములైన తీర్మానములు ప్రజాబలమును వ్యక్తము చేసినవి. నాయకుల భేదాభిప్రాయము లెటు లున్నను ప్రజలు తాము నమ్మిన ధర్మసిద్ధాంతములను పునః ప్రతిపాదనము చేసి ప్రజాశక్తిని గాంధిమహాత్మునిపట్ల భక్తిని స్వరాజ్యాసక్తిని విశదము చేసినవిధమును జనాంగీకృతములైన క్రింది ప్రస్తావములు విశదము చేయుచున్నవి.

“న్యాయవాదులును దావాదారులును గూడ ప్రభుత్వన్యాయస్థానములను బహిష్కరింపవలె నని వెనుక నామోదింపబడిన తీర్మానమును మఱల నీ మహాసభవారు స్థిరపరచుచున్నారు.”

“దేశీయులు సాయుధులై విప్లవము చేయుట కంగీకరింపనపుడు శాసనోల్లంఘనమే రెండవ ముఖ్యసాధనము. తక్కిన సాధనములన్నియును విఫలమైనపు డీసాధనమునే అనుసరింపవలెను. దేశమున ప్రభుత్వోద్యోగులు ప్రజల కెంతటి ఆగ్రహకారణమును కలిగించినను ప్రజలు శాంతమును వదల రను గట్టినమ్మకము కలిగినపుడు శాసనోల్లంఘనమును ప్రారంభించుటయే ముఖ్యకర్తవ్యము. నిరంకుశమును కఠినమును ప్రజావినాశకరమునగు ప్రభుత్వభావమును తొలగించుటకు మఱియొక శ్రేష్ఠమగు సాధనము లేదు. గాన శాసనోల్లంఘనమును ప్రారంభించుటకు ప్రచారకులు సర్వసన్నాహములను సమకట్టవలెను. జాతీయవర్గములను విస్తరింపజేసి బలపరుపవలెను. తిలకు స్వరాజ్యనిధికి కనీసము 25 లక్షల రూపాయలను చేకూర్పవలెను. 50000 మంది వలంటీరులనైన చేర్పవలెను. ఇందులకు గడువు భారతకాంగ్రెసుస్థాయిసంఘమువారు గయలోనే నిర్ణయించెదరు; ఆ తేదీలోగా ఈపనులు పూర్తి కావలెను.” గడువు ఏప్రిలుమాసాంతము వరకును నేర్పరుపబడినది.

“కాంగ్రెసు సంబంధములగు కార్యములందుతప్ప తక్కిన కార్యములలో అనగా మతధిక్కారము స్త్రీలమానభంగము, పురుషులను బాలుర నన్యాయముగా బాధించుట మున్నగు దుష్కృత్యముల నెవరైన చేసినపుడు న్యాయశాసనబద్ధమగు ఆత్మరక్షణ మొనరించుకొనుటకు ప్రతివ్యక్తికిని అధికారము కలదు. అందువలన సమష్టిదౌర్జన్యమున కవకాశము కలిగింపగూడదు.”

"లాసేన్ సభా చర్యను బట్టి ఖిలాఫతుకు టర్కీకిని చాల విపత్స్థితి కలుగుచున్నట్లున్నది. అట్టి ఆపద కలుగకుండ చేయుటకు హిందువులను మహమ్మదీయులును దీక్షబూనిరి. గాన కాంగ్రెసు కార్యసంఘమువారు ఖిలాఫతు కార్యసంఘమువారితో నాలోచించి హిందువులును మహమ్మదీయులును కలసి పనిచేయుటకు కేర్పాటుచేయవలెను. టర్కీవారి నోడించుటకు హిందూదేశమునుండి దేశీయులను యుద్ధరంగమునకు పంపకుండ జేయవలెను."

గయా కాంగ్రెసు చేసిన తీర్మానములు దేశమునందు వ్యాపించిన భేదాభిప్రాయములను స్థిరతరము చేసినవి. దాసుపక్షమువారు ప్రత్యేకపక్షమును కార్యవిధానమును నిర్ణయించిరి. ఆపక్షమునం దొకకొనను డాక్టరు మంజిగారును రెండవకొనను నెహ్రూగారును గలరు. శాసనసభలయందు బ్రవేశించి సమయానుకూలముగ సహకారధర్మము నవలంబింప గోరెడివారును నిరాకరణధర్మము నవలంబించుచు ప్రతిష్టంభనమును జేయగోరెడివారును నీపక్షమునందు గలరు. ఈపక్షమున కంతకును శాసనసభా ప్రవేశ మొక్కటిమాత్రమే సమానార్థకధర్మము. దాసుగారి సమయానుకూలవ్యాఖ్యానము లీయర్థమునే ప్రతిపాదించుచున్నవి. ఆరంభమునందు సంపూర్ణప్రతిష్టంభనము నపేక్షించిన దాసుగారిపు డన్నివిధముల సహకారమును బోధించుచున్నాడు. ఎన్నికలకుపూర్వమే అభిప్రాయమునందు భేద మేర్పడినపుడు సభలయందు జేరిన తరువాత జరుగగలమార్పు నెవరు నిర్ణయింపగలరు? నాయకులసిద్ధాంతము లెటులున్నను జాతీయసభానిర్ణయములను శిరసా వహించి స్వరాజ్యసేవను జేయుట ప్రజాధర్మము. స్వరాజ్యపురమునందు జాతీయమహాసభా మంటపమునం దామోదితమైన స్వరాజ్యసాధనవిధానము ననుష్ఠించుచు 25 లక్షలరూప్యములను 50 వేల స్వరాజ్యసేవకులను సమకూర్చి అసహాయోద్యమసాధనమునను స్వరాజ్యసంపాదనమును జేయుటకు ప్రజలు పాటుపడి చరితార్థులగుదురు గాక! ఈసందర్భమునను గాంధిమహాత్ముని భావములను పాటించుట పరమధర్మము.

"నే నవలంబించిన మార్గము సత్యమార్గమని నామిత్రులకు తెలుపుము. నా సంకల్పములు ధర్మయుక్తములు. అసహాయోద్యమ విధానమునందును ప్రజలయందును నాకు గల నిండువిశ్వాసము మారలేదు. వారి మనోరథము నిశ్చయముగ సఫలమగును. నేను సౌఖ్యముగను సంతోషముగను నున్నానని తెలియజేయుము. భేదములను మనము లక్ష్యము చేయరాదు. దాసు నెహ్రూగారులు శాసనసభల నాశించుట దురదృష్టము."

మహాత్ముని భావములు ధర్మార్థస్ఫురణమును జేయుచు ప్రజలకు స్వధర్మమును బోధించుచున్నవి.

చెన్నరాష్ట్రమునందును నితరరాష్ట్రములందు వలె నిరంకుశాధికారవర్గమునకు ద్వంద్వప్రభుత్వము పోషణము నొసంగినది. నిరంకుశాధికారబలము చెన్నరాష్ట్రము ప్రజోత్సాహమును సంహారము చేయుటకు వినియోగపడినది. నిరంకుశాధికారవర్గ మసహాయోద్యమయోగులను నపరాధపుపన్నులతోను దండనములతోను నిర్బంధములతోను సత్కరించినది. మంత్రుల బలము కార్యనిర్వాహకవర్గ ప్రయోజనములను సంరక్షించుటకు వినియోగపడినది. శాంతిసంరక్షణ వ్యాజమున దేశసేవకులకు శిక్షలు సంప్రాప్తమైనవి. గోదావరి గుంటూరు మండలములందు దండనపు పన్ను విధింపబడినది. అసహాయోద్యమావలంబకుల కుద్యోగాదులం దర్ధచంద్ర ప్రయోగము గలిగినది. బ్రాహ్మణేతర పక్షమునకు గల పలుకుబడి ప్రభుత్వాధికార సమర్థనమునకు వినియోగపడినది. విల్లింగ్డను ప్రభువు మంత్రులు కార్యనిర్వాహకసభ్యులు కలిసి పని జేసినటులు ప్రకటించినను నుభయపక్షములకును భేదాభిప్రాయము గల విధమును రాష్ట్రవ్యవహారములు విశదము చేసినవి. సామ్రాజ్యప్రభుత్వమునకు భాగధేయ సమర్పణ విషయమై మంత్రులు చేసినయాందోళనము విఫలమైనది. చెన్నరాష్ట్ర మర్పింపవలసిన 348 లక్షలందును తగ్గింపు గలుగలేదు. గతవత్సరమునందు రాష్ట్రాదాయము 167600,000 రాష్ట్రవ్యయము 171800000 లోటు 42,00,000 యని మదింపు వేయబడినను భాగధేయము మాత్రము తగ్గింపబడలేదు. అభివృద్ధిశాఖాంగమంత్రి శ్రీ. రెడ్డినాయుడుగారును నితరశాఖాంగమంత్రులును ధనాభావముచే జేయగలకార్యము లేవియును లేవని వ్యక్తము చేసిరి. విద్యాశాఖాంగమంత్రి విశ్వవిద్యాలయశాసనమును అభివృద్ధిశాఖాంగమంత్రి పరిశ్రమాభివృద్ధిసహాయశాసనమును నిర్మింపజేసిరి. నీటిపారుదల శాసనమును మంత్రిపక్షము ప్రతిఘటించి ద్వంద్వప్రభుత్వమునందు రెండుపక్షములకును గల భేదాభిప్రాయమును సువ్యక్తము చేసినది. శ్రీ. శ్రీనివాసయ్యంగారు కార్యనిర్వాహకసభ్యత్వమును వదలుకొనిరి. సి. పి. రామస్వామయ్యరుగారు వారి స్థానమునకు నియమింపబడిరి. నిరంకుశవర్గపోషణమునకు ప్రతిఫలము సి. పి. రామస్వామయ్యరు

గారికి గలిగినది. అధికారలాభ మధికారైక్యమునకు మూలమగుచున్న విధమున కిట్టిదృష్టాంతములు ప్రత్యక్షముగ నున్నను సభాప్రవేశపక్షవాదనలు విచిత్రముగ నున్నవి. అధికారపదవులందు జేరిన భారతీయుల దేశభక్తిని వితర్కించుట యసంగతంబుగ నున్నను వారి నిరీక్షణము మాత్రము సంకుచితముగ నుండును. ఈరాష్ట్రమునందు గత సంవత్సరమునం దార్థిక పారిశ్రామిక రాజకీయ విషయములందు విశేషమైన ప్రయోజనము లేవియును గలుగలేదు. ద్వంద్వప్రభుత్వము నిరంతరాయముగ నడుచుచున్న చిన్నరాష్ట్రమునందు రాష్ట్రీయ స్వపరిపాలన మచిరకాలమున స్థాపిత మగుటకు ప్రయత్నములు జరుగగల వని వదంతి గలదు. శ్రీవిల్లింగ్డను ప్రభువుకాలము నిర్బంధములతో గూడిన దైనను నాకాలమునం దీస్థితిగలుగుట కనుకూలపరిస్థితు లేర్పడుగాక!

## ఆంధ్రరాష్ట్రము

బ్రిటీషుపరిపాలనము గలుగజేసిన యనర్థములందు రాష్ట్రవిభాగములు ప్రత్యక్షముగ నున్నవి. భాషలతోను జాతితోను సాంప్రదాయాచారములతోను ప్రజాసౌకర్యములతోను నిమిత్తము లేకయే బ్రిటీషురాజకీయ వ్యవహారములకు కనుకూలముగ రాష్ట్రములు నిర్మింపబడినవి. ఈ రాష్ట్రనిర్మాణము ప్రజల ప్రత్యభిజ్ఞానమును నిర్మూలము చేసినది. మాతృభూమిపట్లను మాతృభాషపట్లను నభిమానము నస్తంగతము చేసినది. ప్రజావికాసమునకు ప్రతిబంధకములు గలిగినవి. ఆంధ్రులు కర్ణాటకులు, ఉత్కలులు వివిధరాష్ట్రములందు జేర్పబడి స్వవీర్యశక్తిప్రతాపములను గోల్పోయి దురవస్థ ననుభవించుచున్నారు. ఆంధ్రోద్యమమాంధ్రకర్ణాటకోత్కళులకు ప్రత్యభిజ్ఞానమును గలుగజేసి ప్రజావికాసము గలిగించినది. స్వారాజ్యసామ్రాజ్యము భరతఖండమునందు సాధ్యమగుటకు భాషాప్రయుక్తరాష్ట్రవిభాగము నత్యంతావసరములని మోంటుఫర్డు విధానమును కర్టిసువిధానమును నంగీకరించినను బ్రిటీషురాష్ట్రపరిపాలనము పూర్వమువలెనే పర్యాప్తంబగుచున్నది. భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణావసరము నంగీకరించియును నధికారివర్గము రాష్ట్రనిర్మాణమునకుం బూనుకొనజాలకున్నది. అధికారివర్గమున కనవసరమైనవ్యయము చేయుటకు గల సాహస మవసరమైన నిర్మాణమును జేయుటకు గలుగకున్నది. రాష్ట్రీయ శాసనసభయందు ప్రజాప్రతినిధులుగ నున్న సభ్యులైనను స్వప్రయోజనముల నాసించుచు నాంధ్రరాష్ట్రనిర్మాణవిషయముపట్లను ఉదాసీనభావమును వహించిరి. ఆంధ్రోద్యమము సఫలమగుటకు యావచ్ఛక్తిని ధారపోసిన దేశభక్త కొండ వేంకటప్పయ్యగారు మొదలగు ప్రముఖులు స్వరాజ్యాందోళనమునందు నిమగ్నులై ప్రత్యేకరాష్ట్రనిర్మాణసమస్య నుపేక్షించిరి. దేశమునందు ప్రజాస్వామ్యాత్మాయత్తమైన రాష్ట్రీయస్వపరిపాలనము ప్రయోగయోగ్యమగుటకు భాషావిభక్తరాష్ట్రనిర్మాణము శరణ్యమగుచున్నది. దేశమునం దాంగ్లభాషాపరిచయము లేని దేశసేవాపరాయణులైన శ్రీమంతులు ప్రతిష్ఠావంతులును అనేకులుగలరు. వారి ప్రజ్ఞావకాశములు దేశాభ్యుదయమునకు వినియోగపడుట కాంధ్రరాష్ట్రనిర్మాణ మవసరమగుచున్నది. ప్రజలు దేశప్రయోజనములను స్వప్రయోజనములను గమనించి క్రొత్తయెన్నికలయందు ఆంధ్రరాష్ట్రనిర్మాణమున కనుకూలురైన ప్రతినిధుల నెన్నుకొనుటకు ప్రయత్నములను జేసి ఆంధ్రరాష్ట్రనిర్మాణము నచిరకాలముననే సాధ్యము చేసి స్వరాజ్యనిర్మాణమును స్వధర్మనిర్వాహణమును జేయుదు రని నమ్ముచున్నాము.

ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సంఘము

ఆంధ్రరాష్ట్రనిర్మాణముపట్ల పాలకవర్గ ముదాసీనభావమును వహించుచున్నను జాతీయమహాసభ ప్రత్యేకాంధ్రరాష్ట్రీయసంఘ నిర్మాణము నంగీకరించి ఆంధ్రవ్యక్తిత్వ వికాసమునకుం దోడ్పడినది. ఆంధ్రరాష్ట్రీయసంఘనిర్మాణ మాంధ్రుల సహజమైన ప్రతిభను వ్యక్తము చేసినది. నాగపురము కాంగ్రెసు భరతఖండమును భాషాప్రయుక్తవిభాగములుగ విభజించి భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణమును సార్థకము చేసినది. అసహాయోద్యమమారంభమైనతరువాత నాంధ్రుల నామమితరరాష్ట్రములందు వ్యాపకమును గాంచినది. బెజవాడయందు భారతజాతీయసభా స్థాయిసంఘము నిర్ణయించిన నిర్మాణకార్యవిధాన మాంధ్రదేశమునకు భారతరాజ్యాంగచరిత్రమునందు సుస్థిరప్రతిష్ఠను గలుగజేసినది. గాంధీమహాత్ముని యాంధ్రదేశసంచార మాంధ్రులసహజోత్సాహమును వ్యక్తము జేసినది. లక్షలకొలంది జనులు మహాత్ముని సందర్శించి స్వరాజ్యనిధికి కానుకలను సమర్పించిరి. దేశమునం దంతటను స్వరాజ్యచక్రములను స్థాపించి నూలును వడుకుటయందును ఖద్ద

నూలు బట్టలను నేయుటయందును నాంధ్రులు చూపిన పరమోత్సాహము మహాత్ముని ప్రశంసలకు పాత్రమై భారతీయుల దృష్టి నాకర్షించినది. పొందూరునూలు పొందూరుబట్టలు ఖద్దరునకు లక్ష్యము లైనవి. ఆంధ్రదేశ ఖద్దరు భరతవర్షమునం దంతటను ప్రతిష్ఠను గడించి జనాదరణమునకుఁ బాత్రమైనది. నిర్మాణవిధానము నందువలె నసహాయోద్యమసేవనమునందును నాంధ్రులు పట్టుదలనుజూపుచు ప్రశంసలకుఁ బాత్రులైరి. విద్యార్థులు విద్యాలయములను విసర్జించిరి. ప్లీడర్లు వృత్తిని విడిచిరి. గ్రామోద్యోగస్థులును నితరులును నుద్యోగములను విసర్జించిరి. దేశమునందంతటను శాంతిసేవకదళము లేర్పడినవి. కల్లు సారాయి పాటలయందు శాసనతిరస్కారములను జేసి శాంతిసైనికులు దండనముల ననుభవించిరి. పన్నుల నిరాకరణను జేయుటకు సైతము ప్రబలమైన ప్రయత్నములు జరిగినవి. రాష్ట్రమునందంతటను జాతీయవిద్యాలయములు స్థాపితములై జాతీయవిద్య వ్యాపకమును గాంచినది. గతసంవత్సరారంభమునం దసహాయోద్యమ మాంధ్రదేశమునందు మహాతరంగములవలె బ్రసరించి ప్రజాహృదయమునందు మహాసంచలనమును గలుగజేసినది. అసహాయోద్యమమునందలి కార్యవిధానము నాచరించుట కాంధ్రదేశము నిర్భయముగను బ్రయత్నించినది. త్రివిధబహిష్కారమును పన్నుల నిరాకరణమును మొదలగు విధానములను నాచరించి ప్రజలు దుఃఖము ననుభవించిరి. వందలకొలది స్వరాజ్యసేవకులు నిర్బంధముల ననుభవించిరి. అసహాయోద్యమమునందు ముందంజవేసిన గుంటూరు మండలము నిర్బంధములకు పాలై అపరాధపు పన్నును సమర్పించినది. ప్రజలు మహాకష్టముల ననుభవించినను పరమోత్సాహభరితులైయున్నవిధమును గుంటూరు పురమునందు శాసనోల్లంఘనసంఘమున కొసంగిన మహాస్వాగతమును ప్రజల శాసనాతిక్రమణతత్పరత్వమును విశదముచేయుచున్నవి. అధికారవర్గ మెన్నినిర్బంధములను గల్పించినను ప్రజలయందు స్వరాజ్యోత్సాహ మప్రతిహతముగఁ బ్రకాశించుచున్నవిధము నాంధ్రదేశ పరిస్థితులు విశదముచేయుచున్నవి. దేశభక్త వేంకటప్పయ్యపంతులుగారి నిర్బంధానంతరము శ్రీయుత టంగుటూరి ప్రకాశంపంతులుగారు చేయుచున్న దేశసేవ సంస్తవనీయము. ఆంధ్రుల యసహాయోద్యమయోగతత్పరత్వము కలకత్తా, గయా సమావేశములందు ఆంధ్ర ప్రతినిధు లందఱును నేకగ్రీవముగ నసహాయోద్యమవిధానము నామోదించిన విధమును వ్యక్తము చేసినది. ఆ యామోద మాక్షేపణలకు బాత్రమైనను స్వధర్మనిర్వహణమును జేసి యాంధ్రులు తమ ప్రతిష్ఠను కాపాడుకొనిరి. చిత్తూరునందు గూడిన యాంధ్రరాష్ట్రీయమహాసభ శాసనసభాప్రవేశవిషయమై చేసినతీర్మానము గయా కాంగ్రెసునకు మార్గదర్శకముగ పరిణమించినది.

"అసహాయోద్యమతత్త్వమునకును ఏతత్కార్యప్రణాళికకును శాసనసభాబహిష్కారమే మూలాధార మని, యెంచి యీసభవారు నాగపూరు అహమదాబాదులందు దేశీయమహాజనసభవారు గావించిన తీర్మానమును దృఢపఱచుచు, శాసనసభాప్రవేశసమస్యను పునర్విచారణకు తెచ్చుటయందు మనయుద్యమమపజయముపొందినదను అంతర్గర్భితమైన సూచన సత్యమునకు దూరమయినది గనుక అట్టిసూచనను ఈ సభవారు అంగీకరింపక శాసనసభాప్రవేశమును ప్రోత్సహించు అసహాయవాదులు పక్షలలో నుండి అసహాయసూత్రమును అవలంబించెద మను నుద్దేశ్యము, భావములు, అసంభవము లనియు, అసమంజసము లనియు, పరిగణించి యీ సభవారు శాసనసభాప్రవేశమును అన్ని విధములను ఖండించుచున్నారు."

ఆంధ్రరాష్ట్రీయసభయందు జేసిన తీర్మాన మసహాయోద్యమముపట్ల నాంధ్రుల నిశ్చలాభిప్రాయమును తెలుపుచున్నది.

**నిర్మాణ విధానము**

నిర్మాణవిధానమునందాంధ్రుల ప్రతిష్ఠ భరతఖండమునం దంతటను వ్యాపించినది. మాంచెస్టరు మల్లుతానులను, ధోవతులను మించిన మల్లుతానులును, ధోవతులును నాంధ్రదేశమునందు తయారుచేయబడి ప్రశస్తిని బడసినది. పాశ్చాత్య యంత్రాలయములు నేతపరిశ్రమములను నిర్మూలము చేసినను ఆంధ్రదేశమునందు కొనయూపిరితో నిలిచియున్న నేతపరిశ్రమ కుత్తేజము గలిగి ప్రజలకు జీవనాధారమున కవకాశము గలిగినది. దేశమునందంతటను ఖద్దరు పరిశ్రమాలయములు వెలసినవి. ఆంధ్రదేశ ఖద్దరన్ని రాష్ట్రములకును నెగుమతి చేయబడి ఆంధ్రదేశ సౌభాగ్యమును వికసింపజేసినది. ఖద్దరుధారణ మాంధ్రదేశమునందంతటను విరివిగ వ్యాపించినది. అభివృద్ధిశాఖాంగమంత్రి గా. రెడ్డినాయుడుగారు రాటములను ఖద్దరును పరిహసించినను మాంచెస్టరు గార్డియను పత్రిక ప్రచురించిన వ్యాసమువలనను, ఖద్దరు నిర్మాణమువలనను, భారతదేశమునకు స్వయంపోషణము సాధ్య మగు నని విశదమగుచున్నది. నిర్మాణవిధానమునందు గల యితర

కార్యనిర్వహణమునందును ఆంధ్రదేశము ఉత్సాహమును జూపినది. ఆంధ్రరాష్ట్రమునం దితరరాష్ట్రములందువలె నంతఃకలహములు లేకను ప్రజలు దీక్షాపరాయణులై జాతీయసభాదర్శములను సఫలము చేయుటకు బ్రయత్నించిరి. స్వరాజ్యాశ్రమమునుండి తిరిగి వచ్చినవారు సయితము స్వరాజ్యసేవను జేయుటకు సిద్ధముగ నున్న విధమును వారి ఉత్సాహవిశ్వాసములు విశదము చేయుచున్నవి. అసహాయవాదులు సహాయనిరాకరణమునందు జూపుచున్న యుత్సాహమునే సహకారవాదులు ఉద్యోగార్జనమునందును జూపుచున్నారు. ఆంధ్రప్రముఖులు బ్రాహ్మణేతరనాయకులు మంత్రులుగ నున్నారు. ఇతరశాఖలందును నాంధ్రులు నున్నతోద్యోగములను బడయుచున్నారు. ఉద్యోగనిర్వహణమునందును నాంధ్రుల ప్రతిభ వ్యక్తమగుచున్నది.

జాతీయవిద్య

భారతజాతీయనిర్మాణమునకు మూలాధారమైన జాతీయవిద్యావ్యాపనమునందును నాంధ్రదేశము స్వధర్మనిర్వహణమును జేయుచున్న విధమును దేశమునందు వ్యాప్తములైన జాతీయవిద్యాలయములు విశదము చేయుచున్నవి. రాజమహేంద్రవరము తెనాలి ఏలూరు విజయవాడ ఒంగోలు నెల్లూరు మొదలగు పురములందు జాతీయవిద్యాలయములు స్థాపితములై జాతీయవిద్యను నేర్పుచు నాంధ్రవ్యక్తిత్వమును వికసింపజేయుచున్నవి. మచిలీబందరునందు పదియైదేండ్లక్రితము స్థాపితమై కోపల్లి హనుమంతరాయవర్ధితమైన జాతీయవిద్యాలయము జాతీయవిద్యాలయములకు మార్గదర్శకముగ నున్నది. స్వజాతీయప్రత్యభిజ్ఞానమునకు సాధనభూతములైన శాస్త్రములను కళలను మాతృభాషాముఖమున నభ్యసింపజేయుచు విద్యార్థుల కాత్మసంస్మరణమును గలుగజేయుచున్నది. ఆంధ్రజాతీయకళాశాల యాంధ్రుల వ్యక్తిత్వవికాసమునకు నిదర్శనముగనున్నది. ఖద్దరు నిర్మాణమునందును అద్దకమునందును జాతీయకళాశాల స్వరాజ్యనిర్మాణకార్యక్రమమునకు దోడ్పడుచు జాతీయకళాశాలాభిధానమును సార్థకము చేయుచున్నది. జాతీయవిద్యాలయములు వ్యక్తము చేయుచున్న స్వయంవ్యక్తిత్వమును వాఙ్మయము నుచితము సువ్యక్తము చేయుచున్నది.

వాఙ్మయము

భారతహృదయప్రబోధమునకు లక్షణమైన వాఙ్మయనిర్మాణమునందు నాంధ్రహృదయము ధర్మారాధనమును జేయుచున్న విధము నాంధ్రవాఙ్మయ పరిశోధనము విశదము చేయుచున్నది. ప్రజాసంకల్పములను ప్రజాశయములను విశదము చేసి ప్రజలను కార్యపరతంత్రులనుగఁ జేయుటకు వాఙ్మయము పరమసాధనముగ నున్నది. వాఙ్మయమూలమునను ప్రజాహృదయము నావరించిన మాతృభాషాభిమానము మాతృదేశాభిమానము ధర్మపరత్వము బహిర్గతమగుచు ప్రజాశక్తి వ్యక్తమగుచుండును. ఆంధ్రభాషయందు ప్రకటితములైన కావ్యములు నాటకములు ప్రబంధములు పాటలు పద్యములు ప్రజాహృదయమును దెలుపుచున్నవి. స్వరాజ్యనాటకములు గాంధిసంకీర్తనములు స్వరాజ్యగీతములు భజనగానములు ప్రజాహృదయము నావరించిన స్వాతంత్ర్యప్రియత్వమును వ్యక్తము చేయుచున్నవి. ప్రజాభీష్టములను వ్యక్తము చేయుటకు దేశమునందంతటను వార్తాపత్రికలు వెలయుచున్నవి. సర్వతోముఖమైన వాఙ్మయమును నిర్మించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. శ్రీపిఠాపురము మహారాజు గారు బ్రహ్మసూత్ర శంకరభాష్యమును రామానుజభాష్యమును బ్రకటించిరి. శ్రీ వంగూరు సుబ్బారావు గారు నవీనపరిశోధనలను జేర్చి యాంధ్రవాఙ్మయచరిత్రమును వేమనచరిత్రమును శతకకవులచరిత్రమును వేంకటపార్వతీశ్వరకవులు ఏకాంతసేవను బ్రచురించి వాఙ్మయమునకు నూతనాలంకారములను సమర్పించిరి. కవులు పండితులు శాస్త్రజ్ఞులు నూతనకావ్యములను రచియించుచు నాంధ్రుల ప్రతిభను వ్యక్తము చేయుచున్న విధమును నవవాఙ్మయము తెలుపుచున్నది. జాతీయవాఙ్మయనిర్మాణమునం దాంధ్రులు బంగాళీలవలె స్వయంవ్యక్తిత్వమును వ్యక్తము చేయుచున్న విధమును వాఙ్మయము దెలుపుచున్నను నాంధ్రులు వారి ప్రతిభను వ్యక్తము చేయుటకు సకలక్షేత్రములందు నింకను విశేషముగఁ బని జేయవలసియున్న విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. జాతీయవిద్యావిధానము శుభస్థితిని బడయుటకు జాతీయవిశ్వవిద్యాలయస్థాపన మావసరంబగుచున్నది. సంపదలు వికసించుటకు పరిశ్రమలు వృద్ధిగావలసియున్నవి. మధురమైనభాషను రమ్యములైన పరిసరములను సరళమైన స్వభావమును వికసింపఁజేయుటకు కళావికాసము గావలసియున్నది. ఆత్మసంస్మరణము గలుగుటకు సర్వతోముఖమైన వాఙ్మయనిర్మాణ మావసరం బగుచున్నది. సంపూర్ణమైన ప్రత్యభిజ్ఞానము గలు

గుట కాంధ్రరాష్ట్ర నిర్మాణ మత్యంతావసరంబగుచున్నది. ప్రత్యేకవ్యక్తిత్వము గలుగఁజేయగల ప్రయోజనములను నుత్కళ కర్ణాట కాంధ్ర రాష్ట్రీయోపసంఘములు విశదముచేసినవి. ఈయనుభవమును సార్థకముచేయుట కాంధ్ర నాయకులును ప్రజలును వర్తమానసంవత్సరమునందు పాటుపడి యాత్మోపలబ్ధిని బడయుదురుగాత! వర్తమాన సంవత్సరమునందును నాంధ్రధీరు లసహాయోద్యమ ప్రస్థానమును జయప్రదముగ జేసి స్వరాజ్యసంపాదనమునందర్వాస్థానమును బడయుదురు గాత!

ప్రపంచపరిస్థితులు విషమముగ నున్న విధమును సకలరాజ్యముల వ్యవహారములును విశదముచేయుచున్నవి. యుద్ధానంతరము నానాజాతిసమితి ప్రతిపాదించిన ధర్మసిద్ధాంతములన్నియును భగ్నము లైనవి. జాతిసమితి ప్రబలరాజ్యప్రయోజనములకును శ్వేతజాతుల లాభములకును వినియోగపడుచున్న విధమును లోకవ్యవహారములు విశదముచేయుచున్నవి. నానాజాతి సమితియందు గతసంవత్సరమునందు 51 రాజ్యములు చేరినను ధర్మసంరక్షణమునకు నిరుపయోగముగ నున్నది. గతసంవత్సరమునందు జాతిసమితిసభయందు స్వీడనుఫిన్లాండులకు గల తగాదాయును సైలీషియా పాలనమును ఆస్ట్రియాపునర్నిర్మాణమును నిర్ణయింపబడినను శాంతిస్థాపనమునకును సంరక్షణమునకును జాతిసమితినిర్ణయములు నిరుపయోగములుగ నున్న విధమును లోకావృతమైన రాక్షసబలవ్యాపనము స్పష్టము చేయుచున్నది. రూరుసమస్యను ధర్మమార్గమున నిర్ణయించుటకు సాహసధైర్యములను బూనని జాతిసమితి ధర్మప్రతిష్ఠాపనమును జేయఁజాలదు. లోకావృతమైన రాక్షసబలపాలనమును రూరుప్రాంతముల నాక్రమించుకొనుచు బీభత్సమును గలుగజేయుచున్న ఫ్రాన్సుసైన్యములు విశదముచేయుచున్నవి. ఫ్రాన్సుదేశము విల్సను ధర్మములను విసర్జించి ఫాకుధర్మముల నారాధించుచున్నది. యూరపురాజ్యములు వృద్ధిచేసిన దండనీతినె సకలరాజ్యములును నవలంబించుచున్నవి. ఐర్లాండునందు ఘోరహత్యలు ప్రవర్ధమానంబగుచున్నవి. సోవియటు రక్తసైన్యములు సైన్యప్రస్థానమును గోరుచున్నవి. ఈజిప్టునందు బాంబుప్రయోగములువ్యాప్తమునందు గలవు. ఇరాకు వజీరుస్థానములందు వైమానికు లాగ్నేయగోళములను ప్రయోగించుచున్నారు. గ్రీకులు కయ్యమునకు

ఉపసంహారము

కాలు దువ్వుచున్నారు. లాసేను సంధిసభ నిరర్థకమైనది. మహమ్మదీయప్రపంచమునందు మహాసంచలన మంకురించినది. భరతఖండమునందు స్వరాజ్యసమస్య ఖిలాఫతు సమస్య మహానిర్బంధములు మహాసంచలనమును గలుగజేసి ప్రజాహృదయమునం దశాంతిని బుట్టించినవి. భారతవ్యవహారములం దనుభవము గల గ్విను గారు మాన్చెస్టరు గార్డియను పత్రికయందు దెలిపిన భావములు భారతదేశస్థితిని తెలుపుచున్నవి. లోకావృతమై దినదిన ప్రవర్ధమానంబగుచున్న యశాంతిని శాంతింప జేసినగాని తరణోపాయము లేదని ప్రపంచపరిస్థితు లనంతముఖములను బోధించుచున్నను నీమహాబోధ మానవహృదయమునందు బ్రవేశమును గాంచుటకు మహాప్రతిబంధకములు గలుగుచున్నవి. ఆగ్రహమున కభ్యస్తమైన పాశ్చాత్య ప్రపంచమునకు నిగ్రహము దురారాధ్యముగ నున్నది భోగమున కలవాటుపడిన లోకమునకు త్యాగ మపరిచితముగ నున్నది. బలదర్పముల భ్రాంతియందు మునిగియున్న జాతులకు వినయవివేకములు పరిహాసపాత్రములుగ నున్నవి. పాశ్చాత్యసంస్కారము పరమవిషాదమును గలుగజేయుచున్నది. పాశ్చాత్యజాతులు వెదజల్లిన విలయసంస్కార బీజములందు ప్రళయఫలములు ప్రత్యక్షముగ గనుపించుచున్నను పాశ్చాత్యజాతు లహమహమికను బూని యాత్మవినాశసాధనముల నారాధించుచు ధర్మారాధనమును జేయజాలక మహాప్రళయప్రస్థానమును చేయుచున్నవి. శాంతిస్థాపనమును జేయుటకు శక్తిసామర్థ్యవకాశములు గల బ్రిటీషుప్రభుత్వము విషాదయోగమును బూని ధర్మసంస్థాపనమున శాత్రవకర్షణమును జేయుటకు వెనుకాడుచున్నది. పరాసుల యాక్రమణమును ఖండించియును ధర్మప్రతిపాదనమును జేయుట కాంగ్లప్రభుత్వము పూనుకొనకున్నది. పరాసులస్వార్థారాధనమునందు మహాసంగ్రామాంకురముల నవలోకించియును నుదాసీనభావమును బూనుచు నాత్మవినాశమునకు దోడ్పడుచున్నది. స్వతంత్రరాజ్యవ్యవహారములందువలె సామ్రాజ్యాంతర్గతరాజ్యవ్యవహారములందును బ్రిటీషు ప్రభుత్వము ఉదాసీనభావమును బూనుచు నాత్మవినాశమునకు దోడ్పడు చున్నది. ఈ పరిస్థితులు మారి ప్రపంచమునందు శాంతిబీజములు స్థాపితము లగుటకు యూరపు రాజ్యములు ముఖ్యముగ బ్రిటీషురాజ్యము

నూతనమార్గము నవలంబింపవలసియున్నను పూర్వసంస్కారము ప్రతిబంధకముగ నున్నది.

యూరపురాజ్యముల కభ్యస్తమైన రాక్షసబలము శాంతిస్థాపనమునకు ప్రతిబంధకముగ నున్న విధమును యూరపురాజ్యముల వ్యవహారములు బ్రిటీషుసామ్రాజ్య వ్యవహారములు ముఖ్యముగ ఫ్రాన్సు వ్యవహారములు తెలుపుచున్నను వారిసంస్కారము ప్రతిబంధకముగ నున్నవిధమును పర్యాప్తంబగుచున్న దండనీతి విశదము చేయుచున్నది. మహాసంహారపరములైన మారణసాధనములనే యూరపురాజ్యములు లారాధించుచు సంహారఫలములను బడయగోరుచున్నవి. దుర్దశగ్రస్తమైన జర్మనురాజ్యమున కాత్మసంరక్షణమునకు నూతనధర్మారాధన మవసరంబైనది. జర్మనుల కాయుధధారణము సంగ్రామము పరిపాటియైన ధర్మము లైనను నూతనధర్మారాధన మవసరమైనది. జర్మనుల శిక్షణము సంగ్రామకౌశలము సంగ్రామసంస్కారమునకు దగియున్నను నవయుగధర్మోదయమునకు వినియోగపడుచు జర్మనులకు నవధర్మారాధన మవసరంబైనది. జర్మను లాత్మనిగ్రహమును బూని యభ్యసించుచున్న యసహాయోద్యమయోగము ప్రపంచదృష్టి నాకర్షించుచున్నది. జర్మనుల యోగసంసిద్ధికి జర్మనుగాంధినాయకత్వ మవసరమని పండితులు వ్రాయుచున్నారు. విశ్వవ్యాప్తమైన గాంధిధర్మము పాశ్చాత్త్యదృష్టికి దురవగాహముగ నున్నది. విషాదభరితమైన పాశ్చాత్త్యప్రపంచమునందు నయితము పరాసుల నిర్బంధములు జర్మనుల కాత్మోపలబ్ధికే సాధనంబు లగుచున్నవి. గాంధిమహాత్ముని దివ్యభావములు ప్రపంచశాంతికి సాధనములు గాగల విధమును జర్మనుల సాత్త్వికనిరోధము విశదము చేయుచున్నది. ప్రపంచసంరంభమునందు సకలరాజ్యములును ధర్మప్రదమైన సత్యాగ్రహాయుధమును బూని ధర్మసంస్థాపనమున కేర్పడిన నానాజాతిసమితిప్రయోజనములను సఫలముచేయుటకు భగవంతు డనుగ్రహించుగాత!

భరతఖండపరిస్థితు లయోమయముగ నున్నవిధమును దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి. రాజ్యాంగసంస్థాపనలు నిరంకుశశృంఖలబద్ధములై నిశ్చేష్టతను గలుగజేసినవి. స్థానికసంస్థలయందును సామ్రాజ్యశాసనసభయందును నిరంకుశవజ్రశృంఖలము లభేద్యములుగనున్నవి. రాజ్యాంగసంస్థలయం దధికారమంతయును నిరంకుశత్వాయత్తమై ప్రజాప్రతినిధులుకీలుబొమ్మలవలె నాడుచున్నారు. స్వతంత్రాచరణము స్వల్పసంస్థలయందునైతము పూజ్యముగనున్నది. ప్రజలకధికారము పూజ్యమైనను రాజ్యభారము దుర్భరమగుచున్నది. దేశాదాయమునందు సగము సైన్యమునకును మూడవభాగము పౌరసేవోద్యోగములకును వినియోగపడుచున్నది. నాలుగేండ్లయందు 100 కోట్ల రూప్యము లధికవ్యయముగలిగి క్రొత్తపన్నులు విధింపబడినను లోటుమాత్రము తప్పనిసరిగ నున్నది. అయిదేండ్లలో 750 కోట్లకు అప్పు పెరిగినది. రాజ్యాదాయమును వృద్ధిచేయుటకు జీవనాధారమైన ఉప్పుపన్ను రెట్టింపు చేయబడినది. క్రొత్తపన్నుల నెన్ని వేసినను నేమి చేసినను బొక్కసముమాత్రము పూడకున్నది. దేశదారిద్ర్య మభివృద్ధిని జెందుచున్నది. ప్రజల ఆయుర్భాగ్యములు క్షీణించుచున్నవి. దేశమునకు తరణోపాయముగ ననుగ్రహింపబడిన సంస్కరణప్రసాదము విషప్రాయమై నిశ్చేష్టతకు గారణంబుగ బరిణమించినది. వ్యయభారమును తగ్గించుటకు సాధనమైన భారతీయనియోగము రిక్తమనోరథము లని ఆంగ్లమంత్రులవ్యాఖ్యానములు భారతరాజ్యాంగాధికారుల యాచరణములు విస్పష్టము చేసినవి. భారతజాతీయోజ్జీవనమునకు సత్వరస్వరాజ్యస్థాపన మవసరమని యంగీకృతమైనను సాధన మగమ్యగోచరముగ నున్నది. ఆంగ్లవిద్యాసంభవులకు వారి సంస్కారమున కనురూపమైన సాధనమునందు విశ్వాసము గలదు. వారు సహకారనీతి నవలంబించుచు నిరంకుశశృంఖలములకు బలము నొసంగుచున్నారు. నిరంకుశవిధానము నవితర్కితముగ బోషించుచు స్వరాజ్యమును దూరస్థము చేయుచున్నారు. ఆంగ్లోహైందవవర్గము స్వరాజ్యస్థాపనమునకు సంపూర్ణవిముఖత్వమును జూపుచున్నది. బ్రిటీషు రాజ్యాధికారులు ముఖ్యముగ సామ్రాజ్యాభిమానులైన కర్నలులు ప్రభువులు స్వరాజ్యమును బ్రహ్మరాక్షసివలె సంభావించుచున్నారు. భారతభోగభాగ్యములను మాన్యముగ ననుభవించుచున్న స్వార్థపరాయణులకు పరశ్రేయస్సహనము దుర్లభము. మహారాజనిరంకుశాధికారము ననుభవించుచున్న నిరంకుశవర్గమునకు స్వరాజ్యస్మరణము నయితము భయకంపములను గలుగజేయుచున్నది. శాసనపరంపరారాధకులకు మోక్షమార్గమంతయును శాసనారాధనమునందు గోచరం బగుచున్నది. ఈపరిస్థితులందు దేశదాస్యవిమోచనమునకు

సాధనమును నిర్ణయించుటదుస్తరమై యసహాయయోగము శరణ్యమైనది. అసహాయయోగము గతించిన రెండేండ్లయందును గలుగజేసిన మహాఫలములు లోకమున కంతకును విశదమైనవి. అధికారవర్గపు దండనములు నిర్బంధములు సామదానభేదోపాయములన్నియును స్వరాజ్యసంకల్పమును స్థిరతరము చేసి స్వరాజ్యమునందలి విశ్వాసమును బలపరచినవి. దురారాధ్యమైన యసహాయయోగప్రభావము విశదమైనది. స్వరాజ్యకాము లసహాయయోగసాధనమునను స్వరాజ్య సంపాదనమును జేయుటకు కృతనిశ్చయులై యున్నవిధమును స్వరాజ్యాశ్రమాగతులైన సేవకుల నిశ్చలసంకల్పము విశదము చేయుచున్నది. శాసనసభాప్రవేశసాధనారాధకులును ప్రయాగసమావేశమునందు నిర్ణీతమైన నియమముల ననుసరించి యసహాయయోగసాధనమునందు గల విశ్వాసమును విశదము చేసిరి. భారతదేశబంధవిమోచనమున కసహాయయోగమే శరణ్యమని స్వజాతీయానుభవమును ప్రపంచానుభవమును విశదము చేసినవి. అకాలీల నిగ్రహవిజయము లసహాయోద్యమయోగానుభవమును భారతహృదయమున కనుభవైకవేద్యము చేసినవి. జర్మనులయోగానుభవము ప్రపంచహృదయమునకు నవధర్మప్రభావమును విశదము చేసినది. ప్రపంచమునందు స్థిరశాంతిస్థాపనమున కసహాయయోగము సాధనముగాగలవిధమును లోకానుభవము క్రమముగ విశదము చేయగలదు. దుఃఖసంతప్తమైన ప్రపంచపరిస్థితులందు శాంతిసాధనముల నుపదేశించిన గాంధిమహాత్ముడు నిర్బంధముల ననుభవించుట ధర్మహానికిని దైవదుర్విపాకమునకును నిదర్శనములు.

ప్రపంచావృతమైన దుఃఖనివృత్తికి సనాతనమైన త్యాగధర్మారాధన మవసరంబుగ నున్నది. దుఃఖకారణమైన పరపీడనమును మహాజాతులు చేసి సామ్రాజ్యముల నునిర్మించి మహాసంక్షోభకారణములను నిర్మించినవి. లోకవ్యాప్తమైన మహాసంక్షోభము నుపశమింపజేసి శాంతిని స్థాపించుటకు త్యాగవ్రతము శరణ్యముగ నున్నది. భోగారాధనపరమైన ప్రపంచప్రవృత్తియందు త్యాగప్రవృత్తి వ్యక్తమై నవజీవనము సార్థకమగుటకు సకలజాతులకును త్యాగారాధనమే శరణ్యముగ నున్నది. ప్రపంచావృతమైన సకలసమస్యలను నిర్ణయించుటకును శాంతినిస్థాపించుటకును త్యాగమే సాధనముగ నున్నది. నష్టపూరణసమస్య, కార్మికసమస్య, బ్రాహ్మణేతరసమస్య, స్వరాజ్యసమస్య, బ్రిటీషు సామ్రాజ్యసమస్య, నానాజాతిసమస్య, ప్రాక్పాశ్చాత్యసమస్య మొదలగు సకలసమస్యలను నిర్ణయించుటకు నిగ్రహపరమైన త్యాగమే కీలకము. ఆగ్రహపరమైన వర్తమానప్రవృత్తియందు నిగ్రహమును ప్రతిష్ఠించుటయందు గల కష్టపరంపరలు ప్రతిఘటనమువలనను దెలియుచున్నవి. కోట్లకొలది ధీరులు శాంతిస్థాపనమునకు రణరంగములందు ప్రాణసమర్పణమును జేసినను స్వరాజ్యప్రాప్తికి గాంధిమహాత్ముం డాత్మసమర్పణమును జేసినను త్యాగప్రతాపము సంశయాత్ములకు గ్రాహ్యము గాకున్నది. దుఃఖనివృత్తికి సాధనభూతమైన యసహాయయోగమునకు త్యాగమే బీజము. గతసంవత్సరమునందు వేలకొలది భారతపుత్రు లసహాయయోగాభ్యాసమును జేసి త్యాగపరాయణులై దుఃఖవేదన ననుభవించుచు దాస్యపాశబంధనములను శిథిలము చేసి యసహాయయోగప్రభావమును విశదము చేసిరి. అసహాయయోగపరాయణుడు గాంధిమహాత్ముడు నిర్బంధముల ననుభవించుచున్న సమయమునను, స్వరాజ్యసేవకులు కష్టపరంపరల ననుభవించుచున్న సమయమునను, మాతృదేశము మహాదైన్యము ననుభవించు సమయమునను, నాత్మోపలబ్ధికి భారతీయుల కసహాయయోగాభ్యాసము పరమసాధనముగ నున్నది. ఆంధ్రులును నసహాయయోగారూఢులై భక్తిపరాయణులై ఆంధ్రత్వసిద్ధికిని స్వరాజ్యప్రాప్తికిని లోకకల్యాణమునకును యథాశక్తిని ఆత్మసమర్పణము చేసి భగవదనుగ్రహమునకు పాత్రు లగుదురు గాక!

శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి । తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# కమలములు

## ఇది భద్రమైన పెట్టుబడియే గాక,

## అలంకరించుకొనుటకు మిక్కిలి ఉచితమైనవి

## మరియు అలంకరించుకొనువారికిని, వారి స్నేహితులకును

## ఆహ్లాదమును కలిగించును

### కమలములు

అవి నమ్మకముమీదనే కొనబడుచున్నవి. వీటి నాణ్యమును కట్టజాలనివారు బహుకొద్దిగానుందురు గనుక

### నమ్మకముమీదనే

కమలములను కొనవలెను

అందుకు కమలములను నమ్మువర్తకులలో ఘరానాగలవారెవ్వరో వారివద్దనే కొనటమంచిది. తనకు ఏరకం వస్తువు కావలెనో, ఎంతసొమ్ములో కావలెనో మాత్రము తెలిపి, తక్కిన విషయమంతయు వర్తకునికే వదలివేయవలయును.

### మేము ఒకే ఖరారుధరకు అమ్ముచున్నాము

అందుచేతనే బయటిప్రాంతవారు కూడ మిక్కిలి నమ్మకముతో ఆర్డరులు పంపుటకు వీలగుచున్నది. వృథాగా కాలము, డబ్బు వ్యర్థమగుటలేదు. మిక్కిలి ప్రవీణులైన వారికంటె ఒకబిడ్డ సరసముగా కొనగలదు. ఏలననగా మేమే కమలములను స్వంతముగా ఆంట్వర్పు, అమస్టర్డామ్ (ముఖ్యముగా కమలము లుత్పత్తియగు స్థానములు) మొదలగు పట్టణములనుండి తెప్పించి, వాడు కొనువారికి విక్రయించుచున్నాము. ఇందులో మధ్య దళారీకి ఏమియు యివ్వ నవసరము లేదు.

### మీరు ఎట్లు కమలములను కొనెదరు?

రెండువిధములు గలవు:—

1. అన్నిదుకాణములలోను కొనుట. ఇటువంటి విలువగల వస్తువుల కొరకు అన్ని దుకాణములకు పోయి బేరమాడుటవలన సంతృప్తి కలుగకపోవుటయే గాక చివరకు నష్టము వచ్చును.

### 2. శ్రేష్ఠమైనపద్ధతి

చాలకాలమునకు మునుపు స్థాపించబడిన మావద్ద ఎప్పుడును మామూలుగా కొనుటయే మంచిది. మేమే స్వంతముగా తెప్పించుటచేత తప్పక మిక్కిలి సరసమైన ధరలకు శ్రేష్ఠమైనవాటిని కొనుటకు అవకాశము గలదు.

మీకు నష్టము లేక చేయుటయే

### మా ఉద్దేశ్యము

ఏ వ్యాపారముగాని మీకు పూర్తిసంతృప్తి నివ్వనప్పుడు అది సమాప్తిగాదు. మీరు ఎంత వస్తువులు, ఎంతసొమ్ములో కావలసినది మాకు తెలిపిన మేము మా అంగీకారముపైన వాటిని మీకు పంపెదము. మీరు సులభముగా కొనవచ్చును.

వస్తువులను తీసుకొనిన ఎనిమిది దినములలోపల మీ కంగీకారము లేనిచో వాటిని తిరిగి పంపివేయవచ్చును. పూర్తి మొత్తము వాపసీయబడును.

## ఒకే ఖరారు ధరగల కమలముల అంగడి

### అక్కడ మీరు మిక్కిలి నమ్మకముమీద కొనవచ్చును

### మీరే స్వంతముగా మావద్ద కొనుటవలన చాల లాభము గలదు.

### ఒక ఉత్తరమువ్రాసిన మేము శ్రేష్ఠమైనవాటిని పంపెదము

### మిగత విషయములకు త్రిప్పిచూడుడు.

# రుధిరోద్గారి

బుర్రా బాలకృష్ణ శాస్త్రి గారు

కళయుక్త్యాది దుష్టసం । ఘమునఁ జేరి
దుర్మతిత్వము బూనిదుం । దుడుకు చూపి
ప్రబల సంరంభ గత భయ । భ్రాంతి ముంచి
యున్నమో యన్నమో యను । యార్తరవము
తోడ దుందుభి మ్రోయించి । దుర్నయమున
నీవయిన్ రుధిరోద్గారి । నే నటంచు
వదనమున వ్రాసికొని నీవు । వచ్చినావు
భయమగుచునుండె దనువుఁ గం । పంబునొందె
మది చలించెను బుద్ధియు । మంద మయ్యె
నేమి చేయఁగ వచ్చితో । యెఱుఁగరాదు
అకట యెటు రుధిరోద్గారి । వగుదు చెపుమ!

* * * *

నీవు రుధిరము గ్రక్కెదో? । నీకె హాని
నీశరీరమె ద్రుంచును । నిన్నుఁ గలఁచు
నీయుసురులను దీయుచు । నిన్నుఁ జంపు
నిన్ను దరిచేర రాదు । ఆపన్న వనరు
ముందువెనుకలు చూడక । మోదమంది
చాలఁ జెగనీల్గి యింత దు । ష్కర్మఫలము
దెచ్చుకొనె నంచు నిన్నె నిం । దింత్రుగాని
యెఱుఁగ కొక్కింతయును నష్ట । ముండఁబోదు
అకట యెటు రుధిరోద్గారి । వగుదు చెపుమ!

* * * *

కాక రుధిరగ్రహంబు నే । గ్రక్కెదనిన
నది యతీంద్రియ మక్రమ । మనభిగమము
నప్రమాణము ప్రకృతిధ । ర్మా నవద్య
మత్యసంభవ మీశ్వ రే । చ్ఛాతిరేక
మటు లసంబద్ధమైన కా । ర్యములు కలుగ
వైన "సర్వజ్ఞ సర్వశ । క్త్యాత్ముఁ డైన
యీశ్వరుం డేమి చేయలే । డేమి వింత
యనెదొ చెల్లదు. సంకల్ప । మట్లు లేదు.
కలుగఁబోదు. చాల్చాలు శు । ష్కప్రలాప
మింత దుర్బుద్ధి నీకుంట । వింత గాదు
గోళములు గోళములు నొరసి । కొనునె! యెచట
లగుల నన్యోన్యశక్తి । సూత్రములు మిథ్య.
అటుల ప్రళయము జరుగదె । వ్వటికి నయిన
నదియు మార్గంబు కాదు శ్రు । త్యనుభవమున
చెఱుపఁజూడకె నీవును । చెడుట నిజము.
భౌతికాంతరశక్తిని । బట్టుకొనిన
కర్కశత్వము బూని దు । ష్కర్మగొనిన
కేవలశాస్త్రమునె నమ్మి । చేవ గొనిన
నైహిక సుఖానురక్తి పై । నలముకొనిన
నఖిలభోగంబులే పురు । షార్థ మనిన
ధనమె జీవనమై సమ । స్తంబు విడువ
నారభిమాన పిశాచము । తోడువడిన
పరవినాశము స్వార్థలా । భంబుఁ దలఁప
నీవు రుధిరముఁ గ్రక్కెదు । నిప్పు గ్రక్కె
దేమియిన గ్రక్కెదొక్కింత । యిటుల గనుము

* * * *

ధర్మసంస్థాపనము చేయు । తరుణమందు
ధర్మమార్గానుబద్ధ ప్రో । ద్బలమునందు
ధర్మమార్గానుగత । సమోద్యమమునందు
దయయె ప్రాణంబుగాఁ । గొన్న తరుణమందు
శాంతికవచంబు పైఁ । గొన్న సమయమందు
హింస యనునది లేని లో । కేచ్ఛయందు
స్వప్రకాశకమైన వి । జ్ఞానమందు
నెట్లు చేరెదొ? నీకుఁ దా । వెందుఁ గలదొ?
తెలియఁగారాదు నీవును । దెలుపలేవు.
తెలుపఁబూనిన నీకు యు । క్తులను వినరు.

కాక, మసిపూసి । మారేడుకాయఁ జేసి
మామదిని గొను । కాలము మాఱె నిఁక.

* * * *

జ్ఞానవిద్యుత్తు లల్లె దిక్చక్రమందు
శాంతవాతావరణమును । జగము గ్రమ్మె
నాసుధాంశుఁడు కర్మచం।ద్రాకృతి యయి
యభ్యుదయమునఁ బూర్ణవి।హారి యయ్యె
శాంతలోకాబ్ధి । యుప్పొంగె సకలదిశల
భూ నభోంతరాళంబులఁ । బొంగి పొరలె
శ్రోత్రలై యుండ బ్రహ్మాండ।సూరిజనము
ప్రబలగంభీర ఘుమఘుమా।రావములను
సాంఘికప్రచారంబును । నలుపఁ దొడఁగె
స్వచ్ఛవిజ్ఞానమండ ల।చ్ఛన్నమయ్యె,
ఇంత తావైన లేదు । నీ వెచట నుందు?
వకట యెటు రుధిరోద్గారి । వగుదు చెపుమ!

* * * *

కాలచక్రంబున న్నీకుఁ । గలవు తావు
అంతమాత్రాన నీకు స।ర్వాంతరత్వ
సర్వశక్తిత్వములు । గల్గఁజాల వెపుడు.
తత్పరి భ్రమణంబునఁ । దలఁగు దీవు!
నెట్టి త్రిప్పులఁ బడుదువో । యెఱుఁగ లేవు.
దురభిమానము నింతటి । దుడుకుఁదనము
తగదు నీకీర్తి యడఁగుట । తథ్య మింక
నీస్వతంత్రత మాయుట । నిశ్చయంబు;
నామమాత్రాన భయపడఁ । బోము మేము
సార్థకాభిధ కాదు ని।స్సంశయముగ.
సార్థకంబైన నీశ్వరే।చ్ఛకే విఘాత
మగుట నీ "వమృతోద్గారి" । వనుట తగును.
దాన నీకును మాకును । దగును మైత్రి
ధర్మసంస్థాపనాఫలో।త్పత్తి యగును.
లోకకల్యాణ మబ్బు చీకాకుఁ దొలఁగు.
జీవకోటికి మోక్షసం।సిద్ధి కలుగు.
శాశ్వతయశంబు నీకును । సంఘటిల్లు,
ధర్మనిర్ణయమును । నీవె తలఁపు మమ్మ.

# మహాత్మస్మరణము

పెనుమర్తి వేంకటరత్నము గారు

ఎవ్వాని దీప్తి భూ।మీతలంబున సతం, బజ్ఞానధ్వాంతాల । నణఁచి వైచు
ఎవ్వాని రాక నీ । హిందూతనూజులు, వికసితాత్ములౌచు । వెలయుచుండ్రు
ఎవ్వాని మాహాత్మ్య । మీరేడుజగముల, విజయధ్వానులతోడ । వెలయుచుండు
ఎవ్వానిగుణము లు।ర్వీతలంబున సతం, బగ్గింపఁబడుచుండు । నధికములుగ
గీ. నట్టివాని నిరంతర । మాత్మలోన, మహితభక్తినిఁ జేర్చి న।మస్కరింతుఁ
బ్రథితకీర్తి జగన్మాన్య । భవ్యమూర్తి, దళితపరిపంథి మోహన।దాస గాంధి.

గీ. స్వీయదేశోపకారివై । చెలఁగినావు, ఐహికసుఖాల నెల్లక । నలరినావు
ధరణి నెక్కుడు కీర్తినిఁ । బరఁగినావు, దళితపరిపంథి మోహన।దాస గాంధి.

The Sabarmati Ashramam - the School



సబర్మతీ ఆశ్రమము - పాఠశాల

Mulshi Ladie's Singing Party (Mulshi Mele) Bombay



ముల్షీ స్త్రీల మేళము - బొంబయి

Akali Jatha or Volunteers



అకాలీ జత (వాలంటీర్లు)

# అకాలీల ఆందోళనము

ప్రభ యను హిందీ మాసపత్రికయందు 'ఏక్ బైతా తాలా గ్రాడుక్ యేటు' అను పేరుతో అకాలీయుద్యమమును గురించి ఒక రిట్లు వ్రాయుచున్నారు:—

సెప్టంబరు నెలలో వెలువడిన ప్రభయందు అకాలీల ఆందోళనమును గురించి యీ విధముగా వ్రాసియుంటిని. "అకాలీల ఆందోళనము అనునది వర్తమానకాలమునందలి భారతరాష్ట్రీయసంగ్రామమునకు సంబంధించిన - ఒక మహత్త్వపూర్ణమగు-సంఘటనము. భారతీయుల స్వరాజ్యనిర్మాణకార్యమునందు ఈ ఆందోళనమునకు ఒకవిధమగు విశిష్టస్థానము ఈయబడగలదు ఈ ఆందోళనమున ముందు ఏమేమి ఫలితములు తేలగలవో ఎవరు చెప్పగలరు ? ఏమి తేలినను సరియేకాని వివేచనాశీలుడగు ప్రతిభారతీయునకును ఈ ఆందోళనముయొక్క స్థితిగతులను సావధానచిత్తముతో పరికింపక తప్పదు."

ఈ పైవాక్యములను వ్రాయునాటికి-నాడుగూడ - అకాలీఆందోళనము - ఇంతత్వరలో - ప్రపంచమునంతను ఆకర్షింపగలయంతటిరూపము ధరించునను నాశలేకయుండినది. కడచినదినములలో-చేసిన - ప్రస్తుతము చేయబోవుచున్న - అకాలీల సాత్త్వికమగు ఆందోళనము - ఆకాలీలకీర్తిని సర్వకాలసర్వావస్థలయందును అజరామరముగ నొనర్చివైచినది. గురుకాబాగునందుసత్యాగ్రహసంగ్రామముతరువాత మనినవెను వెంటనే- ఒక్కమాఱుగ - దేశీయులందఱనేత్రములు - అకాలీ ఆందోళనమువైపునకు ఆకర్షింపబడినవి. ప్రజలు - వీరు వారు అను భేదము లేక - ఎల్లవారును అకాలీలను గురించియును వారియుద్యమమును గురించియును గల - కలరూపు తెలియఁగుట కుద్యుక్తులైరి. ప్రభయొక్క సెప్టంబరునెల సంచికలు అయిదారుదినములలోనే కర్చుఅగుటయేగాక అందలిలేఖ అనేకభాషలలో - అనేకపత్రికలయందు -పరివర్తింపబడుటయును పైని చెప్పిన ఉద్యుక్తతవలన చేకుఱిన ఫలితములే. అందునను కొన్నికొన్ని పత్రికలు ఈ ప్రభయొక్క పేరునైనను చివఱ సూచింపజాలనంతటి ఆవేగము మఱికొన్నికొన్నిటిలో - తమయుపజ్ఞతకు భంగము వాటిల్లు ననియేమో - ప్రభ యనుపేరు వచ్చినస్థలములనెల్ల తీసివైచి ప్రకటింపవలసినంతటి ఆవశ్యకతను సైతము కనఁబఱచినవి.

హిందీపత్రిక లవలంబించిన ఈచిత్రమును పాఠకులమనస్సులకు తెచ్చుచు ప్రస్తుతవిషయమునకువచ్చుచున్నాను. పూర్వాపరసందర్భములు గోచరించుటకై ఆకాలీ ఆందోళనమును గూర్చిన ఈలేఖలో - వెనుకటి లేఖయొక్క ప్రస్తావనను - సింహావలోకనన్యాయమున వ్రాసితిని. కాని వెనుక గడచినసంఘటనలవలన - ఎంత లేదన్నను - ఆకాలీ ఆందోళనమునకు జెందిన గురుద్వారాసుస్థితిపైగూడ కొంతప్రకాశము సోకిన దనక తప్పదు. కనుకనే ఈలేఖను ప్రభాపాఠకుల కుపహారీకరించుచున్నాను. ప్రేమాస్పదులగు మాప్రభాపాఠకులు - గురుకాబాగును గురించి విశేషములను స్వయముగా చెప్పజాలిన చిత్రపటములతో విలసిల్లుచున్న - ఈ లేఖను సవిశేషధ్యానముతో పఠింతు రని నమ్మెదను.

కూకాసాంప్రదాయులగు సిక్కులును తత్ఖాలసాలును అకాలీలును సిక్కుమతోద్ధరణమునకై నడుములుగట్టిన వెనుకటిరోజులలో - సిక్కులయొక్క గురుద్వారము - సర్కారువారియొక్క లేక మహంతులయొక్క - చేతులలో నుండెడిది. తారాతరన్‌యొక్క గురుద్వారము. అమృతసరమునందలి సిక్కులదేవాలయము- స్వర్ణమందిరము- అకాలీబంగ్ - మఱియును బాబాఅటల్ - ఇవియన్నియును సర్కారువారిస్వాధీనములో నుండెడివి. తత్ఖాలసాలు కూకాలు అకాలీలు అను ఈమూడుజాతులవారికిని ఇట్లుండుట చాల దుస్సహముగను హృదయశల్యముగను ఉండెడిది. మహంతులు సిక్కులయొక్క ఈ పవిత్రములగు ఆలయములను- అపవిత్రతకు నిలయములుగా- మార్చుచుండుటను జూచినప్పుడెల్లను - జాతీయప్రేమ పరిప్లుతమగు వారిహృదయములు చాల ఖేదిల్లుచుండెను. మహంతులసేఁత లిట్లుండనిచ్చి ఇకను సర్కారువారి స్వాధీనముననున్న ప్రతిష్ఠాపన లైనను చక్కగా నున్నవేమో యనుకొందమన్నను అదియు నంతగనే యున్నది. జలియనువాలాబాగులో జరిగిన వ్యవహారములవలన - సిక్కులు - అసలే దహించుకొనిపోవుచుండి రని ఇదివఱకు తెలిసినవిషయమే. అంతలకు తగినట్లుగా - భగ్గుమనుచున్న వారి హృదయవ్రణములపైని - కారమును చల్లుటకై సిక్కుల - ఉత్తమోత్తమమగు - స్వర్ణమందిరములపైని - పర్యవేక్షకుడుగ ప్రభుత్వమువారిచే నియమింపబడిన మేనేజరు-మామూలుచొప్పున-పంజాబు ప్రభుత్వమువారి ఇషారా తీసికొని - సిక్కులతరపున డయ్యరుకు స్వాగతము నొసగెను. దీనితో పంజాబునందు కొంప లంటుకొనినవి. స్వర్ణమందిరమును ప్రభుత్వమువారి స్వాధీనమునుండి తొలగించుటకై సిక్కులలో అతితీక్ష్ణమగు నాందోళనము ప్రారంభమైనది. సహాయనిరాకరణోద్యమముద్వారా ఈ యాందోళనమునకు ఇంకను అధికముగ బలము చేకూఱెను. ప్రభుత్వమువారు లోలోపల లంతులకొలఁదిసలహాల నొనర్చుచు- ఈయాందోళనము నడంచుటకై - రాజనీతిధురంధరు లగుకలతన్-తమకు గల యావత్తుపలుకుబడి నుపయోగించి - మొదట సామమును - అది అక్కఱకురాకపోయినపిమ్మట దానమును - ఆపైని భేదమును - చివఱకు విసిగి దండోపాయమును సైతము - విచ్చలవిడిగా ప్రయోగించిరి. కాని ఈ సిక్కుల యాందోళనమును అణఁచివైచుటలోఁ గాని స్తంభింపఁజేయుటలోఁగాని సాఫల్యమును బడయజాలరైరి. ఈ విధముగా పరాజితులై ప్రభుత్వమువారు 1920 సం. జులైలో స్వర్ణమందిరపు

ప్రాతపర్యవేక్షకుని(Manager) తొలగించి ఆస్థానమునందు క్రొత్తవారిని నేమించిరి. "ప్రాతవారిని తొలఁగించినచో సిక్కులును సంతుష్టులై యుందురు. మందిరముపైని తమప్రాభవము అవిచ్ఛిన్నముగా కొనసాగనుగూడ గలదు" అని వారు (ప్రభుత్వమువారు) తలంచిరి. కాని ఉదారహృదయు లగు సిక్కులు ఈవలలో చిక్కుకొనలేదు "ఎంతవఱకు ప్రభుత్వము వారు స్వర్ణమందిరవ్యవస్థలలో సంపూర్ణముగా తమపెత్తనమును వదలుకొనరో అంతవఱకును తమకు శాంతి చేకుఱదు"—అనియును, "చివఱకును తామీ ఏర్పాటుపైననే నిల్వఁగలయు ననియును" వారు నిశ్చయించుకొనిరి. ఇయ్యది ట్లుండఁగా, ఈగురుద్వారా ఆందోళనము కేవలము క్రొంగ్రొత్తరూపమును దాల్పఁగల్గుటకు మఱొకసందర్భము పొసఁగినది. ఇంతవఱకును సర్వకాలసర్వావస్థలయందును ఉత్తమతరగతికి చెందినసిక్కులే స్వర్ణమందిరమున పూజారులుగ నుండుట సంప్రదాయముగ వచ్చుచున్నదే కాని హిందువులలోని అస్పృశ్యజాతులనుండి క్రొత్తగ మతస్వీకార మొనరించి సిక్కులుగా నైన వారికి - స్వయముగా - అనఁగా స్వతంత్రతతో - గ్రంథసాహేబును అర్చించునధికారము లేదు. కనుక గ్రంథసాహేబును అర్చింపవలసి వచ్చునప్పుడు - మజహాబీ సిక్కు లని చెప్పఁబడువీరు ఉన్నతతరగతివారి నాశ్రయింప వలసినదే. అయినను 1020 మే నెలలో తత్ఖాలసావారు వీరిని - అనఁగా మజహాబీ సిక్కులను - చీలదీసి 'ఒక మతమునకు చేరినవారిలో ఈ హెచ్చుతగ్గు లుండుట చాల నన్యాయ్యము గనుక మీరు ఇటుపైని స్వయముగానే గ్రంథసాహేబును అర్చింపవలయు' నని ఉద్బోధించిరి. పిమ్మట తత్ఖాలసావారు వీరిని (అనఁగా మజహాబీసిక్కులను) ప్రత్యేకముగా నొకనాఁడు హరిమందిరమునకుఁ గొంపోయి, గ్రంథసాహేబు నర్చింపఁజేసిరి. అకాలీబంగునకు సంబంధించిన పూజారులు ఈవార్తను విన్నవెంటనే గురూగ్రంథసాహేబు విడిచిపెట్టి పలాయనమంత్రమును పఠించిరి. తత్ఖాలసావారు - పరివార మొక్కరైనను దగ్గఱ లేని స్థితిలో - గ్రంథసాహేబును పరిత్యజించుట యనుచితము- అని తలఁచి అతి శీఘ్రముగా అకాలబంగమందిరముపైనగూడ తమయధికారమును నెలకొల్పిరి. గురూగ్రంథసాహేబుయొక్క అర్చనాదులకై తామె సమస్తమగు నేర్పాటులను చేసిరి. నాటినుండి గురుద్వారములపై నధికారము చెలాయించు విషయములో నాందోళనము జరుగుట తలయెత్తినది. అకాలబంగమందిరముపైని ఇదివఱలో ప్రభుత్వమువారి యధికారము చెల్లుచుండెడిది. ఇట్టి అకాలబంగమందిరముపైని - హఠాత్తుగా - ఇట్లు తత్ఖాలసావారి యధికారము సాగుట ఆరంభము కాఁగానే ప్రభుత్వమువారి కన్నులు మెఱమెఱలాడినవి. తత్ఖాలసావారి విజయపతాక చెలరేఁగినది. స్వర్ణమందిరమునకు గాని తత్సంబద్ధము లగు అకాలబంగు మున్నగువానికి గాని పరంపరగ - గురుగోవిందసింహుని రాష్ట్రమువారగు - అకాలీలే రక్షకులుగాను స్వయంసేవకులుగాను ఉండుచువచ్చిరి. తత్ఖాలసా సంప్రదాయమువారును అకాలీసంప్రదాయమువారును భిన్నభిన్నము లగు సంప్రదాయములకు చేరినవారు.

"స్వర్ణమందిరముతో సంబంధ మునుకొని యున్న అకాలబంగమందిరముపైని తత్ఖాలసాల యధికారము రాఁగానే అకాలీలు తప్పక క్రుద్ధులయ్యెదరు. దీన మనకార్యము సులువుగా నెఱవేఱగలదు" అని ప్రభుత్వమువారు ద్వైధీభావతంత్రమును ఆలోచించిరి. కనకనే అకాలబంగుపైని తత్ఖాలసావారు అధికారమును చెలాయించినప్పుడు వీరు మౌనము వహించి యూరకుండిరి. కాని తత్ఖాలసావారి నేర్పు మూలమున ఈతంత్రము సాగినదికాదు. అకాలీలను ప్రసన్నులనుగా నొనర్చుకొనుటకై తత్ఖాలసావారును ప్రయత్నించిరి. ఈయత్నముల ఫలితముగా దొరతనమువా రనుకొన్నట్లులుగా అకాలీవారికిని తత్ఖాలాసాలకును ఘోరయుద్ధము జరుగుటకు బదులుగా - అహార్యమును - అమరము నగు నైక్యము చేకుఱినది.

స్వర్ణమందిరవ్యవహారమున విజయము చేకూఱఁగనే నవలోక స్ఫూర్తి (విషయము) విద్యుద్వేగమున సిక్కులలో వ్యాపించినది. గురుగోవిందసింహుని రాష్ట్రీయస్వయంసేవకు లగు అకాలీలు గురుద్వారము పునరుద్ధరింప యత్నించిరి. దీనితో మఱల సంఘర్షణ మారంభ మైనది. అధికసంఖ్యాకము లగు గురుద్వారాలు నిర్మల ఉదాసీ సంప్రదాయు లగుమహంతులవశమున నదివఱ కుండెడివి. ఈమహంతులలోఁగూడ నధికసంఖ్యాకులు తిష్ఠన్మాత్రులు. ఇంతమాత్రమే కాక అనేకులు- మేజిస్ట్రేట్లు-హానరరీ మేజిస్ట్రేట్లు-సబురుజిస్ట్రార్లు- మున్నగువారి- యాశ్రయమునను డిస్ట్రిక్టుబోర్డులు మునిసిపాలిటీల మహంతులుగ నిర్వహింపఁబడిన వారు. అనఁగా ప్రభుత్వమువారి పెంకపిల్లలు. రాష్ట్రీయమగు అసహాయయోగోద్యమముతోఁ బాటు ఈ సాంఘిక రాజ నైతిక మత సంబంధాది భావములుగూడ సమ్మిశ్రణ మగుటచేత గురుద్వారా ఆందోళనము వెనుకటికంటె మిక్కిలి బలిష్ఠ మైనది. గురుద్వారములను ఆక్రమించి వాని ఖాలసీమతస్థులకు వశపఱచుయత్నములు జరిగినవి. ఈ ఆందోళనమున కగ్రేసరుడు సరదారు ద్రానసింహుడును ఝూపల్ బంధువును.

విదేశములనుండి ప్రత్యాగతులైన సిక్కులు అకాలీలు కూడా గురుద్వారముల నాక్రమించుటకై సుదృఢము లగు దళములను ఏర్పాటు చేసికొనిరి. ఈ దళములకు (గుంపులకు) అకాలీజత్థాలు-అని పేరుపెట్టిరి. గురుగోవిందసింహునినాఁడు ఏవిధముగా సిక్కులందఱును తమ ఆత్మలను బలి నర్పించి సిక్కుమతము నుద్ధరించుటకు భీష్మములగు ప్రతిజ్ఞలను బూనిరో అట్లే ఇప్పుడును ఈ అకాలీజత్థాలుకూడ సమయము వచ్చినప్పుడెల్ల-తమ ప్రాణముల నైనను వదలుకొని- గురుద్వారా ఉద్యమమును సాగించుటకు - పవిత్రమగు ప్రతిజ్ఞను బూనిరి. వీ రిట్లుండఁగ నిక నధికారమత్తులగు ప్రభుత్వపు పరివారము తమకుగల సహజమౌఢ్యమును పరిచయ మొనర్చు మతధర్మములను లక్ష్యము సేయకయే తమ ఇంజనీరులు తయారుచేసిన ప్లానుచొప్పున కట్టడములను పడగొట్టించుట కట్టించుట మున్నగు తలక్రిందుపనులకు గడఁగిరి. ఈ సందర్భమునందు రికాబుగంజుకు చేరిన యొకగోడగూడ చిముకఁగొట్టఁబడినది. అకాలీలకుఁ ఇయ్యది ప్రాణతుల్య మైనపట్టు. వారిమతభావములందు దీనితో ఉజ్జ్వల కలిగినది. కనుక వారందఱును స్వధర్మరక్షణమునకై ఆతురపడసాగిరి. 1920 సెప్టెంబరులో మతప్రియులలో ఒకదళము (గుంపు) ఏర్పడినది. ఈదళమువారి యుద్దేశ్య మేమనఁగా-మనము

AN AKALI WOMAN WHO RECEIVED SEVERE BEATING



దెబ్బలు కొట్టబడిన ఒక అకాలీ స్త్రీ

ANOTHER AKALI WOUNDED AND LYING UNCONSCIOUS



గాయములతో స్మృతితప్పి పడియున్న మరియొక అకాలీ

చచ్చియైనను పోవలెను లేదా రికాబుగంజుకట్టడమును యథాస్థితిగ నిల్పియైనను నిల్పవలయును-అని. తత్ఖాలసావారు పశుబలప్రయోగమును ప్రదర్శింపనున్నారు గనుక మనమే పశుబలము నద్దుకొనవలయును-అని. అనుకొన్నట్లులే మతప్రియులగుంపు స్థిరసంకల్పము జేసికొన్నది. సరిగా ఈసమయముననే కలకత్తాలో కాంగ్రెసుసభ జరుగుటయును సహాయనిరాకరణతీర్మానము ప్రాయించుటయును జరిగినవి. సిక్కులు నవంబరులో జరిగిన తమపరిషత్తులో బహుళసంఖ్యాకుల యిష్టము ననుసరించి ఈ అహింసాయుత మగు సహాయనిరాకరణ సిద్ధాంతమును చేపట్టిరి. తత్ఖాలసాలు సహాయనిరాకరణమునకు విరుద్ధపర్తులు అయినను ఆపరిషత్తునందు మహాత్ముడు అలీసోదరులు మున్నగువారు సమ్మిళితులై యున్నందున-తత్ఖాలసాల ఆట లేవియు సాగక-సహాయనిరాకరణాస్త్రము జయధ్వనులతో విజృంభించినది. క్రమముగా తత్ఖాలసాలకును అకాలీలకును కూకాలకును విదేశీయులనుండి ప్రత్యాగతులైన సిక్కులకును సమాధానము కుదిరి-తత్ఫలముగా-తమయీ యాందోళనమునందు కేవలము అహింసాస్త్రముతోనే పని జరుపబడవలయు నను నిశ్చయమునకు వచ్చిరి. ఆందోళనమునందుగూడ-డైరెక్టు ఆక్షనే యుండవలయు నని నిశ్చయించి - గురుద్వారములపైని స్వాధికారమును ప్రతిష్ఠింపవలయును. కాని శాంతిపూర్ణము లగు ఉపాయములతో-ఏవిధమైన ఉపద్రవములు గాని రక్తపాతములు గాని లేకుండునట్లు-జరుపవలయు ను. అకాలీజత్థలతరఫున డిప్యుటేషను ప్రత్యేకముగా మహంతులయొద్దకేగి- తొలుత-వారిని లోకప్రియ మగురీతిని- సామోపాయముతో బోధించి సమరసపెట్టవలయుననియు నిశ్చయించిరి జలియను వాలాహత్యలవలన ఉద్బుద్ధము లయిన రాజకీయ వాతావరణములు ఈసందర్భమున అకాలీవీరులకు మంచి యనుకూలపరిస్థితుల నొనగూర్చినవి. అహింసాత్మక మగు సహాయనిరాకరణము విజయము గాంచుటకు తగిన యంతప్రోత్సాహము జరిగినది.

ఇట్లు కర్మపథమున నిర్ధారణచేసికొని వీరమణు లగు సిక్కులు ముందునకు సాగిరి. తత్ఖాలసాలు అమృతసరములోని స్వర్ణమందిరమునగూడ స్వాధికారమును సాగించిరి. ఈ పరిస్థితులను చూచి పంజాబు దొరతనమువారు ఈబంధమును వదలించుకొనుటకై యోచించి పటియాలాసిక్కు మహారాజును తమచేతి కీలుబొమ్మనుగా చేసికొని ఈఆసరాతో సిక్కులలోని కొందఱిని కూర్చి ఒక కమిటీని ఏర్పఱచిరి. ఈకమిటీలో ౯౬ గురు సభ్యు లుండిరి. పంజాబు ప్రభుత్వమువారు ఈ కమిటీవారి చేతులకు స్వర్ణమందిరవ్యవహారమును ఒప్పగింప దలచినారు. కాని అకాలీలదృఢనిశ్చయముయెదుట వీరి యెత్తు కొంచెమైనను సాగలేదు. సిక్కులు తమగురుద్వారా వ్యవహారములను ప్రభుత్వమువారేర్పఱచిన కమిటీచేతుల కందిచ్చుటకు ఒప్పుకొనలేదు. కనుక అకాలీల స్థితిగతుల విచారణ సేయుటకై సిక్కుపరిషత్తు అతిశీఘ్రముగ 1920 అక్టోబరులో అమృతసరమున కాహ్వానింపబడినది. ఈసమావేశమునందే సమితిశిరోమణి యను శిరోమణి గురుద్వారా ప్రబంధకసమితి స్థాపింపబడినది. 'ఇంతవఱకును స్వవశములైన గురుద్వారాల విషయమున వ్యవస్థల నేర్పఱచుటకును, తక్కినవానిని తమయధికారముక్రిందికి దెచ్చుటకును ప్రయత్నింపవలసినట్లుగా పైని పేర్కొన్న శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితిని నియోగించిరి. ఈయేర్పాటు అయినది మొదలుకొని శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితియును అకాలీజత్థలును పరస్పరము కలసికొని సంపూర్ణోత్సాహముతో గురుద్వారాలను స్వాధీనపఱచుకొను కార్యమును నిర్వహింప పూనుకొనినవి.

రికాబుగంజు వ్యవహారముతో అకాలీజత్థలు చాల ప్రసిద్ధివడసినవని ఇదివఱకే చెప్పినాము. నాటినుండి-అనగా 1921 ఫిబ్రవరివఱకును పంజాబు ప్రాంతములోని భిన్నభిన్న భాగములకు సంబంధించిన అనేక గురుద్వారాలపైని అకాలీఅధికారము నెలకొన్నది. ఈ గురుద్వారముల ఏర్పాటులు మహంతులనుండి పూజారులనుండి తప్పించి శిరోమణి గురుద్వారా ప్రబంధకసమితివారి చేతులలో నిలిపిరి. 1921 జనవరిలో ఒక అకాలీజత్థా అమృతసరుజిల్లాలోని తారాతరణ గురుద్వారమును వశపఱచుకొనుటకేగెను. ఈ గురుద్వారములపైని ఇదివఱకు పంజాబు ప్రభుత్వమువారి యధికార ముండెడి దని చెప్పియున్నాము గదా. ప్రభుత్వమువారి బలము నండగా గొని గురుద్వారముల పూజారులు అకాలీజత్థలతో దలపడిరి. ఇరువాగులయందలి వ్యక్తులు హతాహతులైరి. ఆహతులసంఖ్య 24 ఉండెడిది. వారిలో 13 అకాలీలు 11 పూజారులు. ఒక అకాలీ గాయములవలన స్వర్గవాసి యయ్యెను.

## నాన్ఖానా హత్యలు

ఇది జరిగినపిమ్మటనే నాన్ఖానాహత్యాకాండపు గోమాంచకర మగు సంఘర్షణము గలిగినది. శిరోమణి గురుద్వారా ప్రబంధకసమితి- "మార్చి మొదటివారములో నాన్ఖానాయందు సిక్కుల గొప్పపరిషత్తు జరుగగల దనియును సందు పరిషత్తువారు నాన్ఖానా సాహెబుగురుద్వారాల ప్రబంధము మున్ముందు ఎట్లు జరుగవలసినది నిర్ణయింపబడుననియును" ఒక ప్రకటనను చేసిరి. ఈ ప్రకటనను విన్నవెంటనే గురుద్వారాల మహంతులకు పై ప్రాణములు పైన నెగిరిపోయినవి. వారు ఇటు ప్రభుత్వమువారిని- అటు గాంధిమహాత్ముని- సహాయమునకై యర్థించిరి. కాని ఏవైపునుండి కూడ సంతోషాస్పద మగు నుత్తరము వారికి లభింపలేదు. మహంతులు ఈసందర్భమునందు చేసెడివాద మిది (నాన్ఖానా సాహెబ్ యొక్క గురుద్వారా, ఉదాసీమహంతులయొక్క కేంద్రస్థానము కనుక అకాలీసిక్కులకు దానిపై నధికారమును చలాయించుటకు హక్కు లే దని)

ఇది యిట్లుండగా అకాలీలు నలువైపులనుండి మొత్తములుగా వచ్చి గురుద్వారములను ఆక్రమించుచున్నారనువార్తలు చెలరేగినవి. ఈ వార్తలవలన నాన్ఖానామహంతునకు చాలవిచారము కలిగి గురుద్వారాలసంరక్షణకై ఆయన స్వయముగా ఏర్పాటులను చేయసాగెను. అతడు సంరక్షణకై సైనికులను సిద్ధపఱచెను. శస్త్రధరులగు పఠానులను నౌకరులనుగా నియమించుకొనెను. ప్రాచీనపద్ధతులు గల సిక్కులను కొందఱిని చేరదీసి ఒక డిప్యుటేషనుగా పంపుచు నందులో గురునానకువంశస్థు లున్నారని సూచించుచు వారు డివిజనల్ కమీషన

నరును కలిసికొని అకాలీలు గురుద్వారమును ఆక్రమించినయెడల ప్రభుత్వమువారు తమకు తోడ్పడవలయు ననియుం జెప్పుకొనిరి. అకాలీలను బెదరించుటకై కమీషనరుసమ్మతిని కూడ ప్రకటించిరి. ఈమధ్యను షుమారు రెండువారములు ముందుగా - అనఁగా ఫిబ్రవరి 20-వ తేది ప్రాంతమున- సరదారు లక్ష్మణసింగునాయకత్వమున-నొక అకాలీజత్థా మఱియొకప్రదేశమునకు పోదలచి నానాకానామీదుగనుండ బయలవెడలిరి త్రోవలో నాన్కానాయందలి గురుద్వారమునందు అర్చనలు చేయుటకై ఈ జత్థా గురుద్వారములోనికి ప్రవేశించెను. వీరందఱును తమ గురుద్వారాను ఆక్రమించుటకే వచ్చిరని అపోహపడి అచ్చటిమహంతు గల్లంతుచేసెను. నిష్కారణముగ జరిగిన యీగడబిడవలన 130 గురు అకాలీలు వీరస్వర్గము నలంకరింపవలసివచ్చినది. ఈహత్యాకాండవలన చాలమంది యుత్తేజితులైరి. అకాలీజత్థాలు ఒక్కొక్కటిగ నాన్కానాసాహేబును ప్రవేశింపసాగెను. సర్కారువారు తమ ప్రభుత్వమునీవిని గనఁబఱచుటకై ఆ అకాలీలందఱును ఒకవారములోపల నచ్చటినుండి వెడలిపోవలసినట్లుగా శ్రీముఖములను ఇప్పించిరి. ఈ వారము దినముల గడువు ఇంకను ముగిసియు ముగియకముందే ప్రభుత్వపుపెద్దలు అకాలీలను శిక్షింప నారంభించిరి. కొలఁదిరోజులకే 150 మందివఱకును అకాలీలు నిర్బంధింపబడిరి. వారిమీఁదని దొంగతనములు దోపిళ్లు మున్నగునేరములను మోపి వారిని జయిళ్లకుఁ బంపిరి. ప్రభుత్వమువా రవలంబించిన ఈ మూర్ఖతాపూర్ణమగు నవినీతివలన అన్యవారిని జేయఁబోయిన క్రొంతి అయిన దైనది. అకాలీలయెడల తమకుఁగల సహానుభూతిని ప్రదర్శించుటకై వేలకొలఁది సిక్కులు అకాలీలైరి. ఈకారణముననే యుూకాలు అకాలీలు తత్ఖాలసాలు అనుభేదము లేకుండ అవాంతరభేదము గలవారందఱును ఒక్కటిగ చేరి ఆందోళన చేయసాగిరి. కాలక్రమేణ మహంతులు మున్నగువారికికూడ ఈఆందోళనమూలమున శిక్షలు సంప్రాప్తములయినవి. కాని వానివలన లోకుల కేమాత్రమును సంతుష్టి కలుగఁజాలదయ్యెను.

## ప్రభుత్వపువారి పోకడలు

అకాలీ ఆందోళనము రోజురోజు బలపడి పోసాగినది. దీనిని పరికించి ప్రభుత్వపువారు మఱల చిత్రచిత్రపునడకల నడువ నారంభించినారు. 1921 ఏప్రిలులో పంజాబు లెజిస్లేటివు కౌన్సిలునందు శాసనమంత్రి సిక్కులమందిరములను గురుద్వారాలను గుఱించియును వ్యవస్థలకై ఒకబిల్లును ప్రవేశపెట్టెను. గురుద్వారములలో వివాదములు కలిగినప్పుడు వాటిని తీర్చి - చివఱతీర్పు బయలువెడలి శాంతి చేకూఱునంతవఱకును తత్సంబంధములైన కార్యజాత మంతయును, ఒకబోర్డు ఆఫ్ కమీషనరుల స్వాధీనమునం దుంపవలయు ననియును, ఈ బోర్డులో ముగ్గురుసభ్యు లుండవలయు ననియును, ఈ ముగ్గురిలోను ఇద్దఱు సిక్కులును మూడవవారు ఎవరైన నొక హాకిమును ఉండవలయు ననియును ఆయిద్దఱుసిక్కులు ప్రభుత్వమువారిచే నిర్వాచితులు కావలయు ననియును ఆ బిల్లులోని యుద్దేశములు. బోర్డఫ్ కమీషనరులు చేయు పనులలో- ప్రత్యేకప్రత్యేకములుగ నున్న మందిరములయొక్కయును గురుద్వారాలయొక్కయును పూర్వపుచరిత్రము నన్వేషించి యథార్థములగు విషయములను తేల్చవలసినట్లును, తగినవిచారణ జరిపి మహంతులకును సుధారకదళములకును (Volunteers) సమాధానము కుదుర్చవలసినట్లును, అట్లు సమాధానము కుదురనపుడు ఆ గురుద్వారమున ఏరీతి ఏర్పాట్లు చేసినచో వారికి తృప్తికరముగా నుండునో కనుగొనవలసినట్లును-ఏర్పాట్లు గావింపబడెను. కాని యీబిల్లువలన ఏపక్షమువారు కూడ సంతుష్టులు కారైరి. ఈ నియోజింపబడిన ముగ్గురుసభ్యులు కూడ సిక్కులచేతనే నిర్వాచితులు కావలయు నని సిక్కులు కోరిరి. సహజధారీ ఉదాసీ నిర్మల సంప్రదాయములకు చెందినసిక్కులు ఈ బిల్లునందు తమ సంప్రదాయములకు చెందినవారొక్కరైనను నియమింపబడలేదు. కనుక దాని నంగీకరింప మనిరి శిరోమణి గురుద్వారా ప్రబంధకసమితివారు కూడ ఈబిల్లు నంగీకరింపలేదు. ఏమనగా తాము కోరిన విషయములు ఆబిల్లునందు చేర్చబడలేదను కారణ మొకటి. అంతవఱకు శిక్షింపబడిన-చెఱపెట్టబడిన-వారినందఱను సంపూర్ణముగా వదలిపెట్టినగాని తా మేవిధమునను ప్రభుత్వమువారిబిల్లునకు తోడ్పడ మనునది రెండవకారణము ఈరెండువిషయములకును ప్రభుత్వమువారు- శిరోమణి గురుద్వారా ప్రబంధకసమితి సమస్తసిక్కులకును నిజమగు ప్రతినిధి గాదని జవాబు నొసంగిరి. ప్రభుత్వమువారి యీయాక్షేపణమును నిరాధార మని ద్రుజుపఱచుటకై 1921 లో శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితికి ప్రతినిధులు మఱల నెన్నుకొనబడిరి ఈయెన్నికలయొక్క ప్రధానమైనయుద్దేశము సిక్కులలోగల సమస్తసంప్రదాయములవారికిని దీనిని ప్రతినిధిగా నొనర్చుటయేకనుక ఈమాఱు వివిధసంప్రదాయుల ప్రతినిధులు నుండునట్లుగా 180 మంది సభ్యులతో క్రొత్త శిరోమణి గురుద్వారా ప్రబంధకసమితి ఏర్పడినది. ఇట్లేర్పడిన యీసమితి పంజాబు గవర్నరునొద్దకు-శిక్షలపాల్గావింపఁబడినసిక్కుల నందఱిని వదలిపెట్టవలయు నని-ఒక డెప్యుటేషనను పంపించెను. కాని ఇది నిరాకరింపబడినది. ఈనిరాకరణమునకు ఫలముగా 1921 ఆగస్టులో శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితియొక్క ప్రభావపూర్ణమగు ప్రబంధకసమితి ఏర్పాటుచేయబడెను. ఈ సమితియందలి యధికారస్థానము లన్నియును సహాయనిరాకరణావలంబులచే పూరింపబడెను. కౌన్సిలులో ప్రవేశించియున్న సిక్కుల నందఱిని తమతమ స్థానములకు రాజీనామాల నీయవలసిన దని తీర్మానించిరి. పంజాబు హైకోర్టునందు పబ్లిక ప్రాసిక్యూటరుగ నున్న సరదారు మహతాబు సింహుగారు - నాన్కానాయందు అకాలీలు నిర్బంధములపాల్సేయఁబడుచున్న కాలములో-తనయసమ్మతినిసూచించుచు ఉద్యోగమును వదలుకొనిరి. డిప్యుటేషను నిరాకరింపబడిన వెంటనే తనకు గలపంజాబుకౌన్సిలు మెంబరుపదవికిని తదుపసభాధ్యక్షపదవికినిగూడ రాజీనామా నొసంగిరి. పిమ్మట వీరు పైని పేర్కొన్న సమితికి మంత్రిగ నెన్నుకొనబడిరి. ఈదెబ్బతో ప్రభుత్వమువారు కన్నులెఱ్ఱజేసి మఱల నిర్బంధములకు గడంగిరి. శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితివారికి-స్వర్ణమందిరమును గుఱించిన వ్యవస్థను సర్కారువారితో పున స్స్వాధీనముచేసికొనవలె-అని ఒక ఆజ్ఞను దయచేయించిరి. ఈయాజ్ఞకు ప్రత్యుత్తరముగా సమితివారిట్లు బదులుచెప్పుకొనిరి- స్వర్ణమందిరముపైన తాళముతనుండియును మాకు

సంపూర్ణమగు అధికారము కలిగియే యున్నది. ఇట్టిస్థితిలో సర్కారు వారిపక్షమున మేమేల దానిని స్వీకరింపవలయునో తెలియకున్నది అని. ఈప్రత్యుత్తరము రాగానే అప్పుడు స్వర్ణమందిరమునకు మేనేజరుగా నున్నవారికి-(వీరిప్పుడు శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితిలో నొక సభ్యుడుగ నున్నారు) మందిరమునకు సంబంధించిన తాళపుచెవులను ట్రెజరీని తమకు స్వాధీనము చేయవలసినట్లుగా ప్రభుత్వమువారుత్తరువును పంపించిరి. మేనేజరుగారు డిప్టీకమీషనరుగారిచ్చిన ఈయుత్తరువును పాలించిరి. ఈసంఘటనముతో మఱల పంజాబునందు భీషణకరమగు ఆందోళనము చెలరేగినది. పంజాబురాష్ట్రములోని అనేకజిల్లాలలో ప్రభుత్వమువారు 'ప్రజలు ఎట్టిసభలను ఆందోళనములను చేయరాదనియును, చేసినచో అయ్యవి రాజద్రోహసభలచట్టముక్రింద పరిగణింపబడు ననియును' ప్రకటించిరి. శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితి వారీచట్టము నుల్లంఘించి సభలుచేయ యత్నించిరి. ఈయత్నములకు ఫలముగా ప్రభుత్వమువారు ఈసమితిసభ్యుల నందఱిని నిర్బంధముల పాల్చేసిరి. కాని ఈనిర్బంధములవలన-తగ్గి-పేరులేకుండ-నశించిపోవలసిన అకాలీలయుత్సాహము మఱింతగ చెలరేగినది. సమితియొక్క సభాధిపతులను-ఒకరితర్వాత నొకరినిగా ఏర్పడినవారిని- మువ్వురిని నిర్బంధించి శిక్షించిరి. సిక్కులలో - ప్రతిపిల్లవాడును పిల్లయును, ఆడువారు మగవారును ఖడ్గములను బహిరంగముగ చేపట్ట నారంభించిరి. ఖడ్గము లన్న ఖడ్గములా! తళతళమను వాలులతో చూచినంతనే ఒడలు జలదరించునట్టివి! స్థితి మఱింతభయంకరమైనది. ఈ ఆందోళనపుగాలి సిక్కుసేనలశిబిరములపై గూడ వీచినచో దుస్సాధ్యమగుస్థితి యేర్పడు నని ప్రభుత్వమువారు భయపడిరి. 1922 జనవరిలో వారు ప్రబంధకసమితివారికి-స్వర్ణమందిరపుతాళముచేతులు కోర్టు సంబంధముతో- అనగా కోర్టువారి అధికారమును స్వీకరించి తత్పరస్పరముగా- స్వీకరించెదరేని- ప్రభుత్వమువారెట్టిషరత్తులతోను నిమిత్తము లేకుండనే నిర్బంధితు లయిన అకాలీల నందఱను వదలుదుము-అని చెప్పి పంపిరి. ప్రభువులు పంపిన యీసందేశమునకును వెనుకటియట్లే సమితి వారు జవాబుచెప్పిరి. ప్రభుత్వమువారేమనుకొనిరో ఏమో, ఏమియును మాట మంతియు లేకయే 17 జనవరినాడు అకాలీలనందఱను వదలివేసిరి. 20 వ తేదినాడు స్వర్ణమందిరపుతాళపుచెవులను వాపసు ఇచ్చిరి. కాని అకాలీలు-అకాలీలకు తోడ్పడె నన్నకారణమున ఏహిందువును నిర్బంధములపాల్జేసితిరో ఆతనినిసైతము వదలుదనుక-ఇందుల కొప్పుకొనము అని జవాబిచ్చిరి. ప్రభుత్వమువారు మాఱు మాటాడకుండ నీహిందువును గూడ ఫిబ్రవరి 11 తేదిని వదలిరి. ఇంతియేగాక మామూలగు కృపాణములకును ఖడ్గములకును (తల్వారు) ఎట్టిభేదమును లేదు గనుక సిక్కులు నిరభ్యంతరముగ తలవారులను ధరింపవచ్చు ననియును ప్రకటించిరి.

ఈతీరున అకాలీలు ప్రభుత్వమువారిని ముప్పతిప్పలకు గుఱిచేసి లోబఱచికొనిరి. ఇట్లు ఓడిపోయియు గూడ ప్రభుత్వమువారు తమకుటిల నీతిని విడచినవారు కారు. శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితివారిచేత నవీనముగ గురుద్వారాబిల్లు నొకదానిని సిద్ధము జేయింపవలయు నని వారు (ప్రభుత్వమువారు) మఱల యత్నింపసాగిరి. ఒకవైపున ఈయత్నములు సంధానరూపమున సాగుచునే యుండగా-నింకొకవైపున లాహోరు హైకోర్టువారు నాన్కానామహంతునకు ఉరిశిక్షను విధించి ఆజన్మము ద్వీపాంతరవాసశిక్షకు పంపిరి. ప్రభుత్వమువారు పైకి తియ్యని మాటలు పల్కుచు గొంతుల గోయుచున్నారని ప్రజలలో నొకవార్త నెలకొనెను. ఇది ఇట్లుండ నిందులకు తోడుగా 13 జిల్లాల డిప్యూటీ కమీషనరులకు రహస్యపుటుత్తరువులు పంపబడిన వనియును, అందఱును చేరిఅకాలీ ఆందోళనము నెట్లయినను అణగద్రొక్కవలయు నని యందు వ్రాయబడె ననియును తెలియవచ్చినది. దీనితో సమితివారు క్రుద్ధులై- అదివఱకు బిల్లువిషయములో చర్చించుటకై రమ్మని తమకు 1922 ఏప్రెలులో జారీయైన యుత్తరువునుసైతము నిరాకరించి-ప్రభుత్వము వారిగురుద్వారాబిల్లుతో ఎట్టితోడ్పాటును పెట్టుకొనకయే సహాయనిరాకరణము నవలంబింపవలయునని నిశ్చయించుకొనిరి. దీనితో ప్రభుత్వమునకు తల దిమ్మెక్కి- అకాలీల నందఱిని వదలిరి. కాని ఈమధ్యనే గురుకాబాగు సంఘటనములు తలచూపి మఱల వారి నస్వస్థచిత్తులనుగా నొనర్చినవి.

గురుకాబాగుసందర్భములను వర్ణించుటకు ముందు గురుద్వారాల జగడాలనుగూర్చి ఒకింత చెప్పుట యుక్తము. మహంతులయొక్క దురాచారాదులట్లుండగా గురుద్వారాల ఏర్పాటులలోని అకాలీసిక్కులకు సహజధారి సిక్కులకు మతవిషయములలో చాలభేదములుకూడ నున్నవి. గురుగోవిందసింహునికి తొలుత తొమ్మండ్రగు గుర్వనుయాయులు కలరు. వీరు అందచందాలలో హిందువులను పోలియుందురు. హిందువులదేవాలయములలో గ్రంథసాహెబును పారాయణము చేయుదురు. సహజధారుల ధర్మశాలలలో హిందువులదేవతావిగ్రహములకు ప్రత్యేకముగా ఒకస్థానము ఏర్పాటుచేయబడి యుండును. ఉదాసీలు నిర్మలమతస్థులు. వీరికి హిందూమతముపై నభిమానము కలదు. హిందూమతానుసారముగా మందిరములమీద మహంతులకు అధికారముండును. పారాయణాదులు మహంతులయొక్కయు సంప్రదాయులయొక్కయు ననుమతిచొప్పున జరుగుచుండును. గురుద్వారాలు స్వాధీనములోగల సహజధారీలు ఈపద్ధతితోనే పని సాగింతురు. కాని అన్నిగురుద్వారాలలోను ఒక్కమోస్తరుగా పని జరుగవలయునని అకాలీల ఉద్దేశము- అకాలీలు పదిమందిగురువులకును ఆశిష్యు లయినందున అన్నిగురుద్వారములలోను పూజాపాఠములను చేయుటకును తమకు అధికారము కలదందురు. నిర్మలఉదాసీసంప్రదాయులమహంతులు ఇందు కొప్పుకొనరు. కనుకనే సిక్కులయొక్క అన్నిగురుద్వారాలపైన శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితికి అధికారము ఉండవలయు నని వారిపట్టుదల. గురుకాబాగుసందర్భము లన్నియు పాఠకులు వార్తాపత్రికలలో చదివియేయుందురు. అమృతసరుకు 9 మైళ్లదూరమున ఈశాన్యమున గురూకాబాగు అని ఒకగ్రామ మున్నది. ఈగ్రామమునందే సిక్కులమతగురువగు అర్జునదేవునియొక్కయు హరగోవిందునియొక్కయు స్మారకచిహ్నములుగా రెండుగురుద్వారాలు నిర్మింపబడినవి. 1921 లో శిరోమణిగురుద్వారా ప్రబంధకసమితివారు వీనిని తమయధికారములో ఉంచుకొనిరి. అప్పటినుండి ప్రతి అమావాస్యకు అక్కడ సభలు జరుగసాగినవి. కడచిన ఆగస్టు 20-వ తేదిని లంగరువేయుటకై గురుద్వారాల అవ

రణమునుండి కట్టెలను కొట్టుకొనివచ్చి రను అపరాధమును మోపి ర్ గురు అకాలీలకు ఆఱుమాసములు కఠినదండనను ప్రభుత్వమువారు విధించిరి. ఇది జరిగినతరువాత ఆగస్టు 22-వ తేదిని జరిగిన సభలో అకాలీలందఱుచేరి గురుద్వారా ఆవరణములో కట్టెలు కొట్టుటకు వెళ్లవలె ననియు నప్పుడు ప్రభుత్వము వారు ఎంతెంత కఠినదండనలను విధించినను నగుమోములతో భరింపవలె ననియును తీర్మానించుకొని పనికి పూనుకొనిరి సరి. ఈ తీర్మానము జరిగినవెంటనే కార్యమున కారంభించి కట్టెలు కొట్టుటకు ప్రారంభించిరి. పోలీసులు-వారిని పట్టుకొని-కట్టి-కొట్టి-నిర్బంధింపసాగిరి. తరువాతి సమాచారములు పాఠకు లెఱిగినవే. అకాలీలు గురుకాబాగునకు వెళ్లునప్పుడును- పోయి కట్టెలు కొట్టబూనునప్పుడును- సైనికులు వారిని అడ్డుకొని- ఆసురభావముతో- స్మృతి తప్పి పడిపోవునంతవఱకు కొట్టి కొట్టి కూల్చుచుండెడివారు. అయినను అకాలీజట్టులు కొంచెమైనను జంకక కొంకక - శాంతమును వీడక - గంగాప్రవాహమువలె నిరంతరధారగా- పిల్లలు పెద్దలు ఆడువారు మగవారు అనుభేదము లేకుండ తండోపతండములుగా వచ్చి పడుచునేయుండిరి. ప్రభుత్వమువారు విసిగిపోయి చివఱకు పరమమూర్ఖత గల తమమూటనీతిని వదలుకొనవలసివచ్చెను. అకాలీలు ఆనాటినుండి దెబ్బలు లేకుండ ఊరకమాత్రమే అరెస్టుచేయబడుచుండిరి. మొత్తముపైని గాయములు పడినవారు వేయిమందికి పైగా నుండిరి. కొందఱుప్రాణములనుగూడ కోల్పోయిరి. ఈసంఘర్షణము ఇంకను నడుచుచునేయున్నవి. అరెస్టు చేయబడిన అకాలీలమొత్తము మూడువేలకు పైబడుచున్నది. మాపాఠకులకు గురుకాబాగుసందర్శనముల చిత్రపటములతో సహా ఈసంచికను అందించుచున్నాము. అమృతసరమునుండి గురుకాబాగునకు వెళ్లి కట్టెలు కొట్టబోవు అకాలీజట్టుల చిత్రపటములు ఇందు మొట్టమొదట ఇయ్యబడినవి. పిమ్మట సైనికులు కొట్టినదెబ్బలవలన వారు ఎట్లు స్మృతి తప్పి పడిపోయినది మొదలగు సమాచారములను తెలుపుపటములు ఇయ్యబడినవి. పిమ్మట గాయములుపడిన అకాలీలకు తక్కినవారు శుశ్రూష చేయుచున్న విధానము తెలుపు పటములు ఇయ్యబడినవి.

# ఆంగ్లేయుల రాజ్యనిర్మాణము

కేసాప్రగడ వీరేశ్వరరాయ శర్మ గారు

వచ్చిరి మూడువంద లగు । వర్షములై స్వమతాభివృద్ధికై
పెచ్చగు కార్యము ల్జరిపి । పిమ్మట మన్మల. బానిసత్వమం
దెచ్చుగ నిల్పి తోడుపడ । తియ్యని మాటలు పల్కి జర్మనీ
కచ్చను డబ్బు బుచ్చుకొని । కష్టపుచట్టము లిచ్చిరా! దొంగల్.

సీ. ఆంగ్లేయు లెవరైన । నతిఘోరకృత్యముల్, చేసిన వారికి । శిక్ష లేదు
దొరగార లన్యాయ।సరణిలో నుండిన గీర్తియే కాని యే । కేసు లేదు
పొగబండిలో శ్వేత।ముఖు లుండ, వారితో సలలితంబుగ నైన । నిలువరాదు
యింగ్లీషుచమ్పుకు । హిందువు లున్నచో, బాత్రోతుగాని పై।పదవి లేదు

గీ. సంఘభావంబు సమయంగ । నలిపినారు, కోర్టుల టును నెలకొల్పి । కొంప లమ్ము
కొనుచు జీవింప మనుష్యుల । ఘోరముగను, మూర్ఖులను జేసి రా శ్వేత।ముఖులువారు.

ఉ. లంచము లీయలేము ప్రజ । లందున భేదము దీయరాము మా
కించలు వీడుకోము ప్రభు । కీర్తికి వన్నెను తేగబోము మీ
రెంచి మదీయహైందవుల । రిక్తుల జేసిన నూరుకోము మా
మంచితనంబె మాకు జయ । మంచు నెఱుంగుడు శ్వేతబృందముల్.

ఉ. కానము బాలహింసలు వి।కారపుచట్టము లెవ్వియైననున్
గానము పూర్వ మెప్పుడును । కాంచము కాంచెను యాంగ్ల రాజ్యని
ర్మాణమునందె నిట్టివి సు।రాసురు లెల్లరు నవ్వ చంద్రి, మా
మానము దొంగిలించిరి ప్ర।మాదము కల్గె విశేషబట్టచేన్.

ఉ. భారతపుత్రకుల్ మిగుల । భక్తిగనుందు రయేని, గాంధియే
ధీరుడు శాంతమూర్తి విను।తింపగ మాధవుడైనయేని, మా
కోరెడిధర్మమే జయము । కోరికమాట నిబద్ధమేని, యీ
క్రూరపుచట్టము లుడగ । కూర్మిని మాకు స్వరాజ్య మబ్బుతన్.

TWO STRIKING PHOTOGRAPHS OF UNHAPPY AKALIS BEATEN BY THE SOLDIERS





సోల్జరచే కొట్టబడిన అకాలీలు

Sriyut Patri Anantha Rao



శ్రీయుత పత్రి అనంతరావు

Sriyut Bhattiprolu Sooryaprakasa Rao



శ్రీయుత భట్టిప్రోలు సూర్యప్రకాశ రావు

Sriyut Kala Venkata Rao



శ్రీయుత కళావేంకట రావు, బి. ఏ.

Sriyut Kola Venkatappayya



శ్రీయుత కోల వేంకటప్పయ్య

Sriman Madabhushy Rangacharyulu



శ్రీమాన్, మాడభూషి రంగాచార్యులు

Sriyut Katikaneni Kalyana Raw



శ్రీయుత కటికనేని కళ్యాణ రావు

# గయా కాంగ్రెసు

భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులు గారు

గయా మహాసభ జయప్రదముగ జరిగిన దని వార్తా పత్రికల వలనను, గయకు వెళ్లి వచ్చిన ప్రతినిధుల వలనను తెలిసికొను చున్నాము. కాని యీ జయముయొక్క స్వభావ మెట్టిది? కేవలము వాగాడంబరముతోడను, తోరణములు మంటపములు మహాసభలు అంగళ్లు సంకీర్తనలు కోలాటములు ప్రదర్శనములు మున్నగువానితోడను, గలుగు జయమా లేక చిత్తశుద్ధి త్యాగము పవిత్రత మున్నగువానితో కూడినదా? గయయొక్క విజయము గాంధియొక్క విజయమే. గాంధియొక్క విజయము ధర్మముయొక్క విజయమే. ధర్మముయొక్క విజయమే స్వరాజ్యము. ఇంద్రప్రస్థమునందు ఒకప్పుడు- అనఁగా- గతవత్సరము నవంబరు 24-వ తేదిని- గాంధి యింకను స్వేచ్ఛగా నున్నప్పుడే- రాజసిక వృత్తిలో నిమగ్నులైన రాజకీయధురంధరు లెల్లరు స్వాతంత్ర్యమార్గ మెద్ది యని యోచించుచుండగా నిందుకు ప్రత్యుత్తరముగ సత్యమే స్వాతంత్ర్యసాధన మని గాంధి పలికెను. కాని ప్రజ లట్టి తాత్పర్యమును గ్రహింపక వారి ధర్మోపదేశమును తిరస్కరించుచు వివాదపడిరి. దేశీయమహాజనసభయొక్క లక్ష్యమును, అనఁగా నుద్దేశ్యమును నిర్వచనము చేయు వాక్యమునందు శాస్త్రసమ్మతమైనట్టియు - శాంతియుత మైనట్టియు - సాధనములవలన స్వరాజ్యసంపాదనము చేయుట - అనునపుడు శాస్త్రసమ్మతమైన అను పదమునకు ధర్మబద్ధమైన అనియే అర్థమని గాంధి ఢిల్లీలో నుడివినపుడు ఒక తెగవారు వీరిని హేళన చేసిరి. ధర్మబద్ధమైన అన్నను, సత్యసంధతతో గూడిన యన్నను ఒక్కటే యర్థము. ఇట్లు కొంత చర్చ జరిగిన పిమ్మట ఆంగ్లభాషయందు లెజిటిమేట్ (Legitimate) అను పదప్రయోగముతో సంతుష్టిచెంది యెవరిభావముతో వారు ఇరుతెగలవారును వీడిపోయిరి.

రాజకీయప్రపంచమునందు భారతదేశమున రెండు మతములవారును ఏర్పడి ఎవరిభావములను వారు పోషించుకొనుచు లోలోపల పరస్పర వైషమ్యములు లేకపోయినను పరస్పర వైమనస్యములతో నైన గత సంవత్సర మంతయు పనిచేయుచుండి రని కలకత్తాయందు జరిగిన అఖిలభారతసంఘసభయందును గయయందు జరిగిన దేశీయమహాజనసభయందును స్పష్టమయ్యెను. ఒకరు గాంధిగారిచే నుపక్రమింపబడిన నూతనతత్త్వనిర్దేశమునందును, తమ భక్తివిశ్వాసముల నుంచి ధర్మపథమును తప్పక, ఆవేశాగ్రహములను వదలి స్వరాజ్యసంపాదన చేయవలె నని పట్టుదలతో నుండిరి. రెండవ తెగవారు రాజసికమనస్కులై దేశమును పలువిధముల బాధపెట్టు ఈ దొరతనమువారి మీదను ఆంగ్లప్రజలమీదను ఆంగ్లదేశముమీదను కసి యెట్లు తీర్చుకొనవలె ననియు యోచించుచున్నారు. మొదటివారు జాతీయపునర్నిర్మాణమునకై పాటుపడుచుండగా రెండవవారు విజాతీయదండన నుద్దేశించుచున్నారు. గాంధియనుచరులు సాంఘికజీవనమునందు విప్లవము గావలయునని యత్నించుచుండగా దాసు అనుచరులు దొరతనముపై తిరుగుబాటును సంఘటన చేయుచున్నారు. ఉభయులయొక్క లక్ష్యమును ఒక్కటే—స్వరాజ్యము. ఉభయులయొక్క సాధనములుకూడ నొక్కటే — అసహాయవాదము. కాని ఆచరణమార్గములు మాత్రము భిన్నములు. మొదటితెగవారు చిత్రించుకొనిన అసహాయవాద స్వరూపము ఒకటి రెండవవారిది మఱియొకటి. వీటియొక్క స్వరూపములు-రూపురేఖావిలాసములు- కళలు- సౌందర్యములు - వేఱువేఱు. ఇందువలననే కలకత్తాయందును గయయందును వీరలకు తీవ్రమగు నభిప్రాయభేదములు గలిగియుండెను.

ఈయీ తారతమ్యములు ఆయా తెగలవారి కార్యక్రమపరీక్షవలన తెలియఁగలవు. స్వరాజ్యము కేవలము రాజకీయవిమోచన మనియును బ్రిటిషువారి బానిసత్వమునుండి తప్పించుకొనుటయనియును ఇట్టి బానిసత్వమున మనల నుంచు బ్రిటిషువారి కెల్లైన హానిని ఇబ్బందిని కష్టమును గలిగించుట ధర్మమనియును తలంచువారు, బ్రిటిషు వస్తుబహిష్కార మావశ్యక మనియు,

శాసనసభాప్రవేశముఁ గావించి శాసనసభలను భగ్నము చేయవలె ననియును స్థానికస్వపరిపాలనసంస్థలలో మనము చేరి వానిని మనము మన ఉద్దేశ్యములకు వినియోగించుకొనవలయుననియును పాఠశాలలబహిష్కారమును, న్యాయస్థానముల బహిష్కారమును కేవల ఆదర్శప్రాయములే కాని, ఆచరణీయములు కావనియును నుడువుచున్నారు. రెండవ తెగవారు బ్రిటిషు వస్తుబహిష్కారము వలదనియును అందుచేత విదేశవస్తుప్రవేశము ధారాళముగ జరుగుచుండు ననియు, విదేశవస్త్ర బహిష్కారమును ఉభయతెగలవారును సమర్థించుచున్నను సామాన్య జనుల మనంబులందు, బ్రిటిషువారికి నష్టమును గలిగించుటయే ముఖ్యముగ గన్పించుటచే జపానుపట్టులు జర్మనీచెక్కులు బెలిజియం చీటీగుడ్డలు మున్నగువాటిని జనులు ఉపయోగించుట తటస్థించి, ఖద్దరుమీద మన ముంచిన ప్రాధాన్యము తగ్గిపోగలదనియును బ్రిటిషువారిని దండించుటయును కలవరపఱచుటయును నష్టపఱచుటయు మన ఉద్యమముయొక్క ఫలితము లయితే అయియున్నను, ఉద్దేశ్యములు కాని లక్ష్యములు కాని కావనియును శాసనసభలలో ప్రవేశించి, నిరంతర ప్రతిఘటనము గావించుటకూడ నొక విధమగు కో-ఆపరేషను అగును గాని, నాన్ కో-ఆపరేషను గాదనియును స్థానికసంస్థలలోనికి ప్రవేశింపగోరువారికి యథాపూర్వముగ సంపూర్ణస్వాతంత్ర్యమున్నను, అందు ప్రవేశింపవలయు ననితీర్మానించుట మన ఉద్యమమునకు అసమంజసముగ నుండుననియును భారతజాతీయతకు పునాదియగు జాతీయ విద్యను పంచాయితీలను పోషింపవలయునన్న దొరతనము వారి కళాశాలలను న్యాయస్థానములను బహిష్కరింపవలయు ననియు, రెండవ తెగవారి యభిప్రాయము.

ఇట్లు అసహాయోద్యమమునకు రెండు స్వరూపము లేర్పడినట్లు కలకత్తాలో జరిగిన అఖిలభారత దేశీయ మహాసభోపసంఘమునందు వెల్లడియై, గయమహాసభయందు ధ్రువపఱుపబడెను. కావున గయయందు రెండు తెగలవారును ఎక్కువ విస్పష్టముగను వివరముగను విడిపోయిరి. వీరి యుభయులకు రాజీకాని సమ్మేళనముకాని ఎట్లు గలుగవలయునో తెలియకున్నది. ఎవరికి వారు తమ భావములే సక్రమము లైనవని తలంచుచు, ఎదుటివారి భావములను కొందఱు ఉపేక్షతోను, మఱికొందఱు నిర్లక్ష్యముతోడను, మఱికొందఱు అసూయతోడను జూచుచుండిరి. కాని ఎవరిభావములు వారికి మనస్ఫూర్తిగను నిష్కల్మషముగను దేశహితైకము లని తోపక పోలేదు. ఆ విషయమును గూర్చి ఇంచుకైన సందియ పడుట భావ్యము కాదు. మన బాధవలన ఎదుటివానిని మనము ధర్మపథములోనికి త్రిప్పవలయుననువారు అహింసాతత్త్వముయొక్క సంపూర్ణస్వరూపమును గ్రహించి, ఆ మార్గమును వదలరాదని తలంచుచు, ఛాందసు లనిపించుకొనిరి. అహింసాతత్త్వము భౌతికప్రపంచధర్మములకు విరుద్ధ మనియును మనము బాధపడుట మన చేటునకే కారణమై ఎదుటివాని శ్రేయస్సును పెంపొందించునే గాని మనకు రాజకీయవిమోచనము గల్గింపజాల దనియును ఎదుటివానిని బాధపెట్టుటయందు తప్పేమియు లేదనియును రెండవ తెగవారి అభిప్రాయమై యుండెను. ఈ రెండు తెగలవారికిని పొత్తుకాని, సమ్మేళనముకాని కుదురుట కెట్టి సాధనమును లేకపోవుటయందు ఆశ్చర్య మెద్దియు గానంబడదు. పరుగెత్తుచున్న రైలుబండికిని, నిలిచియున్న నేలకును రాజీ తాత్కాలిక సంపర్కములోనే యున్నది. కాని, నిరంతరసంపర్కమెచ్చట నుండజాలదు అట్లే ఒకసాధనమునుండి బయలువెడలి భిన్నదిక్కులను ప్రయాణము సలుపు ఇరువురకు గమ్యస్థానము ఒక్కటియే కావచ్చును. గాని మార్గములు కలియజాలవు. ఇదియే గయలో గలిగినచిక్కు. వీరి వీరి మార్గము లంతంత భిన్నములుగ నుండెనా యనుటను ఇంకను అక్కడ గలిగిన (situations) సందర్భములయొక్క వివరములను మన మించుక పరిశీలింపవలయును.

అన్నిటికన్న ప్రధానమైన విషయము శాసనసభలకు వర్తించునది. ఆ సందర్భములో గాంధిమతస్థులెల్లరు ఒక్కపట్టుమీద నుండిరి. ఎదుటివారు భిన్నాభిప్రాయులై, కలకత్తాలోను గయలోను తమతమ భావములను వెల్లడించిరి. మహారాష్ట్రులు మొదటినుండియు, అనగా స్పెషల్ కలకత్తా నాగపురం అహమదాబాదు సభలలోనెల్ల, శాసనసభలలో బ్రవేశించి, అక్కడి యధికారములను జాతీయవాదుల స్వాధీనము చేసికొని మితవాదులను పదభ్రష్టులను గావించి, దేశహితైకమార్గములలోనికి పరిపాలనమును మఱలింపవలెననియే చెప్పుచున్నారు. వీరిలో జయకరుగారు, కేల్కారుగారు, మూంజీగారు, అభయంకరుగారు, అణెగారు, ప్రధానపురుషులు. కాని కేల్కారుగారు, కలకత్తాలోను పిమ్మటను గూడ

మనము ఎన్నికలలో పాల్గొనవలయు ననియు, అటుపిమ్మట **1923-వ సం॥** డిసెంబరులో జరుగు దేశీయమహాసభ నిర్ణయించురీతిని నడచుకొనవలయు ననియు, భావమును వెలిబుచ్చినారు. ఇదంతయు ఒకమతము. పిమ్మట మోతీలాల్ నెహ్రూగారు కేల్కారుగారి మతమును అవలంబించి- అప్పటుమీదనే- కలకత్తా (నవంబరు) సభను గయసభను నడిపించినారు. నిజముగా నెహ్రూపండితుని భావమే కలకత్తాలో కేల్కారుగారిని అవలంబించినది. ఇది ఇట్లుండగా దాసుగారు మొదటినుండియును- అనఁగా ఖైదునుండి వచ్చినదాదిగ- మనము సభలలో ప్రవేశించి మన స్వరాజ్యప్రణాళికను వారికి దెలిపి అందుకు వలయు ప్రాతిపదిక ప్రయత్నములను దొరతనమువా రంగీకరింపనిచో, మనము ఈ శాసనసభలను భగ్నము చేయవలయునని చెప్పియున్నారు. ఇందులో వారెట్టి మార్పును గావింపలేదు. డిసెంబరు 1923 వఱకు మన కర్తవ్యము నిర్ణయింపరాదని చెప్పినను, లేక ఈలోపుగనే దాసుగారి సూత్రము ప్రకారము నిర్ధారణ చేసికొనవలయు నన్నను, శాసనసభలలో బ్రవేశించుట యను నది మొదటి సోపానముగ గన్పించుచున్నది. ఇందులను గూర్చిన చర్చల వివరములు దేశమున కంతకును దెలియును. ఒకసారి ప్రవేశించిన పిమ్మట ఎట్టి ఆపదలు సంభవించునో, మొదట మన వాదపువారు మెజారిటీగ నుండగలమా, అథవా అట్లున్నచో మన శపథముమీద నిలబడగలమా అను సంశయములు అనేకులకు గల్గెను. దొరతనమువారిచే ప్రసాదింపబడు గౌరవములు పదవులు మెండు. అందుచే వారి యాకర్షణలచే లొంగిపోగలవారు చాలమంది యుండవచ్చును. మఱియు మద్రాసు బొంబాయి రాజధానులలో ప్రబలియున్న జాతిమతభేదములలో అసహాయవాదులకు మెజారిటీ స్థానములు లభించుట చాలకష్టము. ఒకవేళ లభించినను ఎన్నికపదవులలో ఎక్కువ స్థానములు లభించునేగాని, మొత్తముమీద శాసనసభాపదవులలో మెజారిటీ రాజాలదు. చెన్నపట్టణములోని 127 స్థానములలో 97 మాత్రమే ఎన్నిక స్థానము లున్నవి. ఇందులో 5 జమీందార్లకు, 5 వర్తకులకు, 5 క్రైస్తవులకు, 13 మహమ్మదీయులకు, 1 ప్లాంటర్లకు, 1 విశ్వవిద్యాలయమునకు, 67 జిల్లాలకు కలగాపులగముగ నున్నవి. కాంగ్రెసువిచారణసంఘము నెదుట ఇయ్యబడిన సాక్ష్యమంతయును ఈ 97 లో మెజారిటీ రావచ్చునని చెప్పియున్నారు. కాని, 127 లో మెజారిటీని గూర్చి ఎవరును అభయహస్తమును ఇచ్చియుండలేదు. ఆశపడను లేదు. అట్టి సందర్భములో అసహాయవాదులకు 97 లో 50 స్థానములు వచ్చినను, 127 లో 50 పోను మిగిలిన 77 స్థానములను దొరతనమువారి స్వాధీనములోని మనుష్యులచే నింపబడుచు వారి సౌకర్యములను నిర్విఘ్నముగ జరుపువారి వగును. పరిస్థితులు ఇట్లుండగా, అసహాయవాదులు శాసనసభలలోఁజేరి, గవర్నమెంటుకు "కోరం" లేకుండ జేయుదమనుట కేవలము అనాధారభూతముగ గన్పించెను. అందుచే దక్షిణ భారతీయు లెల్లరును ఈ పద్ధతిని నిరోధించిరి. ఉత్తర భారతీయులకు ఈ చిక్కులు లేవు. కాని అస్సాములో బంగాళాలో ప్రయాగరాష్ట్రములో గూడ తాలూకాదార్లు, జమీందార్ల సంఖ్య హెచ్చుగ నున్నది. అచ్చట గూడ ఎన్నికస్థానములలో మెజారిటీ రాగలదని ఆశించిరి. గాని, మొత్తపు సంఖ్యలో అధికభాగము వచ్చును అని ఎవరును ఆశింపలేదు. అందుచే శాసనసభాప్రవేశవాదుల వాదము ఎంతయును దౌర్బల్యముగ గన్పట్టెను.

ఈ పూర్వపక్ష సిద్ధాంతములు కలకత్తాయందును, గయయందును వివరింపబడిన పిమ్మట, గయలో శ్రీనివాసయ్యంగారి సవరణ ప్రధానస్థానము నావహించెను. ఇందు ముఖ్యాంశ మొద్ది యనఁగా మనము ఎన్నికలలో పాల్గొని సభలలో ప్రవేశింపకుండవలయుననియే. అప్పుడు కొద్దిరోజులలో మనపదవులు ఖాళీయగును గదా మనము ఏమిచేయవలయునన్న శ్రీనివాసయ్యంగారు అటుపిమ్మట జరుగవలసిన కార్యక్రమమును గూర్చి తాము చెప్పబూనుకొన మని నుడివిరి. ఏలయని అడుగగా అప్పటికి రాజీ పర్పడగలదని వాక్రుచ్చిరి. ఇది ప్రజలకు నచ్చలేదు. 30,000 మంది- అందులో- గాంధి జైలుకుపోయినప్పుడు- నిర్వర్తింపబడని రాజీ- మనపార్టీవారు శాసనసభల ఎన్నికలలో జయమొంది సభలో ప్రవేశింపనిచో జరుగు నని చెప్పుట ఎంతయు సాహసవంతముగ గన్పించినది. మఱియును పదవులు ఖాళీ అయిన పిమ్మట రెండవసారి ఎన్నికలలో పాల్గొనవలయునన్న, తిరిగి విశేషము వ్యయ ప్రయాసల కోర్వవలసి యుండును. అసహాయవాదులము పేదవారము. ఒక్కొక్క ఎన్నికకు సామాన్యముగ రూ 5000 అగును. అట్టితఱి రెండవ ఎన్నిక- మూడవది- నాల్గవది — ఈ ప్రకారము ఎన్నిక తరువాత

ఎన్నికలలో పదిహేనేసి రోజుల విరామముతో - పాల్గొనవలయునన్న కార్యక్రమము దుస్సాధ్యముగ గన్పించుచుండెను. అందుచే శ్రీనివాసయ్యంగారి సవరణ జనులను రంజింపజేయలేదు. మఱియును ఇట్లు ప్రవర్తించిఐరిషువారు జయమునొంది యుండలేదు. మనము సభలలో నున్నను లేకున్నను, దొరతనమువారు తమ కార్యక్రమమును జరిగించుకొనగల అవకాశములను, శాసననిర్ణయములను సౌకర్యములను గలిగియున్నారు. మనము ప్రవేశింపలేదని వారు మనమీద దోషారోపణ చేసి ప్రపంచముయొక్క సానుభూతిని సంపాదింపగలరు. ఇంతకును మనము వోట్లనీయవద్దనిన ప్రజలు త్వరగ నర్థము చేసికొనెదరు. కాని మనలో మనము నభ్యర్థులుగ నుండి, వారివోట్లు ఫలానివారి కియ్యమనిన నప్పుడు మన కార్యక్రమమును సూక్ష్మవిశేషములును వారు గ్రహింపజాలరు. మనచే నిర్ణీతులగు వ్యక్తులకు వారి వోట్లను గూడ నియ్యకపోవచ్చును. వోట్ల నిచ్చితిమా మానితిమా అను స్థూలమగు సారాంశమును వారు అర్థము చేసికొనగలరు. ఎన్నికలలో పాల్గొని, శాసనసభల ద్వారమువద్ద నిలుచుట - నిలిచి ప్రవేశింపకపోవుట - ప్రవేశించి ప్రమాణము తీసికొనకపోవుట - తీసికొని అధ్యక్షుని ఎన్నుకొనకపోవుట - ఎన్నుకొని చర్చలో పాల్గొనకపోవుట - పాల్గొని, నిరంతరము నిరోధించుట - నిరోధించి సభలను భగ్నము చేయుట —— ఇవన్నియు క్లిష్టములగు వివరము లగుటచే, ప్రజాసామాన్యము గ్రహించుట కష్టము. మొత్తముమీద శ్రీనివాసయ్యంగారు గావించిన సవరణ ప్రజలచే గయయందు నంగీకరింపబడలేదు.

గయలో ప్రజలను కలవరబఱచిన విషయము మఱియొకటి గలదు. నెహ్రూపండితుడు మొదటినుండియు శాసనసభలలో బ్రవేశించి భగ్నముచేయవలయునని చెప్పుచు కలకత్తాసభయందును గయలోను ఇప్పటికి ఎన్నికలలో పాల్గొనుటకుమాత్రమే అధికారము ఈయుడనియును అనంతర కర్తవ్యమును 1923 డిసెంబరులో నిర్ణయింతుమనియును చెప్పుచుండిరి. దీనియర్థమేమో ఎవరికిని తెలియలేదు. వీరి యుద్దేశమునకును ఉపన్యాసములకును గొంత, తేడాయున్నట్లు ప్రజలుపడ్డ అనుమానము ఇప్పుడు స్పష్టమగుచున్నది. శ్రీనివాసయ్యంగారి సవరణను వీ రంగీకరించిరి. ఇప్పుడు దాసుగారి పార్టీలో ప్రధాన పురుషులుగ నుండి ప్రవేశించి ఎద్దియో యొక కార్యక్రమముప్రకారము నడపవలయు నని ఈ భావమును ఆమోదించుచున్నారు. ఇప్పటికే మంత్రిపదవులను స్వీకరింపవలయునన్న మహారాష్ట్రులును, డిసెంబరు 1923 వఱకు కార్యక్రమము నిర్ణయింప నక్కఱలేదు. నెహ్రూపండితులును ఎన్నికలలో పాల్గొని ప్రవేశింపవలదన్న దాక్షిణాత్యులును, తమ తమ మతములను మార్చుకొని దాసుగారి యభిమతమును అంగీకరించినచో, రేపు డిసెంబరుకును, అటుపిమ్మటను ఎవరిమతము లెట్లుండునా యని ప్రజలు ఎక్కువ కలవరపడినారు. స్టోక్సు దొరవంటి మహనీయుడు వీరివీరి వాదములకును, వీరి వీరి ఉపసంహారములకును ఎట్టి సంబంధము గలదా యని ఆశ్చర్యపడి, సజావైన అభిప్రాయభేదమే, బేసజావైన సమాధానముకంటె మంచిదని బహిరంగముగ పత్రికాముఖమున దెలిపియున్నాడు. ఏది ఎట్లున్నను, శాసనసభావాదు లిప్పుడు సభలలో బ్రవేశించుటకు తొందరలేదు. నిర్మాణకార్యక్రమమును పూర్తిచేయవలసి యున్నది. అటుపిమ్మట శాసనోల్లంఘనసమస్య ఎదుర్కొనగలదు. శాసనోల్లంఘనమును గూర్చి మెజారిటీ పార్టీవారు తగు సౌకర్యము లొసంగలేదని, దాసుగారు గయాసభానంతరము దోషారోపణమును చేయుచున్నారు. ఇట్టి వాదము ఆశ్చర్యమును గల్గింపకమానదు. శాసనోల్లంఘన తీర్మానము విషయనిర్ణయికసభయందు చర్చలో నున్నపుడు నెహ్రూపండితుడు లేచి, ఇదెంతయు అనాలోచితముగ నుపక్రమింపబడె ననియు, సంయుక్త (ప్రయాగ) రాష్ట్రములో వాలంటీరులను నియమించుటయే శాసనోల్లంఘనమనియు, తక్కిన రాజధానులలో. నెన్నడో గావింపబోవు శాసనోల్లంఘనము, తమ రాజధానియందు మరునటిదినము నుండియు ఆచరణలోనికి వచ్చుననియును ఇతరులు నొప్పిజెందక, తమను నొప్పింప యత్నించుట అసమంజస మనియును వాదించిరి. ఈ వాదమునుబట్టి శాసనోల్లంఘనమున కెవరు వ్యతిరిక్తు లయినదియును తేలుచున్నది. ఇంతియకాక, గయలో నుపపాదింపబడిన తీర్మానము కంటినీరుతుడుచుచున్నదని నుడివిన దాసుగారు శాసనోల్లంఘనమును గూర్చి చెప్పిన మాటలు కూడ వారి పార్టీవారి మతమును వెల్లడించుచున్నవి. "శాసనోల్లంఘనము తనంతట నదియే ప్రయోజన మయిన సాధనము కాదు. జాతీయతాస్థానమున కత్యావశ్యకమయినచో తప్ప, దానిని ప్రయోగించుట అనవసరము.

Bi-amman being led in procession to the Khilafat Conference



బియమ్మగారిని కిలాఫతు సమావేశమునకు గొంపోవుట

The Indian National Congress at Gaya



జాతీయ మహాసభ

The Udasi Mahamandal Camp



ఉదాసి మహామండలి బస

The Exhibition and Stalls



ఖాదీ ప్రదర్శనము

THE CONCRESS SITTINGS
Moving the first Resolution, Showing reverance to Mahatmaji, The whole Congress Standing



దేశీయ మహాసభా సమావేశము
శ్రీ మహాత్మునికి తమ భక్తిని సూచించు మొదటి తీర్మానము సభ్యులందరు నిలచి యామోదించుట

నిష్ప్రయోజనము."—అను మాటలో తమభావమును వెల్లడించు పెద్దలు-ఏల-ఎదుటివారిని కపటవేషధారు లని నొక్కి చెప్పవలసివచ్చెనో- దురూహ్యముగ నున్నది. శాసనోల్లంఘనమును ఆచరణలోనికి తేవలయుననిన, నిర్మాణకార్యక్రమమునునిర్వర్తింపవలయునని ఎల్లరునంగీకరింతురు. కావున ఏప్రిల్ 30-వ తేదీవఱకు ఉభయుల ఎదుటను సూచింపబడిన దేశీయమహాసభయొక్క కార్యక్రమమును గూర్చి, కలిసి పనిచేయుటయం దెట్టి ఆక్షేపణ లుండజాలవు గదా! అదియే మౌలానా అబ్దుల్ కలాం ఆజదుగారు చెప్పుచున్నది. ఆయన కుదర్చబూనిన రాజీషరతు లివియే. ఏప్రిల్ 30 వఱకు కౌంసిలునుగూర్చి ఉభయులును మాట్లాడవలదు. సొమ్మును స్వచ్ఛంద సైనికులను సమకూర్చుడు ఇందుకు గలిసి పనిచేయుడు. పిమ్మట శాసనోల్లంఘనము అవలంబింపబడినచో, ఉభయులును కలిసి పనిచేయుచునే యుండుడు. అట్లు అవలంబింపబడనిచో, ప్రత్యేకపు కాంగ్రెసులో తిరిగి ఈ సమస్యలను తేల్చుకొనుడు. ఈ నిర్ణయములతో గూడిన సంధిషరతులను ఉభయులును అంగీకరింపవలసినదేకదా!

గయాకాంగ్రెసు, గాంధిమహాత్ముడు త్రొక్కిన మార్గముననే త్రొక్కి గమ్యస్థానము చేరవలయునను దేశముయొక్క దృఢనిశ్చయమును దెలుపుచున్నది. కాని గాంధి మాత్రము లేడు. గాంధి లేనపుడు గాంధియొక్క మతము- తత్త్వము- కార్యక్రమములు- దేశము హర్షించి పనికిగడంగునా లేక వారి నీడయందే చేరి వారి సహాయముచేతనే నిరంతరము నడపబడవలెనా? ఇదియే దేశమునంతను ఎదుర్కొనిన సమస్య. ఈ సమస్య ప్రజల కుచితమని తోచినరీతిని గయలో దేశీయమహాసభయందు తెల్పబడెను. ఆ కార్యక్రమముయొక్క పరిపక్వము శాసనోల్లంఘన మనుటకు సంశయము లేదు. పరిపక్వమువఱకు కార్యము నడిపింపబడునా? యని ఎదుటివారు అడిగినచో మనము ఆవేశము జూపవలసిన పని లేదు. శాసనోల్లంఘనము సమిష్టిశాసనోల్లంఘనమా? లేక వ్యక్తిశాసనోల్లంఘనమా? అని ప్రశ్నింపవచ్చును. సమిష్టిశాసనోల్లంఘనముయొక్క స్వరూపము మహాత్మునికి తప్ప ఎవరికిని తెలియదు. శాసనోల్లంఘన విచారణ సభ్యులకే తెలియలేదు. వీరు గుంటూరులో నీ విషయమై సాక్షులను ప్రశ్నించునపుడు, మొదలు సంఘము వారికి దీనియర్థ మెట్లు స్ఫురించుచున్నదో చెప్పుడని గోరి, మహాత్ముని భావములను దెలిపినపుడు, రాజగోపాలాచార్యులుగారు అదంతయు స్వకపోలకల్పితమని తటాలున వాక్రుచ్చిరి. సాక్షి చెప్పిన దంతయు నిజమే యని పటేలుగారు చెప్పువఱకు వారు నమ్మలేదు. కావున గయలో నుద్దేశింపబడినది శాసనోల్లంఘన విచారణ సంఘమువారిచే ప్రేరేపింపబడిన వ్యక్తిశాసనోల్లంఘనమే. ఈ శాసనోల్లంఘనమే కలకత్తాలో జరిగిన నవంబరు సభలో తీర్మానరూపకముగ నంగీకరింపబడెను. ఆ సభయందు దీనిని ప్రతిపాదించినది నెహ్రూపండితుడే. అట్టిచో నేల ఇప్పుడు కూడదని వీరు అభిప్రాయపడుచున్నారో తెలియకున్నది. నిజమేమనగా, వీ రెల్లరును అసహాయవాదమూలసూత్రములకు బద్ధులయ్యును దాని 'చహారా' ను మార్చవలెనని దృఢనిశ్చితులై యున్నారు. ఇటుప్రక్క శాసనోల్లంఘనమునందు వారికి నమ్మకము పోయినది. అటుప్రక్కను శాసనసభాబహిష్కారమునందును నమ్మకము వీడినది. బహిష్కారతత్త్వమునే, సభలలో నుండి అవలంబింపవలెనని వీరు బోధించి, తమలో తాము ఒక మార్గమును అవలంబింపజాలక ఒకరు ఒకమాదిరిని ఇతరులు ఇతరవిధములను మనస్సును వెల్లడిచేసికొనుచు, కడపటకు మన ప్రణాళిక ననుసరించి మనకోరిక లీడేర్పనిచో, "ఏకరీతిని నిరంతరాభ్యంతరము" పరిపాలనకు గలుగజేయవలయునను పర్యవసానమును దేల్చుకున్నారు. ఇప్పుడు రాజీ కుదురు నను ఆశ ఎవరికిని లేదు. కుదురవలె నను గోరిక అందఱకును గలదు. కాని రాజీ యను మాట మనస్సులో నుంచికొని, కాంగ్రెసు ఆదేశమును నిర్వర్తించుటయం దెవరును ఔదాసీన్యమును పూనవలదు. ఆంధ్రదేశమున రాబోవు దేశీయమహాసభ సమావేశము కానైయున్నది. గయాకాంగ్రెసు కార్యక్రమమునకు బాధ్యులలో ఆంధ్రులే అగ్రస్థానమును వహించియుండిరి. కావున మనదేశముయొక్కయు, మన రాష్ట్రముయొక్కయు, మన దేశీయమహాజనసభయొక్కయు పరువుప్రతిష్ఠలను నిలువబెట్టవలయునన్న, మనవంతు ధనమును, మనవంతుకువచ్చిన శాంతిసేనను సకాలములో సమకూర్చుటకు యత్నించుటకన్నను వేఱుగా ఏ ఆంధ్రునకును ఎక్కువ పవిత్రకర్తవ్య ముండజాలదు.

# స్వదేశవస్త్రములు

చాగంటి భీమశంకరరావు గారు

గాంధి మహాత్ముడు భారతీయుల దారిద్ర్యావస్థ దొలగించి స్వరాజ్యము చేకూర్చుటకు స్వదేశవస్త్రధారణము సులభతమ మైన మార్గమని యుద్బోధించియున్నాడు. మనదేశమునందు రాట్నముమీద చేతితో వడుకబడిన నూలునుండి తయారుచేయఁబడిన వసనములు స్వదేశ వస్త్రములు నాబడును. ఇవి యార్థికముగను, నారోగ్యవిషయములందును ప్రజలకు మిగుల లాభకారిగ నుండవలయును. విదేశములనుండి దిగుమతియగు వస్త్రములను కొనుటవలన ప్రతియేట నఱువదికోట్లరూపాయలు విదేశముల కేగుచున్నవి. విదేశవస్త్రబహిష్కారముచేసి, మనదేశమునందు మనసోదరులచే తయారుకాఁబడు వసనములనే కొనుచుంటిమేని యీధనవాహిని యరికట్టబడును. మనదేశములో ప్రతియేటను నఱువదిలక్షల ప్రజలు తిండిలేక శస్రునితో మొఱపెట్టుకొనబోవుచున్నారు. అఱువదికోట్లరూపాయల ధనవాహిని అరికట్టబడియెనేని ప్రజ లాకలిచే మడియుటకు నవకాశము లేదు మన యార్థికదశ బాగుపడెనేని మన మెన్ని ధర్మవైద్యశాలలను నిర్మింపలేము? ఎన్ని పశుచికిత్సాలయములను కట్టలేము? హత్యలు జరుగకుండ నెన్నెని రక్షకభటాలయములను స్థాపింపలేము? ఇదియది యననేల? ఇంక నెన్నెని విధుల మన దేశస్థితిని వృద్ధిచేసికొనగలము. దినమార్తాండునొకపరి ప్రకాశింపజేయు దేశదుస్థితి తొలగించుటకు ధనము కావలయును. విదేశముల కేగు ధనప్రవాహము నరికట్టుటవలన ధనము నెంతేని సంపాదింపగలము. కాన స్వదేశవస్త్రధారణ మెంతయు శ్రేయస్కరము.

విదేశవస్త్రములు యంత్రముల సాహాయ్యమున తయారుజేయబడుచుండును. మొదట నూలు యంత్రములవలన తీయబడి కిరసను నూనెలో నాని వసనముల క్రింద యంత్రసాహాయ్యముచే నేయబడును. ఇందుచే, ప్రత్తి తనయందు స్వాభావికముగా నుండు నుష్ణము మొదలగువానిని కోల్పోవుచున్నది. కాని, స్వదేశవస్త్రములు ప్రకృతిచే సాధింపబడుటచే ప్రత్తి తనస్వభావమును కోల్పోవుట లేదు. రాట్నముచే నూలు వడుకబడుటచేతను మగ్గముచేత నేయుబడుటచేతను ప్రత్తికి నలుఁగుడు లేక తన స్వాభావికము లగు నుష్ణాదిగుణములను కోల్పోవుట లేదు. కాన, స్వదేశవస్త్రములు ధరించి మనుజుని శరీరమందు గావలసిన నుష్ణాదికముల నుంచుట కీవసనములు సాయపడుచున్నవి. ఏదేని అత్యవసరకారణమున విదేశస్థులు హిందూదేశమునకు తమవస్త్రదిగుమతి నాపితిరేని భారతీయులకు వసనము లెందుండివచ్చును? మనమప్పుడు వృక్షములపట్టల నాశ్రయింపవలసివచ్చును. ఐరోపామహాసంగ్రామము జరగుదినములలో విదేశస్థులు వస్త్రముల నధికముగా దిగుమతి చేయలేకపోయిరి. అప్పుడు వస్త్రముల వెల యధికమయ్యెను. 1917-వ సం॥ ఒక యువతీలలామ తనభర్త వస్త్రములను తెచ్చునేమో యని ఎనిమిదిదినములు గుడ్డపేలికయైన కట్టుకొనుటకు లేక తలుపుచాటున గూర్చుండెను. వారముదినము లైనను గూడ నతనికి వస్త్రము దొరకినదిగాదట. అప్పుడామె తనకొమరుల నిరువురి నూతిలోపడవైచి తానుగూడ పడి చనిపోయెను. అహా! మనల నీగతికి తెచ్చినది మన మన్యులపై నాధారపడియుండుటయే గదా. కాన భారతీయులు తమకాళ్లపై నిలువవలయునే గాని యన్యులభుజముపై నాధారపడియుండరాదు. ఈసందర్భమున "భరతపక్షిపిల్లలు" అను కథను జ్ఞప్తియం దుంచుకొనవలయును.

స్వదేశవస్త్రధారణవలన నచిరకాలములో స్వరాజ్యము తప్పక చేకూరును. స్వరాజ్యము వచ్చినంతటనే మాతృదేశము దాస్యశృంఖలములనుండి ముక్తిఁ గాంచఁగలదు. ఆంగ్లదేశరాజ్యతంత్రజ్ఞులచే చేయబడిన శాసనములవలన గొంపోబడిన భారతజాతియొక్క మానము కాపాడబడును. స్వదేశవస్త్ర మను శబ్దమునందలి "స్వ, వస్త్రము" అను నీరెండుమాటలు మాతృదేశము శృంఖలాబద్ధమైనందున కలుగు దుఃఖమును పోగొట్టును. ఆంగ్లదేశరాజ్యతంత్రజ్ఞులచే చేయబడిన శాసనము లెత్తుకొని పోయిన మానము కాపాడును అని తెలియజేయుచున్నవి. ఈరెండు కార్యములు శబ్దార్థములేగాక స్వదేశవస్త్రములను ధరించితిమేని స్వరాజ్యము వచ్చి యీరెండుకార్యములు సఫలము లగును.

పొట్టిగుమ్మమునుండి వెడలునపుడు తలవంచినయెడల నది లొంగుబాటునకు సూచకమగునేమో యని తలవెనుకకు విఱచుకొనునట్లు చేయు మీ పౌరుషము ఓ క్షత్రియసోదరులారా! ఏమైనది? అఱువదికోట్లరూపాయల ధనవాహిని విదేశములగు నిరాటంకముగ నేగుచున్నది. లెండు. దాని నరికట్టుడు. లొంగినను పౌరుషహీనమైన కార్యములు సేయనేరని మీపూర్వుల బప్పారావుల దలఁపుడు. దేశమునకై ప్రాణములను గోల్పోయిన మీరాజపుత్రవీరులను దలఁచి కార్యరంగమునకు దిగుడు. కార్యరంగమేది? కత్తిబట్టుటకాదు. రణరంగముగాదు. స్వదేశవస్త్రధారణమే.

దేశమును క్షామదేవత పీకుకొని తినుచున్నది. వైశ్యులారా! మీకర్తవ్యమేది? వర్తకముచేసి దేశముయొక్క ధనమును వృద్ధిచేయుట దేశదారిద్ర్యము తొలగించు నీస్వదేశవస్త్రవర్తకమును గావింపుడు. ఈవర్తకము మీరు మొదలిడితిరేని మీకు లాభము. మీతోడిదేశీయులకు లాభము. దేశమును పీడించు క్షామదేవత తత్క్షణమే వదలిపోవును. ప్రత్తి నెగుమతి సేయకుడు. ఎగుమతియయిన ప్రత్తి వస్త్రరూపమున తిరిగి యిక్కడకు వచ్చి మనధనమును గొంపోవుచున్నది.

కదళీవృక్షముపొంత ప్రొయ్యిలుపెట్టుకొని కాలము గడపునట్లు చేయునోపోడిమీ ! మితవ్యయము చేయుట విదేశవస్త్రములను కొనుట నిన్నతిక్రమించుటయే యని నీశిష్యుల కింకను తెలియలేదా? (కొన్ని జిల్లాలలో కొందఱు పౌరులు తామెంత భూస్వాములైనను తామెంత గృహస్వాములైనను కదళీవృక్షములపొంతనే వంట చేసికొని యెదరు) తనచేనునందు తాను కష్టపడి పండించుకొనిన వంకాయలు కొంచెము చేదుగ నున్నను కృషీవలుఁడు మిక్కిలి యానందముతో భుజించునుగదా! అంగవైకల్యముగల తనకుమారు నొకమూలకు త్రోచివైచి యంగసౌష్ఠవముగల పెఱవారి కుఱ్ఱని నేకాంతయును తెచ్చుకొనదుగదా! కాన మన స్వదేశవసనము లిప్పట్టున కొద్దిగ మోటుగ నున్నను స్వదేశవస్త్రములు ధరించుటే తగినపని. మనస్వదేశవస్త్రములు కఠినముగ నున్నవని, మృదువుగా నున్న విదేశవస్త్రములను ధనారోగ్యహానులకు నోర్చికొనుట భారతీయులకు తగినపనియా?

ఇప్పుడు మన దురదృష్టముచే మనకళ లన్నియు నాశనమై పోయెనేగాని, మనపూర్వులు నూటయేబదిగజముల తానును కొబ్బరికాయయం దిముడ్చునంతటి నైపుణితో మెలఁగు కళావంతులకు. వారి యున్నతదశను మొన్న మొన్నటివఱకును ఢక్కామల్లులు, కాశ్మీరశాలువలు చాటుచునే యున్నవి. ఇప్పట్టున నట్టి కళ నశించిపోయెను. కాన మనవస్త్రము లిప్పుడు కఠినముగా నున్నవి. మన మలవాటుపడిన యెడల మనకుగూడ నట్టికళ పట్టుపడును.

ఎట్టికళయైన ప్రజాప్రోత్సాహముగాని రాజుయొక్క ప్రోత్సాహముగాని లేక వృద్ధిపొందనేరదు. రాజుప్రోత్సాహ ముండెనేని యాకళ యున్నతదశ నలంకరించెనని చెప్పవచ్చును. ప్రజాప్రోత్సాహముండి రాజు మాటాడ కూరకుండెనేని యిదియు బాగుగ వర్ధిల్లును. ప్రజాప్రోత్సాహము లేక రాజు నసహానమునకు బాత్రమయ్యెనేని యేకళయును వృద్ధిపొందదు. తప్పక నశించును. ఈగతి పట్టినది మనఢక్కామల్లులకు. ఈమల్లుల నేయు నేతగాండ్ర నావేశించినవి మన తూర్పుహిందూదేశవర్తకపు సంఘమువారి భారతీయోద్యోగపిశాచములు. ఈభారతీయోద్యోగులు నేతవాండ్రవద్దకేగి నూరు, నూటయేబదిగజముల తానును వారముదినములలో తయారుచేయుమని కొంతధనమును పెట్టుబడి పెట్టి వారివద్దనుండి యొప్పుదలపత్రములను వ్రాయించుకొనుచుండెడివారు. సాలీలు సాధారణముగ నంత తానును నేయలేకున్నను నెట్లో కష్టపడి నేసి యిచ్చుచుండెడివారు. అప్పుడు తిరుగ 200 గజముల తానును వారముదినములలో నేయవలయునని కొంతధనము పెట్టుబడిపెట్టి యొప్పుదలపత్రము వ్రాయించుకొనుచుండెడివారు. సాలీలట్లు నేయలేక పోవుచుండెడివారు. అప్పుడు పయోముఖవిషకుంభములను బోలు నాయుద్యోగులు సాలీలధనమును మగ్గములను అమ్మి వారిని పలువిధముల బాధించుచుండిరి. మొదట తియ్యనిమాటలు, తరువాత బాధించుట- ఈబాధలు సాలీలు పడలేక బొటనవ్రేళ్లను ఖండించుకొని తమయసమర్థతను ప్రకటించుచు బాధలనుండి విముక్తులగుటకు ప్రయత్నించుచుండి రని కొందఱు చరిత్రకారులు సెప్పుదురు. ప్రభుత్వమువారీపనివాండ్ర నందఱను నిలువబెట్టి బొటనవ్రేళ్లను ఖండించిరని కొందఱు సెప్పుదురు. ఇందేది నిజమో పాఠకమహాశయులే నిరూపింతురుగాక.

మన భరతఖండమున మనదేశవాసులచేతను ఐరోపాదేశస్థులచేతను స్థాపింపబడిన బట్టలునేయు యంత్రము లనేకములు గలవు. అవి వర్తకులకు చాలధనమును సేకూర్చుచున్నవి. అయిననందు నేయబడువస్త్రములు స్వదేశవస్త్రములు కావు. ఆవస్త్రములు భారతీయులకు నార్థికముగను నారోగ్య విషయములందునను లాభకారిగా నుండవు. అవి విదేశవస్త్రములవలె యంత్రముల సాహాయ్యమున నేయబడుచుండుటచే నవి స్వదేశవస్త్రములకు వోలె నారోగ్యకరముగ నుండవు. బట్టలునేయు నీయంత్రముల యజమానులు ప్రతివత్సరము దొరతనమువారికి గప్పము కట్టవలయును. అందుచే ధనము విస్తారముగా విదేశముల కేగుచున్నది. ఇంకొకవిశేషము. ఒకయంత్రము వేయిమంది ప్రజలు చేయుపనిని నూరుమందితో చేయుచున్నది. కాన మిగిలిన తొమ్మిదివందల ప్రజలును పనిలేక నుండవలయును. కనుకనే ఆంగ్లదేశమునందు నిట్లు మిగిలిన తొమ్మిదివందల ప్రజలకును ఇండియా, ఆస్ట్రేలియా, కెనడా మొదలగు దేశము లాశ్రయ మొసగుచున్నవి. మనము యంత్రముమీదనే యాధారపడియుంటిమేని మనదేశవాసులగు నా తొమ్మిదివందల ప్రజలును వారిదేశమునకు బోవలసివచ్చును. ఆంగ్లేయులకు వలసరాజ్యములున్నవిగాన వారక్కడ సుఖజీవనము చేయుచున్నారు. మనకు వలసదేశములు లేవు. మన మాదేశములకుబోతిమేని మన మనేక కష్టములకు లోనుగావలసియుండును. మనము మనదేశముననే యుంటిమేని పనిలేక తిండిలేక మలమల మాడవలసివచ్చును. రాట్నములచేతను, మగ్గములచేతను యంత్రసాహాయ్యము లేకుండ తయారుగాబడిన వసనములను మనదేశస్థు లుపయోగింతురేని మనదేశమందు క్షామదేవతయొక్క నీడయైన కనుపట్టజాలదు. కనుక భారతీయసోదరసోదరీమణులారా! విదేశవస్త్రములందుగల నష్టములను యోజింపుడు. దేశద్రోహమును దలపుడు. వానిని విడనాడుడు.

స్వదేశవస్త్రములందు గల లాభములను యోజింపుడు. ఆందుండిన నీతిని తలపుడు. మీ రన్యులపై నాధారపడితిరేని మిమ్ముల నందఱును చులకనగ జూతురని జ్ఞప్తియం దుంచుకొనుడు. మీ పూర్వుల దేశభక్తి శౌర్యధైర్యస్థైర్యములను దలపుడు. దేశభక్తులు మీకొఱకు కారాగారముల కేగుచున్నా రనుమాట మఱువకుడు. దుందుభులు మ్రోసినవి. గాంధిమహాత్ముఁ డెరవాడచెఱసాలనుండి స్వదేశవస్త్రములను గట్టి స్వరాజ్యము దెచ్చి నిలుపుకొను డనుచున్నాడు. భరతమాత తన తేజోమయంబులగు హస్తము లెత్తి మిమ్ము దీవించుచున్నది. స్వదేశవస్త్రములను ధరింపుడు.

# ఈశ్వరోపాసనము

దాసరి లక్ష్మణస్వామి గారు

(తిగలోచక్ మధుమాపియారే అనుమట్టు)

వరమేశా - దురితవినాశా
వరభువనేశా మము - పాలింపు మీశా. పర.

విశ్వరూపా - విశ్వజనరక్షణా
విశ్వాభిరంజనా - విశ్వావనా. పర.

ఉరుతాపా - హర శుభకలాపా
పరమతేజః ప్రదీప - బ్రహ్మస్వరూపా. పర.

సర్వసాక్షీ - సర్వలోకసంస్తుతా
సర్వసద్గుణోపేత - శరణిదె పరమపితః. పర.

(జప్తకులందఱు అనుమట్టు)

కనుఁగొన లోకే-శ్వరుఁ డొక్క-డె యని
ఘనముగ నెంచవె - యోమనసా,
జనకుని గతి యా - తనినె సతము పూ
జన మొనరింపవె - యోమనసా. క.

మానము సిగ్గుఁ బ-రిత్యజించి కొఱ
గాని పనులు సే-యకె మనసా,
ఆ నిరామయుని - చరితలనే విన
వీనుల నియ్యవె - యోమనసా. క.

నోరెఱుఁగని జీ-వావళి నీ విల
మారణ సేయకె - యోమనసా,
సారెసారెకు - సమస్త ప్రాణులను
గూరిమిఁ బ్రోవవె - యోమనసా. క.

హేయమైన శు-ష్క-వ్రతంబు లిలఁ
జేయఁగ నెంచకె - యోమనసా,
మాయ మాయ స-త్యవ్రతంబె మదిఁ
బాయక సల్పవె - యోమనసా. క.

గరువమునను స్వ-ప్నమునన్నైన మఱి
పరదూషణ సే-యకె మనసా,
ధరణి సమస్త జ-నంబులను సమా
దరమునఁ జూడవె - యోమనసా. క.

వెరవరు లగుచును - ధరఁ జరియించెడు
నరులను గూడకె - యోమనసా,
వరసుఖదం బగు - సజ్జనగోష్ఠియె
నిరతము సల్పవె - యోమనసా. క.

పారమార్థచిం-తన మెద సదా నిను
జేరఁగ నియ్యవె - యోమనసా,
ఓరిమితో సం-సారములోఁ గల
సార మెఱుంగవె - యోమనసా. కను.

(గిరిజామనోవిహార్ అనుమట్టు)

పరమపితావన - వరచరితా యని
నిరతముఁ గొల్వుఁడి - నరులార,
పరమేశ్వరుఁ డురు-తరకృపఁ గని మిము
దరి జేర్చును స-జ్జనులార. పర.

పాపకార్యముల - దాపున కేగక
చూపుఁడు భక్తిని - నరులార,
ప్రాపుఁ జేర్చి మి-మ్మా పరాత్పరుఁడు
కాపాడును స-జ్జనులార. పర.

ఒద్దిక మీఱఁగఁ - బెద్దల నిలనే
ప్రొద్దు గొల్వుఁడీ - నరులార,
హద్దు మీఱకిఁక - బుద్ధి గలిగి యా
సుద్ది వినుఁడి స-జ్జనులార. పర.

President Proposing Resolutions



సభాధ్యక్షుండు తీర్మానముల నుపపాదించుట

Babu Rajendra Prasad's Lecture



రాజేంద్రప్రసాదు సంభాషణము

The Indian National Congress at Gaya



జాతీయ మహాసభ

Subjects Committee Meeting at Gaya



జాతీయ సభోపసంఘము

The Indian National Congress



జాతీయ మహాసభ

Opening Speech of Desabandu Das



దేశబంధుదాసు ప్రారంభోపన్యాసము

Entrance to the Congress Pendal



జాతీయసభా ప్రవేశద్వారము

Prayers and Bhajanas near the River Phalguni



ఫల్గుణీతీరము - ప్రాతఃకాల భజనము

# కృష్ణరాయఁడు-కృష్ణాపత్రిక

పురాణం సూరిశాస్త్రి గారు, బి. ఏ.

(P. S ఈ వ్యాసములో పెద్దలపట్ల నుపయోగింపబడిన యేకవచనములు, వాక్యసారళ్యముకొఱకు, ప్రసిద్ధార్థతకు, భక్తిప్రీతివాహకంబుగ ప్రయోగింపబడినవి.—పు. సూ. శా.)

కృష్ణాపత్రిక 1902 ఫిబ్రేవరిలో కృష్ణాజిల్లా సంఘమువారి యాందోళనసాధనముగ నెలకొల్పబడెను. 1905-6లో గుంటూరుతాలూకాలు వేఱొకజిల్లగ గూర్చబడినందున నీపత్రిక కృష్ణాగోదావరీమధ్యదేశనివాసుల ప్రచురణసాధన మాయెను. 1909 ప్రాంతముల నీపత్రిక జిల్లాసంఘపు స్వాధీనమునుండి తొలగి బందరులోని కొందఱి స్వకీయపత్రికయై వారిమతానుసారముగ నేటివఱ కవిచ్ఛిన్నముగ నడుపబడుచున్నది. దాసు నారాయణరావు గారు కొండా వెంకటప్పయ్యగారు ఆవటపల్లి నారాయణారావుగారు గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు గారు భోగరాజు పట్టాభిసీతారామయ్య గారు మున్నగు నాంధ్రావనీధీరు లీపత్రికలోని ప్రధానవ్యాసముల రచించుచుండిరి. వల్లూరి సూర్య నారాయణ రావుగారు కూడ నిరంతరము వ్యాసముల వ్రాయుచుందురు. 1906 మొదలు నేటివఱకు, పత్రికానిర్వహణధూర్వహుడై- నవీనాంధ్రభావోద్వేగనిర్మాత యై- గద్యరచనపరిపోషకుడై- యాంధ్రుల భక్తివిశ్వాసముల కాశయుడై వెలుగొందియున్న ముట్నూరి కృష్ణరాయఁడీ కృష్ణాపత్రికను గైకొని, సకలకళాశోభితంబుగ- నవీనభావోద్దీపితంబుగ- నిజచారిత్రగౌరవపటిష్ఠంబుగ- నిర్వహించి యాంధ్రపత్రికలకు శిరోభూషణంబుగ చిత్రించినాడు.

వార్తాపత్రికల కేహేతుసముదాయమున నుత్తమగుణము లేర్పడుచున్నవో అవి యన్నియును కృష్ణాపత్రికయందు రూఢములు. సుప్రసిద్ధములై - సుస్థిరములై - యమాత్యనేతలై - సంఘాభ్యుదయాకాంక్షులై రాజిల్లు పత్రికారాజము లన్నియు సద్గుణచతుష్టయముచే నొప్పారుచుండును ఎట్టి యాటంకములనైన - లాభనష్టములనైన - ప్రభుసంఘవిద్వేషమునైనను- ధీరతతో నోర్చి- యవిచ్ఛిన్నముగ నియతకాలాగమనముగలవై కాలప్రవాహ మనువర్తించియు, నిజసాంప్రదాయపరత్వమును విడువకయు, ప్రభువుల అసూయాదరణములను ప్రజల తారుణీకావేశములను పాటింపకయు-శీలప్రధానములై నిజసత్త్వప్రభావమును నిలిపికొను సద్గుణమే వార్తాపత్రికల మొదటిగుణము. పత్రికలో ప్రచురింపబడు విషయములు యథార్థముగ నుంటయు నాయా విషయములందారితేరిన యధికారులే వానింగూర్చి వ్రాయుటయు, జాతియొక్క-వృత్తవర్తిష్యమాణవర్తమాన సంచారమును లెస్సగ గుర్తించు గాఢాస్థైర్యమున విశ్వాసపాత్రములై యొప్పిదమగుటయు వార్తాపత్రికల రెండవ యుదారగుణము. సహేతుకమైన యభినవభావోదయంబును ప్రకటించుచు, దేశములోని ధీయుతుల కవకాశ మొసంగుచు, జాతిస్వతంత్రపరిణామసౌభాగ్య మందు. క్షేత్రమై యుంటయే వార్తాపత్రికల తృతీయసద్భావము. భావిభాగ్యసూచకములగు దారులను- సాంఘికరాజకీయకళాసారస్వతప్రయత్నములను ఊహించి- భావావేశసంచలితములుగ నొనర్చి-సంఘమును ముందునకు త్రోయుచు-త్రుళ్లిపడని జాగరూకతతో నడిపించు కార్యకౌశల్యము - వీనియందు గల నాల్గవ మహాగుణము. ఇట్టి సద్గుణముల నొప్పు- కృష్ణాని కృష్ణ- వనసుమంబులవలె గిరిశిరంబుల గాయు శరచ్చంద్రికల బోలి- యాంధ్రనైజవినయభూషితమై - వంగమహారాష్ట్రపత్రికలవలె నిజప్రభావార్భాటముఖరిత దిఙ్ముఖంబుల జాడ నరయక దాగియున్నది.

కృష్ణాపత్రిక గుణకీర్తనము గావించుచో పత్రికావిక్రయపుబాహుళ్యమునుబట్టి చేయరాదు. కొందఱాంధ్రులు విద్యావిభూషితులయ్యును కార్యకారణసాంప్రదాయముల గుర్తెఱుగరు. వ్యక్తిపరిస్థితుల యన్యోన్యసంబంధ మఱయకుందురు. వీరు నిరంతర మాంధ్రసత్త్వమును దూషించుచు - తిలకు మోతీలాలో గోషు మున్నగు పత్రికాధిపతుల చారిత్రసంపత్తిచే వారిపత్రికలు వన్నెకెక్కినవని యుప్పొంగుచుందురు. కలకత్తా నూఱుసంవత్సరములు హిందూదేశరాజ్యస్థాన మనియు, మహారాష్ట్రులు భాగ్యవంత మయిన బొంబాయిరాష్ట్రమున సర్వప్రచారకులై మొన్న మొన్నటివఱకు యావద్భారతరాజ్యనిర్వహణ మొనర్చినవారని యు స్థానబలముచే కాలబలముచే నచ్చటి ప్రతిభాశాలు రత్యున్నతిని జెందిరనియు మనవారు గుర్తింపరు. బందరులోని న్యాయవిద్యావైదుష్యము రావుబహద్దరయినది. మద్రాసులో అదియే సర్వాభవ్య మయినది. కలకత్తాలో లార్డుసింహారూపమున భారతవిఖ్యాత మొందినది. సీమలో నదియే యాంగ్లసామ్రాజ్యప్రధానప్రాముఖ్యమును వహించి జగద్వ్యవసాయ మొనరించుచున్నది. కాని వైదుష్యము - ప్రతిభాసంపత్తి - సత్స్వభావము- మున్నగు వ్యక్తిసత్వముల దిలకించినచో మన పత్రికాధిపులందు మనవిమర్శకులందు - మన కవులందు - మన ధీవరులందు - అమేయగుణవిభూతి గోచరింపక మానదు. మనకర్మ మేమో కాని యాంధ్రులు నిజసత్త్వ మారయ కున్నారు. "నమ్రత్వేనో న్నమంతః పరగుణకథనైః స్వాన్ గుణాన్ ఖ్యాపయంతః" అను న్యాయానువర్తనము వ్యక్తులయం దుచితమే. కాని జాతీయాభివృద్ధికి విరోధసాధనమై యుండును. ఆత్మవిషయమున నతివినయ ముండవలయును. జాతీయసందర్భములలో నెల్లరు నార్తుక్లిఫ్ప్రభువువలె వెలుగవలయును. సత్త్వబలమున కృష్ణాపత్రిక

భారతపత్రికారాజముల మొదటి తరగతిలో చేరియున్నది. కాని యాంధ్రుల పౌరుషగౌరవప్రాచుర్యపరత్వము లేమిచే దీనికా కళంక మేర్పడుచున్నది. వంగదేశీయులు ఆంగ్లజాతి వాణిజ్యప్రాముఖ్యప్రాగల్భ్యరీతుల ననుకరించి - తమ మిట్టవేదాంతములను - తమ యసంపూర్ణ చిత్రకళలను-విక్రయింపసాగిరి. మన తెలుగువారు రీ వంగదుండగ మెఱుంగక - వారి ప్రాముఖ్యము నుదారభావపూర్ణ- మని భ్రమపడిరి. కృష్ణాపత్రిక నిజముగా తెలుగుబాసలో వ్రాయబడిన వంగసంస్కారసాంప్రదాయముల ప్రాముఖ్యసాధనముగ బరిణమించినది. ఆంధ్రపత్రిక జాతీయతత్త్వమున కెక్కువయవకాశ మేర్పఱచి యాంధ్రత్వ మను శుభావేశమును గల్గించి యున్నది. కృష్ణాపత్రికలోని రెండవలోపము ఆపత్రిక ఆంధ్రజాతి కాదు. ఆంధ్రపత్రిక ఆంధ్రజాతియొక్క దీనాలాపనినాదములతో నోంకారముఖరితమై యుండును. సామాన్యముగా వ్యక్తులకు గాని- సంస్థలకు గాని - ఏ సద్గుణము- బలహేతు వగునో- ఆ సద్గుణమే దౌర్బల్యబీజ మగును. భావావేశతన్మయత్వమున మానవు లాభావములకు బానిస లగుచుందురు. అటులే పత్రికలు నుండును. ఆంధ్రత్వ ముద్ఘోషించు ఆంధ్రపత్రిక బహుజనానీతమై మెత్తందనము (Elastic) సూచించుచుండును. కృష్ణరాయని గుణరూపచారిత్రభావసాదృశ్య మొందిన కృష్ణాపత్రిక వారియొక్కయు వారిమిత్రమండలియొక్కయు నిర్భయదీక్షాపరత్వమున (Policy) ఘనతమమై యున్నది. పట్టాభిగడుసుతనము- స్థైర్యాహంకారములు- హనుమంతరా యని భావలతికావిర్భావసంస్ఫురణము-కోపలాంతఃకరుణయు-కృష్ణరాయని సత్యన్యాయైకదీక్షయు- వీరి సామాన్యవంగోద్భూత బ్రహ్మసంస్కారములతో మిళితములై కృష్ణాసంపుటంబులశోభిల్లుచుండును. పట్టాభివర్తమానరాజ్యతంత్రజ్ఞుడు.జాతీయవిద్యాప్రతిష్ఠాత, భూతజీవి - పత్రికానిర్వాహకుడు. భవిష్యద్భావస్వప్నానందపిపాసి- కృష్ణాపత్రిక ఈ ముగ్గురితత్వసమ్మేళనము. 1909 మొదలు నేటివఱకు కృష్ణరాయరే కృష్ణాపత్రిక. కాళీఘట్టభక్తిఘోషారవములు- రామమార్గణటంకార నినాదములు- బృందావనవైదుష్యశీతలము- నీతిలాలిత్య మొంది- కృష్ణుని గద్యగీతములై- పత్రికాముఖంబున వెల్లివాఱి- నవీనాంధ్రభావశిల్పకకీర్తి నొందియున్నవి.

కృష్ణరాయరే కృష్ణాపత్రిక. ముట్నూరి కృష్ణారావుగారు బందరు గొడుగుపేటలోని యొక సత్సాంప్రదాయవైదిక కుటుంబమున జన్మించిరి. వీరతండ్రి నాగభూషణం గారు లౌకికులై గొప్పయుద్యోగమును బడసియుండిరి. అన్నగారైన వేంకటరత్నముగారు న్యాయపట్టభద్రులై సౌశీల్యమునకును సౌందర్యమునకును అమాయికమైన తెలివికిని స్నేహవాత్సల్యమునకును బేరొంది న్యాయాధికారపదవిలో నస్తమించిరి. కృష్ణారావుగారు వీరినేతృత్వమున చిన్ననాటినుండియు విద్యాభ్యాసనిరతులై- సంఘసంస్కరణాభిలాషులై - భావోద్రేకపూరితులై- యొజ్జల ననురక్తి గొలుచుచు - శీలవంతులై - దేహమనస్సంస్కారములతో కుంభకోణంకృష్ణమాచార్యులవారి యుపన్యాస పూత్కారముల నల్లనమించి, నోబుల్ కళాశాలలో రఘుపతి వేంకటరత్నం నాయుడుగారి ప్రాచీనాచార నిర్మలక వాక్ప్రవాహప్రాబల్యతరంగములం జిక్కికొని, భక్తిపూరితులై- బ్రహ్మమతావలంబనము గావించియుండిరి. కృష్ణారావుగారితో సహాధ్యాయులుగ నాయుడుగారిపంచ జేరిన దేశరాజు పెదబాపయ్య పట్టాభిసీతారామయ్య కోపల్లె కళారాసి మొక్కపాటి సుబ్బారాయుడు, మున్నగు ధీవరు లాంధ్రసాంఘిక రాజకీయరంగములలో వన్నెకెక్కిన సుధీమణులై- ధీరోదారనాయకులై,యాంధ్రోద్యమ సూత్రధారులై బరగుచుండిరి. వీరి కాలమున నాయుడుగారి యుద్బోధన లాలించుటయే గాక బందరు రామన్నపేటలోని సోషల్ క్లబ్బునందు నాయుడుసాంగత్య మధికముగ సేయుచు, వైదికాచారములందును హిందూ సాంప్రదాయములందును, భారతభాగవతాది పురాణములందును అసూయాపరులై, పాశ్చాత్యవిజ్ఞాన వైదుష్యసామ్రాజ్యమున నుప్పొంగుచునుండిరి. యఫ్. ఏ. చదువు- పిన్నతనమున బ్రహ్మమతావలంబనము- నగుటజేసి వీరివిజ్ఞానాదర్శములు వంగసంస్కర్తలచెంత జేరినవి. కృష్ణారావుగారు బ్రహ్మసమాజపు ఋషిపారంపర్యమును జక్కగ గుర్తించి యుపాసించి యావల చెన్నపురి కేగుతఱి, యచ్చట వీరేశలింగం పంతులుగారి సంస్కరణాభిలాష సంక్రమింప, దేశహితకార్యోత్సాహులై యుండిరి. ఆకాలములో వీరనేకసుప్రసిద్ధనటుల నాటకములం జూచుటయు నేర్పడెను.

కృష్ణారావుగారు చెన్నపురి జేరకముందు వివేకానందస్వామి యచ్చటి కరుదెంచి హిందూమతశాస్త్ర్య ముద్బోధించెను. బీసెంటమ్మ కాశినుండి యరుదెంచి యప్పుడప్పుడు హిందూమతౌత్కృష్ట్యమును సూచించు దివ్యజ్ఞాన ప్రబోధములను గావించుచుండెను. కలకత్తాలో బుద్ధిమంతులు,లౌకికకారణములచే నాంగ్లప్రభుత్వవిధానములయం దసూయగలిగి పాశ్చాత్త్యహైందవ విమర్శకుల గ్రంథముల నవలోకించి, హిందూసాంప్రదాయములను తృణీకరించుట మాని- వాని యాథార్థ్యమరయ జూచుచుండిరి. కృష్ణారావుగారు చెన్నపురి వదలుతరుణమున, నాపత్తనములో హేతువాదమా? జాతీయవాదమా? అనుచర్చ సాంఘికసమస్యలపట్ల జరుగుచుండెను.

బాపయ్య సుబ్బారాయుడుగార్లు తక్క, తక్కినస్నేహబృందముతో కృష్ణారావుగారు 1906 కు బందరులో నివిష్టులయిరి. అప్పటికే తిలక్, గోక్లేలయాదర్శమున బహిరంగజీవనము స్వార్థదూర మను తలంపులోడముచుండెను. ఆంగ్లప్రభుత్వమును నిర్భయముగఁ దర్కించు తెలివు లమరుచుండెను. బంగాళావిభాగరోషావిష్టులైన దేశనాయకులు (వాగుడుగాండ్రు) ఆంగ్లరాజనీతియందు విక్టోరియా కాలమున నేర్పడిన విశ్వాస మెల్లద్రుంచి "ఉద్ధరే దాత్మనాత్మానం" అను సూత్రమును గ్రహించి, యొకచెంప నాంగ్లద్వేషమును, మఱియొకచెంప హైందవసాంప్రదాయాభిమానమును ఉద్దీపింపజేయ దొడగిరి. ఆంగ్లప్రభుత్వప్రతిభ నూడగొట్టుటకు ప్రభుత్వవిధానములను ఖండించుటయే గాక, నాంగ్లనాగరక సాంప్రదాయములం దసూయఁ బురికొల్ప నగత్య మాయెను. అసూయాజనితమైన ఈవిద్వేషకప్రచారములో భారతీయులకు స్వదేశవిజ్ఞానమం దంతర్దృష్టియు నాదరణము నేర్పడి 1907 లగాయతు ప్రజలెల్ల రెఱింగిన జాతీయభావ మేర్పడినది. ఇది 1912 వఱకు వంగప్రేరితమై

యుండెను. ఆవల తిలకు బీసెంటమ్మల యాదర్శముల నంటి నడచెను. 1918 లగాయతు మహాత్మునితపఃప్రభావపు లేనీడల నాశ్రయించి చరించుచున్నది. కృష్ణారావుగారును వారిమిత్రులును తొల్లి వంగభావోద్దీపనంబున వంగాదర్శరాజితులై బాహ్యజీవనము సలుపుచు 1907 లో జాతీయవిద్యాలయప్రతిష్ఠాపన మాలోచించి క్రమముగ నద్దాని సిద్ధింపఁజేసిరి. ఆవల 1911 నుండి యాంధ్రోద్యమ మంగీకరించి పనిజేసిరి. 1917 ఆప్రాంతములలో కృష్ణారావుగారు బ్రహ్మసిద్ధాంతములను నౌపనిషద్ధముల జాడను - సంస్కృతసాంప్రదాయానుసరణమునను - బరీక్షించి 1918-19 లో విపులమగు ఖండన మొకదానిని రచించిరి. 19 నుండి గాంధీమతావలంబకులై కాంగ్రెసుతీర్మానముల ననుసరించి యుద్బోధించుచున్నను తొల్లింటి భావసంపూర్ణత గాని, యుదార వాగ్జాలోజ్జ్వలనము గాని ఇప్పుడు కృష్ణాపత్రికయందు గానరాదు. కృష్ణారావుగారు 1910 మొదలు నేఁటివరకు కృష్ణాపత్రికను స్వతంత్రముగ నిర్వహించుచున్నారు. వీ రాంధ్రు లయ్యును వీరిభావనిలయము మెత్తని పిన్నతనములో వంగరాజ్యమున నేర్పడి యచ్చటి లక్ష్యములతో నిండియుండెను. వంగదేశీయుల యుద్బోధనల నందికాని, కృష్ణుని రాసక్రీడల నాదరింపసాగిరి. మాడర్న్ రివ్యూ ఆర్య మున్నగు వంగీయ పత్రికా నేతృత్వమున కళలు కావ్యములు శిల్పములు మొదలగు వానినే గాక సర్వవిషయములఁ దిలకింపుచుండిరి. వంగ పట్టుల వైష్ణవసాంప్రదాయములం దిటీకల గురి కుదిరినట్లగపడును. ఇందుకు రవీంద్రుని కవితావిర్భావ మొక కారణమై యుండనోపును. కృష్ణాపత్రికలో నాంధ్ర రచకుల కెడమిచ్చిరి గాని, యాంధ్రుల నైజైన నభివృద్ధికి దేవలెనను దీక్షతో పనిసేయలేదు.

కృష్ణాపత్రిక వంగసాంప్రదాయముల తెలుగు పత్రిక. పత్రికయే గాక ప్రతిభాప్రాచుర్యసాధనము కూడ. రవీంద్రు డేభావములతో జగముల వెలుగొందెనో ఆభావములు తెలుఁగుదేశమునఁ బూర్వమునుండియు ననేకదేశీయతత్త్వములలో నిమిడియున్న సంగతి కృష్ణుఁడెఱుఁగును. కావ్యఘటనతులందు మసపోతనాదుల మించలేదని కూడ వీరి యనుభవమే. కాని కృష్ణాపత్రికలో వందలకొలది వ్యాసములు వంగచాతుర్యప్రవచనమున కుపయోగింపబడినను, ఆంధ్రశ్రీరీతులం దెంతవఱకు సిద్ధినొందిరో, ఎందునఁ దెలుఁగు వెనుకపడినదో యెందున ముందున్నదో ఒకనాడైన కృష్ణరాయడు నుడువలేదు. దివాకరాస్తమయసంజనిత సంధ్యారాగచిత్రదీప్తులలోగల కళాలేశమయినను కృష్ణుని భావప్రపంచమున జేరలేదు. కృష్ణారావుగా రాంగ్లపండితులు. వంగభక్తులు. పిన్నతనమున నాటి భావస్థిరములై యున్న తత్త్వములు అర్ధక్రైస్తవము లగు బ్రహ్మసామాజపువి. ఆంగ్లనాగరకసంపర్కోపాసనమువలన జాతిభ్రష్టులై నల్లదొరలై, యుభయసాంప్రదాయదూరులై క్రమ్మఱ నైజజాతీయత నొంద యత్నించు వంగదేశీయులు వీరి యాదర్శపురుషులు. కృష్ణారావుగారికేగాక వీరి మిత్రమండలియంతయు నిట్టి మనస్థితి గలవారే. కుమారస్వామిసిఫార్సుచే హైందవకళల నామోదించిరి. వంగవిమర్శకుల నేత్రములతో శాకుంతలలోని రసప్రపంచమును వీక్షింపదొడగిరి. ఇందుచేతనే వీరు జాతీయకళాశాలను స్థాపించినను జాతీయవిద్యాస్వభావస్వరూపముల నిర్ణయింపజాలకున్నారు.

కృష్ణాపత్రిక పట్టాభి సీతారామతత్త్వపూరితమై నిర్భయమగు ఖండనము స్థైర్యాహంకారములు గల్గియుండును. వారిభావముల బ్రకటించి వారిస్వరూపముల కనఁబఱచుటయే గాని దేశములోని ధీయుతులందఱుఁ జేరదీసి సాంఘిక రాజకీయపద్ధతులలో నొక ఆంధ్రసాంప్రదాయమును (School of thought) సృష్టింపరైరి. కృష్ణారావుగారు శోధకుఁడు. సాధకుఁడు. ఉపాసకుఁ డనియుఁ జెప్పదగును. కాని తన తొల్లిటివాఁడు లైన సమానుల నేదక్కు, శీలవిజ్ఞానభావవిభేదముల నానారూపులై తోఁచు చిన్నపెద్దల నొకచోఁగూర్చి - యాదరించి- పెద్దలఁ జేసి తమసాంప్రదాయానుక్రమ మేర్పరచుకొనలేదు. కృష్ణారావుగారు పట్టాభిసీతారామయ్యగారు ఆంధ్రుల భక్తివిశ్వాసములకుఁ బాత్రులైన, తెలుఁగునాయకు లయ్యును భక్తకోటిని శిష్యగణమును సంపాదించు "అభిగమ్యత" నొప్పకున్నారు. నాగేశ్వరరావుగారి యాంధ్రపత్రిక కొంతకాలము బొంబాయిలోను, ప్రస్తుతము చెన్నపురమునను ఉండి ఆంధ్రజాతీయవిజ్ఞానకూటమునకు దూరముగ నుండి కృష్ణాగోదావరీసలిలపోషితమేధావిభూతుల సహాయ్యసంపదల నొందకుండినను, దయోదారగుణములచే నభిగమ్యమై యాంధ్రత్వమున కాలవాలమై యొప్పుచున్నది. తెలుఁగుపత్రికలకు మకుటమువలె నలంకారమైన కృష్ణ యీపుణ్యమును నిజప్రతిభానుగుణముగ సంపాదించుకొనలేదు.

కృష్ణారావుగారు సత్యాన్వేషి. సహనము దయ సమత్వము సౌశీల్యము వ్రతదీక్ష అనుష్ఠానసిరతి గల మంచిబ్రాహ్మణుఁడు. వ్యక్తులగాని సంస్థలగాని ఖండించుచో దయార్ద్రులై పునరభివృద్ధి గోరుచు యుపలోకవార్తలలో సాత్వికమగు హాస్యవిమర్శనమును జేయునే కాని భావభేదమున నాజన్మవైరుధ్య మవలంబించు నిర్దయత వీరియం దగపడదు. పరగుణామోదము పరాభిప్రాయసహిష్ణుత పెదబాపయ్యగారి తరువాత వీరిసమకాలికులలో వీరియందే గోచరించును. ఈమంచికలన కృష్ణాపత్రికలో పెక్కు తెలుగు పిన్నలు తమభావములను గీతఘణతులను వెలిపుచ్చ గలిగిరి. అవకాశమిచ్చి తెలుగుతెలువుల మచ్చుదెలిపెనే గాని యభిమానించి తనప్రతిభచే వారిని అభివృద్ధికి దేలేదని మా విషాదము.

కృష్ణుని ప్రేమరంగమున విశ్వవ్యాప్తమయిన భౌతికప్రణయ మగ్రస్థాన మాక్రమించి - ప్రాచ్యావని - భారతభూమి - వంగదేశము ఆంధ్రజాతి-పట్టాభి-బందరు-తనసంసారము-తాను-క్రమక్షుత ప్రేమాస్పదములై యమరియుండును. ఇట్టి యాంతరంగ మలౌకికమై గౌరవవాస్పద మనుటకు సందియములేదు. కాని యీమనస్థితివల్ల పత్రిక స్థానికాంధ్రీయవ్యవహారములపట్ల కన్న భావప్రపంచమున నెక్కు డుపయుక్తమగుచున్నది. ఈలోపమే ఈపత్రికసుగుణ మని కూడఁ జెప్పవచ్చును.

కృష్ణునిదృష్టి భవిష్యత్కాలమును వీక్షించుచుండును. వీరి మానసము భవిష్యద్భావసౌధనిర్మాణానంద వీచికావిహారములం దూగుచుండును. భూతవర్తమానముల పరిజ్ఞానము జక్కఁగ గలదు. వర్తమాన పరిస్థితుల వర్ణించుటలో నసమానప్రజ్ఞావిశేషముల వ్యక్తపఱచును. కాని,

వానిలో జీవించి యనుభవించు సాధన మలవడలేదు. ఇందుచే వర్తమానస్వరూపములగు పట్టాభిగోపాలకృష్ణులవలె కృష్ణరాయఁడు మంత్రిపదవులకు కార్యదర్శిత్వమునకును తగుదారుల త్రొక్కఁజాలఁడు. దేశాదర్శములు కాలగర్భితమగు భావసామ్రాజ్యము నెంతకాల మాశ్రయించెనో అంతకాలము కృష్ణరాయని కృష్ణాపత్రిక అసమానలేఖినీప్రభావము గల్గియుండెను. తిలకు నిర్యాణముతో వీరివ్యాసరత్నములు మెఱుపుచెడ నారంభించినవి. గాంధి వర్తమాన పడుగడుగునఁ బరీక్షించి నడచు రాచతండేలు. కృష్ణరాయ లీయుద్యమము నంగీకరించినను పట్టాభి లౌకికమెలుకువల నాశ్రయించి నడచుటచే తనభావసంపూర్ణతకును నిరాఘాటలేఖినీప్రచారమునకును ఉచితమయిన సహజావకాశములఁ గలిగింపఁజాలకున్నారు.

సంఘసంస్కరణముపట్ల వీరియభిప్రాయములు కేల్కారు సిద్ధాంతముల ననుసరించి - కొంత సౌమ్యతను హైందవ ధర్మశాస్త్రానురూపమును బొందియున్నను, ఆచరణలోమాత్రము వీరొకరే నిశ్చలమైన సంఘసంస్కరణసిద్ధాంతానుష్ఠాత లని చెప్పవచ్చును. జాతీయోద్యమ మల్లికొనినకొలది నాంగ్లసాంప్రదాయానురూపమున వంగసంస్కర్తలచే నెలకొల్పబడిన సంస్కరణప్రణాళిక చాలఁటఱకు రూపుమాసినది. మఱియుఁ గాలప్రభావమున విద్యాధికులే ప్రబోధముల తక్కఁడుకులంబుల కొసఁగదలచిరో ఆప్రబోధములు విపరీతాహంకారవిషగర్భితములై యుదయించి తొల్లింటిసంస్కర్తల నాయకత్వమును త్రుంచివైచినవి. ఇందుననో ఎందుననో సంఘసంస్కరణము కృష్ణాపత్రికపురిటిగుణమైయుండ నీనాఁ డంతప్రాముఖ్యము వహింపకున్నది. సంస్కరణానుష్ఠానము సంస్కర్తలయం దాదరణమును కృష్ణయం దగపడును.

వేంకటరత్నంనాయుడుగారి విశ్వాంతఃకరుణయు నిర్గుణోపాసనయు కాలావకాశము కుదురని బ్రాహ్మణేతరాభిమానమని తేలినది. వీరేశలింగముగారి గద్యవిధాన మాంధ్రుల కుపకరించినను, వీరి సాంఘికవిమర్శనము లోతులేక సంప్రదాయాభిజ్ఞత లేక వంగాంగ్లవిదేశాదర్శపూరితమై - వైదికద్వేషకలుషితమై - రాగాహంకార మాలిన్యదూషితమై జాతీయోద్బోధవీధితులఁ జూడజాలక తెరగమ్మిపోయినది. బ్రహ్మసమాజములోనే హైందవసాంప్రదాయముల ప్రభావము హెచ్చెను. రామకృష్ణపరమహంస, అశ్వనీకుమారదత్తు, మున్నగు భక్తులయు రవీంద్రాదుల వైష్ణవసాంప్రదాయములయు ఆదర్శములు సాధనలు వంగరాజ్యము నాకర్షించుచున్నవి. స్వతంత్రముగనో, అనుకరణముననో మన కృష్ణాపత్రికకూడ హైందవమతసాంప్రదాయములందు గౌరవ మగపఱచుచున్నది. బాల్యమున బ్రహ్మద్వేషములో - పండితదూషణలో - పురాణేతిహాసతిరస్కారములో - మతసాంఘికాభిప్రాయ నిర్మూలనములో - నిరవధిగ - శూరత మించి చెండాడిన కృష్ణాపత్రిక - కాలమహిమచే వీనిఁ గౌరవించుటయే గాక వీనికన్నిటికి వైష్ణవసాంప్రదాయార్థములను భావవ్యంగ్యసంపత్తిని సంపాదించుచున్నది. భావ మెట్లున్నను చిరాభ్యస్తవిశ్వాసములు సంపూర్ణముగ రూపుమాయవు. కృష్ణారావుగారి పవిత్రసాధక సాధుజీవనము మాత్ర మీపత్రికలో ప్రతిఫలించియుండును.

ఇంతవరకు కృష్ణాపత్రికచరిత్ర - దానిగుణవిశేషములు - దాని సత్వము - యందలి వ్యాసరీతులు - పత్రికాధిపతిజీవితము - వారి యనుచరులు - దేశములోని భావప్రవాహములు - వానిని చలింపజేసిన మార్గములు - ఆంధ్రవిజ్ఞానమున కీపత్రిక యొనర్చిన యుపకారములు - పత్రికయందలి గుణదోషములు - వానికారణములు - విమర్శకబుద్ధితో వీలయినంత వినయముతో చిత్రించియున్నాను. ఒకవ్యక్తినిగాని సంస్థనుగాని విమర్శించి దానిరూపచిత్రణము గావించునపుడు వెలుగునీడల బరిగణింపకనంతయు తేజోరూపముగ నేరును శిల్పింప నేరరు. కాని నీడల సహేతుకముగ విచక్షణతో నిరూపింప బూనుటయే చిత్రకారుని భక్తిని సానుభూతిని ఔదార్యమును వెల్లడించును. నీబాహ్యగుణరూపలోపము లెవ్వియైనను కృష్ణా! నిన్ను ప్రేమించియే దీనిని రచించితిని. ఇక ముందు కేవల మాంధ్రభాషకు కృష్ణాపత్రిక యొనర్చిన యుపకారముల నుడివెదను.

వీరేశలింగముపంతులుగా రాంధ్రప్రబంధ పురాణాదులలో వాడబడు గద్యఫణతులు యమకాదిచిత్రలక్షితంబు లనియు, సామాన్యసందర్భప్రయోగానర్హము లనియు గుర్తించిరి. వీరికాలమునకు రాయవాచకము మున్నగు తేలిక తెలుగు గద్యపుస్తకములు దొరకలేదు. ప్రబంధాదులలోని తెలుగుసాధనలచే నాయన యనుపమాన రమణీయ గద్యరచనావైఖరుల నేర్పరచి - శాస్త్రములు సాహిత్యము మతము సంస్కరణము ప్రహసనములు - మున్నగువానిని రచించి సర్వసారస్వతప్రయత్నముల కుపయోగించిరి. కాని పంతులుగారు శాస్త్రాదులందు లోతుగ దిగకుండుటచే వీరి పరిభాష 1905 ఉగాయతు దేశములో బొడమిన సర్వతోముఖమైన భాషావిన్యాసమునకు జాలకుండెను. ఈ లోపమును వారించుటకు విజ్ఞానచంద్రికామండలి యొకప్రక్కను, ఆంధ్రపత్రిక లొకప్రక్కను, కృషిసేయ దొడగినవి. నిర్ణయసాగరముద్రాక్షరశాలవారి నిఘంటువులును, ఆప్టే సీతారామాచార్యులవారి నిఘంటువులను ఉపయోగపఱచుచుండిరి. ఇంతలో వంగసాహితీనిర్మాతలు తమతమ రచనలందనేక సంస్కృతజన్యాభాసపదముల నుపయోగించుచు నాంగ్లోపన్యాసఫణితులను పత్రికావిరచనామార్గముల ననుకరించురీతి ప్రాగల్భ్యములను వంగవచనరచనారీతుల నేర్పరచుచుండిరి. కృష్ణారావుగారు ఈపదవాక్యప్రయోగవైఖరిని దెలుగున సమర్చిరి. దిగుమతిలో, నితర వంగానువాదులవలె వాక్యరచనారీతు లంత విపరీతాంధ్రేతరమార్గముల జేసియుండకున్నను, కొంతకాలము "కృష్ణాపత్రిక తెలుగు" వింతగను దురవబోధముగను ఉండెను. రాజకీయపరిభాష మిక్కిలి పెరుగుచుండెను. కృష్ణరాయనిభాష 1906—1918 వఱకు తెలుగుదేశపు నాయకమణులైన బందరుదేశభక్తుల వ్యాసోపన్యాసముల కుపయోగింపబడినందున నిదియె ఇప్పటివరకును జనసామాన్యమునకు బాహ్యజీవనభావవాహకమై యున్నది. కాని కాలక్రమమున కృష్ణ డాంధ్రసంస్కృతసాహిత్యగ్రంథముల నవలోకించియు రాజమహేంద్రవరము గుంటూరుపుర ప్రముఖులును ఆంధ్రపత్రికయందును వాడబడు సులలితాంధ్రవాక్య ప్రయోగానుసారమునను, తన వాక్యరచనను వంగాంగ్ల సాంప్రదాయములనుండి తగ్గించి తెలుగుతెఱవుల నలవరచియున్నాడు. ఏమైనను

నవీనజాతీయజీవనమున విలసిల్లు వాడుకతెలుఁగు కృష్ణరాయకృత మని యెంచి "యంజలిసేయక తీర దేరికిన్."

కృష్ణారావుగారు బంగాళాకవీంద్రులయొక్కయు తత్త్వవేత్తల యొక్కయు గాథలను వ్యాసములను తెలిగించి తెలుపుచు నాంధ్రరగ కులకు నూతనమార్గముల జూపిరి. వీరి భాషాంతరీకరణములు కొన్ని సందర్భములలో చక్కని యాంధ్రభాషావ్యక్తిచే నొప్పుచు ప్రధాన వ్యాసముల కన్న నెక్కువ యాంధ్రస్వతంత్రకృతులుగ నగపడును. తరువాత యమలోకవార్తలు మున్నగు హాస్యప్రధానసంఘావలోకన ములలో వాడుక గ్రామ్యతెలుగుపద్ధతుల నవలంబించి పర్లాకిమిడివారి వలె సంస్కృతభూయిష్ఠవాక్యములను వెక్కిరించినట్లు గ్రామ్యతోకను తగిలింపక- విశుద్ధగ్రామ్యప్రయోగమార్గముల నలవరచికొనిరి. కృష్ణారావు గారు గిడుగు రామమూర్తి గారి సార్వత్రిక గ్రామ్యభాషాప్రయోగమునకు వ్యతిరేకముగ నభిప్రాయపడినను- గాంభీర్యవాక్యరచనాప్రౌఢు లయ్యును గ్రామ్య ము ఃతరీతుల సందర్భానుసారముగ నుపయోగించు విచక్షణ గల్గి యున్నారు. కృష్ణాపత్రికలో నానావిషయములఁగూర్చి ప్రచురింపబడు వ్యాసములు కృష్ణరాయని గాంభీర్యభాషాక్రమముననో గ్రామ్యప్రయో గానుసారముననో వ్రాయఁబడుచున్నవి.

కృష్ణారావుగారు తెలుగుబాసల కొలుచు పిన్నల కనేకులకు స్థలావకాశ మిచ్చి ప్రోత్సాహపరచి భావగీతము నాటకసాహిత్య విమర్శనము మున్నగు నవీనవాణీవిలాసములకు తమపత్రిక నుపకరింప జేసిరి. వీరు 1916-17 లో దేశీయపదముల తెరంగులు సొగస్వతమున జేర్పదగు నను ఆందోళన కిచ్చిన యవకాశము వీరి సమభావమును వెల్లడించుచున్నది. కృష్ణారావుగా రిటీవల కొన్ని సంస్కృతకావ్య నాటకములగూర్చి వ్యాసములను ఉపన్యాసములను రచించి ప్రచురించి యున్నారు. వీరి రూపకల్పనము లోకవిదితము.

కృష్ణారావుగారు ఆంధ్రజాతీయోద్యమనిర్మాతలలో నొకరు. ఉపన్యాసవ్యాసరచనారీతులకు తండ్రి. సాంఘిక రాజకీయ కళా సారస్వతముల తెరం గాంధ్రులకు దెలుపుచు దేశోపకారారంభదీక్షితు లై- తమప్రతిభావిశేషమునకన్న- భాషాసేవకన్న- పాండితీగరిమకన్న తమ నిర్దుష్ట నిర్మలచారిత్రప్రకాశమునను భావస్థైర్యమునను వ్రతాను ష్ఠాన నియమమునను - బందరుదేశభక్తులలోనే కాక, ఆంధ్రమాతృ సంతాన మండలిలో మిన్నలని గారవింపదగు ధీరులు. వీరికి పరమేశ్వ రుడు చిరాయురారోగ్య సౌభాగ్యముల నొసంగి ప్రోచుగావుత! వీరు వంగప్రతిభావిశేషముల వెల్లడించిన ఫూనికతో నాంధ్రుల సహజ ప్రతిభను గూడ నలుదెసల వెదజల్లుదురు గాక!

# అశ్రుతర్పణము

చిట్టావూరి కామేశ్వరరావు గారు, బి. ఏ.

నవ్వుపై నవ్వు తొలకాడఁ । బువ్వగుత్తి
వోలె నలరిన భువనైక । మోహనాంగి
పరమ సుకుమారి నన్నెడఁ । బాసి పోయె
ఎందుఁ జనియె? నే నామెకై । యెందుఁ బోదు
సకియ శారద శర్వరీ । చంద్రరేఖ
యందు సున్నిగ్ధముగ లీన । మయ్యెనేమొ
సిద్ధసంకల్పులకు సిద్ధియై । చెలఁగు నేమొ
నీలజలరాశి కల్లోల । లీలలందుఁ
దన్మయత్వంబున మెలఁగఁ । దలఁచె నేమొ.
దివ్యసుందరి యెటకేగెఁ । దెలియఁబడదు

అతుల శీతల నీహార । మందు డాఁగి
సొగసుఁ బ్రసరించు । ప్రత్యూష సూర్యకాంతి
కెమరు చూచు నేమొ? మనోజ్ఞ । వదనులాంగి
సాంధ్య తారాపథంబున । శాంతి విభవ
మేలు చున్నదేమొ మెలఁగు । నేమొ మెలఁత
యమర ప్రేమైక స్వప్నరం । గాలయమున
లేదు!—లేదు!—ముదిత కిది । కాదు తావు!-
ఏది యకలంకగుణపూర్ణ । మేది పుణ్య
మయము? సుపవిత్ర మేది! యా । మహిత నిర్గు
ణాత్మయందు సుందరి లీన । మయ్యె, నిజము!

# గజ్నీ మహమూదు - ఆకాలపు విద్యాభివృద్ధి

గోవిందరాజు వేంకట కృష్ణారావు గారు

గజ్నీ మహమూదు హిందూదేశముమీఁదికనేకసారులు దండెత్తివచ్చి, దేవాలయములను మందిరములను పట్టణములను నాశనముచేసి, యసంఖ్యధనమును దోచుకొనిపోయిన తురుష్కులలో నగ్రగణ్యుఁడని చరిత్రలలో గానవచ్చును. గజ్నీమహమూదు పేరు వినినతోడనే, ఆతని దుర్గుణములనే మనము దలంచెదము. ఇందులకు కారణము లేకపోలేదు. హిందూదేశమందు రాజ్యస్థాపనము గావించుటకు మహమూదు యత్నములు సల్పియుండఁబోలేదు. అనేక పర్యాయములు దండయాత్రలు సల్పెను. ధనము కొల్లగొట్టెను. అంతేగాని యిచ్చట నివాసమేర్పరచుకొని తన ప్రతిభ వెదజల్లుట కిష్టపడలేదు.

విగ్రహధ్వంసకుఁడని ప్రసిద్ధికెక్కినప్పటికిని మహమూదు కొక సద్గుణము గలదు. ఈతడు గొప్ప విద్యాభిమాని. పండితులకు కామధేనువు. స్వమతాభిమానపు పట్టుదలచే నితరమతములందుగల విద్వాంసులను, పండితులను సత్కరింపలేదు. ముఖ్యనగరమగు గజ్నీపట్టణమందు దన దాతృత్వములో చాలభాగము వ్యయపరచెను. అందుచే యతని సద్గుణములకంటె దుర్గుణములే మన కెక్కువగ దెలియును.

ఇతని గురించి అనేక కథలు గలవు. హామ్దుల్లా ముస్తఫీయను కవీశ్వరుఁడీ క్రింది కథను తన గ్రంథమగు "తారిఖీగుజీడా" యందు వ్రాసెను.

"మహమూద్ వికారస్వరూపి. ఒకదినము యుద్ధమునందు తన ప్రతిబింబము చూచుకొని దుఃఖితుఁడయ్యెను. కొంతసేపటికి మంత్రివచ్చి 'దేవా! అట్లు విచారించుచు గూర్చుంటి రేల?' యని ప్రశ్నించెను. మహమూదు 'మంత్రీ! సాధారణముగ ప్రపంచమందు రాజముఖావలోకనము గావించిన ప్రజ లుత్సాహవంతు లయ్యెదరు గదా! కాని నా ముఖవైఖరి గాంచిన ప్రజలు భీతచిత్తులై పారిపోయెద రేల?' యని విచారించుచుంటి ననెను. వజీరు విని 'దేవా! ప్రజలు మిమ్ముగాంచుట యరుదు. కాని మీ సద్గుణంబులు ప్రజల నందఱిని నాకర్షించుచుండు నని' ప్రత్యుత్తర మిచ్చెను."

మహమూదు ప్రతివత్సరము కవీశ్వరులకును, పండితులకును నాల్గులక్షల దీనారములనిచ్చెడివాఁడు. ఆతని విద్యాభిరుచి పండితుల సత్కరించుట మాత్రమే గాదు. శాశ్వతముగ విద్యాభివృద్ధికిగాను అనేక పాఠశాలల నిర్మించెను. నల్లరాయితోడను చలువరాయి తోడను కట్టబడి, తివాచీలతోను మైనపువత్తిగ్లోబులతోను బంగారు వెండి భూషణములతోను నలంకరింపబడి, 'స్వర్గపువధువ'ని కీర్తిగన్న మసీదు సామీప్యమున మహమూదు విశ్వవిద్యాలయ మొకటి స్థాపించెను. ఆ విద్యాలయమందు వివిధభాషా గ్రంథములు గలవు. సృష్టివైచిత్ర్యము జూపు వస్తుప్రదర్శనశాలగలదు. ఈ విద్యాలయపు సంరక్షణ నిమిత్తము చాల ధనము ఖర్చుపెట్టెను. బాలురకు సకల విద్యల నేర్పుటకు యుపాధ్యాయుల నియమించి వారి జీవనోపాధికి తగు నేర్పాటుల గావించెను.

విశ్వవిద్యాలయ స్థాపనమును - సాహిత్యప్రోత్సాహమును, విద్వాంసుల సత్కారమును - మహమూదు దోపిడివలన సంపాదించిన యధర్మపు ధనముకొఱకు గావించిన ప్రాయశ్చిత్తముగ గన్పట్టును. కొలది కాలములో గజ్నీనగరము కవులకును వేదాంతులకును శాస్త్రజ్ఞులకును నాలవాలమై, మసీదులతో గొప్పమేడలతో సరోవరములతో విరాజిల్లుచుండెను. ఆ నగరము కీర్తియందు మధ్యయుగములలో యూరోపాదేశమందలి బొలోనా నగరముతోగాని పాదుయా నగరముతోగాని తులదూగుచుండెను.

సుల్తాను సత్కారము నొందిన విద్వాంసులలో ఉట్బి యను నతడు శబక్తజీను వంశ చారిత్రమును వ్రాసెను. పారసీక దేశీయుఁడగు ఉజరీరాజీ చిన్ని స్తోత్రపాఠ మొనర్చినందులకు సుల్తానతనికి 14,000 దీనారముల నిచ్చెను. ఖురాసానుదేశజుఁడగు అసాదీతుసీ గొప్పకవి. ఫర్దౌసి గురువు. షానామా వ్రాయుమని సుల్తా ననేకపర్యాయము లితని నడిగెను! కాని వార్ధక్యదశయందుండుటచే వ్రాయ లేననియెను. గజ్నీనుండి ఫర్దౌసి పారిపోయినపుడు షానామాలో 4000 ద్విపదలను పూర్తిచేయుమని సుల్తాను

అసాదీతుసీని వేడుకొనెను. బాల్క్ దేశపు లీకునుడును సుప్రసిద్ధ కవీశ్వరుడును హాస్యకారియు నగు మునుచిహిర్ సుల్తానాస్థానమం దుండెను. అక్కాలమందలి కవీశ్వరులలో గొప్పవాడును వేదాంతియు శాస్త్రజ్ఞుడును వివిధభాషా పరిచితుడు నైన ఉన్సూరి, సుల్తాను స్థాపించిన విశ్వవిద్యాలయమందు కృషిసల్పెను. ఇతని గురించి చిత్రకథ యొకటి గలదు.

“ఒకరాత్రి సుల్తాను మద్యపానలోలుండై, యొడలెఱుంగక తన పట్టపుదేవి శిఖను కోసివైచెను. మరునటి దినము ప్రాతఃకాలమున తాను యుక్తాయుక్త వివేచన జ్ఞానములేక చేసిన పనికి విచారించుచు, యేమియు దోఁచక వెఱ్ఱివానివలె నిటునటు పచారు చేయుచుండెను. నౌకరులు యజమాని దగ్గరకు వెళ్లుటకు భయపడుచుండిరి. అప్పుడు ఉన్సూరి సుల్తానును సమీపించి రెండు పద్యములను చదివెను. సుల్తాను చాల హర్షించి అనేకనగలు పారితోషికముగ నిచ్చెను. తరువాత వారిద్దరును మాట్లాడుకొనుచు కాలక్షేపమును జేసిరి.”

వీరేగాక సాహిత్యమందు కీర్తిగన్న ఫర్దాసికూడ సుల్తానుని ఆస్థానమందుండి షానామా యను గ్రంథము రచించెను. ఫర్దాసి మరణమును, అతను మహమూదు యాస్థానమున నియమింపబడుటయు బహు విచిత్రముగ సంభవించెను. అదియెట్లనగా

“ప్రథమదినములందు ఫర్దాసికి పద్యరచనయందు బహుప్రీతి. ఒకానొక సమయమున నితని నొక దుర్మార్గుడు దౌర్జన్యము గావింపగా మహమూదునొద్దకు వెళ్లి తానను భవించిన కష్టములు చెప్పుకొనవలయునని గజ్నీనగరము వెళ్లెను. గజ్నీపట్టణ సామీప్యమునకు వచ్చి అచ్చటనున్న యుద్యానవనమందు ముగ్గురు పురుషులు సంభాషించుట గాంచెను. తన కార్యసాఫల్యమునకు వారు సహాయభూతులు గావచ్చునని దలంచి వారితో ఫర్దాసి మాట్లాడుటకు వెళ్లెను. వారితనిని వీక్షించి ‘అయ్యా! మేము సుల్తాను సంస్థాన కవీశ్వరులము. మాతో మాట్లాడ నపేక్షించువారు కవీశ్వరులై యుండవలయును. లేకున్న మేము మాట్లాడము మాతో సంభాషింప గోరువారు మేము చేయు పరీక్షకు పాత్రులు గావలయును. మేము ముగ్గురము వరుసగా మూడు పాదములు చెప్పెదము. మీరు నాల్గవపాదము ముగింపవలయు’ నని చెప్పిరి ఫర్దాసి యట్లే యని సమ్మతించి జయము గాంచెను. అప్పుడు వారతనిని తమలో నొక్కనిగ జూచుకొని గజ్నీనగరమున కే పనిమీదవచ్చెనో దెలిసికొని, సుల్తాను కృపచే కార్యసిద్ధి నొందజేసిరి. మహమూదు ఫర్దాసిని షానామా వ్రాయుమని ప్రోత్సహించెను. ప్రథమమున వేయిద్విపదల వ్రాసి సుల్తానుకు చదివి వినిపింప నాతడు సంతోషించి, వేయిదీనారముల బహుమాన మొసంగెను. ఫర్దాసి కొన్ని నెలలకు, 60,000 ద్విపదలతో గ్రంథము ముగించెను. సుల్తాను తనకు 60,000 దీనారముల నిచ్చునని యాశతో నుండెను. కాని తానొకటి దలచిన దైవమొకటి దలచు గదా! తన యాశ నిరాశమైనందుకు ఫర్దాసి కుపితుడై నలుబది పద్యములు సుల్తానును దూషించుచు వ్రాసి, వానిని షానామాలో చేర్చి, సుల్తాను దండించునను భయముతో టస్ నగరమునకు పారిపోయెను.

ఒకదినము సుల్తాను వేటనుండి తిరిగివచ్చుచు ఫర్దాసిచే కడపట వ్రాయబడిన 40 పద్యములను హసన్ మైనంది యను కవీశ్వరుడు పఠించుచుండగా వినెను. సుల్తాను కొంతతడవు పద్యములు విని వ్రాసినకవి యెవ్వరని ప్రశ్నించెను. కవి ఫర్దాసి యని దెలిసికొని, తనదుర్నడతకు చాల విచారించి, కొంతమంది మనుష్యుల బిలిచి వారిని 60,000 దీనారముల దీసికొనివెళ్లి కవిని క్షమాపణ యడుగవలసిన దని యుత్తరువు గావించెను. సుల్తాను పంపిన బహుమానము కొంత యాలస్యముగ వచ్చెను. ఫర్దాసి మరణించెను. అతని కొక కుమార్తె గలదు. సుల్తాను పంపిన ధనమామెకు సమర్పింపగ నా కీధన మక్కఱలేదు. నాజీవిత కాలమునకు గావలసిన ధనము నాయొద్దగలదని ధీరముగ వాకొనెను.”

పులిపిల్ల పులిపిల్ల యనిపించును గాని మేకపిల్ల యనిపించునా? సుల్తానాధనముతో ‘టస్’ నగర సమీపమున నొక సత్రమును గట్టించెను.

పండితుల నౌదార్యముతో సత్కరించుటయే గాక ఒకానొకసమయమున మహమూదు రణోత్సాహము కన్న కూడ విద్యాభిరుచియే తనకు మెండుగ గలదని నిరూపించెను. 1023 సంవత్సరమున గ్వాలియరు కోటను మహమూదు ముట్టడించెను. కోట కధిపతి యగు నందరాయడు 300 యేనుగులను మావటీలు లేకుండ తురుష్కులు పట్టుకొనుటకు విడిచిపెట్టెను. కాని ఫెరిస్తా నీ విషయమున వేరొక విధమున వ్రాసెను. ఏనుగులకు మదద్రవ్యముల బెట్టి, సుల్తాను సేనలు ‘పట్టుకొనగలవో

లేవో యని పరీక్షించుటకై నందరాయడు పంపె ననియు, ఏనుగులతోపాటు బహుమానములు కొన్ని పంపెననియును ఫెరిస్తా దెల్పుచున్నాడు. ఏది యెట్లున్నను సుల్తా నా సమయమున నందరాయడు పంపినబహుమాన పూర్వక మగు పద్యములచే సంతృప్తు డయ్యె నని స్పష్టపడుచున్నది. తన యాస్థానమందున్న హైందవ, అరబ్బీ, పారసీక కవులచే యెక్కువ పొగడ్తనొందిన నందరాయని పద్యములకు సుల్తాను సంతోషించి అతనికి కలింజర్ కోటతో 15 కోటల బహుమాన మిచ్చెను. హిందూదేశ చరిత్రలో నీ దృష్టాంతము చాల నపూర్వమైనది. సాహిత్యకవిత్వ జయమున కిది చరిత్రాత్మక మగు ముఖ్యాంశముగ పరిగణింపవలయును.

దోపిడికి, క్రూరత్వమునకు ప్రసిద్ధిగన్న మహమూదు యెంత గొప్ప విద్యాభిమానియో పాఠకు లూహించెదరు గాక !

# జాబిల్లి వెలుగులు

అడవి బాపిరాజు గారు, బి. ఏ.

I

**పతీపుత్రులు.—**

పనికిఁబోవలె నంచు ప్రక్కపై లేవ
సిద్ధమై యుండంగ చేపయ్యె పాలు
గుప్పిట్లు ముడిచికొని కులుకునిద్దురలో
పనసపండుతోనల బాబు పకుకొనెను
పొంగివచ్చెను ప్రేమ ముద్దుపెట్టంగ
గుండ్రని కన్నులు గోముగాఁ దెరచె
ఉబుకు నావక్షంబు నొక్కింతఁ దగుల
నావులించుచు లేచె నపుడు నాతండ్రి.
చిరుచేతులున్ జాచె చిట్టిపాదములు
చటుకున జ్ఞప్తిమై స్తన్యంబుఁ ద్రావ
మొదలుపెట్టెను. నేను మూర్ధంబు తడుమ
బాటప్రక్కదిగుడు బావిగలచోట
పొంతఁ డొక్కరుఁ డాగి పచనంబు చేయ
మెలికల చుట్టుచు మింటిపై కెగసి
మాయమౌ పొగరీతి మరలె చీకట్లు
నీలంపు వెలుగులు నింగి కప్పినవి
నిద్ర మేల్కాన దింక నింట చిరుగాలి
తరుకాండముల మత్తు తరలి పోలేదు
కాకముల బాకాలు నేకడనొ తోచె
అరుణరాగంబంత నలమె పూర్వమున
ప్రక్కలోనున్న నా బాబు పాల్దాగివు
కంఠమున హారముల్ గలగలలాడ
బూరిబుగ్గలు కదల బుణుకుచో పాలు
హృదయంబు సంతోష మినుమడించింది
రత్నగర్భగల ధనరాసులే వద్దు
పక్కలో నాచిన్న బాబున్నయెడల

II

**బంగారుతండ్రి.—**

నాబాబు బంగారు తండ్రమ్మా
సూర్యుం డెట్టని మొండమ్మా
నాబాబు బొజ్జలో వరహాలు
దానిమ్మలో గింజ తరహాలె
నాబాబు బుగ్గలు పాలమ్మా
మల్లెలు సున్నపు పూలమ్మా
నాబాబుకన్నులు నీలాలు
కొండపై చుక్కలు పేలాలు
నాబాబు మాటలు పాటమ్మా
యెద్దుల గంటలు వోటమ్మా
నాబాబు బువ్వలు రుచు లమ్మా
రసాలఫలములు పులు సమ్మా
నాబాబు నిద్దుర జోలమ్మా
అందరి పిల్లలు గోలమ్మా
నాబాబు బంగారు తండ్రమ్మా
సూర్యుం డెట్టని బండమ్మా.

III

**అసంతృప్తి.—**

చాలు వర్ష ఋతువు వాన సాలుపోడవు,
పవలు వెలుగు విడు ప్రచండ భానుకాంతి
చాలు దినము పొడవు, ప్రేమ సఖియ! నిన్ను,
సతతమున్ జూచిన నాకు చాలదేల?

Sarojini Devi on the rostrum



శ్రీమతి సరోజినిదేవి యుపన్యసించు చుండుట

Sry T Prakasam on the rostrum



శ్రీయుత టి. ప్రకాశం పంతులు గారు

Chairman, Reception Committee, reading his Address



కాంగ్రెసు ఆహ్వాన సంఘాధ్యక్షుడు తన యుపన్యాసమును చదువుట

Sry. C. Rajagopalachari on the rostrum



శ్రీయుత సి. రాజగోపాలాచార్యులుగా రుపన్యసించు చుండుట

NATIONAL VOLUNTEER'S GATHERING



స్వచ్ఛందసేవకుల దళము — కాశీ విశ్వవిద్యాలయము

# శాసనములు — తటాక వాఙ్మయము

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

పూర్వము ప్రజలలో ధర్మకార్య ప్రవృత్తి విశేషముగ నుండినట్లు తెలుపు శాసనములు మన తెలుఁగుదేశమునఁ జాలఁ గలవు. ఈ శాసనములు శిలలమీఁదనో రాగిరేకులమీఁదనో చెక్కఁబడుచుండెడివి. తెలుఁగుదేశమునఁ గానవచ్చు శిలాశాసనముల తామ్రశాసనములవలననే పూర్వపు మనదేశచారిత్రము తెలిసికొనుటకు ఇప్పుడు వీలు కలుగుచున్నది. శిలాశాసనములుగాని-తామ్రశాసనములుగాని-సాధారణముగ శాసనములన్నియు దానధర్మములను దెలుపుచుండును. తామ్రశాసనములు బ్రాహ్మణుల కొసంగిన దానధర్మములను దెలుపుచుండును. అవి చాల భాగము సంస్కృతములో నుండును. శిలాశాసనములు కొన్ని సంస్కృతభాషలోను మఱికొన్ని తెలుఁగుభాషలోను వ్రాయఁబడి దేవాలయముల కొసఁగఁబడిన దానములను తెలుపును.

సంస్కృతమున చెప్పఁబడినను తెలుఁగున చెప్పఁబడినను శాసన గ్రంథమంతయు నొక ప్రత్యేక వాఙ్మయమని ప్రవచింపవచ్చును. సంస్కృతమున చెప్పఁబడిన శాసనములలోఁ గొన్ని కొన్ని మహాకావ్యములకుఁ దీసిపోక, శబ్దాలంకారములతోను అర్థాలంకారములతోను అద్భుతములైన వర్ణనములతోను ఒప్పుచు హృదయంగమముగ నున్నవి. ఇట్టి చక్కని శాసనములను ఓరుగంటి కాకతీయుల కాలమునను, కొండవీటిరెడ్ల కాలమునను, విజయనగరపు కర్ణాటుల కాలమునను గూడఁ జూడవచ్చును.

ఇఁక తెలుఁగునఁ జెప్పఁబడిన శాసనములలో నైతము చక్కని పద్యములు కలవు. కొన్ని కొన్ని తెలుఁగు శాసనములు సంపూర్ణముగ పద్యములతో నిండి తెలుఁగు ప్రబంధములను మఱపింపఁజాలియున్నవి. శాసనములందలి తెలుఁగుపద్యము లెట్లున్నవో చూపుటకుఁ గొన్ని యుదాహరణముల నిచట నొసంగుచున్నాఁడను.

ఉ. శ్రీమదనూనదానజల ♦ సేవకుఁ జొంచక చైత్రయము మత్తుఁడ
స్తోమనినాదము న్వినుచు ♦ నూరెల సెప్పుడుఁ బ్రస్తుతించు సి
ద్ధామరకోటికి న్వరదుఁ ♦ డైన గణేశుఁడు సుస్థిరస్థితిం
గామసమానమూర్తి యగు ♦ గాటయ కీవుత మిష్టసంపదల్.

క. చరణసరోరుహరాగ
స్ఫురణ న్మహిషుని శిరంబు ♦ వొలుపుగ సంధ్యా
భ్రరుచి నొనయ మీఱిన స
త్కరుణాన్విత దుర్గి వరము ♦ గాటయ కొసఁగున్.

క. ఉరగేంద్ర దిగ్గజములకుఁ
బరమోత్సాహముగ నాత♦పత్రము వోలెన్
ధరె యెత్తిన కిరి వరదుఁడు
హరి గాటయ కీవుతను ద♦యామతి శుభముల్.

—గణపతిదేవుని ఉపరపల్లిశాసనము

మ. సకలాధీశ నతోత్తమాంగమణిభూ♦షారమ్యపాదాబ్జుఁ డా
టకనారాయణు భానువంశనృపమూ♦ర్ధారత్న శిష్టేష్టబం
ధుకవీంద్ర ద్విజరక్షుఁ గాశ్యపసుగో♦త్రుం బొటకవ్రాతపు
త్రకు మాయోపిలిసిద్ధిఁ జెప్పఁదగు ను♦ద్యద్దండ గోపాలునిన్.

—ఓపిలిసిద్ధి శాణిదనశాసనము

శా. భారద్వాజ పవిత్రగోత్రుఁడు జగ♦త్ప్రఖ్యాతిగాఁ జెట్టెఁ బు
ణ్యారంభుం డొరిగంటివల్లభుఁడు ద♦త్తామాత్యసోముండు త
త్పారామప్రముఖోల్ల సత్ప్రకటు పం♦చారామ తీర్థంబులన్
సారాఖండ దిశా ప్రదీపకము లా♦చంద్రార్క తారంబుగాన్.

—ఎపి. రిపో. ౧౯౧౭. నెం. ౪౦.

శాసనములలో నిట్టి పద్యము లనేకము లున్నవి. పై పద్యములలోని ఎత్తుగీటు గల పదములను రూపములను ఆంధ్రభాషాభిమానులైన పండితులు గమనింతురు. గాక! ఇంతవఱకు గవర్నమెంటువారు నకలెత్తిన శాసనము లన్నియుఁ బ్రకటింపఁబడుచో నిట్టి భాషావైచిత్ర్యము లనేకము బయలుపడును. ఇంతవఱకు మన తెలుఁగుదేశమునందలి శాసనములు సంపూర్ణముగఁ బ్రకటింపఁబడ లేదు.

శాసనములలో దేవాలయముల కొసఁగిన దానములను గుఱించి చెప్పునవియేగాక మఱియొక రకము శాసనములు కూడఁ గలవు. అవి తటాక శాసనములు. అనఁగా తటాక ప్రతిష్ఠ చేసినపుడో, లేక యువిపాతయు

యుండగా వాటిని భాగు చేయించినపుడో వేసిన శాసనములు. ఇట్టి తటాక శాసనములందుఁ గానవచ్చు పద్యములకే 'తటాక వాఙ్మయ' మని సంజ్ఞ యుంచితిని. వాటినే యిందు పొందు పఱుచుచున్నాఁడను.

ఆంధ్రదేశమునఁ దటాక శాసనములు పెక్కు లున్నను వెల్లడి యైనంతవఱకు సరసమైనట్టియు, అల్లిక జిగిబిగి కలిగినట్టియు పద్యములు రెండు మూడు శాసనములలో మాత్రము కలవు. వీటిలో నొకటి రెండు శ్రీనాథకృతులు. శృంగారనైషధము, భీమేశ్వర పురాణము, కాశీఖండము మొదలగు సద్గ్రంథములను రచియించి, కవిసార్వభౌముఁ డని పేరెన్నికఁ గన్న శ్రీనాథుఁడు ఆంధ్రలోకమునకుఁ దెలియనివాఁడు కాఁడు. ఈతఁడు కొండవీటిని బరిపాలించిన పెదకోమటి వేమారెడ్డి (క్రీ. శ. ౧౪౦౦-౧౪౨౦) యొద్ద విద్యాధికారిగ నుండెను. ఈ కోమటి వేమారెడ్డి కుమారగిరి భూపాలుని యనంతరము రాజ్యమునకు వచ్చెను. పెదకోమటి వేమారెడ్డి యొసఁగిన తామ్రదానశాసనములు శ్రీనాథ విరచితములే.

పెదకోమటి వేమారెడ్డి భార్యయు, ధరణికోట గన్నమనాయనికూఁతురు, నైన సూరాంబ సంతానసాగర మను పెద్దచెఱువును త్రవ్వించి, దానికి ౧౩౩౧-వ శకవత్సరమునకు సరియైన విరోధిసంవత్సర ఫాల్గుణ బ ౨ శుక్రవారము ప్రతిష్ఠ యొనర్చెను. ఏతత్తటాక ప్రతిష్ఠా సందర్భమున వేసిన శాసనమున* శ్రీనాథకవి సార్వభౌముఁ డీ క్రిందిపద్యములను జెప్పెను.

సీ. శాకాబ్దములు సహస్రమును మున్నూటను
ప్పదియొక్కఁడును నైన ♦ భవ్యసంఖ్య
వఱలు విరోధిసం♦వత్సరంబున ఫాల్గు
నంబున బహుళప♦క్షంబు విదియ
శుక్రవారంబున ♦ శుభముహూర్తంబున
శ్రీధాన్యవాటీపు♦రాధి పతియుఁ
గృష్ణవేణ్ణాజల♦క్రీడావినోదుండు
నగు గన్న భూపాలు ♦ ననుఁగుఁ బుత్త్రి
గీ. వీరనారాయణుండు వేమ♦విభునిదేవి
భూరిసద్గుణ నికురుంబ ♦ సూరమాంబ
జగము వినుతింప సంతాన♦సాగరాఖ్య
వరతటాక ప్రతిష్ఠోత్స♦వం బొనర్చె.

సీ. జాహ్నవీయమునాది ♦ సకలపావననదీ
విమలతీర్థాంభః ప♦విత్రితంబు
సవిధదేశస్థాటు ♦ శివమౌళి బాలేందు
కామినీ సంఫుల్ల ♦ కైరవంబు
బహుమహాపరివాహ ♦ పాథోభరఘ్నన
ఘుమఘుమాయిత దిశా ♦ గోళకంబు
జలసారిణీసేక ♦ సంవర్ధితానేక
వనివనీతాధ్వగా♦ధ్వశ్రమంబు
గీ. బలవదురు మత్స్యకచ్ఛప ♦ ఢులికుళీర
తిమితిమింగిల విక్రమ ♦ క్రమవిహార
తరళతర తుంగ భంగక♦దంబ చుంబి
తాభ్రవీధి సంతాన మ♦హాపయోధి.

సీ. కపటసూకరమైన ♦ కైటభాసురవైరి
ఖురపుటంబులఁ బరి♦క్షుణ్ణమయ్యె
రఘుకులోద్వహు ధను♦ర్యంత్రముక్తమైన
చిచ్చుఱమ్ములవేఁడి ♦ జేవఁదఱిగె
గుంభసంభవుని హ♦స్తాంభోరుహంబున
నాపోసనంబయి ♦ ప్రాసనమందెఁ
బాషాణములనచ్చ ♦ భల్లగోలాంగూల
కపియూథములచేతఁ ♦ గట్టువడియె
గీ. వనధియేభంగి సరివచ్చు ♦ ననఁగవచ్చు
శారసాతలగంభీర ♦ వారియగుచు
నపగతాపాయ మగుచు శో♦భాఢ్యమగుచు
ననుపమంబైన సంతాన ♦ వనధితోడ.

ఈ సంతానవనధికి నీరువచ్చుటకై పెదకోమటి వేమారెడ్డి కొడుకయిన రాచవేమారెడ్డి (క్రీ.శ.౧౪౨౦-౧౪౧౪) జగనొబ్బగండకాలువ యనుపేర నొక కాలువ త్రవ్వించెనని యీ క్రింది శాసనము తెలుపుచున్నది. ఇదియు శ్రీనాథకృతియే. ఇది ఫిరంగిపురమునకంటె యున్న అమీనాబాదులో కలదు.

సీ. శాకాబ్దములు సహస్రంబును మున్నూట
ముప్పదియేడును ♦ నొప్పుమిగుల
మహనీయమైన మ♦న్మథవత్సరంబున
మఘమాసమునఁ బూర్ణి♦మాదినమున
హేమాద్రిదానచిం♦తామణి యరిరాయ
బసవశంకరుఁ డాజి ♦ ఫల్గుణుండు

* ఈ శాసనము గుంటూరుజిల్లా, సత్తెనపల్లి తాలూకా ఫిరంగిపురములో వీరభద్రస్వామివారి యాలయమున కెదుట శిలాస్తంభముమీఁద నున్నది. అందువలన దీనిని ఫిరంగిపురము శాసనమందురు.

సమదారిరాయవే♦శ్యాభుజంగుండువే
మయరాచవేమక♦క్ష్మావరుండు
గీ. తల్లిసూరాంబచే సము♦త్పన్న మగుచుఁ
బరగు సంతాన వార్ధికి ♦ వరుసగాఁగ
నొలయు గిరివాహినుల జగ♦మొబ్బగండ
కాలువఘటించె నాతార♦కంబుగాఁగ. *

విజయనగరము నేలిన కర్ణాటకరాజుల కాలమునఁ గూడ నిట్టి పద్యములు శాసనములలోఁ గన్పట్టుచున్నవి. కృష్ణదేవరాయల యనంతరము విజయనగరమును బాలించిన అచ్యుతరాయలకు (క్రీ. శ. ౧౫౩౦-౧౫౪౨) మంత్రులుగను, కొండవీటిసీమకుఁ బరిపాలకులుగను ఉండి ప్రసిద్ధికెక్కిన రామయమంత్రులును రామయమంత్రిభాస్కరులును గొప్ప తటాకనిర్మాతలై బహుజనోపకారులై కీర్తిఁగన్నవారు. అందొక రామయమంత్రి బ్రాహ్మణుల కనేకాగ్రహారముల నొసంగుటయే గాక, పదునాఱు తటాకములను నిర్మించెనని శాసనముల ననుసరించి తెలియుచున్నది. రామయమంత్రి భాస్కరుని సోదరియును, ప్రతాపయల్లార్యుని ధర్మపత్నియు, నైన చిన్నమాంబ సాతలూరునొద్ద పర్వతనాథుని పేర నొక శివాలయమును గట్టించి, రామచంద్రపుర మనుపేర వంకాయలపాటి నగ్రహారముగ మార్చి, గోపినాథసముద్ర మనుపేర నొక తటాకమును నిర్మించెను. ఈతటాకశాసనము ♦ నందలి పద్యములు ఫిరంగిపుర శాసనమునందలి పద్యములను బోలియున్నవి. వానిని రచియించిన కవి యెవ్వరో తెలియదు. కాని యతఁడు శ్రీనాథుని పద్యములను బాగుగ ననుకరించి చెప్పెను. వాటినీక్రింద పొందుపఱచుచున్నాఁడను.

సీ. చతుర జనాన్విత ♦, సత్త పావన నదీ
తీర్థ పవిత్రి తా♦ధికజలంబు
సవిధదేశ విశాల ♦ సరస రసాలాది
ఫలరస జంబాల ♦ భాసురంబు
కలకంఠ చంచరీ♦క శుక కలాపసం
కలితపాంథ మనోజ ♦ కౌతుకంబు
ఘటిత కుల్యాగత ♦ ఘన నీరసంచార
సంవర్ధితా నేక ♦ సస్యచయము

గీ. చక్రవాళాచలోపమ ♦ చారుసేతు
బంధబంధుర నీరంధ్ర ♦ భాసురోర్మి
చుంబితాంబర మత్యంత ♦ సుకృతమణిస
నాథశుభనిధి శ్రీగోపి♦నాథజలధి.

సీ. జలతృష్ణమాన్పనీ ♦ జలధిఁబూనకయున్న
పవనంబుచే డాటు ♦ బడకయున్న
మంథానభూధర ♦ మథితంబుఁగాకున్న
మాటిమాటికి నుబ్బి ♦ మఱలకున్న
గరళంబుఁదనలోన ♦ గల్గిమెలఁగకున్న
నొకవేళ లోఁబడి ♦ యుండకున్న
బడబాగ్నికీలలఁ బడి ♦ తపింపకయున్న
నొండుగూడినవారి ♦ నొరయకున్న

గీ. జలధిసరివచ్చు మాధుర్య ♦ చారుజలధి
అపగతాఖిలదోషంబు ♦ నగుచు ధరణి
తనయధీసత్వమహిమచే ♦ ననుదినంబు
వెలయు శ్రీగోపికానాథు ♦ జలధితోడ.

సీ. శ్రీమించుగన్నడ ♦ క్షితివరాచ్యుతరాయ
సన్మిత్రరత్నంబు ♦ జలజనాభ
పాదాబ్జసేవాది ♦ భాసురహృదయుండు
కొండ ధరా ♦ మండలేంద్రుఁ
డైనరామయభాస్క♦రా మాత్యుసోదరి
యలఘుప్రతాప య♦ల్లార్యపత్ని
పర్వతేశ్వరదేవు ♦ భక్తిప్రతిష్ఠించి
గ్రామాదిభోగముల్ ♦ కలుగఁజేయు

గీ. చిన్నమాంబిక ద్విజకృత ♦ స్థిరతరాగ్ర
హారవంకాలపాటి శు♦భాపరాఖ్య
రామచంద్రపురాభ్యర్ణ ♦ సీమయందు
విప్రసత్ఫలసంధాన ♦ విమలమతిని.

సీ. కర్ణాటభూపాల ♦ ఘనకృపాకలితవి
స్తీర్ణ గజాంత ల♦క్ష్మీవరుండు
చండప్రతాప భా♦స్కరుఁడు భాసురదండ
నాథు సోదరి మహో♦న్నతగుణాఢ్య
పూని షోడశ మహా♦దాన విద్యాప్రౌఢిఁ
జిరకీర్తి పనిసట్టి ♦ చిన్నమాంబ
దుగ్ధాంబునిధితోడఁ ♦ దులతూఁగుగోపికా
నాథు సముద్రంబు ♦ నలువుమీఱ

గీ. ధరణిఁగట్టించె నాచంద్ర♦తారకముగ
నఖిలహితమైనయీధర్మ ♦ ముద్ధరించె. ‡

* ఎపి. ఇండి. ౯ పుట 3౧3; ఆం. సా. ప. ప. సం 3; పుట ౨౬౧.   ♦ ఎఫ్. రిపో. ౯౦౧౫, నెం. ౪౨౨.

‡ ఈపద్యములను గవర్నమెంటు శాసనశాఖవారు ఇంకను ప్రకటించి యుండలేదు. నేను వీటిని స్థానికచారిత్రములు ౪౮-వ సంపుటము ౭౬-వ పుటలోనుంచి యెత్తి ఉన్నవి యున్నట్లు, ఏమియు సంస్కరింపక యిచ్చట పొందుపఱిచితిని. కడపటి పద్యమెత్తు గీతములో రెండుపాదములు కానరావు.

తటాకనిర్మాణవిషయమును దలంచునపుడు వెలుగోటివారిని తలంపక తీరదు. విజయనగరాధీశులయొద్ద అమరకముగ సంపాదించి, నెల్లూరుమండలమునందలి దక్షిణసీమం బాలించిన వెలుగోటివారు పెక్కు తటాకములను నిర్మించియును, 'ఖిల'మైన తటాకములను మరల 'నూర్జితము' సేయించియును, వ్యవసాయాభివృద్ధికిఁ జాల సహాకారులైరి. అందు వెలుగోటికుమార తిమ్మానాయనింగారి నందను లయిన వేంకటపతి నాయనింగారు పేర్కొన దగినవారు. శాసనములననుసరించి వీరు శా. శ. ౧౫౩౫ మొదలు ౧౫౬౦ వఱకుఁ బరిపాలించినట్లు కన్పట్టును. వీరు వేయించిన తటాకశాసనము లనేకము కలవు. వీరి యానతిని చింతపట్ల రుద్రప్ప నాయుఁడు కల్లూరిచెఱువునకు అలుగు 33 శిలాస్తంభమ్ములు నిలిపి, యిరుగడల 'సంతనిసారువ్రులు, సోపానాలు' కట్టించినట్లు ఒక శాసనమువలనఁ దెలియుచున్నది. ఆ శాసనమున చక్కని యీ క్రింది పద్యము కలదు.

సీ. అవగాహనేహాస ♦ మాయాతవిబుధరా
ట్కమనీయమణి శతాం♦గములనంగ
తాటాకసేతుసం ♦ దర్శనేచ్ఛాగత
స్థిత సమున్నత మహా ♦ శిఖరులనఁగ
నీతిముజ్జ్వలధరా ♦ నేతృసంపాదిత
మూర్తీభవ త్కీర్తి ♦ మూర్తులనఁగ
ముక్తావళీ యుక్త ♦ మోహనాంబర చుంబి
వరుణరాజన్య గో♦పురము లనఁగ
గీ. నిలిపెఁగల్లూరి కలచెఱు ♦ వలుగునందు
ముప్పదియుమూఁడు రాకంబ♦ములు చెలఁగ
చింతపట్లపురస్థాయి ♦ శ్రీనిధాయి
రుచిరగుణహారి చెంచయ♦రుద్రశౌరి.

ఇది నెల్లూరుమండల శాసనములలోఁ గలదు. (సం ౧. ఆ ౩౫. పుట ౨౮౫.) దీనిని రచియించిన కవి యెవ్వరో తెలియరాదు. గవర్నమెంటువారు ఆంధ్రదేశమునఁ దీసిన శాసనముల నకళ్లన్నింటిని బ్రకటించినచో నిట్టి వెన్నియో దొరకఁగలవని నా నమ్మకము. ఇట్టి శాసనవాఙ్మయమునుగూడ భాషాభిమానులు గోల్పోవఁ జాలరు.

# అనుమానము నొందఁబోకుమా!

మద్దూరుపల్లి వేంకటసుబ్రహ్మణ్యశర్మ గారు

గాంధిమహాత్ముఁ డేమనసు।ఖంబును గోరి మనంబునందు ని
ర్బంధముకైన నోర్చి జన।పాలురబాధల లెక్కసేయకే
బంధులతోడఁ గృష్ణుని ని।వాసముఁ జేరె స్వరాజ్యదీక్షకై
యుంధతఁ జెందఁబోకు జన।మా! యనుమానముఁ నొందఁబోకుమా!

ఉ. శాంతము సజ్జనద్రుమవ।సంతము నిర్మలనిత్యసంతస
స్వాంతము గీయమానగుణ।వంతము దుర్గమరాజ్యపాలనా
క్రాంతము సర్వభూత మతి।కాంతము వాంఛితసర్వకార్యసి
ద్ధ్యంతము వీడఁబోకు జన।మా! యనుమానము నొందఁబోకుమా!

ఉ. ఖద్దరుబట్టనే మనము। కట్టినచో మనదేశమందు నా
పద్దశలున్ దొలంగుఁ గడు। భాగ్యము గల్గు స్వరాజ్యసిద్ధియున్
ఒద్దికఁ జెంతఁజేరు నను। సూక్తుల నమ్మి భజింపు గాంధియన్
హద్దును మీఱఁబోకు జన।మా! యనుమానము నొందఁబోకుమా!

# త్రిలింగదేశ్యము*

## మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు

తెలుఁగు మృదుమధురభాష యని పేరొందుటకు దేశ్యమే మూలము. కాని కేవల దేశ్యకావ్యములు గానరామి దీనికిం దగిన ప్రత్యక్షప్రమాణ మొకటి కొఱఁతపడినను, వేఱు ప్రమాణముల కలిమి దీని వ్యవహారదక్షతను వేనోళ్లఁ జాటుచున్న దని తెలిసికొనవచ్చును. ఇఁకనో యెందఱెంత యత్నించినను దీఱరాని యాకొఱంత యట్లుండఁదగినదియే. కాని యథర్వణాచార్యుఁడు వికృతివివేకము చివరఁ జేసిన దేశ్యప్రశంసనుమాత్ర మీసందర్భమునఁ జదివి యానందింతము.

"భాషేయ మమితా దేశ్యా
తత్ర చిత్రస్వభావయుక్
తచ్చిత్రతాథ ద్రష్టవ్యా
పూజ్యపాద సుభాషితే
* * *
* * *
ప్రమాణ మకలంకస్య
పూజ్యపాదస్య లక్షణం"

"ఈ యాంధ్రభాష యమిత మైనది. అందును దేశ్యము చిత్రస్వభావముతోఁ గూడినది. దాని వైచిత్ర్యమో పూజ్యపాదుని సుభాషితమునఁ జూడఁ దగినది. ......పూజ్యపాదునిలక్షణ మిందుఁ బ్రమాణము." అనెడి యర్థము గల పై శ్లోకములందుఁ బేర్కొనఁబడిన సుభాషితము దేశ్యనీతికావ్యమో లేక లక్షణగ్రంథమో యని సంశయము. అది కావ్యమే కానిచోఁ గేవల లక్షణమునఁ జూడఁదగిన వైచిత్ర్యమేమియు నంతగా నుండ దని యితరలక్షణములవలననే గ్రహింపవచ్చును. ఒకవేళ నది లక్షణమే యగు ననుకొన్నను, అందు మనోహరమయిన దేశ్యప్రసంగ ముండియుండు ననుట కనుమానము లేదు. అయిననేమి? సుభాషితమున దేశ్యచిత్రత చూడుఁ డనెడి యథర్వణుని యుపదేశమునఁ గూడ మన కిపుడు చండమారుత ఘుటికయే నిజ మయినది. కాని యతఁడు భాషనుండి వేఱుచేసి దీని నిట్లు ప్రశంసించి యుండుటచే దేశ్యము తప్పక కావ్యరచనకుఁ గూడఁ దగినంతటిదై యుండు ననెడి యభిప్రాయము స్ఫురింపక పోదు.

దేశ్యమందలి వ్రాలతేలికయును— వీనులపండువగు నొడువుల నుడికారమును— తేనెలొలుకు వానిపలుకుబడియు ననన్యభాషాసామాన్యములు. అర్ధానుస్వార శకటరేఫములు దక్క నిం దుచ్చారణక్లేశమును గలిగించెడి యచ్చులుగాని హల్లులుగాని లేవు. అందును ఖండబిందూచ్చారణము పోనేపోయినది. మఱియు నిందు హల్లు లన్నియుఁ బరస్పరము యథేచ్ఛముగాఁ గలియవు. రేఫలకారములకు మాత్ర మితర వర్ణములతో సంశ్లేషము గలదు. కాని యదియును శ్రుతికటువు గాదు. హలంతపదము లిందు లేవు. తన యీ గుణముల కనుకూలముగానే యిది తద్భవములను గ్రహించినది. కావుననే దేశ్యతద్భవము లుచ్చారణమార్గమున నైక్యమును జెంది యచ్చతెలుఁగున నేకీభవించినవి. ఇందులకుఁ గొన్ని యుదాహరణముల నరయుదము. ఈభాషయందలి 'పాలు, పెరుఁగు' వలెనే 'పుడమి' శబ్దము తన ప్రకృతు లయిన పృథివీపుణవీపదముల కాఠిన్యమును విడిచి దేశ్యకల్ప మయినది. అన్న తల్లి బియ్యము నవ్వు మున్నగువానియందు వలెనే తండ్రి చెట్లు శబ్దములలోని హల్సంయోగము పలుకుబడిని అంత కఠినము గాదు. అడ్డు ఇడ్డు తోడ్పాటు చిల్క గోర్వంక ఇత్యాదులలోని భిన్నవ్యంజనసంశ్లేషములును, చేయుదుర్ మున్నగు హలంతములును గవి కల్పితములు. కాని నైజములు కావు. ఇట్టి వయినను తఱచుగాఁ గానరావు.

దేశ్యమున నొక్క యవ్యయీభావము తక్కఁ దక్కిన సమాసము లన్నియు నుండుటయేకాక వానియందుఁ గొంత వైచిత్ర్యము గూడఁ గాననగును. అందును గర్మధారయము మిక్కిలి చిత్రమైనది. ఇందుఁ బ్రథమైకవచనము ప్రత్యయములలో డు-వు- తుద లేనివియు, ము ప్రత్యయము తుదఁ గలవియు మాత్రము విశేష్యములం గూడును. ఇట్లు కలిసెడి పదములు కొన్ని విశేషణములు విశేష్యములు గూడ నగుటయు, గొన్ని విశేష్యములు మాత్రమే యగుటయుఁ గలదు. చెడ్డపని మంచిదొర మేలుమాట మొదలగువానిలోని పూర్వపదములు ప్రథమైకవచనప్రత్యయహీనములు. వేఱుగా నున్నపుడును తత్పురుష సమాసమందును తఱచుగా విశేష్యము లగు నివి యిందు విశేషణము లగుచున్నవి. చెఱకువిల్లు- పూములికి- కుందనపుబొమ్మలలోని పూర్వపదములు విశేష్యము లయ్యు నిందు విశేషణధర్మము నాశ్రయించినవి. కన్నము వేయు దొంగ- గుఱ్ఱము నెక్కు రౌతు- అనెడి విగ్రహముల సిద్ధించు 'కన్నపుదొంగ గుఱ్ఱపురౌతుల'లోని మొదటివి విశేషణ ధర్మమునుగూడఁ బొందలేవు. అయిన నివి కర్మధారయములే యగుచున్నవి. దీనంజేసి విశేషణము విశేష్యముతో సమసించు ననెడి నియమము గాని విశేషణము విశేష్యగుణమును దెలుపు ననెడి నియమము గాని యిందలి కర్మధారయమున నంతటఁ నన్వయింపదనియు నుత్తరపదార్థప్రాధాన్యముతోడి సామానాధికరణ్యమే కర్మధారయమున కావశ్యక మనియుఁ దెలియుచున్నది. అనఁగా సమాసమును బొందునట్టి రెండు పదములును ప్రథమావిభక్తిలో నుండుటయును, రెండవపదము నర్థమే ప్రధాన మగుటయుఁ గర్మధారయమునకు గుర్తు.

* ఇది వీరి యాంధ్రవాఙ్మయము నుండి సంగ్రహింపఁబడినది.— సంపాదకుడు.

మఱియు నిందుఁ గ్రియాజన్యవిశేషణము లయిన చేసిన చేయక చేయుచున్న యిత్యాదులకు వ్యస్తప్రయోగమే లేదు. అవి తప్పక చేసినవంటు- చేయనివాఁడు- చేయుచున్నపని- యనురీతిని నామవాచకములనే యంటియుండును. ఇట్టివియును గర్మధారయములే. పూర్వులిట్టివానినిఁ గర్మధారయాభాసము లనిరి. దీనింబట్టి యందు సుబంత విశేషణములే కాక యస్వతంత్రము లయిన ధాతుజన్యవిశేషణములు గూడ సమాసమును బొందునని తెలియుచున్నది. మఱియుఁ బ్రొఁజదువు-క్రీఁగాలు- మీఁగాలు- మోఁకాలు - మోఁచేయి మున్నగునవి కర్మధారయము లయ్యు నిత్యబద్ధము లగుటంజేసి తత్తదర్థరూఢములై వ్యుత్పత్త్యర్థమాత్రవిభాజ్యములై యేకపదములునా విలసిల్లును.

ఉభయపదార్థప్రధానము ద్వంద్వమని నియమము గలదు. కాని ఇందు నామవాచకములే కాక యవ్యయములు క్రియాజన్యవిశేషణములుగూడఁ జేరును. ఇందులకు- చేసిచేయములు కన్నపెంచినవారు మొదలైనవి యుదాహరణములు. మఱియు నీదేశ్యమునందు అలరువిల్తుఁడు- ముక్కంటి-యనెడి బహువ్రీహులే కాక 'పూవింటివాఁడు- మూఁడుకన్నులవాఁడు- వేఁడివెలుఁగువాఁడు-' వంటి యాభాసబహువ్రీహులుగూడఁ గలవు. ఇట్లే యరసినచో సంధి సమాసాదివ్యాకరణకార్యవిశేషంబు లెన్నేని యిందు సహజములై కానవచ్చును. కొన్నిపదములతుదనుండు- 'రు అు ల్లు-డు-ను-యి-ము-' మున్నగువర్ణములకు, 'ఇ టి ం టి తి ప' యనెడి వర్ణములు విభక్తిపర మగునపుడు గాని సమాసమునందుఁగాని రెండువేళలఁగాని యాదేశము లగును. వీని కాపవిభక్తికము లనియు నివి యంతములఁగలవాని కాపవిభక్తికాంతము లనియుఁ బేర్లు గలవు. ఇవి యిందువచ్చు నిందురా వనుటకుఁ బ్రయోగవిజ్ఞానమే యాధారముగాని వేఱుత్రోవ లేదు. ఈవర్ణాదేశవైచిత్ర్యమీదేశ్యమునకుఁగల సహజాలంకారములలో నొకటి. ఇట్టివ్యాకరణాంశములను గూర్చి యెన్నిసూత్రములను మనము రచియించికొన్నను వాని కింకను గార్యవిశేషములు మిగిలియే యుండును. సంస్కృతమున- "ఇకారమున కచ్చుపరమగునపుడు యకారమువచ్చు" ననెడి సూత్రము చాలవఱకు సార్వత్రికమై కడముట్టును. కాని యిం దికారసంధినిగూర్చి విధినిషేధాపవాద సూత్రములను గల్పించికొనుచుఁ బోవలసినదే కాని యొకటియును దుదముట్టఁజాలదు. ఇట్లే యిందలి క్రియాపద్ధతిగూడఁ విచిత్రముగా నున్నది. అందుఁ దద్ధర్మార్థకక్రియలను గూర్చి యొకింత యరయుదము.

తక్కినభాషలలోఁ గ్రియలకు మూఁడే కాలములైయుండ నిందు మూఁడుకాలములను దెలుపుచుఁ దద్ధర్మకాల మొకటి యధికముగ నున్నదిగదా! వర్తమాన భవిష్యదర్థక క్రియలకుఁ బోలె దీని కనుబంధ మక్కఱ లేదు. వానివలె నిది ప్రథమపురుషైకవచనమందును స్త్రీపురుష భేదమునుఁ జూపదు. పైగా నింకొక్కవిశేషము. ఏక్రియారూపములకును లేని వ్యతిరేకార్థబోధకత్వము, 'కోరును- కోరఁడు' 'చేసెడున్-చేయడు' అనునట్లుగా ననుబంధాదిరహితమైన దీనికి సహజముగాఁ గలదు. వ్యతిరేకంబునఁ బైవిధముగా నిది స్త్రీపుంలింగభేదమును బ్రథమపురుషైకవచనమునఁ జూపును. ఇన్నియంశములు దీనికిఁ గలవు కావుననే కవుల కిది కామధేనువై యొప్పినది. ఇట్లే పరిశీలించినకొలఁదిని ధాతుజన్యవిశేషణావ్యయాదిరూపసిద్ధి దేశ్యస్వాతంత్ర్యమును వేనోళ్లఁ జాటుచుండు నని తెలుపుటకై యిట్లు దిఙ్మాత్రముగ నుదాహరింపఁబడినది.

దేశ్యమునఁ గొంచె మెచ్చుతక్కువగా మూఁడువేలపదము లుండు నని శబ్దరత్నాకరాదినిఘంటువులవలనఁ దెలియఁగలదు. అంతరించిన వెన్నుండునో మన మిపు డూహింపఁజాలము. నున్న-మట్టి-పాలము-పిల్ల-మేఁక-గొఱ్ఱె మున్నగుపదములు తద్భవము లనియే మనము నమ్మినచో నిత్యవ్యవహారమున నుండఁదగిన యీపదములస్థానములలోని దేశ్యములు పోయినట్లే కదా. ఇంత యేల? మానవజాతిసామాన్యవాచకపదము దేశ్యమునఁ గానరాదు. మానిసి యనెడి తద్భవమే యిందులకు గతి యయినది. దీనిచేనైన దేశ్యములు కొన్ని యడుగంటిన వనుట కనుమాన ముండునా? ఇందుల కింక నొక్క యుదాహరణ మరయుదము. అమ్మ-నీరు- ఇవి తద్భవము లనియే యొప్పికొందము. ఇందు మొదటిది దేశమంతట నాబాలగోపాలము వాడునదే యైనను దేశ్య మయిన తల్లి గూడ నెట్లో మిగిలియున్నది. కాని నీటిని దెల్పుదేశ్య మేది!! తొల్లిటి దేశీయు లీతద్భవము చేరువఱకు నీటికిఁ బేరు లేకుండఁగనే నీటిని వాడుకొనియుండెడివా రని చెప్పనొప్పునా? అగ్గినిప్పు బట్టగుడ్డ- బల్లచెక్క మున్నగువానిలో నిప్పు మొదలగు దేశ్యము లగ్గి మొదలగుతద్భవముల నంటికొని యున్నట్లుగా, నీటి నంటికొనివచ్చిన వేఱుపదమైనఁ గానవచ్చుచున్నదా? లేదు. కావున దీనినిబట్టిచూడఁగాఁ దద్భవములు దేశమున నలమికొనుకాలమున నార్యులవలెనే యిందలి ప్రాఁతకాఁపులును వానినే వాడుచు వచ్చుటంజేసి కొన్ని దేశ్యములు మెల్లమెల్లగా జాఱినవనియును, దద్భవాభిమానులు గొందఱు కొన్ని దేశ్యములను తద్భవములనుగా నిరూపించి రనియుఁ దోఁపకమానదు. (దేశ్యములను తద్భవములనుగా భ్రమసి నిరూపించిన విషయము తద్భవప్రకరణమున విస్తరింపఁబడినది.)

మఱియు దేశ్యములలో నన్యదేశ్యపదములు గొన్ని కలిసియున్నవని యర్వాచీనలక్షణములవలనఁ దెలియుచున్నది. అందు తావు-తవర-వంటి యనాంధ్రవర్ణయుక్తములు సుస్పష్టములే. కావున వానిని విడిచి, తావుమోవి మున్నగు నాంధ్రవర్ణయుక్తములం గూర్చి ప్రసంగింతము. ఇందులకు ముందుగా నన్యదేశ్యము లన నేమి? లాక్షణికు లెట్టివానికీపేరు పెట్టిరి? అనునంశములం గూర్చి యాలోచింతము. వాగనుశాసనాదులు దేశ్యలక్షణమున నన్యదేశ్యప్రశంసను చేసినట్లు గానరాదు. కాని వానితరువాతివారు వేని నన్యదేశ్యములనుగాఁ బరిగణించిరో యవి భారతములోఁ గనఁబడుచునే యున్నవి. కావున నన్యదేశ్యము లనఁబడు నాంధ్రవర్ణపదములు భారతరచనకు మున్నే దేశ్యభాషలో నున్నవనుట నిక్కము. కేతనకవి—

"ఆ. తత్సమంబు నాఁగఁ ♦ దద్భవం బన నచ్చ
తెలుఁగు నాఁగ ♦ దేశితెనుఁగు నాఁగ
గ్రామ్యభాష నాఁగఁ ♦ గల వైదు తెలుఁగులు
వేఱువేఱ వాని ♦ విస్తరింతు."

అని ప్రతినసలిపి యచ్చతెలుఁగు దేశితెనుఁగుభేదమున దేశ్యమును విభజించి యెల్లజనులకును దెలియుపలుకు లచ్చతెలుఁగు లనియుఁ, గొందఱకు మాత్రము తెలియు తెఱఁగుఁబలుకులు దేశితెనుఁగు లనియు వేఱువేఱు లక్షణములు వ్రాసి దేశితెనుఁగునకు నూఱుపదము లుదాహరించి యున్నాఁడు. అప్పకవియును గేతనయాశయమున కనుగుణముగానే దేశ్యమును ద్వివిధముగా విభజించి—

గీ. ఆంధ్రదేశపురస్థాయు ♦ లైన సకల
జనములకును మఱుఁగు లే♦శంబు లేక
తేటతెల్లముగాఁ బల్కు♦మాట లెల్ల
నవని శుద్ధాంధ్రదేశ్యంబు ♦ లనఁగఁ బరఁగు.

క. కేశవ! యాంధ్రులు నానా
దేశంబులయందు నిలిచి ♦ తెలుఁగులె తత్త
ద్దేశోక్తు లంటుఁ బలికిన
నాశబ్దము లన్యదేశ♦జాంధ్రము లయ్యెన్.

అనుచుఁ దద్భేదంబులకు విశదముగా లక్షణములు వ్రాసి రెండవ జాతివానికి రమారమి యిఱువదిపదము లుదాహరించియున్నాఁడు. ఇందీతని రెండులక్షణములను జక్కఁగాఁ బరిశీలించినచో నన్యదేశ్యముల యెడఁ గొందఱకుఁగల భ్రాంతి తొలఁగుటయేకాక వానియెడఁ గేతనాప్పకవు లేకాభిప్రాయు లయినట్లు స్పష్టపడఁగలదు. చూడుఁడు— ఆంధ్రదేశమునఁ దొలుత నివసించినవారికెల్లఁ దేటతెల్లముగాఁ దెలియుమాట లచ్చతెలుఁగు లనియును, నితరదేశముల నివసించిన యాంధ్రు లాయాదేశపుమాటలతోఁ గలిపి పలికిన తెలుఁగుమాటలే యన్యదేశజాంధ్రము లనియు నప్పకవిమతము. దీనింబట్టిచూడఁగాఁ గేతన చెప్పిన దేశితెనుఁగులే యప్పకవి నిరూపించిన యన్యదేశ్యములనియు, నితరదేశములనుండి వచ్చిన తెలుఁగువారి తెలుఁగుమాటలు గొన్ని యిందలివారికిఁ గ్రొత్తవియై యన్యదేశ్యసంజ్ఞఁ జెందినవనియును దెలియుచుండలేదా? ఇందులకు వీరిరువురుఁ గూడ నుదాహరించిన- వెలఁది తొయ్యలి చెలి బోటి క్రాను వెన్న తావి మోవి మొదలగు పదముల యేకీభావమే ప్రమాణము. దీనివలన నాంధ్రవర్ణయుక్తములయిన యన్యదేశ్యములు- అనఁగా నితరభాషలనుండి యిందుఁ గలిసినవి- గావనియు నితరదేశములనుండి యిందరుదెంచిన తెలుఁగువారి తెలుఁగుమాటలే యిందలివారికిఁ గ్రొత్తవియై కొందఱకుమాత్రమే తెలిసెడి తెఱఁగుఁబలుకులు-లేక దేశితెనుఁగుమాటలు-అనియు గ్రహింపనగును. ఇట్లాంధ్రదేశ్యములో నన్యదేశ్య మంతర్భూతమయినదని నిర్ణయించికొన్నను మన మింతటితో నీప్రసంగమును దాఁటలేదు. పైనిజెప్పినట్లు గేతనకవి చూపిన దేశితెనుఁగులలోని ఉవిద వేసవి నాన మున్నగు వానిని, అప్పకవి చూపిన యన్యదేశ్యాంధ్రములలోని బవరము దురము వేసవి మున్నగువానిని మనవైకృతదీపికాశబ్దరత్నాకరములు తద్భవము లనుగాఁ జూపుచున్నవి. చూచితిరా! మన తద్భవశ[illegible] మెంత వఱకుఁ బోయినదో!! ఇవి దేశ్యములని వారిమాట నమ్మఁదగునా? తద్భవములని వీరిమాట నమ్మఁదగునా! ఇందులకు విద్వల్లోకమే ప్రమాణము. కాని పరిశీలింపక యక్షరసామ్యమునుబట్టి దేశ్యపదములను దద్భవము లనుగా నిరూపింపరాదనియుఁ గాలకర్మవశంబునఁ గొన్నికొన్ని పదములు లోపించుటచే నిపుడు సన్నగిల్లినట్లు కనఁబడుచున్నదే గాని లేకున్న మన త్రిలింగదేశ్యము తొలుత గ్రంథరచనకుగూడఁ దగినంతటి స్థితిలో నుండియుండు నని యూహింప మనకు నవకాశముగల దనియు విన్నవించుచు నీవ్యాసమును ముగించుచున్నాను.

# *శ్రీ రాజరాజనరేంద్రుఁడు

శ్రీయుతులు వడ్డాది సుబ్బారాయ కవిగారు

శ్రీ వేఁగీ తిలకాయమానము, కాళింబోలు క్షేత్రం బనం
గా వాసింగని, గంగ కగ్రసహజం♦గా భారతుల్ వల్కు గో
దావర్యాపగ వామభాగమున నాం♦ధ్రజ్యోతియా ప్రోల్ తదా
ఖ్యావిఖ్యాతము; రాణ్మహేంద్రుఁడు మహేం♦ద్రాభుండు నాకస్థితిన్.

ఉ. కాయము వోయినం జెడని♦కాయము కీర్తి యాత్మవోలె, నిం
ద్రాయితవైభవోజ్జ్వలుఁడు ♦ రాజనరేంద్రు నగ ర్నశించినన్,
బాయక కోటయన్నహిత♦నామము మున్నటిచోట వాడుకన్
స్థాయిగ రాణ్మహేంద్రమున ♦ స్మారకమా గత తద్విభూతికిన్.

* ఈ పద్యములు శ్రీ. వ. సు. రాయకవిగారు రాజనరేంద్రుని వర్ధంతిసందర్భమునఁ జదివినవి.—సంపాదకుఁడు.

ఉ. "ఒడ్డెలు రేవుగావను, ద్విజౌఘులొనర్పను స్నానపూజ, లే
యడ్డము లేనియట్టులు, శివాలయమున్ మఱి వారివారియిం
డ్లొడ్డున నేటికిం దవుల నొండ్లవి యొప్పఁగఁ గట్టె మెట్టఁ బ్రోల్
దొడ్డగ" నంచు, వాస్తుకుశలుల్ నుతిసల్పరె రాణ్మహేంద్రునిన్!

సీ. "చిత్రవధంబుచేసినచోటు సారంగ,ధరునిమె" ట్టంచుఁ "జిత్రాంగిమేడ"
యంచుఁ, "గా తేలు గా దద్ది పా తే" అంచు, జనములాయాయి యంశములఁ గూర్చి
వింతవింతలుగఁ గల్పించి విన్తురు కథల్, రాజమహేంద్రవరంబునందు,
భారతంబున నన్నభట్టారకుఁడు గాని, నాఁడు వ్రాసిన శాసనములుగాని
వాకొననివాని; వానిని బాటిసేసి, శారదాంబుదచంద్రనక్షత్రకాశ
రాజహంసప్రకాశయా రాణ్మహేంద్రు, కీర్తిసతిఁ ద్రోయనవునె దుష్కీర్తిఁ గవులు?

ఆ. పురుషుఁ డిరుపనులను బొనరించె నే నందు, మంచిఁ గొంచుఁ, జెడ్డ మానవలయు;
రాణ్మహేంద్రుసుగుణరత్నముల్ గొనుఁడు; చిత్రాంగికల్లమాట యంటకుండు.

ఉ. వాడుక నాంధ్ర మాటవిక భాషగ నుండక, సంస్కృతంబుతోఁ
గూడికఁ జెంది, భారతపుఁ గోశముచే నసమానధన్యమై
వేడుక నేఁత కిందుకులవీరుఁడు మూలము రాణ్మహేంద్రుఁ డం
చోఁడక వాని యాంధ్రజనుఁ డొందడె ఘోరకృతఘ్నతాఘమున్.

ఉ. ఆదివిరాటపర్వమున "నాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం" డటంచుఁ గొనియాడెను మెచ్చి కవిస్వయంభు వే
వేదపురాణశాస్త్రముఖవేదిని, వాగనుశాసనుం డతం
డైదవవేద మిచ్చెఁ, గృతి నందఁడె బ్రహ్మత రాణ్మరేంద్రుఁడున్.

ఉ. తొమ్మిదినూఱులీజరుగు నుందుభికిన్ మనరాణ్ణరేంద్రుకా
లమ్మఖిలమ్ముఁ దద్రమఖిల; మ్మృతిఁ డిడ్డవి నట్లు; కాని స్వ
ర్గమ్మున భోజరాజు సరిగద్దియ భర్తనుసిల్వ, సామన
స్యమ్మునఁ గ్రాలు నందు కృతి సత్కవియీవికిఁ జావు లేదుగా.

ఉ. నాకమునుండి యొక్కపరి నన్నయభట్టును, రాణ్ణరేంద్రుఁడున్,
రాకయొనర్చిరే నిటకు, రాజమహేంద్రము విందుసేయదే
నైకకళాలయంబులఁ, దదాంధ్రకృతుల్ గల కోశశాలలన్,
జేకుఱు ధూమనౌశకటసేతుపథంబుల, సౌధవీథులన్.

మ. కురువంశాంకుర మేముహూర్తమున శంకుస్థాపనం జేసెనో
పురముంగట్టను రాణ్మహేంద్రుఁడు మతేముహూర్తంబునం గావ్యమున్
విరచింపం గవినన్నభట్టు పసుపుం బిళ్లారిఁ బూజించెనో
సిరియున్ వాణి వసింత్రు నేఁడుఁ జెలిమిన్ శ్రీ రాణ్మహేంద్రమ్మునన్.

మ. శ్రీయుతకృష్ణరాయలచరిత్రలవంటివి రాణ్ణరేంద్రు వే
చాయ వినంగరామిని యశస్విరచిహ్నపురప్రబంధపా
రాయణ మాచరించి వసురాయఁడు వానిజయంతి నెక్కువన్
వ్రాయఁగలారి వ్యాసరచనల్ వినఁగోరి ముగించు నింతటన్.

# ఆంధ్రక్షత్త్రియులు - శరీరవ్యాయామము

శ్రీ మత్స్యవంశము జగన్నాథ భూపతిదేవ వర్మ గారు

ధర్మము అర్థము కామము మోక్షము అను నాలుగు పురుషార్థముల కాశ్రయభూతము లయి ఋగ్యజుస్సామాథర్వణంబు లను చతుర్వేదంబులు విలసిల్లుచున్నవి. అందు ఋగ్వేదంబునం దాయుర్వేదంబును, యజుర్వేదంబునం దర్థవేదంబును, సామవేదంబున గాంధర్వవేదంబును, అథర్వణవేదంబునందు ధనుర్వేదంబును ననుపవేదంబులు గల్పితంబు లయ్యె. శిక్ష వ్యాకరణము ఛందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము ఇవి చతుర్వేదంబులకు నంగంబులుగను, మీమాంస న్యాయశాస్త్రము పురాణము స్మృతి యివి ఉపాంగములుగను నేర్పరుపఁబడియె. ఉపవేదములు నాలుగు-అంగములు ఆరును-ఉపాంగములు నాలుగును మొత్తము పదునాలుగును వేదార్థమును వేదమహిమను దెలిసికొనుటకు సహాయము చేయుచున్నవి. వేదపురుషునకు చతుర్వేదంబులు మధ్యకాయము. శిక్షాది షడంగములు అంతరంగములు. మీమాంసాదికము లగు ఉపాంగములు బహిరంగములు. ఆయుర్వేదము మొదలగు ఉపవేదములు వేదపురుషునకు ప్రధానులవంటివి. అష్టాదశపురాణములును అష్టాదశోపపురాణములును ధర్మశాస్త్రమును మూలస్మృతులు పదునెనిమిదియును ప్రాయశ్చిత్తకాండమును వ్యవహారకాండమును సూతశాస్త్రమును (అనగా సారథ్యమును) గజశాస్త్రమును అశ్వశాస్త్రమును వ్యూహశాస్త్రమును సాముద్రికశాస్త్రమును మల్లశాస్త్రమును ద్వాత్రింశదాయుధసాధనంబులును దేహపరిశ్రమమును యోగశాస్త్రమును శివప్రోక్తములగు ఇంద్రజాల మహేంద్రజాల మహామాయాశాంబరములును మొదలుగాగల చతుష్షష్టితంత్రములు మొదలగు అఱువదినాలుగువిద్యలను నేర్వకయే ఉత్తమ క్షత్త్రియవంశంబున జన్మించితిమని వర్ధిల్లుటకంటె మృతినొందుట మేలు. ఇందుపవేదోత్తమంబైన ధనుర్వేదము సకలజన రక్షణంబయి విలసిల్లునది కావున పూర్వంబున క్షత్త్రియు లీవిద్యను విడువక అభ్యసించిరి.

కాని ఈ కాలమునందలి క్షత్త్రియులన్ననో విద్యావిహీనులయి రాజ్యమదాంధతచే స్నానభోజననిద్రామైథునాది సమస్తభోగముల నాసక్తులై సురాపానవ్యభిచారద్యూత క్షుద్రసహవాసంబులను దుర్వ్యసనంబులం దగిలి ధైర్య శౌర్య సాహస సత్య శౌచధర్మములు మొదలగు సద్గుణములను విడిచి-సోమరితనంబున బొజ్జలు పెంచి-నాలుగడుగులు నడువనైన సమర్థతచాలక- ఉస్సురుస్సురనుచు దేహపరిశ్రమ లేనందున - బలహీనులయియుండి- విద్యాశూన్యులగు కొందఱు దేహపరిశ్రమను తగుమాత్రము గావించి ప్రదర్శించువిద్యలంజూచి సంతసించుచు- తమ బలసాహసమానధనంబులును రాజ్యంబును స్వాన్యులకు సమర్పించి వారలకు దాసానుదాసులయి ప్రవర్తించుచున్నారు.

క్షత్త్రియులు నీతికోవిదులును బలవంతులును గాక పోవుటచే దేహపరిశ్రమవిద్య విద్యాశూన్యుల పాలఁబడి తత్సంబంధములగు శాస్త్రములు నశించినవి. విప్రునకు వేదాధ్యయనంబును, క్షత్త్రియునకు క్షాత్త్రమును, వైశ్యునకు వాణిజ్యమును, శూద్రునకు త్రివర్ణసేవకత్వంబును విధింపఁబడిన కార్యంబులు. అందు క్షత్త్రియునకు బలంబునను విద్యావశంబునంగాని క్షాత్త్రం బఖండమంతంబై వెలుంగంబడదు. గాన తద్విద్యాభిలాషులయి క్షత్త్రియకుమారు లుండుట యుత్తమము.

దేహపరిశ్రమ ధనుర్విద్యామహిమముల నించుక విమర్శింతము. త్రిమూర్తుల కాదిమూర్తియగు బ్రహ్మమునందు లక్ష్యలాఘవదృఢములను శక్తిత్రయము లుద్భవిల్లి - అవి తమ శక్తిబలంబున నొక్కొక్కటి మూర్త్యంతరంబులు గైకొని- లక్ష్యశక్తి వాణీనామంబునను, చతుర్ముఖుని లాఘవశక్తి కమలాభిధానంబునను, శ్రీవిష్ణుని దృఢశక్తి దుర్గాఖ్యను చంద్రధరుని వరించినవి. ఇట్టి సనాతనదంపతులైన మువ్వురును యీలోకముల సృష్టిస్థితిలయంబులను చేయుచుందురు. అయ్యాదిశక్తి త్రయంబునే రాజససాత్త్వికతామసంబులని పౌరాణికులు వాడుదురు. ఇట్లేర్పడిన ఆరూపత్రయము లోకంబులు సృజియించుచున్న బ్రహ్మాదరికేగి నమస్కరించి- దేవా! సమస్త ప్రాణులను సృష్టించి పనులువిభాగించి పంచుచుంటివి.

మాకును స్వర్గమర్త్యపాతాళంబునంగల సురాసుర గరుడ గంధర్వ యక్షకిన్నర కింపురుష సిద్ధసాధ్య గుహ్యకమనుజ విషధరాది ప్రసిద్ధులగు వీరపుంగవులకును పూజనీయం బగు కార్యమెద్దియో విచారించి నియమింపుడని వేడెను. చతుర్ముఖుండును చతుష్షష్టివిద్యలలో శ్రేష్ఠంబును- వీర పురుషసేవితంబును-నగు ధనుర్వేదకళను నిర్మించి సమస్త మార్గములకు కులాచారము ప్రశస్తమనియును, దాని కంటె ధర్మము దశగుణిత మధికమనియును, అధర్మ గుణముకన్న సత్యవ్రతము దశగుణిత మధికమనియును, ఈమూడుగుణముల నాశ్రయించి యుండు నది ధైర్య మనియును, అట్టి ధైర్యము పరాక్రమమునందు నిలుచునని యును, పరాక్రమముగలవారలే వీరసింహులనియు శ్రుతులు నుడువుచున్నవి. కాన వీరాగ్రేసరులు దృష్టి బాహు భుజంబుల లక్ష్యలాఘవదృఢంబులను వీరారు మువ్వురు వసింపుడని యానతిచ్చెను.

ధనుర్విద్యయందు దృఢశక్త్యంశము ధనువుగాను- లాఘవశక్త్యంశము నారిగాను - లక్ష్యశక్త్యంశము బాణముగాను - ఈత్రయము పరికరములుగను - ధన్వశక్తి సారము గోధగాను - శింజినీశక్తిసారము అంగుళిత్రాణ (కసినీ)గాను - కాంతశక్తిసారము తూణీరముగాను - ఈ త్రయ ముపపరికరములుగను-ఈపరికరత్రయమును ఉప పరికరత్రయమును కలసి ఆఱువిధములుగను విభాగింపఁ బడెను. సహస్రార్కప్రభాభాసితంబైన ఈశక్తిత్రయము వలన దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనంబు జరుగుచున్నది. యీ సాధనషట్కవినియోగంబులును మిక్కిలి ప్రపం చింపఁబడినవి. ఎట్లనిన - ధనువుబాణములను జిమ్ముచు వామహస్తమందు బ్రకాశించును. మార్వి శరపుచ్ఛముల గ్రహించి ధనువు నాకర్షించును. చిత్తమెచ్చట నాటునో అటకు బాణముపోయి నాటును. శరమువిడుచునపుడు నారిదెబ్బ ఎడమచేయికి తగులకుండ గోధ రక్షించును. అంగుళిత్రాణము దక్షిణహస్తాంగుష్ఠమును కాపాడును. బాణముల నుంచుటకు తూణీర ముపయోగించును.

శ్రీవిష్ణునకు ధ్యానంబును సూర్యునకు నమస్కా రంబులును శివునకు పత్రపూజలును భైరవాది సమస్త నీచదేవతలకు ప్రాణిహింసలును వారివారి మనఃప్రీతి కొలఁదికు పూజచేసి ఆదేవతలవలన మనోభీష్టవరములను బొందుదురు. అది గావున దేవతాప్రసాదంబు గోరువార లకు తదనుకూలంబైన యారాధనావిశేషంబునఁ గాని తద్దేవత ప్రసన్న గానేరదు. లక్ష్మ్యాదిదేవీత్రయంబు నకు అభ్యాసారాధనంబు గర్తవ్యంబైయుండు. అంత కాలంబు దృఢనిశ్చయుండై యభ్యాసంబును నారాధనంబు జేయుచుండు నంత దేవీకటాక్షంబు వడయుంగావున నభ్యాసారాధనం బవశ్య కర్తవ్యము.

ఇఁకను దేహబలంబును శరీరపరిశ్రమను చర్చిం తము:— సాదాదండెములు జమిలిదండెములు గోడ దండెములు హనుమంతులఘువులు వాలుమొగ్గలు గుం జీలు ముగుదారులు లేజము సంగిడీలు తిరువాళీలు ఆసనములు దండలు గతులు పరువుల్లు మొనలు కాయ మానములు విసరులు ఉపవీడములు విన్నాళములు ప్రచారములు నఱుకులు మల్లశాస్త్రము- ఈ మొదలుగా గల దేహపరిశ్రమవిద్యలను ప్రథమంబున నభ్యసింప వలయును.

రణరంగమున శత్రుసంహారమొనర్చు దివ్యాస్త్ర ములు:— బ్రహ్మబాణములు గీలించి హుంకారం బొనర్చిన మాత్రంబున నొక యనూనంబైన తేజంబు ప్రళయాగ్ని సన్నిభంబై శిరంబున వెలువడిన నవి ప్రణవపూర్వకం బైన గాయత్రీ వర్ణంబుల గుప్తంబుజేసి - తదుచ్చారణం బున దత్తేజం బుద్భవంబుగా నియమించి - శరాకర్షణం బునమంత్రోచ్చారణంబును షట్త్రింశద్యోగంబులనెయ్యది సన్నిహితకార్యమై యుండు దానిందలంచు విధంబును తద్ధ్యానంబును-తల్లక్ష్యస్థానభేదంబులైన యంత్రంబులును గల్పించి యమ్మంత్రంబు పఠియించిన నంత నొక తేజము భయంకరాకారమును శ్వేతవర్ణమును గలిగి బ్రహ్మశి రమ్మనుపేరిట మహాస్త్రంబై యుద్భవిల్లె. ఇంద్రాంశం బున నైంద్రంబును దహనాంశంబున నాగ్నేయంబును యమాంశంబున యామ్యాస్త్రంబును ధర్మపాశము [కాలపాశము] నైరుతియంశంబున రాక్షసాస్త్రంబును, వరుణాంశంబున వారుణాస్త్రంబును అనిలాంశంబున వాయవ్యంబును, గుబేరాంశమున గౌబేరంబును, రుద్రాం శంబున రౌద్రంబును, మేరునగేంద్రాంశంబున నచలాస్త్రం బును, అంబుదాంశంబున ఘనాస్త్రంబును, అనంతునియం శంబున నాగాస్త్రంబును, వైనతేయాంశంబున గరుడా స్త్రంబును, భాస్కరాంశంబున తేజోస్త్రంబును, గంధ ర్వాస్త్రంబును, హిమకరాంశంబున సోమశతాస్త్రం బును, మనుష్యాంశంబున మానవాస్త్రంబును, బ్రాహ్మ ణాంశంబున భార్గవాస్త్రంబును, వజ్రాంశంబున సర్వక

వచభేదనాస్త్రంబును, దిగ్గజాంశంబున వారుణాస్త్రంబును దండచక్రము, (కాలచక్రము విష్ణుచక్రము) శైవశూలము ఐహికము బ్రహ్మాస్త్రము శిఖరిగద కౌమోదకీగద (శుష్కాశని, ఆర్ద్రాశని) పైనాకాస్త్రము నారాయణాస్త్రము ప్రమథాస్త్రము హయశిరము కాంచనాస్త్రము శక్తి కంకాళము మానవము కాపాలము కంకణము విద్యాధరాస్త్రము నందనాస్త్రము అసిరత్నము ప్రస్వాపనము ప్రశమనము సౌరము దర్పము శోషణము సంతాపనము విలాపనము దమనము కాందర్పము పైశాచము మోహనము తామసము సౌమనస్యము సంవర్తనము సత్యాస్త్రము మాయావంతము సర్వమాయాదమనము, తేజఃప్రదము తేజోపకర్షణము త్వాష్ట్రికము సుదామనము శివేషుమానవాస్త్రము ముసలము—యీమొదలగు దివ్యాస్త్రములు మూడువందలు గలవు. ఈదివ్యాస్త్రములకు మంత్రములును తల్లక్ష్యస్థానభేదంబులైన యంత్రంబులును తదాదిదేవతాధ్యాన రూపంబును తన్నియమంబులును తత్ప్రయోగదక్షిణంబులును తదుప సంహారక్రమంబులును నెఱింగి ప్రయోగింపనగు. అస్త్రములకు మంత్రమనఁగా తుపాకికి వాడఁబడు అగ్నిచూర్ణమువంటిది. యంత్రమనఁగా తుపాకినాళము వంటిది. తంత్రమనఁగా నాళములో అగ్నిచూర్ణము.గుండు-వేసి గజముతో ధట్టించి చెవికాడలో అగ్నిచూర్ణముపేసి అగ్నితో ముట్టించుట మొదలగునవి. పైనివ్రాసిన అస్త్రములకు ప్రస్తుత మట్టి మంత్ర యంత్ర తంత్రశాస్త్రములు మనహిందూదేశమందు నశించుచున్నవి.

శస్త్రములు:—సత్యవంతము సత్యకీర్తి ధృష్టిరభసము ప్రతిహారతరము పరాఙ్ముఖము అవాఙ్ముఖము లక్ష్యాలక్ష్యవిషయము దృఢనాభము సునాభము దశాక్షము శతవక్త్రము దశశీర్షము శతోదరము పద్మనాభము మహానాభకము సునాభకము దుందునాభము జ్యోతిషము కృశనము నైరాశ్యము విమలము యోగంధరము హారిద్రము దైత్యము ప్రశమనము శుచిర్బాహువు మహాబాహువు నిష్కలి విరుచి సార్చిర్మాలి ధృతిర్మాలి వృత్తిమంతము పిత్ర్యసౌమనసము విధూతము మకరము కరవీరకము ధనధాన్యము కామరూపము కామరుచి మోహనము మారణము జృంభకము సర్వనాభము సంతానము వరణము రుచిరము మున్నగునవి.

ఆయుధములు:—బాణము ఖడ్గము తోమరము స్తోమము చేరి సృగము శక్తి యష్టి భిండివాలము పరిఘము పరశ్వథము — గద ప్రాసము ముద్గరము ముసలము శూలము పాశము చక్రము ముసుండి దండము వజ్రము అశని హలము అరిష్టము క్రకచము కుంతము పరశువు వేణువు తోత్రము కుసూలము త్రిశూలము కఠారి కైజారు. బాకు సూరి పేష్కష్టు మొదలుగాగల ఆయుధములు కర్మకరుల మనముసకుం దోఁచినటుల నిర్మించిరి. అట్టి ఆయుధపరిశ్రమ జేయవలయును. ప్రస్తుత కాలంబున ఐరోపాఖండవాసుల భౌతికశాస్త్రచర్చలు, శోధనలు చాల ప్రబలముగా నున్నవి. •ఆశాస్త్రశక్తులు-పెట్రోలు-మోటారులు- విద్యుద్యాత్రములు-ధ్వనిలేనితుపాకులు పొగలేనితుపాకిమందు-గొప్పఅగాదుగల ఫిరంగిగుండ్లు - విషజల విషవాయుప్రయోగములు - ఆకాశవిమానములు- విద్యుల్లతలదళ్లు- బాంబులు కందకములు-వార్తాయంత్రములు- విద్యుత్కిరణములు - సెర్చిలైట్లు అదృశ్యవిమానములు- శబ్దగ్రాహియంత్రములు- జలాంతర్గాములు యుద్ధనౌకలు వాటిని కనిపెట్టుయంత్రములు తీగలేనివార్తాయంత్రములు టెలిఫోనులు తీగలేనిటెలిఫోనులు టార్పిడోగొట్టములు- మొదలగు సమస్తవిద్యలకు పుట్టినిల్లని ప్రసిద్ధినొందిన మనభారతదేశము ఈకాలంబున క్షీణదశనొందినది. కావున తగు విధమున మన ఆంధ్ర క్షత్రియ కుమారులకై విద్యాశాల లేర్పరచి గురువుల నియమించి ఈప్రాచీన తమములగు క్షాత్రవిద్యల నభ్యసింపజేసినంగాని మఱల ఆర్యావర్తపు క్షాత్రతేజము ముందటివలె సర్వతోముఖమగు నభివృద్ధి నొంద జాలదు.

# ఆంధ్ర వాఙ్మయ నిరీక్షణము

ఆండ్ర శేషగిరి రావు గారు

"పరమహిమన్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు త, న్మహనీయస్థితి మూలమై నిలుప శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటించు నీ, బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్యమూహించెదన్."

—రామరాజభూషణకవి

"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని రాయలవచనము. తీరుతీయములు కలిగి తెనుఁగుబాస వీనులకు విందొనర్చు. మృదుమాధుర్యములఁ జూచుకొని దీనికి 'Italian of the East' అని పాశ్చాత్త్యపండితప్రకాండులు నామకరణ మిడిరి. ఆంధ్రభాష యనఁగా నాంధ్రులచే మాటలాడబడు భాష యని కాని, లేక యాంధ్రదేశోద్భవమగు భాష యని కాని చెప్పవచ్చును. త్రిలింగదేశమునఁ బుట్టిన దగుట తెలుఁగు తెనుఁగు అనియు వ్యవహరింపఁబడును. ఆంధ్రభాషలో నన్నయభట్టారకునకుఁ బూర్వ మనేకగ్రంథము లుండి యుండును. మనదురదృష్టమువలన తదుపలబ్ధి లేకపోయినది. క్రీ. శ. పదునొకండవ శతాబ్ది ఆరంభమునుండియు వాఙ్మయ మభివృద్ధి నొందినది. ఆంధ్రసారస్వతాభివృద్ధికాలమును నాలుగుభాగములుగా విభజింపవచ్చును. అందు 1. భాషాంతరీకరణయుగము. (11-15 శతాబ్దులు) 2. ప్రబంధయుగము. (16-17 శతాబ్దులు) 3. మధ్యమయుగము. (18-19 శతాబ్దులు) 4. ఆధునికయుగము (20-వ శతాబ్ది). ఇందు తొలుతటిదైన భాషాంతరీకరణయుగములోఁ గావ్యములు కేవల మర్థగౌరవముతో రచించిరి. ప్రబంధయుగములో శబ్దార్థముల రెంటికిని సమానముగ ప్రాముఖ్యము నిచ్చిరి. మధ్యమయుగములో శబ్దగౌరవముకే విశేషముగఁ బాటించిరి. కావున నీకాలముననే భాష క్షీణింప మొదలిడెను. భాషాంతరీకరణయుగమందలి వాఙ్మయాభివృద్ధిని ప్రత్యేకించి విమర్శించుకొందము.

## భాషాంతరీకరణయుగము-1 పాదము. 11-13 శతాబ్దులు

**కవులు:**—నన్నయభట్టు ప్రథమాంధ్రకవి. రాజరాజనరేంద్రుని ప్రోత్సాహముచేఁ గవితాప్రపంచమును సృష్టించినాఁడు. 'భారత వేదవాక్య రసభావము తెలుఁగలేక నిస్సారమనస్కులై' 'కాసటబీసటే చదివి గాథలఁ ద్రవ్వు తెనుంగువారి'కై భారతము పరివర్తింప దొరకొని ఆరణ్యపర్వము నాలవయాశ్వాసము సగమువఱకు రచించి కీర్తిశేషుఁ డయ్యెను. ఈతనిరచన మృదుమధురమై-శబ్దాలంకారశోభితమై-సంస్కృతపదభూయిష్ఠమై-యుండును. మధ్యాక్కఱలు మొదలగు వృత్తములరచన నన్నయప్రాచీనతను వెల్లడిసేయును. ఈతని భాషాంతరీకరణము స్వతంత్రమైనది. తర్వాత తిక్కన విరాటపర్వము మొదలుకొని భారతభాగమును 'ఆంధ్రావళి మోదముం బొరయ' రచించెను. నుడికారముగల తెలుఁగుఁబలుకుబళ్లఁ గూర్చుటయం దీతఁడద్వితీయుఁడు. తిక్కయజ్వ విరాటోద్యోగపర్వములందు జూపిన 'మహత్త్వకవిత్వపటుత్వ'సంపదలసదృశములు. పదంపడి ఈయుర్వరకుఁ దుల్యుఁడగువాఁడు ఎఱ్ఱాప్రెగ్గడ. ఆరణ్యపర్వశేషపూరణమునం దీతఁడు నన్నయనే యనుకరించెను. ప్రబంధశైలికి ఇతఁడే మార్గదర్శి. ఈతని ప్రబంధశైలి ననుసరించి శ్రీనాథాదులు గ్రంథములను మనోహరముగా వ్రాసిరి. నన్నయ తిక్కన ఎఱ్ఱాప్రెగడలను కవిత్రయ మందురు. వీరాంధ్రభాషకుఁ బ్రామాణికకవులు. వీరి కవిత్వము పదాఱువన్నె బంగారమువలె నిర్దుష్టమైనది. తిక్కన భారతమును ముగింపఁగానే తగ్వాతి కథయగు హరివంశమందలి యుత్తరభాగమును 'నవీనకవితాసనాథుఁ డ'గు నాచనసోమనాథుఁడు రచించెను. ఈతఁడు కల్పనాకౌశలమున-ప్రతిభావిశేషమున-బుద్ధివైశద్యమున- నిరుపమానుఁ డగుట నాంధ్రకవులలో మిన్న యనవచ్చు. కొన్నిసమయములలో నీతనికి సోమయాజిసయితము తీసిపోవును. కేతన దశకుమారచరిత్ర మీసందర్భమున పేర్కొనఁదగినది. పిమ్మట రంగనాథభాస్కరాదులు రామాయణమును తెనిఁగించిరి.

**కవిత్వలక్షణములు:**—ఆంధ్రభాష భట్టారకుతో నవతరించి తిక్కనకాలమునకే జాతీయత యేర్పడి మహోన్నతదశకు వచ్చినది. భారతకవులగ్రంథములు భాషాంతరీకరణము లయ్యును స్వతంత్రముగా నుండును. ఈకాలమున కవు లాంధ్రపదముల నధికముగా వాడుచు వలయుపట్ల సంస్కృతపదప్రయోగముఁ జేయుచు రసవంతమును మనోరంజకమును నగు కవిత్వము చెప్పిరి. ఈయుగమునందలి గ్రంథము లన్నియు భాషాంతరీకరణములే. కాని స్వకపోలకల్పితములు కావు. భారతకవు లెవ్వరును కేవలశబ్దాలంకారములను విశేషించి వాడియుండలేదు. నన్నయ కవనమందును, భాస్కరరామాయణ హరివంశములందునుఁ గొలఁదిగా శబ్దాలంకారములు కలవు. నన్నయ మొదలు సోమనాథునివఱకు నాంధ్రభారతి సర్వాంగసౌందర్యసౌకుమార్యసంపాదన మొనర్చుకొన్నది. ఈయుగకవులు దీర్ఘసమాసములు వాడియుండలేదు. వీరు స్వతంత్రగ్రంథకర్తలు కాకపోయినను శక్తిమంతులు. వాఙ్మయధురంధరులు. ఈకాలమందలి కవులు సాధారణముగా బ్రాహ్మణులే. అయినను బద్దెనన్నెచోడులవంటి రాజకవులును లేకపోలేదు. తిక్కనకాలమునాఁటి కవులు మంత్రులుగా-రాజకీయతంత్రజ్ఞులుగా-యోధులుగా నుండిరి. ఈయుగమందలి కావ్యరచన నీతిబోధకమును, మతవ్యాప్తికిని తోడ్పడినది.

**మతములు:**—ఈకాలమున బ్రాహ్మణమతమే విజృంభించి యున్నను జైనగ్రంథములు కొన్ని తలసూపినవి. నిదర్శనము జినేంద్ర పురాణము. ఆదిత్యపురాణము. భారతభాగవత రామాయణాది గ్రంథ భాషాంతరీకరణము బ్రాహ్మణమతవ్యాప్తినొనర్చి జైనమతమును క్షీణింపఁ జేసినవి. నన్నయాదుల భారతభాగవతాదుల భాషాంతరీకరణములు జైన మతవిజృంభణ మడంచి బ్రాహ్మణమతప్రచారమునకే తోడ్పడెను. కాని వాఙ్మయాభివృద్ధికి గాదని వాఙ్మయచరిత్రకారునినిర్వచనము. వీరశైవమతా వలంబకులు 'జానుతెనుంగు'లో గ్రంథములను రచించి మతప్రచార మొనర్చిరి. పాలకురికిసోమనాథుని పండితారాధ్యచరిత్రముబసవ పురాణము లను ద్విపదకావ్యము లిందుకు నిదర్శనములు.

**పోషకులు:**—ఆదినుండియు ఆంధ్రకవిత రాజపోషణ మున వృద్ధిపొందినది. **11-13** శతాబ్దులలో మన వాఙ్మయమును పోషించినది చాళుక్యులు. చాళుక్యవంశజు లగు సత్యాశ్రయుఁడు యుద్ధమల్లుఁడు మొదలగువా రాంధ్రసారస్వతమును పోషించి రనుటకు నిదర్శనములు పెక్కు లున్నవి. చాళుక్యులు పిమ్మట చోళులు ఆంధ్ర కవిపోషకులుగా నుండిరి. అటుపిమ్మట కాకతీయులును, రెడ్లును ఆదరించిరి. నన్నయ నారాయణభట్టుల భారతము- మల్లనగణితము- విన్నకోట పెద్దన్న కావ్యాలంకారచూడామణి-చాళుక్యుల కాలమునాటి సారస్వతములు. తిక్కన రామాయణ భారతములు చోడులనాఁటి వాఙ్మయము. భాస్కరరంగనాథరామాయణములు కాకతీయులనాఁటివి. ఎఱ్ఱాప్రగ్గడ భారత రామాయణ నృసింహపురాణాదులు రెడ్లయాద రణమున బయలుదేఱిన సారస్వతము.

**వాఙ్మయ రంగములు :**— ఆంధ్రకవితాసతి గోదావరీ తీరస్థమగు రాజమహేంద్రవరమున నన్నయచే సృష్టింపఁబడి క్రమ ముగా పినాకినీనదీప్రాంతముల స్వేచ్ఛావిహారములనుసల్పి-అద్దంకి ఓరుగల్లు ప్రాంతముల బాల్యావస్థను గడపినది. నన్నయకాలమున రాజమహేం ద్రవరమును— తిక్కనకాలమున సింహపురియు—ఎఱ్ఱాప్రగ్గడకాలమున అద్దంకిప్రాంతములును-భాస్కరాదులకాలమున ఓరుగల్లును-నాచనసోమ నాథునికాలమున విద్యానగరమును - వాఙ్మయకేంద్రస్థానములుగ నుం డినవి.

## ద్వితీయపాదము-14-15 శతాబ్దులు

**కవులు:**—ఈకాలమునాఁటి ఆంధ్రవాఙ్మయ విజృంభణ మును తిలకించి మనము విస్తుపోఁగవలసినదే. పినవీరభద్రుఁడు అనంతుఁడు శ్రీనాథుఁడు బమ్మెరపోతన ఈకాలమందలి అనర్ఘులగు కవులు. పిన వీరభద్రకవి భారతకవులతోఁ దుల్యమైనవాఁడు. జైమినిభారతము శకుం తలాపరిణయము లీతనికృతులు. దృశ్యకావ్యములను ప్రబంధములుగా భాషాంతరీకరించుట కితఁడే ప్రథముఁడు. ఈశకుంతలాపరిణయరచనమే ప్రబంధనిర్మాణమునకు దారిచూపెను. అనంతుని భోజరాజీయము నూతన కథావర్ణనాంశములు కలిగి మృదువై మధురముగ నుండును. స్వతంత్ర గ్రంథరచన కితఁడే మార్గదర్శి. భోజరాజీయము స్వకపోలకల్పితగ్రంథ ములలో మొదటిది. శ్రీనాథుఁడు లాక్షణికుఁడైన గొప్పకవి. ఈకవి సార్వభౌముడు 'చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాఁటి' నుండియు భాషాసేవ నొనర్చినవాఁడు. 'కాశీఖండ మయఃపిండం నైషధం విద్వ దౌషధమ్' అని కొనియాడఁబడు రెండుగ్రంథముల నొనర్చిన యాంధ్రీ కరణమే యీతని పాండితీగరిమమును వెల్లడించుచున్నది. ఈతని సీసప ద్యములలోయ్యారఁపు నడకలు కలవి. ప్రబంధపరమేశ్వరునిచే నిర్మింపఁబడిన ప్రబంధశైలిని శ్రీనాథుఁడు సొంపుగా నింపుగా నభివృద్ధిపఱచెను. తిక్కన సృజియించిన మహనీయస్థితిని శ్రీనాథుఁడు ప్రోచినాఁడు. ఇతని కవితాధార మత్తేభగమనిక గలది. ఇతఁడు దీర్ఘసమాసములను విశేష ముగా ప్రయోగించెను. బమ్మెరపోతన భక్తిరసప్రధానముగా భాగవ తముఁ దెనింగించిన ఆత్మగౌరవముకలిగిన కవిసత్తముఁడు. ధనమున కాశించి ఆంధ్రభారతిని కర్ణాటకిరాటకీచకుల కమ్మని మహాత్ముఁడు. లాక్షణికు లీతనిగ్రంథమున లక్షణదోషంబులు కలవందురు. ఇతని కవనమున శబ్దాలం కారములు మెండుకొనియుండును.

**కవిత్వలక్షణము:**—ఇది స్వతంత్రగ్రంథములు బయలు దేఱిన కాలము. భారతమందలి శకుంతలకథ శకుంతలనాటకము సమ్మే ళన మొనర్చి స్వతంత్రముగాఁ బినవీరభద్రుఁడు శకుంతలాపరిణయము రచించెను. భోజరాజీయము నిర్వివాదముగా స్వతంత్రగ్రంథము. శ్రీ నాథుని హరవిలాసము కొంతవఱకు స్వకపోలకల్పితము. భాషాంతరీకరణ మన్న మాటయే కాని ఆంధ్రభాగవతము సంస్కృతభాగవతముకంటె పెద్దది. ఆంధ్రవాఙ్మయనిర్మాతలని మహాకవులని మనము కీర్తించు శ్రీ నాథుఁడు పోతన్నగారు భాషావ్యాప్తికి చెఱియొక అర్గళమును దెచ్చి పెట్టిరి. అవి అత్యంత దీర్ఘతమము లగు ప్రౌఢసమాసములను వాడుట యొకటియును, శబ్దాలంకారాడంబరత్వము నెలకొల్పుట యొకటియు నని నాభావము. సంస్కృతాంధ్ర భాషాపారంగతుఁ డగుట శ్రీనాథు నకు దీర్ఘసమాసము లుపయోగించుట సులభసాధ్యమే. కాని పండితే తరులకది కొఱుకుపడని కొఱకుమైనది. పోతన్న శబ్దార్థముల రెంటికి సమానగౌరవ మిచ్చి సామర్థ్యాతిశయముతో శబ్దార్థాలంకారము లుప యోగించెను. వారతర్వాతికవులు అవిమృశ్యమగు వికారముదెచ్చిరి.

**మతములు :**—భాషాంతరీకరణయుగపు ద్వితీయపాద ములో రామానుజశిష్యు లగు శ్రీవైష్ణవులును, మధ్వాచార్యశిష్యు లగు మాధ్వులును అనేకాంధ్రగ్రంథములను వ్రాసి వారివారి మతసిద్ధాంత ప్రచారమును, ఆంధ్రసారస్వతాభివృద్ధిని నొనర్చి కీర్తికాయు లైరి. శ్రీనాథునికాలమునాఁటికి యవనసంపర్కము కలిగెను.

**పోషకులు :**—పిల్లలమఱ్ఱి పినవీరభద్రునికాలమున కృష్ణదేవరాయల పూర్వులును, శ్రీనాథునికాలములోఁ గొండవీడు రాజమహేంద్రవరము రెడ్లును ఆంధ్రసారస్వతమునకు పోషకులుగా నుం డిరి. పోతన లక్ష్మీదేవిని తృణీకరించి సరస్వతిని ఆత్మగౌరవమున నిలిపెను.

**వాఙ్మయ రంగస్థలములు :**— ఆనెగొంది రాజ మహేంద్రవరము లీకాలమున వాఙ్మయరంగములు. రాజమహేంద్ర వరము భాషాంతరీకరణయుగపు టాద్యంతములందు సారస్వతకేంద్ర స్థానముగా నుండుట విశేషము. పుట్టినిల్లు విడిచి దూరమేగిన ఆంధ్ర

భాషాయోషను తిరిగి జన్మస్థానమునకుఁ దెచ్చినవాఁడు శ్రీనాథుఁడు. ఆంధ్రభారతిని శ్రీనాథుఁడు దేశమంతయుఁ ద్రిప్పినాఁడు. ఈ యుగమందలి తక్కినపాదములలోఁగూడ నించుమించు నిదియే.

## ప్రబంధయుగము. 16-17 శతాబ్దులు

భోజరాజీయ శకుంతలాపరిణయములను - శ్రీనాథుని దీర్ఘసమాసములను - సీసపద్యములను పోతరాజు శబ్దాలంకారములను - శంభుదాసుని ప్రబంధశైలిని - ఆదర్శముగా గొని ఈయుగమున స్వతంత్ర గ్రంథములను వ్రాయ మొదలిడిరి. పెద్దన తిమ్మన కృష్ణదేవరాయలు రామరాజభూషణుఁడు సూరన రామకృష్ణుఁడు వీరలు ప్రబంధకవితా తారాపథమున దివ్యజ్యోతులు. మనుచరిత్ర రచించి ప్రబంధములకుఁ బెద్దన్న మార్గదర్శి యయ్యెను. మార్కండేయపురాణమునుండి కథావస్తువును గ్రహించి - విస్తరించి - మెఱుంగుపెట్టి - మనుచరిత్ర వెల్వరించెను. ఇందలి అల్లికజిగిబిగి నిరుపమానము. ప్రకృతివర్ణనలు మనోహరములు. తిమ్మన పారిజాతాపహరణము ముద్దులుమూటగట్టుచుండును. "ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు" అను చాటువు నతురాస్యులైన ఆంధ్రులలో నెఱుంగనివా రరుదు. కృష్ణరాయ లాముక్తమాల్యదను రచించి తన సారస్వతాభిమానమును వ్యక్తీకరించినాఁడు. ఇతఁడు మానవజీవితపరిశీలనమునందసదృశుఁడు. ఆముక్తమాల్యద నారికేళపాకమునఁ బడినది. అయినను అద్భుతజనకములైన ఇందలివర్ణనలు హృదయరంజకములు. మాంధాతృచరిత్ర కాళహస్తీశ్వర మాహాత్మ్యము మొదలగు మధ్యగకపుగ్రంథము లిప్పటివే ధూర్జటికాళహస్తీశ్వరశతకము గంగాప్రవాహప్రతీకాశ మగు ధారావేగము కలది. రామరాజభూషణుని వసుచరిత్ర శబ్దాలంకారములందు భాగవతమును మించెను. భాషావిషయములో నేగ్రంథమును వసుచరిత్ర కీడురాక పోయినను కథాసంవిధానమందు - సంభావణసమీచీనతయందు - వర్ణనసందర్భమందు - వసుచరిత్ర యధమగ్రంథము. పింగళిసూరన ప్రబంధయుగమునఁ జక్రవర్తి. ఈతని గ్రంథములు అన్నియును రత్నములు. ఆంధ్రభాష కీతఁడొసర్చినసేవ వర్ణనాతీతము. రాఘవపాండవీయము ద్వ్యర్థి కావ్యము. ప్రభావతీ ప్రద్యుమ్నము జాతీయములకునిలయమై - మనోహరమై - నాటకసాంప్రదాయములు కల ప్రబంధము. కళాపూర్ణోదయము కథాసంవిధానమున మిన్న. వ్యర్థపదములు మందునకైనలేకుండ తెన్నాలిరామలింగము పాండురంగ మాహాత్మ్యమును రచించెను. పాండురంగమాహాత్మ్యములోనికథలు నీతిబోధకములు. ఇందలి నిగమశర్మకథననుసరించి కందుకూరు రుద్రకవి నిరంకుశోపాఖ్యానమను రసవత్ప్రబంధము రచించెను. పాండురంగమాహాత్మ్యముశైలి యనుకరణీయమైనది. నిర్దుష్టమైనది.

**కవిత్వసామాన్య లక్షణములు:——** మనుచరిత్రరచన దుర్నీతిబోధక మాయెను. ఇందలి రతివర్ణనలు దూష్యములు. వసుచరిత్ర రచనకుఁ బూర్వపు కవులు మనుచరిత్రనే యనుసరించిరి. ఇది మొదలుకొని యనుకరణమే కవిత్వమైనది. ప్రబంధకవులు విశేషసమ్మానములు బడయుటచేఁ గవులు ప్రబంధములు కుప్పతెప్పలుగా రచించిరి. ప్రస్తుతము మనకాలమున నాటకరచనకూడ నిట్లే యున్నది. మనుచరిత్ర రచనానంతరము భాషకు మూఁడున్యూనతలు సంభవిల్లినవి. అవి—కవులు యౌచిత్యమును గమనింపక కేవలము అనుకరణనె నాధారపడుట. శ్రీనాథపోతనల దీర్ఘసమాసాలంకారముల యాదర్శము. భాష కవుల కధీనమై యుండుటకు మాఱు కవులే భాషకధీనులై నిఘంటువులపై నాధారపడుట. ఇఁకను రామరాజభూషణుని వసుచరిత్రతో మనభాషకు నాల్గవన్యూనత సంభవించెను. వసుచరిత్ర తరువాతి ప్రబంధము లన్నియు దానికి ప్రతిమలే. ఈకాలములోనివాఁడైనను జేమకూర వేంకటకవి 'భూమెుగ్గలవలె తమకుఁదామే విడు శ్లేషలతో చవులూరు రచనలతో అనుద్వేగకరములగు వర్ణనలతో - విజయవిలాసమును విరచించి ధన్యుఁడాయెను. అడిదము సూరకవి కూచిమంచితిమ్మకవి మొదలగువారు పప్పులోఁగాలు వేసిరి. పింగళిసూరన్న ద్వ్యర్థి కావ్యరచనతో నైదవ న్యూనత కలిగెను. రసవిజృంభణము - శయ్యాలాలిత్యము - కథాచమత్కారము - శ్లేషకావ్యములందుఁ బూజ్యములు. అనఁగా నభావము లనుట. కావున నదిమొదలుకొని భాష క్షీణదశ నొందినది.

**పోషకులు - వాఙ్మయరంగములు :——** ఆంధ్రభారతిని జయంత్యుత్సవములతో పల్లకులపై నూరేగించినది యీయుగమందే. కృష్ణదేవరాయల 'భువనవిజయమున' వెల్వడిన గ్రంథము లన్నియు నాంధ్రకవితాసతికలంకారములు మనసారస్వతాభివృద్ధి కాలములో దీనిని 'ఆగస్టన్ ఏజి' అనవచ్చును. తంజావూరు రాజులు - మధురనాయకులు - శక్తికొలది సారస్వతమును బోషించిరి. విద్యానగరమే ఈయుగమందలి సరస్వతీనిలయము.

## మధ్యమయుగము - 18-19 శతాబ్దులు

**కవిత్వసామాన్యలక్షణములు :——** మధ్యమయుగమున భాషాయోష కురూపయై కుంట నారంభించినది. ఇదివఱకే వ్యాపించియున్న న్యూనములు గాక మఱిరెండు న్యూనములు వచ్చినవి. మొదటిది అచ్చతెనుఁగుగ్రంథములు. పొన్నగంటి తెలగనార్యుఁడు యయాతిచరిత్ర నచ్చతెనుఁగులో రచించి భాషను విధ్వస్తమొనర్చినాఁడు. మహాకవు లనిపించుకొనుటకైఁ గూచిమంచి తిమ్మనాదు లచ్చతెనుఁగులో గ్రంథములు కురియించిరి. వీరి గ్రంథములు సారస్వత వినాశనమునకుఁ దోడ్పడిన వనకతప్పదు. 2. నిరోష్ఠ్యాదినియమములతో గ్రంథరచనము. ఆధునికులగు శ్రీవీరేశలింగముపంతులుగారు కూడ నిరోష్ఠ్యాది నియమములతో గ్రంథములు వ్రాసి భాషాదేవిని బంధించుటలో పాల్గొనఁగల్గిరి. ఉత్తమ కావ్యమనఁదగినది యొక్కటియు నీమధ్యమయుగమున వెడలలేదు.

**అష్టాదశవర్ణనలు - శృంగారరసము:——** ఈయుగపువారు ప్రాచీనుల పద్యములనే మార్చి-మార్చి వ్రాసి వెలార్చిరి. లక్ష్మణకవి తిమ్మకవి మొదలగువారు ఇందులకు దక్షులు. వీరితోఁ బ్రబంధయుగమున కవసానదశ సిద్ధించి - స్త్రీవర్ణనములు మితిమీఱి - అష్టాదశవర్ణనలే ప్రబంధమునకు ముఖ్యవిషయములుగనైనది. భోగపరాయణులైన ధనవంతులు పోషకులుగా నుండుటచే అసభ్యశృంగారము ప్రధానమైనది. కనుకనే ఈ ప్రబంధములు ఇప్పటినాగరకుల కనిష్టజనకములై యున్నవి. శేషము వేంకటపతిగారి తారాశశాంకవిజయము ముద్దుపళినిరాధికాస్వాంతనమును ఇందులకు నిదర్శనములు.

**క్రైస్తవ వాఙ్మయము:——** మహమ్మదీయసంపర్కము గల ప్రబంధయుగములో మహమ్మదీయగ్రంథము లేవియు వెల్వడకున్నను ఇప్పుడు క్రైస్తవమతసంపర్కములోమాత్రము మతప్రధానములగు గ్రంథములు పొడసూపినవి. ఈయుగాంతమున బైబిలు వచనరూపకముగ వ్రాయఁబడినది. ఆంగ్లేయభాషలో బైబిలుశైలి (Standard style) నిర్దుష్టమైనది. ఇఁక నాంధ్రమునందన్ననో బైబిలుశైలి విపరీతమై యవిషహ్యముగనున్నది. ఇది ఇప్పటి పబ్లిసిటీబ్యూరోవారి శైలినిపోలియున్నది.

## ఆధునికయుగము - 20 వ శతాబ్ది

ఆధునికయుగారంభముతో నాంధ్రభారతికి శుభదినములు వచ్చి

నవి. ఇంతవఱకుఁ గుంటుచుండినవాఙ్మయము కుప్పిగంతులు వేయుచున్నది. ఈయుగమునఁ బ్రజాదరణమే గ్రంథరచనకుఁ బురికొల్పుచున్నది. ప్రభువులకు బదులు ప్రజలే పోషకులైరి. ముద్రాశాలలు ప్రతిపట్టణమునను నెలకొని ప్రతివ్యక్తియు సారస్వతాభివృద్ధికి కొద్దియో గొప్పయో పాటుపడుచుండుట శుభచిహ్నము. ముద్రాయంత్రస్థాపనతో వాఙ్మయాభివృద్ధి విశేషమైనది. పుస్తకములు చవుకగా సులభముగా నెల్లఱకు లభించుచున్నవి. విద్య సులభసాధ్యమైనది. ఆధునికాంధ్ర వాఙ్మయము పాలసముద్రమువలె అపారముగా నున్నది. అయినను నా యోపినకొలఁది ప్రస్తుతయుగమునందలి సారస్వతభాగముల నొక్కొకటిగాఁ దీసికొని చర్చింతును.

**వచనము:**— ప్రస్తుతము పద్యకావ్యములు ప్రజాదరణఁ బడయఁజాలకున్నవి. వచనగ్రంథము లాదరణీయము లగుట పదునెనిమిదవశతాబ్దినుండియు. మధ్యమయుగకవులవచనములు కొండవీటిచేదంత్రాళ్లవలె దీర్ఘములై దుర్భేద్యములైన దుర్గములవలె నుండును. భారతకవులలోఁ—దిక్కనవచనముకంటె నన్నయవచనము మనోహరము. ప్రబంధములందలి వచనములు నిర్గమములేని దుర్గములు. నిఘంటుసాహాయ్యము లేనిదే యవి లొంగవు. మధ్యమయుగములోఁ గొన్ని మనోహరవచనకావ్యములు రచింపఁబడినవి. జైమినిభారత మిట్టిదే. చిన్నయసూరి ఆంధ్రవచనరచనకు * గట్టి పునాదులు వైచిరి. ఆధునికవచనరచనయందు శ్రీ వీరేశలింగముగారే ఆదర్శకులు. ఇక నవలలను గుఱించి చర్చింతము.

నవలలందు సహజమగుమాధుర్యము కలదు. విమలాదేవి రాయచూరు యుద్ధము నవలాసారస్వతమున సుప్రసిద్ధగ్రంథములు. చిలకమర్తివారి నవల లాంధ్రభాషకలంకారములు. ఇంగ్లీషున స్కాటువ్రాసిన ఐవన్హో తాలిస్మానులవలె ఆంధ్రమునందు చిలకమర్తివారి కర్పూరమంజరి సౌందర్యతిలక చిరస్థాయులు. ఇప్పుడు పెక్కులు నవలలు బయలుదేరుచున్నవి. కాని వాఙ్మయాభివృద్ధి చేయలేని గాగితంపుకట్టలు. ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము ఇట్టి నవలలకు ఫ్యాక్టరీ. కనుక నవలలసంఖ్య పెఱుగుచున్నదే గాని జీవకళగల వాఙ్మయము అందుండి వెలువడలేదు.

౧ **ప్రకృతిశాస్త్రములు:**— ప్రకృతిశాస్త్రము లవశ్యముగా నాంధ్రీకరింపవలయును. పారిభాషికపదములను సేకరింపవలయును. ప్రకృతిశాస్త్రము లాంధ్రీకరించుటకును ప్రచురించుటకును ముఖ్యులు శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు. వారిదే విజ్ఞానచంద్రికామండలి. ఈ మండలినుండి చంద్రికాప్రసారము నిలచిపోవుట ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి గొప్పలోపము. శ్రీ లక్ష్మణరావుగారి విజ్ఞానసర్వస్వసంపాదకత్వము మిక్కిలి స్తుత్యమైనది.

**నిఘంటువు-వ్యాకరణము:**— సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణముతో నిఘంటువు లేనిలోపము తొలఁగును. సమగ్రమగు వ్యాకరణముకూడ మనకు లేకయున్నది. మహామహోపాధ్యాయులగు వేదము వేంకటరాయశాస్త్రులవంటివా రిట్టికార్యములకు పూనుకొనునట్లుచేయుట ఆంధ్రులవిధి.

**నాటకములు:**— పూర్వకవులు నాటకములు రచింపరైరి. సంస్కృతనాటకము లాంధ్రీకరించుచోఁ బ్రబంధరూపముగాఁ బరివర్తించిరి. నిదర్శనముగ శృంగారశాకుంతలము ప్రబోధచంద్రోదయము చేకొననగును. శ్రీనాథునివీథినాటకము నాటక మనిపించుకొనదు. నాటకవాఙ్మయాభివృద్ధి యాధునికమైనది. నాటకసారస్వతాభివృద్ధి-ప్రోత్సాహకరముగా-శుభప్రదముగా-లేదు. శతాధికనాటకకర్తలు ఇపు డాంధ్రదేశమున శతాధికు లున్నారు. అయినను ఉత్తమనాటకము లింకను బయలుదేరవలసినస్థితియే యున్నది.

**పత్రికలు:**— పత్రికలు నాగరకతకు ముఖ్యములు. నార్త్‌క్లిఫ్‌వంటిపత్రిక మనదేశమునం దుద్భవిల్లిన బాగుండును. మనఁబత్రికాప్రచారము ఉత్సాహకరముగా లేదు. దినపత్రికలలో నాంధ్రపత్రికయును వారపత్రికలలో కృష్ణాపత్రికయును మంచిసేవ చేయుచున్నవి. ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక లమూల్యములు. చిత్రపటశోభితములు. ఆంధ్రపత్రికను చూడనివాఁడైనను ఉగాదిసంచికనుమాత్రము చూచితీరును. ఉగాదిసంచికలోని చిత్రపటము లయస్కాంతములవలె జనుల మనముల నాకర్షించును. ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము సారస్వతసేవ నిరుపమానముగా నొనర్చుచున్నది. ఆంధ్రమున సచిత్రమాసపత్రిక లేనిలోపము గొప్పదే. టాగూరుఅండుకోవారి 'కళ' ఈలోపమును కొంత వఱకు నివారింపగలదనవచ్చును. ఆంధ్రభారతి గ్రంథాలయసర్వస్వము మొదలగు సచిత్రమాసపత్రిక లిప్పుడు వెల్వడకుండుట శోచ్యము.

**చరిత్రలు:**— చరిత్రరచన మనకుఁ గ్రొత్తకాదు. కృష్ణరాయవిజయము రంగరాయచరిత్ర పల్నాటివీరచరిత్ర ప్రతాపచరిత్ర మొదలగునవి పెక్కులు చరిత్రలు పూర్వకవులు వ్రాసిరి. చారిత్రకసారస్వత ముత్సాహకరముగా వృద్ధినొందుచున్నది. వీరేశలింగము పంతుల ఆంధ్రకవులచరిత్ర- లక్ష్మణరావుగారి హిందూదేశచరిత్ర- వీరభద్రరావు ఆంధ్రులచరిత్ర- సోమశేఖరశర్మ ఆంధ్రవీరులు- వంగూరి సుబ్బారావు వాఙ్మయచరిత్ర - ప్రాచీనాంధ్రనౌకాజీవనచరిత్ర- మొదలగునవి ఇప్పటి చారిత్రకగ్రంథభాండాగారమునం దున్న చారిత్రికములగు గ్రంథములు.

**రాజకీయవాఙ్మయము:**— రాజకీయవాఙ్మయాభివృద్ధి ఉత్సాహకరముగా నున్నది. మహాత్మగాంధి నిరాకరణోద్యమఫలితముగా మనలో రాజకీయసారస్వతము తామరతంపరైనది. ఈసందర్భమున సూనికొండ సత్యనారాయణగారి రాజకీయగ్రంథానువాదములు స్తుత్యములు.

**విమర్శనములు:**— సత్యదృష్టిగలవిమర్శనలు మనలో లేవు. మనలో బ్రతిపక్షదూషణమే విమర్శనమని రూఢమైనది. వీరేశలింగము పంతులే యిట్టి పేరుగొనుటకు పాల్పడిరి. ఇప్పుడిప్పుడు మంచిమంచి విమర్శనములు వెలువడుచున్నవి. రామలింగారెడ్డి కవిత్వతత్వమును- మల్లాదివారి భారతవిమర్శనమును- తేవప్పెరుమాళ్లయ్య గ్రంథపీఠికలు- నిష్పక్షపాతవిమర్శనలు. బ్రహ్మయ్యశాస్త్రిగారి విమర్శనము లాంధ్రవిమర్శనవాఙ్మయమున విమర్శకాదర్శప్రాయములు.

**ఉపసంహారము:**— నేడాంధ్రభాష సర్వాంగసుందరముగా నున్నది. వచనగ్రంథములు వృద్ధియగుచున్నవి. నవలావాఙ్మయము వృద్ధికావలసియున్నది. ప్రకృతిశాస్త్రములు పత్రికలు వృద్ధియగునట్లు మన మెక్కువ పట్టుదల చూపవలయును. చారిత్రిక రాజకీయ విమర్శకవాఙ్మయాభివృద్ధి ప్రోత్సాహకరముగ నున్నది. సూర్యరాయాంధ్రనిఘంటు ప్రచురణమునకై ఆంధ్రులు స్వాతివానలకు ముత్తెపుచిప్పలవలె వేచియున్నారు. ఆంధ్రవాఙ్మయమునకు మున్ముందు సర్వతోముఖమగు నభివృద్ధిగల్గు దినములు లభించుగాక.

* ఆంధ్రవాఙ్మయ విమర్శకులలో బహుళసంఖ్యాకులు ఇందుల కంగీకరింపరు— సంపాదకుడు.

# ఆంద్రూసు మహర్షి

జనమంచి సీతారామస్వామి గారు

భారతపుత్రు లెప్పు డెట బాధలు పడ్డ, నవెల్ల నీకుఁ జే
కూరినయట్లె యెంచి కడుఁ గుందుచు వానిని దీర్ప నిత్యమున్
భూరిప్రయత్నముల్ సలుపు పుణ్యధనుండవు తెల్లవారిలో
నేరయినన్ భవత్సములు పృథ్విఁ గలారె! మహాత్మ! యాంద్రూసూ!

ఉ. శ్వేతశరీరమే మొదటఁ జెందినవాఁడవు; కాని, నీవు మా
జాతికి మేలుచేయుటకు సర్వవిధంబుల నున్నదేశమం
దాతతకష్టముల్ పడుట సద్ధవళత్వమువోయి నీదు ప్ర
ఖ్యాతికి నబ్బుచున్నదిగ దా! యిఁక శాశ్వతమౌట యబ్రమే!

శా. నీనమ్రత్వము, నీదయాహృదయమున్ నీశాంతిసంపత్తియున్
నీనిర్నిద్రపరోపకారమతియున్ నీశౌర్యధైర్యంబులున్
నీనిశ్చంచలభక్తియున్ బొగడఁగా నేర్పుమియున్ లేదు నా
కానందంబది యెంతయైనఁ గల దయ్యా హైందవోద్ధారకా!

మ. ఒకమాటయ్యెను నీదుదర్శనము నా కోహో! మదింబుట్టె నీ
వొక బ్రహ్మర్షివటన్న భావ మది నీ యుక్త్యమృతం బానఁగా
నిఁక నెంతో దృఢమైన దయ్య భళిరా! యే మెన్నఁడున్ మర్వలే
మకలంకంబగు నీదుజీవితము నో యాంద్రూసు ధీరోత్తమా!

ఉ. కొందఱు తెల్లవారమిత కోపముతో నినుఁ దిట్టిపోయఁగాఁ
గొందఱు మూష్కరాధములు కొట్టుట కుద్యమ మాచరింపఁగాఁ
గొందఱు రాక్షసుల్ మిగుల గ్రొవ్వి నినుం బయికీడ్చుచుండఁగాఁ
హైందవజాతివృద్ధికి గదా సహియించితి వెల్లబాధలన్.

తే. తెలివియణుమాత్రమును లేక పులినిజూచి,నక్కవాఁత పెట్టుకొనిన ట్లక్కటకట!
తెల్లదొరల వేషము వేయు నల్లదొరలు, సిగ్గుపడ రేల నినుఁజూచి నష్టుడైన!

తే. కామినీకాంచనాపేక్ష గలుగనీక, యనృతవాక్యము లెన్నఁడు నాడఁబోక
భరతజననీచరణసేవ వదలలేక, యలరుచుండెడు నీకన్న నధికుఁడెవఁడు?

సీ. అస్పృశ్యతాదోష మంతరింపకయున్న భరతదేశము ముక్తిఁ బడయలేదు
మనకందఱకు నైక్యమత్యంబు లేకున్న భరతదేశము ముక్తిఁ బడయలేదు
స్వార్థపరత్వంబుఁ జంపుకొనకయున్న భరతదేశము ముక్తి బడయలేదు
కష్టసహనశక్తి గలిగించుకొనకున్న భరతదేశము ముక్తి బడయ లేదు

గీ. అనుచు బోధించి, బోధించినట్లు చేసి దేశ మభివృద్ధినొంద రాత్రింబవళ్లు
పాటుపడుచున్న నిన్నెన్న వశమె మాకు? ధన్యచారిత్ర! భారతదత్తపుత్ర!

తే. పరమదీర్ఘాయు రారోగ్య భాగ్య మొసగి,యీశ్వరుఁడు నిన్నెపుడు రక్షించుగాక
యనుచు బ్రార్థింతుమయ్య మే మహరహంబు,సద్గుణాగణ్య ఆంద్రూసు ఋషివరేణ్య

# దార్ఢ్యము

**ఏరీతిగ పోవును?** **ఏరీతిగ వచ్చును?**

మేము నిన్నుక దార్ఢ్యవంతునిగ జేయగలము.

నీవు పోగొట్టుకొనిన బలమును తిరిగి పొందుటకు నీవేమి యివ్వగలవు? కొన్ని సంవత్సరములకు పూర్వము నీ కుండిన బలమును చురుకుతనమును తిరిగి కలుగజేయుటకు నీవు ఎంత సొమ్మైనను యిచ్చుటకు సిద్ధపడుదువు. మనోల్లాసము, దారుఢ్యము, ధాతుపుష్టి మున్నగునవి కలుగును. మునుపటికంటె నీవు మంచి ఆరోగ్యమును కలిగియుందువు. అట్లు ఉండుట నీకు ఇష్టమేను. పూర్తిగా కృషించి పోయిన అనేకులకు ప్రతిదినము మా ఔషధము మంచి దారుఢ్యము నిచ్చుచున్నది.

మా విగోరా అను ఔషధమును సేవించుటచే ఇదివర కెప్పుడు వుండని దారుఢ్యము మీకు తప్పక కలుగును.

ప్రాగ్యదేశపు బలవర్ధక ఔషధము. ముఖ్యమైన ఓషధులనుండి తయారుచేయబడినది. అజీర్ణము, పైత్యము, మలబద్ధకము, పాండు:రోగము, బలహీనము, నిస్త్రాణ మున్నగునవి అద్భుతముగా కుదురును. శరీరమంతయు క్రొత్త మార్పును బొందును.

ఒక బుడ్డిని **వాడి** చూచిన దాని అద్భుతమైన గుణము మీకు తెలియును. బుడ్డి 1-కి ధర రూ **1—8—0.**

హిందూదేశమునం దుండువారికి తపాలచార్జి లేదు. ప్యాకింగు ఖర్చులుమాత్ర ముండును.

ఇండియన్ మెడికల్ డిపో,

ఏజెంట్లు కావలెను. భావనగరు (కత్తియువారు - ఇండియా)

INDIAN MEDICAL DEPOT, Bhavnagar, (Kathiawar) INDIA.

☞ ఆర్డరును పంపునప్పుడు ఈ సంచిక పేరును తెలుపుడు.

# ది యునైటెడ్ ఇండియా లైఫ్ అష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

## హెడ్ ఆఫీసు: మద్రాసు

5 సంవత్సరముల కొకసారి 1000-కి రూ 75 ల వంతున

వారసుదారులకు లాభమును పంచిపెట్టిన మద్రాసు భీమాకంపెనీ ఇది ఒక్కటియే.

పాలసిదార్లకు మిక్కిలి అనుకూలమైన షరత్తులు గలవు.

ప్రత్యేక సదుపాయము: వాయిదాకు పైగ అనేకదినములు గడువియ్యబడును.

ప్రీమియములు మితమైనవి. వారసుదారులహక్కు సులభముగాను, త్వరితముగాను తీర్మానించబడును.

మద్రాసు రాజధాని ప్రజలకు మిక్కిలి అనుకూలమైనది.

ప్రాస్పెక్టసునకు ఈ దిగువచిరునామాకు వ్రాయవలెను:—

కె. ఎస్. గోపాలయ్య, మేనేజరు.

# శాస్త్ర మనఁగా నేమి?

పొరనంది జగన్నాథస్వామి గారు, బి. ఏ., ఎల్. టీ.

ఆంధ్ర వాఙ్మయావిర్భావములలో నొకటియైన నూతనపరిభాషలో - శాస్త్రము శాస్త్రీయ విచారణ శాస్త్రీయపద్ధతి శాస్త్రీయదృష్టి - మొదలుగా గల పదముల నుపయోగించునపుడు లేఖకుల అభిప్రాయ మేమియో, చదువరుల మనస్సున గలుగు సంస్కార మేమియో, స్పష్టము కాకుండుట సంభవించుచున్నది. ఎట్లనఁగా నాయుర్వేదవైద్యము శాస్త్రీయమని కొందఱును గాదని కొందఱును జ్ఞానవంతులే వివరించుచుండుట మనముందఱము నెఱుఁగుదుము. ఇట్లే దయ్యములున్నవా లేవా? స్వప్నములు సత్యములా, లేక అసత్యములా అనెడు చర్చలలోఁ గూడ శాస్త్రీయపద్ధతి ఉన్నదని కొందఱును, లేదని కొందరును వాదించుచున్నారు. పాశ్చాత్యవిజ్ఞానసంపర్కముకల వారు ఒక తీరునను, లేనివారు ఇంకొక తీరునను, ఈపరిభాషాశబ్దమును నిర్వచించుటను ఈవాదములకు ఈవాదములలో నుండు అస్పష్టతకును కారణ మగుచున్నది. పాశ్చాత్యవిజ్ఞానములో వాడఁబడుచుండు 'సైన్సు' అనెడు శబ్దమునకుఁ బర్యాయముగ దీనిని - అనఁగా నీశాస్త్రశబ్దమును-ఉపయోగించుచుండునటుల నందఱకును విదితమే. ఆవిషయమునే కొంచెముగ నిచ్చట విచారింతము.

విజ్ఞానచరిత్రమును పరీక్షించినచో విజ్ఞానసంపాదనము రెండుప్రకారములజరుగుచున్నదనిస్పష్టమగును. ఒకటి వ్యాప్తిప్రయోగపద్ధతి. రెండవది వ్యాప్తిసంపాదకపద్ధతి. వ్యాప్తి అనఁగా-ఒకసామాన్యమును వ్యక్తపరచు సూత్రమువంటిది. దానిని ప్రత్యేకసంగతులకు పట్టించి-అందుండి ఒక విశేషమును గ్రహించుట మొదటి పద్ధతి. ఇందులకు ఒక ఉదా.—"ఎచ్చటెచ్చట పొగయుండునో అచ్చటచ్చట అగ్నియునుండును." అనెడువ్యాప్తిని తొలుత ఒకపొగ కనబడుస్థలమునకు సంయోజించి, ఆస్థలమున తప్పక నిప్పుండి తీరవలయునని గ్రహించునపుడు అవలంబించెడిపద్ధతి. ఇట్లు ఎచ్చటెచ్చట సూత్రములను సిద్ధాంతములను న్యాయములను ప్రత్యేకవిషయములకు సంబంధించునట్లు తర్కించుచుండుమో ఆపద్ధతిని వ్యాప్తిప్రయోగపద్ధతిగఁ దలంచెదము. ఒకమారు సూత్రములు స్థిరమైనపిదప లభించుజ్ఞానము ఆసూత్రసంయోజనమువలనఁ గలుగుచుండును. ఈ పద్ధతిలో సూత్రములతథ్యతఁగుఱించి ప్రశ్నమేయుండదు. సూత్రముల ప్రయోగములోను సమన్వయములోను విచారణకు అవకాశముండును. కాని ఆసూత్రము ఋజువగునది కానిది అనుచర్చకు అవకాశ ముండదు. సూత్రములు అమోఘములు - అనాదులు - పరిపూర్ణములు - అనెడు అభిప్రాయము అట్టి స్థితిలోఁ గ్రమముగ స్థిరపడును. అపుడు జ్ఞాన మనఁగా సూత్రములను దెలిసికొనుట, సూత్రముల అన్యోన్యసంయోజనము ఎట్లని విచారించుట - సూత్రములను ప్రత్యేకసంగతులకు పట్టించుటమాత్రమే యగును. అంతియకాక నూతనసూత్రసంపాదనము కూడ అసంభవమగును. విషయ మెట్టిదైనను అల్పోత్కృష్టభేదము లేకుండ దానివిచారణ చేయవలెననిన దానికి హత్తెడు ఒక సూత్రమును, లేక రెండుమూఁడు సూత్రముల సంయోజనను నిరూపింపవలయును. ఇట్లు జరుగుటవలన జ్ఞానవృద్ధికి అరికట్టు కలుగును. ఈస్థితిని విశదపఱచుటకు పాశ్చాత్యదేశములో నొకప్పుడు తటస్థించిన ఒకవృత్తమును తెలియ జేసెదను.

ఆ దేశములలో 300-1200 సంవత్సరముల సమయమున విజ్ఞానమంతయు వ్యాప్తిప్రయోగమేయై యుండెను. పూర్వము అరిస్టాటిలు మొదలైన పండితులు సంకల్పించిన జ్ఞానము క్రమముగా సూత్రితమైనది. ఈజ్ఞానమంతయును ఆనాఁటి మతప్రవక్తల చేతులలోనుండెను. వారు పెద్దపెద్దమఠములను జేరియుండిరి. అట్టి మఠములలోనే అధ్యాపనము ఆరోజులలో జరుగుచుండెను. ఒకనాడు ఒకపెద్దమఠములో ఒకనికి ఒకసంశయము కలిగినది. చచ్చినచేప నీటిలో మునుఁగునా? లేక తేలునా? అని శంక. దాని నివృత్తికై సూత్రపర్యాలోచనము చేయవలసి వచ్చినది. అదియే ఆనాఁటి విజ్ఞానపద్ధతి. అతనియొద్ద నున్న పుస్తకములను త్రిప్పి చూచినాడు. ఎక్కడను అతనికిఁ దగినసమాధానము కానరాలేదు. అందుచేతఁ దనకంటె

వ్యాపకుఁడైన పండితునిఁజేరి సంశయనివృత్తికై ప్రార్థించినాఁడు. మతస్థలములలో సంశయము తీరనిచో ఉపవాసముచేసి దైవప్రార్థనముఁగావించి నివృత్తియగువఱకు ఉపవాస ప్రాయశ్చిత్తమున నుండవలసియుండును. ఆ యిద్దఱు పండితులును ఎంత శ్రమపడినను ఫలము కలుగక పోయినందున ఈ సంశయము క్రమశః మతాధిపతి సముఖమున నుంచఁబడినది. అంతట మతస్థు లందఱును సభచేసినారు. శంక తీఱలేదు. పూజాదులు కట్టివేయఁబడినవి. పుస్తకములపరిశోధనము- భాష్యములసమన్వయము- పంక్తివిచారణము- ఒకవైపునను,ప్రార్థనలు- ఉపవాసములు- ప్రాయశ్చిత్తములు-ఒకవైపునను, ఇట్టిదౌర్భాగ్యస్థితికిఁగారణమైయుండుపాపమేమైయుండునని శోధనమొకవైపునను, మతములో జరుగ నారంభించెను. పాపము. ఏమైనను సరియే. శంకకుఁ దగిన సమాధానము కుదురలేదు. పండితుతెక్కు- వైనకొలది - భాష్యపఙ్క్తుల సమన్వయచర్చ యెక్కువైనకొలది - శంకానివృత్తి తక్కువగుచుండెను. ఇట్లొకవారము నడువగా మతాధిపతి మరణాంతః ప్రాయశ్చిత్త నిశ్చయమునకై ఒకమహాసభను గావించి చర్చ ప్రారంభింపించినాఁడు. ఈ అవస్థను జూచుచుండినబాలకుఁడొకఁడు భయభక్తులతో వణకుచు లేచి నిలుచుండి మాటాడ ననుజ్ఞను వేఁడునట్లు సూచించెను. అనుజ్ఞనుబొంది పండితశిరోమణులారా! మతాధిపతీ! నా కొకసాధనము తోఁచినది. ఈశంకను తీర్చుటకు ఒక చిన్ననీళ్లతొట్టిలో ఒక చచ్చినచేపను వేసి చూడఁగూడదా యని ఆవిద్యార్థి పలుకఁగా అందఱు ఆసభలో నున్నవారందఱు ఒక్కమాఱు అతనిని కసరి "ఈమాత్రము మాకు తెలియదని చెప్పవచ్చినావా" అని అఱచిరి.

వ్యాప్తిప్రయోగపద్ధతియే జ్ఞానమార్గమైనపుడు ఇట్టి దుస్స్థితి జ్ఞానమునకు ప్రాప్తించును. చాలకాలము నుండి మనము ఈదేశములో నిట్టి స్థితిలోనే యుండుచున్నాము. పూర్వులు సంగ్రహించిన విజ్ఞాన మంతయు సూత్రింపింపబడి మనకుభాష్యములమూలమున వ్యక్తము చేయబడుచుండుటచేత ఆసూత్రసమన్వయము ఆభాష్యనిర్వచనము అనెడు వ్యాప్తిప్రయోగపద్ధతిలో పడి కొట్టుకొనుచున్నాము. అందుచేత మనదేశములో శాస్త్ర మనగా ఈపద్ధతి నవలంబించు వాటికే చెల్లుచున్నది. శాస్త్రమను శబ్దమునకు శాసించునది- అనగా ఆజ్ఞనిచ్చునది- అనెడు అర్థమును మన పండితులు చెప్పుచున్నారు.

ఆ అర్థములో వృక్షశాస్త్రము ధర్మశాస్త్రము ఈరెండు శబ్దముల నిర్వచనమును పరీక్షింతము. వృక్షశాస్త్రసూత్రములు ఎవరిని శాసించును. సూత్రములు వృక్షములను శాసించునా లేక వృక్షములు సూత్రములను శాసించునా? ఏది సమంజసముగ నున్నది? ఆవిధముననే ధర్మశాస్త్రమున ధర్మసూత్రములు మనుజులను శాసించునా లేక మనుజులు వారి ప్రవర్తనద్వారా ధర్మసూత్రములను శాసింతురా? ఈవిచారణవలననే శాస్త్రశబ్దము మన పండితులచే ఎట్లు నిర్వచనము చేయబడుచున్నదో వ్యక్తమగుచున్నది.

వ్యాప్తిప్రయోగపద్ధతి నవలంబించునది శాస్త్రము కాదని చెప్పుట పొరపాటు. కాని యేసూత్రములను వ్యాప్తులను ప్రయోగించుటకు అది సిద్ధమగునో ఆవ్యాప్తుల గురించి శోధనలు అవకుంఠము కాఁగూడదు. వ్యాప్తిసంపాదనము అందుచేత నెల్లప్పుడును ముఖ్యము. వ్యాప్తులు అమోఘములు. ఎప్పటికిని కానేరవు. ఎందుచేత ననగా వ్యాప్తికి ఆధార మేమి అనెడు ప్రశ్నకు ఎల్లప్పుడును అవకాశము కలదు. ఆకారణముచేతనే పాశ్చాత్యదేశములో వ్యాప్తిప్రయో విజ్ఞానలోపములు విశదమైన నాటినుండి వ్యాప్తిసంపాదకవిజ్ఞానము ఉత్కృష్టమగుట తటస్థించినది. ఆలాగుననే శాస్త్రమను శబ్దము క్రమముగ వ్యాప్తిసంపాదకవిజ్ఞానమునకు ప్రవర్తక మాయెను. న్యాయముగ శాస్త్ర మనగా రెండును నైనప్పటికి వ్యాప్తిసంపాదనవిచారణము ముఖ్య మగుటచేత ఆపద్ధతికి ఆమాట చెందుట తటస్థించినది. శాస్త్ర మనగా వ్యాప్తిని సంపాదించునది అని యర్థమాయెను. ఒకమాఱు వ్యాప్తిసిద్ధమైనపిదప జరుగవలసినది వ్యాప్తిప్రయోగమే కదా. చర్చ కలిగినచో ఆవ్యాప్తియొక్క తథ్యత గుఱించియే సందేహము కలుగును. అప్పుడు వ్యాప్తిసంపాదక నియమములను నిరూపించి ఆవ్యాప్తియొక్క ఆధారములను తెలియబఱుపవలసివచ్చును.

వ్యాప్తికి ఆధారము ఎల్లప్పుడును జరిగిన సంగతులుకదా. ప్రకృతిలో సంభవించెడు సంగతుల ఏకీకరణము చేసి అన్నిటికిని సంబంధించెడి సూత్రమును ప్రతిపాదింపవలయును. ఎట్లనగా- వృక్షములతత్త్వమును తెలియబఱుచుసూత్రములకు ఆధారమువృక్షములు. ఆసంగతులనుజతపఱచి ఆవృక్షము లన్నిటికిని సరిపడు సూత్రమును ప్రతిపాదింపవలయును. ఒకవృక్షమైనను ఆసూత్రమునకుసరిపడ

నిచో ఆసూత్రమును అంగీకరింపజాలము. వ్యభిచారము లేని సూత్రమే సిద్ధాంత మనదగును. ఎపుడు ఒక్కవ్యభిచారసంగతి యైనను కనబడునో అప్పుడే ఆ సూత్ర సామాన్యమునకు భంగము కలుగును. ఈసంబంధమును-అనగా సూత్రములకు ఆధారము సంగతు లనెడు సంబంధమును-అవలంబించునదియే శాస్త్ర మనదగును.

ప్రతివ్యాప్తికిని ఆధారము జరిగినసంగతులైనచో విజ్ఞాన సంపాదనమునకు సాధనములైన ప్రమాణములలో శబ్దప్రమాణ ముండనేరదు. వ్యాప్తియొక్క నిరంకుశ ప్రామాణ్యమును భంగపఱచునట్టి ఈశాస్త్ర పద్ధతి అంగీకార్యము కాని కాలములో మాత్రము శబ్దప్రమాణము అన్నిటికంటెను బలవత్తరముగనుండెను. అందుచేత శాస్త్రమునకును ఆప్తవాక్యమునకును విరోధము కలదని చెప్పవచ్చును. పాశ్చాత్య విజ్ఞానమునకు ఈ కాలమున శబ్ద ప్రమాణము నిరూపించుపండితు లెవరును లేరు. ప్రకృతి విషయములలోనే కాక అధ్యాత్మికవిచారణమందు సహితము వ్యాప్తికి ఆధారము లెల్లప్పుడు జరిగిన సంగతులే. శాస్త్రములను నిరసించెడి వ్యాప్తి యెట్టిదియు నుండనేరదని వారిసిద్ధాంతము. అందుచేత శాస్త్ర మనగా జరిగిన సంగతుల నాధారము జేసుకొను జ్ఞానమని నిస్సంశయముగ జెప్పవచ్చును.

శాస్త్రమునకు మఱియొక ముఖ్యలక్షణము కలదు. ప్రతివ్యాప్తియు శోధనార్హమైనదై యుండవలెను. అనగా ఎవరైనను ఏ దేశమునందైనను ఎప్పుడైనను ఆవ్యాప్తియొక్క నిజానిజముల గురించి పరీక్షింప బూనుకొనునపుడు అట్టిపరీక్ష వీలైనట్లుండ వలెను, పరీక్షజేయ బూనుకొను వారికి కొంత ప్రత్యేకజ్ఞానము ఆవశ్యకమే. ఆ జ్ఞానము సంపాదించుటకు ఆ తరువాత పరీక్షజేయుటకు సాధ్యము కానట్టి వ్యాప్తులకల్పనము అసంభవ మని శాస్త్రరీత్యా చెప్పవలసివచ్చును.

ఈచర్చవలన ఆధ్యాత్మికశాస్త్రమునకును జరిగిన సంగతులే ఆధారమని సూచింప బడుచున్నది. కాని ఆ శాస్త్రమునకు మాత్రము మరియొకవిశేషము గలదు. దానికి సంగతులు సాక్షాత్తుగ ఆధారములు కానేరవు. ఆధ్యాత్మికశాస్త్రచర్చలు ప్రత్యక్షబలమున జన్యములగు వ్యాప్తులసూత్రములపై నిలిచియుండును. అందుచేతనే యుక్తి ఊహ అనుమానము ఆధ్యాత్మిక శాస్త్రమునకు సాధనములు. ఆసాధనము లుపయోగించు సూత్రములకు ఆధారములు సంగతులు. అందుచేత సంగతులు ప్రకారాంతరమున ఆధారములగుచున్నవి. ఆ కారణము ననే ఆధ్యాత్మికశాస్త్రచర్చయందు మతభేదములు మెండు. ఎన్నిమతము లున్నను ప్రత్యక్షశాస్త్రజన్యసూత్రములకు విరుద్ధమగు ఊహచే నిర్మితములైన మతములు గ్రాహ్యములు కానేరవు. అదియే పాశ్చాత్యవిజ్ఞానవిశిష్టమైన ఆధ్యాత్మికవిచారణలలో పూర్వాధునికములకు గలవిశేషము. అందుచేతనే ఆధునికకల్పనములో ఆధ్యాత్మిక విచారణను శాస్త్ర మని కొందఱు పాశ్చాత్యపండితులు నుడువుచున్నారు. అందుకే వారి ఆధ్యాత్మచర్చలకు మనదేశమున ఆవశ్యకమైన ఉపనిషద్వాక్యములవంటి ఆప్తవాక్యముల శబ్ద ప్రమాణము కల్పింపబడలేదు.

# ఖద్దరువస్త్ర ప్రబోధగీతిక

శ్రీ. సూర్యనారాయణ శర్మ గారు

జైయిలు కేగనైన । సిద్ధమై యెందఱో, సేవఁజేయుచుండ । నీవిదేశ
వస్త్రమైన విడిచి । వరలజాలవా! యెంత యలసబుద్ధివైతి । వార్యపుత్ర!
చెఱలనుండి దేశసేవకు । లేతెంచు, తరుణమందు । స్వాగతం బొసంగ
నెట్లుఁ జనెదవయ్య? । యింక నీగుడ్డతో, లేశమేని లజ్జ లేదె! చెపుమ.
తల్లి యిచ్చు బట్ట । నొల్లక మాయల, మల్లి పంపునట్టి । మల్లుగుడ్డ
గట్టఁ దగదు నీకుఁ । గడు నధర్మము మాత్మ, భక్తి విడకుమయ్య । భరతపుత్ర!
కదరుబట్టఁ గట్టఁ । గడు బరువౌ మోయ, లేమటంచుఁ బల్కు । లేమలార!
అందెలు కడియంబు । లాదియాభరణాల, కన్న భారమగునె యెన్నరమ్మ.
ఇతరుచేతియన్న । మే భుజింపని నైష్ఠి కాగ్రగణ్యులార । కరుణమీర
వినుడు! నామనవిని. । విడనాడుఁ డిఁక మీద, నీమమునకుఁ దగదు । సీమగుడ్డ.

# ప్రస్తుత ప్రజాపరిస్థితి

శృంగారకవి సర్వారాయుడు గారు

సృష్ట్యాదినుండి జాతిభేదము లున్నవి. ఇవి పరమేశ్వరకల్పితములే కాని మానవకల్పితములు కావు. ధర్మకర్మము లిందులకుఁ బ్రధానకారణములు. వీనికి వేదము ప్రమాణము.

"బ్రాహ్మణోస్య ముఖ మాసీత్
బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య వైశ్యః
పద్భ్యాం శూద్రో అజాయత"

యని పురుషసూక్తము.

అనఁగా పరమేశ్వరునిముఖమునుండి బ్రాహ్మణులు, బాహువులనుండి క్షత్రియులు, ఊరువులనుండి వైశ్యులు, పాదములనుండి శూద్రులు, పుట్టిరని భావము. వీనిపరమార్థము విచారింతము. ముఖమనఁగా వాక్కు. వాక్కు విద్య. విద్యాప్రధానులు బ్రాహ్మణులు. వీరే సర్వవర్ణములవారికి నుపదేష్టలు. విధినిధాననిర్ణేతలు. కావుననే భూదేవత లని వీరికిఁ బేరు వచ్చినది.

దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తు దైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమ దేవతా.

యని శ్రీకృష్ణభగవానుఁడుకూడ బ్రాహ్మణుఁడు తనకు దైవమని వక్కాణించినాఁడు. బాహు వనఁగా భుజము. భుజకార్యము శౌర్యము. శౌర్యప్రధానులు క్షత్రియులు, విలువిద్యచే వైరుల గెల్చి దిగ్విజయ మొనర్చి దుష్టశిక్షణము శిష్టరక్షణము గావించు రాజ్యపాలకులు రాజులు. క్షత్త్రచాపమున కీ విప్రశాపము తోడు. ఊరువన నుత్పత్తిస్థానము. ప్రపంచోపయోగమైన సమస్తవస్తువుల సముత్పత్తి కాధారభూతులు వైశ్యులు. వీరికిఁ గృషిపాశుపాల్యవాణిజ్యములు వృత్తులు. పశువులచే వ్యవసాయము, దానివలనఁ బంటలు. పండిన పైరుల క్రయవిక్రయ రూపమే వాణిజ్యము. ప్రపంచము వీరితో నున్నది. పాద మనఁగా నడక. ప్రతిపని వీరివలన నడచుచుండుటఁ బట్టి సకలవ్యాపారప్రవర్తకులుగ నీ పాదజులైరి. కనుకనే యీ చాతుర్వర్ణ్యమునకుఁ గ్రమంబుగ "శర్మ వర్మ గుప్త దాస" యన్న యన్వర్థచిహ్నములు వచ్చినవి. శర్మ అనఁగా సుఖము. సుఖాపాదకులు విప్రులు. వర్మ అనఁగా కవచము. కవచము శరీరమునువలె సర్వవర్ణములవారిని గాపాడువారు క్షత్రియులు. గుప్త అనఁగా దాచఁబడినది. పండించిన ప్రతిపదార్థము నక్కఱవేళకు దాఁచియుంచువారు వైశ్యులు. దాస అనఁగా భృత్యుఁడు. ప్రతికార్యమును నెఱవేర్చు సేవకులు శూద్రులు. బొందిలీలు మున్నగువారిలోఁ గూడ నీనాలుగుజాతు లున్నవి. ఇంత యేల? అచేతనము లగు రాళ్లలోను – అనఁగా వజ్రములలోను – బ్రాహ్మణాదిజాతు లున్నవి.

నాలుగువర్ణములవారి పరస్పరసంయోగసంబంధములచేతనే వివిధకర్మోపయుక్తులైన తక్షకశిల్పకరజకక్షురకప్రభృతిక యగు నానాజాతి సముత్పత్తియు నైనదని మనుధర్మశాస్త్రము. జన్మభేదముచేతనే కర్మభేదము. ధర్మకర్మములను శ్రుతిస్మృతులు నిర్దేశించుచున్నవి. సృష్టికర్తచే నుద్బోధితములై వినఁబడునవి శ్రుతులు. తత్తద్ధర్మజ్ఞాపకసూచకములు స్మృతులు. మహర్షులు వానిని మన ప్రవర్తనలకై శాస్త్రరూపమున వెలువరించిరి. వారి యనుభవమునుబట్టి వ్రాయఁబడిన యాశాస్త్రము లసత్యములుగ నెన్నఁడుఁ గాఁజాలవు.

యుగభేదముచే వర్ణధర్మములు భిన్నము లైనవి. కృతత్రేతాద్వాపరకలినామకములు యుగములు. ఇందు సత్యధర్మశౌచాదు లొక్కొక్కపాదముచొప్పునఁ గ్రమంబుగాఁ దఱుగఁజొచ్చినవి. పాద మన భాగము. మంచిచెడ్డల హెచ్చుతగ్గులే యుగభిన్నతకు హేతువులు. ప్రకృతకాలము కలి. ఇందు అసత్యము– అధర్మము– మోసము– పరాభవము– గర్వము– దంభము– కామము– లోభము– మున్నగు దుర్గుణపరంపర మూర్తీభవించియున్నది. ఇందు పరోపకారముకన్న స్వార్థపరత్వము మిన్న. త్రికరణశుద్ధి తక్కువ. కలఁతలె వృత్తులు. ఇట్లెన్నెన్నో యున్నవి. పూర్వయుగములం దెంతయో ధర్మాదిసంపత్తి కలదని గ్రంథములు నిదర్శించుచున్నవి. భారతభాగవతరామాయణములందలి యుత్తమోత్తమచరిత్రములు చదువుచున్నవే. మఱి వినుచున్నవే. భారతమునఁ బాండవుల ధర్మము – కౌరవుల యధర్మము – దృష్టాంతములే. మంచిచెడ్డ లెప్పుడును వెన్నెలచీకట్లవలె కలసియుండునవే. మంచిచెడ్డలలో నెయ్యది హెచ్చయిన నయ్యది యెన్నికకు వచ్చుచున్నది. మంచివాఁడనఁగానే చెడ్డ లేదని కాదు. చెడ్డతక్కువ. మంచియెక్కువ. చెడ్డవాఁడనఁగానే మంచిలేదని కాదు. మంచి తక్కువ. చెడ్డ యెక్కువ. ఇట్లే ధర్మాదుల హెచ్చుతగ్గులనుబట్టి యుగములు మార్పుఁ జెందు నని యార్యులు నిశ్చయించిరి.

ఇప్పుడు జాతి బ్రువత్వమే గాని శుద్ధజాతితము మగ గాని కానంబడదు. నామమాత్రమే జాతులు. ఇందులకు ముఖ్యకారణములు మూఁడు ఒకటి యుగధర్మము. రెండు ప్రభుత్వము. మూఁడు సాహచర్యము. అధర్మాదిప్రవృద్ధమైన స్వభావము యుగధర్మము. మంచికిఁ బోఁదలంచినను చెడ్డకై యీడ్చును. జాతిమతాదులను గూర్చి ప్రత్యక్షముగ జోక్యము కలుగఁజేసికొనమని యన్నను బరోక్షమునఁ దమవిద్యావ్యాసంగమందును నుద్యోగసంగతియందును బంచమాది సర్వవర్ణసమత్వ

దృష్టిని బ్రసాదించినది ప్రభుత్వము. నిరంతరమగు నిమ్నజాతిసంస్పర్శ సంభాషణాదిసంబంధము సాహచర్యము. ఇందువలననే ధర్మకర్మవైరుధ్యము తటస్థించుచున్నది.

కట్టు బొట్టు జుట్టు జాతీయరూపకచిహ్నములు. అవి యిప్పుడు విరుద్ధములు. బ్రాహ్మణులు పంచకచ్ఛలు పెట్టిన పంచెగట్టు. పైమీఁదఁ బంచె. ఉపవస్త్రము. నుదుట విభూతి. త్రిపుండ్రముపై గంధాక్షతములు. పిల్లజుట్టు. చేతిలోఁ బుస్తకమో, పంచాంగమో; రాజులు విలిచికట్టు. కోరపాగా. అంగీ. నుదుటఁ దిరుమాణ్ణపు టూర్ధ్వరేఖ. కొండెసిగ, చేతఁగత్తి. వైశ్యులు సాధారణపుఁ బంచెగట్టు. ప్రక్కలను జుక్కలు గల గంధపుఁదిర్యగ్రేఖ. మీఁద నక్షతపుబొట్టు. చేత గంటము. తాటాకు కవిలెకట్ట. శూద్రులు పంచెమొగగట్టు. పైని పంచె నెత్తిని పాగ. నుదుటఁ దిరుమాణ్ణపురేఖ. సిగముడి. చేతి ములకాలకఱ్ఱ. ఇది పూర్వాచారము. చూడఁగానే యివి యీ జాతివాఁడని తెలియఁజేయును. మఱియుఁ బేరుతుదఁ జేర్పఁబడు "శర్మ వర్మ గుప్త దాస" శబ్దములును జాతినిర్ణయమును జేయుచున్నవి.

ఇప్పు డప్పద్ధతి తప్పి, వర్ణనిర్ణయ మిసుమంతయు నెఱుంగ నీకున్నది. ఎల్లరు నొకరూపువారే! అందఱు రావులే. పంచెలుమాని కండువాలే కట్టుట. అదియుం బోయి విలిచికట్లు. వానినిమించి యిజార్లు. పైమీఁద వేసికొనుటే లేసు. లోన షర్టు. పైనికోటు. మెడకు కాలరు. నెత్తికి టోపీ. కాళ్లకు బూట్సు. కళ్లకు స్పెక్ట్సు.

బ్రహ్మక్షత్రవైశ్యులకు ద్విజులని పేరు. వీరికే కర్మాధికారములు. "జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః" అని శాస్త్రము. కర్మసిద్ధిచేతనే యీద్విజత్వము. జన్నిదము వీరి కొకచిహ్నము. ఉపనయనాదిసంస్కారములు వర్ణోచితములు. ఉపనీతుని కొకటి. వివాహితునకు మూఁడు జన్నిదములు. వస్త్రాభావమున నాల్గు. యజ్ఞోపవీతము గాయత్రి బ్రహ్మప్రతిపాదక మని శ్రుతి కనుకనే దానిముడికి బ్రహ్మముడి యని పేరు. ఒక్కొక్కజన్నిదమునందు మూఁడేసి పేటలు. పేటకుఁ దొమ్మిదేసి పోచలు. మూఁడుతొమ్ములు యిరువదియేడు తత్త్వములు. వానిముడి బ్రహ్మైక్యబంధము. ఇది వేదార్థము. ఇయ్యర్థ మెఱుంగరు. ఇయ్యుపాసనము చేయరు. ఏనూలుపోగో మెడలో నుండుటే చాలు నన్నకడకు దిగినది. వేదాధ్యయన మొనర్చుచు బైఁడిపత్తి పింజెతో నీజందెములను వడుకవలసిన దని నియమము. ఇట్టి నిష్ఠాపరులైన వేదవేత్త లరుదు. ఉండిరో- యింతతీరికగా వడుకరు. ఎవరో కొందఱుమాత్రమే జన్నిదములు వేసికొనువారు. చాలమంది తీసియే వేయుచున్నారు. ఇదేమి చిత్రమో లేనివారు తెచ్చిపెట్టుకొనుచుండఁగా నున్నవారు పోఁగొట్టుకొనుచున్నారు.

ఇఁక వేషములలో నల్లవారు తెల్లవారలైరి. శీతలదేశపుదుస్తులుష్ణదేశములవారి కెట్లు సరిపడఁగలవు? అచట శీతముచేత నీరు సైతము పేరుకొనును. సూర్యరశ్మి పట్టపగలేకాని కన్పట్టదు. వర్షములు తఱచు. మంచు విస్తారము. కావుననే టోపీలకుఁ బంచలు జింపఁబడియుండును. మూఁడునాలుగు తొడుగులు. కాళ్లకుఁ జేతులకుం గూడ మేజోడులే. ఇంత యేల? శరీరమాద్యంతము కప్పియుంచక తప్పదు. లేకున్న నొడలు కొరడుబాఱి పోవును. అంతటి శీతము కలుగుటంబట్టియే తెల్లబాఱి యుండుట సూర్యరశ్మి తగులనిచోట మొలచిన మొలకలైనను తెల్లఁబాఱి పోవుట మనము చూచుచున్న విషయమే. ఎవరి కెయ్యది యుచితమో యయ్యది తగుఁగాని యన్యము తగదు.

మీసము లుంచుకొనవలసినవారు తీయించుట- కూడనివారు పెంచుట. చత్వారమున్నవాఁడు లేనివాఁడుగూడ సులోచనములు పెట్టుట. జేబుగడియారమో చేతిగడియారమో దాల్చుట. తఱచు కాఫీగాని టీగాని పుచ్చుకొనకుండుట నాగరకతాహీనతయైనది. ఇవి యున్నతత్త్వములకు వర్జింపవు. మీఁదుమిక్కిలి వీనివలన నెందఱెన్ని బాధలు పడుచుండిరో యెవరికివారికే? యనుభవము. హిందువులలోఁ బనిపాటులు గలవారికిఁ జలిదియన్న బంతబల మైనది మఱి లేదు. సర్వసస్యసమృద్ధియున్న మనకు షడ్రసయుక్తమైన భుక్తియే సౌఖ్యకరము. నిత్యకర్మములమాట యటుంచినను బిత్రుకర్మము తప్పని దని కొంద ఱందురు. ఇదేమి తండ్రితద్దినమా యున్న సామెత వినుచున్నదేకదా! దానిని మానినవా రున్నారు.

మాతృభాష సంస్కృతము. ఇందే శ్రుతిస్మృతిపురాణాది గ్రంథము లున్నవి. ఇదే యార్యభాష. దీని తరువాతిది దేశభాష. ప్రభువులయాదరణము గలది. దానివలన నుదరపోషణము నగుచుండునది. అందుచే నెందఱో తద్భాషాభ్యాసకు లుండుచువచ్చిరి. అన్యదేశభాష యనావశ్యక మైనది. ఇప్పుడు వేదము లడుగంటినవి. శాస్త్రములు సన్నగిల్లినవి. సంస్కృతముమాట యటుండ స్వభాషయే హేయమైనది. అన్యభాష రుచి కెక్కినది. ఏల? జనాదరము. ఉదరభరణము కలదు. సేవకవృత్తి గౌరవపద మయ్యె. చదువఁగూడ దని కాదు. జాతిభేదము. స్త్రీపురుషవివేచనము లేక యెల్లవారు రాజభాషాభ్యాసమున నుపక్రమించువారే. సమర్థులు ధనము వెచ్చించి, సామాన్యులు తమకున్న మడిమాన్యములు తాకట్టు పెట్టియిండ్లువాకిండ్లమ్మి, పేదలు యాచించి తెచ్చి, విద్య నేర్పింపఁ జొచ్చిరి. పెద్దవాఁడై యుద్యోగము చేసి తమ్ముద్ధరించు ననియే వారియూహ. ఎంతచదివి పనిలోఁ బ్రవేశించినను బ్రథమమున జీతము పదునైదే. ప్రస్తుతము కఱవుచే ముప్పదియైదైనది. వ్యయపఱచిన ద్రవ్యమునకు వడ్డియైనం గిట్టదు. ఎన్నఁటికిఁ బెద్దయుద్యోగమగును? ఎప్పుడు బాగుపడును? ఎందఱకని వచ్చును? ఎక్కు వేలము వెట్టిక్రిందఁ బడినది. అన్యభాషాభ్యాసముచే స్వభాషయం దనాదరణము మాత్రమే కాదు చాలవఱకు మఱపుగూడఁ దటస్థించుచున్నది. అనుభవముచేఁ జెప్పుచున్నాను. ఎందఱో తెనుఁగువర్ణక్రమమునే యెఱుఁగనివా రున్నారు. మాటలాడుటలో నూటికిఁ బదివంతులు స్వభాషాపదములు. తక్కినవన్నియు నన్యదేశ్యములే.

మనపండితులు ప్రసంగించు శాస్త్రసంగతులు రుచింపవు. అయ్యవియే యన్యుఁ డన్యభాషలో నుపన్యసించినచో నాదరపురస్సరంబుగ

నాలించి బలే యని మెత్తురు. మే లని సంతసింతురు. నూతసమార్గద్రష్టల మని కొందఱు బుద్ధిమంతులు బయలుదేఱిరి. సమగ్రగ్రంథద్రష్టలు గాకుంటంబట్టి యట్టియూహాలు పుట్టినవి. పూర్వులు విద్యలు గురుశుశ్రూషాగ్రాహ్యములని కొన్నిగోప్యములు గావించిరి. ఇప్పుడవి భాషాంతరీకరణములందు వివరణవిశేషసౌలభ్యము నందినవి. కాని ప్రతివిషయము మన శ్రుతులలో మనస్మృతులలో మనపురాణములలో నిదర్శింపఁబడినదే. లేనిది లేనేలేదు. సర్వగ్రంథముల వ్యాసంగము- వ్యాపకత్వము- లేమింజేసి స్వకపోలకల్పితములుగాఁ దోఁపవచ్చును. విమర్శకుల కది సులభగ్రాహ్యము.

చదువుచదువందురే కాని గట్టెక్కుటకుఁ దనకెంతవట్టు కావలెనో యంత ముక్కనఁబట్టి కక్కుట తక్కగట్టి దొక్కముక్కయైన రాదు. లోకజ్ఞానము లేదు.

ఉద్యోగధర్మముచేత- విద్యాభ్యాసముచేత- సనాతనాచారములు జాఱినవి. నిరంతరము పంచమాదిజాతిసంపర్కము శూద్రప్రకల్పితభక్ష్యభక్షణము. వంటపూటింటితిండి. ఇందు తురకమరక యేకమే. తినువాఁడు తినుచుండు. వెళ్లువాఁడు వెళ్లుచుండును. తిన్నయెంగిలి తిన్నఁగఁ దీయరు. తినువారినిబట్టియే పెట్టువా రుందురు. తినువారు జోడుతీయనివారు కొందఱు. చొక్కాల తీయనివారు కొందఱు. పట్టుగుడ్డ చుట్టఁబెట్టుకొనువారు కొందఱు. ఆచామన్న నాక్షేపించువారు కొందఱు. ఆచారమునకని కాదు కాని తెల్లవాఱలేవఁగానే మాత్రము సబ్బురుద్దికొని శిరస్స్నానము చేయు టొకటి కనఁబట్టుచున్నది. ఎంగిలి యస్పృశ్యత యన్నవి యేకోశమునను లేవు. కాఫీ మంచితీర్థము మున్నగువానిలో జాతిభేదము విద్యార్థులేకాదు పెద్దలు ఉద్యోగస్థులు పాటించుట లేదు. సహపంక్తికి నంగీకరింతురు. రైలుప్రయాణమునఁగాని- నౌకాయాత్రలోఁగాని- యిట్లే. ప్రయాణములలోను- తీర్థములలోను- కొంత యొప్పుకొందము. ఇంటనుండియు శూద్రులచే నన్నము దెప్పించుకొని తినువారెందఱు లేరు? సర్వసమత్వము పాటింపవలెనని- నిమ్నజాత్యుద్ధరణము గావింపవలెనని- చెప్పువారుకూడఁ దమ క్రిందితరగతులవారితోఁ గలసిమెలసి భోజనభాజనాదులు గావించుట లేదు. ఎవ్వఁడును పైతరగతివారితోనే చేరఁగోరును. ఈసంగతి యొక్కరుఁ గనిపెట్టకుండుట గొప్పయనర్థక మైనది. మహర్షులు ద్వైతాద్వైతవిశిష్టాద్వైతము లని మతత్రయము. శంకరులు శైవ వైష్ణవ సౌర గాణాపత్య శాక్తేయాది షణ్మతములు నిర్ణయించిరి. ఇవి యాస్తికమతములు. జైనబౌద్ధాదులు నాస్తికమతములు. ఆస్తికమతముల సిద్ధాంతీకరించి నాస్తికమతముల నిరాకరించిరి. మతమనఁగా జనసంఘముయొక్క సమ్మతి యని యర్థము. మున్నెక్కడనో యొక్కఁడుగాని సర్వసాధారణముగా నెల్లరు స్వమతాచారులే. అన్యమతావలంబకులు గారు. ఒకప్పుడొకనిమతము భేదించె నేని ప్రభువులో పెద్దలో పీఠస్థులో నిరోధించుచుండిరి. శిక్షించు వా రుందు రను భయముననే కాదు- స్వతస్సిద్ధముగనే ప్రతిజాతికిని ఆస్తికత గలదు. “స్వధర్మో విగుణ శ్శ్రేయః పరధర్మాత్స్వనుష్ఠితాత్” అనుసూక్తిని స్వధర్మము విగుణమైనం బ్రశస్తము. పరధర్మ మెంతసగుణమైన నప్రశస్తము. ఇప్పు డన్యమతావలంబనము ముఖ్యధర్మము. గురువులు గాని ప్రభువులు గాని యేమందురో యన్నభయము పోయినది. వారును గాలానుసారులే యైరి. ఇఁక మతము స్వేచ్ఛానుసారిగాక మఱేమగును!

ప్రజల ప్రవర్తనవైరుధ్యమునంజేసి క్షోభములు సంప్రాప్తించుట స్వభావసిద్ధము. తెలివితేటలు తాటాకుమంటలు. సందేహములు తండోపతండములు. ఆలోచన లనంతములు- ఊహాపోహాలు హెచ్చినకొలఁదినాయువులు తగ్గఁజొచ్చినవి. అకాలమృత్యువులు- బాల్యమరణములు పెచ్చుపెరుఁగుచున్నవి. భూమి నిస్సత్వమైనది. అందుత్పన్నమగుచున్న ప్రతిపదార్థము నిస్సారమైనదే. వాని దిను ప్రాణు లేల బలహీనులు గారు? అందుచేతనే చిరాయువులు పుట్టుట తటస్థింపకున్నది. శరీరతత్త్వములు ద్వంద్వములు. ఆరోగ్యములు తక్కువ. విషూచి మశూచి బొబ్బజబ్బులు వింతజ్వరములు ప్రబలి; వఱదలు వచ్చి; గాలివానలు రైలు ప్రమాదములు పుట్టి; యంతకు మించి క్షామము- పదేపదే సంగ్రామము- బయలువెడలి జనక్షోభము కల్పించుచున్నవి. పంటలు పండియు రెండుదశలనుండి కఱవు పీటలుపట్టుకొనియుండినది. జనధననష్టప్రద మేమనఁగా సంగ్రామము.

పూర్వాపరవిమర్శన చేసి చూడఁ దేలినవిషయ మొక్కటి. నాగరకత మీఱినది. బుద్ధివిశేషములు హెచ్చినవి. స్వాతంత్ర్యములు వచ్చినవి. ప్రతిమనుష్యుఁడు పేరుప్రతిష్ఠలకుఁ బ్రయత్నింపఁజొచ్చెను. స్వబుద్ధి నుపయోగింపసాగెను. విద్య గ్రహింపఁగడంగెను. విదేశవాసులతోడ సంబంధము. పరదేశసంచారము దేశచరిత్రపరిజ్ఞానము నూతనాచారములకు దారితీసినది. దీనంజేసి రాజ్యపాలనలోని లోపాలోపములు కనిపెట్ట ననువయ్యె. స్వరాజ్యస్థాపనమున కుద్యమములు బలపడుచుండినవి. సాహసధైర్యాదు లుద్బోధితము లగుచున్నవి. రాజకార్యాలోచనములలోఁ బాలుగొనసాగిరి. ప్రజ్ఞావిశేషములచేతనే శాసనసభలలోను- రాజప్రతినిధికొల్వులోను- లోకల్ బోర్డులలోను- మునిసిపాలిటీలలోను- కాంగ్రెస్సులలోను- యూనివర్సిటీలలోను- ఇంక నెన్నెన్నో యెన్నికఁగన్న పదవులలో- సభ్యత్వము సంపాదించి యాధిపత్యములు సంగ్రహించి బిరుదము లార్జించి పేరుకెక్కిరి. కాల మొక్కఫక్కి నుండదు. మఱల సనాతనధర్మములు జీవితములై యార్యాచారము లుద్బోధితములై యార్యావర్త మన్వర్థసంజ్ఞను జెందుఁగాత.

# ఉత్తమస్మృతి

వారణాసి లక్ష్మీనారాయణ శాస్త్రి గారు

ఏరులు పారగ రక్తము
కారును నిందనుచు ప్రజలు । కళవళపడగాఁ
దారసిలెగాదె రుధిరో
ద్గారి! తదుపశాంతి యిపుడు । తగు నొనరింపన్.

క. ధీరులు వీరులు కరుణో
దారులు భాగవతపాద । ధ్యాన జ్ఞానా
పారులు నగు నుత్తములను
కోరి భజించినను గొంత । గుణము నొసర్చున్.

క. కావునఁ దలచెద పెద్దల
భావలయంబునను శాంతి । పుట్టుటకొఱకై
యీవత్సరమున, ముందుగ,
ధీవరు వాల్మీకిముని నుతింతును భక్తిన్.

క. వ్యాసుని హరిపదభక్త్యు
ల్లాసుని భజియింతు శాంతి । లభియించుటకై
భూసురగురుఁడగు కాళి
దాసుని స్మరియింతు శాంతి । ధరణికిఁ గలుగన్.

గీ. రామసేవాపరుం డయి । రామ మడిగి
రాజదండన నొందియు । రామభజన
మానకొనరించి ముక్తుఁడౌ । మాన్యుదలతు
రామపూజాభిలాషు మా । రామదాసు.

గీ. పరమభక్తునిఁ బ్రహ్లాదుఁ । బ్రస్తుతింతు
సమరసముని విభీషణు । నభినుతింతు
విమలవిజ్ఞానులౌ వారు । విష్ణువలన
శాంతిమార్గంబు జగతికిఁ । జక్కఁ జేయ.

గీ. సత్యమార్గంబు దప్పక । జగతి నేలి
ప్రజలఁ దన కన్నబిడ్డల । పగిదిఁ బ్రోచి
యార్తపరిరక్షణంబునె । యాత్మరక్ష
ణముగఁ దలపోసికొన్న య । త్తములదలతు.

గీ. సన్నయాదుల కొనరింతు । విన్నపంబు
ప్రజల కీ రుధిరోద్గారి । వత్సరమున
రక్తసంపర్క మేమియు । రానియట్లు
ధర్మకథనఫలంబును । ధారవోయు.

గీ. తనకుఁ దెలియని మెలకువ । లను గురుండె
తెల్పఁదగు నని మాటాడ । దివికిఁ జన్న
బాలగంగాధరుని పాద । పద్మములకు
భక్తి నర్పింతు పదివేల । వందనములు.

సీ. ధరణికంతకు ప్రబో । ధమును గల్పించి భా
స్కరుడు పోవగవచ్చు । చంద్రమౌళి
పదునుఁ దెచ్చిన నేల । పయిన విత్తనమిడు
పంటాతనిపిరుంది । వర్ష మట్లు
మంత్రశక్తినిఁ దెల్పు । మానిసియటుగఁ దో
తెంచియుండిన యుప । దేష్టవోలె
జమదగ్నిరాముడు । చనఁ గల్గు సత్యధీ
ధాముడు దశరథ । రామునిగతి

గీ. బాలగంగాధరుడు భూమి । బాసినంత
వెలువడిన శాంతమూర్తిని । విజ్ఞుతుల్యు
మధురసంభాషు సర్వస । మ్మతమనీషు
గాంధిదేవుని స్మరియింతు । కరము మోడ్చి.

# ఆంధ్రశృంగారకావ్యములు

రావు వేంకటరావు గారు

సంస్కృతాంధ్ర భాషాకోవిదుఁడును కర్ణాటభాషయందు ప్రచండపాండిత్యమును కలిగిన ప్రభువతంసమును కవిరాజు నగు శ్రీకృష్ణదేవరాయలు తన యాముక్తమాల్యదయందు—

" దేశభాషలందు దెనుఁగు లెస్స "

అని వచించెను. ఆంధ్రభాష విదేశీయులచేకూడ మిగుల మృదువైనదనియును మనోహరమైన దనియును గొనియాడఁబడినది. పశ్చిమఖండములయం దన్నిఁటిలో "ఇటలీభాష" ఎట్లగ్రస్థానమును వహింప దగినదో తూర్పుఖండములకుఁ దెనుఁ గట్టిదని పలువురు నుడివిరి. అట్టి మృదుమధురంబగు నాంధ్రభాషలో ప్రాచీనకవిశేఖరుల గ్రంథరాజములను విమర్శనపూర్వకముగఁ జదివిన గ్రంథకర్తలు-మాతృభాషాగ్రంథములఁ బెక్కింటిని పఠించి-పాండిత్య మలవఱచుకొని-యసాధారణప్రజ్ఞాశోభితులై-తాతతండ్రులనాటినుండియు వచ్చు నిరర్గళకవితాధారతో గ్రంథరచనముజేసినట్లు విస్పష్ట మగును. ఆకవిశ్రేష్ఠులు సంస్కృతమునుండి పురాణేతిహాసాదులఁ దెనిగించియు నూతనకథల గల్పించియుఁ జమత్కృతివిజ్ఞానవిశేషంబుల వెల్లడించియు మనస్తోషజనకములగను గంభీరార్థప్రతిపాదకములుగ నుండునట్లును పెక్కుప్రబంధములను రచించిరి. అందుండు పద్యాదులు పదలాలిత్యమును అర్థగాంభీర్యమును గలిగి యిక్షుఖండముల బోలి రసాలవాలములై క్రాలుచు నీతివిజ్ఞానదాయకములును సలక్షణములునై, అష్టాదశవర్ణనలతో సరసజనహృదయంగమములై, వీర హాస్యశృంగార కరుణేత్యాదిరసోపేతములై అమేయకల్పనలతో నొప్పుచుండును. అట్టి యుత్కృష్టగ్రంథముల రచించి భాషాప్రపంచమున కమితోపకారమును జేకూర్చిన కవిపుంగవుల మేలు ఆలోకము మఱవజనదు.

పూజ్యు లగునట్టి యాపూర్వకవివరులలో గొందఱు సుధారసలహరులచందంబున-శ్రవణపుటపేయమై-నీతినిబోధించిలోకజ్ఞతనుచేకూర్పవలసిన కవితను-గుట్టువిడిచి బట్టబయలుగ శృంగారరసవర్ణనలకు వినియోగించినందున, నట్టిగ్రంథములు పామరులను భ్రమపెట్టుచున్న వని తలచి యంతరింపజేయ యత్నించుచుండిరి. ఒకవస్తువును సూక్ష్మదృష్టితో పరిశీలించునప్పుడు అందుండు సుగుణములను గ్రహించి దోషములను విడిచిపుచ్చుట ధర్మమే యైనను నందలి బాగోగులను వెలిపుచ్చుట స్వాభావికమై యున్నది.

సాధారణముగా ప్రబంధములయం దెందుఁ జూచినను కవివరులు కొలఁదిగనో గొప్పగనో శృంగారమును వర్ణించియే యుండిరి. కాని కొందఱు సౌమ్యముగను మఱికొందఱు ధారాళముగను వర్ణించియుండిరి. ధారాళముగ జెప్పబడిన గ్రంథములలో గొన్ని నీతిదూరములై యున్నవనుట సత్యము. అట్టి గ్రంథములు పామరుల నేల? ఒకొక్కప్పుడు ప్రాజ్ఞులగూడ నీతిబాహ్యులనుగఁ జేయుననుట నిక్కము. రాజహంస క్షీరనీరములను వేఱుచేయుపగిది నుచితభావములను గ్రహించుట ధర్మమే యైనను, ఉచిత భావములతో పాటు అనుచితభావములుకూడ మనస్సున నాటుఁబడుననుట నిశ్చయము. అదియునుఁ గాక కొన్ని గ్రంథములు నుచితభావములు లేకుండుటయేగాక మిక్కిలి యనుచితవిషయములకు ఉద్బోధకములుగూడనై యున్నవి.

తారా శశాంకవిజయాదిగ్రంథములు కేవలము శృంగారరసైకప్రధానంబులగు కావ్యములై దుష్టవర్ణనములతో నీతిబాహ్యములై యున్నవి. మన శృంగారకవులు తమకుగల యకుంఠితకవితాశక్తిని మదనకదనరంగమున మల్లయుద్ధముజేయ మఱలించిరే గాని మంచిమార్గమునకు ద్రిప్పరైరి. ఉదాహరణార్థము ఒక్క తారాశశాంకవిజయమును చూచినఁ జాలును.

" లోకములోనఁ గొంద ఱబలల్ ...............తా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినఁ బాప మంచు "

"ఎన్ని పువ్వులన్ వ్రాలదు ద్రేఁటి యట్లు
మగవాఁ డనువానికి దోస మున్నదే "

ఇత్యాది యవినీతికరము లగు విషయములతోడను,

" సీ. కన్నాతలాగించి కాంతమోము గదించి

అను నీ మొదలగు జుగుప్సాజనకములగు వర్ణనలతోడను నిండియుండును. తొలుత కథాభాగమే అప్రశస్తమై యుండగాఁ గర్ణకఠోరములగు నుడువులు అందులకు సహకారములా? శృంగారరసమును జిలికింపవలెనన్న రసౌచిత్యమును గమనించి రమ్యతరముగా రచింపవలెనేగాని లోకానంగీకారము లగు విషయములలో, కంజాస్త్రకయ్యమునఁ గల చౌశీతిబంధనావిధానమును విప్పి చెప్పరాదు. చెప్పినను అది శృంగారము కానేరదు. అట్టివర్ణనలు పాఠకుల కసహ్యమును విసువును జనింపజేయును.

ముద్దుపళని ప్రణీతంబైన రాధికాసాంత్వనము మృదుమధురపదభూయిష్ఠమై, సరసంపుబల్కుల కాకరమై యున్నను కథాంతమువఱకు ఆలుమగలాటలను వివిధగతుల విస్తరించి వర్ణించుటయందే తన నేఱజాణతనమునుఁ గనఁబఱచెను. ఆంధ్రభాషలో నిట్టి దుర్నీతికర మగు కావ్యము వేఱొండు కానరాదు. కావ్యలక్షణములను లక్ష్యముసేయక జంకుగొంకు లేక రసంపుబెంపును సొంపుగా గూర్పఁదలచి బూతులబుంగగ జేసెను. అందం దనేకము లనుచితవిషయములు గూడ గలవు. ఉదాహరణమునకై " సీ. చెలువుడుఁ గౌఁగిటఁ జేర్చినయపుడీవు – అను మున్నగు పద్యములను చూడుడు.

**Goswamy Sree Tulasi Dasjee**



గోస్వామి శ్రీ తులసీదాసజీ

**Buddha Gaya Temple Tank**




బుద్ధగయ దేవాలయ సరోవరము

**Gautama Buddha at Gaya**



శ్రీ బుద్ధమూర్తి, గయాక్షేత్రము

**Buddha Gaya Temple**



బుద్ధగయ దేవాలయము

Sriyut Ayyanki Venkata Ramanayya



శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్య

Sriyut Bellamkonda Raghava Rao



శ్రీయుత బెల్లంకొండ రాఘవరావు

Sriyut Kolachelam Seetharamayya



శ్రీయుత కోలాచలం సీతారామయ్య

Vaydyaratna Gudur Venkata Siva Kavi



వైద్యరత్న గూడూరు వేంకటశివకవి

Sriyut Duvvuri Balakristnayya



శ్రీయుత దువ్వూరి బాలకృష్ణయ్య

Sriyut Kallakuri Nrusimham



శ్రీయుత కాళ్లకూరి నృసింహం

ఇట్లు అవి నీతికరముగను, అసహ్యకరముగను, దురుసుగను వర్ణించిన గ్రంథములను మచ్చునకైన లేకుండ * మంటగాల్చుటయే యుక్తమ మని నాయభిప్రాయము. వేఱొకచో, కేళీమందిరాంతరస్థితుఁడగు శ్రీకృష్ణుఁడు ఇళాదేవితో కేళీవినోదము లాడువేళ రాధ యేగుదెంచి యిళాదేవి యున్నదనియైన జంకులేక మోహాతిరేకముతో బింకముగ సయ్యాటల నుద్యమించెనఁట! ఇళాదేవి ఈయసందర్భమును గమనించి పాఱెనఁట! ఇవి యెట్టిదుశ్చరిత్రములు! వెలయాలగు ముద్దుపళనికవిత్వపుముద్దు గాబోలునిది!

హంసవింశతి పృథగ్విధము లగు పుర, ఋతుషట్కాదులగు నిరువది వర్ణనలను గలిగి మనోహరముగ జిత్రించి వ్రాయఁబడెను. ఆయా కులములను-ఆచారములను - ధర్మములను-ఎఱింగించుచు ప్రాచీననాగరకతా విభవములను ఇయ్యది చక్కఁగఁ దెల్పెను. ఇది నిర్దుష్ట మగు కావ్యములలో నొకటి గాకపోయినను సార్థకపదములతో హృదయంగమముగ నుండెనని యొప్పుకొనక తప్పదు. కాని వైగ్రంథములను బోలి ఇది యును నీతి దూరమే. సనాథలగు సతీరత్నములకే పరపురుషసంగమాపేక్షను సంకల్పించి యసత్యప్రకటనలతోఁ గప్పిపుచ్చినట్లు చేసెను. ఏ కావ్యమును జదివినను తద్రచయిత పాఠకుల కొకింత నీతిజ్ఞానములు కలుగునట్లు ప్రసాదించుట ధర్మమే గాని విరుద్ధాభిప్రాయములను సమకూర్చుట యుక్తపద్ధతి కాదు. భావగర్భితముగ శృంగారరసమును జిమ్మిన చిత్తము నాకర్షించునే గాని గుట్టు విడిచి బట్టబయ లొనర్చిన గణనీయ మగునా?

విప్రనారాయణచరిత్రంబు నందుఁ గొన్నిచోటుల నవయువ నిర్ణయమును విడిచి వర్ణించినను కథాంతము నీతిసంగ్రాహకమై యున్నది.

శుకసప్తతి హంసవింశతినిబోలి మితిమీఱిన శృంగారమును గల్పింపకపోయినను కథావిధానము ఇందునుఁ దుల్యమే!

ఇట్లే కొన్ని గ్రంథములు కేవలము శృంగారరసైకప్రధానంబులై జంకులేక జుగుప్సావర్ణనములను వర్ణించినయవి యున్నవి. కొన్ని కావ్యములు మోటుతనములేక సరసముగ రసౌచిత్యమును గమనించి రసికజనహృదయంగమముగ విరచించినవియునుఁ గలవు.

ప్రాచీనకవిశేఖరు లగు పెద్దన్న - సూరన్న - తిమ్మనార్యుఁడు మున్నగు కవిసింహము లాయాభావములను దెల్లముసేయునపు డెంత సరసముగ, క్రొంజివురుటాకువలె కోమలముగ వర్ణించిరి! గీర్వాణకవిరాజగు కాళిదాసంతటి శృంగారరసైకప్రధానుఁ డెవ్వరును గారు కదా! శృంగారవర్ణనములను హృదయంగమముగా సౌకుమార్య సౌందర్య సౌరభ్యాదు లెసంగునట్లు ఆమహాకవి వర్ణించినాఁడు. చూడుడు— శకుంతలను వర్ణించునప్పుడు.

"శ్లో. అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదితరసం
... ... ... "

యిట్టిశ్లోకమును రచించుట ప్రాకృతతపః ఫలము గాక మఱియొం డగునా!! ముద్దుపళనిగాని వేంకటకవి గాని వర్ణించుచో వట్రువలగుగబ్బిగుబ్బలు-సయ్యాటలకుచక్కఁదనమౌ రతనంపుబొమ్మ-చౌశీతిబంధనావిధానవిజ్ఞానము గల సరసులసొమ్ము-అని ఇట్లింకను సూక్ష్మదృష్టితో నేమేమో జెప్పుటకు సంశయము లేదు. కళాపూర్ణోదయమునఁ బింగళిసూరన ఎట్లు వర్ణించెనో చూడుడు.

"శా. ఆవాలుంగనుదోయి యానగుమొగం ♦ బాగుబ్బపాలిండ్లపెం
పావేణీభర మాతనూవిలసనం ♦ బాయొప్పు లేఁ జెప్పినం
గైవారం బగు గాదె? కేవలశిరః♦కంపంబు గల్పించి యా
హా పుట్టింపదె యిట్టిధన్యునకు న♦య్యబ్జాక్షి నీక్షించినన్."

ఇట్టి కవిత్వమే కవిత్వము. పూలరేకులవలె మెత్తనై- రసాస్వాదనము సులభమై యుండును. రతికేళీవిలాసగతులను వివిధవిధముల విప్పిచెప్పినదే శృంగారమని మనవారిభావమైనచో రసమనుపదమునం దర్థముండజాలదు. సూక్ష్మరసంపు బెంపును చూపి చిత్రకళాప్రదర్శన మొనర్చిన అల్లసాని పెద్దన్నగారి శృంగారమున కక్కఁజమొంది-అక్కటా! వింతవింత విమర్శనములను వ్రాయుచుండగా- మొల్లగారి సుఖాస్వాదన మొసంగు మొగలిపూరేకువంటి రామాయణము నగికారాలతో మితిమీఱిన శృంగార మనిగిలిగింతలుకొట్టి ఖండనములొనర్చుచుండగా-తారాశశాంక విజయాదిగ్రంథములు సన్నుతిఁగాంచఁదగినవా? ప్రభుత్వాధికారుల యాంతఱ యిం దేమియు నన్యాయ్యము గాదు. పామరులనేగాక యినుపకచ్చడములనుగట్టిన మునిముచ్చులనైనను నియ్యవి భ్రమింపజేయును. ఇట్టి గ్రంథములు భాషాప్రపంచమున కనుపయోగములును నపకారకములు నగుననుట నిస్సంశయము.

* ఆదర్శములలో నప్పటివారికి నిప్పటివారికిని అభిప్రాయభేదమగుటచే లేఖకుల యీ యభిప్రాయముతో మే మేకీభవింపము—సంపాదకుడు.

# అనుతప్త హృదయము

కలశపూడి శ్రీశైలము గారు. బి. ఏ.

సాంగసుఁదనర్చు కెంజిగురు। జొంపము దియ్యని కమ్మవాసనల్
బుగబుగలాడు క్రొన్ననలు। పొల్పువహించెడు మావిగున్న నొం
టిగ వసియించి యీనిశను నిద్దురఁ। బాసి వసంతగానమున్
వగ నిటు లాలపించెదవు। వాకొను కారణమున్ బికోత్తమా !

ఉ. తమ్ములఁదాయ హాయినిడు। దట్టపు వెన్నెలగాయ వాయువుల్
నెమ్మదివీవ నీజగము నిశ్చ। లతన్ దనరార నీదు ప్రా
ణమ్ములు సొమ్మసిల్లఁ గరుణా। రస నిర్భరగానవాహినిన్
బమ్మరిలంగఁ జేసెదవు పల్కుము। కారణమేదొ కోయిలా !

ఉ. నిన్న రసాలశాఖపయి నిక్కి। గళంబుల నెత్తి పెల్లుగాఁ
దిన్నని కంఠరాగఫణితిన్। ముద మారఁగ జోడుకంఠముల్
గ్రన్ననఁగూడి పాడినటులన్। వినియుంటిని. ఇప్పుడక్కటా !
మిన్నునుదాఁకు శోకమునిమిత్తము। నేఁ గనుగొంటి కోయిలా !

చ. ఎలమిని నప్పుడే పొటమరిం। చెడు మవ్వపు జవ్వనంబునన్
వలపులుగుల్కు కన్నియలు వారక। తన్గవియింప రివ్వునన్
లలిత మనోజ్ఞ గానశకలంబుల। మేఁతను మాని రివ్వునన్
మెలగిన నీసతీమణియు మేదిని। బాసి తొలంగిపోయెనే

చ. ఇడుములచేత హృత్తరణి। యెంతయు శోకజలార్ణవంబునన్
సుడివడ మున్గ నీయక మనోధృతిఁ। బ్రోచెడు గర్ణధారి యౌ.
విడువక వెక్కివెక్కి విలపించిన। నుంతయు లాభమున్నె ? యూ
అడిలుము చన్న నీయువతి। రాదుగదా ! పికరాజచంద్రమా !

చ. సెలవులువాడి ప్రాణములు। సేదగొనెన్ గడు వేగ రమ్ము నీ
కొలుకులఁజారు బాష్పములు। గోటనుమీఁటి సుశీతలమ్ములౌ
జలముల దప్పిదీర్చి పికసత్తమ। నాదగుబిడ్డరీతి వ
త్సలతను నిన్ను సాఁకొనెదన్। హృదయార్తి శమించి పోవఁగన్.

# ప్రభుత్వ స్వరూప నిర్ణయాధికారము

జనమంచి వేంకట రామయ్య గారు

రాజనీతివేత్తలలో రాజ్యాంగప్రతిష్ఠాపనము లనఁగా నేమి యను విషయమునఁ బరస్పరవిరుద్ధములైన భావనలు పుట్టుటచేత, వాని ననుసరించి రెండుపక్షము లేర్పడినవి. అందొక తెగవారు పాలన మనునది కృషివాణిజ్యాదులవంటి వ్యాపారమే యనియును, అందు సాధ్యసాధనవిచారము నకుఁ (అనఁగా నుద్దిష్టప్రయోజనమును సంపాదించుట కేయే సాధనము లావశ్యకములో అను విచారము) దక్క మఱి యన్య విచారమున కవసరము లేదనియును, పురుషార్థసంపాదనమున కనువైన సౌకర్యములును సదుపాయములు నెప్పటికప్పు డవసరములను బట్టి క్రొత్తగాఁ గల్పింపఁబడునవియై-పాలనవిధానములో-దేహతత్త్వమునం దన్నరసములవలెనే - చేరి కలియుచుండు ననియుఁ దలఁచుచున్నారు. మఱియు పాలనముచేయుట యనఁగా యంత్రతంత్రములను విచారించుకొనుటే యనియును, ఈయంత్రములు మనుష్యనిర్మితములగుటచే వానిని నిర్మించుకొనుటగాని నిర్మించుకొనకుండుటగాని మనుష్యేచ్ఛాధీనమై యున్నదనియును భావించుచున్నారు. వీరిమతమునందు పాలనసమస్య తక్కిన లౌకికవ్యవహారసమస్యలవంటిదే. కనుక వీరుపదేశించెడి కార్యక్రమ మేమనఁగా, మునుముందు పాలనమువలనఁగలుగవలసినవిశిష్టప్రయోజనము లేవో వానిని నిర్దేశింపవలెను. ఆవెనుక నాప్రయోజనములను సంపాదించుట కత్యంతానుకూలమైన పాలన మెట్టిదై యుండవలెనో దానినిగూర్చి ఆలోచింపవలెను. అటుపిమ్మట నేపాలనపద్ధతివలన లోకమునకు మిక్కిలి యెక్కువమేలును మిక్కిలి తక్కువకీడును గలుగఁ గలదో దానిని నిర్ధారణచేయవలయును. అప్పు డెవరికొఱకీపాలనవిధాన ముద్దేశింపఁబడినదో అట్టి స్వదేశీయులకుఁ గాని విదేశీయులకుఁ గాని మన నిశ్చితాభిప్రాయములను తెలిపి యందులకుఁ గాను వారిసమ్మతిని బడయవలెను. అనఁగా నత్యుత్తమమైన పాలనవిధానమును కనుఁగొనుట. కనుఁగొని యదియే యత్యుత్తమమైనదని యితరులకు నచ్చఁజెప్పుట. చెప్పి దానిని సంపాదించుటకై వారిలో గొప్పకదలికను బుట్టించుట. ఇదియే యీరాజనీతికోవిదులు తలంచుత్రోవయై యున్నది.

ఇంక రెండవతెగలోఁ జేరిన రాజనీతిజ్ఞు లేమనుచున్నారు? వీరు పాలనవిధానము యంత్రమువంటిది కాదనియు నది యనన్యప్రేరితమైన యుత్పత్తికలదనియు ననగాఁ బ్రకృతిసిద్ధమనియును పాలనవిద్యయనునది జంతుస్వభావశాస్త్రముయొక్క శాఖగాఁ బరిగణింపఁ దగిన దనియు వాదించుచున్నారు. వీరిమతమునఁ బాలనవిధానము లిచ్ఛాధీన విషయములు గావు. చాలవఱకును యథాసంభవముగ గ్రాహ్యములు. అవి యొక నమూనాను బట్టి తయారుచేయఁదగినవియుఁ గావు. అట్లయిన వానితో వ్యవహరించుట యెట్లుండు లేని మనము ప్రకృతిధర్మముల ననుసరించితిమనక యన్న కారణముచేతనే యొకటి కొనితెచ్చి పెట్టుకొనుచుండుట ప్రవర్తించుచున్నారమే కాని, ప్రకృతి మనయభీష్టము ననుసరించి నడచుచుండుటలేదు కదా! అట్లే పాలనప్రతిష్ఠాపనముల స్వాభావిక ధర్మములను గుర్తించి, వాని ననుసరించి మన వ్యవహారములను సవరించుకొనవలయు నందురు. మఱియు నీ సంప్రదాయమువారు ఒకజాతియొక్క ప్రాతిపదిక రాజ్యాంగవ్యవస్థ లాజాతియొక్క ప్రకృతితత్త్వములోఁ బుట్టి పెరుఁగుచుండు ననియును సాధారణముగ చెట్లయందును, ఆ చెట్లు పుట్టిన భూమియొక్క సారము చేరునట్లే వానియందును వాని గుణస్వభావాదులు చేరుచుండు ననియు, కనుక వాని మూలతత్త్వ మెన్నఁటికిని మాఱునది కాదనియుఁ జెప్పుదురు. మఱియు నీ ప్రతిష్ఠాపనకార్యమునం దాజాతియొక్క యిచ్ఛాశక్తి ఏదేని యొక పరమోద్దేశ్యము ననుసరించి ప్రవర్తించియుండక యెప్పటి కప్పుడు తటస్థమైన యత్యావశ్యకముల నత్యావశ్యకోపాయములఁ గడపుకొనుటకు మాత్రమే వినియోగపడుచుండె ననియును, ఈయుపాయసామగ్రిలో ఆజాతియొక్క సహజప్రవృత్తుల ననుసరించి సంప్రదాయసిద్ధములైన యాచారవ్యవహారములకు విరుద్ధములు కానివెల్ల నిలువంబడి కాలక్రమమున పెఱిఁగి పేరుకొని రాజ్యతంత్ర మనుపేర స్థిరాకృతిని తాల్చియుండుననియును, అట్టి రాజ్యతంత్రములను-భిన్నప్రకృతులును భిన్నపరిస్థితులును గల యితరజాతులకు - మెడఁ గట్టఁబూనుట వ్యర్థప్రయాసమనియుఁ దలంచుచున్నారు.

ఈ రెండుమతముల సిద్ధాంతములను పరస్పరానపేక్షము లగు రెండు ప్రత్యేకవాదములుగా నంగీకరింపఁగలిగినయెడల మనకు ఆరెంటిలో నేది కేవల మసంగతమో నిర్ణయించుట కష్టసాధ్యమై యుండును. కాని యదృష్టవశమున నవి యట్టివి కావు. ఏ మనఁగా, సాధారణముగా లోకములో నొకవివాదవిషయమున నొకమత మవలంబించితిమని చెప్పుకొనువారి సిద్ధాంతములు ఆవిషయముననే వారు వ్యావహారికదశలో వెల్లడించు నభిప్రాయములను పూర్తిగా వివరింపఁజాలవు. అవలంబితుల మతసిద్ధాంతములకును, అవలంబకులయాచారమార్గములకును పూర్ణసమన్వయము కుదురుట కష్టము. ఈయంశ మీయుభయవాదకులను పరిశీలింతుమేని బయలుపడఁగలదు. అన్నిజాతులవారును అన్నివిధముల ప్రతిష్ఠాపనములను జక్కఁగా సాగింపఁగలుగుదు రని యంత్రసామ్యవాదు లనుచున్నారు. కాని యిది విశ్వాస్యము కాదు. లాగుటకు బలిష్ఠములైన యెద్దులును - తదుపయోగము తెలిసి లాభకరముగాఁ బనిచేయించు నేర్పుగల సేవకులును - కలుగునప్పుడే యొకరైతు ఇనుపనాఁగలిఁ గొనుచున్నాఁడు. గాని అవి లేనప్పుడు చెక్కచెదరని యుక్క

లేదు. ఇఁక చెట్లుచేమలవలె రాజ్యతంత్రములుకూడ నెట్లు పుట్టిన నట్లే పెరుఁగవలెనని చెప్పెడి ప్రకృతిసిద్ధవాదులు తాము నియతివాదుల మని చెప్పుకొనుచున్నారు. కాని యది వట్టిభ్రమ. ఏమనఁగా మన మొకనిఁ బిలిచి "ఓయీ! ఇన్నివిధములైన రాచటికము లున్నవి. వీని వీని లాభము లిట్టి విట్టివై యున్నవి. ఆలోచించుకొని నీ వెట్టి యేలుబడిలో నిలువఁ గోరెదవో చెప్పు" మని యడిగినప్పుడు నే నిట్టి రాచటికములో నుండఁగోరుదు నని చెప్పి యెన్నుకొనుటకు వాని కవకాశము కేవలము లేకపోలేదని వీరును ఒప్పుకొనుచునే యున్నారు. దీనినిబట్టి చూడఁగా నీరెండువాదములును గొంచెము ప్రకారపరివర్తనమునొందకుండ సరిపుచ్చుకొనఁజాలని వనియు, ఆ కారణముచేత వీని ప్రాబల్యదౌర్బల్యములు తుల్యములే యనియుఁ దేటపడుచున్నది. అట్లయిన నింక వీ రొకరితో నొకరు పోరాడుటకుఁ గారణభూతమైన భేద మెందున్నదందురేని అది వీరి విచారసరణియొక్క ప్రకారద్వయమునం దంతర్నిగూఢమై యున్నది. అయినను ఈ రెంటను కేవలసత్యములును కేవలాసత్యములును గాకునికి స్పష్టము గుటచే, వీనిమూల మరసి సత్యమును సంగ్రహింపవలయును.

రాజ్యాంగప్రతిష్ఠాపనములు మనుష్యనిర్మాణములే యనియు, వానియుత్పత్తిస్థితులకు మూలము మనుష్యసంకల్పమే యనియు మనము జ్ఞప్తియం దుంచుకొనవలయును. మనుజులు నిద్రించుచుండఁగా నవి చెట్లవలెఁ బెరుఁగుచుండునవి కావు. కథలలోని గాఁడిబిక్కులవలె నంకురించి యొక్కసారిగ నంతరిక్షమార్గమున కెగఁబ్రాకినవియుఁ గావు. వాని విద్యమానస్థితి యెప్పటికప్పుడు మనుష్యకర్తృకమైన యిచ్ఛావ్యాపారము ననుసరించియుండును. మనుష్యుఁడు కావించు నితర కార్యములవలెనే, అవియును వానియందు వినియోగపడు వివేకకౌశలములకొలఁదులను బట్టి, మంచివయినను చెడ్డవయినను కావచ్చును. ఒక విషమదశ ప్రాపించినప్పుడెల్ల, నద్దానిని బ్రతివిధానములచే సవరించుకొనుచు గాని, తమకుఁ జేకూడిన బలముతో విరోధించుచు గాని, తాత్కాలికప్రక్రియ నాశ్రయించి యొకవ్యవస్థ నేర్పఱచుకొనుటకు, స్వబుద్ధిలోపముననో అన్యులబలాత్కారముననో, యశక్తులైన జనులకీ రాజకీయపురోగమావరోధము నిస్సంశయముగా నొక ప్రతిబంధమే యగును. కాని ఇతరులకు మేలయిన ప్రక్రియ వీరికి మేలయి యుండకపోయెడి దని కాని, యర్హ మని తలఁచి యవలంబింతురేని మీఁద నయినను మేలుచేయదని కాని సాధించుట కవకాశము కలుగదు.

రాజ్యయంత్రము తనకుఁ దానుగా నడచునదికా దనువిషయమును గూడ మనసునం దుంచుకొనవలయును. దానిని దొలుత నిర్మించిన మనుజులే—సామాన్యమనుజులే—దానిని నడపింపవలసినవారునై యున్నారు వారు కదలిక గలిగి కలిసి పనిచేయవలయును. కాని వారు అంగీకారసూచకముగాఁ దలయూఁచినంతనే యది కదలునది కాదు. పనిచేయలభించినవారి శక్తిసంపదకును గుణసంపదకును దగియుండునట్లు దానిని సరిపుచ్చుచుండవలయును. ఇదియెల్ల మూఁడు నిబంధనల నాశ్రయించియున్నది. ఎవరికొఱ కొకపాలనపద్ధతి యుద్దేశింపఁబడునో వారు దాని నంగీకరింపనైన నంగీకరింపవలయును. లేదా యధమపక్షము తత్స్థాపనమునకుఁ బ్రబలప్రతిబంధరూపమైన యసమ్మతి నైనను జూపకుండవలయును. వారు దానిని నిలువబెట్టియుంచుట కావశ్యకమైన దెల్ల నొనరించుట కభిముఖులును, సమర్థులును నై యుండవలెను. దాని ప్రయోజనముల నది చక్కఁగా సాధింపఁగలుగుటకై యది వారి నేమేమి చేయవలయు నని కోరునో దానినెల్లఁ జేయుటకు వా రభిముఖులును సమర్థులునై యుండవలెను. ఈమూఁడునిబంధనలలో నేది కొఱవడినను, ఆజాతిచేఁ బ్రతిష్ఠింపఁబడిన పాలనపద్ధతివలన నాజాతికిఁ గలుగవలసిన పరమప్రయోజనము కలుగకుండును.

ఏపాలనమునైనను బ్రతిష్ఠించుటకు మొదటి యాటంకము ఆజనులకు దానియెడలఁ గలుగు విద్వేషమే యని చెప్పియుంటిమి. ఇందుకు లోకచరిత్రమునం దుదాహరణములు పెక్కులు గలవు. విదేశీయుల తుపాకిగుండుదెబ్బలు తగిలి దేహములు నొచ్చినప్పుడే, ఉత్తర అమెరికాలోని యిండియనుమోటుజాతివారి మనస్సులకు నాగరకపరిపాలనము వలని లాభములు నచ్చినవి కావు. అదేప్రకారముగా ప్రాచీనరోమక రాజ్యములపై దండెత్తిన బర్బరజాతులయుద్ధానంతరస్వేచ్ఛావిహారములు వారి నాయకులకైన నడంపశక్యములు కాకపోవుటచే వారి నాజ్ఞాబద్ధులనుగా దిద్దుటకుఁ గొన్ని శతాబ్దులు పట్టెను. మఱియును గొన్ని జాతులవారు, తమ్ముఁ జిరకాలమునుండి పరిపాలించుచుండిన రాజవంశములలోని రాజులచేత నే కాని తదితరులచేఁ బరిపాలింపఁబడుట కిష్టపడకున్నవారు. మఱికొందఱు తాము విదేశీయులచే జయింపఁబడినప్పుడు తప్పఁ దక్కిన సందర్భములలో నేకచ్ఛత్రాధిపత్యమున కియ్యకొనకున్నారు. అదేవిధముగా నింకఁ † గొందఱకుఁ బ్రజాస్వామ్యపద్ధతి యన్నఁ దలకంటకముగ నున్నది. మీఁదఁ బేర్కొనఁబడిన యాటంకములన్నియు నశక్యత్వరూపములై యున్నవి. ఈయశక్యత్వము నైమిత్తికమే గాని, నిత్యము మాత్రము కాదు.

మఱియు నొకజాతివా రొకపాలనపద్ధతియెడలఁ గేవలద్వేషము పూనకున్నను సాధ్యమయినవఱకు ననురాగమునే ప్రకటించుచున్నను, పూర్వోక్తనిబంధనలను చెల్లించుట కభిముఖులుగాఁగాని, సమర్థులుగాఁగాని యుండకపోవచ్చును. పేరునకైనను దానిని నిలఁబెట్టియుంచుట కావశ్యకములైన నిబంధనలనైనను పాలింపగలవారుగా లేకపోవచ్చును. ఎట్లనఁగా నొకజాతివారు స్వతంత్రపరిపాలన మెక్కువ మేలైనదని తొలుత నెన్నుకొని, యావెనుకఁ బ్రమాదాలస్యాది తమోగుణగ్రస్తులును, శౌర్యౌదార్యాది సుగుణరహితులు నగుటచే నద్దానిని రక్షించుట కావశ్యకమయిన ప్రయాసమునకు ఓపలేని, అన్యులు తమప్రభుత్వముమీఁదికి దండెత్తివచ్చినప్పుడు వారి నెదిరించి పోరలేని, తమ్ము నందుండి మెల్లగాఁ ద్రోసివేయుటకై కుమంత్రులు పన్ను పన్నుగడలకు వశులగుదురేని క్షణమాత్రపు నిరుత్సాహమువలనఁ గాని, హఠాత్సంభవమైన తాత్కాలికభీతిచేతఁ గాని లేక యొకానొక వ్యక్తిచేఁ బ్రేరితమైన యుత్సాహావేశమునఁ గాని యొక మహాపురుషుని పాదముల నాశ్రయించి తత్సన్నిధిని తమస్వాతంత్ర్యముల నెల్ల నర్పించి,

తా ముకట్టినదెల్ల నేలపట్టి మెుసరింప నవకాశ మొదవించు నధికారముతో నాతని నమ్మి సర్వస్వతంత్రునిఁ జేయ వెనుదీయరేని యట్టివారు స్వాతంత్ర్యమున కించుమించుగా నర్హు లేయని చెప్పవలయును. మఱియు నొక యనాగరకజాతివారు తమపరిపాలనముచే విధింపఁబడిన ధర్మముల నెఱవేర్చుట కభిముఖులును సమర్థులును గాకపోవచ్చును. వీరు నాగరక సంఘమువలని లాభములను కొంతవఱకు గుర్తింతురు. కాని యాసంఘముచే నిషేధింపఁబడిన వాని నాచరించుటకు విముఖతను గనఁబఱుపఁ జాలరు. వీరిచిత్తవృత్తుల యుద్రేకమును - వీరియభిమానముల దుస్త్యజత్వమును - వీరిలోవీరికి సకారణముగనో అకారణముగనో తగవులో లేక తగవులవంటివో పుట్టినప్పుడు, వీరిచేఁ గత్తిగట్టి కసిదీఱఁ బోరాడించునే కాని, వీరిని న్యాయస్థానములకుఁ బంపుట కొప్పుకొనదు. అట్లు సేయుట పౌరుషహీనమైన కార్యముగాఁ దోఁచును. ఇట్టిస్థితిలో నాగరక పరిపాలనమువలన వాస్తవమైనలాభము కలుగవలెననిన నది చాలవఱకు నిరంకుశముగనే యుండవలెను. అప్పు డాజనులకు దానిని కట్టుఁబాటులో నుంచుట కధికారమేమియుఁ గలుగకపోవుటయును, అదియే వారివ్యాపారముల నెల్ల నణఁచిపెట్టి యుంచుటయును, తటస్థించును. మఱియు దుష్టశిక్షణకార్యమునందు శాసనములకును వానిఁ బాలించు నుద్యోగస్థులకును పూని తోడుపడనిజనులు కొలఁదిస్వాతంత్ర్యమునకు మాత్రమే అర్హులు. దండ్యుఁడైన దోషినిఁబట్టి యొప్పగించుటకు మాఱుగా దాఁచి కనఁబడకుండఁ జేయువారును, తమయింటఁ గన్నము వైచిన దొంగమీఁద సాక్ష్యమిచ్చుట శ్రమకుఁ గారణమనియో, లేక పగలు పెరుఁగుటకుఁ దెరువని యెంచియో యెఱుఁగమని యప్రమాణమునకు సిద్ధపడువారును, నడువీధిలో నొకఁడు బాఁకు గొని వేఱొకనిఁ బొడువఁగాఁ జూచియు నిది విచారించుట రక్షకభటులపనియే కాని మనపని కాదనుకొని తొలఁగి యవ్వలివైపుగా మెల్ల మెల్లనటివఱకును బోవుచుండిన కొన్ని ఐరోపాజాతులవంటివారును, హత్యకు సహాయపడక హంతకుని నురిదీయునప్పుడు తిరుగఁబడుటకుఁ గొంకనివారును, ఇందుకు లక్ష్యభూతులగుచున్నారు. వీరిని బాలించుసందర్భమున నధికారులకుఁ జేతినిండఁ జండతరమైన యధికారముండిననే కాని, దౌష్ట్య మడఁగి నాగరకపరిపాలనము నడచుట కాధార మేర్పడదు. అనాగరకవృత్తినుండి యప్పుడప్పుడే బైటఁబడిన యేజాతివారిలోనైనను శోచనీయములైన యీవిరుద్ధభావము లుత్పన్నములగుటకుఁ గారణము నిస్సంశయముగా వారి వెనుకటి దుష్పరిపాలనమే. శాసనములు వారి మేలుకొఱకుఁ గాక మఱియెందుకో నిర్మింపఁబడి యున్నవనియును, శాసనపాలకులే శాసన తిరస్కారులకంటెఁ దమకుఁ బ్రబలశత్రువులనియును, వారు భావించుట కీదుష్పరిపాలనమే కారణము. ఇందులకు వీరిని నిందింపవలసినపని లేదు. సత్పరిపాలనమున నవి క్రమక్రమముగాఁ దొలఁగిపోవఁ గలవు. కాని అంతవఱకును, శాసనమన్న గౌరవమును సానుభూతియుఁ గలిగి శాసనపాలనకార్యమున హృదయపూర్వకముగాఁ దోడుపడుటకు ముందడుగు వేయువారిని పాలించినట్లు, వీరిని బరిమితాధికారముతోఁ బాలించుట కవకాశము లేదు.

ఇంకఁ బ్రాతినిధ్యపరిపాలనము :— ఈ పాలనమువలనఁ బ్రజలకు మేలు కలుగవలయు నన్నయెడలఁ, బ్రతినిధుల నెన్నుకొనుట కధికారము గలవారిలోఁ జాలభాగము తమరాజ్యముయొక్క యోగక్షేమములఁ గూర్చి శ్రద్ధవహించినవారయి తమ యెన్నికచీట్లను ప్రజాసేవాపరాయణులగు నర్హులకే యియ్యవలయును. అట్లు సేయక వా రుదాసీనులయినను లేక ద్రవ్యాపేక్షచేఁ దమయెన్నికచీట్ల నమ్ముకొనినను లేక తమ్ము లోఁబఱచుకొన్నవారి యాగ్రహానుగ్రహములకుఁ బాత్రులమగుదుమని భయపడికాని యాశపడికాని యనర్హులకిచ్చినను, ఈపాలనమువలనఁ దంత్రములు హెచ్చి తన్మూలమునఁ బ్రజోపద్రవము వాటిల్లును. ప్రజాప్రాతినిధ్యవరణ మీతీరుగా నడపఁబడినయెడల, దుష్ప్రభుత్వము కృశించి నశించుటకు మాఱుగా మఱియింత బలపడుట తటస్థించును. రాజ్యయంత్రము నడచుటకు నైతికములైన యీయాటంకములే గాక, తెఱుఁగ దుస్తరము లగు నితరాభ్యంతరములును గలవు. అది యెట్లన, పూర్వకాలమునందు [అనఁగా పౌరసంఘములు పౌరరాష్ట్రములు స్థాపింపఁబడిన కాలమందు] ప్రజలలో వ్యక్తిస్వాతంత్ర్యము సర్వసాధారణమై యుండెను. కాని తత్స్వాతంత్ర్యము తద్రాజ్యములలోనే కాని తత్సీమలకు వెలుపలిప్రదేశములలో నెక్కడను ప్రజాసమ్మతమైన సక్రమపరిపాలనకార్యమందు వినియోగపడినట్లు సూచనలెవ్వియుఁ గానరావు. ఏమనిన, ఈరాష్ట్రన్యాయస్థానములకు లోకవ్యవహారములనుగూర్చి యాలోచించుటకై రప్పింపఁబడఁగలిగిన పౌరప్రముఖులలోఁ దక్క, దక్కిన పైప్రదేశములలోని జనాభిప్రాయమును నిరూపించుటకును అద్దానిని వ్యాపింపఁజేయుటకును వలయు సాకారసాధనకలాప మేదియును లేకయుండెను. అందుచే నీప్రాతినిధ్యవిధానము నవలంబించిన వెనుక నీయాటంకము కొంతవఱకుఁ దీఱిన ట్లెంచఁదగి యున్నను, దానిని పూర్తిగాఁ దొలఁగించుట కాకాలపు న్యాయస్థానాదులతో నొకవిధముగా సరిపోల్పఁదగియుండు నేఁటికాలపు ముద్రణయంత్ర వార్తాపత్రికాదికము కావలసివచ్చెను. మఱియు విస్తీర్ణములైన యేకచ్ఛత్రాధిపత్యములు సుస్థిరములై నిలిచియుండుట కనుకూలింపని సాంఘికస్థితులు గల కాలములు కొన్ని కలవు. రాజు తనరాజధానినుండి దూరస్థప్రజలకు శాసనముల నంపుటకుఁ గాని, ఏ విధముననో అంపఁ గలిగినను అవి యెట్లు మన్నింపఁబడెనో తెలిసికొనుటకుఁ గాని యావశ్యకమైన అధికారయంత్రసామగ్రి కొదువ యగుటచే నట్టి రాజ్యములు కాలక్రమమునఁ జిన్నచిన్న స్వతంత్రసంస్థానములుగఁ గాని, లేక యొకే ప్రభువు నాశ్రయించి కొలుచు పాలెగాండ్ర సైనికవృత్తులుగఁ గాని చీలిపోవుట తప్పనిసరి యగుచుండెను. మఱియు రాజు తనసైన్యమునైనను స్వాజ్ఞాబద్ధముగాఁ జేసికొనుటకుఁ దత్సైనికులు స్వేచ్ఛాపూర్వకముగఁ దమస్వామియెడలఁ జూపఁగలిగిన భక్తివిశ్వాసములు దక్క వేఱుశరణము లేనివాఁడయి యుండెను. రాష్ట్రములోని ప్రజలెల్లరును దనయాజ్ఞలను జెల్లించునట్లు చేయవలెనన్న నాతనికి గొప్పసైన్య మొకటి కావలసియుండెను. కాని తత్సైన్యపోషణమునకు వలయుధనము ప్రజలవల్లఁ బన్నులమూలమున వచ్చుమార్గము గానఁబడకుండెను. కావున

నీపరిపాలనవిధానములకెల్ల నివియును నిట్టివియును ఆర్థిక భౌతిక నైతిక ప్రతిబంధములై యున్నవి. ఈప్రతిబంధసామగ్రి కొన్నిపాలనముల నెక్కువగను కొన్నిటం దక్కువగను నుండునని తెలియవలయును. అది గొప్పదిగా నున్నప్పుడు ఒకరాజ్యమును కేవలము త్రోసివేయనప్పటికిని అనఁగా, తత్ప్రజలకు దానిని విడిచి మఱియొకదానిని గోరుకొనుట శక్య మనుతలంపు పుట్టింపనప్పటికి, దానిని మిక్కిలి శోచనీయమైన దుస్థితికిఁ దేఁగలుగునంత గొప్పదిగా నుండవచ్చును. ఇట్టిస్థితిలో మనమా యనన్యగతికులగు ప్రజలొక యభావప్రతినిధి నాశ్రయించి యల్లాడుచున్నారని యెఱుంగవలయునే కాని వారు దానికిని-అది వారికిని-దగి యున్నట్లెంచుట న్యాయ్యము కాదు.

ఇంతవఱకుఁ బాలనపద్ధతులు పాలితుల కనుకూలములై యుండవలయు ననుటకు మూఁడు ముఖ్యనిబంధనలను గూర్చి చర్చించి యున్నాము. రాజ్యప్రకృతిసిద్ధత్వవాదులు చెప్పెడిమాటల కర్థ మీ మూఁడును అవశ్యోపాదేయములే యనుట యగునేని, ఇందు మొదటి రెంటిని పూర్తిగను మూఁడవదానిని గొంతవఱకును నెఱవేర్పక ఏ ప్రభుత్వముగాని సుస్థిరమై నిలువనేరదనుటయే యగునేని, వారివాదము మితవాదమై నిర్వివాద మగును. ఇంతకంటె నెక్కువయర్థము చెప్పుదురేని యది నిలువనేరదు. ప్రతిష్ఠాపనములు చరిత్రాత్మకాధారములై యుండవలె ననియు నవి తత్ఫలభాక్కులగు జనుల యాచారవ్యవహారాదులతో సన్నిహితముగా మిళితములై యుండవలెననియు వీరుచెప్పెడి మాటల కింతే యర్థము. ఈమాటలకు వాస్తవముగాఁ జెప్పవలసిన సహేతుకార్థముకంటె రసప్రధానముగాఁ జెప్పెడి యాలంకారికార్థమే యెక్కువగ నున్నది. కాని రాజ్యాంగప్రతిష్ఠాపనముల కావశ్యకము లని చెప్పఁబడు నీయాచారాదులు—నిజముగా వానియుపయోగమును బట్టి చూచినయెడల—పూర్వోక్తనిబంధనలను నెఱవేర్చుటకుఁ దోడుపడెడి సౌకర్యములవంటివే యగును. ఒకప్రతిష్ఠాపనమునకుఁ గాని కొన్ని ప్రతిష్ఠాపనములకుఁ గాని జనుల యభిప్రాయములచేతను అభిరుచులచేతను అభ్యాసములచేతను ఒక త్రోవ యేర్పడినప్పుడు, వారు వానిని బరమసంతోషముతోఁ జేకొనుటయే గాక, వానిని సంరక్షించి ఫలప్రదములుగా నొనరించుట కావశ్యకమయినదెల్లఁ బ్రారంభము నుండియు నెక్కువ సుకరముగాఁ జేయఁగలుగుదురు. ఇట్టిసౌకర్యము లున్నప్పుడు శాసననిర్మాత వానిని గుర్తింపక తల్లాభములను గణింపక చట్టములను జేయఁ బూనుకొనుట తప్పే యగును. కాని యివి లేకపోయినఁ జేయున దేమియు లేకపోవు ననుకొనుట యంతకంటెను దప్పగును. ఏ మనఁగా జనులు తాము చేయ నలవాటుపడియున్న వాని నెక్కువసుకరముగాఁ జేయఁగలిగినను, క్రొత్త వానినిగూడఁ జేయనేర్చుకొన వలఁతులై యుందురు. ఎఱుక పిడికెఁడు ధన మన్నట్లు పరిచయము చాల సాహాయ్యకారియే యగును. కాని అపరిచితముకూడ నదేపనిగఁ జింతింపఁబడినప్పుడు, పరిచితమే యగును. జనులు నూత్నవిషయములనుగూర్చి యత్యాసక్తిని గనఁబఱతు రనుటకు దృష్టాంతములు పెక్కులు కలవు. అపూర్వముల నాచరించుటకును నూత్నపరిస్థితులకుఁ దగినట్లు మెలఁగుటకును వలసిన సామర్థ్యసంపద యాయా జాతులయందు వారివారి నాగరకతలనుబట్టి వేఱువేఱు కొలఁదులు కలదిగా నుండును. ఒకపాలనపద్ధతినిబంధనలను నెఱవేర్చుట కొక జాతికిఁ గల సామర్థ్యమును నిర్ణయించుట యంతసులభసాధ్యము కాదు. ఈపనికిఁ గడఁగువారి కాజాతినిగూర్చి చక్కఁగాఁ దెలిసియుండవలెను. మఱియుఁ గార్యసాధనానుకూల మగు సామాన్యవివేచనతోపాటు సూక్ష్మమతిత్వము కూడఁ గావలయును. ఈ సందర్భమున నింకొక్క యంశముకూడ విచారింపఁదగియున్నది. ఒకజాతివారు మంచిప్రతిష్ఠాపనములకు సంసిద్ధులై యుండకపోవునప్పుడు తద్విషయకమైన కోరిక నంకురింపఁజేయుట నాయకులకు ముఖ్యకర్తవ్యము. ఇది సన్నాహప్రధానాంగములలో నొకటి. ఒక ప్రతిష్ఠాపనముయొక్క ప్రాశస్త్య మిట్టిదని తేటతెల్లముగఁ దెలిపియు దానివలనఁగలుగు లాభము లిట్టి వని కన్నులకుఁగట్టినట్లు వర్ణించిచెప్పియు, వాదించియు, నాయకు లయినవారు ప్రజల కుద్బోధమును గలిగింతురేని, వారు మేలుక, కావలయు దానిం గోరుకొని యది సిద్ధించు వఱకును నిదురవోక సర్వవిధములఁ బాటుపడుదురు. ఇట్లు చేసియే - మాజినీ గారిబాల్డీయను నిటలీదేశాభిమానులు తమదేశమున కేకాధిపత్యస్వాతంత్ర్యములను సంపాదింపగలిగిరి. కాని నాయకు లొక యంశమును మఱవఁగూడదు. తాము మంచివని చెప్పు ప్రతిష్ఠాపనమువలని లాభములను మాత్రమే గాక, తమ దేశీయుల కాయికమానసికనైతికశక్తిసంపదల పరిమితులనుగూడ సంపూర్ణముగ గుర్తించి ప్రవర్తింపవలెను. అట్లు సేయరేని వారిప్రబోధము మేరమీఱిన యాశలను బుట్టించి గొప్పసంక్షోభమునకుఁ గారణమగును. ఇంతవఱకుఁ జేసిన నిబంధనత్రయవిచారణవల్లఁ బ్రజలకుఁ బ్రభుత్వస్వరూపనిర్ణయాధికారము కల దని ఫలితార్థ మేర్పడుచున్నది.

# జాతీయ విద్య

వల్లూరి సూర్యనారాయణ రావు పంతులు గారు, బి. ఏ., బి. ఎల్.

పందొమ్మిదివందల ఐదవ సంవత్సరమునందు కాశీలో జరిగిన కాంగ్రెసుసభలో, జాతీయవిద్యాప్రసంగము మొదట బయలుదేరి 1907,1908 సం॥లలో దేశమునందు అక్కడక్కడ కార్యరూపము దాల్చినది. ప్రస్తుత పరిపాలకులతో సంబంధము లేకుండ సాధ్యమైనంతవఱకు దేశభాషలలో సమస్తమైన శాస్త్రములు కఱపవలెననియు, మనపూర్వుల విజ్ఞానము, మతము చరిత్ర వేదాంతము మొదలగు వానియందు ఎక్కువగ దృష్టి నుంచి వివిధవర్ణములలో దేశాభిమానము ఐకమత్యము మానవసేవ మొదలగు సద్గుణములను అలవడఁజేయుచు ప్రతివిద్యార్థికిని అతని జీవనోపాధికి ఒకకళనైనను నేర్పవలెననియును, విద్యార్థులును ఉపాధ్యాయులును రాజకీయ సాంఘిక విషయములలోఁ బాల్గొనుటకు సంపూర్ణస్వాతంత్ర్యముండవలయు ననియును మనవారియుద్దేశ మగుటచేత, ఆవిధముగానే మనదేశమునందు కొన్ని పాఠశాలలు బయలుదేరినవి. కాని అయ్యవి తగినంత ధనసహాయము లేక నానాటికి కృశించుచున్నవి.

ఈ జాతీయపాఠశాలలను మొదటను స్థాపించినపుడు, ప్రస్తుతము సర్కారు పాఠశాలలలో నేర్పు విద్యకు సహకారముగా నుండుటకే గాని, వానిని బొత్తిగా మార్చివేయుటకు ఏర్పఱచ లేదు. గనుక నీ రెండు విధములగు పాఠశాలలలోని విద్యావిధానమును కొంచెమించుమించుగ ఒకమాదిరిగనే యున్నది. ఈజాతీయపాఠశాలలలో మనము చేసిన కొలదిమార్పులను మనమంత్రులు కూడ నిప్పుడంగీకరించి ప్రాథమిక మధ్యమ పాఠశాలలలో వానిని చొప్పించుచున్నారు. కాని యిది జాతీయవిద్య కాదని నాయభిప్రాయము. విద్యలో జాతీయము అవిజాతీయ మను భేదములు సామాన్యదృష్టికి గోచరింపవు. విజ్ఞానమనునది ఏదేశమునుండి వచ్చినను స్వీకరింపఁదగినదే. కాని పాశ్చాత్త్యపరిభాషాపదముల నుపయోగించుచు భౌతిక శాస్త్రములను మన మభ్యసించుచున్నంతవఱకును, వానిని మన శరీరములోఁ జక్కగ జీర్ణము జేసికొన్నట్లు యెంచబడదు. మఱియు నాజ్ఞానము విదేశీయముగనే భావింపబడునే గాని మన రక్తములో కలియదు. ప్రపంచములో నెచ్చటనుండి యైనను మనము విద్యలను గ్రహింపవలసినదే గాని దానిని మనజాతీయముగా చేయగలిగినపుడే అది సామాన్యప్రజలలో వ్యాపించుటయును, నూతన పరిశోధనములకు ప్రోత్సాహము నొసంగుటయును సంభవించును. ఆయా శాస్త్రములలో నెంతవఱకు మనపూర్వులు కృషిచేసినదియును తెలిసికొని వానిలో నేటివఱకును ప్రపంచములో తక్కిన దేశములందు వృద్ధిపొందిన జ్ఞానమును చేర్చవలెను. పూర్వపు పునాదుల మీఁదనే - అట్టి సంప్రదాయములను అనుసరించియే - అట్టి దేశీయ వాఙ్మయముతోనే - ఈ నూతనజ్ఞానమును కూడ నిర్మింపవలెను. అట్లు కానియెడల పూర్వాధునిక విజ్ఞానములకు రెంటికి సంబంధము లేక విడివిడిగా నుండిపోవుటయును, ఎప్పటికిని మన విద్యాధికులు విదేశీయ దృష్టితోనే ప్రతివిషయమును పర్యాలోచనము సేయుచు, తమ పూర్వులకును ఇప్పటి తమ సామాన్య సోదరులకును దూరముగ నుండుటయును తటస్థించుచుండును. ఈ నూతనజ్ఞానము మనది కాదను భ్రమతోనే యుందురు.

మన వాఙ్మయమునందు అరువదినాలుగుకళలు నున్నవనియును వానిఁగూర్చి పెక్కుగ్రంథములు సంస్కృతభాషయందు నున్నవనియును చెప్పెదరు. ఇది నిజమైనయెడల నా గ్రంథములను మున్ముందుగ మన సంస్కృతపండితులచేత, ఆంధ్రీకరింపఁజేసి, తరువాత నాయాశాస్త్రములలో ఆధునికజ్ఞానమునంతయు కలిగినపండితులద్వారా, దానిని పూర్వుల విజ్ఞానముతో చేర్చి గ్రంథములను వ్రాయింపవలెను. ఇట్టి యుద్గ్రంథములనుండి బాలురకొఱకు ఆయాతరగతులకు తగినట్లుగ - చిన్నచిన్న పుస్తకములను - (Primers) వారి వాచకపుస్తకములలో - చిన్నచిన్న పాఠములుగ - వ్రాయించి నేర్పిన యెడల, మనబాలురకు జాతీయవిద్య బోధించుచున్నట్లు యెంచబడును. బెరామిటర్ థెర్మామిటర్ కాల్సియమ్ పారలాక్సు థోరాక్సు మొదలగు పదములతో నిండిన పాశ్చాత్యశాస్త్రములను ఆంధ్రభాషద్వారానైనను, యెంతకాలము కఱపినను ఆవిద్య మన శరీరములో చేరక విజాతీయముగానే యుండును. అంకగణితము బీజగణితము రేఖాగణితము ఖగోళశాస్త్రము

శారీరకశాస్త్రము జీవశాస్త్రము వృక్షశాస్త్రము మానసికశాస్త్రము, రసాయనశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము వాస్తుశాస్త్రము శిల్పిశాస్త్రము ఆరోగ్యశాస్త్రము వైద్యశాస్త్రము వ్యవసాయశాస్త్రము పశుశాస్త్రము ఖనిజశాస్త్రము చిత్రలేఖనము సంగీతము ఈ మొదలగు శాస్త్రములను, కళలనుగురించి గ్రంథములు దేశభాషలలో వ్రాసి బాలురకు పఠనీయగ్రంథములుగ పాఠశాలలలో నేర్పరచినపుడే, అవి జాతీయపాఠశాలలని పేర్కొనుటకు అర్హములై యుండును.

ప్రపంచమునందు ఎచ్చటెచ్చట నూతనముగఁ గని పెట్టిన విషయము లున్నను అవి తమవిగానే భావించి మన పూర్వులు విదేశీయులనుండి అనేకశాస్త్రములను గ్రహించిన జ్ఞానమును సంపాదించుకొనుచు తమ విజ్ఞానమును వారి కిచ్చుచునుండిరి. ఈజిప్టుదేశవాసులు అరబ్బులు గ్రీకులు మొదలగువారు ఈ దేశజులతో అనేకవిద్యలను మార్చుకొనుచుండినట్లు ప్రాచీనములగు నిదర్శనము లున్నవి. ఆ విధముగా నేమనము విదేశీయులచే సంపాదింపబడిన జ్ఞానమునంతను దేశభాషలలోనికి తెచ్చుకొనునపుడే అది హైందవ విజ్ఞానములో నిముడును. ఇట్టి జాతీయాభివృద్ధికి యెంత ధనమైనను వెచ్చింపవలసి యున్నది. ఎంతమంది విద్యాధికులో ఈ విషయమునందు రాత్రిందివములు పని చేయవలసి యుందురు. అయినను యిప్పుడు జాతీయ పాఠశాలలను స్థాపించినవారును స్థాపింప దలచినవారును ఒక్కొక్క శాస్త్రపుఅభివృద్ధికై నను స్వాంతముగ కృషిసల్పినయెడల శీఘ్రకాలములోనే జాతీయవిద్య మన దేశములో సర్వతోముఖముగ వ్యాపించుననుటకు సందేహము లేదు.

ఇప్పటి గవర్నమెంటు పాఠశాలలమాదిరిగనే పాఠశాలల నేర్పరుచుటవలన కలుగు లాభముకంటెను ఇప్పటి నూతనమార్గమున ప్రజలు తమధనమును వెచ్చించిన యెడల దేశమునకు ఎక్కుడు ఉపకారమును చేసినవారగుదురు. ముందుగా ఒక్కొక్క శాస్త్రములోను మన సంస్కృతగ్రంథము లెక్కడదొరకునో కనుగొనవలయును. వానిని సంపాదించి మనసంస్కృతపండితులచేత ఆంధ్రములోనికి అనువదింపజేయవలయును. తరువాత ఆశాస్త్రము నభ్యసించిన ఒక ఆధునికపండితుని సహాయముతో దానిని పూర్తి చేయింపవలెను. మన ఉపాధ్యాయులు ఈ విషయములో తమ విధాయకత్వమును మఱచుచున్నారు. భారమంతయు వీరిమీఁదనే యున్నది. వీరు గ్రంథములను వ్రాసినయెడల వానిని అచ్చొత్తించుటకు సంఘములు బయలుదేరును జాతీయపాఠశాలాస్థాపకులు ఈ సంఘములలో చేరి యిట్టి గ్రంథములను బయలువెడలునట్లు చేసి తమతమ పాఠశాలలలో వానిని పఠనీయగ్రంథములనుగా నేర్పాటు చేసినయెడల ఇప్పటికంటె మన దేశమునకు ఎక్కుడు ఉపకారమును చేయఁగలుగుదురు.

## కీ. శే. శ్రీరాజా రామేశ్వర రాయల స్మృతి

సి. ఎమ్. శా మ రా వు గా రు

జనుల గుండెలు జల్లురనఁగను
జగతివిరహము నందుల బ్రుంగగ
తనయు లాప్తులు తల్లడిల్లఁగఁ
—దరలపోయితివె!

కనులుదెరువని కూన లిరువురు
వినుతరాజ్య మొకండు మిగిలెను
ఘనతమంబగు శోకసంభ్రము
—గడవదాటఁగను!

నీదుమృతికై వగలఁ బొగులుచు
బాదుకొనుచున్నారు గుండెలు
"ఏదిమాదిక దిక్క"టంచును
—నెల్లవేళలను!

తెలుఁగుతల్లికి పోషణంబిక
గలుఁగుటెట్టుల నీవులేనిది?
కలగెకవుల హృదబ్జకోశము
—లొక్కతీరుననె!

జగతినిండెను నీదుకీర్తియు
నగణితంబగు వితరణంబును
సుగతినీకటఁ గల్గకుండునె?
—యాత్మశాంతియును!

ధీరగుణమును దేవతాంశము
సారధర్మము నిర్విచారము
భూరిసౌఖ్యము నెల్లకాలము
—నీకునిల్చుతను!

Sriyut Gandi Venkataswamy



శ్రీయుత గండి వెంకటస్వామి

Sriyut Karry China Venkata Reddy



శ్రీయుత కర్రి చినవెంకట రెడ్డి

Late Konala China Venkata Reddy



కీ. శే. కోనాల చినవెంకట రెడ్డి

Sriyut Dommety Venkataswamy



శ్రీయుత దొమ్మేటి వెంకటస్వామి

Sriyut Sreepadam Subbarayudu



శ్రీయుత శ్రీపాదం సుబ్బారాయుడు

Dr. K. U V. Row



డాక్టరు కె. యు. వి. రావు



Sree Mahanandeeswara Cow-protection Shed, Nandyala

శ్రీ మహానంది గోరక్షణశాల - నంద్యాల

Sriyut Ummidi Ramayya Chetty



శ్రీయుత ఉమ్మిడి రామయ్య శెట్టి

Sriyut Ummidi Guruswamy Chetty



శ్రీయుత ఉమ్మిడి గురుస్వామి శెట్టి

Sriyut Nemali Subba Rao



శ్రీయుత నెమలి సుబ్బారావు

Sriyut Dronamraju Sita Rama Rao



శ్రీయుత ద్రోణంరాజు సీతారామారావు

Sriyut Nallagonda Janaki Ramayya



శ్రీయుత నల్లగొండ జానకిరామయ్య

Sriyut Jarugumilly Venkataramanayya



శ్రీయుత సి. కే. జరుగుమిల్లి వేంకటరమణయ్య

# శ్రీనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁడా?

బండారు తమ్మయ్య గారు

ప్రతిరాస్యు లగు నాంధ్రులలో శ్రీనాథమహాకవి పేరెఱుంగని వాఁ డొక్కఁడు నుండ నేరఁ డనుట యతిశయోక్తి కాఁజాలదు. ఇతని గ్రంథములు చాలవఱకు జనసామాన్యమున కందుబాటుగాని శైలిలో రచింపఁబడినను నాంధ్రదేశమునం దీతఁడు గడించిన యనన్యసామాన్యకీర్తిగౌరవములచే నీతని నామము సామాన్యజనంబులకుఁ గూడఁ బరిచితమగుటకుఁ గారణమైనది. ఇఁక నీతని గ్రంథములు చదివి యీతని కవితామృతంబును గ్రోలిన రసజ్ఞు లీతని కాంధ్రవాఙ్మయమున నెట్టి మహోన్నతస్థానంబు నొసంగుచున్నదియును నేనిచ్చట వివరింపఁబనిలేదు. ప్రభువుల ప్రేమాతిశయంబునఁ గాక యజేయం బగు నిజవిద్వత్కవితా విక్రమంబున నీతఁడు స్వయముగా గడించికొనిన "కవిసార్వభౌమ" బిరుదమే యీతని యుత్కృష్టతను వేనోళ్లఁ జాటఁగలదు. అనన్యవిషయకంబగు నీబిరుదంబును మఱియొకఁడు దాల్చుట పులిని జూచి నక్క వాతఁ బెట్టుకొనురీతియే గాని వేఱు కాదు. ఇట్టి కవిసార్వభౌముని చరిత్రముగూడ సమగ్రముగను యథార్థముగను నింతవఱకు లభింపకుండుట మన దురదృష్టమని చెప్పకతప్పదు. ఈతఁడు జననమందిన గ్రామ మట్లుండ దేశముగూడ నిదమిత్థమని తెలియుటలేదు. ఈతనిఁ గడుపారఁ గన్న గౌరవమును మనయాంధ్రదేశమునకుఁ జెందనీక కొందఱు మహనీయు లీతఁడు కర్ణాటుఁ డని కొన్ని కారణాభాసములచే వాదించుచున్నారు. పాకనాటింటివాఁడ నని శ్రీనాథుఁడు స్వయముగా వ్రాసికొనిన వ్రాఁత లుండగ, వానిని ద్రోసిపుచ్చి యాతనిపూర్వు లసలు కర్ణాటదేశీయులై యుందురనియుఁ దరువాతఁ బాకనాటికి వచ్చియుందు రనియు నత్యూహ లొనర్చుట విమర్శకుల చాతుర్యమునే గాని, సత్యగ్రహణమును బ్రకటింపఁజాలదు. శ్రీనాథుఁడు పాకనాటివాఁ డని గ్రంథాధారము లుండుటచే నాతఁ డాంధ్రదేశమునఁ బాకనాటిలో జన్మించె ననుటకు నావంతయు సందియ ముండరాదు. ఇఁక నీతఁడు జన్మించినగ్రామ మేది యీతనిగృహనామ మేమి యను ప్రశ్నలకు మూకీభావము తప్ప సరియైన ప్రత్యుత్తరమున కాధారము లింతవఱకుఁ లభింపలేదు. ఇంక నితఁ డేకులమువాఁ డన బ్రాహ్మణుఁడని నిర్వివాదముగాఁ జెప్పవచ్చును. కాని మఱలనందులో నేశాఖవాఁడను నంశము వివాదగ్రస్తముగనే యున్నది. శ్రీనాథుఁడు వైదికుఁ డని సూచించువారు కొందఱు. నియోగి యని వచించువారు కొందఱు. ఆతఁడు వైదికుఁడు గాక నియోగియే యని నాదృఢాభిప్రాయము. అందులో మఱియు లింగధారణము నొందిన ఆరాధ్యబ్రాహ్మణుఁడేమో యనియు నాయనుమానము. విశేషజ్ఞులు విషయవిమర్శన మొనర్చి సత్యనిశ్చయ మొనరించుటకై నాకుఁ దోఁచిన స్వల్పాంశములనిచ్చట వివరించుచున్నాఁడను.

శ్రీనాథుఁడు వైదికుఁ డగునేమో యని సూచించినవారు శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు. "గోపాలుని రామకవి వన్నయభట్టు వంశకవి కాఁడు" అనుశీర్షికతో రౌద్రిసంవత్సరపు టుగాదిసంచికలో వారు వ్రాసిన వ్యాసమందలి యీ క్రిందివాక్యములఁ దిలకింపుఁడు.

"అది యటులుండ భట్టశబ్దమును వాడుకొనిన శ్రీనాథుఁడు రూఢిగా నియోగి యని తలంచుటకుఁ గత మేమి? ఆతఁడు తాను నియోగి నని వ్రాసికొనెనా? లేదు. అమాత్యపదకలితుం డగుటనా? ఆపదముచే నొప్పువార లితరులు లేరా? కలరు. శ్రీనాథుఁడు నియోగియా? వైదికుఁడా? యనుశంకనుగూడ శ్రీరామమూర్తిగారు చేసికొనిరి. రామకవివలె, నియోగి యని యతఁడు వ్రాసికొనలేదు. ఇఁక నియోగియే యని యెట్లు రూఢిచేయఁగలము?"

శ్రీనాథుఁడు వైదికుఁడేమో యని శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు శంకించుటకుఁ గల ప్రబలకారణ మాతఁడు కాశీఖండములో "కర్ణాటదేశకటక పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి" అని వ్రాసిన పద్యపాదములో భట్టశబ్ద ముపయోగించుకొనుటయే యని స్పష్టమగుచున్నది. భట్టశబ్దసంకలితు లందఱు వైదికులే యని శ్రీశాస్త్రులుగారి యభిప్రాయము. అట్లైనచో నమాత్యపదసంకలితు లందఱు నియోగులే యని కూడ నంగీకరింపక, యాపదముచే నొప్పువార లితరులు లేరా యని శాస్త్రులవా రేల ప్రశ్నింపవలెనో తెలియకున్నది. భట్టశబ్దము శాస్త్రిశబ్దమువలెనే పాండిత్యసూచకమైనది. యాగాదు లొనర్చిన వైదికేతరులు తమనామముచివరను 'సోమయాజి' శబ్దమును జేర్చికొనినట్లే (ఉదాహరణము — తిక్కనసోమయాజి. ఆత్మూరి లక్ష్మినృసింహసోమయాజి మున్నగువారు) పాండిత్యసంపన్ను లగు నితరకులములవారుకూడఁ దమనామముచివరను శాస్త్రిశబ్దము చేర్చికొనుట యాచారము. కర్ణాటదేశములో వీరశైవమతావలంబకు లగు జంగమపండితు లందఱు శాస్త్రిశబ్దసంకలితులే. కాఁబట్టి భట్టశబ్దసంకలితు లందఱు వైదికులే యగుదు రని నొక్కి వక్కాణింప వీలులేదు. ఇంతకుఁ దక్కినవారివిషయ మెట్లున్నను శ్రీనాథుఁ డుపయోగించుకొనిన భట్టశబ్దముగూర్చి మాత్రమే మన మిపుడు విచారింతము.

ఈభట్టశబ్దమును శ్రీనాథుఁడు తనకావ్యములోఁ బైని చెప్పిన యొక్కతావునందుమాత్రమే వేసికొనియున్నాఁడు. అదియైనను బద్యపాదములో యతిస్థానమందు. ఈభట్టశబ్ద మితనికి వైదికుఁ డగుటచేఁ బుట్టుకతో వచ్చినది కాదు. ఉద్భటవివాదమున గౌడడిండిమభట్టకవిసార్వభౌముని నోడించి యాతనికంచుఢక్కను బగులఁగొట్టించి తన్మూలమున

శ్రీనాథుఁ డాడిండిమభట్టారకుని కవిసార్వభౌమబిరుదంబుతోఁ బాటు గైకొనినదే యీభట్టశబ్దముకూడ నై యుండనోపు. ఈవిజయానంతరము రచియించిన కాశీఖండములోనే యీశబ్ద ముపయోగింపఁబడుటకూడ నీయూహకుఁ దోడ్పడఁగలదు. మఱియు "డిండిమభట్టు" అనునది కూడ శ్రీనాథునిచే నోడింపఁబడిన యాతని ప్రత్యర్థి నామము గాక వంశపరంపరాగత మగు బిరుద మై యున్నది. "అరుణగిరినాథుఁడు" అనునది యాతని యథార్థనామము. డిండిమభట్టబిరుదములోని భట్టశబ్దముచే నాతఁడుకూడ వైదికుఁడో లేక నియోగియో రూఢిపఱుప వీలు లేదు. భట్టశబ్దము పాండిత్యసూచకముగఁ జిరకాలమునుండి యుపయోగింపఁబడుచుండుట కిది కూడ నొకదృష్టాంతము కాఁగలదు. ఇఁక శ్రీనాథుఁడు తాను నియోగి నని స్పష్టముగా వ్రాసికొనకపోయినను దన కావ్యములలోఁ దనతండ్రికిఁ దాతకు బందుగులకుఁగూడ నమాత్యశబ్దముఁ జేర్చియున్నాఁడు. శ్రీనాథుఁడు తాను నియోగి నని స్పష్టీకరింపకపోయినంతమాత్రమునఁ బ్రత్యవాయము లేదు. వైదికకవు లందఱు తాము వైదికులమని మాత్రము స్పష్టముగ వ్రాసిరా ? ఉన్నచో మన కిన్ని తిప్పలు లేకుండును గదా ? బ్రాహ్మణులలో వైదికనియోగభేద మేర్పడినతర్వాత నప్పటికాలములో వైదికబ్రాహ్మణులలో వైదికవృత్తిని విడనాడి లౌకికవృత్తిలోఁ బ్రవేశించినవారు గానరారు. అమాత్యపదసంకలితు లగు వైదికులనామము లానాఁటి వాఙ్మయములో మృగ్యములు. కావున నమాత్యపదసంకలితు లందఱు నియోగులే యని సర్వసాధారణముగా నంగీకరింపవచ్చును. ఎచ్చటనైనను మిక్కిలి యరుదుగా నొకరిద్ద రట్టివారు వైదికులలో నుండియుందు రనుకొన్నను, తాతలనాఁటినుండియు నమాత్యపదసంకలితులేయైన శ్రీనాథుఁడు నాతని వంశ్యులును నియోగులే యని యంగీకరింపకతప్పదు. శ్రీనాథునితాత కమలనాభుఁడు- తండ్రి మారయ- బంధువు బెండపూఁడి అన్నయ్య- మఱఁది దగ్గుపల్లిదుగ్గయ్య- అందఱు నమాత్యపదసంకలితులైనట్లు గ్రంథాధారము లున్నప్పుడును, వారిలోఁ గమలనాభుఁడును అన్నమంత్రియు మహాలౌకికధూర్వహు లైనట్లు ప్రబలప్రమాణము లున్నప్పుడును- శ్రీనాథుఁడు నియోగియే యని నిస్సంశయముగా నంగీకరింపవచ్చును.

ఇఁక శ్రీశాస్త్రిగారు శ్రీనాథుఁడు వైదికుఁడా నియోగియా యను శంకను గురుజాడ శ్రీరామమూర్తిగారుకూడ చేసికొనినా రనిన మాట విచారింతము. శ్రీరామమూర్తిగా రిట్టిశంకను చేసికొనినట్లు వారికవిజీవితములలో నెచ్చటను నగపడలేదు. శ్రీనాథునిచరిత్రములో "శ్రీనాథుఁడు భారద్వాజసగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, నియోగి బ్రాహ్మణుఁడు" అని యొకమాఱును, మఱొకపరి సీ. వినిపించినాఁడవు వేమభూపాలున కఖిలపురాణవిద్యాగమములు" "పాకనాఁటింటి వాఁడవు బాంధవుఁడవు......................" అను భీమఖండములోనిపద్యము నుదాహరించి పిమ్మట "ఇందుఁ బాకనాఁటింటివాఁడ వనుదాని కర్థము." అను మున్నగువాక్యములను వ్రాసి శ్రీరామమూర్తిగారు శ్రీనాథుఁడు నియోగియేయని నొక్కి వక్కాణించిరి. మఱియు నన్నయభట్టారకచరిత్రములో నన్నయ నియోగియే యను తమవాదమున కనుగుణముగ నియోగులలోఁగూడ భట్టశబ్దసంకలితులు గల రని చెప్పుటకుఁగాను శ్రీనాథుని ప్రశంసయెత్తి యీ క్రిందివాక్యములనుగూడ శ్రీరామమూర్తిగారు లిఖించిరి.

"పూర్వులలో లౌకికశబ్దవాచ్యు లగు నియోగులుకూడ భట్టశబ్దముంచి వ్యవహరించినందులకుఁ బ్రయోగము కలదు. అది యెట్లనఁగా

"గీ. ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ,
గాశికాఖండ మను మహాగ్రంథ మేనుఁ
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశకటక,
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి."

అని యున్నది గాని యీ శ్రీనాథుఁడు నియోగియేయగునా ? అని యూహింపఁగా నా గ్రంథాంతములోని యాశ్వాసాంతగద్యము పై సందేహమును నివారించును."

ఈవాక్యములలో నున్న శ్రీనాథుఁడు నియోగియే యగునా ? అను నొక్కవాక్యమునుమాత్రమే గైకొని శ్రీరామమూర్తిగారుకూడ శ్రీనాథుఁడు నియోగియా వైదికుఁడా యనుశంకను జేసికొనినా రని శ్రీబ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాసిరేమో ? సాంతముగఁ బైవాక్యముల నన్నిఁటిని జదువగ శ్రీనాథుఁ డుపయోగించుకొనిన భట్టశబ్దమునుబట్టి యాతఁడు వైదికుఁడని తలంచుటకు వీలు లేదనియు నాతఁడు తప్పక నియోగియే యని రూఢిపఱుచుటయు శ్రీరామమూర్తిగారి యుద్దేశమైనట్లు స్పష్టమగుచున్నది.

గద్యలోఁ గాకపోయినను స్థలాంతరములందు శ్రీనాథుఁడు తన తాతకుఁగూడ నమాత్యశబ్దమును జేర్చియున్నాఁడు. భీమఖండములోని యీ క్రిందిపద్యమును జూడుఁడు. ఈపద్యమును శ్రీరామమూర్తిగారు కూడ శ్రీనాథునిచరిత్రములో నుదాహరించియే యున్నారు.

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీ ♦ కాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణసంగ్రహకళా ♦ కావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతిసార్వభౌముఁ గవితా ♦ విద్యాధరుం గొల్తు నా
యనుగుం దాతఁ బ్రదాత శ్రీకమలనా ♦ భామాత్యచూడామణిన్.

కమలనాభుఁ డమాత్యచూడామణి యనియును, కాల్పట్టణమునకధీశ్వరుఁ డనియును, వినమత్కాకతిసార్వభౌముఁ డనియును, దీనివలనఁ దెలియుచున్నది. నిక్కమాలోచింపగ శ్రీనాథునితండ్రికన్నఁ దాతయే మహాలౌకికధురంధరుఁడని తోఁచుచున్నది. వినమచ్ఛబ్దార్థమును గమనింపక శ్రీవీరేశలింగముపంతులుగా రీకమలనాభుఁడు కాల్పట్టణ మను గ్రామమునకుఁ గరణమై యుండునని వ్రాసిరి. కాకతిచక్రవర్తిచే నమస్కరింపఁబడినవాఁడు సామాన్యగ్రామకరణమైయుండు ననుట పరిహాసాస్పదము. కమలనాభుఁడు తప్పక మహామాత్యశిఖామణియో, దండనాథుఁడో యై యుండును. శ్రీనాథుఁ డాతనియెడ నుపయోగించిన "అమాత్యచూడామణి" శబ్దము నిరర్థకము గాక సార్థక మయినదే. పూర్వోక్తకారణములచే శ్రీనాథుఁడు తప్పక నియోగిబ్రాహ్మణుఁడే యని పాఠకులు నిర్వివాదముగా నంగీకరింతురని తలంచెదను. బ్రహ్మయ్య

శాస్త్రిగారికిఁ గూడ శ్రీనాథుఁడు నియోగియే యనెడి గట్టి యనుమానము లేకపోలేదు. కాని శ్రీనాథుఁడు నియోగియే యనువిషయము ననుమానముతోఁ గాక ప్రమాణముతో నంగీకరింపవచ్చునని శ్రీశాస్త్రులువారికిని లోకమునకుఁగూడ విన్నవించి యింక నాతఁ డారాధ్యబ్రాహ్మణుఁ డగునా యను సంశయమునుగూర్చి విచారించెదను.

శ్రీనాథుఁడు శివభక్తుఁ డని కవిచరిత్రకారులేగాక తదితరులు గూడ నంగీకరించియున్నారు. ఈతఁడు రచించిన గ్రంథములలో హారవిలాసము భీమఖండము కాశీఖండము శివరాత్రిమాహాత్మ్యము అనునివి పరమశివభక్తిప్రబోధకములై యున్నవి.అందునను నీతఁడు వర్ణించిన శైవాచారము సామాన్యశైవవిషయికము గాక వీరశైవమతప్రతిపాదితమని విమర్శకులకు గోచరింపక పోదు. దశవిధశైవములలో నిష్టలింగధారణము నంగీకరించిన శైవము నే వీరశైవ మని వ్యవహరింతురు. అష్టావరణసిద్ధి లేక భస్మరుద్రాక్షధారణము మాత్రమే స్వీకరించి పార్థివలింగపూజ నొనర్చు శైవులు వీరశైవులు కాఁజాలరు. బసవేశ్వర పండితారాధ్య సోమనాథాదులచే నుద్ధరింపఁబడిన వీరశైవము శ్రీనాథుని కాలము నాఁటికి విశేషవ్యాప్తిలో నున్నది. శ్రీనాథునికృతిపతులలో అవచి తిప్పయశెట్టి (హారవిలాసకృతిపతి) చిఱుతొండనివంశీయుఁ డని వర్ణింపఁబడుటచే నాతఁడు లింగధారియగు వైశ్యుఁడని స్పష్ట మగుచున్నది. మమ్మయ శాంతయ్య (శివరాత్రిమాహాత్మ్యకృతిపతి) వీరశైవుఁ డగు జంగముఁడు. ఇఁకను నైషధభీమఖండకాశీఖండములకృతిపతు లగు మామిడిసింగయ్య బెండపూడి అన్నయ్య వీరభద్రరెడ్డియుఁ గూడ - శ్రీనాథుఁడు వారి శైవాచారముఁగూర్చి చేయువర్ణనలనుబట్టి చూడ-సామాన్యశైవులుగాక వీరశైవులేమోయని యనుమానము తోఁచుచుండును. గీ. పాకనాటింటి వాఁడవు బాంధవుఁడవు" అను భీమఖండములోని పద్యపాదమునుబట్టి బెండపూడిఅన్నామాత్యుఁడు శ్రీనాథునకు బంధు వనికూడ స్పష్టమగుచున్నది. బెండపూడివారిలో నారాధ్యబ్రాహ్మణు లిప్పటికి నున్నారు. కావున నన్నామాత్యుఁడును తద్బాంధవుఁ డయిన మనశ్రీనాథుఁడు నారాధ్యబ్రాహ్మణులే కాఁదగును. ఆరాధ్యబ్రాహ్మణుఁ డగు మల్లికార్జునపండితారాధ్యుని చరిత్రమును వీరశైవుఁడగు పాలకురికి సోమనాథుఁడు ద్విపదకావ్యముగా రచియించియున్నాఁడు. శ్రీనాథుఁడు దానిని తనబాల్యములోనే పద్యకావ్యముగా రచించుట చూడ నాతని వీరశైవమతాభినివేశము వ్యక్తమై యాతనివీరశైవము స్వావలంబితము గాక వంశానుగతమేమో యనికూడఁ దోఁపకపోదు. మఱియు శ్రీనాథునిది భారద్వాజగోత్రమనియును ఆపస్తంబసూత్రమనియును

శా. భారద్వాజపవిత్రగోత్రుని శుభా♦పస్తంబసత్సూత్రు వి
ద్యారాజీవభవుండు మారయకుఁ బు♦ణ్యాచారభీమాంబకున్
గారామైనతనూజు.........

అను నైషధమునందలి పద్యమునుబట్టి విశదమగుచున్నది. నైషధకృతిపతియగు సింగామాత్యునిదికూడ భారద్వాజగోత్రమే. కృతిపతికిని దనకును గూడ గోత్రకర్తయైన భారద్వాజమహర్షిని శ్రీనాథుఁడు నైషధములో నిట్లు వర్ణించెను.

శా. తోరంబైన తపోవిశేషమున స♦ద్యోజాతవక్త్రంబునన్
గౌరీవల్లభుచేత దీక్షగొనియెన్ ♦ సప్తర్షులం దొక్కఁడై
తారావీథి నలంకరించెఁ గొనియెన్ ♦ ద్రయ్యర్థసంఘాతమున్
భారద్వాజమహామునీంద్రుఁ డగడే ♦ భక్తిం బ్రశంసింపఁగన్.

(ఆ. 1. ప. 19)

ఇం దుదాహృత మయిన దీక్ష వీరశైవదీక్షయే యని నాయభిప్రాయము.

"శ్లో. దీయతే లింగసంబంధః క్షీయతేచ మలత్రయమ్.
దీయతే క్షీయతే యస్మాత్ తస్మా ద్దీక్షేతి కథ్యతే."

అని పారమేశ్వరాగమలింగపురాణాదులందు దీక్షాశబ్దము నిర్వచింపఁ బడినది. శ్రీనాథుఁడు తాను వీరశైవుఁడుగనుకనే గోత్రకర్త వీరశైవదీక్షను ఇట్లభివర్ణించినాఁ డని తోఁచుచున్నది. భారద్వాజుఁ డొక్కరుఁడేగాక పూర్వమహర్షులందఱు లింగధారణము నంది వీరశైవదీక్షను స్వీకరించినట్లు ప్రమాణము లున్నవి. సనాతనం బగు వీరశైవమతము కాలవశమున క్షీణించుటచేతనే దాని నుద్ధరించుటకు బసవేశ్వరాదు లవతరించిరి. ఈవిషయ మిట నప్రస్తుత మగుటచే విస్తరింపను. మఱియును.

సీ. స్వర్గస్థుఁ డయ్యె వి♦స్సనమంత్రి
మఱి హేమపాత్రాన్న మెవ్వని♦పంక్తిఁ గలదు.

అను పద్యపాదము శ్రీనాథకృత మని యంగీకరించినచో నదికూడ శ్రీనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁ డను నూహకే తోడ్పడఁగలదు. ప్రసాదనియమము గల వీరశైవులకుఁ బాత్రభోజనమే విధ్యుక్త మగును కాని పత్రభోజనము సర్వథా దూష్యము.

శ్రీయుతులు అక్కిరాజు ఉమాకాంతము పంతులుగారు పల్నాటి వీరచరిత్రపీఠికలో "శ్రీనాథుఁ డాచారమునకు వీరశైవుఁడైనను-శివుఁడని విష్ణువని పోరాడెడు బుద్ధిమంతులవలెఁ గాక-న్యాయాదిశాస్త్రముల నభ్యసించి జ్ఞానదృష్టి గలిగిన వేదాంతిగాఁ గన్పట్టుచున్నాఁడు. హారవిలాసములోని.

గీ. ఆవగింజత బూదిపై ♦ నలఁదెనేని
వెలఁది గుమ్మడికాయంత♦ వెట్టి పుట్టు

అను పద్యపాదములవలనను మఱికొన్ని పద్యములవలనను భస్మధారణాదిబాహ్యవేషములయం దితని కెక్కువ నమ్మకము లేనట్లు కనఁబడుచున్నది." అని కొన్ని విపరీతవాక్యములను వ్రాసి యాతఁ డద్వైతి యని చూపనెంచిరి. పాపము. వీరిదృష్టిలో బసవేశ్వరుఁడు- పండితారాధ్యుఁడు-పాల్కురికిసోమనాథుఁడు మున్నగు వీరశైవులును, రామానుజుఁడు మొదలగు వీరవైష్ణవులును జ్ఞానదృష్టిలేని మూర్ఖశిరోమణులు కాఁబోలును! న్యాయాదిశాస్త్రములను వారుమాత్ర మభ్యసింపలేదా? భస్మధారణాదులు పిచ్చివేషము లని శ్రీపంతులుగారి యభిప్రాయమై యుండును కాఁబోలు! ఏమివీరి యద్వైతవిజ్ఞానము!! అద్వైతమతాచార్యుఁడగు శంకరభగవత్పాదులు భస్మరుద్రాక్షధారి కాఁడా? ఉమాకాంతముగారు

ఈ దాహరించిన హరవిలాసములోని వైపద్యపాదములు మాయాతపస్వినీ వేషముతో నున్న పార్వతి సిరియాలకుమారునిఁ జంపి జంగమవేషధారియై వచ్చిన శివునకు నారగింపఁబెట్టఁ దలంచి చిఱుతొండనంబియొక్క భార్య తిరువెంగనాంచితో నట్టియుద్యమమునుండి భర్తను మరలింపు మని యుద్బోధించిన పట్టులోనివి. ఇది సంపూర్ణపద్యము.

గీ. ఆవగింజంత బూది మై ♦ నలఁదికొనిన
వెలఁది గుమ్మడికాయంత ♦ వెట్టిపుట్టు
గటకటా! యెట్లు తనబుద్ధి ♦ కాటఁ గలియ
నిసువుఁ జంపంగఁ దలఁ ♦ చెనో నీమగండు ఆ 2 ప 99

కవులు రసోచితములగు భావములను వాక్యములను సందర్భానుగుణముగఁ గూర్చి పాత్రములచేఁ బల్కించుచుందురు. ఆవాక్యములు సందర్భానుసారములగు నేకదేశోక్తులేగాని సిద్ధాంతములు కావు. అట్టిభావములచేతను వాక్యములవలనను వారి మతములను గుణములనునిర్ణయించుట హాస్యాస్పదము. పాల్కురికిసోమనాథుఁడు వీరశైవుఁ డని యందఱు నిర్వివాదముగా నంగీకరింతురు గదా! ఆతఁడు బసవపురాణములో నొక సందర్భములో బిజ్జలునిచే బసవేశ్వరు నిట్లు గేలిచేయించినాఁడు.

ద్వి. ఇసుమంత బూదిద ♦ నొసలఁబూసినను
మసలక కొండంత ♦ మరులెత్తె ననుట
తెల్లమనుచు రా జు ♦ మెల్లన నగుచుఁ
జెల్లవో బసవయ్య! ♦ శివమరుల్ గొంటె.

దీనినిబట్టి సోమనాథుఁడు వీరశైవుఁడు కాఁడనియు భస్మధారణాదులందు నమ్మకము లేనివాఁ డనియు నెట్టి వెంగలియైనఁ దలంచునా? కావున శ్రీనాథుఁ డాతని గ్రంథములఁబట్టియు నాచారములఁ బట్టియును వీరశైవుఁడుగనే గాన్పించుచుండినను నట్టివాఁడు కాఁడని యిట్టి ప్రమాణాభాసములతో నిరూపింప నెంచుట మహాసాహసము గాక మానదు. ఈవిషయము నింతతో విరమింప నెంచుచు శ్రీనాథగురుపాదుల దివ్యమూర్తిని మనమున ధ్యానించి యాతనికి నేనర్పించికొనిన గురుదక్షిణానవరత్నములలోని యీక్రిందిపద్యము నిచ్చట నుదాహరించుట యప్రస్తుతము కాఁజాలదు.

మ. జితసర్వేంద్రియవర్గమై శుభకర శ్రీభూతి రుద్రాక్ష భూ
షితమై నిత్యషడక్షరీమను జప స్థేయ స్థలీనాత్మభా
సితమౌ నీశివమూర్తి నెప్పుడు మనోక్షేత్రంబున న్నిల్పి స
న్మతి సేవించెడువాఁడె మోక్షరమణీనాథుండు ముమ్మాటికిన్.

# రాజభక్తి

## గు. వేం. సుబ్బారావు గారు

తన రాజ్య మఖిలభూ।తల విశాల మగు మాత్రమున రారాజు రా।రాజు కాఁడు
తన దోః ప్రతాపాగ్ని। యనివార్యమైన మాత్రమున రారాజు రా।రాజు కాఁడు
తన వాహినీసము।ద్ర మపారమైన మాత్రమున రారాజు రా।రాజు కాఁడు
తనయాజ్ఞ ముక్తియం।త్రము రీతి సాగు మాత్రమున రారాజు రా।రాజు కాఁడు
గీ. రాజు కావలె నవసుధా।రాజ్యగరిమ! రాజు కావలె విబుధాను।రాగగతుల
రాజు కావలె సత్యవి।క్రమనిరూఢి! రాజు రాజౌనె రాజ్య మే।ర్పడిన యంత.

సీ. నరమాంసభోక్త యౌ। ధరణీశుపై భక్తి, భక్తి కాదు విషాన్న।భుక్తి గాని
సాధువిద్రోహి యౌ। జనపాలుపై భక్తి, భక్తి కాదు వినాశ।యుక్తి గాని
దర్పాంధుఁడైన భూ।తలనాథుపై భక్తి, భక్తి కా దుత్పాత।శక్తి గాని
ప్రజలకుఁగాని భూ।వల్లభుపై భక్తి, భక్తి కా దధమాస।సక్తి గాని
గీ. ప్రజల దుఃఖంబె తనదిగాఁ। బరిగణించి, ధర్మదేవత నాల్గుపా।దముల నడువ
మించు వేడుకభూమి పా।లించుచుండు, రాజుఁ గొల్చుటె నిక్కంపు। రాజభక్తి.

# సంగీతము

వెదురుమూడి రామలక్ష్మీ నరసింహారావు పంతులుగారు బి. ఏ.

సర్వవిచిత్రమయంబగు ఈ ప్రపంచమందున మానవుఁడు జ్ఞాన రత్నమహిమచే నాధిక్యమును పొందుచున్నాఁడు. అట్టి జ్ఞానమునకు మనోనిశ్చలత ముఖ్యాంశము. కాని మన యనుభవమునం దట్టిది సర్వదా యెల్లరయందునను కానము. ఒకఁడు సర్వధనసంపద్విధానుం డయ్యు దేహదార్ఢ్యము లేమి మనశ్చంచలుఁ డగును. మఱియొకఁడు దేహారోగ్య సంపన్నుఁ డయ్యు ధనహీనతచేఁ గుందుచుండు. ఒకరి మరణమునకై మఱియొకరు చింతింతురు. ఇట్టి సర్వదుఃఖస్థానంబు నాఁ బఱఁగు నబ్ధిమేఖల నట్టి దుఃఖములనుండి ప్రజల విముక్తులఁ జేసి మనంబుల స్థాయియందు నుంచుటకై భగవన్ముఖమునుండి సామవేద రూపమున వెలువడిన నానాస్వరసమ్మేళనాజనిత ప్రమదమే సంగీతమని నాయభిప్రాయము. అట్టినాదము మనహృదయమునుండి జనించును. నాదమునుండి యక్షరములును, అక్షరమువలనఁ బదములును, పదముల వలన లోకవ్యవహారమును కలుఁగుచున్నది. కావున జగమంతయు సంగీతంబున బుట్టి వృద్ధిఁ జెంది యందే లీన మగుచున్న దని పెద్దల యభిప్రాయము.

సంగీతమును తఱచిన కొలఁదిని, అం దంతర్భూతములై యున్న దివ్యశక్తులు వెలువడి, జ్ఞానబీజాభివృద్ధికి సాధనము లగుటయేగాక ఇహపరసౌఖ్యములఁ గూడ నిచ్చుచున్నవి. స్వానుభవముల ననుసరించి పిపీలికాదిబ్రహ్మపర్యంతము సంతోషమునిడునది కేవల మొక్క సంగీతమే యనదగును. శంకరాదు లగు మహనీయులు సంగీతరసజ్ఞశిరోమణులు గదా! ఇట్టిసంగీతసుధారసమును గ్రోలని మానవుఁడు గార్దభరాజుకం టెను ఘనుఁడే. స్వరప్రధానముగఁ గలఁది సంగీతము. గీతవాద్యనృత్యంబులుఁ జేరి సంగీత మగుచున్నది. ఈ సంగీతమును తందానపదముల వలె స్వేచ్ఛానుసారముగఁ బాడఁ గూడదు. దాన నపస్వరములును అపార్థములును యుత్పన్నము లగును. సర్వవేదములును స్వరమునందున నియామకముల నెట్లు కలిఁగియున్నవో యట్లే సంగీతమును స్వరనియామకమును కలిఁగియున్నది.

ఇఁక సంగీతాంగ మనఁ బఱఁగునట్టి స్వర మెందు జన్మించెనని తలంచినచోఁ బరబ్రహ్మస్వరూపమగు "ఓం" కారమందున జనించినటులఁ దెలుచున్నది. ఇందు—ఓం=అ+ఉ+మ, అను మూఁడక్షరములు గలవు. ఇందు నకారము ఋగ్వేదము. మకారము సామవేదము. అకారము నాదము. ఉకారము బిందువు. మకారము కళ. అని పెద్దలందురు. ఇట్లు "ఓం" కారమను రూపమునను న్న ప్రణవమే సంగీతము. ఇందులకుఁ దార్కాణముగా:—

శ్లో. "ఓంకారప్రభవో వేదాః
ఓంకారప్రభవ స్స్వరాః
ఓంకారప్రభవం సర్వం
త్రైలోక్యం సచరాచరం

అని యున్నది. ఇట్టి ప్రణవ ముజ్జృంభణమునందు నధ్యాత్మికమునందు అష్టాక్షరివలె - స-రి-గ-మ-ప-ద-ని-యను సప్తాక్షరితో జనించి, షడ్జము ఋషభ గాంధార మధ్యమ పంచమ దైవత నిషాధము లను శృతిస్థాయుల ననుసరించి రాగోత్పత్తి యయ్యెను. అట్టి రాగములు వేనవేలు గలవు. కాని వానియందు శంకరాభరణము ధన్యాసి కళ్యాణి భూపాళి వసంత నాటీ కాంభోజి ఘూర్జరి భైరవి బంగాళి మేఘరంజని దేవగాంధారి కురంజి సింధు సావేరి ఆరభి మంగళకౌశికి తోడి కేదారగౌళ హిందూస్థాని మోహాన మన్నగు ముప్పదిరెండురాగములు ముఖ్యములు.

ఈ రాగములను పాడుటకును సమయములు కలవు. ఆయాసమయోచితరాగములు బాగుగ రాణించును. ఇందులకుఁ దార్కాణముగా వసంతరాగ మపరదినమందునను-మేఘరంజని మధ్యాహ్నమునను-భూపాల ప్రాతఃకాలమందునను-పాడవలెనని నుడువుదురు. అనఁగా నాయారాగములను నిర్దిష్టేతరములగు సమయములఁ బాడరాదని కాదు. ఒక విధముగ నైసర్గిక సంతోషజనిత రాగ మగుటచే మన మానందముగనున్న యెల్ల సమయములను పాడనగును. కాని యందునను నాయానియమిత కాలములు శ్రేష్ఠము లని యెఱుంగవలయును. ఒకఁడు సారంగరాగమును పాడి సారంగముల స్వాధీనము జేసికొనియె ననియు, ఇంకనొకరు మేఘరంజిని గానముఁజేసి మేఘములఁ గ్రమ్మించి వర్షమును కురియించె ననియును విందుము.

అభినవ నాగరకురాలగు "వాట్సుహ్యూగ్సు" దొరసాని స్వరసంగమమువలన నంతరాళమునఁ గలుఁగు మ్రోతచే నద్భుతరూపము లుప్పతిల్లునని సిద్ధాంతీకరించినది. ఈ వనితామణి "ఈడోఫోన్" అను యంత్రమువలనఁ దానుఁ బాడిన గానస్వరజనిత నానాస్వరూపములను ప్రపంచమునఁ దిలకింపఁ జేసినది. దీని ననుసరించి స్వరవిశేషము రూపవిశేషోత్పత్తికిఁ గారణమని తేలుచున్నది. వెండియు నేత్రగోచరములు గాని వస్తువులకు రూపములను కల్పించి, ప్రత్యక్షముఁ జేసికొనుశక్తి సంగీతమునకుఁ గలదని ఋజు వగుచున్నది. అట్టి సమయమున మంత్రశక్తిచే మనయాఢ్యులును, నృత్తగీత వాద్యములచేఁ గొందఱు భక్తులును, భగవద్రూపమును ప్రత్యక్షముఁ జేసికొని రనుటలో నతిశయోక్తి యేమియును లేదు. ఈ సంకల్పశక్తి యెట్టి దుర్ఘటముల నైనను రూపింపఁ గలదని సూరిజనాభిప్రాయము. సంగీతవేదులగు పర్వత నారద వాయుపుత్రాదులు దమతమ గానచమత్కృతులచే శిలలఁ గరిగించినట్లును, నీటిని శిలలుగా మార్చినట్లును వినియున్నాము. ఇందు మన వారి కంతగా

నమ్మక ముండకఁ బోవగును. కాని కొలఁది దినములకుఁ బూర్వమున నమెరికాయందున నొక చిన్నవంతెనపై నొక గాయకుఁ డొనరించిన కజ్జమునుగూర్చి వార్తాపత్రికలలో ప్రకటించినవార్తను పఠించినవారలు దీని నతిశయోక్తిగాఁ బరిగణించరు. ఇట్లే యనేకములు మనశాస్త్రము లందునఁ జెప్పఁబడి, మనవారలు నమ్మని వెన్నో దినదినమును ఇతరుల హస్తములందున బుజువునకు వచ్చుచున్నవి. కావున నో సహోదరులారా! మనశాస్త్రము లందునఁ గన్పించిన వానినెల్ల నతిశయోక్తులగాఁ బరిగణించి వానియందు నమ్మక ముంచకపోవుట కేవలము బుద్ధిలేమియేయని నాతలంపు. కొంచెమంత నిదానము-శాంతము-దూరదృష్టి యవసరములు. మనయందున మనకే నమ్మకములు లేకపోవుట మన క్షీణస్థితికి ముఖ్యమగు కారణము.

వీణ తంబుర మృదంగము పిడేలు జలతరంగిణి పియానా పిల్లనగ్రోవి వేణునాదము మున్నగునవి సంగీతసహాయోపకరణము లని యెల్లరకును విశదమే.

సంగీతము రాగరూపమై తాళము ననుసరించి యుండును. ఇట్టి తాళము ధ్రువము - మధ్యము - రూపకము - జంపె - త్రిపుట - అట- ఏకతాళము అని యేడువిధములు. "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" యను పరమానందదాయకం బగు ఇట్టి గానము నృత్యవిద్యచేఁ బరిపూర్ణకళాప్రజ్వలం బగుచున్నది.

నృత్యమనఁగాఁ బాత్రానుగుణ్యముగా స్థూలసూక్ష్మాభినయములవలన నాయా పద్యగద్యాదులందలి రసములను ముఖబింబమునఁ బ్రకటించుటయే! ఇందు సూక్ష్మాభినయము వేశ్యలకును, స్థూలాభినయము నటులకును యొప్పును. నృత్యశాస్త్రము భరతాదిమహామునులచేఁ బ్రచురింపఁబడి రానురాను లెక్కకు మించిన మార్పులను చెందినది. ఈ నృత్యములనుండియే యభినవనాటకములును వేశ్యానాట్యములును యుత్పత్తిల్లినవి. నిజమునకు నీ నాట్యములు జగమున కెంతో యుపకారకములు. అట్టినాట్యములు మనవారల గొప్పకార్యములను మనమునందున ముద్రితములజేసి నాగరకతకుఁ గొనివచ్చి, మేధాశక్తిని దేశభక్తిని దైవభక్తిని సత్యదయాశౌచాది సుగుణములను వృద్ధిలోనికిఁ గొనివచ్చి, సన్మార్గులను జేయును. కాని ప్రకృతము నటులు వేశ్యలు కేవలము మత్తులు కుక్షింభరులు- నగుటచే వారి యభినయ గానాదులును అందులకు దగినట్లుగానే యున్నవి.

నాటకశాలలలో నటుఁడుగాని, వివాహసభయందునఁ వేశ్యగాని ప్రవేశింపగనే—

రావే! నా సుందరాంగి! నవయౌవన కుచకచ శోభిత

అని మొదలిడుట యాచారమైనది. ఇది ఇంతతో ముగిసినను కొంత మేలుగనే యుండును. కాని శ్రోతలుగ వచ్చిన సభవారిలో నుండి ఒకఁడు హిందూస్థానిజావళీ పాడు మనియు, మఱియొకఁడు మోహినీ రాగములో శృంగారజావళీ పాడవలయు ననియును, నింకొకఁడు, "తాళలేనె చెలియా" యను దరువును పాడు మనియు, నెవరికి తోచిన విధమున వారు పలుకుదురు. ఆది సంగీత మెందులకై పుట్టినదో యాదారి పెడదారిని దైనది. ఇప్పుగిది నభినవు లర్జునని శాపపాత్రుఁగాఁ జేసి ప్రసిద్ధికెక్కినట్టియు, శంకరునిచే సంస్కృతాక్షరములుగఁ బ్రచురింపఁబడి సర్వభాషామతల్లియై పరఁగు సంగీతయోషను కురూపిఁగాఁ జేసి, దర్శకులకు దుర్నీతులను బోధించుచున్నారు.

శ్లో. నాహం వసామి వైకుంఠే
న యోగిహృదయార్ణవే
మద్భక్తా యత్ర గాయంతి
తత్ర తిష్ఠామి నారద!

అని శ్రీ కృష్ణ భగవానులు జెప్పియున్నారు. కనుక మనమెల్లరమును నభినయమును వేశ్యలపాలిఁటను దుష్టనటులపాలిఁటను బడియున్న గాన విద్యను వారలనుండి తొలఁగించి - సన్మార్గమునకుఁ గొనివచ్చి- నాటకశాలాదులందు తగిన మార్పులనుఁ గొనివచ్చి- త్రిమూర్తులకు సహిత మానందనిలయమై యొప్పిన సంగీతహర్షాబ్ధిని విలీనంబగుదుము గాక.

పూర్వపునాటకాగారములకును ప్రకృతపు నాటకశాలలకును వ్యత్యాస మెంతయో గలదు. పూర్వరంగశృంగారములును, నటుల అభినయములును ప్రకృతమున కంటె మేటులని చెప్పకయును డిప్పకొనకయును తప్పదు పూర్వకాలమందు నాటకమున దర్శకులకు లంకాదహనమును చూపించవలయు ననిన శక్యము కాకుండెడిది. ఇప్పుడన్నను బుద్ధిమంతులచేఁ గనుఁగొనఁబడిన విద్యుచ్ఛక్తివలనఁ జూపనగును. ఇట్లే ప్రకృతనాటకములందునను నాటకశాలలందునను లెక్కకుమించి- బుద్ధికుశలతఁ దెల్పు మార్పులు గొనిరాఁబడినవి. ఇట్టివానిని కనుఁగొని- తొల్లింటివాని నభివృద్ధికిఁ గొనివచ్చిన వారలకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

పవిత్రమైన మన భరతవిద్య తొల్లి నారద గౌతమ కాశ్యప భరతోపాధ్యాయ గాలవ కాత్యాయన ఆంజనేయ జైమిన్యాదులచే వృద్ధికిఁ గొనిరాఁబడి, దేవదాసీలనామమునఁ బరఁగు మత్తకాసినులచే భగవత్పూజాసమయములందున నాట్యములఁ జేసెడివారు. ఆవిధమున నిప్పుడును దేవాలయాదుల వేశ్యలఁబెట్టి నాట్యములఁ జేయించుచున్నారు. మనవారుఁ బూర్వమున నాచరణ యందుంచి రని ఇప్పుడును ఈపద్ధతినాచరణయందుంతురే కాని,ఆదేవదాసీలకును ప్రకృతవేశ్యలకును కలభేదములఁ గనరైరి. వీరుఁ దమవిన్నాణంపుఁ బలుకులచే ననేకుల మోసముఁజేయు ధూర్తనారులు. కావునఁ బ్రకృతమున మన దేవాలయాదుల నిట్టి వేశ్యలచే నభినయాదులఁ జేయింపక హరికథా శ్రవణాదులఁ గావించినచో చాలబాగుండు నని మాయభిప్రాయము.

# రసము - రస ప్రయోజనము

కామఋషి - మృత్యుంజయ వర్మ గారు

లోహములలో రసముకూడ లోహమే. కాని ద్రవరూపమైన లోహము. ఇది స్వాభావికముగా ద్రవరూపమై యున్నను అరణ్యసంబంధములగు నోషధుల యొక్క పాకమువలన స్వరూపబద్ధతను పొంది స్వర్ణాది సమస్తధాతువులను తనలో జీర్ణింపజేసికొనుసామర్థ్యము గలదియై సర్వరోగములను హరింపఁజేసి రసాయన మగుచున్నది. రసాయనశబ్దమునకు ఇప్పటివారు చెప్పెడి Tonie- బలవర్ధకము అను నర్థముచాలదు.

"శ్లో. యజ్జరావ్యాధినాశకం తద్రసాయనం"

ముదిమిని వ్యాధులను బోగొట్టి దీర్ఘాయువును గలిగించు మహౌషధము ఏదిగలదో అది రసాయన మనఁబడును. వైద్యవాఙ్మయమునందు రసతంత్రవేత్తలగు రసాచార్యులెల్లరును రససంస్కారములను రసాయనవిధులను ప్రకటించిరి. రసవాదవిజ్ఞానమున రసముచే స్వర్ణధాతుకరణమునకు ప్రయత్నించిరి. వాదజ్ఞులకు సర్వసంస్కారములు చేసిచూడవలసి యుండుటచే- వాదమునందు భ్రష్టులైనను వైద్యమునందు శ్రేష్ఠు- లగుచున్నారు. రససంస్కారములచే నాగవంగ దోషములు మాలిన్యదోషము చాంచల్యదోషము విషదోషము గిరిదోషము యగ్నిదోషము కంచుకదోషము అను నీ యేడును నశించి రసము నిర్మలముగా నుండును. స్వేదన మర్దన మూర్ఛనోత్థాపన పాతనబోధననియమనదీపనము లను నెనిమిదిసంస్కారములును, అనువాసన, మగ్నాదిగ్రాసము, చారణ జారణ, రంజనద్రావణ, మారణవేధనాదిసంస్కారములం జేసి రససిద్ధిని పొందవలయును. అందు జారణసంస్కారమువలన రసాయనవిధు లేర్పడుచున్నవి. రంజనసంస్కారమువలన సిందూరాదు లేర్పడుచున్నవి. ఈరెండింటి సౌకర్యమువలన స్వర్ణాదిధాతువులు జీర్ణములై పూర్ణచంద్రోదయ సువర్ణపుష్పరసాయనాద్యనేకౌషధము లుత్పన్నము లగుచున్నవి. రసము ననుసరించి వ్యాపించియున్న స్వర్ణాదిధాతువులు జీర్ణములుగాక రసమువలన గొప్పఫలమును బొందజాలరనియు, అట్టి కోరిక క్షేత్రము మంచిదైనను బీజనివృత్తిలేనిఫలమువలె-వ్యర్థ- మగునని యు రామచంద్రగుహులు తమ రసేంద్రచింతామణియం దుదాహరించినారు. అష్టాదశసంస్కారసిద్ధమైన రసము గుణాధిక్యముకొఱకు గంధకజారణము చెప్పఁబడినది. రోగహరత్వసిద్ధికొఱకు రసమునకు సంస్కారవిధిప్రకార మాఱురెట్లు గంధకముచే జారణము చెప్పబడినది. అభ్రకాది సర్వధాతువులకు విధిప్రకారము సత్వపాతనముచేసికొని యాయాసత్వములయందు రసము జీర్ణించుటవలన రసాయనద్రవ్య మగుచున్నది. అట్లే సువర్ణమునందు జీర్ణించినరసము సహస్రగుణాధిక్యము గలది యగుచున్నది. ఏరసము గాఢాగ్నియందు చలింపదో అట్టిపాదరసము స్వర్ణరజతములను జేయుటకు సమర్థమగును. అట్టి రససేవవలన జరామరణహరణరూపకమైన కాయసిద్ధిని గలిగించు నని రససిద్ధుల యభిప్రాయము.

రసమును గంధకమును సమాంశములుగ గ్రహించి గంధకము మాత్రము జీర్ణించువఱకు పచనముచేసిన రసము నిల్చియుండును. అట్టి గంధకజీర్ణితరసము సర్వరోగములను శాంతింపజేయును. ఇట్లే రెట్టింపుగ గంధకమునందు జీర్ణింపఁబడిన రసము క్షయరోగమును శాంతింపజేయును. మూడురెట్లు గంధకముచే జీర్ణింపబడినరసము కామవృద్ధి నిచ్చును. నాలుగురెట్లు గంధకముచేఁ జీర్ణింపబడినరసము తేజోధాతువులను వృద్ధిచేయును. మేధాశక్తిని నభివృద్ధిచేయును. ఐదురెట్లు గంధకముచే జీర్ణింపఁబడినరసము వలీపలితములను నశింపఁజేసి యౌవనమును నిల్పును. ఆఱురెట్లు గంధకముచే జీర్ణింపఁబడినరసము మృత్యువును జయించును.

ఇట్లు గంధకపచనమువలన అంతర్ధూమవ్యాప్తి బహిర్ధూమవ్యాప్తి నెఱుంగవలయును. ఇక్కడ ధూమశబ్దము పొగయను నర్థమున వర్తింపదు. ఆవిరి అని అర్థము. ఆ యావిరియందలి యణుమార్గమున రసము పైకి వచ్చుచున్నది. స్వర్ణపిష్టాదులయందుగూడ నిట్లే గ్రహింపవలయును. ఊర్ధ్వభాగమునందు జలము నిలుచునట్లును మధ్యభాగమునందు రసగంధకజ్జలి యుండునట్లును క్రిందిభాగమున పాకాగ్ని తగులునట్లును నొకయంత్రమును సిద్ధముచేసి యందు పాకముచేయవలయును. రంజనసంస్కారమునందు గంధకజారణముకొఱకు వాలుకాయంత్రము ప్రసిద్ధమై యున్నది. స్వర్ణాదిధాతువులకు ద్రావణసంస్కారము సత్వపాతనము చేసి రససంస్కారప్రకారము గ్రాసవిధి నెఱింగి కజ్జలిచేసి నియమితగంధకముచే జీర్ణింపజేయుటచే నొక్కొక్క రసాయన మేర్పడుచున్నది. ఇట్లే స్వర్ణపుష్పరసాయనము పూర్ణచంద్రోదయము మకరధ్వజరసము మొదలగు ననేక రసరసాయనములు కల్పింపఁబడినవి. రసభస్మవిధులు కేవలము లవణక్షారసంసర్గమువలన సిద్ధమగుచున్నవి. ఇందులకు ఊర్ధ్వపాతనయంత్రము ప్రసిద్ధమై యున్నది. ఇట్టి భస్మప్రక్రియలయందు గంధకసంపర్కము లేదు. భస్మవిధానములలో రసప్రకాశసుధాకర మను రసశాస్త్రమున యశోధరుఁ డను రసతంత్రవేత్త వర్ణచతుష్టయవిభాగముచేసి అందు రసకర్పూర, రసభస్మాదులు శ్వేతవర్ణభస్మములుగాను రససిందూరము రక్తవర్ణభస్మములుగాను పీతవర్ణభస్మములు కృష్ణవర్ణభస్మములు వర్ణించెను. ఇందులో రససిందూరప్రక్రియలు ప్రాయికముగా రసకోవిదులు గంధకభాగభేదముల ననుసరించి నామభేదములు జారణసంస్కారబలము ననుసరించి గుణప్రాబల్యమువర్ణించిరి. అందుసమసిందూరముకంటె ద్విపాదసిందూరము ద్విపాదముకంటె త్రిపాదసిందూరము, త్రిపాదముకంటె షడ్గుణసిందూరము బలోత్కర్షము గలిగియుండుటచే నొకదానికంటె నొకటి గుణాధిక్యతను పొందుచున్నవి.

ఇందు కృష్ణభస్మము - రసగంధకములు సమభాగములు కజ్జలిచేసి అయశ్శరావమునందు గాని మృచ్ఛరావమునందు గాని యుంచి దీపాగ్నిచే - గంధకము సమగ్రముగా లేచిపోయి రసభాగము మిగులువఱకు - పచనముచేసిన కృష్ణభస్మము మిగులుచున్నది. ఈ కృష్ణవర్ణ రసభస్మమును ఇట్లే షడ్గుణగంధకముచేత భస్మీకరింపఁజేయుటచే గుణాధిక్యతనుబొంది యనేకరోగజాలములందును మాడుటకు సమర్థతను బొందుచున్నది. ఈభస్మ సేవవలనఁ గామవృద్ధి క్షయరోగనాశనము కుష్ఠాదిరోగనివారణము సిద్ధించును. రససంకేతకలిక యను రసశాస్త్రమునందు

చాముండుఁడను రసతంత్రవేత్త రసమునకు రక్తపీతకృష్ణనీలము లని భస్మవిధానములు నాలుగుగా విభజించి రసగంధకకజ్జలీకరణము మాత్రమే వర్ణించి యనంతరపాకవిధానము చెప్పకయే కృష్ణభస్మ మని పేర్కొనెను. ఇందు శ్వేతవర్ణభస్మమును వచింపనే లేదు. రసోత్కృష్టత నిరూపించుటకు గ్రాసవిధానము ననుసరించి ధాతుసమ్మేళనముచేసి బహిర్ధూమాంతర్ధూమపాకములకుం గావలసిన త్రేతాగ్నులచే పచనం బొనర్చి యనంతరము మూలికా రసక్వాథాది ద్రవరూపములచే మర్దించుటవలన గలిగిన వివిధౌషధములు వివిధరోగజాలమును నిర్మూలించుచున్నవి. అందు లోహరసాయనము స్వర్ణలోహరసాయనము మేహవంగరాజీయము తామ్రలోహరసాయనము రసరాట్టు స్వయమగ్ని రసము మొదలగునవి ప్రసిద్ధములై యున్నవి.

కేవలవస్తు సమ్మేళమువలననే స్వయంపచితములగు స్వయమగ్నిరసము మొదలగునౌషధము లంతర్ధూమప్రధానములై దివ్యరసాయనములుగా నున్నవి. ఇందు గంధకమునకు సమగ్రజీర్ణభావము లేదు. వజ్రవైడూర్యాదినవరత్నములు క్షారరూపకమైన భస్మములుగా మార్చి రససమ్మేళనముచేసి గంధకముచే జీర్ణింపంజేసి రసచింతామణి నవరత్నచింతామణి త్రైలోక్యచింతామణి మొదలగు ననేకౌషధములను గల్పించిరి. కేవలభస్మములు రసగంధకకజ్జలీకరణము చేర్చి కషాయకల్కాదుల సమ్మేళనముచేసి వసంతకుసుమాకరరసము మొదలగు రసాయనౌషధముల వచించిరి. కొన్ని సమ్మేళనములయందు వంటఁజేసి తరువాత కల్కాదులఁజేర్చి కాంతవల్లభరసము లక్ష్మీవిలాసరసము మొదలగు నౌషధములను పేర్కొనిరి. ఎన్ని కోట్ల యౌషధములు కల్పించినను రసగంధకములు ప్రధానద్రవ్యములుగా నున్నవి. ధాతువులయందు స్వర్ణ·లోహ తామ్రములు ప్రధానముగా నున్నను రసగంధకసమ్మేళనము లేనిదే రసాయనముగాఁ బ్రయోగింపఁబడలేదు. అందువలన గుణోత్కర్షకొఱకు రసమే సర్వోత్కృష్టముగా నున్నది. రసమువలననే — అమరసుందరీఘుటిక ఖేచరీఘుటిక సంస్కృత మగుచున్నవి. ప్రతి వంటయౌషధమునకు ప్రతికజ్జలియౌషధమునకు చిగురున నామకరణమునందు రసశబ్దముగాని రసాయనశబ్దముగాని ప్రయోగింపబడుచుండును. పూర్వకాలమున రససంస్కారము నిమిత్తము ప్రత్యేకరసశాలలు నిర్మింపఁబడి యందు రసాయనపరికరము లన్నియు సిద్ధముచేయఁబడి రసోపరస ధాతూపధాతు సంసర్గముల ననుసరించి వివిధయంత్రసహాయములచే ననేకవిధ రసరసాయనములం జేసి యనేకరోగములను నిర్మూలము గావించిరి.

రసస్య మనసశ్చైవ చంచలత్వం స్వభావతః
రసబంధో మనోబంధః కిన్న సిద్ధ్యతి భూతలే.

అనుటచే రసబంధమనోబంధము లిహపర సాధకములై యున్నవి. సంసారమును తరించుటకు ముక్తిసాధనములలో పాదరస మొకటి యని రససిద్ధాంతమై యున్నది. ఈ రసము నుపాసించుమతమునకు రసేశ్వరమత మని వ్యవహరింతురు. ఈ రసేశ్వరమత సిద్ధాంతములలో ముఖ్యముగా క్షణభంగురము దుర్బలము రోగభూయిష్ఠము నగు నీ మానవశరీరముల కేర్పడిన పరమాయువు మోక్షసంగ్రహమునకు చాలదనియు మోక్షార్థి జన్మ జన్మాంతరములను పొందకుండ—ఈ జన్మముననే ముక్తిని పొందుటకు అంతరాయములు గలుగకుండ — దీర్ఘకాలజీవనము శరీర పాటవము జరామరణరాహిత్యము సంపాదించుటకు రససిద్ధిని పొందవలయు ననియును రససిద్ధివలన ననేకవిధయోగబలములను బొందుట కవకాశము గల్గుననియు రసేశ్వరమతాచార్యులు వచించిరి. ధాతుమారణ కర్మవిషయమై సిద్ధలక్ష్మీశ్వరతంత్రమునందు

“ లోహానాంసరసం భస్మ సర్వోత్కృష్టం ప్రకల్పయేత్ ”

అని ప్పుటచే గ్రాసవిధానము ననుసరించి రసధాతుసమ్మేళన మొనర్చి మారకోచితమూలికలచే మర్దించి పుటప్రకారము నెఱింగి భస్మములను జేసిన సర్వోత్కృష్టము లగును. అంతర్ధూమముచేత పచనము చేయఁబడినయెడల సర్వలోహములు దోషవిముక్తినిఁ బొందును. అందు షడ్గుణగంధకముచే పాకముచేయబడిన రసమువలన లోహదోషములు సహస్రమున్నను పోగొట్టబడును. రసమువలన దోషములు గలుగునని యును నోరుపట్టు ననియు లోకము భయపడి రసవైద్యము మంచిది కాదని దుర్భ్రమపడుచున్నారు. రసములేని యౌషధమే లేదు. సంస్కారములవలన నిర్దుష్టమై జారణము నొందిన రసమే సేవ్యమై యున్నది. కాని నాగవంగాది దోషయుక్తరసమునుగాని గంధకజారితము గాక లోహగ్రాసము గాక పాచెహీనమైన రసముగాని రోగకారణ మగుచున్నది. సర్వవ్యాధిహరణసిద్ధికొఱకు శ్రీపూజ్యపాదులను రసాచార్యులు “సర్వవ్యాధిహరణరస”మను పేర నొకరసరసాయనమును వచించిరి. అందు ఇంగిలికమునుండి తీయఁబడినరసము 1 భాగము,రసకర్పూరము 2 భాగములు, గంధకము 1 భాగము కజ్జలీకరించి కుక్కుటాండమున నుంచి యంతర్ధూమవ్యాప్తిచేత వాలుకాయంత్రసహాయముచేత వండవలయునని విధింపఁబడినది. రసమునకు ప్రత్యేకశుద్ధి లవసరము లేకుండ హింగుళోత్థరసముదాహరింపఁబడెను. గంధకము మాత్రము శుద్ధులుచేసికొని కజ్జలీకరింపవలయును. పాకముచేయునప్పుడు క్రమాగ్ను లుపయోగింపవలయును. కుక్కుటాండమునకు గంధకధూమము పైకిపోవునట్లు (బహిర్ధూమవ్యాప్తికొఱకు) రంధ్రము విడువకూడదు. కాని జాగ్రతగా 5, 6 చీరమన్నులిచ్చి గాఢముగా నారనిచ్చి వాలుకామధ్యమున నుంచి వండవలయును. స్వాంగశీతలమున రసమును సింహారించి చిన్నచిన్నరవక కట్టియుండును. అందు అండసంబంధ మగు క్షారకళంకము పోవునట్లు జలమున కడిగి యెండించిన యౌషధము రససిందూరమువలె ప్రకాశమానమై యుండును. ఇట్లుచేయబడిన ప్రక్రియలెల్ల “మూర్ఛిత్వాహరతి రుజం” అను రసహృదయాభిప్రాయముగా సర్వరోగముల నిర్మూలన మొనర్చును. రసపాషాణసమ్మేళనమువలన సౌవీరమను నొకరసవిశేష మగు నౌషధము ప్రసిద్ధమై యున్నది.

దక్షిణదేశసాంప్రదాయానుసారముగా దీనిని వీర మను పేరుతో వాడుదురు. అగస్త్యతంత్రములయందు దీనివాడుక విస్తారముగా నున్నది. ఈ సౌవీరము ఫ్రాన్సుదేశీయులు అనేకరోగముల కనేకవిధములుగా వాడుకచేయుదురు. ఉపదంశరోగములకు విశేషముగా వాడుదురు. 1295–1488 క్రీస్తుశకప్రాంతమున ఫ్రాన్సుదేశీయులు హిందూదేశమున సౌవీరముయొక్క వాడుకను గుఱించి యుపదేశించినట్లును 17-వ శతాబ్దమునుండి బాహాటముగా హిందువులు వాడుకొనుచున్నట్లును చరిత్రాంశమై యున్నది. హింగుళోత్థరసమునకు షండత్వదోషము కల దని లోకుల మతము. హింగుళరూపకముగా నున్నప్పు డుండిన నుండ వచ్చునే వాని యూర్ధ్వపాతనవిధిచే నింగిలీకరసమును సంగ్రహించునప్పు డుండదు. కనుక హింగుళోత్థరసమును ధారాళముగా నౌషధముల నుపయోగింపదగును. రసతంత్రములయందు తఱుచుగా నసాధ్యము లగు శ్లీపద భగంధర లూతోపదంశాదిరోగములకు రసభస్మము ప్రధానచికిత్సగా రసాచార్యులెల్లరు నుదాహరించిరి. కనుక నాయుర్వేదవేత్తలు నాయుర్వేదాభిమానులు రసమాహాత్మ్యము సమగ్రముగా గ్రహించి రసోపరస సాధారణరస ధాతూపధాతుసమ్మేళనములు చేసి వివిధరసాయనములను వండి వివిధరోగముల కుపయోగించి రోగార్తులగు నెల్లజనులకు నారోగ్యాభివృద్ధి యగునట్లును చేయుదురు గాక.

The President of the Kilafat Conference
Reading his address



ఖిలాఫతు మహాసభాధ్యక్షుడు
యుపన్యాసమును చదువుచుండుట

Bhai Nirmala Thej Singh
Sings Akalinational Song



భాయి నిర్మలతేజసింగుగారు
అఖాలీ జాతీయగీతము పాడుట

The Jamiat-ul-ulma Pandits



జెమియతులే ఉలేమా పండితులు

Sri B. Braj Kishore Prasad
Chairman Rec. Committee



శ్రీయుత బి. వ్రజ కిశోర ప్రసాద్ గారు
ఆహ్వాన సంఘాధ్యక్షులు

**The Bengali Chorus**



బెంగాలీ గీతము

**Sir P. C. Ray's Dyeing Demonstration**



సర్. పి. సి. రే. దేశీయరంగుల ప్రదర్శనము

**The Arya Samajists' Camp**



ఆర్యసామాజికుల బస

**Main Gate-way and Fountain**



సింహద్వారము - కొళాయి

# ద్వైతమతము

## బంకుపల్లి మల్లయ్యా శాస్త్రి గారు, కావ్యతీర్థులు

శ్లో. స్వతంత్ర మస్వతంత్రం చ ద్వివిధం తత్వ మిష్యతే । స్వతంత్రో భగవా న్విష్ణుః నిర్దోషో ౽ శేషసద్గుణః

విష్ణువు ప్రపంచము అని రెండువస్తువులు. విష్ణువు స్వతంత్రుడు. ప్రపంచ మస్వతంత్రము. విష్ణువే ఆత్మ యని యుపనిషత్తులలో జెప్పుపదార్థము. అయితే స్వజాతీయ విజాతీయ స్వగతభేద శూన్య మాత్మయని శ్రుతులు జెప్పుచున్నవి కదా. వానిగతి యేమి? భేదము చెప్పు "సత్యంభిదా సత్యంభిదా" అను శ్రుతుల కేమిగతి? మనకు గనబడు భేదమును అసత్యమని చెప్పి భేద శ్రుతులకు గౌరవార్థము కల్పించుటకంటె భేదమును అంగీకరించి అభేద శ్రుతులకు గౌరవార్థము కల్పించుట న్యాయ్యమా? మీరే యోచింపుడు. భేదమును జెప్పు శ్రుతులసంఖ్య యధికము. ప్రత్యక్షముగా నీలపీతాదిభేదము గోచరించుచున్నది. అయితే - "యథాతా సౌమ్యైకేన మృత్పిండేన" ఇత్యాది శ్రుతిలో ఏకవిజ్ఞానమువల్ల సర్వవిజ్ఞానము చెప్పి నామరూప ప్రపంచమునకు మిథ్యాత్వము చెప్పుట నెట్లు సంగత మగును? అనినచో, ఇట్లు.—

ప్రధానపురుష జ్ఞానమువల్ల గ్రామమంతయు దెలియునని లోకములో వాడుక యెట్లో అట్లే. మీరు చెప్పినట్లే అయితే సత్తా జ్ఞానమువల్ల మిథ్యాజ్ఞానము పుట్టునని చెప్పవలసివచ్చును. అది అసందర్భము. మా పక్షమున గార్యకారణ భావమున - కారణ మయిన వెండి తెలిసినంతట గార్యమగున కొడుకు దెలియునట్లు సమాధానము. మీ దిశ్రుతిలో "ఏకమృత్పిండ" శబ్దములు రెండు మీమతమున వ్యర్థములు. మృదాజ్ఞాతయా అంటే చాలును. అట్లయితే మృత్తికేత్యేవ సత్యం అని కార్యరూప ప్రపంచము మిథ్య యని యర్థము నెట్లు మీమతమున సమర్థింతురు? ఇట్లు:—

వాచారంభణం వికారో యస్యతత్ అవికృతం నిత్యం నామధేయం మృత్తికేత్యాదివచనం సత్యం-అని తథ్యార్థమే చెప్పునుగాన. లేకుంటే "నామధేయమేవ" అను రెండుశబ్దములును వ్యర్థములు. మఱియు.—ప్రపంచము మిథ్యయనునపుడు మిథ్యాత్వము తథ్యమా? అతథ్యమా? మొదటిపక్షమున సత్యాద్వైతభంగము. రెండవపక్షమున ప్రపంచముసత్యము కావలసివచ్చును. అద్వైతులపూర్వపక్ష మింకొకటి:—మీరు ధర్మిప్రతియోగిఘటితముగా భేదమును అంగీకరింతురా? లేకుండనా? రెండవపక్షమున ధర్మిప్రతియోగిప్రతిపత్తి లేని దీభేదమేయుండదుగదా? మొదటిపక్షమున వికల్పము. ప్రతియోగి జ్ఞానముండు పిమ్మట భేదజ్ఞానమా? రెండును నొకేకాలముననా? ఇందు మొదటిపక్షమున బుద్ధివిరమించి వ్యాపారము చేయదు- గావున ప్రతియోగిజ్ఞానము ముందువీలులేదు.

అన్యోన్యాశ్రయదోషమున్ను. రెండవపక్షమున కార్యకారణము లొక్కకాలమందు గలవు. అన్వయవ్యతిరేకములవల్ల ప్రతియోగిజ్ఞాన భేదజ్ఞానములకు గార్యకారణభావ మంగీకరింపక తప్పదు. కనుక భేదము ప్రత్యక్షమనుట సుకరము కాదు; అని ఇందుకు ద్వైతుల సమాధానము. ఈ మీ గందరగోళము వస్తుస్వరూపభేదవాదిమీదనా? ధర్మిస్వరూపవాదిమీదనా? నేను ధర్మిస్వరూపభేదవాదిని గావున నామీద నీదోషము లెంతమాత్రము పనికిరావు. ప్రతియోగిసాపేక్షము కాని భేద మెక్కడ నుండ దందురా? కాదు కాదు. సర్వతోవిలక్షణముగా వస్తుస్వరూపము దెలిసిన పిమ్మట ప్రతియోగ్యపేక్ష వ్యవహారమున కావశ్యకము. పరిమాణఘటిత వస్తుస్వరూపజ్ఞానము మొదట- తరువాత ప్రతియోగి సాపేక్షదీర్ఘహ్రస్వజ్ఞానము.

నీరక్షీరములచోటవలె భేదప్రతిభాసకూడ గలుగరాదా అందురేమో? అట్లుకాదు అభేదజ్ఞానము.

అతిదూరాత్సామీప్యాత్
ఇంద్రియఘాతాన్మనోఽనవస్థానాత్
సౌక్ష్మ్యాద్వ్యవధానాత్
అభిభవాత్సమానాభిహారాచ్చ

భేదమును అభేదమును రూపింపజేయు స్థలములను నాటికారణములను క్రమముగా జూడుడు. ఈ శ్లోక

మున పర్వతము దూరమున నున్నగా గనుపించును. ఇంద్రియఘాతమువల్ల విద్యుదాదులు మనస్సు స్థిరముగా నుండకపోవుటవల్ల వెలుగులో నున్న వస్తువుకూడ గనంబడదు. కన్ను చీకటిః క్రమ్మినట్లు తోచును. చిన్నదగుటచే పరమాణువులు భిన్నములుగా గోచరింపవు.

గోడ వెనుకనున్న వస్తువువ్యవధానమువల్లను-పగలు నక్షత్రములు దృష్టి తిరస్కారమువల్లను- నీరిక్షీరములు సమానాభిహారమువల్లను - భేదఘటితములుగా గానరావు. ఇక్కడకు ప్రత్యక్షప్రమాణసిద్ధమే భేదమని సాధించి యుపమాన ప్రమాణముచేతనుగూడ సాధించుచున్నాడు.

పరమేశ్వరుడు జీవునికంటె భిన్నుడు. జీవునకు సేవ్యుడు. గనుక భృత్యుడు ప్రభువువలె లోకములో దనకు సుఖముగావలెను దుఃఖము వద్దు అనువాడు అనర్థము పొందును. తాను హీనుడనని పరుని గుణోత్కర్షము ను గొనియాడువానికి బరునివల్ల దప్పక సుఖము గోరక సిద్ధించును.

"ఘాతయన్తి చ రాజానో
రాజాఽహ మితి వాదినం"
తద్వ త్సకల మిష్టంచ
స్వగుణోత్కర్ష వాదినాం.

నేనే రాజుననువానిని రాజు దండించును. గుణోత్కర్షను గొనియాడుచు దాను తక్కువ వాడను అని సేవించువానిని సుఖంపజేయును. సేవ త్రివిధము. అంకనము నామకరణము భజనము అని తొలుతటి రెండును స్పష్టములు. మూడవదగు భజనము పదివిధములు:—

వాక్కుతో 1 సత్యము 2 హితము 3 ప్రియము పల్కుట స్వాధ్యాయము చెప్పుట. శరీరముతో 1 దానము 2 పరిత్రాణము 3 పరిరక్షణమును. మనసుతో 1 దయ 2 స్పృహ 3 శ్రద్ధకలిగియుండుట.

ద్వైతసాధకశ్రుతి

"సత్యమేవ తమనువిశ్వే మదన్తి
రాతిం దేవస్య గృణతో మఘోనః
సత్యాసో.........సత్య ఆత్మా
సత్యో జీవః- సత్యం భిదా సత్యం భిదా
మయివారుణ్యో మయి వారుణ్యో
మయి వారుణ్యః."

అని. అయితే—

బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి

అను శ్రుతి యెట్లు సమరసించు ననగా నిట్లు:—

బ్రాహ్మణుని సేవించిన శూద్రుడు బ్రాహ్మణుండగును అన్నట్లు స్మృతిని.

ప్రపంచోయది వర్తేత
నివర్తేత న సంశయః
మాయామాత్ర మిదం ద్వైతం
అద్వైతం పరమార్థతః.

ప్రపంచము మాయామాత్రము. అద్వైతమే పరమార్థము. అంటే సమాధానము. శ్లోకార్థ మట్లుకాదు. ఇట్లు పరమార్థాపేక్షచే అంతటికి ముఖ్యుడైన విష్ణుతత్త్వము సములని అధికులని ప్రపంచము వానిని జూడదు. అని తాత్పర్యము.

పరమేశ్వరజ్ఞానవిషయ మయినది కనుక ద్వైతము భ్రాంతికల్పితము కాదు. పరమేశ్వరుడు సర్వజ్ఞుడని శ్రుతులలో జెప్పియున్నది. కనుక ప్రపంచ మయిదువిధము లైనది 1 జీవేశ్వరభేదము 2 జడేశ్వరభేదము. 3 జీవాన్యోన్యభేదము. 4. జడజీవభేదము 5 జడాన్యోన్యభేదములని.

ద్వైతం న విద్యత ఇతి తస్మా దజ్ఞానినాం మతం

ద్వైతము లేదు అని చెప్పునది యజ్ఞానులమతము. భగవద్గీతలలో—

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షరఏవచ.

అను మొదలయినదారుశ్లోకము లీయర్థమునె ప్రతిపాదించుచున్నవి. మోక్షమువిష్ణుసాలోక్యసామీప్యాదులు. నిత్యములు. తక్కుంగల ధర్మార్థకామము లనిత్యములు. ఆమోక్షము భగవదాధీనము. అనిచెప్పి "సఆత్మా తత్వమసి" వాక్యమునుగూడ అతత్వమసి. అని పదచ్ఛేదముచేసి యొకసమన్వయును

ఆదిత్యో యూపఇతిపటి సాదృశ్యా ద్యాతు సాశ్రుతిః

అని ఈ యూపస్తంబము సూర్యుడు అనుశ్రుతిలో సూర్యకాన్తివంటి కాన్తి కలది యని యెట్లు తాత్పర్యమో అట్లే నీవు వాడయితివి. అనునపుడు అట్టి గుణములుగలిగి లోకపూజ్యుడ వగుదువు. అనియే యర్థము. అని పూర్ణప్రజ్ఞుల వారి మతము.

ప్రథమస్తు హనుమాన్ స్యాత్
ద్వితీయో భీమఏవచ
పూర్ణప్రజ్ఞస్తృతీయ స్స్యాత్
భగవత్కార్యసాధకః.

భగవంతునికార్యమును సాధించువారిలో మొదటివాడు హనుమంతుడు. రెండవవాడు భీముడు. మూడవవాడు పూర్ణప్రజ్ఞుడు. పూర్ణప్రజ్ఞుడనునది మధ్వాచార్యులవారికి నామాన్తరము.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

### ఋయ్యుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులు గారు

స్వభాషాపరిజ్ఞాన మందఱకు నత్యంతావశ్యకము. అందుల కాయా భాషాగ్రంథము లామూలాగ్రముగఁ బఠింపవలయును. అట్లు చదువునపుడు శబ్దార్థపరిజ్ఞానమునకు నిఘంటువులు ముఖ్య సాధనంబులు. ఆనిఘంటువులు రెండు విధములు. పద్యరూపములు, అకారాదికోశరూపములు. ఆంధ్రగీర్వాణభాషలయందుఁ బద్యరూప నిఘంటువులు నాంగ్లేయాదిభాషలయం దకారాదికోశములు నున్నవి. పద్యరూపకోశములు బాలురు చిన్నతనములో సంతచెప్పుకొని, శబ్దార్థ జ్ఞానవిశారదు లగుటకు మిగుల నుపయోగించును. ఈ మహోపకార మాంగ్లభాషాభ్యాసకులకు లేదు.

అమరము, అమరపదపారిజాతము, నానార్థరత్నమాల, మేదిని, విశ్వప్రకాశిక, త్రికాండశేషము, వైజయన్తీనిఘంటువు, ధనంజయ నిఘంటువు మొదలగునవి సాంస్కృతిక శ్లోకమయ కోశములు. ఆంధ్రభాషార్ణవము, ఆంధ్రపదాకరము, ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు మొదలగునవి యాంధ్రపద్య నిఘంటువులు. ఈ పద్యనిఘంటువుల సమయమునకు స్ఫురించునటులు చక్కఁగా నేర్చుకొనినచో భాష వశమగును. అందుచేతనే, "అనుగము నెమరునకు వచ్చినచోఁ, గావ్యము లెందుకు కాల్పనా" యను లోకోక్తి కలిగినది.

ఆంగ్లేయ నిఘంటువులవంటి యాంధ్రాకారాది నిఘంటువులకు శ్రీ పరవస్తు చిన్నయసూరిగారు మార్గదర్శకులు. తన్మార్గప్రథమపథికులు శబ్దరత్నాకరకారు లగు శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారు. పిమ్మట శబ్దార్థచంద్రిక యను నకారాది మిశ్రాంధ్ర నిఘంటువు, పురుషోత్తమకవీయ మను తెలుఁగునిఘంటువు, ఆంధ్రపద పారిజాతము, లక్ష్మీనారాయణీయము మొదలగు నచ్చాంద్ర నిఘంటువులు బయలుదేఱినవి. ఈ యకారాదినిఘంటువులు మూడు విధములు.

(1) శబ్దార్థములఁ బ్రయోగసహితముగఁ జూపు నిఘంటువులు:- ఉదా. శబ్దరత్నాకరము; ఆంధ్రపదపారిజాతము.

(2) అర్థము, పర్యాయపదములఁ జూపునిఘంటువులు:—ఉదా. లక్ష్మీనారాయణీయము.

(3) కేవల శబ్దార్థముల నొసఁగు నిఘంటువులు:—ఉదా. శబ్దార్థ చంద్రిక.

ఇపుడు శ్రీ పీఠికాపుర మహారాజావారొక విపులాంధ్రనిఘంటువును రచియింపించుచుండిరి. విద్వాంసులు దానికి శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు వని పేరిడిరి, తత్సంపాదకులు శ్రీ జయంతి రామయ్య పంతులుగారు. ఆంధ్రగీర్వాణమహావిద్వాంసు లగు బ్రహ్మశ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు, కీర్తిశేషు లగు తంజనగరం తేవప్పెరుమాళ్లయ్య గారు, శ్రీ వద్దుల చిన సీతారామస్వామిశాస్త్రి గారు శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులు గారు శ్రీ దంతుర్తి సుబ్బరాయ శాస్త్రి గారు, శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు శ్రీ అల్లంరాజు రంగశాయి కవిగారు (శతావధానులు), శ్రీ అల్లంరాజు సోమకవిగారు మొదలగువారీనిఘంటువును వ్రాసి భాషాసేవచేసినారు. వ్రాతపని ముగిసినది. ఇపు డర్థనిర్ణయము జరుగుచున్నది. అర్థనిర్ణయప్రారంభములో, నాంధ్రగీర్వాణ మహావిద్వాంసులును, ఆంధ్రశంకరభాష్య శుక్రనీతిసారాద్యగ్రంథకర్తలు, మద్గురుశిరోమణులు నగు బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రులవారు, శ్రీ రామకృష్ణ పరమహంస చరిత్రము, గౌరాంగస్వామి చరిత్రము మొదలగు పావనగ్రంథకవులును, రామభక్తశిరోమణియు, మద్గురువర్యులు నగు బ్రహ్మశ్రీ కూచి నరసింహం పంతులు గారు (బి. ఏ.,) శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు, (మద్గురువులు) శ్రీ అల్లంరాజు సోమకవి గారును బని చేసిరి. జ్ఞానవయోవృద్ధు లగు శ్రీ మల్లయశాస్త్రిగారు కొంతకాలమునకు విశ్రాంతి తీసికొనిరి. వారి స్థానములో, వైయాకరణులును, మహావిద్వాంసులును, మద్గురుశిఖామణులు నగు బ్రహ్మశ్రీ పేరి పేరయ్య శాస్త్రులవారు పనిచేయుచున్నారు. వీ రందఱును వృద్ధులు. చిన్నవారము మేము వారి భాషాసేవాఫల మనుభవింతుము. "Planting trees for others" (ఇతరులకొఱకుఁ జెట్లు నాటుము)అను లోకోక్తి వినమే. భాషాసేవచేసి వా రందఱు ధన్యులైరి. ఇఁక నొక విజ్ఞాపనము.

"నీచాదపి మహద్గ్రాహ్యం, బాలాదపి సుభాషితమ్."

పూర్వోక్తనిఘంటురాజవిషయమై విద్వాంసుల యభిప్రాయములఁ గైకొనిరి. నేను పండితుఁడఁగాను. కవినిగాను. ఐనను దన్నిఘంటువిషయమున నామనవిచేయుదానిలో నేమైన నొప్పు లున్న గ్రహించి, నన్ను ధన్యుం జేయ నంకర్వాణులకొఱకుఁ గేల్మోడ్చుచున్నాఁడను.

1. ప్రతిపదమునకు, (సంస్కృతమైనను, దెలుఁగైనను) బ్రయోగము (ప్రమాణము) వ్రాయవలయును.

2. ప్రతిపదమునకు నిర్వచనము లేక వివరణము (Definition) వ్రాయవలెను.

3. సంస్కృత (ప్రకృతి) శబ్దముల కచటనే తద్భవములు వ్రాయవలెను. తద్భవము (వికృతి) లేని సంస్కృతపదమునకుఁ దెలుఁగు మాట వ్రాయువలెను.

4. అట్లు, తెనుఁగుమాటకుఁ బ్రకృతి యచటనే వ్రాయవలెను. ప్రకృతి లేని దేశ్యములు మొదలగు పదములకు సంస్కృతపదములు వ్రాయవలె. కవ్వడికిఁ బ్రకృతి లేదు కనుక, సవ్యసాచి యను నాయర్థమునే యొసఁగు సంస్కృతపదమును వ్రాయనగు.

5. ఏకాక్షరపదములు విడువరాదు.

6. ప్రతిశబ్దమునకు సాంధ్రగీర్వాణపర్యాయపదములు వ్రాయవలెను. అట్లు సంస్కృతపదమునకుఁ బర్యాయపదములు వ్రాయుచో సంస్కృతపర్యాయపదములనే యకారాదిగ వ్రాసి, చివర నాంధ్రపర్యాయ పదములకు, చూ. అను సంజ్ఞ వేసి యవి యేపదముక్రింద నున్నవో యా పదము వ్రాయవలెను.—

ఉదా. (a) గజము:—ఏనుఁగు (పర్యాయపదములు, సంస్కృతము చూ. అనేకపము— తెలుఁగు ఎక్కుడుమెకము)

(b) అనేకపము:—ఏనుఁగు (పర్యా. సం (1) ఇభము. (2) కరి. (3) గజము. (4) దంతి (5) దంతావళము. (6) దాని. (7) ద్విపము. (8) ద్విరదము. (9) నాగము. (10) పద్మి. (11) మాతంగము. (12) వారణము. (13) స్తంబేరము. (14) హస్తి. తెనుఁగు చూ. ఎక్కుడుమెకము.)

(c) ఎక్కుడుమెకము=ఏనుఁగు. (పర్యా సం. చూ. అనేకపము. తెలుఁగు (1) ఏనుఁగు (2) చేమెకము (3) చేటచెవులమెకము. (4) పలుగొమ్ములమెకము (5) బలుహజ్జమెకము.)

(a) లో నష్టదిగ్గజములఁ దద్భార్యలనామములు వ్రాయవలె.

(b, c) లలోఁ బర్యాయపదము లన్నియు వ్రాయలేదు. ఉదాహరణమునకై కొన్ని చూపినాను.

7. ప్రతి సంస్కృతపదమునకు, సాధ్యమైనంతవఱకుఁ దెలుఁగు పదములకు వ్యుత్పత్తి, ధాతువు వ్రాయవలెను.

ఉదా. ఖగము:—[వ్యు. ఆకాశమునఁ బోవునది- ధాతువు, ఖం గచ్ఛ=(To go) వెళ్లుట.]=పక్షి

నలువ=[వ్యు. నాలుగు + వా] బ్రహ్మ, చతుర్ముఖుఁడు.

8. రూపాంతరము లున్నచో నకారాదిగ వ్రాయవలె. రూపాంతరము లత్యంతావశ్యకములు.

ఉ. నీవృతము — నీవృత్తు
ఘృతస్పృక్కు — ఘృతస్పృశుఁడు
దృక్కు — దృశ
అంగిరుఁడు — అంగిరసుఁడు
ఒకరిత — ఒకర్తి ఒకర్తు ము.

9. అల్పార్థములు (Diminutives) వ్రాయవలె.

ఉదా. i స్వము — స్వకము
ii బాలుఁడు — బాలకుఁడు
iii నెలఁత — నెలఁతుక
iii పొలఁతి — పొలఁతుక

10. అవసర మగుచో స్త్రీలింగములకుఁ బుల్లింగరూపములును, బుల్లింగములకు స్త్రీలింగరూపములును జూపవలెను.

ఉదా. విద్వాంసుఁడు — విదుషి (స్త్రీ)
భ్రాత — స్వస
వృషభము — ధేనువు
జామాత — స్నుష
అశ్వము — బడబ
సోమయాజి — సోమపీథిని
ప్రేఁడు — ప్రేత

11. కొన్నిచోట్ల బహువచనరూపములు చూపవలెను.

ఉ. వ్రాయి — బ. వ. వ్రాలు.

వెండి, పైఁడి, కేలు, మొన్న, నిన్న, రేపు మొదలగునవి నిత్యైకవచనము లనియు,

కురులు, ఇగులు, వడ్లు, పెసలు మొదలగునవి నిత్యబహువచనము లనియుఁ దెలుపవలెను.

12. అలంకారము లాయాచోట్ల నిర్వచింపుచు (Define) దండి మొదలగువారి ప్రమాణముల నిచ్చి, యుదాహరింపవలెను.

ఉ. అర్థాంతరన్యాసము:—సామాన్యవిధిని విశేషవిధిచేఁ గాని విశేషవిధిని సామాన్యవిధిచేఁ గాని స్థిరపఱుచు నొక యర్థాలంకారము.

ఉ. "కామార్తాహి ప్రకృతికృపణా శ్చేతనా చేతనేషు" (మేఘదూత)

"కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్"—(మను. చ.)

13. సంధు లాయాచోట్ల నిర్వచించి యుదాహరింపవలెను.

ఉ. సవర్ణదీర్ఘసంధి:—సంస్కృత సంధి. హ్రస్వదీర్ఘంబు లగు 'అ, ఇ, ఉ, ఋ' లకు సవర్ణంబులు పరమగుచో నా రెంటి కొక దీర్ఘ మాదేశ మగు. "అకస్సవర్ణే దీర్ఘః"

ఉదా. రామ + అనుజుఁడు=రామానుజుఁడు.
ముని + ఇంద్రుఁడు=మునీంద్రుఁడు.
పృథు + ఊరువు=పృథూరువు.
పితృ + ఋణము=పితౄణము.

14. శబ్దవ్యుత్పత్తులు.—సమాసములు. 3 విధములు. (Gen ral)

(1) సాంస్కృతికము - ఉ. తటాకోదకము.
(2) మిశ్రము ఉ. చెఱువుసుదకము.
(3) ఆచ్ఛికము ఉ. చెఱువునీరు.

(1) తత్పురుషస—8
(2) కర్మధారయస— 7
(3) ద్విగుస.—2
(4) బహువ్రీహిస.— 7
(5) అవ్యయీభావస—2
(6) ద్వంద్వస—4

ఆయాసమాసముల క్రిందవానినిర్వచింపుమనుదాహరణములీదగు.

15. తద్ధితము లనేకవిధములు అవి 30 కంటె నధికముగా నున్నవి. ఆయాచోటుల వాని నిర్వచింపుచు నుదాహరింపవలెను.

ఉ. సంస్కృతార్థకము—దధ్ని సంస్కృతం దాధికమ్
సమూహార్థకము—శౌకము=శుకసమూహము.
అధ్యేత్రువేదిత్రర్థకము — వైయాకరణి = వ్యాకరణ శాస్త్రజ్ఞుఁడు.

వ్యాకరణము—అ. తద్ధి. వైయాకరణి.

సుస్నానము—పృచ్ఛత్యర్థకత. సౌస్నాతికుఁడు= సుస్నానమా యని యడుగువాఁడు.

సుఖశయనము — పృ. త. సౌఖశాయనికుఁడు=సుఖశయనమా యని యడుగువాఁడు.

సరస్వతి —సంబంధార్థకత. సారస్వతము (Litera ure)

16. దేశీయములు (Idioms):—దేశీయములు వ్రాసి వాని చమత్కారములం దెలిపి ప్రయోగము చూపవలెను.

ఉ. (i) శిలాక్షరము;—(శిలలయందుఁ జెక్కఁబడిన యక్షరము లెట్లు శిథిలముగాక యుండునట్లు లెన్నఁటికి మార్పుచెందక శాశ్వతముగా నుండునది) స్థిరమైనది.

ఉ. "పలుకు శిలాక్షరంబు నయపాలనరూపము లానిరూపముల్"
(రామాభ్యుదయము.)

దీనికి వ్యతిరేకము( X )నీటివ్రాలు.
"నీట వ్రాసినవ్రాలునై"—కాళహస్తిమాహాత్మ్యము (తృ.ఆ.)

(ii) ముంగొంగుపసిఁడి:—సులభముగా నభీష్టమును దీర్చునది.
ఉ. "పరమార్థలాభతత్పరుఁ డైనవానికి
ముంగొంగుపసిఁడి శ్రీరంగశాయి"—(కవికర్ణరసాయనము)

(iii) పుక్కిటిపురాణము:—వ్యర్థపుఁబలుకులు
ఉ. "కన్యక యిది పుక్కిటిపురాణమై తోఁచెఁ జుమీ"
(రామాభ్యుదయము)

(iv) ఉట్టికట్టుకొని యూఁగులాడుట:—(శిలవేసికొనియుండుట) ఎంతకాలమునకుఁ జావక యుండుట.

ఉ. "నిశ్చలత న్వైవెద వుట్టిగట్టుకొని దుస్సాధ్యంబు సుమ్మి"
(పాండురంగమాహాత్మ్యము.)

(v) తేనె పూసినకత్తి:—పైకి నెమ్మదిగా గన్పించుచు లోనఁ గ్రౌర్యము గలవాఁడు.

ఉ. "తేనెపూసినకత్తి ధాత్రీసురుండు"—(పాం. మా)

ఇట్లు చూ. "గోముఖవ్యాఘ్రము"
పయోముఖవిషకుంభము.
దర్దురస్వరదర్వీకరము= "కప్పరొలుంగుఁబాము పై".

(vi) గగనకుసుమము } :— లేనిది, దుర్లభము.
నభఃకుసుమము

ఉ. "పగలనుశబ్దమాత్రము నభఃకుసుమంబు నిజంబు నాన్"
—కళాపూర్ణోదయము.

ఇట్లు చూ. శశవిషాణము=కుందేటికొమ్ము
వంధ్యాపుత్త్రుఁడు
మృగతృష్ణికాజలము

(vii) గజస్నానము=నిరుపయోగము
ఇట్లు (చూడు) అరణ్యరోదనము.
అడవిని గాచినవెన్నెలు
బూడిదలో హోమము చేయుట

ఉ.శ్లో. ఆమ్నాయాభ్యసనా న్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహమ్
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయః సర్వేహుతం భస్మని
తీర్థానా మవగాహనానిచ గజస్నానం, వినా యత్పద
ద్వంద్వాంభోరుహసంస్మృతీ ర్విజయతే దేవస్సనారాయణః"
—(ముకుందమాల)

17. లోకోక్తులు:—"Proverbs are the daughters of daily life"—Dutch proverb)
=“(లోకోక్తులు లోకానుభవసంజనితములు) సామెతలు తప్పక వ్రాయవలయును. ఈ క్రింది విధమున శబ్దములకు సామెతలు ప్రమాణముగఁ జూపవలెను.

ఉ. సిద్దె=బుంగవలెఁ దోలుతో గుట్టినపాత్రము.
[ప్రయోగము] "చెప్పు కొఱుకుతే సిద్దె కొఱుకనా"-లోకోక్తి
(కొఱుకనా=కొఱుకవలయునా) ఇందు మంచినీతి యున్నది.

(ii) ముగ్గురిని గూర్చొను ముండదయ్యము.
ఉ."ముగ్గురంగూర్చొనె ముండదయ్య"మని-(రామాభ్యుదయము)

(iii) బట్టతలకు మోకాళ్లకు ముడిపెట్టుట=దుస్సాధ్యము.
ఉ. "ఏగతిని బట్టతలలు మో
కాళ్లు ముళ్లుపెట్టఁగలదో కాని"—కళాపూర్ణోదయము.

(iv) ఎంగిలిచేయి కాకికి విదల్పనివాఁడు=లుబ్ధాగ్రేసరచక్రవర్తి
ఉ. "కసరి యెంగిలిచేతఁ గాకి నేయనివాఁడు
న్నదా సతతాన ప్రశస్తుఁ డయ్యె"—(పాండు. మా)

(v) ఆత్మవత్సర్వభూతాని=Do to others as you would be done by) "ఆత్మవత్సర్వభూతాని యనెడు పలుకు"—(కుచే.)

(vi) సహసావిదధీతనక్రియాం=Haste makes waste
"శ్లో॥ సహసావిదధీతనక్రియా
మవివేకః పరమాపదాంపదం ॥—భారవి.

18. న్యాయములు:—
(i) ఉ. తృణజలూకన్యాయము=ముందటిపట్టు దొరకినగాని వెనుకటిపట్టును-జలగవలె వదలకుండుట.

(ii) చంద్రచంద్రికాన్యాయము=చంద్రుని వదలి వెన్నెలయుండదు.

19. (i) ఉపస్కారపదములు:— వేళపాళ. ఈడుజోడు. కలసిమెలసి.

(ii) సంఖ్యావాచకములు.

(a) చిరజీవు లేడుగురు

"అశ్వత్థామా బలిర్వ్యాసః హనూమాంశ్చ విభీషణః
కృపఃపరశురామశ్చ సప్తైతే చిరజీవినః"

(b) కావ్యపంచకము:—

రఘువంశము కుమారసంభవము మేఘదూత
మాఘము భారవి.

(iii) కవిసమయములు=(Poetic connentions) ప్రాచీనకవు లేర్పరచిన సంకేతములు.

(a) కీర్తి తెలుపు. అపకీర్తి నలుపు.

(b) బుద్ధి—బృహస్పతి

(c) విద్య—పుంభావసరస్వతి

20. గ్రంథస్థములై యనైఘంటికము లగు పదముల వ్రాయవలెను.

(i) అవి (సం)—తద్భ. బ॥=గోత్తై

ఇట్లప్పకవీయములో నున్నది. ఈబవిళబ్ద మిదివఱ కున్నయే నిఘంటువులోను లేదు.

(ii) ముక్కంటి=(1) ఈశ్వరుఁడు (నైఘంటికము)

కొబ్బరికాయ (అ నై)

ఉ. "ముక్కంటిపండుల మెక్కెడితిండీ డు"

—(ఆం. నా. సంగ్రహము)

21. కొన్నిపదముల యర్థములు గ్రంథస్థములునుగాక, నైఘంటికము లునుగాక యున్నవి. అట్టివానిని వ్రాయవలె.

(i) ఆబ=(1) కంటిపాప (నైఘంటికము)

(2) పేరాశ, దురాశ (అనైఘంటికము.)

"ఆబచే మామిడిపళ్లు వేయించుకొని పాఱవేసినాఁడు"

(ii) తోటబెద్దు—(వ్యంగ్యము.)

(iii) కుచేలము=(1) కుచ్ఛితమైనచేలము. చింపిగుడ్డ

ఉ. కుచేలుఁడు (వ్యు. కుచ్ఛితం చేలం యస్యసః= చినిఁగిపోయినబట్ట యొవనికో యతఁడు) (అనైఘంటికపదము)

(2) (కు=భూమికి + చేలము=వస్త్రము) సముద్రము. (అనైఘంటికము)

ఉ. శ్లో. కాచాయనీచం కమనీయవాచా।
మోచాఫలస్వాదుముచానయాచే।
దయాకుచేలే ధనదత్కుచేలే।
స్థితే కుచేలే శ్రితమాకుచేలే॥

—(వేదాంతదేశికకవిత్లజుఁడు)

దయాకుచేలుఁడు=దయాసముద్రుఁడు

(iv) నారదగజసుతుఁడు:— (అనైఘంటికము)=అభిమన్యుఁడు.

నార=నీళ్లు

నారద=మేఘము

నారదగ=ఇంద్రుఁడు

నారదగజ=అర్జునుఁడు

నారదగజసుతుఁడు=అభిమన్యుఁడు.

22. కొన్నిసంస్కృతపదములు తత్సమము లై వేఱొకయర్థమును బొందుచున్నవి. అట్టివానిఁ జూపవలెను.

ఉ. (i) కైంకర్యము=(సం) కింకరునిధర్మము ము=సేవ (తత్స) దొంగతనము.

ఉ॥ వాఁడు నాపుస్తకము కైంకర్యము చేసెను.

(i) ప్రమోషించు=(సం) దొంగిలించు
(తత్స) మోసపుచ్చు

ఉ. "క. అనవుడు సిగ్గును గోపం
బును మదిఁ బెనఁగొనఁగ మోసపోయితినకదా
ననునితఁ డిట్లు ప్రమోషిం
చెనె దీనికి మాఱుచేయఁ జెల్లదె యనుచున్"

—భోజరాజీయము-2 ఆ.

23. గ్రంథరాజములనామములు, కవిశిరోమణులనామమును వ్రాయవలెను.

ఉదా. 1. కువలయానందము:— అలంకారగ్రంథము సంస్కృతము. కవి, అప్పయదీక్షితుఁడు (1554-1626)

2 అనర్ఘరాఘవము:— నాటకము-సంస్కృతము-మురారికవివిరచితము.

3. కాళిదాసు:—గీర్వాణకవితల్లజుఁడు రఘువంశము, కుమారసంభవము, మేఘదూత, మొదలగు కావ్యములు, శాకుంతల, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము మొదలగు నాటకరాజములు రచించినమహాకవి.

4. పోతనామాత్యుఁడు:—ఆంధ్రకవిచక్రవర్తి భాగవతగ్రంథకర్త. ఇతరగ్రంథములు, వీరభద్రవిజయము, నారాయణశతకము, భోగినీదండకము.

24. ఆంధ్రభాషామహా. కీనిఘంటుమూలమున సేవయొనర్చిన విద్వాంసులఛాయాపటములను, నొక్కొక "పేరా"లో వారివారి సంగ్రహజీవితములను వ్రాయవలెను.

25. పూర్వకవీశ్వరులను, వారివారిగ్రంథరచనానైపుణ్యము, శైలి ప్రాశస్త్యముంబట్టి, శబ్దరత్నాకరకారులు చేసినట్లు, తరగతు లేర్పఱుపవలెను.

# ఉ రు ము క థ

[బృహదారణ్యకోపనిషత్తు సప్తమాధ్యాయము ద్వితీయబ్రాహ్మణము]

పారనంది సర్వేశ్వర శాస్త్రి గారు

దేవతలు మనుష్యులు రాక్షసులు అని మూడువిధములుగ బ్రహ్మదేవుని సంతానము లుండెను. ఈ త్రివిధ సంతానములుగూడ తండ్రి యగు బ్రహ్మయొద్ద శిష్యులై యుండిరి. ఇట్లు కొంతకాలము గడచినపిదప "శిష్యుల మగు మమ్ము శాసించి యేమైనఁ జెప్పవలయు" నని ముందుగ దేవతలు పలికిరి. పిదప మంచిది యని దేవతలకొరకు "ద" అను నీయక్కరమును మాత్రము బ్రహ్మ యుపదేశించి "దేవతలారా! నే జెప్పినది మీరు దెలిసికొంటిరా?" అని ప్రశ్నించెను. అటుపైని దేవతలు "మేము తెలిసికొంటిమి" స్వభావముచే మాకు దమగుణము లేదుగాన "మీరు దమ గుణము కలవారు కండు" అని మీరు మా కుపదేశించినటుల దెలిసికొంటిమి అని బదులు చెప్పిరి. ఔను. అదియే నేను మీకొరకు జెప్పినాడ నని బ్రహ్మ యంగీకరించెను.

పిదప మనుష్యులు గూడ "శిష్యుల మగు మమ్ము శాసించి యేమైనఁ జెప్పవలయు" నని బ్రహ్మతో పల్కిరి. వారికి గూడ ఆచతురాననుండు "ద" అను నీ యక్షరమునే యుపదేశించి "మనుష్యులారా! నే జెప్పినదానిని మీరు దెలిసికొంటిరా?" అని ప్రశ్నించెను "మీరు స్వభావముచే దాతృత్వము లేనివారలు గాన నిటపై మీరు దాతృత్వము కలవారు కండు" అని మీరు మాకొరకు చెప్పియున్నారని తెలిసికొంటిమని మనుష్యులు జవాబు జెప్పిరి. ఔను అదియే మీకొరకు నేను చెప్పినాడ నని బ్రహ్మ యంగీకరించెను.

పిదప రాక్షసులు గూడ "శిష్యుల మగు మమ్ము శాసించి యేమైనఁ జెప్పవలయు" నని బ్రహ్మను గూర్చి పలికిరి (తండ్రికి బిడ్డలయందు పక్షపాత ముండునా?) వారికిఁ గూడ బ్రహ్మ "ద" అను నీయక్షరమునే యుపదేశించి "ఓయసురులారా! నే జెప్పినదానిని మీరు తెలిసికొంటిరా?" అని ప్రశ్నించెను. "మీరు స్వభావముచే నెవ్వరియందును దయ లేనివారలు గాన నిటుపై మీరు దయకలవారై యుండుడు" అని మీరు మా కుపదేశించినటుల తెలిసికొంటి మని యారాక్షసులు ప్రత్యుత్తర మిచ్చిరి. ఔను అదియే నేను మీ కొరకు చెప్పినాడ నని బ్రహ్మయు నంగీకరించెను. పైని చెప్పిన మూడు ద కా ర ము ల కు ను ఆముద్వురు దమము, దానము, దయ, అను మూడు అర్థములను చేసికొనిరి. ఆమూడు సుగుణములను మరువకూడదని యిప్పటికిని దివ్యమగు వాక్కు "ద ద ద" అని ఉరుము రూపముగ పలుకుచున్నది గాన నీగుణత్రయము నందరు నభ్యసింపవలయును.

# కర్రరద్దుయొక్క ఉపయోగములు

## మల్లాది సుబ్బారావు గారు

అడవిలో మానులు నరకుటమొదలు పట్టణములలో సొగసైన బీరువాలు చేయువరకు కర్రపనివలన అపారమైన రద్దు బయలుదేరుచున్నది. ఇది గొడ్డలిపెచ్చులు, బాడిదపేళ్లు, రంపముపొట్టు చిత్రికపొట్టు అయియుండును. కాకినాడవంటి ఒక్క పెద్దపట్టణములో సంవత్సరమునకు కొన్నివేలపుట్లు కర్రపని జరుగుచున్నది. దీనినుండి ఎంత రద్దు పోవుచున్నదో ఊహింపవచ్చును. దినమునకు 20 మణుగుల బరువుగల కర్రతో పనిచేయు ఒక ఫ్యాక్టొరీనుండి 16 మణుగుల రద్దు వచ్చుట నాకు తెలియును. వీనికి తోడు చర్మములు బాగుచేసినపిదప మిగిలిన తుమ్మచెక్క మొదలైనవియు చెడిపోయిన కర్రమున్నగునవియు చేర్చిన ఎంత కర్రరద్దు ఉండునో చెప్పలేము. ఇందులో కొంతభాగము వంటచెరకుగా వాడుచున్నారు. కాని సన్నని రంపపుపొట్టువంటిది వంటచెరకుగా వాడ వీలులేనిది సంవత్సరమున కెన్నియోమణుగులు వృథాపోవుచున్నది. ఇది వృథాపోవుట యటుండ కొన్నిస్థలములలో దాని పోయుటకు స్థలములేక చిక్కుపడుటయు ఎవ్వరైనను ఊరికె ఎత్తుకొనిపోయిన సంతోషించుటయు తటస్థించుచున్నది. రంపపుపొట్టు విస్తారము ఒకచోట కుప్పగా పోసి అశ్రద్ధగా వదలివేసినయెడల అగ్నిభయము గూడ గలదు. ఇట్టితరి పొట్టు మొదలగు కర్రరద్దును ఉపయోగించుమార్గము లేవైన దొరకినచో అవి కొంత మిక్కిలి ఆదరణీయము అని తోచుచున్నది. ఈముందుపుటలలో అట్టిమార్గములగురించి క్లుప్తముగ చర్చింతును. * 1. రంపపుపొట్టు సన్నముగ నుండుటచే సామాన్యపు పొయిలలో వంటచెరకుగ విరివిగ ఉపయోగించుటకు వీలు లేకున్నది. కాని ఇటీవల రంపపుపొట్టును కాల్చుటకు వివిధములగు పొయిలు కల్పింపబడినవి. వీనివలన విస్తారము పొట్టు స్టీముబోయిలర్లు వగైరాలకు వంటచెరకుగా ఉపయోగింపబడుచున్నది.

2. ఇంకను ఈపొయిల సదుపాయమువల్లనే రంపపుపొట్టు విరివిగా డిస్టిలేషనుకు గూడ ఉపయోగింపబడుచున్నది. దీనినుండి ఈ సదుపాయమువలన ఎసిటిక్ ఆసిడ్డు, ఆల్కహోలు, ఆసిటోను, కోల్‌గాసు, తారు, తారునుండి తీయు అనిలైనురంగులు మున్నగున వెన్నియో తీయబడుచున్నవి. కర్రనుండి స్టిలుచేసి తీయ వీలగు వస్తుసముదాయమును చూచినచో కొంత బోధపడును. కాన దాని నిక్కడ పొందుపరచుచున్నాను.




అమెరికాలో కర్రనుండి ఆల్కహోలు తీయుచుండుటచే ఇక్కడ అర్ధరూపాయ కమ్మేసీసా స్పిరిటు అక్కడ అణాన్నరకు అమ్ముచున్నారు. విరివిగా తయారుచేసినయెడల అర్ధణాకు అమ్మవచ్చు నని లెక్కలు కనబడుచున్నవి. స్పిరిటు చౌక అయినచో ఏమయ్యెడి దనుకొనువారు ఫ్రెంచిపాలిష్షు లన్నిటికిని లక్క స్పిరిట్ మూలమనిన్ని స్పిరిట్ ఖరీదు జాస్తియగుటచే ఇక్కడ పాలిషులుచేసిన కిట్టుటలేదనియు తెలిసికొనవగును.

3. రంపపుపొట్టును జిగురులతో కలిపి మరల కర్రచేయుట ఇదివరకు వినియున్న విషయమే. ఇది సహజమైన కర్రవలెనె అనేక పనుల కుపయోగపడుచున్నది.

4. రంపపుపొట్టును తుపాకిమందులో ఉపయోగించుట ఇంకను విరివిగా జరగుచుండలేదు గాని కొంతప్రయత్నము జయప్రదముగనె యున్నది.

5. రంగులువేయుటలో విస్తారముగ ఉపయోగపడు ఆగ్జాలిక్ ఆసిడ్ రంపపుపొట్టులోనుండి మాత్రమె తయారుచేయుచున్నారు.

6. ఫ్రాంసులో సిరాను ఒత్తుటకు ఇసుకకు మారుగ రంపపుపొట్టు వాడుదురు. సన్నపొట్టుకు రంగువేసి సువాసనకు అత్తరు కలుపుదురు.

7. సన్నని రంపపుపొట్టు మక్కుగా ఉపయోగింతురు.

8. గాజుసామానుల ప్యాకింగుకు రంపపుపొట్టు విరివిగా ఉపయోగపడును.

9. గుడ్లను భద్రపరచుటకును, ప్యాకింగు చేయుటకును ఊకకంటె పొట్టు ఎంతో మంచిది.

---

* ఈవిషయమున నింకను వివరముల గోరువారు— సూపరింటెండెంటు ఆంధ్ర ట్రేడ్సు ఇన్స్టిట్యూటు, 68 నాటుపిళ్లారికోవిల్ వీథి, చెన్నపురి—అను చోటునకు వ్రాయవలయును.

10. రంగులు వేసిన పిదప పెయింటుడబ్బాలు మొదలైనవి శుభ్రపరచుటకు పొట్టును ఉపయోగపరతురు.

11. మినరల్‌ఫోస్ఫేట్సు, పీటు, పొట్టు, తారు మున్నగు వానితో కలిపి కాల్చి గుండచేసి. దీనిని ఎముకబుగ్గికి మారుగ ఉపయోగపరచవచ్చునని మాక్సివెల్ లిట్ వ్రాసెను.

12. ఇది మంచి ఉష్ణప్రచారిణి (conductor of heat) కాకుండుటచే ఈ గుణమవసరమైన అనేకపనులలో దీని నుపయోగించు చున్నారు. మంచును నిలవచేయుటకు దీని ఉపయోగ మెల్లరకు తెలియును.

13. లినోలియం అను వస్తువు చేయుటకు కార్కుఁరద్దును అగిసెనూనెతో కలిపి అట్టలుగా పోయుదురు. ఈకార్కుఁరద్దుకు మారుగ రంపపుపొట్టును తిరగళ్లలోవేసి మెత్తగ నూరి వాడుచున్నారు. చౌక రకము లినోలియంకు బాగానే యున్నది.

14. కాగితము తయారుచేయుటలో ఫిల్లింగుమెటీరియల్‌గా రంపపుపొట్టును మెత్తగా విసరి ఉపయోగించుచున్నారు.

15. సిమెంటుపలకలతోను, కడపరాళ్లతోను చపటాలు చేయునప్పుడు క్రింద ఇసుకకు మారుగ రంపపుపొట్టు వాడవచ్చును. దీని వలన ఇల్లు వేడిమిగూడ నుండును.

16. రంపపుపొట్టును పిచ్చితో చేర్చి మంచి బలమైన ప్రెస్సులలో నొక్కిన కఱ్ఱవంటి వస్తువు తయారగును. దీనిని మామూలు కఱ్ఱవలె కోయవచ్చును. చిత్రిక పట్టవచ్చును.

17. పొట్టును ప్లాస్టరుఆఫ్ పారిసుతోగాని సిమెంటుతోగాని నీటితోగాని చేర్చి అట్టలుగా పోతపోయవచ్చును. ఇవి తేలికగాను బలముగాను ఉండును.

18. ప్లాస్టరు ఆఫ్ పారిసును పొట్టును చేర్చి బోయిలరుకు స్టీము గొట్టములకు ప్యాకింగుకు నుపయోగింపవచ్చును.

19. పొట్టును ఆస్ఫాల్టుతో కలిపి గోడలకట్టడములో నీరు పైకెక్కకుండుటకు ఉపయోగింతురు.

20. రంపపుపొట్టు, సర్వీసు, నీరు చేర్చి వుడ్‌సిమెంటు అను వస్తువును తయారుచేయుదురు.

21. ఇటుకలు చేయునప్పుడు మన్నుతో రంపపుపొట్టును చేర్చిన తేలికై సూక్ష్మమైన రంధ్రములు గల ఇటుకలు తయారగును. ఇవి ఉష్ణప్రచారిణులు కాకుంటచే ఈగుణము ప్రధానమగు పనులలో వాడుదురు.

22. మన్నుతో పొట్టును కలిపి దానిని బట్టీలలో బాగుగా కాల్చినయెడల నీరుమున్నగువాని వడగట్టుటకు ఉపయోగపడును. ఇందు కఱ్ఱబొగ్గు చేరియుండుటచే ఇది క్రిమిహారిణిగ గూడ నగుచున్నది.

23. పొట్టును తారుతో చేర్చినయెడల నీటిమయమగు స్థలములలో కట్టు ఇండ్లకు క్రిందవేసిన నీరెక్కకుండ చేయును. చాల్సవ్ ఆఫ్‌సల్ఫర్‌తో చేర్చిన రబ్బరువలె మెత్తనైనదిగను, ఆస్ఫాల్టుతోను అగిసెనూనెతోను చేర్చిన కొంచెము గట్టిదిగను ఉండి గోడలకు పూయుటకు పనికివచ్చును.

24. పట్టిగొట్టములు కాల్చునప్పుడు మధ్యమధ్య పొట్టువేసిన యెడల ఈపొట్టుకాలి దీనిలోని పదార్థములు గొట్టములు పీల్చుకొని కాటుకనలుపుగ తయారగును.

25. గోడల కంటించు కాగితము చేయుటలో ముఖమల్ కాగితము చేయుటకు రంపపుపొట్టు లేదా కఱ్ఱపిండి విస్తారముగా ఉపయోగింతురు.

26. చేతపువ్వులకు పుప్పొడికి మారుగ కఱ్ఱపిండికి వేర్వేరు రంగులు వేసి వాడుదురు.

27. పశువులశాలలలో రంపపుపొట్టు పరచిన పశువులకు వేడిగను మెత్తగను ఉండుటయె గాక పొలములకు మంచియెరు వగుచున్నది.

28. రంపపుపొట్టు ముక్కించి పేడమొదలైనవానితో చేర్చి మొక్కలకు దానిపాళంగాగూడ నుపయోగింపవచ్చును. ఇది ముక్కిన ఆకు చెత్తకంటె తేలికగా నుండును.

29. చిక్కనివస్తువులను గుల్లగా చేయుటకును బరువువానిని తేలికగా చేయుటకును రంపపుపొట్టు ఎంతయో మంచిది. బొగ్గుగాను శుభ్రపరచుటకు ఉపయోగించువస్తువులలో పలువురు శాస్త్రవేత్తలు పలువిధములుగ రంపపుపొట్టును విరివిగా ఉపయోగించుచున్నారు.

30. ఉక్కుచేయుటకు ఒకపద్ధతిలో ఇనుమును రంపపుపొట్టుతో చేర్చి కాల్చుదురు. పిదప దానిని ప్లంబగోమూసలలో కరగించుటకు గూడ పొట్టును విరివిగా వాడుదురు.

31. పొటాసియం సోడియం ఆసిటేట్లు తయారు చేయుటలో పొట్టు విరివిగ ఉపయోగపడును.

32. గోడలు కట్టుటకు సున్నమును ఇసుకకు మారుగా పొట్టుతో తయారుచేయుపద్ధతి గలదు.

33. పొట్టు, తారు, గుండు గంధకము, సున్నము కలిపి ఈముద్దను అచ్చులలో పోసి ఇంటికప్పులకు పెంకులుగా చేయుదురు.

34. బోయిలర్లలో ఉప్పునీటి వాడకమువల్ల పెంకుకట్టకుండగ పొట్టు, సోడా, పైనుకఱ్ఱబొగ్గు, రైపిండి, మన్ను కలిపివేయవచ్చునని మోర్టిలెటి చెప్పినాడు.

35. క్రోయిజాను, బ్రిటోనీరు రంపపుపొట్టు, పొట్టుపోయిన కఱ్ఱనుండి రంగులు తీయు పద్ధతిని కల్పించిరి. ఈపద్ధతి మిక్కిలి సులభము. పెద్ద యంత్రసామగ్రి అక్కర లేదు. శాస్త్రజ్ఞాన మవసరము లేదు. చౌక.

36. పొట్టు నీటిని పీల్చుకొను గుణము గలుగుటచే వర్షకాలములో ట్రాంకార్లలోను, మోటారుబస్సులలోను దీనిని చల్లుదురు. జారుడుస్థలములలో దీనిని చల్లిన మంచిది.

37. కగ్గిన వెండిసామానులనుతోముటకు పొట్టు నుపయోగింతురు. బీదికఱ్ఱపొట్టు బంగారము మెరుగుపెట్టుటకు ఉపయోగపడును. ఇండ్లలో దుప్పట్లు, తలగడాగలీబులు ఉదుకునప్పుడు రంపపుపొట్టుతో తోమిన అవి శుభ్రపడును.

38. ఆర్గోలోని స్మిత్‌కంసోలిడేటెడ్ కంపెనీవారు బొగ్గునలిసే గాక రంపపుపొట్టునుగూడ ఇటుకలుగా చేసి వంటచెరకుగా నుపయో

గించుటకు వీలుగా చేయుచున్నారు. ఈపనికై ఉపయోగించిన యంత్రములో ఒకయిరుసుకు మూడుఅచ్చులు తగిలించి యుండును. ఒక అచ్చులో సరుకుపడుచుండ ఒక అచ్చులోని పొట్టు గట్టిగా నొక్కబడుచుండును. మూడవ అచ్చులోని యిటిక బైటకు త్రోయబడుచుండును. ఇట్లు గంటకు 135 మణుగుల పొట్టును ఇటికలుగా చేయును. ఈ యిటికలు వంటచెరకుగా నుపయోగింపబడుచున్నవి. మూసినపాత్రలలో డిస్టిల్ చేసి, తారు క్రీసోట్ మున్నగు వస్తువుల తీయుటకును ఉపయోగపడుచున్నవి.

39. కాగితము, అట్టలుచేయుటకు పొట్టును చిన్న కర్రముక్కలను, పేళ్లను గుజ్జుగా మార్చుటకు యంత్రములు గలవు. కొంతపొట్టును గుజ్జుగామార్చి అట్టనుచేయుటకు పైనజెప్పిన ఆంధ్ర ప్రేశ్స ఇన్స్టిట్యూటులో పరిశోధనచేయబడెను. కొంచెము ప్రోత్సాహకరముగ నే యున్నది.

40. కర్రపిండిని పశువులకు ఆహారముగ నుపయోగించు పద్ధతిని వెండెంబర్గ్ కనిపెట్టెను.

41. రంపపుపొట్టు లోహపరిశ్రమలలో విస్తారము ఉపయోగించుచున్నారు. ద్రావకములలో నుండి తీసినవస్తువుల నారబెట్టుట కిది మంచిది. దీనితో తోమినపిదప అవి కగ్గవు. కొమ్ము, దంతము, తాబేటిచిప్ప, ఎముకలతో చేసిన వస్తువులను పదను ఆర్చుటకు పొట్టు చాల మంచిది. ఇత్తడి కంచు మొదలైనవానితో చేసిన వస్తువులకు మెరుగుబెట్టుటకు పొట్టు మంచిది. ఇందుకు పొట్టు బాగుగ ఆరి ఎంతమాత్రము తేమలేక యుండవలెను.

42. కర్పూరతైలము, రజానుఫ్యాక్టొరీలలోని రద్దుతో రంపపుపొట్టును చేర్చి చిన్న పుల్లలుగాచేసి నిప్పంటించుటకు ఉపయోగింతురు.

43. ఈవస్తువులనే కార్బొరండం, కాల్సియం కార్బైడు చేయుటలోగూడ వాడుదురు.

44. కొలదికాలములో మెండుగ నభివృద్ధిగాంచి రంపపుపొట్టు ఎంతదొరకినను హరించు కృషి పొట్టునుండి చక్కెర, ఆల్కహాలు తయారుచేయుట. ఇది యిప్పుడు అమెరికాలో ధారాళముగ పని జరుగుచున్నది.

పొట్టును ఉపయోగించుమార్గము లింక నెన్నియో గలవు. కాని కొన్ని అంత ముఖ్యమైనవిగావు. కొన్ని యింకను బహిరంగముకాలేదు.

పైనజెప్పిన వస్తువులలో చాలభాగము పొట్టుతోనే గాక ఏవిధమైన కర్రరద్దుతోనైనను తయారుచేయవచ్చును.

ఇచ్చట చర్మములు బాగుచేయు తుమ్మచెక్కను గురించి కొంచెము వ్రాయుట అప్రస్తుతము కాదు.

ప్రస్తుతపు పద్ధతులవలన చెక్కనుండి రసమంతయు వచ్చుటలేదు. బీటుదుంపనుండి చక్కెరరసమంతయు న్యూజెకబాకు పద్ధతి ననుసరించి ఫ్రాంసులో ఒకపద్ధతి ప్రచారములో నున్నది. దానివలన విస్తారము రసము తీయ వీలగుచున్నది. దానిని వివరించి యిచ్చట వ్రాయ స్థలము చాలదు. ఎవ్వరికైన అభిలాష గలిగినచో పైఇన్స్టిట్యూట్ సూపరెండెంటుకు వ్రాసిన తెలియును.

రసముతీసినచెక్కను పొలములలో ఎరువుగా నుపయోగింతురు. నారుమళ్లలో ఉపయోగించినచో వానికి కావలసిన వేడిమి నిలబడును. పూలమడులలో ఈచెక్కను మట్టిని కలిపివేసినచో కలుపు మొలవదు. భూమి గుల్లగా నుండును. వేసగిలోగూడ కొంత తేమగా నుండును. చెడుపురుగులు పట్టవు. చెట్లు శీఘ్రముగ పెరుగును. కొమ్మలు దగ్గర దగ్గరగా మొలచును. ఆకులును మొగ్గలునుగూడ బలముగ వచ్చును. వేరులుగూడ విస్తారముగ బలములుదేరును. చర్మములు బాగుచేసిన రద్దు విస్తారముగ పడుస్థలములలోని ముసలిచెట్లు మరల చక్కగ కాయుచుండుట ఎవ్వరైన గమనించి యుందురేమో. చెక్కరద్దు ఉపయోగించుటవలన మొక్కలలో కలుపుతీయు ఖర్చు తగ్గును. వేళ్లకు పురుగుపట్టదు. పెరుగుట పండుట అభివృద్ధినొందును. కనుక లాభము హెచ్చుగానుండును.

అమూల్యమైన యీ సంవత్సరాదిసంచికయం దెన్నియో వ్యాసములు ప్రచురింపవలసి యుండుటచే నావ్యాసమును అతివిపులముగ వ్రాయుట కవు చాలగు. కాని వీలైనకొలదిస్థలమున విషయమును తగువరకు స్పష్టపరచితి నని నానమ్మకము. వృథాపోవు కర్రరద్దునుండి ఎన్నెన్ని విలువగల పదార్థములు తీయవచ్చునో కనబరుపబడినది. ఇందులో కొన్ని సులభసాధ్యములు. కొన్ని కొంచెము కష్టసాధ్యములు. అన్నియు సాధింపయోగ్యములు. మన రసాయనశాస్త్రవేత్తలకు కొంచెమైన అభిలాష అనెడి అంకుర ముండెనేని వారు వీనిని సాధింపక విడువరు. జీవనోద్దేశము కేవలము ధనార్జనము మాత్రమె కాదు. క్రొత్తపనుల సాధించుట, క్రొత్తవస్తువుల కల్పించుట ' ఖ్యాతి గాంచుటయు న్యూనమైన జీవనాశయములు కావు. మన ఆంధ్రయువకులు తీరుబాటుకాలమును చిన్న లేబొరేటరీలో ఖర్చుపరచిన ఎన్నియో మంచి వస్తువులు తయారగుచుండును. వీరికి తోడుగా కొందరు ధనికులు రావలెను. మన ధనికులు షోకులకు ఖర్చుపెట్టు ధనములో 100కి 5 చొప్పుననైనను ఇట్టి సత్కార్యములకు వినియోగపరచినచో వారి పేరు ఎంతయో ఖ్యాతిగాంచును. దేశము ముక్తి గాంచును. ధనికులును శాస్త్రవేత్తలును కొంతపని చేయవచ్చు నని వ్రాసితిని గాని వీరు మత్సరులై యుండవచ్చు. అప్పుడుగూడ నేవ్రాసిన ఈవ్యాసము వృథపోవునని తలపను. రసాయనశాస్త్రజ్ఞానము లేనివారయ్యు డబ్బుసహాయము లేనివారయ్యు మనము ఖ్యాతి గాంచవలెను, దేశము నౌన్నత్యమునకు దేవలెను అను అభిలాష గలవారు ఎట్టెటో కష్టపడి ఎవ్వరెవ్వరినో సహాయము వేడి కేవలము కార్యదీక్షచే జయమొందగలరు. ఈవ్యాసమును జదివి దీనిలోని విషయముల విపులముగ దెలిసికొనుటకు కొన్ని గ్రంధముల జదివి పరిశోధనల జేసి జయమొంది ఆంధ్రమాత ఋణమును దీర్చుకొను భాగ్యశాలు లుందురు గాక.

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరు ల్విఘ్ననిహన్యమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధు ల్గావునన్.

# సంధ్యాన్వేషణము

శతావధాని వేదుల సత్యనారాయణ శాస్త్రి గారు

అంతరించెను పశ్చిమాశాంచలాంభోద, రాజిఁ బర్విన సాంధ్యరాగశోభ
చిందువారెను దిన శ్రీ కాలకుంతల, చ్ఛాయలోఁ ప్రబలవిషాదరేఖ
శాంతించె ద్విజరాజ సాంధ్యగీతికలందు, కడసారి గాద్గదిక ప్రశస్తి
తడవాయె తలఁగి వాత్సకలోలధేనుకా, వారంబునందు హంభారవంబు

గీ. కలిగ ప్రేయసీ సల్లాప కాంక్ష కొంత
దోహనోత్సుక గోపసందోహమందు
శ్యామికా గోకులమున నీ జాడ లేదు.
స్రుక్కి యెటనుంటి వోయి కిశోరమూర్తి!

ఉ. త్రోపుడులాడు కార్మొయిలు దొంతరచేత తమాలపాదప
వ్యాపితమైన గోకులవనాంతర మంతయుగూడ, శ్యామికా
స్థాపితమయ్యె నీయడుగు జాడలు గానఁగరావు తోడి గో
గోపకులన్ దిగన్విడిచి గోపకిశోరక! యెందుఁ బోయితో!

ఉ. తీయని వాయుపూరణగతిన్ నును బుగ్గలు బూరటిల్ల హా
హ్లాయితమై జగంబులు కరంగగ మోహనవేణుగానముం
జేయుచు బర్హిపింఛ నవ నృత్యము జూడమి నీపవాటికా
చ్ఛాయలు విన్నబాటు గొనసాగ నెటేగితో! శ్యామసుందరా!

ఉ. మేలములాడు తెమ్మెరలమించి వినీలకళిందజా సరి
త్కూలతరంగమాలికలు గూడ భవత్ప్రణయ ప్రశాంత గీ
తా లలితానురాగ రసతత్పరతన్ దురపిల్ల శ్యామికా
వేళ నెటేగితోయి! వనవీథుల నొంటిని గోపబాలకా!

ఉ. కోమల వల్లికావృత నికుంజతలంబులయందు శాద్వల
శ్యామలభూములందు సువిశాల తమాల మహీజవాటికా
రామములందు శీతలతరంగ నిషిక్త నదీతటోపల
స్తోమములందు నీయునికిదోఁప దెటేగితో! శ్యామసుందరా!

ఉ. కెందలిరాకు జొంపముల గీతికలందు విషాదరాగముల్
చిందులువారె స్నిగ్ధలవలీలతలన్ హిమబాష్పసంహతుల్
కొందలపెట్టె పూఁబొదలలో వలపుంబొగ గ్రమ్మె తీవలన్
సందడి గొల్పసాగె యదునందన నీ వెట కేగినాఁడవో!

ఉ. తావులఁ జిమ్ముమంజుల ల।తాంతచయమ్ములనుండి జిమ్మునం
గ్రేవల జాఱు తేనియల।రీతిని తీయగ హాయిగా చవుల్
జీవకళల్ దొరంగు ముర।ళీ మృదు గానరవంబు లేమి బృం
దావని శూన్య మయ్యె యదు।నందన! నీ వెటకేగి యుంటివో!

చ. పొదుగులఁ జేపు పాలు గొనఁ। బోవక పచ్చిక ముట్టఁగోర కె
ల్లదిశల శూన్యవీక్షణము।లన్ నిగుడించుచు నే విషాదమో
యెదవినయట్లు ఱిచ్చవడి। యున్నవి మోముల వ్రాల్చి లేఁతయా
గదుపులు నీవు గన్పడమి। కాన నెటేగితి వోయి గోపకా!

ఉ. వ్రేలెడు మావికొమ్మల న।వీన కిసాలయ పీఠి నెక్కి యు
య్యాలల నూగు కోయిలల। యామని వేడుక పాటలున్ విషా
దాలసతాంకితంబులయి।నట్లు వినంబడుచుండె నోయి గో
పాల! తమోవిలీన వన।పాంథుఁడవై యెట కేగి యుంటివో!

గీ. సగము కొఱికిన దర్భపో।చలను విడిచి
హృదయ నిర్వేదమున లేడి। కొదమ లెల్ల
దెసలఁ బరికించు సాకూత। దృష్టి నిపుడు
మురళి వినరాని హేతువే।మో యటంచు.

ఉ. లాలనఁ జేసి పూవు జెలు।లన్ చిగురాకుల జొంపమందు ను
య్యాలల నూచి బాలమల।యానిలుఁడున్ భవదార్ద్రగీతికా
శ్రీ లలరింపమిన్ ప్రణయ। శీకర గర్భిత దుఃఖవీచికాం
దోళితుఁడై చలించును య।దుప్రవరా! యెట కేగితో గదా!

గీ. మేచకాంభోద పటల చుం।బితము లగుచు
దరుల నొరసెడి సెలయేటి। తరగలందు
వలపు చికిలించు తేటపా।టల యెలుంగు
మలయ దది యేమొ! కృష్ణ।కుమార! యిపుడు.

ఉ. చామనచాయవాఁడు జల।జంబుల నేలెడు కన్నుదోయి ప్రే
మామృత మొల్కు వాడు మకు।టాంచిత బర్హమువాఁడు ముంగురుల్
బ్రామిన నవ్వుమోముగల। బాలుఁడు ముద్దులు మూటగట్టు మా
కోమల వేణుగాన రసి।కుండు గనంబడఁ డేమి పాపమో!

ఉ. గోవుల మేపుచున్ సుమని।కుంజమునీడల విశ్రమించి యి
చ్ఛావిధి వేణుగానమును। సల్పుచు నీవలరింప ధన్యయా
యావని నొక్కతీవనయి। యేల జనింపకపోతి నంచు, చిం
తావివశాత్మయౌ చరణ। దాసికి గన్పడవేల మాధవా!

# గౌతమి స్వీయ చరిత్రము.

[కరుణార్ద్ర మగు చిన్న కథ]

రాయసము వేంకట శివుడు గారు. ఎమ్. ఏ., ఎల్. టీ.

**బాల్యావస్థ**

నేనెక్కడ జనించితినో నాతలిదండ్రు లెవరో నాకుఁ దెలియదు. నా చిన్ననాఁటి దినములు జ్ఞప్తికిఁ దెచ్చుకొనునప్పుడు- ఉన్నతమైన కాయమును తెల్లని ముఖకాంతియును గల యొక కుక్కయాకారము స్ఫురించుచుండును. స్తన్యపానము చేయుచు దానివెనువెంటనే నేను దుముకుచుఁ బోవుచుండుట నాకుఁ దోఁచుచుండును. కాని యానాఁటి సంగతులు వివరముగను వరుసగను నేను పేర్కొనఁ జాలను. పిమ్మటఁ గొంత కాలమునకుఁ దటస్థించినవి మాత్రమే నేను గుర్తెఱుఁగుదును.

ఒకానొక దినము నేను వాయువేగముతో గ్రామములో నొక క్రొత్త వీథిని బరుగెత్తి పోవుచుంటిని. ఇరుపార్శ్వముల నుండియు నపుడు కుక్కలు నన్ను ముట్టడింప సాగెను. నేను వానిని లెక్కసేయక- పిక్కబలము చూపి పోసాగఁగా నా దేహమంతయు గాయములతోఁ గప్పఁబడెను. శత్రువుల గోళ్లగీఱలును - పండ్లకాటులును- దిగి నాశరీరమునుండి రక్తధారలు సెలయేళ్లవలె ప్రవింపసాగెను. కాని యింతటితో శునకసమూహమునకు మత్సరము శమింపలేదు. అలసట చేతను బాధచేతను గొంతవడికి నేను నేలఁ బడితిని. కుక్కలు చుట్టును జేరి నన్నింకను బాధింపఁ జొచ్చినవి. ఒకటి చెవి పట్టిలాగును. ఇంకొకటి తోఁక పెఱుకును. వేఱొకటి కాలు కొఱుకును. ఇటు లుండఁగా గుభాలునఁ బెద్ద శునక మొకటి యెచటినుండియో వచ్చి నా గొంతును బట్టుకొనెను. అంతటితో నాకు స్మృతి తప్పిపోయెను. మరణ మాసన్న మయ్యె నని తలంచితిని.

కాని కొంతసేపటికి నాకు స్మృతి కలిగెను. మృత్యుదేవత యపరావతార మనఁదగు ఆపెద్ద శునకమువానినుండి నన్నెవ్వరు తప్పించిరో ఎంతకాలము నేను స్మృతిలేని యవస్థయం దుంటినో నాకుఁ దెలియదు. కాని యిపుడు నేనొక నిశ్శబ్దమగు చావడియం దుంటిని. నాశరీరము నందలి గాయములకు మందు, దట్టముగఁ బూయబడి యుండెను. అప్పుడప్పుడు వయసుమీరిన యొక మనుజుఁడు వచ్చి నాముఖమును నిమురుచు, తన కన్నులనుండి రాలు బాష్పములను తుడుచుకొనుచు నాబాధను శమింపఁజేయఁ జూచుచుండును. ఇట్లాయన వచ్చి నా కుపచారములు చేయునపుడెల్లను నేను దోఁక నాడించుచుందును నాకు దగ్గఱగఁ జాఁపబడిన యాతని హస్తమును నాకుచుందును. ఆపత్కాలమునఁ గనిపెట్టినవారే కదా నిజమైన తలిదండ్రులు! అమి బాధచే నహర్నిశము నేను గనులు మూసికొని మూలుగుచున్నను ఈయన వచ్చి నాచెంత నుండునపుడు మాత్రము నాబాధకుఁ గొంత యుపశమనము గలుగుచుండును.

**మిత్రులు**

ఆయింట నుండునది నా రక్షకుఁడగు నీపురుషుఁడు గాక యింక నిరువురు మాత్రమే. వారు ఒక వృద్ధస్త్రీయును. ఒక బాలికయును. నాకు గంజి పోయునపుడు మాత్రమే యవ్వ వచ్చుచుండును గాని, బాలికమాత్రము తన తండ్రి యగు నారక్షకునితో వచ్చి నన్ను పలుమాఱు సందర్శించుచుండును. మొట్టమొదట నన్ను సమీపింప నామె వెఱచుచుండినను, అంతకంతకు నే ననిన గోఁత వెఱపులు లేక, తండ్రివలెనే నాకు సాహాయ్యముఁ జేయుచుండును. జ్వర తీవ్రతవలన నా కాఁకలి నశించి యాహార మసహ్యమైన యాదురవస్థయందు నాకుఁ దిరిగి భోజనమం దిష్టము కలిగించిన మహనీయురా లీమెయే. చిఱునవ్వుతో నలంకరింపఁబడిన యీమెవదనపద్మము నాకన్నులయెదుటఁ దోఁచిన తోడనే నాబాధకుఁ దీక్ష్ణత తగ్గుచుండును. ఈమె చిన్నిచేతులు పోయు గంజి యెంతో మధురిమఁ దాల్చియుండును. నాయం దపరిమిత మగు దయ గలిగి యాబాల రొట్టెముక్కలు మిఠాయి మొదలగు సూడిదవస్తువులు దెచ్చి నాజిహ్వకుఁ దిరిగి చైతన్యము గలిగించెను. ఆబాలిక దయాపూర్వకముగ నా కిచ్చుచుండు ముద్దుపెట్లకు లెక్కలేదు. ఆమె నాయెడలఁ జూపించిన కరుణయును ప్రేమయును నే నెన్నఁడును మఱచి పోఁజాలను.

ఇట్టి గృహస్థుల దయయే కారణముగా నేను బునర్జీవము నొందితిని. నానాఁట నాగాయములు మానిపోయెను. శరీరమునకుఁ గ్రొత్త నెత్తురు పట్టెను. సోయగ మిగిరించుచుండ నే నంత గ్రామములో రాకపోకలు సేయుట కారంభించితిని. మావీథిని గల శునకము లన్నియు నా బలమును జూచి నన్ను మన్నింపసాగినవి. ఏయుపద్రవమును లేక నేను మావీథిలో నిచ్ఛావిహారము సలుపుచుందును. పగలంతయును గ్రామములోని రాచకార్యములను చక్కపెట్టి రాత్రిపూఁట నిలుసేరుచుందును. అంత నత్యాదరముతో నారక్షకు నింట నా కాహార మిడుదురు.

**దినచర్య**

ఆకాలపు నాఁటి నాదినచర్య నాకు జ్ఞప్తిలో నున్నది. వేకువనే నేను నిద్రనుండి లేచునప్పటికి నారక్షకుఁడు లేచి గ్రంథకాలక్షేపము చేయుచుండును. అంత నే నాయనదగ్గఱకుఁ బోఁగా ఆయన నాదేహము నిమురుచు, "ఇఁకఁ బోయిరా!" యని పలుకుదురు. వారి యనుజ్ఞగైకొని నేను వీథిలోనికిఁ బోయి గ్రామవ్యవహారములు చక్కఁబెట్టుచుందును.

వీథిసంరక్షణము శునకజాతికి విధికృతమైన కార్యము. గ్రామము లోని ప్రతి వీథియును బ్రత్యేక శునకసమాజ పరిపాలనమునకు లోనయి యుండును. వీథిలోనికిఁ గ్రొత్తవా రెవరును రాఁగూడ దనునది మాసమాజపు మొదటి నిబంధన. ఇది మాత్రము మానవులయెడఁ బూర్తిగ వర్తింపఁజేయుట మాకు సాధ్యము గాదు. కావుననే మానవు లిన్ని యనర్థముల పాలగుచున్నారు. కాని మా విధి మేము నెఱవేర్చుకొను చుందుము. క్రొత్తమనుష్యుఁడు గాని క్రొత్త వేషము ధరించినవాఁడు గాని వీథిఁ బడఁగనే, మేము మొఱుఁగుచుందుము. ఇంకొక వీథికుక్క కానఁబడఁగనే మేము మొఱుఁగుచు దానిని ముట్టడింతుము. అది పారిపోయి తప్పించుకొనినఁ గాని దాని పరువు నిలువదు. అది తోఁక ముడుఁచు కొనినచో ఇంక దానివంకఁ బోము. వీథిలోనుండి పిల్లులు మొదలగు క్షుద్రజాతిజంతువులను బాహాటముగ మేము నడవనీయము. వన్యమృగము లేవైన దూరమున నుండఁగనే మేము పసిపట్టి ఆజాడ లూరివారికిఁ దెలియునట్లుగ బొబ్బ లిడెదము. ఒక్కొకసారి రాత్రులు మాకన్నులకుఁ బగ లెన్నఁడును గానరాని వికృతాకారములు పొడసూపును. వెంటనే మేము ఆకాశమువైపునకుఁ దలయెత్తి పొలికేక లిడుచుందుము. వీథిలో నుండు కుక్కలన్నియు నొక్కపెట్టున నేడువఁగా నాయాకారములు పటుమాయ మగును! ఏదో యొక కాలమునందు తప్ప సామాన్యముగ శునకజాతివా రందఱును నిరంతరము మిత్రతతో నుందురు. ఊసు పోనపుడు మేము చెరలాటములతోను, కృత్రిమపుఁ బోరాటములతోను గాలము గడపుదుము.

ఇటువంటి బయటి పనులు చక్కపెట్టుకొని నే నిలు చేరి యజమానుని దగ్గఱకుఁ బోఁగా నపు డాయన ప్రేమము ఉట్టిపడునట్లుగ నా శరీరమును స్పృశించును. తోఁక యాడించుచు ఆయనచేతిని నాఁకుచు "కుయ్యో" యని మొఱుఁగుచు నాయనయెడల ననురాగము నగపఱచుచుందును. అంతట ఆయన స్నానమొనర్చి భోజనమునకుఁ బోవును. ఆసమయముననే యవ్వ నన్నుద్దేశించి, "గంజిమూఁకుడు తెచ్చుకొమ్ము" అని పలుకును. నే నపుడు దొడ్డిలోనున్న మూఁకుడు దెచ్చుకొందును. దానిలో నాకుఁ గావలసిన యన్నమును గంజియు నైతురు. అది భుజించి, తిరిగి మూఁకుడు యథాస్థానమునఁ జేర్చి చావడి మీఁద నేను విశ్రమింతును.

మధ్యాహ్న సమయమున నేను యజమానుని జేరరాదు. ఈనిర్బంధముయొక్క యర్థము మొట్టమొదటి దినములలో నాకుఁ దెలియక, నామీఁద యజమానునికిఁ గోపము వచ్చెనా యని తలంచుచు వచ్చితిని. కాని, అంతకంతకు, ఆయన నిష్ఠాపరుఁ డనియును, భోజనానంతరమున నను స్పృశింప నొల్లఁ డనియును నేను గుర్తెఱిఁగి, జాగరూకతతో నే నాయనకు దూరముగనే తిరుగుచుందును. అవ్వగారిని నే నెపుడును సమీపింపనే కూడదు. నా యజమానుని కొమార్తె యగు "మీనాక్షి" కిని నాకును జెప్పనలవిగాని మైత్రి. ఆమె యిల్లు విడిచి యెచటికిఁ బోయినను తిరిగి యిలు సేరువఱకును నే నామెను వెంబడించుచుందును. ఆమెచెలికత్తెలమీఁదికి నే నెన్నఁడును పోవువాఁడను గాను. కాని దుష్టు లెవరైన నామెకుఁ జెడుగు చేయఁజూచినచో నిఁక వారి కర్మము మూఁడినదే. "గౌతమీ!" యనునామె పలుకు నా కెంత దూరమున వినవచ్చినను కనుఱెప్ప గీఁటునంతలో నేను మీనాక్షిదగ్గఱకుఁ బోయి చేరుదును. ఆహా! ఆమెముద్దుపలుకులకును ఇతరులమాటలకును ఎంత వ్యత్యాసము గలదు! నాహృదయమునకు మీనాక్షికంటెఁ బ్రియతరమగు వస్తు వేదియును గానరాదు. ఆమె నాబహిఃప్రాణమే.

శునకజాతిజంతువు నగు నాకు మానవుఁ డగు నా యజమానుని యూహాపోహాలు కష్టసుఖములు నేమి తెలియఁ గలవు? ఐనను నేను

**యజమానుడు**

బగటిపూఁట చావడిమీఁదఁ బండుకొని యుండునపుడు సదా కనులాయన వైపునకే త్రిప్పి ఆఁయనముఖావలోకనము చేయుచుందును. ఆయన మితభాషి. నైష్ఠికుఁడు. గ్రంథకాలక్షేపమునందును ధ్యానమునందును గాలము గడపుచుండును. ఆయన యాలోచనల విషయములు నాకు దుర్గ్రాహ్యములైనను, అవి యుత్కృష్టమైనవని మాత్రము నా దృఢవిశ్వాసము. ఆయనయాజ్ఞలను జవదాఁటకుండుటయే నాముక్తి. ఆయనయభిమతము నెఱవేర్చుటయె నాకు మోక్షము. అట్టిమహనీయుని వాక్కులనే నిదానముగఁ జేసికొని ఆయనకనుసన్నలనే మెలఁగవలె నని నాయుద్యమము. కావున శునకజాతిచర్యలందు నాకు వాంఛ క్రమముగఁ దగ్గసాగెను. ఒక్కొకప్పుడు కొన్ని దినములవఱకును నేను తోడిశునకములను దర్శించుటకు వీథిలోని కడుగైన నిడను. నాయజమానుని ముఖమునందు నిమేషనిమేషమునకును గానవచ్చెడిమార్పులను బరికించుచుందును. అర్థము బోధపడకున్నను ఆయన చదివెడి సంగతులు వీనులార వినుచు నేను బుద్ధికుశలతఁ జాల్చి యుందును. నా కాయనయం దున్న పెత్తి విశ్వాసమున పరమోత్కృష్టములైన వని యాయనచర్యల నే ననుకరింతును. ఆయన నెలకు రెండుపర్యాయము లుపవసించును. నేను నట్టుల చేయుటను అలవఱచుకొంటిని. ఒక్కొక్కతటి ఆయన రాత్రిపూఁట భుజింపకుండను. నేను నపుడు భుజింపనొల్లను. నాయందు జాలిగొని అట్టి సమయములందు యజమానుఁడు భుజింపుమని నన్నెంత ప్రేరించినను నే నాఁగింపను.

ఇట్లు దినములు మాసములు వత్సరములును గడచిపోయెను. మీనాక్షి నాకన్నులయెదుటనే పెరిఁగి పెద్దదయ్యెను. అంత నాయెజ

**మీనాక్షితో నేఁడు బాటు**

మానుని యింట నొక గొప్ప యుత్సవము జరిగెను. ఎందఱెందఱో యతిథులు వచ్చిరి. అందఱు క్రొత్తవారగుటచేత వారియెడల నేను ద్వేషబుద్ధి వహింప మొదట నుద్యమించినను మీనాక్షికిని నా రక్షకునికిని హాని తలంపకుండుటచే నేనూరకుంటిని. పల్లకిలో మీనాక్షిని నొకయువకుని నెక్కించి యూరేగించునపుడు నేనును చెలికత్తె సంరక్షణకై వారితో నూరేఁగి యింటి కామెను సురక్షితగఁ గొనివచ్చుచుందును. ఇంకవఱకును ఉపదంతములు శాంతతతోనే జరిగినవి. కాని ఒకానొకదినము మీనాక్షిని బల్లకిలో నెక్కించి వారందఱు గ్రామాంతరముఁ గొనిపోవ సమకట్టిరి. ఆసమయముననే నా యజమానుఁడు దేహస్వస్థత

లేకపోవుటచే మంచముమీఁదఁ బడియుండుట తటస్థించెను. తాను పోవునపుడు బాలిక కంటఁ దడిపెట్టెను. తండ్రికిఁ గూడఁ గన్నీరు క్రమ్మెను. అట్టి సమయమున నాచెలికత్తెను వారు పల్లకిలోఁ గూర్చుండబెట్టికొని పోసాగిరి. ఆహా! నాకిఁక దీనియర్థ మంతయు బోధపడినది. ఆద్రోహులు మొదట మిత్రులవలె వీరియింటఁ ప్రవేశించి పిమ్మట బాలికను గొనిపోవ నుద్యమించిరి! ఇది మీనాక్షికిని దండ్రికిని దుస్సహముగ నున్న దనుటకు వారిదుఃఖమే నిదర్శనము. కష్టకాలమున స్వామికార్యము మఱచిన సేవకుని ప్రయోజన మేమి? కావున నేను వేగముగఁ బల్లకి మోచుకొని పోవు బోయలకాళ్ల కడ్డము వచ్చి- వారిని దక్కిన వారిని- గఱవ మొదలిడితిని. అంత వారిలో నాకుఁ బెద్ద కయ్య మయ్యెను. వారిచేతులనుండి మీనాక్షిని విడిపింపలేకపోయినను, తుదకు నేనామెను విడువకయైన నుండవలెనని నాకుఁ బట్టుదల కలిగెను. కాని యింట వ్యాధిగ్రస్తుఁ డగు యజమానుఁ డేమగునో యని మనస్సు ఉయ్యేలవలె నిటునటు నూఁగెను. యజమానునిమీఁద మనసు తిరిగినపుడు వెంటనే నేను మీనాక్షిని విడిచి యింటికిఁ బోవుదును. యజమానుఁ డింట భద్రముగ నుండుటఁ గాంచి సంతుష్టిఁజెంది ఇఁక మీనాక్షిని గాపాడవలయు నని యచటికిఁ బరుగు లిడుదును. ఇటు లెన్నియో సారు లిటు నటు నాదినము పరుగెత్తుచుంటిని. నాసందడిలో నే నిటు లుండఁగా దూరపువీథికిఁ గ్రొత్తగ వచ్చిన పెద్దకుక్క యొకటి ఒక సందునుండి నేను మఱలుచుండఁగా న న్నాకస్మికముగఁ బట్టుకొనెను. దాని నోడించుటకు నాకు శక్తియున్నను యుద్ధముచేతఁ గాలహరణ మగుననియును ఇంతలోఁ బల్లకి మోచువారా బాలను గొనిపోదు రనియును నేను బలాయనమైతిని. అదుష్టశునకము మాత్రము నామనసు గ్రహింపక నేను బిఱికిదాని నని భ్రమఁజెంది, నా వెన్నుమీఁది కంప గట్టిగఁ గొఱికివైచెను. అప్పటికిని నేను స్వామికార్యమును విడువక బాధ కెటులో సహించి పోతిని. ఇంతలో మీనాక్షిపాలకి చాల దూరము పోయెను. నాకు ఆమె కానిపింపలేదు. అంత నేను విఫలమనోరథనై యిలు సేరితిని.

**మీనాక్షి గానఁబడుట**

ప్రియమిత్రమగు మీనాక్షిని బాసి నే నిఁక నెట్లు జీవింపఁ గలను? ఐనను రోగపీడితుఁడగు యజమానుని పడకను దివారాత్రములు నేను గనిపెట్టుకొనియున్నాను. ఆహారమనిన నా కిపుడు వాంఛ లేదు. కోయి కంటి కొకకునుకైనఁ బట్టదు. యజమానుఁ డెంతయొత్తిచెప్పినను నే నాహారము భుజింపలేదు. శరీరము మనసు గూడఁ బెద్దకొలిమిలోఁ బడి మండుచున్నట్లు తోఁచుచున్నది. ఇటులుండ నీ ప్రాతఃకాలమున వాకిటఁ బల్లకిమ్రోఁత వినవచ్చుచున్నది! ఎవరో బాలిక యొకతె నా కన్నుల కగపడుచున్నది. ఆహా యీమె మీనాక్షియే! ఆహా ఏమి నాపుణ్యము!!

[మీనాక్షికొఱకుఁ బనవి పనవి, ఆమె క్రొత్తగ నత్తవారింటనుండి రావేగమె చూచునపు డానందపరవశయై గౌతమి యాకస్మికముగ మరణము నొందె నని యింటివారు చెప్పుచున్నారు. గౌతమి వెన్నుమీఁద నొక పెద్దపుండు ఉండుట గనిపెట్టినది మీనాక్షియే. వ్యాధిగ్రస్తుఁ డగు మీనాక్షితండ్రి యిన్నాళ్లు నిది చూడనేలేదు. కాని గతించినదాని కిపు డెవరేమి చేయఁగలరు? ఆదిన మాగృహము రోదనధ్వనులతో నిండెను. ఎట్టకేలకు మీనాక్షి తండ్రి ధైర్యము తెచ్చుకొని- గౌతమి శునకజన్మ మెత్తినను ఋజుమార్గమున నడుచుకొనుటచే నది పుణ్యపురుషునివలెనే యుత్తమలోకప్రాప్తిఁ జెందు నని నిర్ధారణచేసి - దానికి దహనసంస్కారాదిక్రియలు గావించె నని తెలియవచ్చుచున్నది—కథకుడు.]

# సమరతృష్ణాగీతము

దువ్వూరి రామిరెడ్డి గారు

సంగరతృష్ణచే । స్వాంతంబు రగులఁ
బటు దురాశావేశ । పారవశ్యమున
నధికారదాసులై । యవనిఁ బీడించు
మనుజసంతతులార । కనికరము లేక
బలహీనజాతులఁ । బట్టి చంపెదరు
దేహంబు నలుపైనఁ । దెలుపు పసుపైన
నాత్మబంధులు గారె । యఖిలజనంబు?

కామంబు క్రోధంబు । గర్వంబు జాతి
దేశంబు భాష యు । న్దెరలు చింపంగ
సర్వసామాన్యమై చను । మానవత్వ
మొక్కటీరునఁ గాక । యున్నె వేర్వేఱ?
మానవరక్త సం । భార విక్రయము
గావించు నక్రైస్తు । ఘాతుకులార
విజయమదిరాపాన । వీతచిత్తమున

నేల పావనమూర్తి । నేసు మహాత్ము
మఱియొక్కమారు క । ర్మాగారపంక్తి
చిమినీలపై కీడ్చి । సిలువ వేసెదరు?

* * * *

నిస్సహాయయు దాస్య । నిగళబద్ధయును
నగు నమాయికజాతి । యస్థిపునాదిఁ
గనకమందిరములఁ । గట్టుచున్నారె ?
యాలపోయెడి వారి । యుడుకు నిట్టూర్పు
విసరదేమీ చితి । వేడిమంటలను ?
సొంత యక్కఱకన్న । నెంతో యెక్కుడుగ
వస్తుల నిర్మించి । వాని వెలపుచ్చ
జనసంఘముల బాని । సలుగఁ జేయుదురె ?
యిట్టి యన్యాయ్య మిం । కెంత కాలంబు
అవునుగా దనకుండ । రవులుకొనఁగలదు?

* * * *

ఐశ్వర్యవంతుల । యఱచేతి ఫలమ !
కష్టజీవులపాలి । కంఠపాశంబ !
ఓనాగరకత ! నీ । యున్నతాదర్శ
మిదియెయై యుండిన । నింకఁ జాల్చాలు;
మానవహృదయమ్ము । మంటవెట్టుకును
చీఁకట్లఁ బెనుగాలిఁ । జిమ్ము తెక్కలను
భూతలముం గప్పి । పొదుగంగఁ బోకు
కాలకూటజ్వాల । గ్రక్కు సర్పముల
వాణిజ్యదేవతా ! । వాయుసామ్రాజ్య
మందుఁ జరించు మా । యలమంత్రకత్తె
అతిదురాశాతృషఁ । బతితులౌ జనుల
బంగారుపావలకుఁ । బట్టి బంధించి
కొండలం గానలఁ । గోనల గుహాల
నింటను మంటను । వెంట జీతాడ
నీడ్చికోఁబోయెద । వేమి నీమహిమ !

* * * *

నీపాదచిహ్నాల । రాపాడి వచ్చు
సంగరపశుశక్తి । చచ్చిచావకయ
యాత్మకృతాపరా । ధాంకమై నిలిచి
బహుళ పశ్చాత్తప్త । బాష్పపూరములఁ
దన మనోవికృతుల । దాహంబు దీర్చు
శాంతి నానాజాతి । సమితి చేకూర్పఁ
జాలునే చిత్తముల । సలసలఁ గ్రాఁగు
పాషాణరసములు । పైకిఁ బొంగంగ ?
సమరపరాజిత । శత్రువర్గముల
కొల్లద్రవ్యముఁ బంచు । కొనువేడ్కఁ బెద్ద
భాగంబులకుఁ బోరు । "పరమసౌహార్ద
చక్రవర్తుల" కేల । శాంతిపీడనము ?
ఖండాంతరంబుల । కపటనాటకము!
కాల మెప్పటికైనఁ । గనికరము లేక,
నీముసుంగును జీల్చి । నిజరూపుఁ జూపు

* * * *

భావిసంగరముష్టిఁ । బట్టుపడనీక
జగతినిఁ గాపాడ । సకలదేశముల
కవిమహాశయు లొక్క । కట్టు గావలయు.
ఇదియె నా స్వప్నంబు; । నిదియె నాయాశ
కలయు నిక్కం బగు । కాలంబు రాదె?
ఓకవివరులార! । యోజగదేక
శాంతిదాయకులార ! । సర్వజనీన
సేవాసమాసక్త । చిత్తాబ్జులార !
అల్లదే దర్శింపుఁ । డవతరించెడిని

* * * *

ఆధ్యాత్మికయుగంబు । నానందమఖము
జ్ఞానమహోమాగ్ని మీ । కరదీపికలను
వెలిఁగించి జండాలు । వినువీథి నెగుర
సఖిలమానవహృద । యధ్వంసి కీట
కములకుఁ దల్లియౌ । కఠినదురాశ
సమయింప సంగ్రామ । సన్నద్ధు లగుఁడు

* * * *

అదిగో దివ్యాహ్వాన । మభ్రమున వినుఁడు
నిభృతశాంతకుటీర । నీడముల నుండి
కవికోకిలములార ! । గగనంబు గనుఁడు
ఎంతవిశాలమై । యెంత గాంభీర్య
రామణీయకమున । రాజిల్లు నదియొ !
లేలెండు తఱియిదే । లెండు సఖులార !





త్వరగా లోపల ప్రవేశించుటయందును, మండుటయందును మిక్కిలి ప్రసిద్ధిచెందినది. చదునైన మాదిరికిని, త్వరగా వెనుకకు తిరుగకుండుటకును ప్రసిద్ధికెక్కినది. సులభముగా కాల్చుటయందు దీనికి సమాన మైన తుపాకి ఏదియును లేదు. ఒంటినాళము, రెండునాళములు గల శ్రేష్ఠమైన ఇంగ్లాండు, అమెరికా దేశముల తుపాకులు, పిస్తోళ్లు అనేకరకములలో కలవు. మిక్కిలి హెచ్చుగు వేగము వాటి అంతట అవియే మారునట్టి ఏర్పాటుగల తుపాకులు మరి యే దుకాణమునందును దొరకవు.

ఇవి అన్నియు ఎల్లప్పుడును ఈ దిగువ తెలుపబడిన కంపెనీలో చాల చౌకగ దొరకును.

## ఎన్. వి. రామానుజంశెట్టి కంపెనీ (స్థాపితము 1863 సం॥ రం)

## ఆరమ్సు అండు అమ్యూనిషన్ వర్తకులు, నెం 12, బ్రాడ్వే, మద్రాసు.

## వసంతకుసుమాకరము

ఇందు బంగారు, వెండి, అభ్రకము, ముత్యములు మొదలగు భస్మసంపుటిచే తయారుచేయబడినది. దీని గుణము జగద్విఖ్యాతమయి యున్నది. మేహరోగములను ఖండించుటలో శ్రేష్టమయినది. అతిమూత్రమును రూపుమాపును. సమస్తజ్వరములు, శ్వాసకాసలు, క్షయలు, ఉన్మాదము, పాండువు, శూలలు, శుక్లనష్టము, శిరరోగము, నపుంసకత్వము, స్త్రీల ఋతువువ్యాధులు, మూత్రవ్యాధులు, అత్యుష్ణ ప్రాబల్యము, నిశ్శక్తి, అమ్లపైత్యము, సర్వపైత్యములు మొదలగు అనేక వ్యాధులను నిర్మూలము గావించును. మూత్రమువెంట పోవు శుక్లనష్టమును కట్టును. రక్తవృద్ధిని కలిగించును. మిక్కుటమగు వీర్యవృద్ధిని, సంభోగశక్తిని, బలమును, యౌవ్వనమును, కాంతిని, సంతానప్రాప్తిని, కలిగించు వరప్రసాదము. వెల స్వల్పము.

తులం 1-కి రు 15-0-0. 20 మాత్రలు రు 3-8-0

### పూర్ణ చంద్రోదయము

అన్ని వ్యాధులకు శ్రేష్ఠయౌషధము

తులం 1-కి రు 12-0-0    20 మాత్రలు రు 2 8-0

వి. పి. చార్జి ప్రత్యేకము

## పి. శి. ఏ. అండు కంపెని,

ఆయుర్వేద సమాజ్, పెరిదెపి, నెల్లూరుజిల్లా.

## మీ పొలమునుండి

### ఎక్కువ లాభమును సంపాదించుడు

కిర్లాస్కర్ నాగళ్లతో మీ భూములను మిక్కిలి లోతుగా దున్ని, కృషి చేసిన తప్పక ఎక్కువ లాభమును పొందెదరు.




ఇట్టివి ప్రస్తుతము 80000 నాగళ్లకంటెను అధికముగా ఉపయోగములో నున్నవి. దున్నుటకగు వ్యయము కంటెను మిక్కిలి తక్కువే యగును. అయితే లాభము అధికమగును. మీరు ధనవంతులగుటకు మిక్కిలి సహాయకారిగా నుండును. నేడే దాని వివరములకై వ్రాయుడు.

**KIRLOSKAR BROTHERS, Ltd.**

**KIRLOSKARVADI,**

DIST. SATARA, INDIA,




# పాళ్యపు వేంకటాచల పండితులవారి
# లోకోపకార కస్తూరిమాత్రలు
## శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

మద్రాసు బ్రాంచీలు: 183, చైనాబజారు, ఆనందభవనముదగ్గిర. 331, తంబుశెట్టివీధి

ఈ మాత్రలు ఉత్తమమైన కస్తూరి, కుంకుమపుష్పము, పచ్చకర్పూరము, మున్నగు హెచ్చు వెలగల పదార్థములచేతను, వీర్యవంతములగు, శుద్ధములగు, గుణకారులగు మూలికలచేతను, చేయబడుచున్నవి. ఆక్షేపకరమగు ఏ వస్తువు కాని చేరలేదు. ప్రతిదినము ఈ మాత్రలు 2, 4, తాంబూలములో గాని, కట్టినోటిలో గాని, సేవించుచు వచ్చిన నోరు నిండా సేపు వాసనగా నుండుటయేగాక ఎట్టివ్యాధిని రానీయదు. జఠరాగ్ని మందము, జలుబు, దగ్గు, క్షయము, శీతవాతము, వివిధజ్వరములు, పళ్లనొప్పి, అజీర్ణము, మలబద్ధము, కడుపుబ్బరము, కడుపునొప్పి, తలనొప్పి, పిల్లలజ్వరములు, ఈడుపు, మాంద్యము, అజీర్ణము, అజీర్ణభేదులు, శీతవాయువు, మున్నగు రోగములను గుణపరచి శుద్ధరక్తమును వృద్ధిజేయును. బాలింతలకు సంజీవిని వంటిది. 250–300 మాత్రలుగల బుడ్డి 1–కి ధర రు. 0–4–0 మాత్రమే.

తమంతటతామేపంపిన వేనవేలు యోగ్యతాపత్రములనుండి కొన్నిటిని మాత్రమే యీక్రింద ముద్రించియున్నాము

1 మ. డాక్టరు ప్రభాకర్ ఫెలో ఆయుర్వేదిక్ యూనివర్సిటి గ్రాడ్యుయేట్ ఎన్ వై ఇన్‌స్టిట్యూటు ఆఫ్‌సైన్సు యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా ఏ ఎల్. ఎక్స్ శానిటరీ ఇన్‌సిట్యూటు లండను కన్‌సల్టింగ్ కెమిస్టు, ఎగ్జామినర్, నెం 2, బొంబయి, వీరు వ్రాసియుండునది. తమ లోకోపకార కస్తూరిమాత్రలను ఉపయోగించినవారిలో ప్రత్యేకముగ శ్వాసోచ్ఛ్వాసముల వ్యత్యాసము, అజీర్ణము, మలబద్ధము, ప్రక్కలనొప్పి, కడుపునొప్పి, దినజ్వరములు, పిల్లల యీడుపు, వాయువులన్నియు గుణమై యున్నవి.

2. మ. వి. ఎన్. అచ్యుతరావు సివిలియను, సర్జను, మరియు శానిటరి కమిషనరు మైసూరు గవర్నమెంటు, వీరు వ్రాసియుండునది తమచే తయారుచేయబడిన లోకోపకార కస్తూరిమాత్రలను, నేనుపయోగించి యున్నాను. ఈ మాత్రలు చాల గుణకరముగ నున్నవి.

3. మ. కే. కే. విశ్వాసు కవిరాజ్, కష్టహర డిస్పెన్సరి 9–41 వీధి, బొక్లేబజారు, రంగూన్; బర్మా, వీరు వ్రాసినది. తమ లోకోపకార కస్తూరిమాత్రలు నాకును నాకద్దరు రోగుల రోగులకును సంపూర్ణమైన తృప్తి నిచ్చినవి.

4. మ. మాధవరావు సదాశివ జోషి, ప్లీడరు, అమరావతి, బీరార్ వీరు వ్రాసినది. లోకోపకార కస్తూరిమాత్రలు బాలింతలకు చాల మేలుచేసియున్నది. తొందరగా 25 సీసాలను పంపగలరు.

5. మ. లాల్ సింగు, మిాథే సబు అసిస్టెంటు సర్జను, సిరోహి రాజపుటానా వీరు వ్రాసినది. లోకోపకార కస్తూరిమాత్రలను నేను ఉపయోగించుచున్నాను. చాల గుణకరముగనున్నది. మరి 12 సీసాలను పంపవేడెద.

6. మ. సి ఎన్. మాధవరావు అసిస్టెంటు సూపరింటెండెంటు ఎలమనేరిపోస్టు, చిత్తూరుజిల్లా లోకోపకార కస్తూరిమాత్రలందు సంపూర్ణమైన గుణములన్నియున్నవని తమకు సంతోషముతో తెలియజేసెదను.

మా ఔషధశాల దివ్యౌషధములలో కొన్నిటిని యీ దిగువ తెలిపియున్నాము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| తాపశమనోదిని (జీర్ణజ్వరములకు) | 64 పొట్లములు ప్యాకెట్టు రు | 1–0–0 | మహాభృంగామలక తైలం (శిరోవ్యాధులకు) | 4 ఔన్సు సీసా | 0–8–0 |
| గోరోచనమాత్రలు (భేదిమందు) | సీసా 1–కి | 0–6–0 | | 8 ఔన్సు | 1–0–0 |
| బాలసుఖోదయం (తియ్యనిమందు) | 4 ఔన్సు సీసా | 0–12–0 | దంతోజ్వలచూర్ణం. | టిన్ 1–కి | 0–2–0 |
| వాతగజకేసరిలేహ్యం (సర్వవాయువులకు) | 24 తులం టిన్ | 2–0–0 | అశ్వగంధ రసాయనం (రక్తపుష్టికి) | 24 తులముల టిన్ | 1–8–0 |
| శ్వాసకాలేశ్వరం (ఉబ్బసము క్షయములకు) | 24 తులం టిన్ | 1–8–0 | మహాసౌభాగ్యశొంఠి (బాలింతలకు) | 20 తు | 1–0–0 |
| భావనజీరక రసాయనం (పిత్త, అజీర్ణములకు) | 24 తులం టిన్ | 1–[illegible]–0 | సుగంధపాలవెల్లి వరబత్తు | 12 ఔన్సు 1–0–0 6ఔన్సు | 0–8–0 |
| కృష్ణగాజర రసాయనం (ధాతువర్ధనకారి) | 24 తులం టి | 2–[illegible] | శివాకాంత తైలము (సుఖభేదిమందు) | సీసా | 0–8–0 |
| నారికేళాంజనము (నేత్రవ్యాధులకు) | సీసా | 0–6–0 | దద్రుమహాహారిణి (సకల తీటలకు పామలకు) | | 0–4–0 |
| బాధాపహారిణి (అన్నినొప్పులకు) | | 0–6–0 | వైశ్వానరాసవం (కలరాకు) | 4 ఔన్సు సీసా | 1–0–0 |
| లోలామృతమాత్రలు (సెగరోగములకు) | సీసా 1–కి | 0–12–0 | వ్రణాంతకలేపము (వ్రణములకు పైన రుద్దుటకు) | | 0–8–0 |
| సారస్వతాసవం (బుద్ధిప్రసాదిని) | 6 ఔన్సు సీసా 1–కి | 1–0–0 | భూనింబారిష్టము (పాలజ్వరములకు) | 6 ఔన్సు సీసా | 1–0–0 |
| కాసకేసరి (సాధారణమైన దగ్గులకు) | 4 ఔన్సుల సీసా 1–కి | 1–0–0 | మండూరాదిరసాయనం | 24 తులములు | 2–8–0 |

ఇంకను అనేక సిద్ధక్రియలగు మందులున్నవి. అన్నిమందులకును ప్యాకింగు పోస్టేజి ప్రత్యేకము.

# ప్రస్తుత విద్యావిధానము

పోణంగిపల్లి వరహాలు గారు

జీవితములో మానవుని లక్ష్యము సుఖసంపాదనము. ఆసుఖము కేవల మైహికమై యుండుటయే గాక ఆముష్మిక మగునప్పుడే పూర్ణతఁ జెందును. జ్ఞానములేనిది శాశ్వతసుఖము మృగ్యము. జ్ఞానముకలవాడే సంతుష్టుఁ డగును. సంతుష్టికలవాడే నిత్యసుఖము కలవాఁడు. అట్టి జ్ఞానసంపాదనమునకు విద్య సాధన మగుచున్నది. కాబట్టియే విద్య ఇహపర సాధనము.

విద్యవలనను వినయంబు వినయమునను
బడయు బాత్రత పాత్రతవలన ధనము
ధనమువలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక సుఖము లందు నరుడు.

విద్యాభ్యాసము వివిధదేశములలో నాయాదేశ మతాచారములను బట్టి వేర్వేఱువిధానములపై బాలురకు గఱపఁబడును. ఒకదేశముయొక్క యౌన్నత్యము రాజకీయముగాగాని నైతికముగాగాని ఆధ్యాత్మికముగాగాని చాలవఱకు ఆదేశములో బాలురకు గఱపబడు విద్యపై నాధారపడియుండును. ప్రకృతము మనదేశములోనున్న విద్యావిధానము విదేశీయము. మనదేశమును ప్రస్తుతము పీడించుచున్న బీదఱికము బానిసత్వము పరాధీనత దౌర్బల్యము చాలవఱకు ప్రస్తుతవిద్యావిధానముచే గల్గినవి. కనుక ఈ విధానమున గలిగిన గొన్ని లోపములను ఇట వివరించెద.

విద్య యనగా కేవలము భాషాజ్ఞానము కాదు. జ్ఞానసంపాదనము, భాషాశకటమధిరోహించి జ్ఞానగమ్యస్థానమునకు జేరవలయును. కాఁబట్టి భాష జ్ఞానసంపాదనమునకు నిమిత్త మగుచున్నది. అట్టిచో మనకు నేర్పబడుచున్న భాష - మతములోగాని ఆచారములోగాని సాంప్రదాయములలోగాని నాగరకతలో నేమాత్రము పోలికలేని పరులగు నాంగ్లేయుల భాష. ఈభాషను మనము బలవంతముగా నేర్చుకొనుచున్నాము. పరభాషను నిర్బంధముగా నందఱును నేర్చుకొని తద్ద్వారా జ్ఞానమును సంపాదించుటలో నమూల్యమైన మనకాలము చాలవఱకు వృథగా వ్యయపఱచుచున్నాము. అట్లనుటలో నింగ్లీషు భాష నేర్చుకొనగూడ దనుట కాదు. ఏలయనఁగా లోకమాన్యతిలకు నుడివినట్లుగా దేశభాషలో సులభముగా నేడు లేక యెనిమిది సంవత్సరములలో నేర్చుకొనగల్గిన విద్యను పరభాషయైన యాంగ్లభాషలో నేర్చుకొనుటకు ఇరువది లేక యిరువదైదేండ్లు వ్యయపఱచుచున్నాము. ప్రస్తుతవిద్యాలయములలో, మతవిషయికజ్ఞానము నుపదేశించుట లేనేలేదు. దీనికిఁ గారణము మనపాలకులయొక్కయు మనయొక్కయు మత మొక్కటి కాదు.

మనదేశములో నున్న విద్యావిధానమును గూర్చి చెన్నపురిలో శ్రీ వివేకానందస్వామి ఒకమా రిట్లు నుడివిరి. "ప్రకృతము మీరు నేర్చుకొనుచున్న విద్యవలన కొంతమేలుగల్గినను, అంతకంటెను కీడు అధికముగా నుండుటంబట్టి ఆ మేలు ఆ కీడుగుఱఁ బడిపోయినది. మఱియు నావిద్య ఉత్తమగుణముల నొసగునది కాదు. ఉన్నమతిని సైతము పోగొట్టునదిగ నున్నది. అది మన కనావశ్యకమైనదానిని వృద్ధికిఁ దెచ్చుచున్నది. బాలుడు బడికిపోయినవెంటనే నేర్చుకొనుచున్నక్రమ మీక్రిందివిధముగ నున్నది --ఒకటి తండ్రి మూర్ఖుడు. రెండు తనతాత అప్రయోజకుడు. మూఁడు తన ఆచార్యుడు వేషధారి. నాలుగు వేద మబద్ధము. అయిదు అన్నివిధముల నాంగ్లమాదర్శప్రాయము- అని నేర్చుకొనుచున్నాడు. ఇట్లు చదివి పదునారవయేట దుర్బలుడై సర్వ మసత్యము అనెడిశూన్యవాదమునకు సంసిద్ధుఁ డగుచున్నాడు. కాఁబట్టియే ఈవిద్య ఒకశతాబ్దిగా నభ్యసింపబడుచున్నప్పటికిని మనదేశమందంతటను నొక్కఁడేని స్వతంత్రబుద్ధికలవాడు లేకయున్నాడు. స్వబుద్ధికలవారు కొందఱుండు రేని వారు ఇతరస్థలములందో లేక సద్గురువులయొద్దనో నేర్చినవారే కాని ప్రకృతము సర్వవ్యాప్తమై యుండు నాంగ్లవిద్యవలన కాదు."

ఇక రాజకీయవిషయమైన జ్ఞానము అసలేలేదు. ప్రస్తుతవిద్య బానిసత్వమును పెంపొందించుచున్నదియే కాని స్వాతంత్ర్యబుద్ధి నణుమాత్రమైనను గలిగించుట లేదు. మనకు అత్యవసరమైన మతవిషయికజ్ఞానము రాజకీయవిషయములు కార్మికవిద్యలు మొదలగువానివిషయమై తలపెట్టరు. ఇంతియకాక ప్రస్తుతవిద్యాలయములలో నేర్పుచున్న చారిత్రకవిషయములు చాలవఱకసత్యములు. భారతజాతియొక్క సత్యమైననాగరకత ఆధ్యాత్మికోన్నతి శిల్పకళానైపుణ్యము భారతవీరుల ప్రతాపధైర్యస్థైర్యములు జ్యోతిషముఆయుర్వేదవైద్యము వీనినిగూర్చి తలఁపనైన తలఁపరు. పఠనీయగ్రంథము లన్నియును పాశ్చాత్యనాగరకతతోను సాంప్రదాయములతోను పాశ్చాత్యవైవాహికాచారములతోను వారి స్వదేశవర్ణనములతోను గృహవర్ణనలతోను నిండియుండును. పాశ్చాత్యగౌరవములు వేషభాషలు మున్నగువానియందు నిర్బంధముగా భారతయువకులు బుద్ధిని లయింపజేయవలసివచ్చుటచే స్వధర్మనిరసనమును పరధర్మాదరణమును గలుగుచున్నవి. పఠనీయగ్రంథముల మార్పువిషయమై మన మెంత గట్టిగ- పట్టుపట్టి- మొఱబెట్టినను- అవియన్నియు నరణ్యరోదనము లగుచున్నవి. ప్రభుత్వమువారు వానినిమార్చుట కిష్టపడరు. పెడచెవిని పెట్టి బుట్టదాఖలా చేయుదురు. కాని మార్పు చాల అవసరము. దానిని పాలకులుపేక్షించినను ప్రజల పట్టుదలవలననైనను స్వప్రయత్నముచే, మన దేశపుటాచారముల కనుగుణముగా విద్యావిధానములోఁ బూర్తిగ పునర్నిర్మాణము కావలయును. మార్పు చెందనిది విద్యాలయములకు పోగూడదు. దేశము నానాటికిని- కడుంగడు- హీనదశకు పాలగు

చున్నది. దరిద్రదేవత దేశమందు నలుగడలను చెలరేగి విజృంభించుచున్నది. భారతీయుల సహజప్రతాపధైర్యస్థైర్యతేజము లడుగంటుచున్నవి. వృత్తులు నశించుచున్నవి. అధర్మము సమస్తవిధముల పెంపొందుచున్నది. స్వయంసహాయము లేదు. ఇంక మన కిపు డున్నవి దౌర్బల్యము- పరాధీనత- ఇంతే.

పైని వివరింపబడిన అన్యాయము మన మెన్నిసారులు చర్విత చర్వణముగా చాటినను లాభ మేమి? అది పోవుమార్గ మన్వేషించుట కర్తవ్యము. కాబట్టి రెండవ ప్రహ్లాదుఁ డనదగు గాంధిమహాత్ముఁడు ఎలుగెత్తి భారతయువకుల కీ సందేశము నిచ్చుచున్నాఁడు. వినుఁడు.

ఉ. బాలకులార రండు మనప్రాయపు బాలురు కొంద ఱుర్విలోఁ
గూలుటఁ గంటిరే గురుడు క్రూరు డనర్థపథంబునందు దు
శ్శీలత నర్థకల్పనముచేసెడి గ్రాహ్యముకాదు శాస్త్రమే
మే లెఱిఁగించెదన్ వినిన మీకు నిరంతరభద్ర మయ్యెడిన్.

—ఆంధ్రమహాభాగవతము

జాతీయవిద్య అనుటతోడనే జాతీయ మనుపదమున కేమర్థ మీయవలయునో ప్రప్రథమముననే తెలుపవలసియున్నది. జాతీయము అనుటతోడనే విదేశమునకు విరుద్ధము. ఏవిద్య- మన మతమును ఆచారములను సాంప్రదాయములను స్వధర్మమును వెనుకటి ఔన్నత్యమును జాతీయాశయములనుగూర్చి సర్వతోముఖముగవృద్ధిబొందించునో యది జాతీయవిద్య. ఇప్పుడు మనము చదువుచున్న ఆంగ్ల పుస్తకములు వారి ఆచారములను వారిచరిత్రలను వారిపరాక్రమములను వారి శక్తిసామర్థ్యములను వారి వాణిజ్య పారిశ్రామిక రాజకీయతంత్రములను వారివేషభాషలను తెలుపునే కాని మన బాలురకు మనసమీపమున జరుగుచుండు విషయములనుగూర్చిగాని జరిగినవిషయములను గూర్చిగాని వారి సమీపమందున్న వస్తువులనుగూర్చిగాని అపాత్తములలోనుండవు. ఎల్లప్పుడును పాశ్చాత్యపరాక్రమసంస్మరణముచేత స్వీయపరాక్రమమును మఱచి స్వయంసహాయమును వారు విడిచిపెట్టుచున్నారు.

భవిష్యజ్జాతీయవిద్యావిధాన మిదమిత్థ మని స్థిరపఱచుటకై పూర్వకాలమునందు మనదేశమునం దెట్టి విద్యాభ్యాస ముండెడిదో- విద్యాదానమే ఆదర్శముగా గల యెట్టి గురువులు- గురుభక్తి యుండెడిదో- ఎట్టి శిష్యవాత్సల్య ముండెడిదో- మన మొకసారి జ్ఞాపకమునకు తీసికొని రావలసియున్నది. ఎట్లు శిష్యుడు బ్రహ్మచర్యము నవలంబించి గురుశుశ్రూష నొనర్చి తర్కమీమాంసాది శాస్త్రములను అభ్యసించుచు ఆధ్యాత్మికవికాసమును పొందుచుండెడివాడో మనము స్మరణయం దుంచుకొనవలయును. బాలుర విద్యాభ్యాసకాలమున నవీన నాగరకసౌకర్యములు లేకున్నను చెట్లక్రిందనే ఋషికుటీరములయొద్దనే యాడంబరరహితముగ నెట్లు విద్య నభ్యసించుచుండెడివారో ఎట్లు గురుశిష్యులు ప్రేమపాశాబద్ధులై యుండెడివారో, జ్ఞాపక ముంచుకొనవలయును. ఆవిద్య ప్రస్తుతవిద్యవలె నొక్క మేధాభివృద్ధికేగాక, ఆత్మవికాసమునకును తోడ్పడుచుండెడిదో ఆవిషయముకూడ మనము జ్ఞప్తియం దుంచుకొనవలయును. ఈమాట కర్థము—పూర్వ ముండునట్టివిధానమే కావలయును గాని అన్యము వద్దనుట కాదు. కాని కాలానుసారముగ మానవజాతిపరిణామమునుబట్టి విధానములు మార్పుచెందుచుండును. అట్టి మార్పు యేజాతియొక్కగాని ముఖ్యోద్దేశమునకు భంగకరముగ నుండ కూడదనియే. వాణిజ్యము నభివృద్ధిచేసి కేవలలాభేచ్ఛతో పరదేశముల కేగి తద్దేశజులవంచించి పరరాజ్యాక్రమణముచేయుటకు కాదు. మానవజాతి కల్యాణమునకు భంగకరములు అపాయములు అగు యంత్రములు విష వాయువులు కనిపెట్టుట వారిలక్ష్యముకాదు.

ఈ మన దేశమునందేకదా "మానవు డెట్టివాఁడు? ప్రపంచ మెట్టిది? మానవుడు జననమునకుపూర్వము మరణానంతరమున నేమగుచున్నాఁడు? అను తత్త్వవిచారము గలిగి తుదకు దేవుఁ డొకడు కలడు. పరబ్రహ్మము సత్యస్వరూపమైనది. జ్ఞానాత్మకమైనది. అంతములేనిది. శాంతమైనది. మంగళస్వరూపమైనది. అద్వితీయమైనది పరిశుద్ధమైనది. భగవంతుడు సర్వవ్యాపియును శాశ్వతుడును స్వప్రకాశుడు సృష్టిస్థితిసంహారకర్త నిర్వికల్పుడు నిరంజనుడు నిశ్చలుడు నిర్వికారుడు అవాఙ్మానసగోచరుడు సర్వసాక్షి. ఆత్మ నాశనరహితమైనది" అను తత్త్వజ్ఞానోదయము మొట్టమొదట మనభరతఖండవాసజ్ఞానులకే గదా గలిగెను. జ్ఞానభానూదయము ప్రాగ్దిశ నుదయించి పశ్చిమఖండములను ప్రకాశింపఁజేయును. ఇచ్చటనుండియే జ్ఞానవాహినులు జ్ఞానబలములేని దేశమునకు ప్రవహింపవలసియున్నవి. భరతఖండపు ముఖ్యలక్ష్యమగు ఆధ్యాత్మజ్ఞానాభివృద్ధికి భంగకరము లగు విధానములు దీనికిపనికిరావు అయితే పూర్వమువలె దేశములోసంతఃప్రపంచముయొక్క జ్ఞానము విశేషముగా గలిగియుండుటకు సంస్కృతభాష ప్రాముఖ్యముగ నేర్పవలెను. హిందువుడైన సంస్కృతమును- మహమ్మదీయుడైన నరబ్బీ భాషయును- తమతమ మతవిషయికజ్ఞానమును పూర్తిగా గలిగియుండుటకు తప్పక నేర్చుకొనవలయును. రాజకీయముగా దేశములో వివిధభాషలను మాట్లాడు పలుతెగలవారి నైకమత్యముగా నుండుటకు హిందీభాష రాజభాషగా నుండవలయును. మనదేశములో స్వరాజ్యము స్థాపించుటకు పూర్వము హిందీని ప్రతిభారతీయుఁడును నేర్చుకొని యుండవలయును. దేశము రాజకీయముగా స్వతంత్రతతో నుండుటకు మనవిద్యావిధానములో హిందీభాషను-ఆధ్యాత్మికజ్ఞానోన్నతికి సంస్కృతభాషను- ప్రతిభారతీయుడును నేర్చుకొనుచు, భారతీయులకు భగవన్నిర్ణీతమైన ప్రాచీనజ్ఞానసందేశమును అచిరకాలముననే ప్రపంచమునకంతకు వెల్లడించు భాగ్యమును భగవంతుడు మనకనుగ్రహించునుగాక!

# గంగాఘోషము

గుండిమెడ వేంకట సుబ్బరావు గారు

త్రిభువనారాధ్యులౌ । దేశభక్తుల కెల్ల నిర్జరాశీర్వాద।నిస్స్వనంబు
కపటదేశద్రోహ । గజయూథముల పాలి, ఘోరసింహేంద్రని।ర్ఘోషణంబు
సమదశాత్రవలోక।సంహారధీరులౌ, క్షాత్త్రశూరులకు సం।గ్రామభేరి
పరమతద్వేషులౌ । పాపకర్ములపాలి, భీభత్సయమభటా।న్వేషణంబు
గీ. పరమపూజ్యులౌ వంశపా।వనుల కెల్ల, మధురవాగ్జాలకుశలసం।భాషణంబు
సాధుకంటకబహుళదు।స్తంత్రలోక, భీషణంబు గంగానదీ।ఘోషణంబు

గీ. ముప్పదియు మూడుకోటుల। పుత్త్రకులను, గాంచియును గొడ్డువోతివే। కన్నతల్లి
ఏటి కూరక యిట్టుల ఘో।షించెదమ్మ, నిన్నుగనువార లింక నెం।దున్నవారు ?

సీ. నిజసహోదరకోటి। నెమ్మేని రక్తంపు, టేర్లు హోరున ప్రవ।హించునాఁడు
పగరచేతులఁ జిక్కి। ప్రాణభయార్తయై, పాంచాలకన్య ఘో।షించునాఁడు
అకలంకభరతరా।జ్యకుమారి బాష్పప్ర, వాహముల్ పరియలై। పారునాఁడు
అధికారదర్పదా।వాగ్నిహోత్రము జేగి, కన్నతల్లిని కాల్పఁ। గడఁగునాఁడు
గీ. కంటవీక్షించుచును దోమ।గఱచినట్లు, లైన లేక యథారీతి। నలరుచున్న
ఘోరపాషాణకఠినాత్మ।కులము తల్లి, నీమృదులఘోషణంబు మా। కేమిలెక్క

సీ. దశరథరాము సు।త్రామురాజ్యప్రభల్, కఱవు తీఱఁగఁ గాంచి। మురిసినావు
శ్రీహరిశ్చంద్రు సు।స్థిరసత్యదీక్షఁ గ, న్నారఁ గాంచెడు భాగ్య। మందినావు
ప్రకట పాండవధార్త। రాష్ట్రసంగ్రామంబు, కంటఁ జూచి విముక్తిఁ। గాంచినావు
విశ్వధూర్వహుఁడైన। విశ్వేశ్వరునకు న, ర్ధాంగివై యెంతో యు।ప్పొంగినావు
గీ. అట్టి నీయట్టి భువనత్ర।యైకధన్య, కిమ్మహాఘోరపాపకూ।పమ్మునందు
నిలువఁ జనదమ్మ, యిటనుండి। తొలఁగుమమ్మ, హరిపదాంభోజవల్లి ! గం।గామతల్లి !

శా. మానశ్రీహరణాభిలాష నరమాం।సాహారమత్తంబులై
సానల్ దీరిన భూతకోటు లిట సం।చారంబుఁ గావించెడున్;
కానన్ యోగ్యవు పూజ్యమానవవు గం।గా! సుంత మానంబుపై
ధ్యానం బుంచుము ఇంక నేన్ దొలఁగి పో।మ్మా యన్యలోకార్థివై !

# జాతివ్యవస్థ

కావ్యతీర్థులు బంకుపల్లి మల్లయ్యశాస్త్రి గారు

బ్రాహ్మణాది జాతివ్యవస్థ సృష్ట్యాదిగనే వచ్చుచున్నదని కొందఱు కొంత సృష్టి ప్రవర్తించిన తరువాత నీవిభాగము వచ్చినదని మఱికొందఱును, ఎప్పుడైతే నేమి జన్మతోడనే జాతి ప్రారంభము గాదు జన్మాంతరము గుణకర్మానుగుణముగ జాతివ్యవస్థ యేర్పడినదని యొకకొందఱును, కాదు కాదు జన్మతోటిగనే జాతిజాతి యని యొక కొందఱును నీజాతిని చర్చించుచున్నారు. నేనిప్పుడు స్మృతులను బట్టి చర్చించిన నెట్లు తేలునో యాసంగతిని వ్రాయుచున్నాను. అందు ముఖ్యములు మను యాజ్ఞవల్క్య పరాశరస్మృతు లని పెద్దలు వ్యవహరించుటచే వానిలోని విషయమునే సంగ్రహించితిని. స్మృతుల యభిప్రాయమని చెప్పునదే కాని యిదియే నాయభిప్రాయమని కాదు. దీనిని బట్టి కాదనియు ననుకోరాదు. ప్రకృతమున జాతి యనుపదము పాణిని శాసనము ననుసరించి జనుధాతువునుండి పుట్టినదని చెప్పక తప్పదు. దానికి ప్రాదుర్భావ మని యర్థము. ప్రాదుర్భావ మనఁగాఁ బుట్టువు. మఱి యేవ్యాకరణమును ఈ యర్థమును బ్రతిఘటింపదు. ఈ ధాతువు స్మృతియందుఁ దఱుచుగ—

"ముఖబాహూరుపజ్జానాం పృథక్కర్మాణ్యకల్పయత్"

అనుచోట పజ్జానాం అనుపదమునందును, అపరవర్ణజః—అనుస్థలమునను,

"స్వజాతిజానన్తరజా షట్సుతా ద్విజధర్మిణః"

అను తావునను ప్రయోగించినాడు. ఇట్లే మఱికొన్ని యెడల గనుపట్టుచున్నది. కావున జన్మ ననుసరించియే జాతకర్మాదిసంస్కారములు ప్రవర్తిల్లును. కాని యిచ్ఛికముగఁ బ్రవర్తిల్లవు.

"తథాన్యాజ్జాత ఆర్యాయాం సర్వం సంస్కార మర్హతి"
(మను. అ 10, శ్లో 68-69)

'ఆర్యునివల్ల నార్యస్త్రీయందు బుట్టినవాఁడే సంస్కారములకు నర్హుడు' అని చెప్పుటవల్ల జన్మనుబట్టి జాతియును జాతిననుసరించియే సంస్కారములు ననితోఁచక మానదు. ఇట్లు కాఁగా సంస్కారార్హులు ఆర్యులే యనియును ననార్యులు సంస్కారానర్హు లనియును గావచ్చును అట్లయినప్పుడు ద్విజు లార్యుల నియు నితరుల నార్యులనియును ఫలితము కావచ్చును. అయితే యార్యునకు శూద్ర (అనార్య) స్త్రీయందు బుట్టినవాఁడును, అనార్యునకు నార్యస్త్రీయందుఁ బుట్టిన వాఁడును సంస్కారార్హులు కారు. గాని యిందు మొదటివాఁడు మాత్రము గుణోత్కృష్టుఁడని చెప్పెడు. దీనిమీఁది—

"శ్లో. జాతో నార్యామనార్యాయా మార్యా దార్యో భవే ద్గుణైః"

అనుదానిని బట్టి యార్యశబ్దము శ్రేష్ఠవాచకమై యనార్యశబ్దము నికృష్టపర్యాయమై యుండఁగ మీఁద ద్విజాద్విజవాచకముగఁ జెప్పుట సంగతము కాదని యాక్షేపింపవచ్చును. అది సత్యమే. కాని "గుణై రార్యః" అనుటచే బీజప్రాధాన్యము ననుసరించి యార్యగుణములు సంక్రమింపవచ్చును. కాని జాతిచే నార్యుఁడు మాత్రము గానేరఁడు. అట్లు కాకున్న వీని కేల సంస్కార మర్హము కాకపోయెను? తల్లిదండ్రులిద్దఱును ఆర్యులే యయినప్పుడు మాత్రమే సంస్కారార్హత కలదని యేల చెప్పును? ఈవిచారణచేఁ దాత్పర్యము బ్రహ్మక్షత్రవైశ్యభేదమున నార్యులు ద్విజులను నామాంతరమున వ్యవహృతు లగుచున్నారని.

దీనిపై మఱియొక యాక్షేపము. ఆర్యునకు ఆర్యయందు బుట్టినవానికే సంస్కారార్హత కలదే గాని యితరులకు లేదనుట- బీజప్రాధాన్యమంగీకరించినపుడు ఆర్యునకు ననార్యస్త్రీయం దుద్భవించినవాఁ డసంస్కార్యుఁ డని యనుట - యెట్లు సంగతము లగును? అంగీకరింపలేదందుమా! బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందుఁ గన్యకపుట్టె యది తిరిగి బ్రాహ్మణునే పెండ్లాడఁగోరిన దానిసంతతి పుత్త్రికలను బ్రాహ్మణులకే యిచ్చుచుండఁగా నయిదవతరమునఁ గాని యేడవతరమునఁ గాని పుట్టినవాఁడు బ్రాహ్మణుఁ డగునని యెట్లు చెప్పినాఁడు.

దీనికి సమాధానము—బీజప్రాధాన్యము నంగీకరించి క్షేత్రమునకు మాత్రము తత్సంపర్కమునఁ గొన్ని తరములకు గుణోత్కృష్టత నంగీకరించి సంస్కారార్హజాతిమత్త్వము స్మృతులలో నంగీకరించియున్నారు—అని. కావున ద్విజపురుషులకు ద్విజస్త్రీలయం దుదయించినవారు వెంటనే సంస్కార్యులని, ద్విజేతరస్త్రీలయందు ఉద్భవించినవారు స్మృత్యుక్తక్రమమునఁ గొన్నితరములకు ద్విజులు కాఁగలరని, ద్విజేతరులకుఁ బుట్టినవారు బీజప్రాధాన్యముచేతను స్మృత్యనుగ్రహము లేకుండుటచేతను ద్విజులు కాలేరని తేలిన ఫలితము.

ఇది యిట్లుంచి మఱియొకతీరున మీఁది శ్లోకమును విచారింతము. "ఆర్యో భవే ద్గుణైః" అనుచోట గుణము లనఁగా—తపశ్శౌచక్షమార్జవాదులు బ్రాహ్మణగుణములు. ఇవిసాత్వికములు. శౌర్యతేజోధృతి దాక్ష్యాదులు క్షత్త్రియగుణములు. రాజసములు. కృషివాణిజ్యాది కర్మ పారీణత వైశ్యగుణము. ఇది తామసము. వీటినిబట్టి శూద్రుఁడు గూడ నాయాయి జాతికిఁ దుల్యుఁ డగును. అనఁగా "మంత్రవర్జం న దుష్యన్తి" అనుశాసనము ననుసరించి వేదాధ్యయనము మాత్రము తక్కనకర్మలన్నియు మంత్రము లేక చేయనర్హుఁ డని తేలును. అందుచేత వ్యవహారకాలమున వారివారి యోగ్యతానుసారముగ నుత్కర్షాపకర్షలు కలవనియును, జాతిమాత్రము జన్మమునఁ దప్ప వేఱువిధమున సంపాదింపరాదనియు మంత్రపురస్సరకర్మములలోఁ బ్రవేశము లేదనియునుఁ దాత్పర్యము. కావున శ్రాద్ధేతరకాలమునఁ బాకాదిపరిగ్రహము- వైదికసభలఁ

దక్క వ్యావహారికసకల బ్రాహ్మణసన్నిధాన మున్నను గుణోత్కర్షను బట్టి యగ్రాసనాధికారము - మొదలగునవి శూద్రులకు సయితము స్మృత్యుక్తము లనవచ్చును. ఇందుకుఁ బ్రమాణము—

"శ్లో. శూద్రేషు దాస గోపాల కుల మిత్రార్ధ సీరిణః
భోజ్యాన్నా నాపి తశ్చైవ యశ్చాత్మానం నివేదయేత్"

(మను. అ ౪, శ్లో 166)

అనగా ద్విజునింట సచ్ఛూద్రులైన వీరిచే వంట చేయించి యన్నమును గొనవచ్చు ననియే దీనికిఁ దాత్పర్యము. ఏలనగా శ్రాద్ధ కాలమున మాత్రము ద్విజుఁడు శూద్రునింట భుజింపవచ్చును. ఇతర కాలమునఁ గూడదు-అని చెప్పినచో

"నాద్యా చ్ఛూద్రస్య పక్వాన్నం విద్వా నశ్రాద్ధినో ద్విజః"(అ. 4.)

అనువచనమును బట్టి అట్లయితే "స్పర్శేనావరవర్ణజః" శూద్రుఁడు ముట్టితే యన్నము పవిత్ర మగును- అను మనువచనమునకు గతి యేమం దురేమో! ప్రకరణమునుబట్టి ద్విజునింట శ్రాద్ధకాలమున శూద్రుఁడు ముట్టిన యన్నము పనికి రాదనియే యర్థము చెప్పకతప్ప దందుము. కాకుంటే దాసనాపితగోపాలా అను శ్లోకముగతి యేమగును? ఇక్కడి ద్విజశబ్దము బ్రాహ్మణేతరపర్యాయము కారాదా యనవచ్చును. అట్లు కాదు. అధ్యాయాన్తమునందు—

"ఏషోదితా గృహస్థస్య వృత్తి ర్విప్రస్య శాశ్వతీ"

యని బ్రాహ్మణవృత్తినే చెప్పియున్నాడు. మఱియును

"న విప్రం స్వేషు తిష్ఠత్సు మృతం శూద్రేణ నాయయేత్"

తనజాతివారు లేనప్పుడు బ్రాహ్మణులు బ్రాహ్మణశవమును శూద్రుని చేత మోయింపవచ్చు ననుటచే శూద్రులను మన మిపు డనుకొన్నంత దూరమున గర్మలలో సయితముఁ బూర్వు లుంచినట్లు కానరాదు.

దీనిపైని పరాశరస్మృతి—

"శూద్రాన్నం శూద్రసంపర్కం శూద్రేణతు సహాసనం
శూద్రాత్ జ్ఞానాగమః కశ్చి జ్జ్వలంతమపి పాతయేత్"

(అ. 12, శ్లో ౩4)

"యశ్శూద్ర్యా పాచయే న్నిత్యం శూద్రా చ గృహమేధనీ
వర్జితః పితృదేవేభ్యో రౌరవం యాతి సద్విజః" (శ్లో. ౫)

అను శ్లోకములు విచారించినపుడు "కలౌ పారాశరా స్స్మృతా" యని ప్రతిజ్ఞానుసారము కలియుగమున నివన్నియు నిషిద్ధము లందురేమో యనుటనరాదు. ఈతఁడు గూడ మనుయాజ్ఞవల్క్యు లుదాహరించిన దాసనాపిత భోజ్యాన్నా యనుశ్లోకము నంగీకరించి తానును బ్రకటించినాడు. ఇదిగాక—

శూద్రునింట క్షీరాజ్యతైలములతోఁ జేసిన పదార్థములు నదియొడ్డునకు దీసికొనిపోయి తినవచ్చు నని యన్నాడు. దీనిని బట్టి చూడ శూద్రునింట భోజనముమాత్రమే పరాశరుఁ డంగీకరించ నట్లు తోఁచును. ఇక్కడ నిషేధించినాడు. ఒకచో నంగీకారము మఱియొకచోట నిషేధమును జెప్పుటచే "యశ్శూద్ర్యా పాచయే న్నిత్యం" అని నిత్యశబ్దప్రయోగము సేయుటఁ జూడ నెప్పు డెప్పుడో యవసరమును బట్టి శూద్రపక్వాన్న భోజనము కూడు ననియు నదియును పాలు నెయ్యి నూనెలతోఁ జేసినదే గ్రాహ్యానియమును కావలసి వచ్చినది. లేదా యీనిషేధము-అసచ్ఛూద్రవిషయము గాని సచ్ఛూద్రులగు దాసనాపితాదుల విషయము గాదన్నను బాధకములు గానరావు. లేక "పితృదేవేభ్యో వర్జితః" అనుటచే శ్రాద్ధాదులయందు మాత్రము శూద్రీపాకము నిషిద్ధ మనియైనఁ జెప్పనగును గాని వ్యవహారదశలోఁ గూడ - శూద్రాన్న శూద్రసంపర్క శూద్రసహాసనములు నిషేధించిన పరాశరుఁడు "దాసనాపిత... భోజ్యాన్నః..యని యెట్లు చెప్పఁగలఁడు? అట్లుం గానిచో వెఱ్ఱివాఁడని చెప్పినను చెప్పవలసివచ్చును. ఇది గాక పైపెచ్చుగా—శ్లో. ౩౩ లో

"దక్షిణార్థంతు యోవిప్ర శ్శూద్రస్య జుహుయా ద్ధవిః
బ్రాహ్మణస్తు భవే చ్ఛూద్ర శ్శూద్రస్తు బ్రాహ్మణో భవేత్."

దక్షిణకొఱకు శూద్రునింట హోమముచేసిన బ్రాహ్మణుఁడు శూద్రుఁ డగును. శూద్రుఁడు బ్రాహ్మణుఁ డగు అన్నాడు. కాన నిప్పుడు బ్రాహ్మణులచేఁ గర్మలుచేయుచు శూద్రులు మాత్రము పరాశరుఁడు చేసిన బ్రాహ్మణులు కావచ్చును. వారికిఁ గర్మలు చేయించు బ్రాహ్మణులు శూద్రు లనియుఁ జెప్పుట కొప్పవలసివచ్చినది. కలౌ పారాశరా అని కదా! కావున నోమహాశయులారా! ఒకయుగమున కాకర కాయ మఱియొకయుగమున బీరకాయ యగునా! యుగవ్యవస్థ నంగీకరించినప్పుడు కాలానుసారము స్మృతులు మాఱుచున్న వని చెప్పక తప్పదు. పరాశరుఁడు వ్యవహారకాండ చెప్పక యాచారకాండ సర్వసామాన్యముగఁ జెప్పి ప్రాయశ్చిత్తకాండను విస్తరించి వ్రాయుటచే నిది స్మృతియే యనిపించుకొనదని కొందఱును - చెప్పనిభాగము నితర స్మృతులలోనిది తన కంగీకృతము గావున స్మృతిత్వమునకు భంగము లేదని మఱికొందఱును ప్రాయశ్చిత్తమునే పరాశరప్రోక్తముగ గ్రాహ్యమని పలువురును పండితులు వివరించుచున్నారు. ఏది యెట్లయినను స్మృతిత్వ మంగీకరించియే నేను వ్రాయుచున్నాను. ఋషివాక్యము గాన నే ఋషియైన నేమి? ఏస్మృతియైన నేమి? ఏయుగమైన నేమి? అనుకూలప్రతికూలభావముల ననుసరించి కాలానుగుణముగ స్మృతికి విరుద్ధములు కానివి. స్మృతిలో ననుగృహీతము లైనను కాలానుగుణములును గ్రాహ్యములు కావు అని కొందఱి మతము.

ఇది యిట్లుండనిండు.

"శుచి రుత్కృష్ట శుశ్రూషు ర్మృదువా గనహంకృతః
బ్రాహ్మణాద్యాశ్రయో నిత్యం ఉత్కృష్టాం జాతి మశ్నుతే"

తాను శుచియై తనకంటె నెక్కువవారిని సేవించుచు మృదువాక్కు గలిగి యహంకారదూరుఁ డయిన శూద్రుఁ డుత్కృష్టజాతిని బొందును. అనునర్థము గల శ్లోకమును విచారించి చూతము. ఉత్కృష్ట జాతిని బొందుట యనఁగానే మీఁద వివరించినతీరున గుణములచే జాతి

సామ్యమును బొందుటా? లేక జాతినే పొందుటా? రెండవపక్షమున సంస్కారము లన్నియు రావలసివచ్చును. మొదటి పక్షమున లేవు. ఇట్లు ఫలభేదము గానవచ్చుచున్నది. ఫలములనుబట్టి తంత్రన్యాయమున నిది యొక్కటే శ్లోకమయినను రెండర్థముల నిచ్చు రెండుశ్లోకము లనకతీరదు. అట్లయినపుడు రెండుస్మృతులకు విరోధము వచ్చినప్పుడు ఆచారమును బట్టి యర్థనిర్ణయము చేయవలెను.

"స్మృతోర్వ్విరోధే న్యాయస్తు బలవాన్ వ్యవహారతః"

అను యాజ్ఞవల్క్యవచనము ననుసరించి వ్యవహారపర్యంతధావనము చేయవలసివచ్చినది. వ్యవహార మనఁగా పురాణేతిహాసాదులవల్లను, నితరశాస్త్రవిషయానుప్రసక్తముగ నూహించిన యాచార మని చెప్పనగును. పురాణములలో, విశ్వామిత్ర కవష నాతొడు లుత్కృష్టజాతిని బొందినట్లు గానవచ్చుచున్నది. శుక్రనీతిలో

"నజాత్యా బ్రాహ్మణ శ్చాత్ర క్షత్రియో వైశ్యఏవ న
న శూద్రో నచ వై మ్లేచ్ఛః భేదితా గుణకర్మభిః"

అనుటచేతనుగూడ గుణమునుబట్టి జాతినే పొందవచ్చును. అట్లయినప్పుడు సంస్కారములుగూడ యథోక్తములు రావచ్చునని దేలుచున్నను ఆర్యునకు నార్యయందుఁ బుట్టినవాఁడే సంస్కారార్హుఁడు ఇతరుఁడు కాఁడు అని చెప్పునది. గుణోత్కృష్టత గలయపుడు ఆర్యానార్యభేదము లేక సంస్కారత్వ మభిప్రేత మయితే మనువు—

"గుణోత్కృష్ట స్సర్వం సంస్కార మర్హతి"

అని చెప్పలేకపోయెనా? ఏల?

"యఆర్యా జ్జాత ఆర్యాయాం"

అని చెప్పినాఁడు? కావున నిష్పక్షపాతదృష్టితోఁ జూచునప్పుడు జాతిచేతనే సంస్కారము. గుణములచేతనే యుత్కృష్టనికృష్టభావము అని సిద్ధాన్త మేర్పడుచున్నది. మఱియు శుక్రనీతివచనము గూడ నీయర్థమందే యభిప్రేతము. కాకున్నచో—

"యోవా స్వధర్మనిరతః........"

రాజా స్వధర్మే స్థాపయే త్ప్రజాః త్యక్త స్వధర్మాచరణాః"

అని శుక్రనీతి ప్రథమాధ్యాయప్రారంభముననే చెప్పుట యెట్లుసంగతము? స్వశబ్దమున కర్థమేమి? నియతముగాని గుణకర్మలనుబట్టి యిపుడు బ్రాహ్మణు డైనవాఁడు క్షత్రియగుణములచే నాజన్మలోనే క్షత్రియుడు గావచ్చును.

ఇట్లే గుణములనుబట్టి పర్యాయముగ జాతిత్వము రావచ్చును. అప్పుడు స్వశబ్ద మెట్లు ప్రవర్తించును? అప్పుడు స్వధర్మ మేదని గ్రహించి రాజు శాసించును? కావున శుక్రనీతిగూడ గుణోత్కృష్టతను తన్నికృష్టతనుజూపి వ్యవహారమున గుణములను గ్రహింపవలయును. సంస్కారములు జన్మతోడనే యని చెప్పునని యొప్పక తప్పదు. మఱియు శుక్రనీతివచనమున "ఏవ" అను పద మున్నది. దీనిని జూడక పలువురు భ్రమించుచున్నారు.

జాత్యైవ బ్రాహ్మణః క్షత్రియః వైశ్యః న

అని పదయోజన చేయక తప్పదు. దానియర్థము జాతిచేతనే బ్రాహ్మణుఁడు క్షత్రియుఁడు కానేరడు. అనగా గుణములు గూడ నుండవలసినవే అని గుణసద్భావమును సాధించునే గాని జన్మచే జాతిలేదని చెప్పదు. నాకేమో పట్టుదల యుండి వ్రాయుట లేదు. నిష్పక్షపాతముగ నాబుద్ధి ననుసరించి వ్యాఖ్యానించుటయే యుద్దేశము.

ఇంక చండాలజాతిని ఇంచుక విచారించి ఈ యుపన్యాసమును ముగింతును. మన స్మృతులలో—

"దివాకీర్తి ముదక్యాంచ పతితం సూతికాం తథా
శవం తత్స్పృష్టినం చైవ స్పృష్ట్వా స్నానేన శుద్ధ్యతి"

మాలవానిని ముట్టుదానిని పతితుని పురిటాలిని శవమును శవము ముట్టినవారిని, ముట్టుకొంటే స్నానముతో శుద్ధియని చెప్పుటచేతను అస్పృశ్యత అని చెప్పిరె యున్నారు. కాని మీఁదిజాతులలో గుణోత్కృష్టతను బట్టి యేలాగునఁ దత్తజ్జాతిసామ్యము నంగీకరించినారో యట్లే "తుల్య యుక్తి"తో నిచ్చుటఁగూడ గుణోత్కృష్టత లేదని చెప్పుట సాహసమాత్రమే యగును. అన్యాయ్యమును అంత్యజాతిగుణము లని నాలుగు జాతులగుణములును జెప్పినపిమ్మట శుక్రనీతిలో నిట్లు వ్రాసిరి.

"త్యక్తస్వధర్మాచరణా నిర్ఘృణాః పరపీడకాః
చండాశ్చ హింసకా నిత్యం మ్లేచ్ఛాస్తే హ్యవివేకినః"

ఇతరులను హింసించువారు ధర్మత్యాగమును జేసినవారు అవివేకులును దయలేనివారు అని యనుటచేత నాగుణములుగల బ్రాహ్మణాదులు తత్తుల్యు లనియు ఆగుణములులేని చండాలురు శూద్రతుల్యు లనియు ఉత్కృష్టగుణము లుండినచోఁ దత్తదుత్కృష్టజాతితుల్యు లగుదురనియు, చెప్పుట కేమియు బాధకము లేదు. ఉత్కృష్టజాతితుల్యతకు ఫలము— అస్పృశ్యత లేకపోవుటయే. సంస్కారములుమాత్రము జన్మచే రావలసిన వగుటచే నిపుడు రానేరవు. కావునఁ బరాశరవచనము క్తలక్షణలక్షితచండాలురే యస్పృశ్యు లని చెప్పుటచే సార్థకము.

"యుగం యుగద్వయం చైవ"

అనుశ్లోకమున చండాలుని 1౦ మూరలదూరమున నుంచవలసినదని కొందఱును, యథాక్రమాత్తని పాఠముగాని అథఃక్రమాత్తని కాదు. అట్లయిన నాలుగుమూరల యెడ మున్న చాలునని మఱికొందఱును పరాశరశ్లోకమున భేదింతురు. ఏది యెట్లున్నను అస్పృశ్యత గుణోత్కృష్టపరము గాదు. స్మృతులన్నియు నిందు కనుకూలముగనే యున్నవి. సంస్కారములు మాత్రము జన్మతోనే తప్ప గుణములతో రావు. ధర్మశాస్త్రమున హేతువాదము చేయ వీలు లేనందునఁ గారణ మేమి యని శంకింప వీలులేదు. శాస్త్రమున నెట్లున్నది యని విచారించుటమాత్రమే కాని శాస్త్ర మట్లేల చెప్పెను అని యడిగినవారికిఁ గాదు. లోకములో నందఱు నంగీకరించిన ధర్మమే కదా "సత్యము పలుకుమని" కోర్టులో నయితము నంగీకరించినదే కదా! సత్య మేల పలుకవలెనంటే సమాధాన మేమి? బాగుగ దీని చర్చించి నిష్పక్షపాతబుద్ధిగల విద్వాంసులే నిర్ణయింతురుగాక.

# ఖిలాఫతు - ఐరోపా రాజ్యములు

కళా - వేంకటరావుగారు బి. ఏ.

మహమ్మదు ప్రవక్త బోధించినమతము హైందవ మతముకంటెను క్రీస్తు మతముకంటెను ఆధునిక మయినది. మహమ్మదు ప్రవక్త మహాపురుషుడు అతిహీనస్థితిలో నున్న అరేబియా ప్రజల దుస్థితిని వైమన్యములను గాంచి కాలక్రమేణ నూత్న తేజము నార్జించి

"ఈశ్వరు డొక్కడు. అతనిదూత మహమ్మదు. విగ్రహారాధనము చేయగూడదు. మద్యపానము చేయరాదు."

యనిబోధనల గావించెను. దీనివలన నాయన పట్టణము నుండి వెడలగొట్టబడి మదీనా పట్టణమునకు జేరి సైన్య సహాయముతో జన్మస్థానమును వశపఱచుకొని రాజును ప్రవక్తయు గూడ నయ్యెను. వేలకొలది అరబ్బులు మహమ్మదుశిష్యు లయిరి. ఖురేషు లనువారు మహమ్మదుశిష్యులను బాధింపసాగిరి. మొదట శాంతముగ ధర్మోపదేశము జేయ నుంకించిన మహమ్మదు- శత్రువులబాధలను సైపజాలక- కఠినపరిస్థితులలో కత్తిని ధరింపక తీరినది కాదు. నాటినుండియు మహమ్మదీయులు మతదీక్షయును త్యాగశిక్షయును ఉగ్రతయును గలవారైరి.

మహమ్మదు గతించినవెనుక నాయనపీఠ మధిష్ఠించినవారలను "ఖలీఫా" లందురు. వివిధ కాలములలో ఖలీఫాముఖ్యస్థానము వేర్వేరుచోట్లకు మారినది. ఈఖిలాఫత్ పీఠము ప్రథమమున మదీనాపట్టణములోను పిమ్మట డమాస్కసులోను తదనంతరము బాగ్దాదులోనుండి, ఆఖరునకు ఇస్తంబులు లేక కాన్స్టాంటినోపిలు నగరమునకుమారినది.

ఖలీఫాల రాజ్యకాలములో మహమ్మదీయ ఇస్లాముమతము అన్యదేశములలో బాగుగ వ్యాప్తిజెందెను. రెండవఖలీఫా ఏసుక్రీస్తు జన్మస్థానమును క్రైస్తవులకు పుణ్యక్షేత్రము నగు జెరూసలేమును స్వాధీనముజేసికొనెను. సిరియా పర్షియా ఈజిప్టు మాల్టా గ్రీసు రోడ్సు ఆఖరుకు ఉత్తరఆఫ్రికా స్పెయినురాజ్యములను గూడ పిమ్మట పూర్తిగా జయించిరి.

మహమ్మదీయమత విజృంభణము పాశ్చాత్య నాగరకతకు చాల తోడ్పడెను. ఈసమకాలమును ఐరోపాచరిత్రలో "చీకటిశతాబ్దు" లని వ్రాయుదురు. 16వ శతాబ్దములో ఐరోపాఖండమునకు వచ్చిన జ్ఞానోదయమునకును మతవిజ్ఞానవిప్లవములకును మహమ్మదీయ మతప్రచారమే కారణము. కార్డోవాపట్టణములో స్థాపింపబడిన యిస్లాము విశ్వవిద్యాలయమునకు క్రైస్తవపండితులు చేరి జ్ఞానోదయము గాంచినసంగతి లోకవిదితమే. ఆశతాబ్దులలో మహమ్మదీయమతము ప్రపంచకములో నూతన శక్తిని జ్యోతిని విజ్ఞానమును పెంపొందింపజేసెను.

తమపుణ్యక్షేత్రమును మతమునకు జన్మస్థానమునునైన జెరూసలేము పట్టణము పలస్తీను రాజ్యము మహమ్మదీయులహస్తగత మగుట క్రైస్తవులగు ఐరోపీయనుజాతులకు కంటకముగా నుండెను. కాని ఆసమయమునందు వార లేమియును జేయజాలక మిన్నకుండిరి. మతముపై భక్తిగాని గ్రీసుసామ్రాజ్యమునాటి విజ్ఞానముగాని రోమనులశౌర్యముగాని యాకాలపు ఐరోపీయను ప్రజలకు లేవు. కాలక్రమేణ వారిలో విజ్ఞానము పెరుగజొచ్చెను. ఆనాటి క్రైస్తవుల ప్రధానమతాధిపతి పోపు అను నామముతో రోము పట్టణములో నుండెడివాడు. పోపు కాలమునాటికి పీటరు అను నాతడు పోపు సహాయముతో ఐరోపాదేశమునంతను పర్యటనము గావించి, మహమ్మదీయులపై మతయుద్ధమునకు డీకొనవలయునని ప్రజలకు బోధింపసాగెను. దానిపై మొదటిదాడి "పలస్తీను" రాజ్యముపై బయలువెడలెను. కాని యుత్సాహముతో మతావేశపూరితులై దాడివెడలిన భక్తులు క్రియలలో నేమియును జేయ లేక ఖిన్నులైరి. పుణ్యక్షేత్రమును సంపాదించుకొనలేకపోవుచింత యటుండ, వేలకొలది మైళ్లదూరము నడువవలసి దారిలోను ఓడింపబడి తిరిగి వచ్చునాడును వారు పడిన కష్టనిష్ఠురములకును మితి లేదు. ఈదాడిని మొదటి "క్రూసేడు" అందురు. కొంత కాలమునకు పిమ్మట రెండవ క్రూసేడు కూడ నేమియు కార్యసాధనము చేయలేకపోయినది. మూడవ క్రూసే

డన్నిటియందును ముఖ్యమైనది. ఈ దాడిలో నింగ్లండు రాజగు ‘సింహహృదయు’ డను బిరుదుగాంచిన రిచ్చర్డును ఫ్రాన్సు జర్మనీ మొదలగు దేశముల రాజులును స్వయముగా పాల్గొనియుండిరి. సైన్యాధిపత్యమున కంతఃకలహము లుద్భవించినను వీరుఁడగు రిచ్చర్డు సేనాధిపతి యయ్యెను. కాని వీరును పూర్వపుపరాజయమునే పొందవలసినవారైరి. ప్రతికక్షి యగు సలాద్దీనుడు మహాతేజస్వి. ఆంగ్లరాజసింహమునకు దగినశరభము. భగ్నమనోరథుడై రిచ్చర్డు ముట్టడి లేవదీసికొని జెరూసలేము కోటను కండ్లారజూచుచునే వెనుకకు మఱలవలసివచ్చెను. పిమ్మట జరిగిన “క్రూసేడు” దాడు లంత ముఖ్యములైనవి గావు. కాని యొకవిశేషము జరిగెను. “బాలుర క్రూసేడ్” డనునది యొకటి పరాసుదేశమునుండి బయలువెడలెను. మతావేశపూరితులై 15 వేల బాలురు దూరమును నడువజాలక తిండిలేక బాటప్రక్కను అసువుల విడిచినవారును శత్రులచేతిలోఁ జిక్కి బానిసలైనవారునై యొక్కరు మగిడి గృహముల జేరలేదు. పైవిషయము లన్నియు క్రైస్తవుల మతావేశమును నిరూపింపఁగలవు.

పరమతసహనము లేకపోవుట పాశ్చాత్య క్రైస్తవులకు ముఖ్యవర్శ్య మనుట చరిత్రయే చాటుచున్నది. కాని వారి యావేశము కార్యకారి కాలేదు. మొన్నటి ఐరోపా మహాసంగ్రామమునకు దరువాత “సెవర్సు” సంధి పూర్తియగుదనుక, నిన్నినాళ్లనుండియును పలస్తీను రాజ్యము తుర్కీసుల్తానగు ఖలిఫాపాలనమునం దుండెను. ఎనిమిదివందల సంవత్సరములకుఁ బైగా తమరాజ్యమును ముఖ్యముగా పలస్తీను ప్రదేశమును సంరక్షించుకొనగలిగిన తురుష్కుల ప్రతిభను “సెవర్సు” సంధితో నిర్మూలించుటకు మిత్రమండలివారు కృతనిశ్చయులైరి.

గ్రీకులును తురుష్కులును వంశానుగతు లగు శత్రువులు. దీనికి కారణమును వెదక నక్కఱలేదు. తురుష్కులు మొదటిదాడులలో తూర్పు ఐరోపాఖండమును జయించిరి. ఆ ప్రదేశములు మొన్నటివఱకు తుర్కీస్వాధీనములో నుండెను. గొప్పసామ్రాజ్య వైభవము ననుభవించిన గ్రీసుజాతులకు శత్రువుల రాజ్యములో నుండుట కష్టముగానుండెను. స్వాతంత్ర్యేచ్ఛకు తోడుగా పాలక పాలితులు వేర్వేరుమతస్థులు. గ్రీసువారును ఇరుఁబును రెండవ కారణము నాధారము చేసికొని యితరరాజ్యములవారి యొక్కయు స్వమతస్థులయొక్కయు సానుభూతిని సంపాదించుకొని క్రమేణ స్వాతంత్ర్యసిద్ధిని గాంచిరి. కాని యింతటితో సంతృప్తిఁబొందక తుర్కీయధీనములో నున్న యితరప్రదేశములనుగూడ వశపరచుకొనుటకు వాంఛింపసాగిరి. ఆసియామైనరులోని స్మిర్నావగైరా ప్రదేశములలో క్రైస్తవప్రజలు గలరు. వారలను సుల్తాను పీడించుచున్నాఁడనియును ఆర్మీనియా ప్రాంతములలో క్రైస్తవులను చిత్రవధచేయుచున్నాఁడనియును లోకమునకు వెల్లడిచేయసాగిరి. కాని నిజముగా నట్టి మహాఘోరములు వర్ణించిన రీతిని జరుగలేదు. గ్రీకులు కూడ నిస్లాము ప్రజలను పెట్టిన బాధలు స్మిర్నాలోని యుద్ధానంతరపరిస్థితులు పాఠకు లెఱుంగనివి గావు. క్రైస్తవమతోద్ధరణముకంటెను ధనాపేక్షయును స్వలాభాపేక్షయునుమాత్రమే పాశ్చాత్యుల కారాధన దేవతలు. ఇట్టి దురుద్దేశము తోడనే సమీప ప్రాంతరాజ్యములు సమయము వచ్చినప్పుడెల్లను దక్కినంతవఱకు కొంచెముకొంచెముగ తుర్కీ ప్రదేశములను వశపరుచుకొనఁజొచ్చెవి. ఇంగ్లీషువారికి జిబ్రాల్టరును - ఫ్రెంచివారికి మొరాకోయును నుండుటచేత మాకుకూడ నాఫ్రికా యుత్తరతీరమున నేదో యుండవలయు ననుదానికంటె ఇటలీకి ట్రిపోలీని తుర్కీనుండి లాగుకొనుటకు న్యాయ్యమైన కారణము మఱేదియును కానరాదు. పలుమారులు జరిగిన బాల్కను యుద్ధములకు గూడ నిట్టి స్వార్థపరాయణత్వమే మూలకారణము.

ఇంతలో మహాయుద్ధము సంప్రాప్తమైనది. తుర్కీ జర్మనీపక్షము వహించెను. చాలకాల మతిధైర్యముతోఁ బోరాడినది. కాని జయము పరాధీనమైనది. గెలిపొలీలోను మెసపొటోమియాలోను ఆంగ్లులకు పాఠము చెప్పిన తుర్కీసైన్యములు 31-10 18 తేదిని తెల్లజెండా నెత్తవలసివచ్చినది. రాజీషరతుల ప్రకారము సంధి కుదురుదనుకను తుర్కీసైన్యములను నిరాయుధరహితుల జేయుటకును మిత్రమండలివారి యధికారములో ముఖ్యప్రదేశముల నుంచుటకును తుర్కీ యొప్పుకొనెను.

1918 వ సంవత్సరము నవంబరు 30 వ తేదిని యుద్ధము విరమింపఁబడినను 1920-వ సం॥రము ఆగస్టు 10-వ తేదీ వఱకు సంధిపత్రము లంగీకృతములు కాలేదు. ఈలోపుననే ప్యారిసుపట్టణములో గ్రీసుమంత్రి యగు వెనిజలాసు థేసుప్రాంతమును కాన్స్టాంటినోపిలునగరముగూడ తమకే చెందవలయునని ఆందోళనమును జరుపసాగెను. దీనికి ఫలితముగా సంధి కుదరక మునుపే

**The Fifth Annual gathering of the Andhra Parisothaka Mahamandaly, Pithapuram**



ఆంధ్రపరిశోధకమహామండలి పంచమ వార్షికోత్సవము, పిఠాపురము

**Reception to Sreeyut C. Venkatarangam Sresty garu, Chittoor**



శ్రీయుత సి. వెంకటరంగం శ్రేష్ఠిగారి స్వాగతసభ, చిత్తూరు

A group photo of little girls in a drama at Guntur



గుంటూరు బాలికల నాటకప్రదర్శనము

Hindi Vidyalaya for Andhras at Nellore



ఆంధ్ర హిందీశిక్షక విద్యాలయము - నెల్లూరు



Professor Hanuman Divi Hanumanthacharyulu

ప్రొఫెసరు హనుమాన్ దివి హనుమంతాచార్యులు

అనగా 1919-వ సం॥రము మే నెలలోనే- గ్రీసుదేశమునకు స్మిర్నాను వశపరుచుకొనుటకు సుప్రీము కౌన్సిలువారు హక్కు నిచ్చిరి. ఇంతకన్న అన్యాయ్యమగు విషయము వేరొకటిలేదు. ఇట్టి నీతిబాహ్యమగు సహాయము నూతజేసికొని గ్రీసుదేశస్థులు స్మిర్నా ప్రదేశమును వశపరచుకొని తురుష్కులను పెట్టిన హింసలకు మేర లేదు. నేటికి గ్రీసువారు ప్రాతపగను చిత్రవధలచే దీర్చుకొన గలిగిరి.

ఈలోగా తురుష్కు లూరకుండలేదు. జాతీయవాదు లందఱును ఐరోపాఖండమును వదలి ఆసియామైనరులోని అంగోరాకు చేరసాగిరి. అక్కడ కెమలుపాషా యను నాయన అతిసామర్థ్యముతో వారి నందఱను సైనికులుగ తయారుచేయసాగెను. ఇట్టి ప్రయత్నములలో 1919 వ సంవత్సరము గడచిపోయినది. ఈసంవత్సరాంతమున జాతీయపక్షమువారు నూతనప్రణాళికను ప్రచురపరచిరి. దానిలో తుర్కీస్వాతంత్ర్యమును ప్రకటించిరి. 1920 సంవత్సర ప్రథమదివసములలో వారు ఎన్నికల జరిపిరి. ఏప్రిలునెలలో జాతీయ శాసన సభానిర్మాణము పూర్తియయి ప్రథమసమావేశము జరిగెను. ఆసమావేశములో పైప్రణాళికను న్యాయమని స్థిరపరచిరి. ఇంతటితో ఈ నూతన మగు అంగోరా ప్రభుత్వము నిజమయిన జాతీయసంస్థక్రింద నేర్పడి పూర్తియధికారమును సంపాదించినది. దీనితో గ్రీసువారును మఱికొందఱును పోరాటమును మొదలుపెట్టిరి.

పైనిచెప్పిన రీతిని 1920 సంవత్సరము ఆగస్టు 10 వ తేదీని నిజాధికారరహితు డగు తుర్కీసుల్తానునకును మిత్రమండలివారికిని సంధి పూర్తి అయినది. దీనినే సెవర్సుసంధి యందురు. దీని ప్రకారము తుర్కీకి ఐరోపాఖండములోని ప్రదేశమంతయు పోయెను. ఒక్క కాన్స్టాంటినోపిలు పట్టణము మాత్రమే మిగిలెను. దానిని పరిశీలించుటకుఁగూడ మిత్రమండలి వారికి సైన్యముల నచ్చట నుంచుటకు హక్కుగలదు. డార్డినల్సు జలసంధి అంతర్జాతీయ మైనది. దాని యిరుప్రక్కల నున్న ప్రదేశములు తటస్థములు చేయఁబడెను. గ్రీసు దేశము స్మిర్నాథ్రేసుప్రాంతములు సంపాదించెను. ఫ్రాంసునకు సిరియాదేశము సిలీషియాయును, ఇటలీకి అనటోలియాయు,నీయఁబడెను. ఆర్మీనియా స్వతంత్రరాష్ట్రముగా జేయఁబడియెను. అరేబియాకూడ నూతనరాజ్యముక్రిందికీయబడియె. మెసపొటేమియా బ్రిటిషు సంరక్షణక్రింది రాష్ట్రమయ్యెను. తుర్కీకి నౌకాసైన్యముగాని వాయువిమానములుగాని యుండరాదు. సామాన్యసైన్యము 50700 కంటెను మించరాదు. ఆర్థికవ్యవహారములు అంతర్జాతీయసంఘమువారి పరిశీలనములో నుండవలయును.



ఈ సెవర్సు సంధికంటె అన్యాయ్య మగు సంధి వేరొక టుండబోదు. బ్రిటిషుమంత్రి హిందూదేశములోని ముసల్మానులకు జేసిన వాగ్దానములును- విల్సనుగారు తమ పదునాలుగు సూత్రములలో జెప్పిన మాటలును- దీనితో నీటిపై వ్రాసిన మాటలని తెల్లమయినది. అంతర్జాతీయ న్యాయసూత్రములను గమనింపకయేచేసిన పై సంధికి సామ్రాజ్యవిస్తీర్ణాభిలాషయు ధనాభిలాషయు మతవైషమ్యమును దప్ప వేరుకారణములు గానరావు. ఆంగ్లులకు తమ వాటా ప్రదేశములలోని కిరసనాయిలు నూనెగనులు కండ్లకు మిరుమిట్లు గొలుపుచుండగా వాగ్దానము లెచ్చట నుండగలవు? తుర్కీ తనరాజ్యములో నున్న క్రైస్తవుల బాధించుచున్నదన్నను- మిత్రమండలి దేశములు దమ సామ్రాజ్యములలో జేయుచున్న చర్యలకంటె- హీనమగు పనిని గావించుటలేదు. డయ్యరు చర్యలకంటెను గ్రీసు స్మిర్నాలోజేసిన ఘోరములకంటెను స్పెయినువారు ముసల్మానుల బెట్టిన బాధలకంటెను, అరేబియాలో పన్నుల వసూలుచేయుటకు గ్రామములపై బాంబుల ప్రయోగించిన మార్గముకంటెను తుర్కీపాలనము అధమస్థితిలో లేదు. తుర్కీలోని అధీనరాజ్యములకు స్వతంత్రమంట! ఒక్కొక్కదానికిని మిత్రమండలివారు సంరక్షకులట. నిజమైన ప్రజాస్వాతంత్ర్యవాదికైనను అధీనరాజ్యముల స్వయంనిర్ణయమున కొప్పుకొనుట నూతనము గానేరదు. కాని అధీనుల స్వాతంత్ర్యసిద్ధి యని పలుకుచు తమ సామ్రాజ్యవిస్తీర్ణమును జేసికొనుచు నూతనరాజ్యములను తమచేతిక్రింద నుంచుకొనుటకంటె వింతయుండదు. తమ చేతిలోని హిందూ సామ్రాజ్యమును సరిగా పాలింపలేని ఆంగ్లులు ఇతరసామ్రాజ్యములోని అధీనరాజ్యములకు స్వాతంత్ర్యసిద్ధిని చేకూర్చెద రనుట కల్ల గాదా?

సెవర్సుసంధి ప్రపంచకమునకును ముఖ్యముగా హిందూదేశములోని ముసల్మానులకును వర్ణింపనలవికాని ఆశాభంగమును గలిగించినది. తమ ఖిలాఫతు పీఠము సర్వస్వమును గోలుపోవుటనుగాంచి హిందూముసల్మాను

లసంఘములు- జేసిన మహోద్యమములు- తుర్కీ-బాధితులకు చేసిన సహాయములు- ప్రస్తుతవ్యాసమునకు చెందనేరవు.

సెవర్సుసంధి న్యాయ్యము గాదనియును దానివలన తుర్కీకి సర్వనష్టమనియును దానికిని తమచర్యలకును సంబంధము లేదనియును అంగోరావారు ప్రకటించిరి. ఎన్నుకొనఁబడిన జాతీయ ప్రభుత్వమువారి ప్రకటనతో సంధిపటుత్వము తగ్గిపోయెను. అంగోరా ప్రభుత్వము గ్రీసుతో యుద్ధమును సాగించుచుండెను. ఇట్టి స్థితిలో లండనులో 1921 మార్చిలో జరగిన సభలో మిత్రమండలివారు సూచించిన షరతులుగూడ నూతనప్రభుత్వమువారంగీకరింపక యుద్ధమును సాగించిరి. కాని 1921 అక్టోబరు 20 తేదీని అంగోరాకును ఫ్రాంసునకును ప్రత్యేకసంధి జరగెను. దానిప్రకారము రెండుదేశములును యుద్ధమును విరమించుకొని వర్తకసంధానమును ఏర్పరచుకొనెను. ఇఁక గ్రీసుమాత్రము యుద్ధమును కొనసాగించుచుండెను. గ్రీసువంటి చిన్నదేశ మింతకాల మెట్లు యుద్ధము జేయుచుండెనో యందఱకు వింతగానుండెను. తాము సహాయము జేయుటలేదని లాయడు జార్జిగారు 16-8-21 తేదిని 20-2-22 తేదిని ప్రకటించిరి. కాని నిజము దాగదు. 23-3-22 తేదిని హిల్టనుగారు ప్రభుత్వపక్షమున గ్రీసునకు 21-12-1921 తేదిన 15000000 పౌనులు అప్పు నిచ్చితి మని ఆంగ్ల పార్లమెంటులో ప్రకటించిరి. దీనినిబట్టి తుర్కీ-విషయమై ఆంగ్లమంత్రివర్గము తీసికొనుచున్న గూఢచర్యలు బయల్పడక మానవు. తాము చేయున దేమియును లేక 27-3-22 తేదీని లాయడు జార్జిగారు ప్యారిసులో తుర్కీ-సంధిషరతులను బాగుగా విరళము జేసిరి. కాని స్మిర్నాను గ్రీసువదలినగాని సంధి యొనగూడదని తుర్కీ-వారు చెప్పుటచే ఈ సమావేశము ఫలకారి కాలేదు.

ఇట్టి పరిస్థితులలో 9-10-22 తేదిని రూటరుసంజయుడు ప్రపంచకమునకు నూతనవార్తను అందజేయక తీరినదికాదు. నాటితో గ్రీకులు పూర్తిగా నోడింపఁబడిరి. జాతీయసైన్యములు డార్డినల్సు జలసంధిని దాటుటకు సంసిద్ధము లయ్యెను. లాయడుజార్జిగారు కుతంత్రములచే నిర్మించిన సౌధము నేలమట్టమయ్యెను. ఇట్లు ప్రపంచకమున కంతకును వింత గలిగించిన తుర్కీ-విజృంభణమునకు కారకుడు పూజ్యుడగు కెమలుపాషాగాక వేరెవరు?

ముస్తఫా కెమలుపాషా విద్య నభ్యసించినపిమ్మట సైనికుఁడై గొప్పసమర్థుఁ డయ్యెను. గెలిపొలిలో అనజాక్సు పటాలమును లొంగదీసిననాఁడే యీతని ప్రతిభ లోకమునకు వెల్లడియయ్యెను. అంగోరా ప్రభుత్వస్థాపనకు ఈయనయే కారకుఁడు. దాని ముఖ్యాధ్యక్షుఁడు కూడ కెమలుపాషాయే యయి తననిర్మాణశక్తిచేతను ధైర్యముచేతను రాజనీతికౌశలముచేతను శాంతముగా తన కోరికను నెరవేర్చుకొనఁ గలుగుటయే గాక లోకమువారికి వంద్యుఁడై పాశ్చాత్త్యరాజ్యములకు బోధకుఁడునై నేడు దివ్యజ్యోతితో వెలుంగుచున్నాడు. కెమలుని విజృంభణముతో లాయడుజార్జిగారికి విచక్షణ క్షీణమై, తత్క్షణము కెమలుని దాడి నెదిరింపుడని డార్డినల్సు ప్రాంతములోని సైన్యమున కాజ్ఞ నిచ్చెను. కాని కెమలునిబలము బ్రిటిషుసైన్యాధిపతికి పూర్ణముగా దెలిసియుండుటచే హారింగుటను సైన్యాధ్యక్షుఁడు ఆఉత్తరవును జేబులో నిముడ్చుకొని యుద్ధము మానుకొని వ్యతిరేకాభిప్రాయమును తెలియజేసెను.

దానితో లాయడు జార్జిగారి యసామర్థ్యము ప్రకటితమగుటచే మంత్రిపదవికి రాజీ నిచ్చెను. పాపము క్రొత్తయెన్నికలలో ఈయనపక్షము జయమొందలేదు. పిమ్మట నిరుపక్షములవారును లాసేనులో సంధిసభ జరుపుకొనుట కంగీకరించిరి. ఈవ్యాసము వ్రాయుసరికి సభ పూర్తి గాలేదు. పర్యవసాన మెట్లుండినను తుర్కీ-విజయము మాత్రము స్థిరమైనది. మోసూలునూనెగనుల కొరకు కర్జను ప్రభృతులు చేయుచర్చలు సభను విజయవంతముగ జేయలేనిచో తప్ప తుర్కీకిమాత్రమే గానేరదు.

క్లుప్తముగను, అసంపూర్ణముగను పైనివివరించిన విషయములు పాశ్చాత్త్య రాజ్యనీతిని వెల్లడింపగలవు. ధనలాభముకొఱకును, సామ్రాజ్యవిస్తీర్ణము కొఱకును నీతినైన వదలి వారు తమచర్చల సమర్థించుకొందురని తెల్లమగుచున్నది. కడచిన పదిశతాబ్దులలో తెల్లరాజ్యములవారు తుర్కీ-విషయమునందు జరిపినచర్యలు, ఆంగ్లప్రభుత్వముతో శాంతిసమరమును జరపుచున్న మనకు మంచిపాఠమును నేర్పకమానవు. ప్రభుత్వవాగ్దానములు బూటకములని నేటికయినను మనవారు తెలిసికొనక మానరు. తుర్కీ- స్వాతంత్ర్యసమరములో హిందువులును ముసల్మానులును సోదరత్వముతో జేసికొన్న సహాయము నిచ్చుట వర్ణింప నక్కఱలేదు. ఏతద్విజయముచే

ఆసియా ఖండము ప్రతిభ గడించినది. దీనిలో హిందూ దేశముయొక్క వాటా కెమలుపాషాగారు చోటానీగారికి వ్రాసిన లేఖలోని యీ క్రిందియంశము వలన విదితమగును.

"మా దిగ్విజయగౌరవములో ముఖ్యభాగము హిందూదేశమునకు జెందును. మీరు చేసిన సంపూర్ణసహాయమును- కష్టపడి వసూలుచేసి పంపినసహాయనిధులును- మావిజయమునకు చాల తోడ్పడినవి. మీవంటి సేవకులు గల హిందూదేశము సత్వరస్వరాజ్యసిద్ధి నందునని నమ్ముటయే గాక అద్దానికొఱకు భగవంతుని నిరంతరము ప్రార్థించుచున్నాము."

కెమలుపాషా ఆశయమును దైవప్రార్థనమును సఫలీకృత మగుగాక! గాంధిమహాత్ముని పదానుచరు లగు హిందూ ముసల్మానులు స్వసహాయముతో- దౌర్జన్యరాహిత్యసహాయ నిరాకరణమంత్రాచరణచే- తుర్కీవలెనే- భారతదేశమునకు పాశ్చాత్యశృంఖలములను డుల్చి వైచి స్వరాజ్యమును సంపాదించెదరు గాత.

# అరుణోదయము

గోల్లమూడి రామారావు గారు

వెన్నెలచందము । వెలవెలఁ బాఱె
తారలనిగ్గులు । తరగిన వయ్యె
కలువల మిత్రుండు । కాంతిసిఁ బాసె
మందస మీరుఁడు । నందము తోడ
నడుగులఁ నల్లన । బుడుకుచు వెడలె
కొక్కొఱొకోయని । కోళ్లుగూసెను
మెలఁకువఁగాంచిరి । మేదిని జనులు
తెల్లని పిట్టలు । తీరములందుఁ
పిల్లలఁగూడుక । వెలయుచునుండెఁ
నెమళులుఁనొక్కెడ । నింపుతోఁజేఱి
నీటుగ నెంతయొ । నాటల నాడి
తరుగుల్మంబుల । పొరుఁగున కేగి
కేరదొడంగెను । కేకారవముల
కలువలుఁదమ్ములు । గలిగినయట్టి
కాసారమ్ములు । కాంతులనొప్పె

*   *   *   *

నీటులఁ జూపెడి । నెరజాణులార!
పాటలఁ బాడెడి । పద్మాక్షులార!
ముదమున మీరలు । మోహంబుతోడ
సదమల భక్తితో । సరసంబుగాను
ధ్యానంబు జేయుడు । తమ్ములతేని
వేదగోష్ఠినిఁజేయు । ద్విజవర్యులార!
భూములఁనేలెడి । భూపతులార!
బేరముల్ సేసెడి । బేహారులార!
ముదమున మీరలు । మున్ముందు రెండు
సమయంబుసుఁడి దీనిజరుపగారాదు
ఆప్తుల మిత్రుండు । ఆర్యముండింక
పుడమిఁగాంచగ వచ్చు । మోదంబు మీర

*   *   *   *

మీకృత్యములఁదీర్ప । మెలకువతోడ
తరలుఁడు వేఁగమే తర్కించు కొనక
లోకబాంధవుఁడును । లోకరక్షకుఁడు
సన్మార్గులనుఁ బ్రీతి । సదయుడై బ్రోవ
దుర్మార్గులను చాల । దురపిల్ల జేయుఁ
వేవెల్గు భూమిని । వెలయింపఁ జేయుఁ
సకల సద్గుణరాశి । సర్వాత్మకుండుఁ
గగన భాగంబంత । గగ్గోలుఁ వడఁగ
రక్తవర్ణపుఁగాంతి । రాజిల్లుఁ చుండ
బాల భాస్కరమూర్తి । బంగారుచాయ
నలుదెసలకు గ్రమ్మె । నాణెమైనట్టి
సింధూర కాంతులు । చెన్నుమీరగను.

*   *   *   *

మణిమయ మేడలు । మహిమెప్పదొడఁగ
కోటలుఁ బేటలు । కొమరారదొడఁగ
రాచవీధులుకడు । రంజిల్లదొడఁగ
పచరించుకన్నుల । పండుగనలము
నుద్యానవనములు । యొప్పుగా నెంతొ
చిగురుటాకులతోటి । చెన్నారుచుండె
మెఱుఁగుతీవలఁబోలి । మెఱయుచునుండె.
దిగ్గున వికసించి । తెలుపొంపు విరులఁ
వలుదగుత్తులనెత్తు । వలపు ఫలమించి
విలసితంబయ్యెను । వికృతిసంతటను.

# మహాకవి పోతన

కల్లూరు వేంకట నారాయణ రావు గారు. బి. ఏ.

ప్రతిగ్రంథమును తత్కర్తయొక్క జీవితాశయమును వ్యక్తీకరించును. ఆవ్యక్తీకరణమున రచయితయొక్క జాతీయత ప్రతిబింబితమై యుండును. దానియందే, కవికాలసాంఘిక రాజకీయ స్థితులు లక్ష్యయత్నముగఁ బ్రదర్శితములై యుండును. పోతన భాసిల్లినది బదునైదవశతాబ్ది అని సింగమనాయని సమకాలికత్వము మున్నగు వానినిఁబట్టి వీరేశలింగకవి ప్రభృతు లూహించిరి. కాని యింకను సునిశ్చితము కాలేదు. ఆశతాబ్దిని భారతదేశ మే రీతి నుండెనో చర్చింపవలయును. పఠాను రాజ్య మస్తమించినది. మొఘల్ చంద్రుఁ డింకను ఉదయింప లేదు. విజయనగరరాజ్యమున నరసింహనాయకుని వంశలతటిల్లత తలయెత్తలేదు. కాకతీయరాజ్యము భామినీవిక్రమాబ్ధిలో మునిగిపోయియున్నది. ప్రసిద్ధమైన యాంధ్రరాజ్య మేదియును అప్పటికి రేకెత్తలేదు. కాని ద్వితీయదేవరాయని సేనానాయకుల విజృంభణములో భవిష్యద్విజయనగరసామ్రాజ్యవైభవమును సూచించు నుఱుము లుఱుముచునే యున్నవి. అంతయు నంధకారావృతము. మహమ్మదీయుల భామినీరాజ్యమున మహమ్మదు గావను రాజనీతి-చైతన్యుని శిష్యులు వంగదేశమున- నానక్ యొక్క యంతేవాసులు పంజాబునందు- కబీరుతుకారాముల వచస్సరణి హిందీమహారాష్ట్ర వాఙ్మయములందు-విరాజిల్లుచున్నది. ఇట్టి సమయముననే గాఢతమఃపటలి నపనయించుటకై ఆంధ్రదేశమున భక్తాగ్రగణ్యుఁ డగు పోతన యవతరించెను.

పోతనయవతరించినది సంధిసమయము. రాజకీయ వాతావరణమున సంజెచీకటి గ్రమ్ముకొనియుండెను. ఆంధ్రమహాజనుల రసనారంగమున నుదయించి, గణక విజయాదిత్యుఁడు, యుద్ధమల్లుఁడు మున్నగువారిచే సీసములు తరువోజలు గొన్ని నేర్చి, వారి శాసనముల లోఁగొని, నన్నయచే సభామధ్యమున నిలువఁగఱచి, కుండలీంద్రునిచే సర్గసంపదనొంది, ప్రబంధపరమేశ్వర నాచనసోముల ప్రౌఢపదవిన్యాసమును వడసి బాల్యదశను గడచి, నవయౌవనరస సౌభాగ్యము నందుస్థితి అప్పటికి ఆంధ్రభాషాయోషకు చేకూరినది. ఐనను ఆమె యుద్విగ్నమనస్కయై యుండెను. సాంఘికస్థితి స్వమతావేశపరవశులగు మహమ్మదీయుల దుండగములచే కళంకిత మగుచుండెను. అట్టితఱి నహంకారభూయిష్ఠులగు భూపతుల నిరసించుటయు, నాంధ్ర భాషారమణికి నూత్నయౌవనసందర్భసముచిత స్వాతంత్ర్యగౌరవమానంబులఁ గలిపి సరసవిభవంబుచే నుద్బోధించుటయు, భగవద్భక్తితత్త్వప్రకాశీకరణంబుచే మహమ్మదీయమత ధ్వాంతమును బాపుటయు, అను ఆదర్శకార్యంబులు పోతనపై నానౌరపడినవి. పోతన వీని నెంతవఱకు నిర్వహించి, సిద్ధసంకల్పుఁడైనదియు కనుగొనుటయే పోతనకవిత్వమును విమర్శించుట యగును.

భగవత్తత్త్వార్థప్రతిపాదనమునందు భగవద్గీతకుఁ బిమ్మట భాగవతమే లోకోత్కృష్టమైన గ్రంథరత్నము. దానిని మూలానుసారముగఁ దెనిఁగింప వేదాంత పరిజ్ఞానమ్మును, నిస్తులమేధావిస్తృతనిరంకుశకవితావేగంబునుఁ గల మహాకవికిఁ దప్ప నొరుల కసాధ్యము. భాషాంతరీకరణమున మూలమునందలి భావార్థసర్వస్వమును హృదయంగమంబగు పదోచ్చయములో బొదివించి, తేటతెల్లము గావించి, మూలరచయిత రచియించిన కాలపుఁ బాఠకు లెట్టి మనస్తుష్టిఁ గాంచిరో యట్టిదానినె పరివర్తించిన గ్రంథమునుఁ జదువఁబూనుచదువరులు సైతము పొందునట్లు రచించుటయే యగును. కాని, తూ, చా, తప్పక, భావము గూఢమైనను సరియే యక్కఱమున కక్కఱముఁ బొందుపఱచుట కాదు. పోతన్న కవితను గురించి తర్కించుటకు ముందతని యాంధ్రీకరణపద్ధతి నించుక యఱయుదము.

(1) మూలార్థములు గూఢముగా నున్నచోట శ్రీధరవ్యాఖ్యానము ననుసరించి, వానిని తేటతెల్లముగావించుట (2) వలయుకడలఁ బెక్కువ్యాఖ్యానపదంబులనే దెనుఁగునఁ జొప్పించుట (3) కవివైచిత్ర్యమునకు ననువుపడని వేదాంతఘట్టముల, మృదుపదఘటనచే దెనుంగున మనోరమ్యముగ జొప్పించుట (4) సరసంబులుగాని కథాంశంబులను సైతము రసవత్తరములుగా రచించుట (5) మూలము నెక్కడను సుంతేనియు విడువక విపులీకరించియు, విశేషము లెడుక్కజేసియు, అర్థబాహుళ్యము హ్రస్వణించియు కొండొకచో పాఠకులచిత్తముల నాచికొను సులభపదంబుల, భావంబును సంగ్రహించియు, మొత్తముమీద కావ్యశక్తికి రసపుష్టికి ననుకూలపడునట్లు, మూలావిరుద్ధముగ, నన్వయసౌలభ్యంబుఁ గల్పించుట యను నైదుసూత్రంబు లితని భాగవతాంధ్రీకరణంబుఁ బట్టి ముఖ్యంబులని పూర్వవిమర్శకమతానుసారంబుగ నిశ్చయింపవచ్చును. ఈపై భాషాంతరీకరణసూత్రముల యాథార్థ్యముఁ గన్గొనుటకు భాగవతసప్తమస్కంధము నొక్కదానినైనను యథామూలముగ బఠించిన గోచరమగును.

పైసూత్రములను సూక్ష్మముగఁ బరామర్శించిన పోతన కేవలాంధ్రీకరణకర్తయైనదియు సహజకవితామృతతరంగిత దుర్వారప్రతిభాసముద్రుఁ డైనదియు నిశ్చయింపనగును. మొదటిమూఁడును సమర్థుఁడగు భాషాంతరీకరణకర్త యవలంబింపవలసిన పద్ధతులే, కాని నాల్గవ సూత్రము నుడువు రసోద్దీపనము, కవికి గాక కేవలపరివర్తనకున కెట్లబ్బును? ఐదవసూత్రమువచించు (1) కావ్యఫణితి లేక రచనాశిల్పము (2) భావవైశద్యోత్కర్ష రససౌభాగ్యసంపదకంబు లగు సందర్భసముచితపదంబులఁ గూర్చి మూలాతిక్రమణమును సరకు గొనక,

వ్యర్థవిశేషణంబుల నూలశ్లోకగతంబులను జాటింపక స్వకీయకల్పనా విజృంభణపారవశ్యంబుచే, ప్రత్యేకవ్యక్తిత్వమును సంతరించుట, యను రెండుపనులు మహాకవిపుంగవులకు గాక మరెవరికి సలవడును? ప్రాణము లేని కళేబరంబులో జీవకళ నింపునట్లు, సర్వసాధారణంబయిన చప్పిడి సంగతి నిసర్గరసోల్లసితంబగు కావ్యరాజంబుగా మార్చుట, కవితాప్రభావమే గదా? పైతర్కమునుఁబట్టి పోతన నిస్సందేహముగా మహాకవి యననొప్పునని నిశ్చయించితిమి.

ఇంక నాంధ్రీకరణకర్తయగు పోతన నటుంచి కవియగు సహజపాండిత్యునిఁ గుఱించి విచారింతము. ఇతఁ డొనర్చినకృతులని బ్రతీతి నందినవి వీరభద్రవిజయము భోగినీదండకము నారాయణశతకము ఉత్పన్నములుగాని భాగవతభాగములు. కడపటిదితప్ప తక్కినగ్రంథములు వివాదావస్థ నతిక్రమింపకుండుటచే వానినిగుఱించి మనము, నిజస్థితి దెలియువఱకు నౌదాసీన్యము వహింతము. భాగవతకవితయే విచారణీయాంశమగుట నీకఁ బ్రస్తుత మనుసరింతము.

శ్రీకారమునసే గృష్ణస్తుతితరువాత శివబ్రహ్మస్తోత్రములు అనంతరము గణనాథ సరస్వతీ పార్వతీ లక్ష్మీ వ్యాస వాల్మీక శుకాభివాదనము పిదప సంస్కృతాంధ్రకవిజనాభివందనము. ఆపైని భావికవిబహూకృతి, పదుపడి కృతిపతిత్వనిర్ణయము. ఆంధ్రకవులలో నన్నయతిక్కన ఆర్వురే పేర్కొనఁబడిరి. కాని సంస్కృతకవులు పెక్కురు స్తుత్యులైరి. సంస్కృతసాహిత్యమున పోతన కధిక ప్రావర్యము కల్మియే దీనికి హేతువేమొ! కొండొకచో ననుసరణమున కనుపడిన సోమభాస్కరులఁ దలంపలేదు. వారును "నితరపూర్వకవి" సంభావనలో జెల్లిపోయినారు. కృతిపతిత్వనిర్ణయారంభమునసే "ఇమ్మనుజేశ్వరాధముల" నని యప్పటి నరనాథుల తిరస్కారసరణి. ఈ వ్యత్యస్తతకు ఆంధ్రసరస్వతి వల్లేయనినది. ఇతనికన్న ముందటివారై-నరపాలుర నసేవల నాశ్రయించి వారిమూర్తుల తమకవితాసుధారసమున అమరమూర్తులగావించిన-రాజరాజనరేంద్రుని సంపద ననుభవించిన- నన్నయ, మనుమసిద్ధిశతుమాచక్రము తనచేత ద్రిప్పిన సోమయాజి, దేవరాయనిచే నగ్రహారములనొంది సుఖించిన సోమకవి, యాశ్చర్యచకితులై పరమపదము నుండి యవలోకించుచునే యుండిరి పోతన స్వాతంత్ర్యాశయ మాగలేదు. ఆగర్భదారిద్ర్యబాధ మూలకు ద్రోయఁబడినది. ఒకటేదీకు! ఆంధ్రభాషాలలనకు స్వాతంత్ర్యమానగౌరవముల ప్రాశస్త్యము చక్కగఁ దెలిసినది—పోతనా! నీవేధన్యుడవు! అన్నికష్టములను నిరసించి, రాజభీతికిఁ దలంకక స్వాతంత్ర్యశీలుఁడే మహాకవియని తేటపఱచితివి !!

"దయయును సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని, గలుగ నేటికి తల్లుల కడుపుచేటు" కించి దున్మీలిత లోచనుండై "వల్లీయుత తమాల వసుమతీజము భంగి బలుకొల్లు మూపున బరఁగువాఁడ"గు రామభద్రునిఁ గాంచి యాతనిచే భాగవతాంధ్రీకరణమున కాజ్ఞపడసెను. కాననే యత్యుత్సాహముతో "భాగవతంబు దెలిసి పలుకుట చిత్రంబు; అయినను తెలియవచ్చినంత తేటపఱతు"నని కార్యముయొక్క ఘనతయు తనశక్తియు వినమ్రభావముతో వచించినాఁడు. అంతియగాక "నందఱు మెప్పింతు గృతుల నయ్యై యెడలకు" అని ప్రతినఁబట్టినాఁడు. పిదప రాముని సాన్నిధ్యమునుఁ గల్పించుకొని, షష్ఠ్యంతములలో రామకృష్ణావతారముల కథేదాధ్యవసానము ఘటించినాఁడు. ఇదంతయు నాంధ్రభాగవతమునకు పోతనకృతంబునకు బీఠికయనఁదగును. దీనినుండి కవియభిప్రాయముల గ్రహింతము.

కవి విమర్శనము, కవిమానస, కవికాల రాజకీయసాంఘికస్థితి, పరస్పరసంఘర్షణ పర్యవసానము దేలినగాని తుదముట్టదు గదా! కాన పోతన యాశయములిట్టివని గుర్తించి తత్కాలస్థితి యెంతవఱకు కారణమో లోగొని నదియు గుర్తింపవలసియున్నది. ఆకాలపురాజులను సమకాలికు లగు కవులవలె నింద్రుఁడు చంద్రుఁడు పేంద్రుడని భూషింపక, వారినాశ్రయించి యాచించుటనుతుచ్ఛీకరించి స్వతంత్రదృక్పథము-నాంధ్రవాఙ్మయమున ప్రప్రథమముననిర్మించినఖ్యాతికిఁ బాత్రుఁడై, తనకాలపద్ధతినిడనాడికాలము నేశాసించినవాఁడీతడు. ఇట్టీతఁడుతత్కాలశాసకుఁడై, భక్తిభావప్రాధాన్యకేశ్వరోపాసన వెలయు నద్వైతతత్త్వమును ప్రచరించుటచే, నుత్తగ విషయంబులఁ గబీరు తుకారామ చైతన్య లెట్టిమహాత్ములో, యట్టిమహాత్ముఁడేఁ! యట్టిగౌరవనీయుఁడే! యట్టియుగోద్ధారకుఁడే! యాంధ్రదేశమున కనుట సాహసము గాకున్నది. నిడుదలు నన్నయసులభంబులు నగు సాంస్కృతికసమాసంబుల పావణించిన నన్నయను సూరియనియు, ప్రౌఢపదప్రయోగార్థసారస్యములకుఁ బెన్నిధియైన దిక్కనను మనీషియనియుఁ బేర్కొని, యితరపూర్వకవిజనంబుల వేత్వేఱఁ బేర్కొనమిచే నాయిర్వురికవితాగుణంబుల నితం డవలంబించె ననుట పొసగుచున్నది. పైనుడివిన యర్థసామరస్యాన్వయసౌలభ్యాదు లితనియందు నున్నను యితనిసందర్భోచిత నవరసవిస్ఫురక నిర్గళ నిరుపమ మధుర శైలి దానినిఁ దనలో లీనముఁ గావించుకొన్నది. నాల్గవయంశ మితండు సంస్కృతాంధ్రపద జాలంబులు రెంటియందును మనోహరరచనలు సల్పునట్లుద్దేశించుట తుదిని గ్రహింపదగినది. తూఁచిన సరిఁగఁదూగు పాదంబులయందంబుచే రామవర్ణనావిలసితమై యుండు సీసపద్యములందలి, వస్తుగుణప్రకటీకరణవైశద్యము (Detailed and analytical decription) వర్ణనాపద్ధతి, పోతనరచించిన ప్రతిపద్యమున నెలకొనియే యున్నవి. సోమభాస్కరులయందుండు రససౌభాగ్య మితని కడ, పూర్ణరాకాచంద్రదర్శనంబున నుప్పొంగిన సముద్రంబుచాడ్పున భక్త్యుద్రేకసాతత్యముచే సహజసముల్లసనముఁ గల్గియున్నది. పై యంశములు పోతనచే స్వకీయముగ నుక్తములయ్యు, యతని కవితను సంగ్రహించి వర్ణించునవి గాన దృష్టాంతముల నభిలషించెదు. వాని నీక్రింద నిందుక వివరించువాఁడను.

"వేదకల్పవృక్ష విగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న,
భాగవతపురాణ ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసిక భావవిదులు

పరిశీలకులను హెచ్చరికఁ గొల్పి ప్రథమస్కంధ మనఁబరగు భాగవతావతారిక నారంభించుచున్నాఁడు. నైమిశారణ్యవర్ణనము మొదటిదీర్ఘ వచనరచన. దీనిలో శ్లేషానుప్రాణితాథేదాధ్యవసానం బగు

నర్థాలంకారంబు మెండుగొనియున్నది. ఈయలంకారంబు సాధారణంబుగఁ బోతన వచనరచనలందే గుప్పించినాఁడు. ఇయ్యలంకృతి యష్టమస్కంధంబున సరోవరవర్ణనంబున, రామరాజభూషణుని ద్వ్యర్థపదవిన్యాసప్రౌఢిమను సూచించి, హాలాహలోదయసందర్భమున సుషమాలంకారసహజసౌభాగ్యంబు వడసి, గంగావతరణంబున నసదృశగంభీరభావరససముత్తేజితమై పొంగి కట్టతెగి విశృంఖలకల్పనాప్రవాహంబుగా పరిణమించినది. ఇతనివచనరచనలు నిడుదలైనయెడల వర్ణనావసరంబులందెల్ల, కోమలపదమాధురీధురీణలసితం బగు వృత్తంబులనియే యెన్నవలసియుండును. నృసింహావతారఘట్టంబునందలి వీరరసభాసురంబులైన శబ్దార్థాలంకారంబులును, మోహినీవిలాసప్రదర్శనవేళలోని, యనన్యసాధ్యశృంగారరససన్నివేశసమంచితానల్పకల్పనలును అమరావతీనగరవర్ణనమందలి ప్రకృతిసౌందర్యమును సుంతేని కొఱఁగానీయక ప్రత్యక్షముగఁ జూపిన వానివలె రచించిన ప్రతిభావిభవమును, సూక్ష్మపరిశోధనద్యోతకం బగు వర్ణనావైశద్యంబును, ఈ మహాకవిని సర్వజ్ఞునిగా వేనోళ్లఁ జాటుచున్నవి. ఎన్నిమాఱులు చదివినను తనివిదీరక, నవనవభావస్ఫూర్తి దోపించు, నాతనివచనకవితారచన మితరకవు లెవ్వరికి నంతటి శిరీషమృదులలలితపద సరళధారా ప్రసాదవిలాసములతో రచించుట కలవడ లేదన్న సాహసోక్తి కానేరదు.

వచనరచనలయందలిసుగుణములే-అనగావర్ణనావైశద్యము పండితపామరజనహృదయంగమం బగు కోమలపదవిన్యాసము- శబ్దార్థాలంకారములు- అన్వయసౌలభ్యము- నిరంతరసందర్భోచితరసపుష్టి- పద్యములందును గన్పట్టుచున్నది. ముక్తపదగ్రాసయమకము నితండు, సంపూర్తిగా సంతరించి పోషించినాఁడు. ఈయలంకారము శంభుదాసభాస్కరులకుఁ గూడ ప్రియముగఁ గన్పట్టుచున్నది.పద్యములను పాదపాదమున విఱిచియే రచించినాఁడు. పద్యములన్నిటను నొకవిధమగు తూఁగు కన్పట్టుచున్నది. అదియితనికవితకు స్వాభావికముగా నున్నది. మచ్చున కొక్కపద్యము:-

మ. మలఁగున్ మెల్లనిగాలికిన్ బటురటన్మత్తద్విరేఫాలికిన్
దలఁగున్ గోయిలమ్రోతకై, యులఁగు నుద్యత్కీరసంభాషలన్
గలఁగున్ వెన్నెలవేఁడిమిన్ నలఁగు మాకందాంకురచ్ఛాయకున్
దొలఁగున్ గొమ్మ మనోభవానలశిఖాదోధూయమానాంగియై.

యతిప్రాసములందు వెదకికోలు గాన్పింపక శబ్దాలంకారవైచిత్రితో, సరసపదాభినివేశము వెలయ పద్యాదినుండి పయింబయి రసపుష్టి నొదవించుటలో నితఁ డసమానుఁడు. రుక్మిణీకల్యాణఘట్టమున "ఘనుఁడా భూసురుఁ డేగెనో" యను పద్యమును బఠించిన దానిలో రసానురూపంబుగఁ బద్యమెట్లు సువిభక్తమై యుండునదియుఁ గోచరించును. నవరసభావపోషణవైదగ్ధ్య మెందును గుంటుపడనిధారతో, చారుశయ్యతో, కటువులుగాని పదముల సౌకుమార్యంబుతో, వెలయించుట పోతనకు సమకూరినట్లింకెవరికిని సమకూరలేదు. సంగీతపరిజ్ఞానము రసోత్కృష్టతతో మేళగించి తుఱంగలించు తెలుంగున ప్రతిపద్యంబు నితండు శ్రావ్యముగా ఘటించినాఁడు. అందఱకు సమ్మోదావహంబైనది భావసుభగత్వము. దాని నెల్లెడల నితండు ప్రకటించినాఁడు.

క. అంగీకృత రంగన్మా
తంగీమదగంధ మగుచు • దద్దయు వేడ్కన్
సంగీతవిశేషంబుల
భృంగీగణ మొప్పె ర్మ్రాను • పెట్టెడి మాడ్కిన్.

క. కంటే జగములదుఃఖము
వింటే జలజనితవిషము • వేఁడిమిప్రభువై
యుంటకు నార్తులయాపద
గెంటించుట ఫలము. దాన • గీర్తి. సృగాక్షీ!

పోతన కమనీయకవితాకల్పశాఖి- భాగవతప్రథమస్కంధమున నశ్వత్థామావమానకలినిగ్రహంబుల భయానకభీభత్సరసంబులును, కృష్ణస్తవకుకసందర్శనంబుల శాంతిరసంబును, కృష్ణనిర్యాణవార్తభూదేవీధేనాలాపంబుల శోకకరుణారసంబులును, ప్రోదిసేయ మొలకెత్తి యుత్పన్నంబులుగాక నిల్చిన ద్వితీయ తృతీయ చతుర్థస్కంధంబుల భాగంబులందలి మైత్రేయ విదుర సంవాదంబులను, ధ్రువాద్యుపాఖ్యానంబులను, కపిలజననకథాదికంబులందు వెలయు దత్త్వఘట్టంబులందలి భక్తిభావైకద్యోతకంబగు నద్వైతసరణిని రూపించుటలోని విషయవిశదీకరణనై పుణ్యంబుచే బలిసి- సప్తమస్కంధంబున వీరకాద్రశాంత్యద్భుతరసంబులకు దావలంబైన ప్రహ్లాదచరిత్రంబునందలి మంజులతావహనీయపద్యజాలంబులచే బల్లవించి- యష్టమస్కంధంబున చిత్రవిచిత్రశబ్దార్థాలంకారవిశిష్టదుర్వారశైలిశాఖోపశాఖలంబెరిగి- నానావిధానల్పకల్పనాకోరకంబుల జిగిచే రహించి- నవమస్కంధమున వివిధరాజవంశచరిత్రమాలాత్తకోమలవాక్యకలకంఠకాకలీ సుస్వరమాధురిమచే నెసంగి- భగీరథప్రయత్నసమాగత గంగాప్రవాహరామకథామృతనిధులందలి మధురశబ్దమకరందము వహించిన మనోజ్ఞభావపుష్పములఁబూఁచి- దశమస్కంధమున సర్వరసౌత్కృష్ట్యముఁ బ్రదర్శించుచు- భరతశాస్త్రప్రభృతి శాస్త్రపరిచయమును శిశులీలాదికప్రపంచజ్ఞానధౌరంధర్యమును యుద్ధయాత్రాప్రముఖరాజకీయవిశేషవిజ్ఞానము నొక్కుమ్మడి గ్రుమ్మరించుచు- సర్వజనహృదయంగమంబు లగుచుండు రాసలీలా జరాసంధసంహారకంసశాసన గోపికాలాప రుక్మిణీకల్యాణాదికకథాసముల్లసితకృష్ణచరిత్రలను సత్ఫలంబులఁ గాఁచి- శృంగారభక్తిరసంబులను, కొండొకచో వీరశృంగారంబులను, సమ్మేళనంబుజేసి యనంతభావసౌభాగ్యంబు వెలయ రచించిన భాగంబులందలి ప్రతిభచేఁ బండితులకు పామరులకుభావనభ్యసించువారికి వారువీరనక నాంధ్రమహాజనుల కెల్లరికి సర్వకామదంబై చెన్నారినది. పోతనకవిత్వమును పూర్తిగ విమర్శింపవలసిన కావ్యగుణంబులనెల్ల గల్గి యాతని యుపాఖ్యానంబులఁ బ్రతిదానిని ప్రత్యేకప్రబంధమువోలె గణింపవలయును. ఆపనికి బండితులు గుణగ్రహణపారీణులగు వార లియ్యకొందురుగాక.

పోతనయందు విమర్శకులు గొందఱు దోషంబుల మూఁడింటి నారోపింతురు. అవిఉభయరేఫమైత్రి సంధినూత్రనిరాకరణము. వ్యర్థపదాడంబరము. ఉభయరేఫమైత్రి పోతనయందుగన్పడదనియు నితరకవుల

భాగవతభాగములందే ప్రయుక్తమనియుకూడ నిరూపించితిమ్మకవి సోదాహరణముగ నిశ్చయించినాఁడు.

ఇఁక సంధిదోషములు:—పోతన యెచ్చటను సంధి దోషముల పాలై యుండలేదు. "సర్వమున్నతని" యనువానిలోని సంధిని బ్రహ్మశ్రీ కల్లూరు వేంకటరామశాస్త్రిగారు గుప్తార్థప్రకాశికలో నిర్దోషమని సమర్థించియున్నవారు. "పుట్టెన్నఁడు" మున్నగునవి ప్రమాదపతితములు. ఇఁక పదాడంబరదోష మొకటి మిగిలినది. అది రసావేశపారవశ్యముచే శ్రావ్యతగలది. సందర్భౌచిత్యము గలది. కాన విచారణీయముగాదు. అంతియగాక యీయభ్యాసము మహాకవులెల్లరిలో గన్పట్టుచున్నది. షేక్స్పియర్ "హామ్లెట్" అనునాటకరాజములో సమయస్ఫూర్తికొఱకు పదాడంబరము కవులచే రసోద్దీపకముగా బ్రయోగింపఁబడె నని వచించెను. కాన దాని నొక దోషముగా గణించుటకు వీలుగాదు.

ఇతనియెడఁ గొన్ని వివాదాంశము లున్నవి. వీరభద్రవిజయ భోగినీదండకముల కర్తృత్వము-పోతనవాసస్థలనిర్ణయము-జనపారంపర్యముగా వినఁబడు పోతనమహిమానుభావములగు కథలు- సంశయాళువులకు చర్చనీయములుగా నున్నవి. వీరభద్రవిజయములోని గద్య వేఱుగానున్నందున శ్రీనాథునిబావమఱది యగు పోతన్న యొక్కఁ డుండుటవల్లను, (చూ. ఆంధ్రపరిషత్పత్రికాసంపుటములు) నది పోతన్నది కాదనవచ్చును. అట్టినీరసమైన కవిత పోతనకు నచ్చియుండదు. భోగినీదండకము పోతనకూర్పునకు వెనుదీయకున్నను పోతనదేయని యొకవేళ సిద్ధాంతరీకరింపఁబడినను, ఆ నిశలన సె పోతన యాచంద్రతారార్కమగు కీర్తిని గడింపనికతంబున దానివిషయ మంతగా చర్చింప ననవసరము. పోతన యొంటిమిట్టవాఁడైనను యోరుగంటివాఁడైనను నాంధ్రమహాజనుల కెల్లరకును వంద్యుఁడే యగుట పరస్పరవివాదౌద్ధత్యములు ద్వేషములు, నిందలు ప్రయోజనరహితము లని నుడువవలసియున్నది. విమానములన్న వింతగా నింతవర కుండియు నిపుడు సాధారణవిషయమైనట్లు సరస్వతియే పోతనకు స్వాతంత్ర్యపథంబు గఱపుట, యొకసారి యన్నమువడ్డించుట, విష్ణువువరాహావతారమున గాజభటులను పాఱద్రోలుట, మున్నగువిషయంబులు నమ్మనివారికి భ్రాంతిగా దోచినను, నట్టిభక్తుఁడే, నేడు మహిమలఁ బ్రదర్శించిన నమ్మఁగల్గుదురు. కొందఱు నమ్మెడువారుగను మఱికొందఱు సంశయగ్రస్తులుగా నుండినను, పోతన మహాత్ముఁడగుట నిస్సందేహము.

పోతన యాంధ్రప్రపంచమునకును తద్ద్వారా ప్రపంచమునకు నర్పించిన సందేశ మెద్ది? భక్తిప్రాధాన్యేశ్వరోపాసనాద్వైతతత్త్వావలంబనముఁ గల్గి, సాత్వికగుణవిశిష్టమగు నిష్కామకర్మయోగముచేఁ బరమపదరూపంబగు జీవయాత్రనుఁ గడతేరి మానవుఁడు సుఖింపవలయు ననుటయే యీతని సందేశము.

సీ. "కర్మతంత్రుఁ డగుచు ♦ గమలాక్షుఁ గొల్చుచు
నుభయనియతవృత్తి ♦ నుండుచుండ
జెడును గర్మమెల్ల ♦ శిథిలమై మెల్లన
ప్రబలమగుచు ♦ విష్ణుభక్తి చెడదు"

మొదలగుకథాంత్య తీర్మానపద్యంబులం దెల్ల నీయర్థమే ప్రతిధ్వని నిచ్చుచున్నది.

వాఙ్మయస్థానమున పోతనపదవి యేది? ప్రపంచకవులగు వాల్మీకి వ్యాసహోమరు (Home ) లకు గాని వారికిగ్రిందిమెట్టుననే యుండు కాళిదాసను దాంతి (Dante) భూరిదర్శి (Furdnsic) శకవీర (Shekspeare) గాథి (Goethe) ప్రభృతులకుఁగాని పోతన్ననుఁ బోల్చుటకు, భాషాంతరీకరణకళంకంబొకటి యాతనిని బాధించుచున్నది. మహాకవికి స్వకీయకల్పన విశ్వభావనము కళాచాతురీకల్పిత సర్వసహృదయ హార్దోత్కర్షము (Originality universality and everlasting artistic pleasure) లావశ్యకంబులు. తుదిరెండుగుణములచే పోతన్నను కవిశ్రేష్ఠునిగా నిర్ణయింపనగును గాని మొదటిగుణమునుఁ బరామర్శించి పోతన భాషాంతరీకరణకర్త కాదని చెప్ప వలను పడదుగదా! ఎట్లయిననేమి? ఆంధ్రసరస్వతికి రూపకల్పనఁ జేయఁగోరు చిత్రకారు లున్నచో ననన్యసాధ్యార్థగభీరతయును వ్యాకరణవైచిత్ర్యసమంచితపదప్రయోగపటిమయు గల తిక్కన ప్రసన్నవదనముగను రసోత్కృష్టగరిమయు సుకుమారరచనాప్రసన్నతయు గల పోతనయే హృదయముగను ఏర్పరుపవలసియుండును. తిక్కన్న పోతన్నల మించు కవి జనించువఱకు ప్రపంచదేశభాషామతల్లు లెల్లను నొక్కసమావేశంబుగావించుటయే యెప్పుడేని తటస్థించినచో నాంధ్రవాణి కనపాయులై వెన్క నరుగుట కిర్వురుమాత్రమే సర్వవిధముల నర్హులు. వారే తిక్కన్న పోతన్నలు. యోగ్యతనుఁబట్టి యాంధ్రసారస్వతమునఁ దిక్కన ప్రథముఁడు పోతన్న ద్వితీయుఁడు. తక్కుంగలవారలు మిగిలినస్థానముల నలంకరింపదగినవారు?

చ. తెలిసిరొ, బాల్యధీఫలమొ ♦ దేల్చితి నింత భవద్విచర్చనం
బలఘుయశోవిభూతియు మ♦హాత్మ్యమనంతముగాఁగ గల్గు నీ
లలితపదప్రయోగరస ♦ లాలితసత్కవితామతల్లి నే
నలతిగఁ జేయ నాపయిని ♦ నాగ్రహ మూనక తొల్లియట్ల న
గ్గల మగు బుద్ధితైక్ష్ణ్యమిడి ♦ గైకొను ♦ పోతన నా నమస్కృతుల్.

క. నీ మహితకవిత నెఱుఁగన్
బామరుఁడగు నాకుఁ గాని ♦ పని, దుస్సహాతే
జోమాన్యుని రవిఁ జూడఁగ
నేమానవునకు సుసాధ్య ♦ మిలఁ బోతన్నా!

సీ. కాటుక కెప్పలఁ ♦ గన్నీరు రురవడింప
యాంధ్రవాణియె వచ్చి ♦ యఱియు నెల్ల
రఘువంశకలశాబ్ధి ♦ రాకాసుధాంశు డే
యలవడని కవిత్వ ♦ మల్లునెల్ల
గురుముఖంబున విద్య ♦ నరయకయేబుట్టు
రసభావ విస్ఫురర రచన ♦ లెల్ల
అతిశయభక్తి ♦ భావానుపోషణపార
వశ్యోత్థసుకుమార ♦ పదము లెల్ల

గీ. నీకె చెల్లును గాక య♦స్తోకశేము
షీప్రభావంబునఁ బ్రబంధ ♦ శేఖరులకు
భావికవులకుఁ జూపితి ♦ త్రోవలెల్ల
ప్రణుత తత్త్వార్థభాషి! ♦ పోతనమనీషి!

# సుకవీశ్వరుల ప్రశంస

### శ్రీయుత నిడుదవోలు వేంకటరమణ గారు

సకలామోద రసప్రవర్షిత వచ।స్సౌందర్య మేపారగా
నకలంకం బగు భావసంపదను కా।వ్యశ్రేణి నిర్మింపుచున్
ప్రకృతిగ్రంథ రహస్యశోధనకళా । పారీణులైనట్టి యా
సుకవిశ్రేష్ఠుల నాశ్రయించెదను సం।శుద్ధాంతరంగంబునన్.

చ. అలయక దీక్షఁబూని కవి।తామృతవాహినిచే జగంబునన్
జెలఁగెడి మానవాళిఁ జిర।జీవులఁ జేసి యమూల్య కావ్య భూ
షలఁ దనియించి వాక్సతి వి।శాలయశోంబర మధ్యమందు ని
శ్చలగతి వెల్గు సత్కవులు । సంస్మరణీయులు గారె నిచ్చలున్.

సీ. మహికర్ణ మకరంద । మాధురీమహిమంబు, దలపించు నీముద్దు । పలుకులోన
నవనవోన్మీలిత । భువనసంజాతంబు, వలపించు నీదు భా।వంబులోన
ప్రాలేయకిరణసం।భవసుధాజాలంబు, మఱపించు నీగాన । మహిమలోన
సకలకలాన్వితా।ధికసౌధరాజంబు, హావణించు నీదు కా।వ్యంబులోన

గీ. ఎంత యానంద మున్నదో । యెఱుఁగగలమె?, ఎంత మాహాత్మ్య మున్నదో । యెఱుఁగగలమె?
సర్వ మెఱిఁగిన యొక్క యీ।శ్వరుఁడు దక్క, సకలకల్యాణగుణసాంద్ర! । సుకవిచంద్ర!

గీ. అఖిలజగముల । కాధార మైనయట్టి, సత్యము నెఱింగి పరమార్థ।సార మెఱిఁగి
ఎఱుఁగఁదగువాని నెల్లను । నెఱిఁగినట్టి, సకలకవివర్యులకు నమ।స్కారశతము.

గీ. కవితచేతనె జగములు । గలుగుచుంట, జగములుం గవిచేతనె । సాగుచుంట
కవిత కెఱుఁగని చిత్రసం।గతులు గలవె?, కవితచేఁ జెందరాని స।ద్గతులు గలవె?

గీ. అమలతర కీర్తిమయశరీ।రములనుండి, అసువులు దొలఁగకుండ కా।వ్యామృతంబు
జీవరసమును పోసి పో।షించువారు, కవులుగాక మఱెవ్వరు । గలరు జగతి.

గీ. జీవములు నిల్పు నిర్మలో।జ్జీవరసము, భువనమోహనకరము స।మ్మోదరసము
పరులకేగాని తమకునై । పాలుగొనరు, జగతి నుపకృతి కవులకు సహజగుణము.

గీ. చంచలం బగు విశ్వప్ర।పంచమందు, నిక్కువంబుగ నిలుచువాఁ । డొక్క కవియె!
కాలపురుషుని దండ ప్రఘాతమునకు, జెక్కుచెదరక నిల్చువాఁ । డొక్క కవియె!

గీ. ప్రకృతి యనునట్టి యీ మహా।గ్రంథమందు, నొక్కపుటయైనఁ ద్రిప్పువాఁ । డొక్క కవియె!
పెక్కురీతులు దాల్చు నీ । పృథివియందు, నొక్కరీతిగ నుండువాఁ । డొక్క కవియె!

గీ. దిక్కులెల్లను నిండి పెం।పెక్కు వెలుఁగు, చక్కఁగాఁ జూచినట్టివా । డొక్క కవియె!
అట్టి కవికన్న నెవ్వరీ । యవనియందు, ధన్యు లతులితమతులు స్వ।ధర్మపరులు.

రూ 250 లు బహుమానములు యివ్వబడును

## చమత్కారగణితము (యుక్తిలెక్కలు)

ఈ గ్రంథములో గణితసంబంధమైన తమాషాలు, వినోదములు, చిక్కులు, చిక్కుప్రశ్నలు, రేఖాగణితసమస్యలు, అంకెలలోని చిత్రములు, గీతలతోచేయు చిత్ర విచిత్రములు, గణితచమత్కారములు, మనోగణితము, యుక్తిలెక్కలు మొదలైనవి గలవు. ప్రతి వ్యాపారస్తునివద్దను, ప్రతి గుమాస్తాదగ్గరను, ప్రతి ఉపాధ్యాయునివద్దను, ప్రతి విద్యార్థిచేతిలోను, వీరువారననేల, అందరివద్దను ముఖ్యముగా నుండవలసిన పుస్తకము. ఏలననగా ఇది వర్తకులపాలిటి చింతామణి. గుమాస్తాలపాలిటి కామధేనువు. స్త్రీలపాలిటి గృహలక్ష్మి. ఉపాధ్యాయులపాలిటి కల్పతరువు. విద్యార్థులపాలిటి వరప్రసాదము. వేయి వక్కాణించి వ్రాయ నేల? ఈ గ్రంథమును తెప్పించి చదివినచో గణితమునం దసమాన ప్రజ్ఞయు, చతురతయు, చమత్కారమును, ఎక్కువ తెలివియు నలవడును. ఈ గ్రంథమంతయు ప్రశ్నలపూర్వకముగా ముందు పంపబడును. ఈ పుస్తకములోని ప్రశ్నలకు ప్రత్యుత్తరములు వ్రాయుటలో మొదటివారుగా గడ తేరినవానికి 116 లు ప్రథమ బహుమాన మొసంగబడును. రెండవ వారుగా తేలిన వానికి రూ 50 లు ద్వితీయ బహుమాన మివ్వబడును. తృతీయబహుమతి రూ 25 లు, నాల్గవ బహుమతి 15 లు. ఇట్లు 10 బహుమానము లుండును. ఈ బహుమానములకొరకు అక్షరజ్ఞానము గల ప్రతివారును ప్రయత్నము చేయవచ్చును. ఈ పరీక్షకు స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, యవ్వనులు అందఱునుకూడ ప్రయత్నించవచ్చును. ఎవరియిండ్లలోవారు కూర్చుండి మీకు తెలియని ప్రశ్నలకు యితరులను అడిగి తెలుసుకొనికూడ గ్రంథమందిన 3 మాసములకాలములోపల పరీక్షప్రశ్నలకు సదుత్తరములు వ్రాయ వచ్చును గనుక కడుసులభము. ఫల మధికము. మా వద్దనుంచి చమత్కారగణితము (యుక్తిలెక్కలు) ప్రశ్నపుస్తకమును తెప్పించుకొనిన ప్రతిఒక్కరును పరీక్షకు అర్హులు. ఈపరీక్షకు ప్రత్యేకరుసుమేమియు చెల్లించనక్కరలేదు. పరీక్షలో గెలుపొందినవారి పేర్లనుకూడ ప్రత్యుత్తరములపొత్తములో ప్రచురించుచు, యీప్రశ్నపుస్తకమునుకొనిన ప్రతిఒక్కొక్కనికి వెనుకనుండి ప్రత్యుత్తరముల గ్రంథము సహితము ఉచితముగాపంపబడును. చమత్కారగణితము (యుక్తిలెక్కలు) పరీక్షప్రశ్నల పుస్తకము వెల రూ 1-0-0 మాత్రమే. 1 రూ. మాకు తక్షణమేపంపినచో, మీపేరును రిజష్టరుచేసుకొని మీనెంబరునున్న, చమత్కారగణితము(యుక్తిలెక్కలు) పరీక్షప్రశ్నల పుస్తకమునున్ను మీకుపంపెదము. కొద్దిప్రతులు మాత్రమేగలవు. ఆలస్యముచేసిన ఆశాభంగముకలుగును. త్వరపడుడు. మావిలాసము:—పి. ఆర్. జనార్దనంనాయుడు, ఒంగోలు పోస్టు, యం.యస్.యం.రైల్వే, దక్షిణఇండియా అనివ్రాయవలెను.

# రాచమడుగు పెద్ద అప్పయ్య శెట్టి అండు సన్సు,

73, నారాయణ మొదలి వీధి,

కమీషను యేజంట్లు అండు యినుపపెట్టెల వ్యాపారం, మద్రాసు.



మాకంపెనిలో క్రొత్తరేకులతో అనేక మర్మములతో యినుము పెట్టెలు తయారు చేయించి వెల సరసముగా విక్రయించబడును. పెట్టెలు సిద్ధముగా నున్నవి.

**R. P. APPIAH CHETTY & SONS,**

**Commission Agents & Iron Safe, Manufacturers,**

**73. Narayana Mudaly Street, MADRAS.**

# భోజబంద్.

రాత్రి యొకమాత్ర పుచ్చుకొనిన యెంత పలుచబడిన వీర్యమయినను రెండుగంటలకాలము స్తంభించి అధికమయిన రతి సౌఖ్యము నిచ్చును. కావలసినప్పుడు కొంచెము నిమ్మపండురసము త్రాగిన వెంటనే వీర్యస్ఖలన మగును.

మూడురోజులు రెండుపూటలు పాలతో పుచ్చుకొనిన ధారగాబోవు వీర్య (శుక్ల) నష్టమయినను తప్పక కట్టును. 15 రోజులు పాలతో రెండుపూటలు పుచ్చుకొనిన జారత్వాదిదురభ్యాసములవలన కలిగిన నపుంసకత్వము పోయి మరల యౌవనము లభించును. అనేకులచే పరీక్షింపబడి సర్టిఫికెట్లు పొందియున్నది. మీరు వ్రాయు ఉత్తరములు రహస్యముగా నుంచబడును. 20 మాత్రల సీసా 1-కి రు. 2-0-0 వి. పి. ఖర్చులు వేరు. మందు పుచ్చుకొనువిధము మందుతో పంపబడును.

ఆర్యవైద్యాశ్రమం,

38, బైరాగిమఠం వీధి, మద్రాసు. జి. టి.

# "ఏకో రసః కరుణ ఏవ"

బసవరాజు వేంకటప్పారావు గారు బి. ఏ.

ఏకో రసః కరుణఏవ నిమిత్తభేదా ద్భిన్నః పృథక్పృథగివాశ్రయతే వివర్తాన్,
ఆవర్త బుద్బుద తరంగ మయాన్వికారా నంభోయథా సలిలమే వహి తత్సమస్తమ్.
(భవభూతికృత ఉత్తరరామచరితము.)

రసములం దెల్ల కరుణయే రసమా? ఔరా యేమి యీభవభూతి యభిమానము? ఇతనికి నిజముగ సంస్కృత కావ్యలక్షణము తెలియదందుమా? లేక తానేమో ఉత్తరరామచరితము నాటకముగ వ్రాయుచు అందు కరుణరసమే స్థాయీభావముగ గ్రహించియుండిన కారణముననే స్వాభిమానప్రేరితుఁడై, స్వోత్కర్ష ప్రకటనకాంక్షాపరతంత్రుఁడై యిట్లు వ్రాసెనందుమా? లేకున్న కరుణతక్క వేఱు రసమే లేదని మనఃపూర్వకముగ నమ్మి యీవిధమున వ్రాసెనందుమా? భవభూతితోపాటు మనము కూడ రసములం దెల్ల కరుణయే రస మని యొప్పికొందుమా?

మున్ముందు శ్లోకభావమును గ్రహింప యత్నింతము. రస మనఁగ కరుణయే రసము. ఈ భావమునే మఱొక విధమున స్ఫుటముఁ గావింపవచ్చును. లోకములో నెల్ల ఒక్కటే యనఁదగు రస మేది యని ప్రశ్నింప కరుణయే యని భవభూతి ప్రత్యుత్తర మొసఁగుచున్నాఁడు. "మంచిదే. అంతవఱకొప్పికొందము. కాని కరుణ కాక ప్రపంచమున నితరరసము లెన్నియో యనుభూతము లగుచున్నవి కదా? ఈరసము లన్నియు నెచ్చటనుండి వచ్చినవి?" అని జిజ్ఞాసువు ప్రశ్నింపక మానఁడు. అందులకు భవభూతి యేమని సమాధాన మొసఁగుచున్నాఁడు? "ఓయి అమాయికుడా! లెక్కకు మిక్కిలిగఁ దోఁచు రసము లన్నియు కరుణకన్న వేఱగు రసము లని తలంచుచుంటివా? పొరపాటుసుమీ! నిమిత్తభేదములవలన, అనఁగ రసమునకు కారణభూతులును లక్ష్యభూతులు నైన వారియొక్క ఉపాధిభేదముల మూలమున, భిన్నమై కొంతకొంత వేఱుగఁ దోఁచురూపములఁ దాల్చుచున్నదే కాని రస మనఁగ కరుణ యొక్కటే సుమా? ఎట్లంటేని చూడుము; జలము సుడిగుండములో తిరుగుచున్నపుడు, బుడగలు తరఁగలు మొదలగునవి యెన్నో కన్నుల కగపడును. అవి యన్నియు జలమే కదా? సుడిగుండము నాశ్రయించిన కారణముననే కదా జల మీవికారముల, ననఁగ రూపాంతరములను, పొందినది? కావున నిప్పటికైన కరుణ యొక్కటియే రస మనియు మిగిలిన రసములు, అనఁగ కరుణ కాక వేఱైన వని నీవు తలఁచు రసములు, అన్నియు ఉపాధిభేదజనిత రూపాంతరములే యనియు తెలిసినదా?" యని నచ్చజెప్పుచున్నాడు.

కాని, యెట్లో యొకట్లుగ మనస్సును సమాధాన పఱచికొని కరుణ యొక్కటియే రస మని యొప్పికొందు మన్న లాక్షణికు లూరకుండరు కదా? "వీరశృంగారయో రేకః ప్రధానం యత్ర వర్ణ్యతే" అని మహాకావ్య నాటకాదుల లక్షణముగ నిర్వచించిరే! వీర శృంగారములలో నొకటే కావ్యమునఁ గాని నాటకమునఁ గాని ప్రధానముగ వర్ణింపవలెనని కదా లాక్షణికులు శాసించిరి! ప్రజలకు రాజశాసనమువలె కవులకు లాక్షణికుల శాసనము ననుల్లంఘ్యము కదా? లక్షణ విరుద్ధముగ నేఁటికీభవభూతి యొకఁడు కరుణయే రసమని నిర్ణయించి దానినే తన యుత్తరరామచరిత నాటకమునఁ బ్రధాన రసముగఁ బోషించినాఁడన్నంత మాత్రమున బుజము లెగురవేసి లాక్షణికశాసనము నతిక్రమించి భవభూతితోపాటు తోడిదొంగలుగ (abettor's అని భావము) మనమును దారుణ లాక్షణిక శాతాసిహతికి గుఱి యగుదుము కదా? అయ్యో బుగ్గను నమ్ముకొని నట్టేట మునిగి నట్లైనదే మనగతి! కరుణ యొకటియే రస మని యీతఁడు చెప్పినంతమాత్రమున నేదో మొగమాటముచే నొప్పికొని యేల యీలాక్షణికులచేతఁ జిక్కి సిలుగుల పాలైతిమి?

మొదటి ముద్దాయి యగు భవభూతి తుండు తుపాకి లేకుండ నెగురఁగొట్టుచున్నాఁడు. "ఏ కుటిపక్షపు న్యాయవాదియొక్క కేసంతయు అబద్ధము. నా కేసంతయు

నిజము. కావున వెంటనే కేసు నాపక్షమున డిక్రీయీావ లెను. "మీారు డిక్రీయీాయకున్న అపీలు కోర్టులో తప్ప కుండ నా పక్షముననే డిక్రీయిచ్చితీరుదు" రని పల్కు న్యాయవాదివలె వాదించుచున్నాడు.

"ఏకో రసః కరుణఏవ నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథగి వాశ్రయతే వివర్తాన్.

అను నది నా కేసు. అందులకు తీర్పు

"ఆవర్తబుద్బుదతరంగమయాన్ వికారాన్
అంభోయథా సలిలమేవహి తత్సమస్తమ్.

అనునదియే. కావున నావాదమే నిజమైనది. ప్రతిప క్షులవాదము నిరాధారమైనది. ఇందులకు మీారంగీక రింపక నాకావ్యమును త్రోసి రాజందురా నాకేమియు భయములేదు. ఇదిగో అపీలు చేయుచున్నాను.

"యేనామ కేచి దిహ నః ప్రథయన్త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ప్రతి నైషయత్నః
ఉత్పత్స్యతేస్తి మమకోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ"

మీాకు నా కావ్య రసము రుచించకపోయిన నాకేమియు లోటులేదు. దానిని గ్రోలి పరవశులై తాండవము సల్పువారు ముందు పుట్టకపోరు. కాలమున కంతు లేదు కదా! ఈ పృథ్వి విశాలము కదా? మఱేమియు భయ ము లేదు పొం డని లాక్షణికులను ధిక్కరించి మరీ వాదించుచున్నాడు. పోనీ మన మేదైన క్రొత్తమార్గము నాలోచించి సవినయముగ వాదించి తప్పించుకొందమా? ఇట్లు మనవి జేసికొందము.

"రసిక శిఖామణి వగు నో న్యాయ నిర్ణేతా! మా మనవి చిత్తగింపుము. స్థూలదృష్టితోఁ జూచువారికి మా భవభూతి లాక్షణికులయాజ్ఞ నతిక్రమించి తమశాసనము వారికి గురియైనట్లు కన్పించును. కాని సూక్ష్మముగఁ బరిశీలించిన నతడేమియుఁ దప్పుఁ గావింపలేదనియు రస మనఁగ నేమో, కరుణ శృంగార వీర రసములన నేమో తెలియకపోవుటయే యీనిందకుఁ గారణమనియు విశదమగును. ప్రప్రథమమున రస మన నేమో తెల్పెదము. రస్యత ఇతి రసః అనియు, రసః సఏవ స్వాద్యత్వా ద్రసికస్యైవ వర్తనాత్ అనియు రసరహ స్యవేత్తలు నిర్వచించి యున్నారు. రసమునకు రుచి కల్గించుటయే ముఖ్య లక్షణము. అట్టి రుచి అనుభవ శాలికే కలుగును. అనఁగ జన్మాంతర సంస్కారవాస నాబలము కలిగిన యనుభవ రసికుఁడే రసము ననుభ వింప గలుగును. అట్టిరసికునే రసము రంజింపజేయును. వస్తు విశేషమును తిలకించినపుడు అనుభవరసికుఁ డగు వానికి కలుగు భావమే రసము. వస్తువును తిలకించనిది రసము జనింపదు. జన్మాంతర సంస్కారము కాని, అథ మపక్షమున నిహజన్మసంస్కారము కాని లేనివానికి వస్తువును తిలకించి నంతనే భావము, అనఁగ రసము జనింపదు. అందుకనియే కదా కాళిదాసు—

"అధరస్యమధురిమాణం కుచకాఠిన్యం దృశోస్తైక్ష్ణ్యంచ,
కవితాయాః పరిపాకం హ్యనుభవరసికో విజానాతి"

యని నిష్కర్షగఁ బలికెను? జన్మాంతర సంస్కార బలమున రసపరవశుఁడై కావ్యగానము సల్పునతఁడు సహజకవి. ఇహజన్మసంస్కారముచే రసానుభవము నొందు నతఁడు పండితకవి కాని కేవలపండితుఁడు కాని యగును.

ఈ ప్రసక్తి యేలయందురా వినుఁడు. రసము జన్మాంతరసంస్కారబలముచే జనించునని యంగీకరించి నచో మా వాదముయొక్క ప్రాతిపదిక నంగీకరించిన యట్లే. జన్మాంతరసంస్కారబలసమన్వితుఁ డగు కవి యేదేనివస్తువును దిలకించినపు డది యాతనికొక ప్రత్యేక రూపముదాల్చినట్లు కన్పించి యాతనియం దొక ప్రత్యేక భావమును జనింపఁ జేయును. అతనికి సంబంధించి నంతవరకు అతనికి గోచరించు రూపమే వస్తువు యొక్క సిద్ధమగు రూపము. అతనిమనమున జనించు రసమే తద్ద ర్శనమువలన జనింపఁదగిన రసము. వెనుకటి కొకఁడు "నీభార్య కోతివలె నున్నదేమిరా" యన వెంటనే "ఓరీ నాకన్నులు పెట్టుకొని చూడు" మని రెండవవాఁడు పూర్వపక్షము చెప్పెనట. అట్లే కవి విషయము కూడ. ఒక్కొక కవికి జన్మాంతరసంచితపరిపాకమున ప్రకృతి ఆనందమయముగ గన్పట్టును. వెనుకటికి మా గురువగు రాధాకృష్ణన్‌గారు "కడుపునిండ భోజనము చేసినవాఁడు ప్రపంచముననున్న తోడిమానవులను దయార్ద్రహృదయ మున మన్నించును. ఆకలిచే మటమటమాడువాఁడు కాని, విచారసంక్షుబ్ధ మనస్కుఁడు కాని, అపచార క్షుబ్ధాంతరంగుఁడు కాని తోడిమానవుల లోపములను నిష్కరుణతో ఖండించు" ననియు పల్కుచుండెడి వారు. షేక్స్పియర్ మహాకవి జూలియస్ సీజర్ అనునాటకమున

**“Yon Cassius hath lean and hungry looks, I fear him.”**

అని వచించి యున్నాడు. మఱియొక్కనికి ప్రపంచము విచారజనకమగును. ఒకడు పుట్టుకతోడనే మానవకల్పితనియమశృంఖలల నొక్కపెట్టున త్రెంచివేయవలెనను స్వాతంత్ర్యేచ్ఛతోడనే జన్మించి షెల్లీకవివోలె సాంఘికనియమముల నెల్ల తృణీకరించి తుదకు విషాదజనకమగు పరిణామము నందును. మఱియొకడు ప్రకృతి ధర్మములను మానవకల్పితము లగు సాంఘిక ధర్మములను సమన్వయము కావించి సమరసబుద్ధితో ననుభవించి జీవితసంరంభమున విజయము నొందగలుగును. కావున సుఖదుఃఖ, ఆనంద విచారాది విభేదములన్నియు ననుభవించువాని పూర్వజన్మవాసనను బట్టి యనుభూతము లగుచుండును. మానవప్రకృతు లనంతము లగుటచే నిట్టి రసవిభేదము లనంతము లగును. ఎవని కెట్లు రస మనుభూత మగునో అట్లేయాతఁడు వర్ణించును. అందుచే నీవు శృంగారమునే వర్ణించుము, వీరరసమునే వర్ణింపుము అని శాసనముఁగావింపజూచుట లాక్షణికనిరంకుశాధికారధూర్వహణము మాత్రమే యగును. నిజముగ నిట్టి విషయమున స్వాతంత్ర్య మెవ్వరికైన నుండదగు ననినచో నదియొక కవికేఁ గాని తదితరులకుఁ గాదు. అందుకనియే కదా “ నిరంకుశాః కవయః”అని మనవారును,“ Poets are the unacknowledged legislators of the world ” అని షెల్లీ మహాకవియు నుద్ఘోషించినారు? ఈభావమే—

“ కవుల బంధింపగల్గు శృంఖలలు లేవు,
వారె సర్వలోకములకు ప్రభువు లఱయ ”

ననుచు నిరాఘాటముగ దెల్పవచ్చును గాదే! భవభూతి అత్యంతస్వాతంత్ర్యప్రియుఁడు. లాక్షణికుల యడుగులకు మడుగులొత్తు వాఁడు కాడు. అట్టిభాగ్యము కాని దౌర్భాగ్యము కాని ఇతరులకు పట్టవలసినది భవభూతికి మాత్ర మెన్నటికిని కాదు. ఎదుట సాక్షాత్కరించిన రసస్వరూపమును తోడివారి లాలింపులకుఁగాని పైవారిబెదరింపులకుఁగాని క్రిందివారి యీసడింపులకుఁగాని లొంగక యథాదృష్టముగ చిత్రించిన కవిశేఖరుఁడు. ఆతనిహృదయమునకు కరుణకన్న వేరురసము లేదని యనుభవైకవేద్యమగుటచేతనే యతఁ డట్లు వ్రాసెను. అతని హృదయమునకే యనుమాట యేమి? ఆదికవియగు వాల్మీకి తమసానదీతీరమున క్రౌంచమిథునమునం దొకటి కిరాతునిచే వధింపఁబడుటఁ గాంచి యార్ద్రీభూతహృదయుఁడై, అనుకంపాచకితాంతరంగుఁడై తోడనే ఆకస్మికప్రత్యవభాసమును, అవ్యతికీర్ణరూపమును నగు భావమును దేవభాషలో, ననుష్టుప్ ఛందరూపమున—

“ మానిషాద ప్రతిష్ఠాం త్వ
మగమః శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక
మవధీః కామమోహితమ్. ”

అనుచు కరుణరసము జగము నంతయు కరగింప నాక్రోశ మొనరించెను. తోడనే బ్రహ్మ ప్రత్యక్షుడై యతనిని—

“ఋషే! ప్రబుద్ధోసి వాగాత్మని,
తత్ బ్రూహి రామచరితం,
అవ్యాహతజ్యోతి రార్షం
తే చక్షుః ప్రతిభాతి. ఆద్యః కవి రసి. ”

యని యాదేశించి యాశీర్వదించి యంతర్హితుఁ డయ్యెను. అనంతరము వాల్మీకి యాశ్లోకమునే ప్రాతిపదికగ గ్రహించి శ్రీరామచరిత్రమును రచించి ధన్యుఁడై సంస్కృతకవులకు కల్పవృక్షమును ప్రసాదించియేగెను. ఆ కల్పవృక్షఫలములనే కాళిదాసు భవభూతి, శంకరుడు మొదలగు మహాకవులు భుజించి తద్రసగ్రహణ పారవశ్యమున కావ్యగానముఁ జేసిరి. అట్టివాల్మీకినే లక్ష్యమున నుంచికొని రామచరితమును వ్రాసి ధన్యుఁడు కాదలచిన భవభూతికి- రామజీవితమున లీనమైపోయిన భవభూతికి- కరుణతక్క నన్యరసములు గోచరించునే? అది యతనికి భగవంతుడు ప్రసాదించిన రసము. అదియే అతని జీవితమును సర్వమును చలింపఁజేసినరసము. అందుచేతనే అతఁడు“ఏకో రసః కరుణ ఏవ”అనియుద్ఘోషించెను. తక్కిన రసములన్నియు కరుణయొక్క రూపాంతరములే యని సమర్థించెను. ఏ యితివృత్తమునకు తగినరసమా యితివృత్తమునకే. ఏకవికి ప్రసాదింపఁబడిన రసమా కవికే గ్రాహ్యమగును కాని అలంకారికనియమితములగు రసములు కావు. కవికి ప్రసాదింపబడిన రసమును ఆలంకారికుడు కోరురసమును నొకటైయైన ఆలంకారికునిదే యదృష్టము. వెనుకటికి “రోగియు పాలే కోరెను. వైద్యుడును పాలే యొసగ” ననులోకోక్తి కలదు. అట్టి యాలంకారికులకు శరణ్యుఁడు కాళిదాసే! అతఁడు తన నాటకముల శృంగారమునే యుపయోగించి తన మర్యా

దను ఆలంకారికుల మర్యాదనుకూడ కాపాడెను. అందు కనియే మన లాక్షణికు లెల్లరును "కవికులతిలకః కాళిదాసః" అని పొగడుట. కాళిదాసు సమకాలికసాహిత్యసంప్రదాయముల ప్రతిఘటించు వాఁడు కాఁడు. ఉన్న వారి కనుగుణముగనే తన ప్రజ్ఞను కనుబఱచినాఁడు. ఆపరితోషా ద్విదుషాం నసాధుమన్యే ప్రయోగవిజ్ఞాన" మ్మని నమ్మువాఁడు. భవభూతి స్వేచ్ఛాప్రియుఁడు. అవసరమైన సమకాలికసంప్రదాయముల తిరస్కరించి నిజమనోగతభావమును యథానుభూతముగ వర్ణించు ఖండిత స్వభావము కలవాఁడు. కవుల సంఖ్య యనంతము. వారనుభవించు రసములును తద్రసముల కాశ్రయము లగు నితివృత్తములును ననంతములు. అనంతోవైరసః అను మాట సిద్ధాంతము. వీరశృంగారములు మాత్రమే కావ్యమున ప్రధానరసములుగ నుండవలెననుట పొసగనిదియు కవికావ్యప్రకృతివిరుద్ధమును నగు మతము. ఈ విషయమున కవియొక్క విషయసాక్షాత్కారమే - రససాక్షాత్కారమే-అంతఃకరణ ప్రవృత్తియే- కవికి ప్రమాణము. కాని యాలంకారికనిర్వచనములు కావు. నిరంకుశాః కవయః అనుట సర్వకాలములను సర్వదేశములను సత్యము.

ఇక కరుణరసము మూలరసమును, అందుచేత నదియే యేకరస మనియు నెట్లు నిర్ధారణ జేయనగును? ఈ నిర్ధారణఁ జేయుటకు ముందు కరుణరస మన నేమో తిన్నగా గ్రహింపఁ దగును. కరుణరసము శోకమను స్థాయీభావమువలన జనించు నని కావ్యప్రకాశికాది గ్రంథములలో లాక్షణికులచే నిర్వచింపఁ బడినది. కరుణరసమనఁగ నిష్టబంధుజనవియోగజనితదుఃఖమే యని వారిమతము. ఇట్టిదుఃఖమే ప్రపంచమున సర్వత్ర మూలరస మనుట యొకవిధముగ సాహసమే యగును. దుఃఖమే మూల రస మగుచో నొక్కరామునికి మాత్రమే కాక జీవరాసుల కెల్లను—

"అద్యావసితం జీవితప్రయోజనం శూన్యమధునా
జీర్ణారణ్యంజగత్ అసారస్సంసారః కష్టప్రాయం శరీరం"

అను వాక్యములు వర్తింపవలసివచ్చును. జీవరాసులెల్లను

"అశరణావయం, కింకుర్మః కాగతిః క్వగచ్ఛామః.
దుఃఖసంవేదనాయైవ నాస్మాసుచైతన్యమాగతం,
మర్మోపఘాతిభిః ప్రాణైః వజ్రకీలాయితంస్థిరైః.

అనుచు రామునివలె విలపించుచు తుట్టతుదకు నివృత్తి మార్గము నవలంబింపవలసి వచ్చును. ఇట్టి జగత్ప్రళయ సమానమగు నవస్థ మానవులకు సహజముగ ననుభూతము కానవలెననియు నిట్టి యనుభవమే కరుణరసమనియు భవభూతి యెన్నటికిని తలచియుండఁడు. ఇట్లు తలచి యుండనిచో కరుణరసమున కింకొక యర్థమేమి చెప్పవలెనను ప్రశ్న ముదయించును. మా మతము ప్రకారము భవభూతి కరుణరస మనఁగ పరులకష్టసుఖములగని చకితమై ఆర్ద్రమగు హృదయమున జనించు ననుకంపమే యని భావించెను. హృదయమున నార్ద్రత లేనివానికి కరుణ జనింపదు. కరుణ యన నొక్కదుఃఖవిషయమున జనించు ననుకంప మాత్రమే యని భావింపదగదు. ఒకవేళ అట్లు భావించినను దుఃఖానుభవములోనే అనేక తారతమ్యస్థితు లున్నవి. ఒక స్త్రీ మరణము నొందినపుడు భర్తకొకవిధమగు దుఃఖము పిల్లలకొకవిధమగు దుఃఖము- తల్లితండ్రులకొక విధమగు దుఃఖము - చెలికత్తెలకొకవిధమగు దుఃఖము. మిగిలిన తోడిజనులకొక విధమగు దుఃఖములు కలుగుచున్నవి. కాని వీని నన్నిటిని నిమిత్తభేదములుగమాత్రమే పరిగణించి వీని నుద్బుద్ధము గావించు మూలరసము సర్వత్రాపి కరుణయే యని జలసాదృశ్యమును బట్టి భవభూతి నిర్ణయింప జూచెనని కొందరందురు- కాని ఇది అంత సమంజసము కాదు. దుఃఖసమయ మప్పుడు జనించు కరుణయే మూలరసమని చెప్పుటకు చాల యభ్యంతరము కలదు. పైన చెప్పఁబడిన దుఃఖభావములలో నొకదాని కింకొకదానికి నిసర్గములగు భేదము లెన్నో కలవు. భర్తయొక్క దుఃఖము ప్రణయోద్బుద్ధము. తల్లిదండ్రుల దుఃఖము వాత్సల్యోద్బుద్ధము. పిల్లల దుఃఖము మాతృప్రేమోద్బుద్ధము. తోడిజనుల యొక్క దుఃఖము సాధారణానుకంపాజనితము. చెలికత్తెల దుఃఖము స్నేహోద్బుద్ధము. అన్నియు దుఃఖములే కావున దుఃఖమే మూలరస మనుట బియ్యమునకును పిడుగునకు నొకే మంత్ర ముపయోగించి నట్లగును. అది కాక దుఃఖమే జీవితమునకు మూలమనియు దుఃఖమే జీవితసర్వస్వమనియు దుఃఖమే జీవితపరిణతి యనియు చెప్పుట చెప్పువానియొక్క మనఃప్రవృత్తిని అతని విచారమును మాత్రమే సూచించును కాని దుఃఖమే మూలరసమని సిద్ధాంతము చేయుటకు తార్కాణము కాజాలదు.

అథేదం రక్షోభిః కనకహరిణచ్ఛద్మవిధినా
తథావృత్తం పాపై ర్వ్యథయతి యథా క్షాలితమపి

జనస్థానే శూన్యే వికలకరణై రార్యచరితై
రపిగ్రావా రోదిత్యపిదళతి వజ్రస్యహృదయమ్.

అను శ్లోకము రాముని శోకముయొక్క తీవ్రతనే సూచింపగలుగును కాని దుఃఖాత్మ మగు కరుణయే మూలరసమని స్వీకరింపఁజాలదు. ఒక్కరాముని జీవితము దుఃఖమయమైనది కావున జీవితమునకు దుఃఖమే మూలమనుట హేత్వాభాసమగును. అందువలన దుఃఖమే కరుణ యనునెడల కరుణ మూలరసము కానేరదు. కాఁదగదు కూడ. ఇక కరుణ యన పరుల కష్టసుఖముల విషయమున ననుకంప ఆర్ద్రిత, సంచలనము నొందుట, తన కష్టసుఖముల నార్ద్రానుకంపాదిభావములతో ననుభవించి యితరులకు తదనుభూతరసవాసన వ్యాపింపజేయుటయేః యగుచో తప్పక యంగీకరింపవచ్చును. కాని యిట్టి కరుణకు ప్రత్యేకవిలక్షణత్వ మేమియు నుండదు. అట్టి యనుకంపాజనకశక్తి ఆర్ద్రీకరణశక్తి సర్వరసములకు కలదు. అట్టి శక్తి శృంగారమునకు కలదని కాళిదాసు చూపింపగలిగెను. శాకుంతల సౌందర్యదర్శనమొక్క దుష్యంతునికే కాక సర్వమానవప్రపంచమునకును నేత్రనిర్వాణముఁ గూర్పఁ గలుగును.

కుసుమమివ లోభనీయం యౌవన మంగేషు సన్నద్ధం
అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదితరసం
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూప మనఘం
యా తత్ర స్యా ద్యువతివిషయే సృష్టి రాద్యైవ ధాతుః
జీవితం మే ద్వితీయం

ఇత్యాది వాక్యముల కాళిదాసునిచే వర్ణితమైన ప్రేమరసము సమస్తజీవరాసులకును మాధవీలతాసహకారములకును, పద్మినీభాస్కరులకును కువలయినీసుధాంశులకును కలదుకదా. సర్వసృష్టికిని మూలకారణమగు భావము నుదయింపజేయు శృంగారము మూలరసమని యేల నిర్ణయింప దగదని వాదించుచో కాళిదాసున కెవ్వరు ప్రత్యుత్తర మీయగలరు? సకలజీవరాసులను చలింపజేసి కడుపులు చెక్కలుగ నవ్వింపగల శక్తి హాస్యరసమునకుఁ గలదని మహాకవి షేక్స్పియర్ రాబర్ట్ బరన్స డికెన్స మొదలగు వారిచే వర్ణింపఁబడినహాస్యరసము నాస్వాదించిన వారికి గోచరింపకపోదు. ఫాల్‌స్టాఫ్ యొక్క వేషమును చూచికాని, షేక్స్పియర్ సృష్టించిన యితరహాస్యరసపాత్రములవాక్యములను కాని,

"The rank is but the guinea's stamp, a man is a man for a' that,"

అని వర్ణించిన రాబర్టు బరన్స హాస్యప్రసంగములను కాని, డికెన్సుయొక్క దయాపూర్ణహాస్యభరిత ప్రసంగములను కాని

"Ah, take the cash in hand, and waive the rest, Oh the brave music of a distant drum"!

అనుచు ఆముష్మికసుఖాపేక్షకుల నందఱ నెగతాళి జేసిన ఒమార్ ఖాయాంయొక్క వికటహాస్యభరితవాక్యములను కాని జదివినప్పుడు ఏకో రసో హాస్యఏవ అనిపించును. మార్లో రచితమగు టాంబర్లేన్, గేతే రచితమగు ఫాస్టు మొదలగు నాటకములలోని వీరరౌద్ర బీభత్స భయానకాద్భుతాది రసములలో దేని కదియే "ఏకోరసః" అను నట్లుండును. కావున నింతదూరము చర్చించుటవలన తేలిన దేమనఁగా ననుకంపాజనకశక్తియు, హృదయవిద్రవణశక్తియు ప్రతిరసమునకు లక్షణములే యనియు, కరుణకుమాత్రమే ప్రత్యేకలక్షణములు కావనియునే. నిసర్గప్రతిభాశాలియగు కవిబ్రహ్మ లెట్టి రసమునకైనను విశ్వవ్యాప్తి నొసగి అదియే మూలరసమని యెల్లరు ననుకొనునట్లు చేయఁగలరు. అందమొకరిసొమ్ము కానట్లు హృదయవిద్రవణశక్తి యేదో ఒక్క రసముయొక్క సొమ్ము మాత్రమే కాదు. కావున కరుణ యొక్కటియే రస మనునది సర్వత్రాపి సిద్ధాంతము కానేరదు. కాని భవభూతికి మాత్రము రసము కరుణ రూపమున సాక్షాత్కరించెను. అతడు కరుణ రసమును వర్ణించుటలో చూపిన ప్రజ్ఞ యనన్యసామాన్యము. అందుత్తరరామచరితమున నతడు కరుణ రసమును పోషించిన విధము శ్లాఘ్యతమము. అందుచేతనే "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" యని లాక్షణికులు కూడ విధిలేక చల్లచల్లగ నంగీకరించిరి. ప్రపంచమున కెంతటిదైనను కాకపోయినను భవభూతికి మాత్రము "ఏకో రసః కరుణ ఏవ."

ఇక భవభూతి కరుణరసము నేవిధముగఁ బోషించెనో, కాళిదాసునకు నితనికీ విషయమునఁ గల భేదమెట్టిదో స్థాలీపులాకన్యాయమున సూచించెదము. భవభూతియొక్క కరుణరసము వాచ్యప్రధానము. కాళిదాసుని కరుణరసము వ్యంగ్యప్రధానము. భవభూతి భావమను పండు నొలిచి తొనలను తీసి యొకతొన వెంబడి యింకొక తొనను తీసి చేతపెట్టి తినిపించును. కాళిదాసు

తొనలతో నిండియున్న పండును మాత్రము చేతికిచ్చుచు దాని నొలిచికొని తొనలను దీసి భుజించు భారమును పాఠకునికే వదలివేయును. ఈ భేదమునకుఁ గారణము స్పష్టమే. భవభూతి కరుణనే ప్రధానముగఁ గైకొని యుంటచే దానిని విప్పిచెప్పి, పెంచి, వ్యాప్తి కలిగించి యేకపుత్రునింబోలె పోషించెను. కాళిదాసన్ననో దానిని శృంగారరసమున కుపాంగముగ గైకొని యుంటచే తన ప్రేమమంతయు నూరక పారలనీయక ఒక్కొకపరి వ్యంగ్యముగ-ధ్వనిప్రధానముగ-సూచించి విడచును. భవభూతికరుణరసము తల్లిప్రేమవలె యూరక పైకుబుకు చుండును. కాళిదాసుని దన్ననో తండ్రిప్రేమవలె గంభీరమై యొప్పును. భవభూతికరుణసముద్రము నిరంతర తరంగసంక్షుభితము. కాళిదాసునిదో ప్రశాంత గంభీరము. అగాధము. భవభూతియొక్క కరుణరసపోషణశక్తి విషయమునే యాధారము జేసికొని దానిచేఁ బరిమితమై యొప్పును. కాళిదాసన్ననో యవకాశము చేఁజిక్కినప్పుడెల్ల భూమ్యాకాశముల తాళము వాయించుచు, షేక్స్పియర్ చెప్పినట్లుగా—

"The Poet's eye in a fine frenzy rolling, Doth glance from earth to heaven and heaven to earth".

అను వాక్యమునకు లక్షీభూతుఁ డగుచున్నాఁడు. తారతమ్యమును జూపించుటకుఁ గాక యిరువురి మార్గముల యందుగల భిన్నత్వమును సూచించుటకు మాత్రమే కొన్ని యుదాహరణము లొసఁగి వానిపై యభిప్రాయము లొసగు భారము పాఠకులకే వదలివైచెదము.

కాళిదాసు:—

శివశిరసి శిరాంసి యాని రేజుః
శివశివ! తాని లుఠంతి గృధ్రపాదైః
అయిఖలు విషమః పురాకృతానాం
భవతిహి జంతుషు కర్మణాం విపాకః.

మా మాకాశప్రణిహితభుజం నిర్దయాశ్లేషహేతో
ర్లబ్ధాయాస్తే కథమపి మయా స్వప్నసందర్శనేషు
పశ్యంతీనాం నఖలు బహుశో న స్థలీదేవతానాం
ముక్తాస్థూలా స్తరుకిసలయే ష్వశ్రులేశాః పతంతి.

ఉద్గలితదర్భకబలా మృగ్యః
పరిత్యక్తనర్తనా మయూరాః
అపసృత ఇవ పాండుపత్రాన్
ముంచం త్యశ్రూణీవ లతాః.

కథ మేష్యతి మమశోకః
నీవారబలిం విలోకయతః.

యాస్య త్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్టముత్కంఠయా
కంఠః స్తంభిత బాష్పవృత్తికలుష శ్చింతాజడం దర్శనం
వైక్లబ్యం మమ తావ దీదృశ మిదం స్నేహా దరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథం ను తనయావిశ్లేషదుఃఖై ర్నవైః.

ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః
ఇ త్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యక స్తం యయాచే
కామార్తాహి ప్రకృతికృపణా శ్చేతనా చేతనేషు.

త్వామాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగై శ్శిలాయాం
ఆత్మానంతే చరణపతితం యావదిచ్ఛామి కర్తుమ్
అ స్రై స్తావ న్ముహు రుపచితై ర్దృష్టి రాలుప్యతేమే
క్రూర స్తస్మి న్నపి నసహతే సంగమం నౌ కృతాంతః.

అయి జీవితనాథ జీవసీ
త్యభిధాయోత్థితయా తయా పురః
దదృశే పురుషాకృతిః క్షితౌ
హరకోపానలభస్మ కేవలమ్.

భవభూతి:—

అయం తావ ద్బాష్ప స్త్రుటిత ఇవ ముక్తామణిసరో
విసర్పన్ ధారాభి ర్లుఠతి ధరణీం జర్ఝరకణః
నిరుద్ధో ప్యావేగ స్స్ఫుర దధరనాసాపుటతయా
పరేషా మున్నేయో భవతి చిర మాధ్మాత హృదయః.

తత్కాలం ప్రియజన విప్రయోగజన్మా
తీవ్రోపి ప్రతికృతివాంఛయా విసోఢః
దుఃఖాగ్ని ర్మనసి పున ర్విపచ్యమానో
హృన్మర్మ వ్రణఇవ వేదనాం తనోతి.

ఏతస్మి న్మదకలమల్లికాక్షపక్ష
వ్యాధూతస్ఫురదురుపుండరీకభాగాః
బాష్పాంభఃపరిపతనోద్గమాంతరాళే
సందృష్టాః కువలయినో మయా విభాగాః.

శైశవా త్ప్రభృతి పోషితాం ప్రియాం
సౌహృదా దపృథగాశ్రయా మిమాం
ఛద్మనా పరిదదామి మృత్యవే
శౌనికే గృహశకుంతికా మివ.

అపూర్వకర్మచండాల మయి ముగ్ధే విముంచ మాం
శ్రితాసి చందనభ్రాంత్యా దుర్విపాకం విషద్రుమమ్.

విస్రంభా దురసినిపత్య జాతనిద్రా
మున్ముచ్య ప్రియగృహిణీం గృహస్య శోభాం

ఆతంకస్ఫురిత కఠోరగర్భగుర్వీం
క్రవ్యాదోభ్య బలి మివ దారుణః క్షిపామి.

చిరా ద్వేగారంభీ ప్రసృతఇవ తీవ్రో విషరసః
కుతశ్చి త్సంవేగా త్ప్రచల ఇవ శల్యస్య శకలః
వ్రణో రూఢగ్రంథి స్స్ఫుటిత ఇవ హృన్మర్మణి పునః
ఘనీభూతశ్శోకో వికలయతి మాం నూతన ఇవ.

దళతి హృదయం గాఢోద్వేగం ద్విధాతు నభిద్యతే
వహతి వికలః కాయో మోహం నముంచతి చేతనాం
జ్వలయతి తనూ మంతర్దాహః కరోతి నభస్మసా
త్ప్రహరతి విధి ర్మర్మచ్ఛేదీ నకృంతతి జీవితం.

వేలోల్లోలక్షుభిత కరుణోజ్జృమ్భణ స్తంభనార్థం
యోయోయత్నః కథమపి సమాధీయతే తంత మంతః

భిత్వాభిత్వా ప్రసరతి బలాత్కోఽపి చేతోవి కార
స్తోయ స్యేవా ప్రతిహతరయ సైన్క తం సేతుమోఘః.

హాహా దేవి! స్ఫుటతి హృదయం ధ్వంసతే దేహబంధ
శ్శూన్యం మన్యే జగద వికళజ్వాల మంతర్జ్వలామి
సీదన్నంధే తమసి విధురో మజ్జతీ వాంతరాత్మా
విష్వఙ్మోహః స్థగయతి, కథం మందభాగ్యః కరోమి!

ఈ శ్లోకము లన్నిటి భావవిశేషములను సరిపోల్చి విమర్శించి చెప్పజూచుట గ్రంథవిస్తరభీతివలనను, అట్టి పని పాఠకుల రసికత ననుమానించుట యగునేమో యను శంకచేతను సూచనల గావించినదానితోడనె తృప్తిజెంది విరమించుచుంటిని. పాఠకులు మదభిప్రాయముల సాదర బుద్ధితో పరిశీలింతురు గాక.

# శ ర ద్రా త్రి

శా. శివ యోగా నంద రావు గారు

పండువెన్నెల లెల్లెడ నిండుకొనియె.
కంటి కింపుగ నుండె నక్షత్రపంక్తి
అద్దమున కన్న నిర్మలంబైన గగన
జలధిఁ దోఁగుచునున్న నిశాచరుండు
రమ్యముగ నుండె శారదరాత్రి వేళ
ప్రకృతియంతయు శాంతభావమును దాల్చె.

*  *  *  *

కోమలంబైన పూలతాకుంజములను
పచ్చనౌ చెట్ల యాకులఁ జొచ్చి లోన
పాన్పుపైఁబడి కిటికిచువ్వలను దాటి
పొడలుపొడలుగ చంద్రికల్ పొల్పుమీఱె
హృదయమున కెంతయో ముద మొదవుచుండ.

*  *  *  *

ప్రియుని నెడబాసి యొంటి జీవించుచుండి
కాలమును బుచ్చు విరహిణి కలముబూని
ప్రేమలేఖను లిఖియింపగా మొదలిడి
దీర్ఘయోచనలను మున్గి తేలుచుండి
తన్మయత్వముఁ జెందగ తనువు మఱచి
ప్రకృతి శాంతములోన విశ్రాంతి గాంచె.

నిర్మలంబుగ నున్న కోనేటినీట
కళలఁబర్వుచుఁ జంద్రుఁడుఁ గాంతి గులుక
చూచుచుండెను నెమ్మోముసోయగంబు.
కాంతు డేతెంచ నూత్నవికాస మొంది
కలువపూవులు వికసించె. గంధవహుఁడు
సార తరులతాఫలపుష్ప సౌరభముల
సరగఁదాలిచి నీటను స్నాన మాడి
కదల లేకుండుటను మందగతిఁ జరించె
గాలితాకున లేచి సున్నాలవోలె
తెరలుతెరలుగ మెల్లన తీరమునకు
తరలుచుండెడి ధ్యులలమొత్తంబునందు
యామినీకాంతు డలరి యుయ్యాల లూగె.

*  *  *  *

అక్కడక్కడ నెగిరి తళుక్కుమనుచు
వెండిముక్కలవోలె కన్పించుచుండి
నీట మున్గెడి చేపల నిస్స్వనంబు
శ్రోత్రపుటములకును విన సొంపు గలిగి
శాంతిభంగంబు గావించె జలమునందు.

# శ్రీనాథసూరనలు — మరాళవర్ణనములు

మండలేముల వేంకట శాస్త్రి గారు. బి. ఏ., ఎల్. టీ.

శుచిముఖిచరిత్ర మత్యద్భుతము. వజ్రనాభునిపురమునందలి వృత్తాంతముల నెఱిఁగి తనకు నివేదింపుడని మరాళముల నెల్ల దేవేంద్రుఁడు స్వప్రయోజనసిద్ధికై పనుపఁ దనవల్లభునియనుమతి వడసి, శుచిముఖి కథలోఁ బ్రవేశించినది. సహజమగు తన మృదుమధుర వచనరచనచే నతని సంతుష్టుఁ జేసినది. తనపూర్వము నెఱిఁగించుచు—

గీ. "విను సురేంద్ర పద్మజుని తేరు దివుచు సా
రంధరాఖ్యుఁ డగు మరాళవిభుని
బిడ్డ నేను వాణి పెనుపంగ బెరిఁగి త
ద్విమలశిక్షఁ గంటి విద్యలెల్ల."

అని దేవేంద్రునితోడను, బ్రభావతిని వర్ణించు నవసరమునను బ్రద్యుమ్నునితో—

ఉ. "......................అతివాఙ్మహిమాఢ్య నేను, మా
యమ్మ సరస్వతీసతి తనంతటిదానిఁగ నన్ను దిద్దుటన్."

అని తాను బ్రహ్మదేవుని రథవాహనంబైన సారంధరుం డను హంస వంశావతంసు కూఁతురగుటయుఁ దదీయసంబంధవశంబునందు వాణి పెనుపఁ బెరుఁగుటయు, తదనుగ్రహంబున దనకు నఖిలవిద్యలుం గరతలామలకంబగుటయుం జెప్పి, "శుచిముఖి" యను నామము సార్థక మనియును తనముఖము శబ్దసంస్కారపూతం బనియెంచి వాణియే యిడినదనియును తెలిపియున్నది. కవిత్వమునఁ దనకుఁగల శక్తిని మెచ్చి—

చ. ప్రబలములైన కౌతుకకృపారస వత్సలతాదరంబులన్
శబలితచిత్తయై యపుడు నాకుపమాతిశయోక్తికామధే
నుబిరుదమిచ్చి తల్లిఖితనూపురమున్ భుజనైకమాత య
య్యబల మదంఘ్రిఁ దాఁ దొడిగె నాబిరుదం బిది చూడు మేర్పడన్.

అని పల్కి వలయు గరువతనము నంతయు వ్యక్తపఱచినది.

ప్రభావతీప్రద్యుమ్నమున శుచిముఖియే ముఖ్యపాత్ర. ఆమె లేనియెడ కథావేగమునకు భంగము కలుగును. కథయే లేకపోవు నని నుడివినను సమంజసమై యుండనోపు. తొలుదొల్త వజ్రనాభునివలనఁ గలుగు విపత్పరంపరచే మిగుల నొచ్చిన దేవేంద్రుని మనస్తాపమును ప్రభావతీస్వప్నవృత్తాంతమును నివేదించి యుపశమింపఁ జేసినయది. "అకించిదంచిత సహజమాధురీధురీణ వాణీరామణీయకంబు కార్యకాపునీయకంబున నినుమడించి" యాహంస యీవిధమున "బిడౌజుని బిడౌజుం" జేసినది. వజ్రనాభునిపుర మన్ననో "తపమున బ్రహ్మఁ బ్రసన్నుఁ జేసి" "మారుతాతపములకు న్నిజానుమతిఁ దక్క ప్రవేశ మొనర్పరానిది." దుర్గమ మగు నా వజ్రపురి తనకు సుసాధ్య మని తెలిపి, దేవేంద్రుని కార్యము నిర్వహించుట కర్హతను దెలిపినది. ఇట్టి యుత్తమప్రయోజనమున నచ్యుతుఁడుగూడ దృఢమనస్కుఁడై యుండు నటుల తాను కార్యసిద్ధి యచిరకాలముననే కలుగు ననుటయును తార్కాణగ నీ స్వప్నవృత్తాంతము నివేదింపఁబడినదని తోఁచెడిని. మఱియు నీకార్యము నెఱవేర్చుభారము తనపై నిలిచియుండుటచే, శ్రీకృష్ణునితోడ నేకాంతమున సంభాషించి యాతని మనోధర్మమును గుర్తెఱిఁగినది. ప్రద్యుమ్నుఁడే వధకు సాధన మగుటచే నతని మనోదార్ఢ్యము నెఱిఁగి యరుగుట యుక్తమని తలచి గగనసరణి నరుగు నతనికి వినఁబడువిధమున "నతఁడితం"డని పల్కి, మరాళములతోఁ గూడ యాదృచ్ఛికముగ వ్రాలినటుల నటించినది. తనప్రయోజనం బతనికి దెలుపుట ముఖ్యావసరము. ఐనను ప్రద్యుమ్నుఁడు మిగులఁ బ్రార్థింపని రహస్యమును తెలుపునట్లు నటించి సమాచారము నెఱిఁగించినది. ఈకార్యమున నతనియుత్సాహ మినుమడించుటకు ప్రభావతివృత్తాంతము దెలిపి, యామె రూపవయోవిలాసాదికమును నగ్గడించుచు, తన బిరుదమును జూపి యాతనిప్రశస్తి వడసినది. మఱల ప్రభావతియు రాగవల్లరియు నుద్యానమున నుండి - చిత్రఫలకమునుగూర్చి ముచ్చటించుచుండ, వారితెఱఁగంతయుఁ జూచి వాగ్యుద్ధము నిపుణముగ సలిపి ప్రార్థితయై ప్రద్యుమ్నుని గూర్చి ఎట్టకేలకు ముచ్చటించినది. వజ్రనాభునికి సహజవైరియగు మురారిసూనునియెడ నామె ప్రేమలత లెంతబలముగ నున్నవని పరీక్షించి, వేఱొకని నైకొనజాల నని యామెచే ప్రతినఁ జేయించుకొనినది. ఈవిధముగ శుచిముఖి కథాగమనము తనపై నాధారపడియున్న దని మనము భావించునంతటి ప్రాముఖ్యము నొందినది. కథ ముగియువఱకు నప్రమత్తయై సంచరించి నిర్వహించి కృతార్థత నొందినది. ప్రభావతికి బ్రద్యుమ్నునితో వివాహ మగుటయే కథలో ముఖ్యాంశ మగుటచేఁ గాని, లేనిచో నీప్రబంధమును "శుచిముఖీయ" మనినను సమంజస మని నా యభిప్రాయము. సాధారణమగు మరాళ మొకటి దేవదానవులకుఁ గల ప్రయోజనమును సంఘటింపఁదగు నపాయముల నరసి, వలయుయుక్తులఁ బన్నుచు, నింద్రాదుల నెల్ల నాడించియుంట యాశ్చర్యము! కడుంగడుఁ బ్రశంసాపాత్రము. కవికల్పితమయ్యును సృష్టివైచిత్ర్యముల మించియుండుట కవినాథుని యసాధారణప్రతిభను వేనోళ్లఁ జాటుచు కళాసామ్రాజ్యమున నతఁ డున్నతస్థానము నలంకరింప నర్హతనుగూడ బ్రకటించునది.

## గుణములు - స్వభావము

ఇఁక శుచిముఖిస్వభావమును ముఖ్యము లగు గుణములనుఁ గొంత విమర్శించి చూతము. మరాళమును "ప్రౌఢ" యనఁదగు నని

యేకగ్రీవముగ నొప్పుకొనక తీరదు. ఉత్తమస్త్రీరత్నములకు వలయు గఱువతనము నీమెయందు వేయిమడుఁగులఁ గాన నగును. మఱియు నౌచిత్యమునకు శుచిముఖి పెట్టినది పేరు. అనుచితమగు నొక్కపనియైనఁ జేసి యెఱుంగదు. ఒక్కమాట నాడియెఱుంగదు. చదువరులెల్లరు నామె చర్య ముమ్మాటికి నుచితమని యొప్పుకొనవలెను. పరిస్థితుల లెస్సగా నరసి యనుకూలములగు మార్గముల నిర్ణయించి, యనువగు విధమున నుపాయాంతరములఁ గల్పించి తనకార్యము సంఘటించుకొనుటలో శుచిముఖిని గడచువా రుండరు. అట్లగుటచే నీమెస్వభావము వర్ణనాతీతము. దుర్గ్రాహ్యము. నిదర్శనము లొకటిరెండు మాత్రము చాలును. తనకార్యమును ఫలింపఁజేయుటకు ముఖ్యాధారము ప్రద్యుమ్నుఁడు. దేవేంద్రుని ప్రయోజన మతనికి నివేదించి, సమరమునకుఁ బురికొల్పుట తనకు కర్తవ్య మయ్యు శుచిముఖి సామాన్యపు మర్యాదను గనఁబఱచురీతిని

గీ. ..............................
యతనిఁ జూచియల్ల ♦ యతఁ డితండ
కావలయు నవశ్య ♦ మీవరపురుషుతో
మాటలాడి చనుట ♦ మనకు మేలు.

అని యాదృచ్ఛికముగ దిగుట నభినయించినది. పిదపఁ బ్రద్యుమ్ను నుద్దేశించి—

ఉ. ఇప్పుడు నిన్నుఁ జూచి కొలు ♦ వించుక సేయ కతిక్రమించి పో
నొప్పదటంచు వచ్చితిమి ♦ యోగ్యసమర్హణ మాను టెంతయున్
దప్పుగదయ్య యాదవ♦తంస! నినుం గని నీయనుగ్రహం
బొప్పఁగఁ గాంచిపోవుట ప్ర♦యోజనసిద్ధికి మూల మారయన్.

అని తనయవసరమును వెలిపుచ్చియు నిగూఢముగ నుంచి మనోగాంభీర్యమును వ్యక్తపఱచినది. 'ఏముపోయివచ్చెద' మని తోడనే పలికినది. ఆమె ప్రయోజనసిద్ధికిఁ దనయనుగ్రహ మెట్లు మూలము కాఁగలదను సందియము ప్రద్యుమ్నునియం దుదయించుట సహజము. కావున నతడు రాచపాడి దప్పని విధమునఁ దత్కార్యము నెఱింగింపుఁ డని శుచిముఖిని వేఁడఁగా—

చ. అనుడు; రహస్యమైనదియె ♦ యైనను భవత్పరిపృష్ట మెంతయున్
జనక నిమేషమున్ దడయ ♦ సంగతిగాదును మాకు నైన నీ
వనఁగ జనార్దనుం డనఁగ ♦ నారయ భేదము లేదు! కావునన్
నిను వినిపింతు మాపనియు♦నీదు ప్రసంగము మున్న కల్మిడున్.

అని విధిలేక తెలిపినటుల సవిస్తరముగ నేకాంతమున బలికినది. మఱియు నీసమయమున కుచితమగురీతిని బ్రభావతీవృత్తాంతము నెఱిఁగించి యాతని మనస్థైర్యమును బలపఱచినది. ఇం దెంత గఱువతనము వ్యక్త మగుచున్నది! సామాన్యపు మరాళమే యయిన నింతటి ప్రయత్నముసేయక తొలుదొల్తనే దేవేంద్రునిప్రయోజన మెఱింగించియుండును. అట్లయిన నొకవేళఁ గార్యము సిద్ధిఁబొందినను నిజమనోగాంభీర్యము వ్యక్తపడఁజాలదు. ఈప్రయోజనమునఁ బ్రద్యుమ్ననికిఁ గొంతవఱకు లక్ష్యము తగ్గియుండును. ప్రభావతీరాగవల్లరు లుద్యానవనమునఁ జిత్రఫలకమును తద్వృత్తాంతమును విమర్శించునవసరమున శుచిముఖి యదృచ్ఛనపోలె నొనరించినది వర్ణనాతీతము. ప్రద్యుమ్నకుమారుని వృత్తాంత మామెకుఁ దెలియఁజేసి ప్రభావతి నతనియెడ బద్ధానురాగఁ జేయవలయు. సంశయాకులిత మగు నామెహృదయమును స్థిరపరచి, యతనిఁ దప్ప వేఱొకని వరింపనను వాగ్దానముఁ గైకొనవలయు. లేనిచో వజ్రనాభునివధ సుసాధ్య మగునా? తోడనే ప్రద్యుమ్ననివృత్తాంత మామెకు నివేదించినచో తనయుదంతమునను తనయెడనుఁ బ్రభావతికి గల గౌరవ మల్పము కావచ్చును. కావునఁ జిత్రఫలకమును సంశయించు ప్రభావతిని జూచి, యదియ యిదని తలఁచి, యామెయెదుట నడ్డముగ సంచరించుచు, నావరపురుషుఁ జూడ మొదలుపెట్టినది. తోడనే ప్రభావతికి సందియము గలిగి వయస్యతో మరాళముఁగూర్చి పల్కుచుండ మున్నొక్కచోట నొక్క వరపురుషుంజూచి తత్సమానరూపుని మఱియెందునుం గానలేక, ఇప్పు డిందు నతనికైవడి దోఁచిన నిది తదీయ రూపం బెఱింగి వ్రాసినతెఱంగో యటుగాక యట్టివాఁ డెక్కడనైనం గలిగెనో యని యించుక విమర్శించి వీక్షించితి నని పలికి యామెహృదయమున నద్భుతప్రమోదసందేహంబులఁ గ్రందుగొనఁ జేసినది. శుచిముఖివంటి తిర్యగ్జంతువున కంతటి సుజ్ఞానము కలదను నద్భుతమును- కలఁడో లేఁడో యని పరితపించి తనకు నిశ్చయ మెఱుగనయ్యె నను ప్రమోదమును- అట్టివాఁడుండునా యనియు నుండిన నతనిసాంగత్యము తనకు లభించునా యనుసందియమును- ప్రభావతియం దొక్కసారి పొడమినవి. శుచిముఖియెడ గౌరవ మతిశయము నొందినది. చిత్రఫలకమును విమర్శించి తనకుఁ దెలిసినది నివేదింపుమని మరాళమును మిగుల సాభిప్రాయముగఁ బ్రార్థింపఁగా-

క. నీవనిన యట్లు యేను భ
యావహులను గానివారి ♦ నాకృతిన కనం
గాకలతి; నైనఁ బిలువక
యే పట్టిన చేర నిరవు ♦ శకత మాడన్.

అని తనగఱువతన ముట్టిపడునటుల పలికినది. ఇది శుచిముఖిగాంభీర్యమున కొక దృఢనిదర్శనము. దీనిని గ్రహించి యాచెలువ లిద్దఱును-

గీ. ఈశుకీ తానొన్యవదనమై ♦ యెంతమూర
మఱుగుచున్నది దీని వాక్యాశయ మని-
మిగుల వెఱఁగందిరి. అంత లక్షణకథన మొ♦కింత సలిపి.

చ. ఎనయఁగ నెవ్వ రెంత మన ♦ సిచ్చి వచించిరి తాను వారితో
పనుపడ నంతమాత్రఁ బ్రతి♦భావణ మాడుట యుక్తమం ద్రుమీ
కొనరఁగఁబన్ని దంపుగెలు♦పోటలు దీర్పఁగ నిప్పు డేనుఁ జె
ప్పినయది చాలు నింకఁ దలపెట్టుట చెల్లద♦యెక్కు డేమియున్.

అని తనప్రయోజనసిద్ధికి మూలమగు నీఘట్టమున నెంత బిగువుఁ గనఁబఱచుచున్నది! వారిచే ప్రార్థితయై కాక రవంతయుం మాటాడదు. కొంతయుదంతము దెలిసి శాంతముగ నెఱుఁగఁగోరుట యాయింతులకును సహజము. వారు ప్రార్థించి విసిగి వేసారియుండఁగఁ బ్రభావతిని ఖేదిల్ల జేయుట యగునను భయమున వాచోయుక్తిని చాలించి-

ఉ. అంతిపురంబుకన్యలట ♦ యాత్మ తెఱంగభిధాప్రయుక్తి నొ
క్కింతయు నేర్పతింపరట ♦ యిట్లనిట్లని నాకు నాకె య
ర్థాంతరముల్ గడించుకొని ♦ యంజక యెట్లు యువస్తుతుల్ ప్రపం
చింతుసటంచు నుంటి నిక ♦ జెప్పెద మీరలు గుట్టుదెల్పుటన్.

అని యావచ్చరిత్రయును గడు రమ్యముగనుడివినది. ఈఘట్టమంతయుఁ జదివినగాని మనోగాంభీర్యమున శుచిముఖి ఎంత ప్రశంసాపాత్ర మో గ్రహించుట కష్టము.

మఱియు నౌచిత్యమునకు శుచిముఖి పెట్టినది పేరని నుడివియుంటిమి. కథానిర్వహణమునకు ముఖ్యసాధనమగు నామెచర్య కడుంగడు నుచితము. తమయొడయడగు దేవేంద్రునివైరియగు వజ్రనాభునికర జీవనము సలుపుచుండుట యేహ్యముగతనకే తోఁచి శుచిముఖి—

చ. తడవులబట్టి యేము సత♦తంబును బోదుము వానివీటికిన్
గడు మతిచాలమిన్ గడుపు♦కక్కటితిన్ సురలోకనాథ మా
యెడఁగలయట్టి తప్పిది, స♦హింపుము పక్షులమాట నొక్క వెం
బడి నిది చెల్లెఁ గాక రిపు♦ప్రాంతము చేరెడువార లాప్తులే?

యనియు, నతఁడు తనసరసులయందు గనకనళినజాతు లెల్ల నాటించినాఁ డనియు నటుచనక మేతనడ మనే హంసములకు” అని సమర్థించినది. ఇది యెంత యుచితముగ నున్నది! చూడుఁడు ప్రద్యుమ్నునితోడఁగాని శ్రీకృష్ణునితోఁగాని యీసమాచారముఁ జెప్పినదా?

పరిస్థితులనెల్ల లెస్సగ బరీక్షించి యనుకూలములగు మార్గముల నిర్ణయించి స్వకార్యసాఫల్యము నొందుటకు శుచిముఖిసలుపు బ్రయత్నము స్తుత్యతీతము. కథాసరణియందు దామెకుఁగల ప్రాముఖ్యము సరయుసందర్భమున నియ్యది చాలవఱకు సరఁగుబడినది. ముఖ్యవిషయముల నొకటి రెండిటిని మాత్ర మిందుఁ బొందుపఱచుట యుక్తము. దేవేంద్రుని ప్రయోజనము వజ్రనాభునివధ అందులకు ప్రతికూలమగునంశము వజ్రపురి మారుతమునకైన జొరరాకయుండుట. అట్టితటి నాపట్టణము తమకు సుగమమగుట సూచించి, యాతని మనస్సును దృఢపరచినది. అచ్యుతుని కీప్రయోజనమున సంబంధము గల్పించినది శుచిముఖియే. ఇందులకు కారణము ప్రభావతీస్వప్నవృత్తాంతము. ప్రద్యుమ్ని యుద్వాహము నెఱుఁగక పూర్వము గూడ నిష్కారణవత్సలుఁడగు శ్రీకృష్ణుఁడు తగుసహాయ మింద్రునికిఁ జేసియుండును. కాని తప్పక సహాయము దొరకునను ధైర్య మింద్రునకు గలుగుటకును, వజ్రనాభుని వధగూడ నిశ్చయమని యాతఁడు నమ్మికొని యుత్సాహియై యుండుటకును గూడ నీస్వప్నవృత్తాంత ముపయోగకరము. దేవేంద్రుఁడుగాని, శ్రీకృష్ణుఁడుగాని ప్రద్యుమ్నునితో నీవృత్తాంతమును దెలిపి యుండుమని కోరలేదు. అదియును స్వకపోలకల్పితము. తన యూహ్యమించిన కార్యమునకు సాధనమని శుచిముఖి తలఁచియుండును.

శుచిముఖిస్వభావము నింత గంభీర మొనరించిన యాకవిచంద్రుని ప్రతిభ వర్ణనాతీతము. నైషధమునను ఈకావ్యమునను గల మరాళము లొండొంటిని గొంతవఱకు పోలియు, వ్యక్తిస్వభావములు గల విగఁ దోఁచును. ఈపరస్పరవిషయముల నించుక విమర్శింతము.

తిర్యగ్జంతువులలో నెల్ల మరాళము లుత్తమము లగుటచేఁ గార్యములకుఁ గారణములుగ నీగ్రంథములలో నయ్యవి పేర్కొనఁబడియె. ఇంతియకాక యిమ్మరాళములకుఁ గవికల్పితములగు నుత్తమవంశములు గలవు. వంశాభిజాత్యములను జ్ఞానమున రెండును సంచరించుచు వచ్చినవి. మరాళము బ్రహ్మకు వాహనము. అట్లగుటచే శుచిముఖి ఇంద్రునితో—తన సత్కులీనతను ‘వినుసురేంద్ర’ యనుపద్యమునఁ దెల్పినది. ఇట్లే దమయంతితో సంభాషించు నవసరమున శృంగారనైషధమునందలి మరాళమునైతము—

గీ. భారతీదేవిముంజేతి పలుకుచిలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు.

ననియు “ఒక్కనాఁడు విధాత వినోదార్థంబు వాహ్యాళివెడలి మరలి వచ్చునపుడు మాకులస్వాములైన యతని రథరథ్యంబులు శ్రమంబునం డీలుపడియున్నం జూచి యేను విమానదండంబు కంఠంబున ధరియించి విరించిచేతం బారితోషికంబు వడసితి. నేను దివ్యతిర్యగ్జాతిని విను” మనియె. ఈరెండిటిలో నూరనార్యుని శుచిముఖి, విరించి రథవాహనుండగు సారంధరాఖ్యుని వంశంబునఁ బుట్టినది గావున మిన్న యనఁదగును. విద్యాభ్యాసాదికమును వర్ణించుకొనుచు “నలినజురాణివాసమున వాణి పెనుపఁ బెరిఁగి, తద్విమలశిక్ష విద్యలెల్ల గంటిన”ని నుడివినది. కవిత్వమునఁ దనకుఁగల యుత్తమప్రజ్ఞకు నిదర్శనముగ పెండేరమును ధరించి బిరుదమునకు దగినపలుకులచే శుచిముఖి యను సార్థకనామముఁ దాల్చినది. నైషధమున మరాళము వేఱొకభంగిని తన యౌన్నత్యము నుగ్గడించుకొనుచున్నది. చూడుఁడు!

సీ. నలినసంభవు వాహ♦నము వారువంబులు
కులముసాములు మాకుఁ ♦ గువలయాక్షి
చదలేటిబంగారు ♦ జలరుహంబులతూండ్లు
భోజనంబులు మాకుఁ ♦ బువ్వుబోఁడి
సత్యలోకముదాక ♦ సకలలోకంబులు
నాటపట్టులుమాకు ♦ నబ్జవదన
మధురాక్షరములై ♦ మామాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యు♦లనుపమాంగి.

గీ. భారతీదేవి ముంజేతి♦పలుకుచిలుక
సమదగజయాన స♦బ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాదివిద్య లెల్ల
తరుణి! నీయానఁ ♦ ఘంటాపథంబు మాకు.

అని పలికినది. అట్లయ్యు ప్రౌఢిమను తనచర్యచే సువ్యక్త మొనర్చుకొనజాలినది కాదు. శుచిముఖి యన్ననో ఉత్తమవంశమున జన్మించి విద్యాభ్యాసాదికమునఁ దనకుఁ గలిగిన యౌన్నత్యమును హేతుసహిత మగు వాదము సలిపి బలపఱచుకొనినది. తన బిరుదమున కాదర్శప్రాయములగు వర్ణనలసలిపి ప్రశస్తివడసినది. శ్రీనాథుని రాజమమున కింతటిఘనత

చర్యలోఁ గానఁబడినది కాదు. మఱియు నీప్రబంధమునఁ గథ యంతయు శుచిముఖిపై నాధారపడి యుండినది. వజ్రనాభునివధకుఁ దగు ప్రయత్నము సలిపి నలయు మార్గముల నిర్ణయించు భార మామె వహించినది. పురుషోత్తము దృఢమనస్కుఁ జేసినది. ప్రభావతీప్రద్యుమ్నులను గృత ప్రతిజ్ఞులఁ గావించి, కార్యసిద్ధి కరగతఁ మొనరించుకొనినది. ఆమె లేనియెడ కథ యెట్టుల జరిగియుండునదియు దురూహ్యము. శ్రీనాథుని మరాళమున కంతటి ప్రాముఖ్యము లేదు. నల దమయంతు లిరువురును పరస్పరము ప్రేమించుకొనుచునుండ నీమరాళము దూత కార్యము నెరవేర్చి యంతరించినది. కథయంతయు దానంతన నొకరి జోక్యము లేకయే జరిగినది. మఱియు నలునిచేఁ బ్రాణదానము గైకొని ప్రతిఫలముగ దమయంతిని గూర్తునను ప్రయోజనము కల్పించుకొనుటలో సత్యవాక్పరిపాలనము వ్యక్తమైనను, అంత రసభరితముగఁ దోఁచదు. ప్రత్యుపకార నిస్పృహచే శుచిముఖి దేవేంద్రుని ప్రయోజనము సాధింప సమకట్టియుండుటలో విశేషమగు సౌజన్య మేర్పడినది. ఈ సౌజన్య మనన్యసామాన్యము. నలునితో మాటలాడుచు మరాళము, "ఫలకుసుమ మూలమాత్రంబున శరీరయాత్ర నడపుచు, మునులువోలె సలిలంబులోనం దపంబు చేయుచున్నవార మని పల్కియు శుచిముఖివలె నిష్కారణ సౌజన్యమును బ్రకటింపక ప్రత్యుపకారస్వభావము మాత్రము ఘటించినది. శుచిముఖిసౌజన్యము వర్ణనాతీతము. మఱియు నింకొకభేదము గలదు. నలదమయంతులతోడ నొండొరుల యుదంత మామరాళము తనంతటిదానిగ నివేదించినది. అందు ప్రౌఢిమ కొంత తఱిగినది. ముఖ్యావసరములగు ఘట్టములయందును శుచిముఖి ప్రకటించిన బిగువు బింకముల నీ వఱకే విమర్శించియుంటిమి. ప్రభావతీ రాగవల్లరులతో సలిపిన వాగ్యుద్ధ మామెను "ప్రౌఢ" యని వేనోళ్లఁ జాటెడిని. స్త్రీస్వభావమును శుచిముఖి లెస్సగ నెఱిఁగినది. కావున తనసొబగును వర్ణించి ప్రభావతి స్తుతించుచుండ తనవలన రహస్యము దెలిసికొనుటయే యామె ముఖ్యోద్దేశ మని గ్రహించి ఎత్తి పొడుచుచున్నది—

ఉ. ఇప్పుడు నీవు చెల్మికిని ♦ హేతువుగాఁగ గణించినట్టి నా
యొప్పును గిప్పుఁ దా నెచట ♦ నుండు రహస్యవిచారవిఘ్నమా
కెప్పుడు నీకుఁ దోఁచె నపు♦డింతయు రోసెదు; దీనిచేత మా
యిప్పటి మంతనంపు పని ♦ యేమఱి కంపుడు వోయివచ్చెదన్.

అనినది. అట్టిసమయమున నైషధమున మరాళము మిన్నకుండి 'ముగ్ధ' యనిపించుకొనినది.

అయిన నీయుభయులలోఁగల సామాన్యవిషయముల నొకటి రెండింటిని విచారించెదము. స్త్రీస్వభావము చంచల మనియు, దానిపై నాధారపడరాదనియు నిరువురు లెస్సగ గ్రహించిరి. దమయంతీ ప్రభావతుల యనురాగములు దృఢములు కావని యెంచి పరీక్షించి యుపాయాంతరముల గల్పించి నలయు ప్రతిజ్ఞల గైకొనిరి. ప్రభావతి

క. విను ప్రద్యుమ్నుని దక్కన్
మనమున నే నొరు వరించు ♦ ఘాటు విడువు మా
ఘనుఁ డొల్లకున్న జెందుదు
మనసిజశిఖి దనువు వ్రేల్చి మఱుసటిమేనన్.

అనియును దమయంతి—

గీ. అనలసబంధవాంఛ నా ♦ కగునె యేని
యనలసంబంధవాంఛ నా ♦ కగునె చూవె
చాలు సందేహవక్రభా ♦ షణము లింకఁ
దరుణచక్రాంగపాథఃప♦తంగశక్ర.

గీ. తండ్రి నిషదాధిపతి కీక ♦ తక్కు నొరున
కీఁదలంచిన నే విహగేంద్ర వినుము
దేహ మనలంబునకు నాహుతిగ నొసంగి
యతనిఁ బొందంగఁ గందు జ♦న్మాంతరమున.

అనియు దగురీతిని తీవ్రము లగు ప్రతిజ్ఞల సలిపిరి. వర్ణనకాళల మీ మరాళములకు సమానము. నలదమయంతులయుఁ బ్రభావతీప్రద్యుమ్నులయు లింగరూప వయోవిశేషాదుల వర్ణించుఘట్టములఁ జదివి యానందించి యారసమును గ్రోలఁదగునేగాని నుడువ శక్యముగాదు. శ్రీనాథుని మరాళమునఁ గృతజ్ఞతయు సత్యవాక్పరిపాలనమును విదితములు. సహజమగు సౌజన్యమును స్వామికార్యధురంధరతయును అనన్యసామాన్య శేముషీవిశేషమును, అసాధారణ ప్రౌఢిమయు శుచిముఖియెడ సువ్యక్తములు. ఈమరాళముల నింతటి యుత్తమపాత్రలఁ జేసిన కవినాథుల ప్రజ్ఞ స్తుత్యతీతము.

# సీత — శకుంతల

కావ్యతీర్థ జనమంచి సుబ్రహ్మణ్యశర్మ గారు

సీత భారతదేశవాసులలో నసామాన్యయగు నొకవ్యక్తి. ఈమెవలె యోషిద్గణాలంకారభూతయై లోకోత్తర సౌందర్యవతియై సతిమృదులహృదయయై జన్మభూమిని తరింపజేసిన భారతీయ యువతీమణులు మిక్కిలి యరుదు. ఎప్పుడైన నెందైన సీతాదేవివంటి రామారత్నము ఇతర లోకంబునందుఁ బ్రసిద్ధిఁ గాంచి యున్నదా? మహోత్తమ మగు నాదర్శముతో సతీత్వమును పతిభక్తిని వ్యాపింపఁజేసినది సీతయే. ఈ పూజ్యురాలే గంగోత్తరీయ జలధారవలె స్వచ్ఛతమయై నిష్కాపట్యగ్రథినియై సమస్త సద్గుణధారచే మనకు నిరంతర సమారాధ్యయైనది.

సకలకర్తవ్య కర్మైకాయనీభూతుఁడగు భర్తయే యాత్మావలంబన మని యెంచి తదనుసరణమునే నిఖిల కర్తవ్యములకంటె నధికతమంబుగఁ దెలిసికొన్నదై పురాణకథలయందుఁ గడుఁ బ్రఖ్యాతిఁ జెందినదై సహృదయులహృదయంబును బుణ్యతోయయగు భాగీరథింబోలె నలంకరింపఁజేసి పావన మొనఁగూర్చుచున్న కాంతామతల్లి సీతామహాదేవికన్న వేఱులేదనవచ్చును. జనశ్రుతులయందుఁ దదీయచారిత్రపద్ధతి లోకములకు సచ్చరిత్రమును సాధు విశుద్ధిని బోధించుచున్నది. సమాజశిక్షయందుఁ దత్ప్రాతివ్రత్యమే కామినీసమూహంబులఁ గలుషవిషయంబుల నుండి తప్పించి తరింపజేయుచున్నది. మఱియును ఈమె సుఖంబులదైనను దుఃఖంబులందైనను విరక్తమానసంబు గాంక్షింపనిదె యపూర్వభావసమారాధితాంతఃకరణయై ధైర్యమునుయు నవస్థానుకారిణియునై ప్రవర్తించిన సతీరత్నము.

వాసన్తి (వనదేవత) సకలదేవతలయందును సమానభావమయ్యుఁబగు ప్రీతి గలదయ్యు, నే కారణంబున సీతాదేవి గుణగణంబులయం దాసక్తిగలదై విరాజిల్లెనో యెఱుంగఁగోరిన నామె గుణాతిశయంబే మూలమని సకలసహృదయ హృదయములకును నవగతం బగుచున్నది. విలాపంబుఁగూడఁ బై విషయంబు ననుసరించియే ధీరుండగు శ్రీరామునకును సైతము సీతనుగురించి యేకదా సంతాపము? ప్రజలకును నీమెయం దేకాంతానురాగము మునికులముఖ్యులగు వసిష్ఠాదులకును నీమెయందే దేవీభావసంస్థాపనంబు. ఇట్లే యెన్నఁబూనిన పెక్కులు సద్గుణపుంజంబు లీ జనకజయందుఁ గలవని చెప్పఁబూనుట యతిశయోక్తియగు నని యేరన సాహసింతురు?

మహాకవి భవభూతిచే నుత్తరామచరిత్రంబునఁ జక్కఁగ నివ్విషయంబు ప్రతిపాదింపఁబడినది. నారీకులంబున రాఘవకులలక్ష్మి యగు వైదేహియే దృష్టాంతభూత యని మొదటినుండియును దచ్చారిత్రశుద్ధి ప్రకాశనము జేయ నతఁడు పాటుపడినాడు.

“దైవ్యా మపి హి వైదేహ్యాం సాపరాధో యతో జనః”

అని ప్రత్యేకముగనే నిర్వచించినాడు. సీతకు రామునితోఁ బరమస్నేహ ముదయించిన పిమ్మట స్వజనవిరహాతిదూనయగు సీత రామోపదేశమును విని “జానామి ఆర్యపుత్ర జానామి” అనునట్టి సందర్భములచేత రామునిసమీపమున మిక్కిలి సరళత్వమును బ్రకటింపఁజేసి యున్నది. శ్రీరాముఁడు వసిష్ఠుని యాదేశమును గ్రహించు సమయంబున—

“స్నేహం దయాంచ సౌఖ్యంచ యది వా జానకీ మపి,
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా”

అని యుచ్చరింపగనే సీత—

“అతఏవ రఘుకులధురంధరః ఆర్యపుత్రః”

అని వచించి తన సహజనిర్మలగుణంబును వ్యక్తపఱచె. ఇయ్యది సాధారణ వాణియగునా? లేక యనన్యసామాన్య మహత్త్వమా? భర్తృముఖమున స్వపరిత్యాగసంకల్పమును వినియును నట్టి వచనవ్యాపార మొనరించుట యెట్టిదో యెఱుఁగనగు. చిత్రపటదర్శనావసరంబున లక్ష్మణుఁడు “ఏషా పంచవట్యాం శూర్పణఖా” అని తెల్పఁగనే సీత “హా! ఆర్యపుత్ర! ఏతావ త్తే దర్శనం” అని తన సరళభావంబును వ్యక్తీకరింపఁజేసెను. ఇయ్యది పూర్వవిషయంబని యెఱింగియును నపుడు జరుగుచుండినట్లు తలంచి కలఁతఁ జొందినదై సీత భ్రాంతినొందినట్లు గడగడ వడఁకసాగెను. శ్రీరాముఁడు “చిత్రమేతత్” అని యామె నూరడించెను. ఈమెకుఁ బ్రణయవికాసంబు

గూడ నతిశయంబుగ తపోవన గమనాసక్తికల దైనను అయ్యది రామవిరహముచేత సుఖదాయకము కాదనియే కదా "ఆర్యపుత్ర యుష్మాభి రప్యాగన్తవ్యమ్"అని పల్కినది ఈ సతీరత్నము కాననమును సౌధాధివాస సుఖంబునే రామునితోఁగూడి యుండుటగఁ దలంచినది. శ్రీరాముఁడు సీత నిర్దోషియైనను, నగ్నిపరిశుద్ధయైనను, సకలగుణగణపరివృతయైనను, నళీకలోకాపవాద దూషితంబుచే గేవలము ప్రజానురంజనార్థమై కాంతారంబునందు విడిపించెను. ఇట్టి యిక్కట్టునకుఁ బుట్టినిల్లగు చెట్టలకుఁ బాల్పడియుఁ బతియం దించుకేనియు విరక్తభావంబును గాని, విషమభావంబును గాని పొందలేదు. ఈ మహామాతయొక్క హృత్కేంద్రము పూర్వాపేక్షచేనైన విరహముచేత స్వచ్ఛమైనదివలెఁ బ్రేమసంవాద మొనరించెను. ప్రతిపదమునందును శ్రీరామ విషయకమగు తృష్ణము గలదియైనను రాముని తృణవర్ణనమైనను నమృతస్నాన సంతృప్తివలె దలంచుచు సంతసించుచుండెను. ఇందులకు ఛాయాంకోపసంహారమే తార్కాణము. ఈయర్థమును దేటతెల్లముగఁ జేయు నీ సందర్భమును స్థాలీపులాకన్యాయముగ గమనించిన జాలును.

తమసా:—కథంవా గమ్యతే. యస్యాస్తవ—

ప్రత్యుప్తస్యేవదయితే తృష్ణాదీర్ఘస్య చక్షుషః
మర్మచ్ఛేదోపమై ర్యత్నైస్సన్నికర్షో నిరుధ్యతే.

సీతా:—నమోనమః సుకృతపుణ్యజనా పూర్వదర్శనీయాభ్యాం
ఆర్యపుత్రచరణకమలాభ్యామ్ (ఇతిమూర్ఛతి)

ఈ ప్రదర్శనమునకుఁ బిమ్మట దమసచే ననురుద్ధ యయ్యును సీత చేష్టఁగలది యయ్యును దనదృష్టిని శ్రీరామునినుండి మఱలింపలేదు. కాననంబున మనోహరంబులైన గిరినిర్ఝరాది చేతస్సంతోషకరంబులును శ్యామావిటపాదితరుబృందంబులును, వల్లీపుంజంబులును మఱియు నసంఖ్యము లున్నను నివియన్నియును శ్రీరామ విరహంబున లావణ్యవిహీనంబులుగఁ దెలిసికొనెను. ఈమహామహురాలి మనస్సున కెచటను శాంతి కలుగనేలేదు. సకలశాంతి మయమును గేవలశాంతిమయంబును సంతోషమయంబును సద్వృత్తిమయంబును నగునది శ్రీరామచంద్రదర్శనమే యని నిశ్చయించినదై శ్రీరామరమణి తనదుదృష్టిని శ్రీరామచంద్రునినుండి వెనుకకు మఱలింపగల్గునా?

ఇఁక శకుంతలా గుణగణంబు నొక్కించుక పరిశీలింతము. కాళిదాస పరికల్పితయగు శకుంతలాపేక్షచేఁ గూడ నాయికాగుణంబులయందు వైదేహియే యుత్తమ యని సమాలోచనావసరంబున బ్రాయికంబుగఁ బండితు లంద అంగీకరింతు రనుట నిస్సంశయంబు. దుష్యంత పురంబును జేరి నిజప్రాణనాథుఁడగు భర్తచే విస్మృతి సూచకంబగు వాక్యయంబును విని రోషాతిశయ దూషిత యయి—

"అనార్య! ఆత్మనో హృదయానుమానేన కిల సర్వం ప్రేక్షసే కోనామాన్యో ధర్మకంచుకవ్యపదేశిన స్తృణచ్ఛన్నకూపోపమస్య తవా ఒనుకారీ భవిష్యతి"

అని పలికెను. గుణవంతులలో నగ్రగణ్యుఁడయి రాజపదంబుచే విరాజమానుండగు దుష్యంతుఁడు శకుంతలచే "అనార్య!" అనునట్టి వాదంబులచే నెట్లు భర్త్సింపదగినవాఁడు? ఇదియే వైదేహి నున్నతపదంబునఁ బ్రతిష్ఠింపఁజేయు గుణము. మఱికొన్నివిషయంబులచేఁ గూడ దఱచుగా సీతాశకుంతలలయొక్క చరిత్రాంశంబున సాదృశ్యంబున భేదంబుగన్పట్టుచున్నది. విస్తరభీతివదలెదను.

సీతయనఁగా లోకాదర్శభూతయగు పతివ్రతయు గుణవతియు నగు రమణీమణియని వేఱ నుతించి చెప్పననవసరంబు. శ్రీరాముఁడు కష్టకరంబులగు విషయంబులను గలిగించినను గష్టంబని యెంచక రామునియందు నిమగ్నయై తదేకధ్యాన పరాయణయయి యుండెను. రామదర్శనముచే సకలకష్టములను బ్రహ్మానంద సదృశములుగ నెంచెను. ఒకప్పుడైనను శ్రీరాముని నిందావేశమును గూడ వినుట కిచ్చగింపక వజ్రపాతమువలె నద్దానిని దన శ్రవణకుహరంబులం జీల్చునట్టిదిగ నెంచుకొనెను. నరకజ్వాలలవలె రాముని కష్టవేశమునకుఁ గూడ దుఃఖపడుచుండెను. భవభూతి యుత్తరరామచరితంబున—

వాసన్తీ:—అయిదేవ! కిమపి దారుణో దారుణః ఖల్వసి?

సీత:—వాసన్తి కిం త్వమపి ఏవంవాదినీ భవసి?

పూజార్హాః సర్వస్యార్యపుత్రో విశేషతః మమ ప్రియ సఖ్యాః

అనియును మఱొకచో వాసన్తి శ్రీరాముని గురించి—

"కి మకార్య మనుష్ఠితం దేవేన"

అని యుచ్చరించుచుండగనే

సీత:—"సఖి! వాసన్తి! విరమ విరమ.

అని వినజాలనిదై చెప్పెను. మఱియొక సందర్భమున

వాసన్తి.—"అయి కఠోర! యశః కిలతే ప్రియం
కిమయశో నను ఘోర మతః పరమ్
కిమభవ ద్విపినే హరిణీదృశః
కథయనాథ! కథంబత! మన్యసే.

అని శ్రీరామునిఁ గూర్చి యనెను. సీత "కఠోర" అను నిత్యాదికములు తనభర్తను గురించి యనుటకు వినుటకైన సహింపలేక

వాసన్తి! త్వమేవ సఖి దారుణా కఠోరాచ,
యైవం ప్రలపంతం ప్రలపయసి

అని చెప్పినది. ఆహా! ఎంత కోమలహృదయ! మఱియు నునిట్టి సందర్భములఁ బట్టి చూడఁ గాళిదాస మహాకవి శకుంతలకంటె భవభూతి సీతయే యుత్తమగుణాఢ్య యని చెప్ప నొప్పును. సీతా రాములకు గలయనన్యసాధారణ దాంపత్యభావమును కనుఁగొనుఁడు.

"ప్రకృత్యైవ ప్రియా సీతా రామాస్యాసీ న్మహాత్మనః
తదైవ రామః సీతాయాః ప్రాణేభ్యోపి ప్రియోఽభవత్

ఆహా ! సీత యెంతటి ధన్యురాలు ! ఆమె పాతివ్రత్య మంతకంటె ధన్యతరము. ఇట్టివ్యక్తి మనుష్యులలో సంభవించుట దుర్ఘటము. ఈమె యుత్పత్తి పాతివ్రత్యశిక్షార్థమే యని నమ్మకము. శకుంతల గుణవిహీన యని నిర్వచింపుట కేరును సాహసింపరు. శకుంతలకంటె సీతయే యుత్తమ గుణాఢ్య యని యందురు. ఈమె జన్మముచే భారతవర్ష మెంతటిధన్యత నొందినదో యార్యులే యెఱుంగదగుదురు.

# వేణుగానస్మరణము

శ్రీ శేషాద్రి రమణ కవులు

ఉ. ఆవులు మోరలెత్తి భవ । దద్భుతవేణురవామృతం బొగిన్
ద్రావుచుఁ గన్నుమూసె నఁట । తల్లులుపిల్లలు గోపకుల్ మనో
భావము లుల్లసిల్లగను । వంశరవంబును మెచ్చిరంట కృ
ష్ణా! వినిపింపరాదె యల । నాఁటి భవన్మురళీనినాదముల్.

చ. పదములు వక్రరీతి నిడి । బంగరుడుప్పటి నేలజీర నై
నదుముచు భూమిపైని మృదు । లాంగుళి మోపి మనోహరంబుగాఁ
బెదవిని వేణువుంచి కను । వెల్గులు పైనె లయించి గానసం
పద వెలయించినావె! యదు । బాలక! గోపకు లుల్లసిల్లఁగన్.

ఉ. విచ్చినజెల్లుచా లొరసి । వేగమబ్బాఱు కళిందజాతటిన్
బచ్చికపట్టు నెన్నడుమ । వాసమొనర్చిన గోపగోపికల్
ముచ్చటదీరగా వినిన । మోహనగానము భక్తచిత్తహా
టచ్చర! కృష్ణ! యెప్డు విను । టల్ ఘటియిల్లునో తృప్తితీరఁగన్.

చ. తరువులు మొగ్గ లీనె నఁట । దాపున నున్న శిలాప్రతానముల్
కఱఁగఁగ సాగెనంట యదు । కన్యక లీప్రకృతిప్రపంచమే
మఱచి మనోజ్ఞగానరస । మగ్నమనోంబుజలై కడింది చి
త్తరువులఁ బోలినారఁట గదా! । యదురత్నమ! వేణువూదఁగన్.

## వే ణు గా న స్మ ర ణ ము

ఉ. శారదరాత్రియే ప్రకృతి । సంపద కెంతయు నాటపట్టు వా
చారురుచిప్రకాశ మగు । సాంధ్యముఖంబున గోపగోపికా
వారము గోకదంబకము । వన్యములున్ దనియంగ నవ్యవం
శీరవమాధురిన్ వెలయఁ । జేవితి వే! యదునందనందనా.

చ. విలసితచంద్రికానిశలు । వీనులవిందుగఁ గ్రోలెనో సము
జ్జ్వలయమునాతరంగిణి ప్ర।సన్నజలంబుల లీనమయ్యెనో
తెలియఁగరాదు కృష్ణ భవ।దీయ మనోహర వంశగీతి యీ
కలియుగమందు నీమహిత । గానరసామృత మానఁగల్గునే.

చ. జరుగుచునున్న వెన్నియొ ప్ర।సన్నసుధానవచంద్రచంద్రికా
సరళమనోహరమ్ము లగు । శారదరాత్రులు తావకీనమా
మురళిరవంబు నీభువన।మోహనగానము నోఁచకుంట ని
ర్భరయశమున్ దొలంగెను శ।రన్నిశ లో యదునందనందనా!

ఉ. మూఁపునఁ జల్దిచిక్కమును । ముద్దుమొగంబున లేఁతనవ్వు వా
ల్జూపులయందు బింకమును । శోణితరాధరమందు వేణువు
ద్దీపితమై తలిర్పఁ బ్రకృ।తిన్ వలపించుచు గానమాధురీ
రూప మలంకరించితె! । సరోజభవాండమునందు మాధవా!

ఉ. వాలు మెఱుంగుచూపులను । వత్సలమున్ శిఖిపింఛభూషణ
శ్రీలలితాననంబు పయి।స్మేరరుచుల్ నుదులందు శాంతమున్
నీలశరీరమందు స్మర।ణీయవిలాసము మించఁగా శర
త్కాలనిశన్ భవన్మురళి । గానముసేయవె క్రమ్మఱన్ హరీ.

చ. చెలువముజిల్కు లేఁజిఱుత । చెక్కుల నూఁది కరాంగుళీతలం
బులఁబయిఁ బాదుకొల్పి పశు।వుల్ నిసువుల్ తము విస్మరింపగా
నల మధురాపురీపరిస।రాంతరదంతుర శాద్వలస్థలిన్
జిలికిన వేణునాథసుధ । శ్రీధర! మాకు ననుగ్రహింపవే.

ఉ. ఆయమునాతరంగిణియు । నప్పటి నందకులంబు నాటి యా
త్మీయపురప్రదేశములు । దృష్టిగతంబులే! మైన లాభమే
మీ? యదుపుత్రకా! భవద।మేయమనోహరవంశగానమున్
బాయుటఁజేసి యందుఁ । గనుపట్టవు జీవకళారహస్యముల్.

# నిజాం రాష్ట్రాంధ్రోద్యమము

### వడ్లకొండ నరసింహారావు గారు

నిజాము రాష్ట్రములోని తెలుగుజిల్లాలు ఎనిమిది. రాజధానియగు హైదరాబాదును దానిసమీపముననున్న సికందరాబాదపట్టణమును తెలుగుదేశములోనే చేరియున్నవి. వరంగల్లు కరీంనగరము నల్లగొండ యందు కేవలము తెలుగుభాషయే వాడబడుచున్నది. ఆదిలాబాదలో కొంతభాగము మహారాష్ట్ర భాషయును, మెదకు నిజామాబాద మహబూబ్‌నగరము అత్రాఫ్‌బల్దాలో కొన్నిభాగములు మహారాష్ట్రకర్ణాటకభాషాసంపర్కము గలిగియున్నవి. నిజాంరాష్ట్రమున రెండు అయోమార్గములు గలవు. ఒకటి బెజవాడనుండి వాడీవరకును మరియొకటి మన్మాడ్‌నుండి హైదరాబాదవరకు పూర్వము నడుపబడుచుండెను. ఇటీవల ఇది గద్వాలవరకు మహబూబ్‌నగరము జిల్లాలో నుండి నడుపబడుచున్నది. దీనివల్ల మహబూబ్‌నగరముజిల్లాకు రాకపోకల విషయమునందును వాణిజ్యాది విషయములందును సౌకర్యము లేర్పడినవి. కరీంనగరము అయోమార్గమునుండి కడుదూరముగా నుండుటంబట్టి అయోమయములో మునింగియున్నది. నల్లగొండ మెదకుజిల్లాలలోని విశేషభాగము రైల్వేకు దూరమున నున్నది. ఆదిలాబాదకు రైల్వే సంబంధము లేదు. మొత్తముమీద తెనుగుజిల్లాలకు విశేషముగా రైల్వే యనుకూలములు లేవని చెప్పవచ్చును. మహారాష్ట్రప్రాంతములకు నిజాము రైల్వేలుగాక జి. ఐ. పి, బి. ఎల్. ఆర్. రైల్వేలవల్ల గూడ సౌకర్యమేర్పడినది. వాణిజ్యమందు మహారాష్ట్రజిల్లాలు ముందుకు వచ్చుట కిది యొకకారణమై యున్నది. కరీంనగరము ప్రాంతములనుండి ధాన్యాదులు విక్రయార్థము వరంగల్‌కు తేబడుచున్నవి.

## విద్యాస్థితి

ఉస్మానియా యూనివర్సిటీ ఏర్పడి మద్రాసు యూనివర్సిటీతో సంబంధము కొంతవఱకు విడనాడిన తరువాత ఆంధ్రవిద్యార్థులసంఖ్య కళాశాలలందు హెచ్చినది. ఉస్మానియాకాలేజి, నైజాముకాలేజి అను రెండుకళాశాలలు ఇచ్చట గలవు. కొలది కాలములో ఏఫ్. ఏ. బి. ఏ. లసంఖ్య స్వల్పముగా నుండదన్న నమ్మకముగలదు. వైద్యకళాశాలలోనేమి శిల్పికళాశాలయం దేమి న్యాయశాస్త్రతరగతిలో నేమి ఆంధ్రవిద్యార్థులసంఖ్య పూర్వముకంటె హెచ్చినది. అమెరికా ఇంగ్లాండునకు తెలుగుజిల్లాలలోని వతందారులపిల్లలు విద్యాభ్యాసమునకై పంపబడుచున్నారు. బార్-అట్-లా బిరుదులను పొందిన ఆంధ్రసోదరులు కలరు. ప్రభుత్వమువారి సహాయము లేకయే హైద్రాబాదునందు రెడ్డివిద్యార్థులకై బోర్డింగుగృహము సక్రమపద్ధతులపైన నడుపబడుచున్నది. పాఠశాలలసంఖ్య తెలుగుజిల్లాలలోగూడ హెచ్చింపబడినది. వరంగల్లుజిల్లాలో హనుమకొండయందు బోధనాభ్యసనపాఠశాల ఏర్పడినది. ఇచ్చట ఆంధ్రమునందే బోధనాపద్ధతులు నేర్పింపబడుచున్నవి. బాలబాలికలకై తెలుగు పాఠశాలలు సక్రమపద్ధతులపైని స్థాపించి నడపవలెనన్న యపేక్ష ప్రజలలో నంకురించినది. చందాలవల్ల ద్రవ్యము పోగుచేసి పాఠశాలకార్యములు నిర్విఘ్నముగా కొనసాగునట్లు ప్రయత్నములు చేయుట కలవాటుపడినది. ఇట్టి ఉద్యమములు ప్రభుత్వమువారి సహాయ మవసరమైనంతవరకు బొందుచునే యున్నవి.

ఉన్నతన్యాయసభయందు పనిచేయుచున్న ప్రముఖులగు న్యాయవాదులలో ఆంధ్రులు లేకపోలేదు. ఆంధ్రన్యాయవాదులసంఖ్య క్రమక్రమముగా హెచ్చుచున్నది. జిల్లాలలో పలుచోట్ల ఆంధ్రన్యాయవాదులసంఖ్యయే ఎక్కుడగా నున్నది.

నిజామాబాదప్రాంతములనుండి కొంతకాలమునకు పూర్వము పూనా బొంబాయి ప్రాంతములకు పోయి అచ్చటనే స్థిరనివాస మేర్పరచుకొనిన కొందఱు ఆంధ్రులు నిజామురాష్ట్రాంధ్రుల యెడ తమ సానుభూతిని చూపుచున్నారు. నిజాంరాష్ట్రాంధ్రుల కాకర మగు సంస్థలకు వలయు ద్రవ్యసహాయము చేయ సంసిద్ధులైయున్నారు.

బ్రిటిషుప్రాంతములోని యాంధ్రసోదరులచే చేయబడు ప్రయత్నములం దిచ్చటి యాంధ్రులు తమ సానుభూతిని చూపుచు నోపినకొలది సాయపడుచున్నారు. బందరులోని ఆంధ్రజాతీయకళాశాల యభివృద్ధికై యేటేట చేయు సహాయము చాల ప్రశంస్యముగ నున్నది.

## గ్రంథాలయములు

గ్రంథాలయములు విరివిగా స్థాపింపబడుచున్నవి. యువకులు ఉత్సాహపూరితులై వీని యభివృద్ధికై పనిచేయుచున్నారు. హైద్రాబాద, సికంద్రాబాద, హనుమకొండ, ఖమ్మంమెట్టు, ఎఱ్ఱుపాలెము, మట్టెవాడ, కొలనుపాక, సూర్యాపేట, హుజూరాబాద, హుజూరునగరము మున్నగుచోట్ల గ్రంథాలయములు పఠనమందిరములు ఆంధ్రభాషాభివృద్ధికి నెలకొల్పబడినవి.

హైద్రాబాదునందలి శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయము వీనిలో మొట్టమొదటిది. ఆంధ్రప్రపంచమున కంతకు కేవలము ఆంధ్రభాషాభివృద్ధికై స్థాపింపబడి నేటివరకు సక్రమముగా నడుపబడుచున్న గ్రంథాలయములలో కూడ నిదియే మొదటిదని చెప్పవచ్చును. ౧౯౦౧ సంవత్సరమున పాల్వంచ, మునగాల సంస్థానాధిపతుల పోషకత్వమున నిది రావిచెట్టు రంగరావుగారు మున్నగువారివల్ల స్థాపింపబడినది. ఇరు

Sreemathi S. Janakibayamma



కీ. శే. ఎన్ వతిన్ జానకిబాయమ్మ

Sreemathi H. Jimmabayamma



శ్రీమతి ఎచ్. జిమ్మాబాయమ్మ

Sreemathi Sakuntala Devi



శ్రీమతి శకుంతలాదేవి

Sreemathi M Kanthamma



శ్రీమతి కాంతమ్మ

Late Ramatilakamma



కీ. శే. రామతిలకమ్మ

Daughter of Nemili Subba Rao



శ్రీయుత నెమిలి సుబ్బారావుగారి
కుమార్తె

పదిరెండుసంవత్సరములనుండి నీభాషానిలయము ఇతరనిలయముల స్థాపనకు ఆదర్శకముగా నుండియు, ఇచ్చటియాంధ్రులందు మాతృభాషాభిరుచి గలుగజేసినారు. అన్యభాషాపదప్రయోగము మాటలాడుటయం దేమి, వ్రాయుటయం దేమి నిర్మూలముచేయుటకును ఆంధ్రభాషాపరివర్తనము సక్రమముగా నేర్పుటకును నిజాంరాష్ట్రాంధ్రుల యభివృద్ధికి పునాదిగా నుండి భాషాసేవ జేయుచున్నది. సుమారు ౧౨,౫౦౦ రూప్యంబులు నిలయాభిమానులవల్ల ప్రోగుచేసి స్వంతభవనము గడింపగలిగినది.

## పత్రికలు

ఇటీవల దేశాభ్యుదయమునకును ప్రపంచవ్యవహారజ్ఞానమును జనసామాన్యమునకు బోధించుటకును ప్రత్యేక తెలుగువార్తాపత్రికలు నిజాంరాష్ట్రమునుండి వెలువడు టావశ్యకం బని ఇచ్చటి ఆంధ్రులు గమనించినారు. మహబూబ్‌నగరమునుండి కొంతకాలమువరకు హితబోధిని యను మాసపత్రిక వైద్య పారిశ్రామిక సంస్కరణాదివిషయములను చర్చించుచు వెలువడినది. అటుపైని దివ్యజ్ఞానసమాజమువారిచే నొక పత్రిక ప్రచురింపబడినది కాని ఈ రెండును అంతరించినతరువాత నల్లగొండనుండి "నీలగిరి" యను పేరను వరంగల్ జిల్లాలోని ఇనుగుర్తి యను గ్రామమునుండి "తెనుగుపత్రిక" యను పేరిటను రెండువారపత్రికలు వెలువడి సక్రమముగా నడుపబడుచున్నవి. వీనికి స్వంతముద్రాక్షరశాలలు గలవు ప్రజలు పత్రికలయభివృద్ధికై అనేకవిధముల తోడ్పడుచున్నారు. నిజామురాష్ట్రములో తెలుగుపత్రికలు లేవన్న యపకీర్తి వీనితో తొలగినది. నూతనముగా "హైదరాబాదయూత్" అను పేర ఆంగ్లేయ మాసపత్రిక నొక యాంధ్రయువకుని సంపాదకత్వముననే వెలువడుచున్నది.

## గ్రంథమాలికలు

ఆంధ్రవాఙ్మయమున కొక క్రొత్త సోయగ మేర్పరిచి ఆంధ్రవధూటిని వన్నెకుదెచ్చిన విజ్ఞానచంద్రికామండలి మొట్టమొదట హైద్రాబాదులో నిజామురాష్ట్రాంధ్రులవల్ల స్థాపింపబడి తరువాత చెన్నపట్టణమునకు మార్చబడినది. తరువాత సికంద్రాబాదులో "కలవాణీగ్రంథమాల" స్థాపింపబడినది. ఇటుపిమ్మట సంస్కారిణీగ్రంథమాల పేర నల్లగొండలోను, విజ్ఞానప్రచారిణీ గ్రంథమాల యను పేర ఇనుగుర్తియందును బయలువెడలినవి. వీనిలో మొదటిది వేరొండురూపమును బొంది గ్రంథమాలయుద్యమము మానుకొన్నది. రెండవదానికి కార్యనిర్వహణమునందు చిక్కులనేకము సంభవించినను ధైర్యస్థైర్యములు విడనాడక పాటుపడుచున్నది. కీర్తిశేషులగు వీరేశలింగముపంతులుగారి జ్ఞాపకార్థము "శ్రీ వీరేశలింగ కంఠాభరణ గ్రంథమాల" యను పేర మఱొక గ్రంథమాలిక నల్లగొండయందు స్థాపింపబడి హైదరాబాదుకు మార్చబడినది. ఇది పంతులుగారి నామాంకితమువల్ల నైనను అచిరకాలమున వృద్ధిలోనికి వచ్చి సర్వజనసమాదరణీయమగునని నమ్ముచున్నాము. భక్తిరసప్రధానంబగు గ్రంథములు మాత్రమే ముద్రించి ప్రచురించునట్టి గ్రంథమాల నల్లగొండయందు మరొక్కటి కలదు. ఇయ్యది "జగదీశ్వరగ్రంథమాల".

## స్త్రీవిద్య

బాలికాపాఠశాలలు పలుచోట్ల స్థాపింపబడుచున్నవి. పిల్లలను బడులకు పంపుటకై తలిదండ్రులు వెనుదీయుట లేదు. ప్రభుత్వము వారి పాఠశాలలు లేనిచోట్ల ప్రత్యేకసంఘములవారు తమబాలికల విద్యాశిక్షణకై పాఠశాలలు స్థాపించుటకు ప్రయత్నించుచున్నారు. బోధకురాండ్రు దొరకుట యొకింతదుర్లభముగా గన్పట్టుచున్నది. ప్రభుత్వమువారిచే వరంగల్లుజిల్లాలోని హనుమకొండయందు ప్రత్యేకముగా స్త్రీలకొరకు బోధనాభ్యసనపాఠశాల స్థాపింపబడినది. ఇది కేవలము స్త్రీలచే నడుపబడుచున్నది. బోధనాపద్ధతులు ఆంధ్రమున నేర్పబడుచున్నవి. పురుషులయందు స్త్రీవిద్యాభిమానము గలిగియున్నది. స్త్రీలయందు పఠనాసక్తి యంకురించినది. హైద్రాబాదునందు కొంతకాలము క్రిందట స్త్రీసమాజ మొకటి కీ. శే. రావిచెట్టు లక్ష్మీనరసమ్మగారిచే స్థాపింపబడి వారిజీవితకాలమున అతిసమర్థతతో దానిని నడుపుటకు ప్రయత్నములు జరుపబడినవి. అటుతరువాత స్త్రీసమాజములజాడ గన్పట్టలేదు. దుందుభినామసంవత్సరమున హైదరాబాద రెసిడెన్సిబజారులో "ఆంధ్రసోదరీసమాజము" స్థాపింపబడినది. ప్రతి ఆదివారము ఆంధ్రభాషానిలయమున స్త్రీలు గుమిగూడి సభలు జరుపుకొనుచున్నారు. ధైర్యోత్సాహములు అభివృద్ధి యగుచున్నవి.

## కవీశ్వరులు, గ్రంథకర్తలు

పూర్వమునుండి నిజామురాష్ట్రము కవిమూర్ధన్యులకు పుట్టినిల్లనిపించుకొనినది. పోతన, సోమనాథుడు, భీమకవి మున్నగు సుప్రసిద్ధప్రముఖులైన కవిపుంగవులు నిజామురాష్ట్రములోనివారని నిరూపింపబడినది. ఇప్పటికిని కవిత జెప్పువారు లేకపోలేదు. విద్యార్థులలో సహితము రసవంతమైన పద్యముల నల్లగలవారున్నారు. అష్టావధానము చేయగల యువకు లొకరిద్దఱు కేవలము నైజామురాష్ట్రములోనివారై యున్నారు. వీరు శ్రీమాన్ వానమామలై వెంకటాచార్యులును వారి సోదరులగు లక్ష్మణాచార్యులును, వరంగల్ జిల్లాలోని మడికొండగ్రామమందు పుట్టిపెరిగినవారు. గద్వాలసంస్థానమందు ప్రతిసంవత్సరము విద్వత్సభలు జరుగును. పండితులకు వార్షికము లేర్పడియున్నవి. పెక్కండ్రు విద్వాంసులు ప్రతిసంవత్సరము నానాభాగములనుండి ఇచ్చటికి వచ్చెదరు.

## మాతృభాషాభిమానము

ఎల్లరును ఆంధ్రభాషాభిమానమును జూపుచున్నారు. సభలలో తెలుగునందు ఉపన్యాసము లిచ్చుటకు ప్రయత్నించుచున్నారు. మాతృభాష యగు తెనుగునందే శ్రద్ధ వహించి యావశ్యకతను గ్రహించుచున్నారు.

## ఆదిమాంధ్రులు

ఆదిమాంధ్రులప్రసక్తి నిజామురాష్ట్రమునందు లేకపోలేదు. వీరిలో శాకాహారులు గలరు. మంచి ఉద్యోగములందు పలువు రున్నారు. నిమ్నజాత్యుద్ధరణమునందు సానుభూతి కనబఱచువా రున్నారు. నిమ్నజాతి

బాలబాలికాపాఠశాల లున్నవి. ఇంకను నెలకొల్పబడుచున్నవి. ఆది హిందూ సాంఘిక సేవాసమాజము ఇటీవల స్థాపింపబడినది. బాలబాలికలకై ప్రత్యేకముగ నొకపాఠశాల పైసమాజమువారిస్వాధీనమున నున్నది. చందాలవల్ల ద్రవ్యము పోగుచేసి పాఠశాలకై స్వంతభవన మొకటి కట్టింప నుద్యమించినారు.

## కళావంతులు

కళావంతులసభ సెకందరాబాదునందు కలదు. హేయమగు వ్యభిచారవృత్తిని మానవలె ననియు, ముందుసంతతివారికి వివాహములు చేసి కుటుంబములవారినిగా జేయుటకును, స్త్రీలసహాయమున జీవనము చేయువారు తమశక్త్యనుసారము ఇతరవృత్తుల నవలంబించుటకును త్రాగుడును శుభాశుభదినములందు ఖండితముగ నిషేధించుటకు ఈసభవారు తీర్మానించుకొని యున్నారు.

## వైశ్యులు

సెకంద్రాబాదునందు వైశ్యులు సంస్కరణాపేక్ష గలిగియున్నారు. పూర్వమువలె వీరు తమవర్తకవ్యాపారముతో తృప్తినొందుట లేదు. విద్యావ్యాసంగములను, సంఘాభివృద్ధికరమగు సంగతులను ఆలోచించుచున్నారు. వైశ్యసహాజనసభ యొకటి గలదు. మట్టెవాడయందు నొక సంఘము కలదు.

## సంస్కరణము

వైశ్యులే గాక తదితరులయందును సంస్కరణాభిలాష యంకురించినది. ముదిరాజసంఘము యాదవజనసంఘము హైదరాబాదయందున్నవి. ఇవి కేవలము ఆయా తెగలవారి యభివృద్ధికై కృషి చేయుచున్నవి ముదిరాజసంఘమువారి యధీనమున బాలికాపాఠశాల యొకటి నూతనముగ స్థాపింపబడినది. బ్రాహ్మణబ్రాహ్మణేతరకక్షలిచ్చట లేవు. పరస్పర మనూయాభావములు లేవు. అందఱును కలసిమెలసి స్నేహభావముతో నభివృద్ధికై పాటుపడుచున్నారు.

## రాజకీయము

రాజకీయసమస్యలు, పరిపాలనావిధానమునుబట్టి యిచ్చటివారిని బాధించుట లేదు. కాని భారతదేశపు భవిష్యత్స్థితిని గుఱించి, ప్రస్తుతము జరుగు వ్యవహారములను గుఱించి తల పంకింపనివారు లేకపోలేదు. మహాత్ముల సందేశములు పెడచెవిని పెట్టుట లేదు. ఖద్దరునందు అభిమానముగలవా రిచ్చటియాంధ్రులందు అనేకులు గలరు.

## పరిశ్రామికములు

పరిశ్రామికములయందును నిజాంరాష్ట్రాంధ్రులు శ్రద్ధ వహించి యున్నా రనుటకు ఈసంవత్సరమున ఓరుగల్లునందు జరుపబడిన విజయదశమిప్రదర్శనమే సాక్ష్యము. విద్యుద్దీపము, స్టవ్ (పొయ్యి) వీవన, సబ్బుబిళ్లలు, తాళములు, గుండీలు, కత్తులు, తివాచులు, జంపఖానాలు, మున్నగునవి ఓరుగల్లువాస్తవ్యులచే తయారుచేయబడినవి ప్రదర్శింపబడినవి.

## ఆంధ్రజనసంఘములు

నిజామురాష్ట్రములోని యాంధ్రులందు పరస్పరసహానుభూతిని గలిగించి వారి యభివృద్ధికై యత్నించు నుద్దేశ్యముతో హైద్రాబాదు పట్టణమునం దొక యాంధ్రజనసంఘము మొట్టమొదట స్థాపింపబడినది. ఇదే యుద్దేశముతో హనుమకొండ, నల్లగొండ, సికందరాబాద, పర్బాల, ఖమ్మంమెట్టు లం దాంధ్రజనసంఘము లేర్పడినవి. ప్రతిజిల్లాయందును ప్రతితాలూకాయందును సంఘములు స్థాపించు ప్రయత్నములు జరుగుచున్నవి. పరస్పరస్నేహభావము ఐకమత్యము ఆంధ్రులయం దంకురించి ఈ సంఘములవల్ల ఘనకార్యము లవలీలగా జరుగునన్న నమ్మకముగలదు.

## ముగింపు

ఈ వ్యాసమును ముగించుటకు పూర్వము ఆంధ్రోద్యమము లన్నిటియందు ముఖ్యముగా పాలుగొనువారి నిద్దరిని పేర్కొనవలసియున్నది. వీరిలో మునగాల సంస్థానాధిపతు లగు రాజా నాయని వెంకట రంగారావు బహద్దుర్ గారు ఒకరు. శ్రీ రాజాగారు ఇంచుమించుగా ఆంధ్రభాషానిలయములన్నిటికి పోషకత్వభారము వహించియున్నారు. ముఖ్యముగా హైదరాబాదలోని శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయమునకు స్థాపకులు, రాజపోషకులు, అధ్యక్షులు. మందిరనిర్మాణకార్యమున కమితమైన ద్రవ్యసహాయము చేయుటయే గాక నిరంతరము దాని యభివృద్ధికై తోడ్పడుచున్నారు.

రెండవవారు శ్రీమాడపాటి హనుమంతరావు పంతులుగారు. వీరు హనుమకొండయం దున్నకాలమున అచ్చటి నిలయపాలనమునందు తోడ్పడినారు. తరువాత హైదరాబాదయం దుండి అచ్చటిభాషానిలయమునకు పాలకసభ్యులుగాను, కార్యదర్శిగను, ఉపాధ్యక్షులుగను ఉండి యతిసమర్థతతో కార్యభారమును నిర్వహించియున్నారు. మందిరనిర్మాణము పూర్తియగుటకు వీరు పడినప్రయాసము నిలయాభివృద్ధిలో మఱవదగనిదై యున్నది.

# కామశాస్త్రము — తత్ప్రయోజనములు *

సారంగు నరసింహారావు గారు

ధర్మార్థకామమోక్షము లగు చతుర్విధపురుషార్థములలో ప్రధానములు కామమోక్షములు. కొందఱు ధర్మమోక్షములు ముఖ్య మందురు. కాని యది సరిగాదు. ధర్మార్థములు రెండును కామమున కంగములు. ఈ మూడిటికిని భిన్నమైనది మోక్షము. ఎట్లనఁగా జ్యోతిస్స్వరూప మగు నాత్మకు శరీరములు మూడని తత్త్వవిదులు చెప్పెదరు. మొదటిది బుద్ధ్యాత్మకము. చిత్తము రెండవది. ఈ రెంటిని ఆవరించిన భౌతికదేహము మూడవది. ఇందు బుద్ధి విషయముగా గలది మోక్షశాస్త్రము. రాగద్వేషాదులకు స్థానమగు చిత్తము కామశాస్త్రవిషయము. ఇఁకను ధర్మార్థములు భౌతికదేహమునకు చెందినవి. ఇట్లు పురుషార్థముల నాలిగింటిని దేహములతోపాటు స్థూలముగ భాగింపవచ్చును. జీవునకు జన్మాద్యవస్థలు గలుగుట ఆత్మవికాసానుసారము ముక్తుఁ డగుట కని అందఱు నెఱిఁగినదే. ధర్మార్థములు భౌతికదేహస్థితికే తోడ్పడును కాన ఆత్మవికాసానుసారముగ ముక్తిసాధనమునకు ముఖ్యములు కావు. ఎట్లనగా భౌతికశరీరము జీవునకు స్థూలప్రపంచముతో సంబంధము కలుగజేయునే గాని ఆత్మవికాసమునకు తోడ్పడజాలదు. అంతపై సూక్ష్మము లగు బుద్ధిచిత్తముల ననుసరించి భౌతికదేహము నిర్మింపబడు ననునది జంతువులలో నిత్యమును మనము చూచుచున్నాము. కాబట్టి చిత్తము బుద్ధి యనునవియే ఆత్మవికాసమునకును, తద్ద్వారా ముక్తికిని సాధనము లని సిద్ధాంతమగుచున్నది. కాన భౌతికదేహస్థితికై నియమింపబడిన ధర్మార్థశాస్త్రములు జీవునకుత్కృష్టఫల మీయజాలవు. ఇటులు చేయునది కేవలమును కామమోక్షశాస్త్రమును మాత్రమే!

చిత్తవికాసము కామశాస్త్రవిషయము. మనుష్యుని వ్యక్తిత్వము (Personality) చిత్తానుసృతము కావున కామశాస్త్రప్రయోజనము వ్యక్తిత్వాభివృద్ధి యగును. బౌద్ధికమగు ఉత్కృష్టజ్ఞానస్వరూపము విభాగానర్హము కావున వ్యక్తిత్వమునకు బుద్ధివికాసమునందు తావులేదు. ఇఁకను, సర్వసామాన్యమగు భౌతికశరీరము ప్రత్యేకత్వము నీయఁజాలును. గాని వ్యక్తిత్వాపాదక మెంతమాత్రము కాదు. దీనివలన చిత్తమే వ్యక్తిత్వమునకు నిధానమని సిద్ధించుచున్నది. కాన చిత్తవికాసమే విషయముగాఁగల కామశాస్త్రము అవశ్యము సాధనీయము. చిత్తవికాసము నఁగాని వ్యక్తిత్వము రాజాలదు. వ్యక్తిత్వము లేనిదే జీవుడు మోక్షగామిగాజాలఁడు. కాన వ్యక్తిత్వాభివృద్ధి ముఖ్యకర్తవ్యము. దానికై కామశాస్త్ర మభ్యసింపవలెను. "కామిగాక మోక్షగామి కాడు" అనిగదా సామెత.

ఇఁక చిత్తవిషయమును చర్చింతము. రాగద్వేషాదులగు భావములకు చిత్తము స్థానభూతము. లేదా చిత్తము ఈభావముల పుంజమే గాని వేఱుగాదని చెప్పినను చెప్పవచ్చును. కావున చిత్తమునుగూర్చి విచారించుటకు భావజ్ఞాన మావశ్యకము. సద్భావములను సాధించుటచేఁ జిత్తమును తదాధార మగు వ్యక్తిత్వమును అభివృద్ధిఁ జెందును. భావములలోఁగల మంచిచెడ్డలను తెలిసికొనుటకు మున్ముందుగ భావములు తెలియవలయును గదా! చిత్తవృత్తి యగు భావజ్ఞానము కేవలము ఆధ్యాత్మికముగఁ దర్కించుటచే కలుగదు. అనుభవజ్ఞానము కలుగుటకు కళాజ్ఞాన మావశ్యకము. కళలు భావబోధకము లగుటచే చిత్తవికాసమునకును, తద్ద్వారా వ్యక్తిత్వాభివృద్ధికిని కారణములు. రసికత వ్యక్తిత్వసూచకము కావున నవరసరసికుఁడు మహాశయుఁ డని చెప్పఁబడును. మఱియును రసానుభవము బ్రహ్మానుభవమునకు ప్రతీకమని శాస్త్రోక్తమగుటచేత ముఖ్యముగసాధింపఁదగినది. దానికై కామశాస్త్రాభ్యాసమవశ్యము. కావునకళాజ్ఞానమును రసానుభవమును కామశాస్త్రవిషయములు,

* (వాత్స్యాయనమహర్షికృత కామశాస్త్రమును ఆంధ్రములోనికి పరివర్తించి జయమంగళవ్యాఖ్యతోను నృసింహాకారికలతోను మేళవించి- కావ్యవ్యాకరణతీర్థులు బ్ర. శ్రీ. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు- [10, అర్మగంతేను, ట్రిప్లికేను మద్రాసు.] ముద్రింపనున్నారు. వీరి ముద్రణమునందు సులభమైనశైలిలో రతిరహస్యము అనంగతంత్రము మున్నగు 20 సంస్కృతగ్రంథములనుండియును, కొక్కోకము రతిచంద్రిక మున్నగు 15 ఆంధ్రగ్రంథములనుండియును, సారాంశములు వివరణరూపమున నుద్ధరింపబడుటయేగాక సుశ్రుత చరకాది వైద్యగ్రంథముల నుండి ఆంగ్ల వంగాదిభాషల నుండి అనేకము విశేషాంశములు చేర్పఁబడినవి.—సంపాదకుడు.

కామశాస్త్రమునకు విషయము- అనగా సాధ్యము- స్త్రీతక్క వేఱు లేదని పెక్కురు అభిప్రాయపడుచున్నారు. కాని అది సరియైనది కాదు. స్త్రీసాధనము ముఖ్యవిషయముగ నుండవచ్చునే కాని దానికంటె మఱి లేదనుట మిక్కిలి యనుచితము. మానవజాతియొక్క వ్యక్తిత్వమునకు స్త్రీ ఆధారమైయున్నది. జాతికి పురుషుడు బుద్ధి యనియును స్త్రీ చిత్తమనియును చెప్పవచ్చును. కావున పురుషుడు బౌద్ధికమగు నుత్కృష్టజ్ఞానమునకును- స్త్రీ చైత్తికమగు వ్యక్తిత్వమునకును ప్రతీకములని గణింపనర్హులు. స్త్రీజ్ఞానము జాతిస్వ్యక్తిత్వమును బోధించును. కావున ప్రత్యేక వ్యక్తిత్వాభివృద్ధికి తోడ్పడును. ఇందువలన స్త్రీజ్ఞానము కామశాస్త్రముఖ్యవిషయ మన్నచో తప్పును లేదు.

ప్రస్తుత మీ వ్యాసమున చర్చింపదగినది ఇంకొక విషమవిషయము గలదు. సాంప్రయోగికజ్ఞానము జీవగుణోన్మీలనమునకు సాధన మనుట బహుజనుల కిది పథ్యము గాకపోవచ్చును. కాని తత్త్వదృష్టితో నించుక పరీక్షించినచో ఇందలి యాథార్థ్యము బోధపడును. ఎట్లనగా స్త్రీపురుషభేదము జీవునకు ముక్తిసాధన మనుట యైనచో సృష్టిలో నీభేద ముండనక్కఱయే లేదు. ఈ విభేదము దేహప్రసూతికిమాత్రమని యందురేని లింగవివక్షలేని స్వేదోద్భిజ్జాదికములగతి యేమి? కావున లింగభేదము జ్ఞానప్రయోజక మని సిద్ధించును. తారకమంత్రోపదేష్ట యగు పరమశివుని లింగరూపమున నారాధింతు మని జ్ఞప్తియం దుంచికొనినచో రతిజ్ఞానము అత్యుత్కృష్ట మగు విజ్ఞానదాయక మగు నంశమనుట కాక్షేపణ ముండదు. రతికౌశలము చిత్తపరిస్పందన మగుటచే వ్యక్తిత్వాభివృద్ధికారకము. అయినను మనము సురతము నీచమను దురభిప్రాయమునకు దాసులమై, దాని ప్రాధాన్యమును గుర్తింపజాలకున్నాము. కొంచెము విచారించినచో తదుత్కృష్ట ప్రయోజనము బోధపడును. బాల్యావస్థనేమో చెప్పజాలముగాని, ఇతరావస్థల నెట్లుగా విధించునో చెప్పవలెనన్నచో పెద్దగ్రంథ మగును. ఇది మానవజాతికే గాక స్త్రీపురుషవివక్షగల జంతుజాలముల కన్నిటికిని సామాన్యము. నెమలిపింఛమును చూచునప్పుడును, పుంస్కోకిలాలాపమును వినినప్పుడును, యువకుల శరీరాలంకరణమును చూచినప్పుడును, సాంప్రయోగిక ప్రాధాన్యమును చక్కగా తెలిసికొనజాలుదుము. మానవదేహముల ప్రస్తుతస్థితి సాంప్రయోగిక వైదగ్ధ్యమని డార్వి నను జంతుశాస్త్రజ్ఞుడు సూత్రించియున్నాడు. అందుచే సురతము నీచముగాదని సిద్ధించును. అందునను రతితృప్తిలేనిది గర్భధారణము లేదనియును, అసంతుష్టరతి స్త్రీ పురుషుల కనారోగ్యకర మనియును పాశ్చాత్య వైద్యులు గూడ నంగీకరించియున్నారు. కావున భావానురంజనము ప్రాధానముగ సాధనీయము సాంప్రయోగికజ్ఞానము కామశాస్త్ర ముఖ్యవిషయము. దంపతులవిధులు వివాహభేదాదికములు సురతాధికారమునకు అంగభూతములు కావున నవియును కామశాస్త్రమునందు చర్చనీయాంశము లే.

కామశాస్త్రవిషయములు అముఖ్యములు పెక్కులుగలవు. అనేక క్రీడలు- హల్లీసకాదినర్తనములు గృహారామనిర్మాణములు- మొదలగువాని నుదాహరణముగ గైకొనవచ్చును. వాత్స్యాయనాదులు వేశ్యాధర్మములను గూడ కామశాస్త్ర విషయములుగా నంగీకరించియున్నారు. కాని అది ధర్మశాస్త్రసంబంధమేమో యని సందేహము. సంఘమును కాపాడుటకై వ్యభిచారమును నియమింపవలసివచ్చినది. అందులకే, కాబోలు వేశ్యావృత్తి ఏర్పరుపబడినదని యూహింతును. ఈయాచారముచే సంఘమునకు కలుగుమేలు స్థూలబుద్ధులకు గోచరింపక పోవచ్చును. కాని వ్యభిచారమును నియమితవృత్తిగా విధించుట శ్రేయమని పక్షాంతరమున నంగీకరింపవచ్చును. ఎటులైన వేదకాలమునుండియు వేశ్య లున్నారనుట నిర్వివాదము.

కామశాస్త్రసంప్రదాయము లగు గోష్ఠీసమవాయాదికములను, వాత్స్యాయనుడు వర్ణించియున్నాడు. వాటిని నవీనులు Clubs అని వాడుదురు.

ఇట్టి ప్రయోజనములు గల శాస్త్రము అవశ్యసాధనీయ మని వేఱుగ చెప్పనక్కఱయే లేదు. ఈశాస్త్రగ్రంథములనుగూర్చి కొంచెము చెప్పెదను. వాత్స్యాయనసూత్రము లీశాస్త్రమును పూర్తిగ చర్చించును. కొక్కోకకృతమగు రతిరహస్యము సురతాధికారమునే వర్ణించును. ఇవి సంస్కృతపుస్తకములు. ఆంగ్ల జర్మను భాషలలో ఈశాస్త్రగ్రంథము లనేకము లున్నవి. ఇంకను నిర్మింపబడుచున్నవి. కామశాస్త్రము నింద్యమని త్రోసివేయదగినది గాక తత్త్వజ్ఞులగు వారి కెల్లరకును నవశ్యముపాదేయ మని నామనవి. ఆంధ్రమహాజనులు దీని నాదరింతురుగాక.

# జాతీయ విద్య

ఓరుగంటి వేంకట సుబ్రహ్మణ్యము గారు

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్, స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

ప్రాణనాది లేని కట్టడముగాని బాధ తెలియని సౌఖ్యముగాని, అనుభవైకయోగ్యములు గావు. స్వరాజ్యము అప్రయత్నముగ ఊడిపడునని యెంచు టెంతయు హాస్యాస్పదము. అస్వతంత్రజాతీయుల మైన మనము స్వరాజ్యసాధనమునకై తీవ్రశ్రమసంరంభమునం దగిలి విజయులము కాగల్గుటకు ముందు కొన్ని యుపకరణముల సమకూర్చుకొనవలసి యున్నది. ఆర్థికముగ నధోగతి నున్న తోడి దేశీయసోదరులకు కొంతకుకొంత బ్రదుకుతెరవును కల్పించినచో దేశమాతృసేవకు వందలు వేలై స్వరాజ్య భక్తులు పరుగువాఱక పోరు. ఈ యుద్దేశసాఫల్యమునకే గాంధిమహాత్ముడు స్వదేశవస్త్రపరిశ్రమోద్ధరణమును గూర్చి మాటిమాటికి దేశము నుద్బోధించెను. జాతీయభావములను భరతఖండమునందంతట మూలమూలలకును పల్లెపల్లెలకును ప్రాకునట్లు చేసి సుస్థిరముగ నెలకొల్పవలయు. స్వరాజ్యప్రయత్నములందు చేదోడువాదోడై నిరుపమానసాహాయ్యము నొసర్పగల్గినవారును ఉత్సాహసంపన్నులు నగు యువజనుల నుపేక్షింపరాదు. స్వాతంత్ర్యసంపాదనమునకై యిటలీదేశమునందేమి, ఐర్లండ్ హంగరీలందేమి విద్యార్థులు చూపిన త్యాగశీలమును కష్టసహిష్ణుతయు నసమానములు. జాతీయతను ధ్వంసము సేయునవి యగు పరరాజ్యాంగపు పాఠశాలలపైని వ్యామోహమును పాఱద్రోలి విద్యార్థులలో నచంచలమగు స్వాతంత్ర్యేచ్ఛను, నిష్కళంకమగు మాతృదేశారాధనతత్పరతను పురికొల్పజేయు జాతీయవిద్యాలయముల దేశమునందు విరివిగ స్థాపించుట అవసరము. ఇదియే జాతీయ నిర్మాణమునకు నిజమైన పునాది. హంగరీవారును ఐర్లండువారును ఈ విషయప్రాముఖ్యమును గమనించియే స్వరాజ్యలాభమును బొందుటకు మున్ను ఏండ్లకొలందిని తమతమరాష్ట్రములందు జాతీయవిద్యాలయప్రతిష్ఠాపనలకై కడుంగడు పాటుపడిరి. 1906 వ సంవత్సరమునందు కాళీఘట్టమున మహామహుడు దాదాభాయినౌరోజి అధ్యక్షుడుగా సమావేశమైన భారతదేశీయమహాసభవారి తీర్మానానుగుణముగ నీదేశమందు జాతీయవిద్యావ్యాపనమునకై విపులప్రయత్నములు గావింపబడినవి. కాని తత్సందర్భమున స్థాపింపబడిన విద్యాలయములు ఆయుద్యమపువేడి చల్లారుటతో నదియును చల్లారిపోయెను. ఐనను స్వార్థత్యాగులును కార్యశూరులు నైన లాలామున్షీరాము శ్రీకోపల్లెహనుమంతరావు మున్నగు మహానుభావుల అసమానకృషి-హరిద్వారమందేమి బందరునందేమి- తక్కిన ప్రదేశములయందేమి దివ్యఫలము లీనగల్గెను.

గాంధిమహాత్ముడు సహాయనిరాకరణసందేశము ననుగ్రహించెను. దీనితో జాతీయవిద్యాప్రయత్నముల కుజ్జీవము గల్గెను. కాంగ్రెసుసభాదేశానుసారముగ విపినచంద్రుడు గాంధి చిత్తరంజనుడు లజపతిరాయి మున్నగు నాయకవతంసములచే నుద్బోధింపబడి వందలకొలది విద్యార్థులు విదేశీయపాఠశాలలను వదలిరి. కాని జాతీయవిద్యాలయనిర్మాణమునకై కాంగ్రెసుమహాసభవారింతవఱకును ప్రశంస్యములగు ప్రయత్నముల నేమాత్రము గావించియుండలేదు. ఎన్నియో నెలలకుబూర్వము కాంగ్రెసుకార్యనిర్వాహకసంఘమువారిచే నియోజింపబడిన 'జాతీయ విద్యాసమితి' వారు తమనివేదికమును త్వరలో ప్రచురింపనున్నారు. ఇది జాతీయవిద్యాభిమానులకు సమ్మోదావహము.

ప్రభుత్వపాఠశాలలందలి ఆంగ్లభాషైకప్రధానమైనను ప్రస్తుతపు విద్యాపద్ధతికి మూలకారకు లనందగు మెకాలె- గతశతాబ్దాదిని హిందూదేశపురాజప్రతినిధియై యుండిన విలియంబెంటిక్- దేశీయ విద్యాపద్ధతులన్నను, అరబిక్ సంస్కృతము మున్నగు దేశభాషలన్నను ఎంతో కంటగించుకొనువారట. మెకాలేగారి యభిప్రాయప్రకారము మనదేశమునం జదువదగిన గ్రంథమే లేదు. ఉన్నచో కొఱగానివి! సంస్కృతవాఙ్మయ మంతయుం గలిపినను పెట్టె డాంగ్లేయపుస్తకములకు సరిగావు. బెంటిక్ రాజ్యపాలనకాలమున సంస్కృతమునకును నరబ్బీభాషకు ప్రభుత్వమువారు ధనసహాయమును బొత్తుగ నిలిపి, సంస్కృత భాషాగ్రంథముల ముద్రింపరాదనియు నాంగ్లభాషమాత్రమే యీ దేశమువారికి నేర్పవలసినదనియు శాసించిరి. "సంస్కృతభాషాభ్యాసమున కనుమతించినయెడల నది యైరోపీయవాఙ్మయాభివృద్ధికి నెదురొడ్డి నిలుచుననియు నాంగ్లభాషాప్రచారముచే హిందూదేశములోని మతములను నాగరకతను క్రమముగ గోతిలోం ద్రోయుటయు, సాధ్యమైనచో దలక్రిందుచేయుటయు" ప్రభుత్వమువారి ముఖ్యోద్దేశము. ఇట్టి దురుద్దేశములచే నంకురించిన ఆంగ్లేయవిద్యాపద్ధతి మనదేశమునం దెట్టి దుష్ఫలము లొసంగెనో గమనింపుడు.

మున్ను లెక్కకుమిక్కిలియైయుండిన పల్లెకూటములును స్వతంత్రములై సంఘావసరముల నెంతో చక్కగ దీర్పగలిగియుండిన పాఠశాలలును ప్రస్తుతము మాయమైనవి. వీనిస్థానమున బయలుదేరిన గవర్నమెంటుబడులు అల్పసంఖ్యాకములై ప్రజావసరములకు చాలకున్నవి. ఇన్నియేండ్లనుండియు బ్రిటిషువారీదేశమును పాలించుచున్నను కలిగిన ఫలితము వారిమాటలవలననే తెలియుచున్నది: "హిందూదేశములో నూటికి 75 గ్రామములలో బడి యన్నమాటయే లేదు. చదువుకొన్నవారు జనసంఖ్యలో 100 టికి 7 మంది మాత్రమే. చదువుకొననీడుగలబాలురలో 100 టికి 67 మంది. బాలికలలో 100 కి 93½

మంది చదువు లేకయున్నారు." ఇటు విద్యార్థులజ్ఞానవికాసము ముఖ్యోద్దేశముకాదు. గాని తెల్లవర్తకులసంచులు నింపుటమాత్రమే యని మాటిమాటికి మాఱుచుండు పఠనీయగ్రంథములే చాటుచున్నవి. విద్య యనఁగా ఎఱుగుటకు యోగ్యమైనది. అర్థాత్తుజ్ఞానమును కలిగించున దేదియో అదియే విద్య. మోక్షసాధనమైన బుద్ధికి జ్ఞానము అని పేరు. తజ్జన్యమైనది విజ్ఞానము. కాని యిపుడు సర్వసాధారణముగ ప్రభుత్వపాఠశాలలో అజ్ఞానము నవిద్యయు నేర్పఁబడుచున్నది. ఈవిదేశీయపాఠశాలలు ప్రభుత్వమునకు నౌకరులఁ దయారుచేయు యంత్రశాలలుగాని విద్యాశాలలు గావు. సుస్వతంత్రజీవనమును నిర్మూలించు నీపాఠశాలలు బానిసవ్యాపారమున తగిలియున్న వేగాని వేరుకాదు. 1920 సంవత్సరమునందు మదరాసు విశ్వవిద్యాలయస్నాతకులకు పట్టము లిచ్చుసందర్భమున శ్రీయుత కే. శ్రీనివాసయ్యంగారు రొసంగిన యుపన్యాసమును పఠికించువారికి ప్రభుత్వవిద్య యెట్లు వ్యర్థమైన దగుచున్నదో తెలియగలదు. స్వభావసిద్ధమును ప్రత్యేకవ్యక్తిత్వము గలదియు నగు హైందవజాతీయసంస్కారము నీవిజాతీయవిద్య విపరీతముగ నిర్మూలన మొనర్పగల్గినది. మఱియు నిది విద్యార్థులందు మాతృభాషానిరసనమును దేశభాషాపాండిత్యాభావమును ప్రబలునట్లు చేసెను.

## జాతీయ విద్య - తద్విద్యాధికారము

ఇట్టి పరిస్థితులలో భారతీయస్వాతంత్ర్యాభిలాషు లెల్లరకును జాతీయభావోత్తేజకము లగు జాతీయవిద్యాలయముల అవశ్యకత తెలిసివచ్చుచున్నది. జాతీయవాంఛలెల్ల రూపుదాల్చినది యనఁదగు దేశీయమహాసభకును జాతీయపాఠశాలలకును ఉండఁదగు సంబంధ మెద్ది? జాతీయవిద్యావిధాననిరూపణ మెట్టిది? దానిని నిర్ణయించున దెవరు? ఇత్యాదిప్రశ్నలిపుడు కలుగుచున్నవి. సంపూర్ణస్వరాజ్యభాగ్యము మన కొనగూడు దనుక సంపూర్ణవికసన మొందిన స్వతంత్రజాతీయవిద్యాపద్ధతి లభ్యమగు ననుమాట కల్ల. ఐనను ప్రస్తుతపు స్థితిగతుల ననుసరించిచూడ సాధ్యమైనంతవఱకు జాతీయవిద్యాసంస్థల అర్హనిర్మాణముం గూర్చియు, అందలి విద్యాబోధనాపద్ధతులం గూర్చియు దేశశ్రేయోభిలాషు లెక్కుడు శ్రద్ధ వహింపకతీరదు.

దేశమునంతను జాతీయవిద్యాలయములతో నింపివైచుటకు- తగినంత ధనసమృద్ధి- తీరిక- కాంగ్రెసుమహాసభకు గాని మఱి యేయితరసంస్థకుగాని లేదు. మొన్న మొన్న పుట్టిన కొన్ని జాతీయవిద్యాలయములు ధనాభావముచేతను జీర్ణోత్సాహముచేతను కృశించి చావుబ్రదుకుల నున్నవి. అందుచే జాతీయపాఠశాలలను నిర్వహించు భారము తత్ప్రాంతజనులపై నుండును. ధనమీయని అధికారమును విద్యాలయాధికారు లోర్తురనుటను నమ్మరాదు. అందుచే జాతీయవిద్యాప్రయత్నముల నేకోన్ముఖము చేయనెంచువారును- జాతీయవిద్యావిధానమందును బోధనాపద్ధతులందును ఏకత్వము సాధింపఁజూచువారును తమ తీర్మానములును జతనములును జాతీయవిద్యాలయములకును ప్రజలకును- ఉద్బోధకములుగ- మార్గదర్శకములుగ- నుండునట్లు చూచుకొనదగునే కాని కంటకప్రాయ మగువిధము నవలంబింపరాదు.

మఱియు జాతీయవిద్యావిధానమందుగాని, బోధనాపద్ధతులందుగాని ఏకత్వమును సాధించుట ముఖ్యము గాజాలదు. అట్లేకత్వమును సాధింపజూచుట అనుచితము నసాధ్యమునైన కార్యము. భిన్నత్వమే ప్రపంచపుపద్ధతి. ఇదియే స్వాభావికము. ఇందే అనీరుచియు నున్నది. కవిత్వచిత్రలేఖనముఁవలె విద్యాబోధనమును ఉపదేశకుని స్వయంవ్యక్త్యనుగుణముగ హృదయమునుండి సహజముగ నసర్గళముగ ప్రవహింపకలయును. "జాతీయవిద్యాస్వరూపమును మే మీ విధముగ నిర్ణయించితిమి విద్యాబోధన మీనిర్ణీతవిధమున నుండుగాక" అని యాదేశించుట సమంజసము కాదు. లాలామున్షీగాము హరిద్వారమందు స్థాపించిన గురుకులమహావిద్యాలయమును- బందరునందు కోపల్లి హనుమంతరావుగారు కేర్పరచిన ఆంధ్రజాతీయకళాశాలను- ఒండొంటితో బోల్చి చూడుడు. రెండును ప్రత్యేకవిద్యావిధానములతో నలరుచు ప్రత్యేకవ్యక్తిత్వలక్షణములను ప్రదర్శించుచున్నవి. ఎవ్వరునే జాతీయవిద్యాలయముయొక్క స్వతంత్రవికాసమునకును అడ్డుపడరాదు. దేశీయపాఠశాలలన్నింటియందును విద్యావిధానము నేకరీతిని సాధింపజూచుట, దేశపురోవృద్ధికి నిశ్చయముగ నాటంకముల గల్పించుటయే.

ఐనను కాంగ్రెసుమహాసభ జాతీయవిద్యావిషయమున నెట్టికృషి చేయదగు ననుటయు నాలోచింపదగినదే. ప్రస్తుతదేశస్థితిని గమనించువారికి కాంగ్రెసువారు స్వయముగ జాతీయవిద్యాలయముల నడపుబాధ్యతను దమమూపులపై మోయుట యసందర్భ మని పొడగట్టును. ఇందులకై సాంగ మగు జాతీయవిద్యాసంఘములను వారు నెలకొల్పి వానిసహాయమున జాతీయవిద్యాప్రచారమును సక్రమముగ సాగింప వీలు గలదు. జాతీయవిద్యాసంఘనిర్మాణముం గూర్చి నాయభిప్రాయముల గొన్నింటి నిందు బొందుపఱుచుచున్నాను.

## జాతీయవిద్యాసంస్థలు-వ్యవస్థలు

(1) జాతీయవిద్యాసంఘము ప్రతిమండలమున కొక్కటి యుండదగును. అందు జిల్లాయందలి ఒక్కొక్క జాతీయ పాఠశాలపక్షమున నొక్కొక్క ప్రతినిధియు, మండలకాంగ్రెసుసంఘమువారిచే నెన్నుకొనబడిన యిరువురు పెద్దలును, మండలకాంగ్రెసు సంఘాధ్యక్షుడును సభ్యులగుదురు. (2) రాష్ట్రీయజాతీయవిద్యాసంఘము ప్రతిమండలజాతీయవిద్యాసంఘమునుండి మువ్వురేసి ప్రతినిధులును రాష్ట్రీయకాంగ్రెసు సంఘాధ్యక్షుడును రాష్ట్రీయకాంగ్రెసుసంఘమువారిచే నెన్నుకొనబడిన మఱియిద్దఱును ఈ రాష్ట్రీయ జాతీయవిద్యాసంఘసభ్యులు. (3) అఖిల భారత జాతీయ విద్యాసంఘము. రాష్ట్రీయసంఘములు ఒక్కొక్కటియు ముగ్గురుసభ్యుల నిందుకు నియమింప నర్హములు. అట్లే అఖిలభారతకాంగ్రెసుసంఘపక్షమున తత్సంఘాధ్యక్షుడును మఱియు నిద్దఱును భారతజాతీయవిద్యాసంఘమున కెన్నుకొనబడి సభ్యులౌదురు. (4) మండల రాష్ట్రీయ దేశీయ జాతీయవిద్యాసంఘాధ్యక్షులు ఆయా మండల రాష్ట్ర, దేశీయకాంగ్రెసుసంఘములందును, కార్యనిర్వాహకవర్గములందును సభ్యులగుటచే కాంగ్రెసుజాతీయవిద్యాసంఘముల పరస్పరసాహాయ్యము హెచ్చుగ వీలై, అందుచే భారతదేశమందు జాతీయ

విద్యాభివృద్ధికార్యము సుగమ మగును. (5) భారతజాతీయవిద్యా సంఘాధ్యక్షుడు అఖిల భారత జాతీయ విద్యాంగమంత్రి యగును. (6) భారతజాతీయ విద్యాంగమంత్రి భారతజాతీయవిద్యాసంఘము వారి సలహాననుసరించి రాష్ట్రరాష్ట్రమునకును ఒక్కొకజాతీయవిద్యా పరిశీలకుని జీత మిచ్చి నియమింపదగును. ఈ పరిశీలకులు ఆయా రాష్ట్రపు జాతీయవిద్యాసంఘముల నధికారరీత్యా సభ్యు లగుదురు (7) ప్రతిజిల్లా జాతీయవిద్యాసంఘమునను పైవిధమున నేర్పడు సభ్యుల మొత్తపుసంఖ్యలో నేడవభాగమునకు మించకుండ పండితులను శాస్త్రజ్ఞులను ఆయామండలజాతీయవిద్యాసంఘమువారు నియమింపవచ్చును.(8) ప్రతివత్సరమును మండల రాష్ట్రీయ అఖిలభారతజాతీయ విద్యామహాసభలు జరుగుచుండుట బాగు.

## జాతీయవిద్యాసంఘముల కార్యవిధానము

(1) భారతదేశమం దీనాడు జాతీయవిద్యాలయములం దుపయోగింప నర్హములైన పఠనీయగ్రంథములకు చాల కొఱంత గలదు. గ్రంథకర్తల కిట్టి అత్యుత్తమగ్రంథములు రచించుటందును ప్రకటించుటయందును జాతీయవిద్యాలయములందు పఠనీయగ్రంథములుగ గమనించుటచేనేమి ధనసహాయముచేనేమి ప్రోత్సాహము నీజాతీయవిద్యాసంఘము లీదగును. (2) దేశమందలి జాతీయవిద్యాలయముల స్థితిగతులను గూర్చి లెక్కలు తయారుచేసి ప్రకటించుట. (3) జాతీయవిద్యావిషయములం గూర్చి సంతతము చర్చలమూలమునను ఇతరవిధములను ప్రజలజ్ఞానము నుత్సాహమును వృద్ధిజేయుటయు, జాతీయవిద్యాప్రచారమును సాగించుటయు నీసంఘములు నిర్వహింపవలసినవిధులు. (4) "సామాన్యవిద్య నిచ్చు జాతీయపాఠశాలలందు విద్యార్థుల మాతృభాషలకే ప్రధానస్థానమీవలయు"—పయివిధులను జాతీయపాఠశాలలు గమనించునట్లు చేయవలయు. ఇక జాతీయవిద్యావిధానముం గూర్చి కొంత యాలోచింతము. సంపూర్ణముగ కాంగ్రెసువారిచే పోషింపబడుచుండు పాఠశాలలు కాంగ్రెసువా రేర్పరుచు విద్యావిధానమునే అవలంబింపగలవు. ఇం దసహాజ మేమియు లేదు. తదితర జాతీయవిద్యాలయములకు కాంగ్రెసు విధానము నిర్బంధముగ అవలంబనీయము కాజాలదు. కాంగ్రెసువిధాన మీక్రిందివిధమున నుండదగునేమో ఆలోచింతురుగాక.

విధానము:— ప్రతిజాతీయవిద్యాలయమును భారతస్వరాజ్యాదర్శము నంగీకరించి తద్వ్యతిరిక్తములైనబోధల వేనిని జేయక విద్యార్థులందు మాతృదేశాభిమానమును మానవసోదరత్వభావమును, కష్టసహిష్ణుతయు భోగరాహిత్యమును పెంపొందజేయవలయును. ఆడంబరరహితమును స్వతంత్రమునైన జీవనముయొక్క చవిని బాలురు గ్రహించి సుఖు లగునట్లు చూచుట లెస్స. ప్రభుత్వపాఠశాలలందు నేర్చినవిద్య అసంఖ్యాకులను విదేశవస్తువ్యామోహమున బడద్రోయుటచే నానాటికి దేశభాగ్యము గ్లాస్గోమల్లులమూలమునను, హాటు- బూట్- కోట్- సూటు-లనీటులకొఱకును పరదేశములపాలై పోవుట కడుశోచనీయము. వెలపొడుగువియగు నాజూకువిదేశవస్తువులజోలి మాని జాతీయపాఠశాలలందలి బాలబాలికలు స్వదేశీవ్రతదీక్షాపరు లగునట్లు ప్రోత్సహింపబడవలయు. ఆజానుబాహులు వజ్రకాయులును బలిసియుండిన యీ భారతభూమి నేడు హ్రస్వాంగులును రోగపీడితులునైన విద్యార్థిజనసమూహములతో కాంతిహీనమై వెలవెలబోవుచున్నది. దేశీయవిద్యాశాల లీదుర్భరస్థితిని చక్కబఱుప నడుములుకట్టి తమవిద్యార్థుల యారోగ్యముంగూర్చి హెచ్చైన శ్రద్ధ గైకొనునుగాక. విశేషధనవ్యయసాధ్యము లగు క్రికెటు ఫుట్‌బాలు హాకీ మున్నగు వైదేశికములగు ఆటలు పరిత్యాజ్యములు. విద్యాదానమందు మతభేదములకును వర్ణభేదములకును తావుండరాదు. విద్యాబోధ దేశభాషలమూలమున జరుగవలయును. విద్యార్థులు నూలువడుకుటను నిర్బంధముగ నభ్యసించునట్లు చేయదగును. సామాన్యముగ సంభాషణశైలి యలవడునంత మాత్రము హిందీభాషాజ్ఞాన మత్యవసరము. సాధ్యమైనయెడల గురుశిష్యసంబంధ మెక్కుడగుటకుగా 'ఆశ్రమ' వాసపద్ధతిని అవలంబింపదగును. భౌతికరసాయనాదిశాస్త్రజ్ఞానమును ఆయుర్వేదయూనానీవైద్యములకు తోడు పాశ్చాత్యదేశములం దీనడుమ నత్యుచ్ఛదశకు వచ్చియున్న శస్త్రవిద్యయును పరిగ్రాహ్యములు. జ్ఞానము దేశకాలపరిమితుల నతిక్రమించునది. అది యేయొకజాతివారి ముల్లెయును మూటయు గాదు.

బాలభటశిక్షణము:— జాతీయవిద్యావిధానమున 'స్కౌట్ ట్రైనింగ్' ప్రాముఖ్యముగ గ్రహించుట మంచిది. విద్యార్థులకు రాజకీయపరిజ్ఞానమును ప్రాపంచికజ్ఞానము నలవడునట్లు చేయుట, సామాన్యముగ వారిదేహమనశ్శక్తుల నన్నింటిని సమగ్రముగ విజృంభింపజేయుట, సంఘ దేశసేవలందు వారి కనుభవమును భక్తిప్రేమలను కల్పించుట జాతీయవిద్యాలయోపదేష్టల కర్తవ్యకృత్యములు.

## మతవిద్య - నీతిబోధ

భిన్నాచారములును భిన్నమతములును గల యిట్టి దేశమున మతభేదములను గమనింపక యేకవిధమైన మతవిద్య నొసంగుట అసాధ్యము. అందుచే వీలైనచో క్రైస్తవులకు బైబిలుబోధయు మహమ్మదీయులకు ఖురానుబోధయు హిందువులకు భగవద్గీతాదికమైన హిందూమతబోధయు పార్శీ ఆర్యసమాజాది వివిధమతస్థులకు వారివారి మతానుసారముగ ప్రార్థనలను క్రమముదప్పక ఒనరించుట కేర్పాట్లు చేయనగును. నీతిబోధ చేయుతరగతుల కన్నిమతముల విద్యార్థులును రావలయు. అట్టితరగతులందు సామాన్యముగ నీతిబోధచేయుచో వివిధమతప్రవక్తలయు మహాత్ములయు జీవితచరిత్రల నుపదేశింపదగును.

## జాతీయవిద్యాక్రమము

శిశువిభాగము— నాల్గేండ్లకాలపరిమితి:—i. మొదటి తరగతి—చదువుచెప్పుట. ఆటపాటలమూలమునను చిత్తరువులు పిట్టకథలు వలనను మాత్రమే. అక్షరాభ్యాసతరగతికిని చాలియుండని పసికూనలీతరగతివారు. ii. మిగతమూడుతరగతులందును వారివారి మాతృభాషలందు విద్యార్థులు చక్కగ చదువుట వ్రాయుట—కూడుట తీసివేయుట భాగహారము గుణకహారములను నేర్చి, చిన్నచిన్న పద్యములను పాటలను కంఠతః రాజేసియుందురు. బాలురచరిత్రజ్ఞానమునుకొంతవఱకు

వృద్ధిజేసి నీతిబోధకము లగు ప్రాచీనభారతదేశపుకథలను నేర్పవలయు. ఈయీడుపిల్లలకు ఆటపాటలందు తమి యెక్కుడుగ నుండుటను గమనించి గురువులు వర్తించు టవసరము.

బాలవిభాగము— ఈ విభాగమందు హిందూభాషాభ్యసనము నిర్బంధము. ఈవిభాగపరిమితియు నాల్గేండ్లు.

యువవిభాగము— మూడేండ్లు—ఇందు మాతృభాష గాక హిందీ సంస్కృతము, ఆంగ్లేయము, ఉర్దు, పారసీ, అరబిక్, అరవము, బెంగాలీ, మరాటీ మున్నగు భాషలం దేరెంటినయిన నేర్వవలయు. యువవిభాగము తెలుగు, మళయాళము, మొదలగు కొన్ని దేశభాషల కనుబంధముగ సంస్కృతము కొంత నేర్పుట లాభకరముగ నుండును. మఱియు నీసంస్కృతపుజదువు యువవిభాగకాలము నాక్రమింపదగును.

బాల యువ విభాగములు: — గణితము — ఇపుడు ప్రభుత్వపాఠశాలలందు గణితమును బోధచేయు విధము బాలురను సామాన్యజనుల యభిప్రాయములో కొఱమాలినవానిగ నొనర్చుచున్నది. స్వయంకృషిచే వర్తకులు వీరు చదివినచదువు చదువకయే వ్యాపారసంబంధమైన లెక్కలను కడు నేర్పుమీఱ గుణింప సమర్థులు. ఇట్టిలోటులు జాతీయపాఠశాలలందు కలుగకుండ జూచుట శ్రేయస్కరము.

భౌతిక, ఆరోగ్య, శారీరశాస్త్రజ్ఞానమును కొంత యీతరగతుల వారికి బోధించు టవసరము.

చరిత్ర:—హిందూదేశచరిత్ర కెక్కువప్రాముఖ్య మీవలయును. మఱియుఆంగ్లదేశముయొక్కయు తదితరదేశములయొక్కయు వీరులసంగ్రహచరిత్రమును తద్దేశీయుల రాజకీయవికాసక్రమమును బోధించుట మేలు. మఱియు యువవిభాగమున నథమపక్ష మొక్కచేతిపనియందైనను విద్యార్థి ప్రవీణుడు కానగును.

4. పండితవిభాగము—ఇందు కాలపరిమితి విద్యార్థియొక్క అభిమానశాస్త్రము లేక కళయొక్క అవసరమునుబట్టి నిర్ణయింపబడును.

స్త్రీవిద్య:—బాలికలు ఉద్యోగములు చేయబోవువారును, ఊళ్లేలువారును కాదు అన్నసామెతను ప్రజలమనస్సులకు పట్టునట్లు చేసి, స్త్రీలు విజాతీయవిద్యచే చెడిన తరువాత జాత్యుద్ధరణము మహాదుర్ఘటమగుననుటను దెలిపి, బాలికలను జాతీయవిద్యాలయముల స్థాపించి రక్షింపవలయు. స్త్రీవిద్యాభిమానులు వారికి జెప్పు చదువు ఉత్తరోత్తరమున వారు సంసారముల దిద్దునపు డుపకరించునట్టిదైయుండునట్లు శ్రద్ధ వహింపవలయు.

జాతీయవిద్య యీదేశమున త్వరలో సుస్థాపితము కాగలదా యన్న శంకకు సూరత్ మున్నగు ప్రదేశములందు ప్రభుత్వమువారు నిర్బంధప్రారంభవిద్య నిచ్చుకారణమున నవలంబించుచున్న నిరంకుశ, నిర్బంధ విధానము తావిచ్చుచున్నది. జాతీయవిద్యారక్షణమునకై కొన్నియెడల శాసనతిరస్కారమునకును భారతీయులు పూనవలసివచ్చునేమో! ఎట్టి అడ్డంకులను వెనుదివియక జాతీయవిద్యాభిమానులు సత్యస్వరాజ్యస్థితికి దారితీయుజాతీయవిద్య యను పవిత్రోద్యమమును భగవంతునిపై భారమూని జయప్రదముగ కొనసాగింతురుగాక.

# కురువృద్ధుఁడు

సోమంచి లింగయ్యగారు

తనతండ్రి కొఱకయి । తన రాజ్యలక్ష్మిని, వదలగా జాలిన వాఁ । డితండు
తన సోదరులకయి । తన వివాహంబును, సౌఖ్యంబు వీడిన, సదయుఁ । డితఁడు
తన మనుమలకయి । తన జీవములగూడ, వీడజాలినయట్టి వాఁ । డితండు
అంప శయ్యాగతుం డయ్యు ధర్మంబులఁ, బూర్తిగాఁ దెలిపిన పూజ్యుఁ । డితఁడు
గీ. కౌరవ పితామహుం డనఁ । గౌరవమున, నందరును జూడఁ । బ్రబలినయట్టివాఁడు
వీరుఁడును త్యాగియును । బ్రహ్మచారి యితఁడు. ఔర! భీష్మునిఁ బోల నెవ్వారు గలరు?

**BHARATA SWARAJYA CONGRESS COMMITTEE**
**MAHATMA GANDHI'S EXHORTATION**



భారత స్వరాజ్య సభ

గాంధిమహాత్ముని యుపదేశము

# ఉపనిషత్తులు

**పండిత మేడేపల్లి వేంకట రమణాచార్యులు గారు**

శ్లో. దితిజేన పురా వేదే వ్యాఖిలేషు హృతేషు యః, తం నిహత్య పునః ప్రాదా ద్వేధసే తం నతో స్మ్యహమ్.

సర్వశక్తి యగు పరమేశ్వరునిచే సృజింపఁబడిన యీ లోకమందు వేద మనాదినిధనావిచ్ఛిన్నసంప్రదాయప్రవర్తమానమై ప్రకాశించుచున్నది.

"వాచా౽ విరూపనిత్యయా"

"అనాదినిధనా హ్యేషా వా గుత్సృష్టా స్వయమ్భువా"

ఇత్యాదిశ్రుతిస్మృతులచే నీ వేదముయొక్క నిత్యత్వ ముద్ఘోషింపఁబడుచున్నది.

"ప్రత్యక్షే ణానుమిత్యా వా య స్తూపాయో న బుధ్యతే
ఏతం విద న్తి వేదేన తస్మా ద్వేదస్య వేదతా"

బౌద్ధులకు త్రిపిటకములు - క్రైస్తవులకు బైబిలు - మహమ్మదీయులకు ఖురాను - జోరోష్టరుమతస్థులకు ఛన్దో౽వస్థానము - మఱికొన్ని జాతులవారికి మఱికొన్ని మతగ్రన్థములు నున్నను అవి యెవ్వియు వేదముతోఁ దుల్యములు కావు. అవి యన్నియుఁ బురుషబుద్ధిప్రణీతము లగుట వలన గ్రంథకర్తల భ్రమవిప్రలమ్భాది దోషములు వానిలోఁ సంక్రమింపక మానవు. మన వేద మన్ననో కర్తృభావమువలనఁ దాదృశదోషగంధసంభావనారహితము. సర్వజ్ఞాననిధి. అతీంద్రియవస్తుబోధకము. సర్వధర్మమూలము. సకలశాస్త్రనిదానము. జైమిని తాను రచించిన పూర్వమీమాంసాసూత్రములలో నిది యపౌరుషేయ మని సమర్థించియున్నాఁడు.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తస్మా ద్యజ్ఞా త్సర్వహుతః ఋచ స్సామాని జజ్ఞిరే
ఛన్దాంసి జజ్ఞిరే తస్మా ద్యజు స్తస్మా దజాయత"

అను నీ ప్రమాణములచేఁ దార్కికు లీవేదము లీశ్వరప్రణీతము లని సమర్థించిరి. బాదరాయణుఁడును "శాస్త్రయోనిత్వాత్" అను సూత్రముచే వేదమున కీశ్వరుడే కర్తయని చెప్పెను. ఇట్టివేదము ఋగ్యజుస్సామాథర్వణము లని నాలుగు విధములుగా విభజింపఁబడియున్నది. ఇది మఱల "మన్త్రబ్రాహ్మణయో ర్వేదనామధేయం" అని రెండుభాగములు. "త చ్చోదకేషు మన్త్రాఖ్యా" అనియును "శేషే బ్రాహ్మణశబ్దః" అనియు జైమిని మన్త్రబ్రాహ్మణలక్షణమును చెప్పియున్నాఁడు. ఇవిగాక యర్థవాదవాక్యము లని మఱికొన్ని గలవు. అవి మన్త్రాన్తర్భూతము లయినను వానికిఁ బ్రామాణ్యము లేదనుచు పూర్వమీమాంసాశాస్త్రకర్త—

"ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మతదర్థానామ్"

అని పూర్వపక్షము జేసి "విధినా త్వేకవాక్యత్వాత్" అని యీయర్థవాదవాక్యములు విధితో నేకవాక్యతాపన్నములయి ప్రమాణభావమును బొందుచున్న వని సిద్ధాంతీకరించినాఁడు.

పూర్వోక్తములగు నాలుగువేదములలో వేఱువేఱుగా నొక్కొక్కదానికిని బ్రాహ్మణమనియును ఆరణ్యకమనియు, నుపనిషత్తనియు, సూత్రమనియు ననుక్రమణికయనియు గలవు.

## బ్రాహ్మణములు

"శేషే బ్రాహ్మణశబ్దః" అని చెప్పుటకంటె బ్రాహ్మణమునకు వేఱగు నిర్దిష్టలక్షణమును జైమినిగాని మాధవాచార్యుఁడు గాని చెప్పియుండలేదు. వానిలోఁ గొన్నింటిని చదివిచూడఁగా నవి కొంతమట్టుకు మూలమన్త్రములకు అర్థవివరణమును, యజ్ఞాదికర్మల నొనరించు విధానమును, ప్రాచీనేతిహాసములను, ప్రాచీనాచారములను, గొన్నిశబ్దముల వ్యుత్పత్తులను బ్రతిపాదించునవిగ నున్నవి. బ్రాహ్మణములు వేదసంహితలకు వ్యాఖ్యానరూపము లని వైదికులు వ్యవహరించెదరు. కాని యది సరికాదు. బ్రాహ్మణములలో చాలభాగము మూలసంహితానిర్వ్యపేక్షముగా గ్రొత్తసంగతులు మూలములో లేనివి యెన్నియో ప్రతిపాదింపబడుచున్నవి. గ్రంథవిస్తర మగు నని వివరింపమానితిని,

ఋగ్వేదమునకు ఐతరేయబ్రాహ్మణ మనియును కౌషీతకీబ్రాహ్మణ మనియును రెండు బ్రాహ్మణములు కలవు. కృష్ణయజుర్వేదమునకు తైత్తిరీయబ్రాహ్మణము. సామవేదమునకు బ్రాహ్మణద్వయము కలదు. వానిలో నొకటి తాండ్యమహాబ్రాహ్మణము. దీనికి పంచవింశబ్రాహ్మణ మను నామాంతరము గలదు. మఱియొకటి షడ్వింశబ్రాహ్మణము. శుక్లయజుర్వేదము (వాజసనేయ సంహిత) కాణ్వశాఖ యనియు మాధ్యందిన శాఖయనియు రెండుభాగములతోఁ గూడినది. దీని బ్రాహ్మణము శతపథబ్రాహ్మణము. అథర్వణవేదమునకు గోపథబ్రాహ్మణము.

### ఆరణ్యకములు

"అరణ్యాధ్యయనా దేత దారణ్యక మితీర్యతే
అరణ్యే తదధీయేతే త్యేవం వాక్యం ప్రచక్షతే"

బ్రహ్మచర్యగృహస్థాశ్రమములఁ గ్రమముగా నడిపి తురీయాశ్రమమును స్వీకరించువానికి మంత్రాధ్యయనమందు నగ్నిహోత్రప్రధానములగు శ్రౌతకర్మల నాచరించుటయందు నధికారము లేనందున నీయారణ్యకములనే చదువవలయు నని ఆరుణికోపనిషత్తులో నున్నది.

"అత ఊర్ధ్వ మమంత్రవ దాచరే దూర్ధ్వగమనం విసృజే త్త్రిసంధ్యాం స్నాన మాచరే త్సంధిం సమాధా వాత్మన్యాచరే త్సర్వేషు వేదేష్వారణ్యక మావర్తయే దుపనిషద మావర్తయేత్"

కొన్నియారణ్యకములు బ్రాహ్మణములలోనిభాగములు. వీనికిని వేదముతో సమానమగు ప్రామాణ్యము కలదు. కాని కౌషీతక్యారణ్యకములోని నాల్గవ యధ్యాయమును శౌనకశిష్యుఁడగు నాశ్వలాయనుఁడు రచించిన ట్లున్నది. ఆ యారణ్యకములో నేడవ ప్రపాఠకము మొదలుకొని పదియవ ప్రపాఠకమువఱకు శౌనకుఁడు వ్రాసిన సూత్రము మఱికొంతభాగ మున్నది. మాధవాచార్యుఁడు ఋగ్వేదవ్యాఖ్యానోపోద్ఘాతమునం దిట్లు వ్రాయుచున్నాడు.

"పంచమారణ్యక మౌష్ణిహత్త్రుచా ఽశీతిరితి ఖండే శౌనకేన సూత్రితం ।
సురూపకృత్ను మూతయఇతి త్ర్యైంద్రం సానసింరయి మితిద్వే ఇతి"

పరబ్రహ్మతత్త్వప్రతిపాదకములగు నుపనిషత్తులు కొన్ని యారణ్యకములలోనివే. ఎట్లనఁగా- బృహదారణ్యకమారణ్యకములోనిది తైత్తిరియోపనిషత్తు తైత్తిరీయారణ్యకములోనిది. ఆరణ్యకము వేదమున కంతకు సారభూత మని తలంపబడుచున్నది.

"తస్యవా ఏతస్య యజుషో రస ఏ వోపనిషత్ శత. బ్రా. 10-3-5-12

మహాభారతములో గూడ నీయారణ్యక మిట్లు ప్రశంసింపఁబడినది.

"భారతస్యవపు స్త్వేత త్సత్యం చామృత మేవచ
నవనీతంయథా దధ్నో ద్విపదాం బ్రాహ్మణో యథా
ఆరణ్యకంచ వేదేభ్య శ్చౌషధిభ్యోఽ మృతం యథా
హ్రదానా ముదధి శ్శ్రేష్ఠో గౌ ర్వరిష్ఠా చతుష్పదాం
ఏతేషా మితిహాసానాం తథా భారత ముచ్యతే

భార. ఆదిప. అను.

బృహదారణ్యకోక్తమగు జనకునికథ మనము పూర్తిగాఁ జదివినయెడల నీ బ్రాహ్మణము లారణ్యకముల కంటెఁ బ్రాచీనతరములని నిశ్చయముగాఁ జెప్పగలము. జనకుఁడు యజ్ఞముఁ జేయుచుండగా నచటికేతెంచిన బ్రాహ్మణులలోఁ బ్రాజ్ఞతముఁ డైనవానికి బారితోషిక మిచ్చెద నని ప్రతిజ్ఞఁ జేసెను.

"జనకో హ వైదేహో బహుదక్షిణేన యజ్ఞే నేజే. తత్ర కురుపాంచాలానాం బ్రాహ్మణా అభిసమేతా బభూవుః. తస్యహా జనకస్య వైదేహస్య విజిజ్ఞాసా బభూవ. కస్స్వి దేషాం బ్రాహ్మణానా మనూచానతమ ఇతి. సహగవాం సహస్ర మవరురోధ. దశదశపాదా ఏకైకస్యాశ్శృంగయో రాబద్ధా బభూవుః. తాన్ హోవాచ. బ్రాహ్మణా భగవన్తో యో వో బ్రహ్మిష్ఠ స్సతా గా ఉదజతా మితి"—బృహదా ౫ అ. ౧ బ్రా.

బృహదారణ్యకమందుఁ జెప్పఁబడిన జనకుని కథయే శతపథబ్రాహ్మణమందునుఁ జెప్పఁబడినది. గాని యాజ్ఞవల్క్యునికిని తక్కిన పండితులకును దత్త్వనిర్ణయవిషయమై జరిగిన వివాదములు మొదలగు మఱికొన్ని విశేషములను జేర్చి బృహదారణ్యకమం దీకథ పెంచి వ్రాయఁబడినది. అంతియే కానికథాభాగ మొక్కటియే. దీనివలన నారణ్యకము బ్రాహ్మణముయొక్క ఉపబృంహణ మని స్పష్ట మగుచున్నది. ఆరణ్యకములలోని వేదాంతభాగముల కుపనిషత్తు లని పేరు. తక్కిన వేదవాఙ్మయము నంతగా గృషి చేసినను చేయకపోయినను యిప్పటి మనవా రీయుపనిషత్తులనే మిక్కిలి శ్రద్ధతో నధ్యయనము సేయుచున్నారు. ఇవి పరతత్త్వప్రతిపాదకములు. హిందువుల దివ్యజ్ఞానసంపద కివియే మూలము. బ్రహ్మసూత్రముల కివియే ఆకరము. మతత్రయసిద్ధాంతములకే కాక తక్కిన సాంఖ్యయోగ న్యాయ వైశేషికాది శాస్త్రసిద్ధాంతములకు గూడ నివియే యుపష్టంభకములు. వీనియందలి శ్రుతులు సగుణ నిర్గుణ భేదాఽభేదఘటకశ్రుతు లని యయిదు విధములుగా విశిష్టాద్వైతు

లోక వర్గీకరణము నేర్పఱచిరి. ప్రాచీనోపనిషత్తు లన్నియు బ్రాహ్మణముల నుండియును నారణ్యకముల నుండియును నుత్పన్నము లయినవి. ఐతరేయారణ్యకము కౌషీతక్యారణ్యకము ఋగ్వేదారణ్యకములు. తైత్తిరీయారణ్యకము కృష్ణయజుర్వేదసంబంధ మయినది.

ఉపనిషత్తులు

వెనుక వ్రాసినట్లు ప్రతివేదమునకు గొన్ని యుపనిషత్తులు కలవు. వానిసంఖ్య నూటయెనిమిది. ఇవియన్నియు నష్టోత్తరశతోపనిషద న్తర్భూతము క్తికోపనిషత్తులో నిట్లు చెప్పఁబడినవి:—

ఐతరేయకౌషీతకీనాదబిందు ఆత్మబోధ నిర్వాణ ముద్గలా అక్షమాలికా త్రిపురాసౌభాగ్య బహ్వృచము లను పదియుపనిషత్తులు ఋగ్వేదీయములు. ఈశావాస్య బృహదారణ్యక జాబాల హంస పరమహంస సుబాల మంత్రికా నిరాలంబ త్రిశిఖీ బ్రాహ్మణమండల బ్రాహ్మణాద్వయ తారక పైఙ్గల భిక్షు తురీయాతీత అధ్యాత్మ తారసార యాజ్ఞవల్క్య శాట్యాయనీ ముక్తికోపనిషత్తులు పందొమ్మిదియును శుక్లయజుర్వేదీయములు. కఠవల్లి తైత్తిరీయక బ్రహ్మ కైవల్య శ్వేతాశ్వతర గర్భ నారాయణ అమృతబిందు అమృతనాద కాలాగ్ని రుద్రక్షురికా సర్వసార శుకరహస్య తేజోబిందు ధ్యానబిందు బ్రహ్మవిద్యా యోగతత్త్వ దక్షిణామూర్తి స్కంద శారీరక యోగశిఖ ఏకాక్షర అక్షి అవధూత కఠ రుద్రహృదయ యోగకుండలినీ పంచబ్రహ్మ ప్రాణాగ్నిహోత్ర వరాహ కలిసంతరణ సరస్వతీరహస్యోపనిషత్తులు ముప్పదిరెండును కృష్ణయజుర్వేదగతములు. కేన ఛాందోగ్య ఆరుణి మైత్రాయణీ మైత్రేయీ వజ్రసూచిక యోగచూడామణి వాసుదేవ మహత్సన్న్యాస అవ్యక్త కుండికా సావిత్రీ రుద్రాక్ష జాబాల దర్శనజాబాలోపనిషత్తులు పదునారును సామవేదగతములు. ప్రశ్న ముండక మాండూక్య అథర్వశిరో అథర్వశిఖా బృహజ్జాబాల నృసింహతాపనీ నారదపరివ్రాజక సీతా శరభ మహానారాయణ రామరహస్య రామతాపనీ శాండిల్య పరమహంసపరివ్రాజకాన్నపూర్ణా సూర్యాత్మా పాశుపత పరబ్రహ్మ త్రిపురాతపన దేవీభావనా భస్మ జాబాలగణపతి మహావాక్య గోపాల. కృష్ణ హయగ్రీవ దత్తాత్రేయ గారుడోపనిషత్తులు ముప్పదియొకటి అథర్వవేదముతో జేరినవి.

మన మీయుపనిషత్తులను విమర్శనసౌలభ్యమునకై నాలుగుతరగతులుగ విభజింపవచ్చును.

(1) వచనరూపముగా వ్రాయఁబడిన ప్రాచీనోపనిషత్తులు. ఛాందోగ్యబృహదారణ్యకములు. తైత్తిరీయము. ఐతరేయము. కౌషీతకి. కేనోపనిషత్తు.

(2) ఛందోబద్ధ మయినది — కఠోపనిషత్తు. ఈశావాస్యము. శ్వేతాశ్వతరము. ముండకము. మహానారాయణము మొదలగునవి.

(3) వచనరూపమయినవి—నవీనోపనిషత్తు ప్రశ్న మైత్రాయణీయ మాండూక్యోపనిషత్తులు.

(4) నవీనోపనిషత్తులలోనే మహోపనిషత్తు యోగశిఖ మొదలగునవి శ్లోకరూపముగా నున్నవి.

ఈ నవీనోపనిషత్తులలో బ్రహ్మవిద్య క్షురిక నాదబిందు బ్రహ్మబిందు అమృతబిందు ధ్యానబిందు యోగశిఖ యోగతత్త్వ హంస మొదలగునవి యోగమును బ్రతిపాదించునవి. అథర్వశిరస్సు అథర్వశిఖ నీలరుద్ర కాలాగ్నిరుద్ర కైవల్యోపనిషత్తులు రుద్రపరములు. మహానారాయణ ఆత్మబోధ నృసింహతాపని రామతాపని విష్ణుపరములు. బ్రహ్మసన్న్యాస ఆరుణేయ కంఠశ్రుతి పరహంస జాబాల ఆశ్రమోపనిషత్తులు సన్న్యాసమును బోధించును. ముండకోపనిషత్తులోని మంత్రములు కొన్ని మహానారాయణమందును శ్వేతాశ్వతరమంత్రములుముండకోపనిషత్తునందును బఠింపబడినవి. ఇందువలన నీయుపనిషత్తులలో గొన్ని ప్రాచీనములు కొన్ని నవీనములని మన మూహించుకొనవలయును. శ్వేతాశ్వతర పంచమాధ్యాయములో నున్న—

తద్వేద గుహ్యోపనిష త్సుగూఢం తద్బ్రహ్మవేద తే బ్రహ్మయోనిం యేపూర్వదేవా ఋషయశ్చతద్విదు స్తే తన్మయా అమృతా వై బభూవుః

అను మంత్రమందు వేదగుహ్యోపనిషత్తులయందు గూఢముగా నున్న యీ పరబ్రహ్మను పూర్వపు దేవతలు ఋషులు తెలిసికొని తన్మయులై మోక్షము నొందిరని చెప్పుటచే మన మెఱిఁగినవానికంటెఁ బ్రాచీనతరములగు కొన్ని యుపనిషత్తు లున్నట్లు తలంపవలయును.

"వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థాః
సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః
తే బ్రహ్మలోకే తు పరాంతకాలే
పరామృతాః పరిముచ్యంతి సర్వే. (ముం-3-౨-౬)

ఈశ్రుతి మహానారాయణోపనిషత్తులోను(౧౦-౨౨) కైవల్యోపనిషత్తులోను బఠిత మైనది. ఈ యుపనిషత్తులన్నియుఁ బరబ్రహ్మతత్త్వమునే ప్రతిపాదించునని మైత్రాయణ్యుపనిషత్తులో ద్వితీయ ప్రపాఠకమందు—

"అథ ఖల్వియం బ్రహ్మవిద్యా సర్వోపనిషద్విద్యా వా రాజన్నస్మాకం భగవతా మైత్రేయేణ వ్యాఖ్యాతా"

అని చెప్పఁబడినది. ఈ యుపనిషత్తు లన్నిఁటిలో ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తైత్తిరీయములు ఛాందోగ్యబృహదారణ్యకములు కౌషీతకి సుబాలోప

నిషత్తు ఐతరేయము శ్వేతాశ్వతరము ననునివి ప్రధానములు. మతత్రయభాష్యకర్తలు వీనినే ప్రమాణములుగ బరిగ్రహించి భాష్యములను వ్రాసియున్నారు. బాదరాయణసూత్రములకు గూడ నివియే విషయము. సకలోపనిషద్వాక్యజాతమును పరబ్రహ్మమందుఁ జక్కఁగా సమన్వయించు నను నంశము "తత్తు సమన్వయాత్" అను సూత్రమునందుఁ జెప్పఁబడినది.

### ఉపనిషచ్ఛబ్దార్థము

శ్రీశంకరాచార్యులవా రుపనిషద్భాష్యప్రారంభమందు ఉపనిషచ్ఛబ్దమున కిట్లు వ్యుత్పత్తిని వ్రాసియున్నారు.

సదేర్ధాతో ర్విశరణగత్యవసాదనార్థస్యోపనిపూర్వస్య క్విప్ప్రత్యయాన్తస్య రూప ముపనిషదితి ఉపనిషచ్ఛబ్దేన వేదాన్తవేద్య వస్తువిషయా విద్యో చ్యతే. అవిద్యాదేస్సంసారబీజస్య విశరణాద్ధింసనా ద్వినాశనా దిత్యనేకార్థయోగేన బ్రహ్మవిద్యా తత్పరాః వేదాన్తశ్చ ఉపనిష దిత్యుచ్యతే.

ఈ శబ్దము నిశేరశాస్త్రకర్తలు పలుతెఱంగుల వివరించి యున్నారు.

శ్లో. ఉపనీయత మాత్మానం బ్రహ్మపాస్తద్వయం యతః
నిహం త్యవిద్యాం తజ్జంచ తస్మా దుపనిష ద్భవేత్"

శ్లో. నిహా త్యానర్థమూలం స్వావిద్యాం ప్రత్యక్తయా పరం
నయ త్యపాస్తసంభేద మతో వోపనిష ద్భవేత్.

ఉపోపసృష్ట మగు సద్ధాత్వర్థమును బట్టి విచారింగా నిది సరియైన యర్థముగా గనుపించదు. ఈ శబ్దమునకు మఱికొందఱు గ్రంథకర్తలు రహస్యమనియర్థముఁ జెప్పిరి. ఉపనిషద్వాక్య ప్రామాణ్యమును బట్టి యిదియే సమంజసమైన యర్థమని తోఁచుచున్నది. ఉపపూర్వకమగు సద్ధాతువునకు సమీపమందుఁ గూర్చుండుట యని మొదటియర్థము. సాధారణముగా నుపదేశకాలమందు శిష్యుఁడు గురుసమీపమునందు గూర్చుండియుండుట యాచారము. గురువు శిష్యునకుపదేశించునపుడు రహస్యముగ నుపదేశించును. అందువలన నీశబ్దమునకుఁ గాలక్రమమున రహస్య మనునర్థముకలిగినది. ఇందులకుఁ బ్రమాణముగా నృసింహోత్తరతాపనియందు ౨-వ ఖండలో,

"బ్రహ్మ భవతి య ఏవం వేద రహస్యమ్"

అని నాలుగుస్థలములయం దావృత్తమైనది. "ఇతిరహస్యమ్" అనుదానికి బదులుగా "ఇత్యుపనిషత్" అనియుఁ బ్రయోగింపఁబడినది. తైత్తిరీయోపనిషదవసానమందు

"తస్మాద్బ్రాహ్మణో మహిమాన మి త్యుపనిషత్"

అని యున్నది. మహానారాయణోపనిషత్తులో సధ్యాయాంతమందు మూఁడుస్థలములలో—

"పురుష స్స నారాయణో భవతీ త్యుపనిషత్" "ఇత్యుక్త్వా ఓ ది నారాయణ స్తిరోదధే త దే త్యుపనిషత్"

అని యున్నది. ఇంకను మఱికొన్ని ప్రాచీనోపనిషత్తులలోను

"గుహ్యాదేశః" (ఛాం 3-౫-౨) "పరమంగుహ్యమ్" (కఠ 3-౧౭) వేదగుహ్యోపనిష త్సుగూఢమ్ (శ్వే ౬-౨౨) గుహ్యతమమ్ (మైత్రా ౬-౨౦)

అని గుహ్యోపనిషద్రహస్యశబ్దములు మూఁడును పర్యాయపదములుగ బ్రయోగింపఁబడినవి. కాఁబట్టి యిది రహస్య మగుటవలననే అనధికారు లగువారికి దీనిని బ్రకాశింపజేయఁగూడ దని నిషేధముకూడ ననేకోపనిషత్తులలోఁ గానవచ్చుచున్నది. ఎట్లనఁగా—

ఇదం వా వత జ్యేష్ఠాయ పుత్రాయ పితా బ్రహ్మ ప్రోవాచ ప్రణాయ్యాయ్వాన్తేవాసినే నాన్యస్మై కస్మైచన (ఛాం 3-౧౧-3) వేదాన్తే పరమం గుహ్యం పురాకల్పప్రచోదితం నాప్రశాన్తాయ దాతవ్యం నాపుత్రాయా శిష్యాయ వై పునః (శ్వే ౬-౨౨) తేషామే వైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తుచీర్ణమ్. ముం3-౨-౧౦

గీతాచార్యుఁడును నర్జునునికి చరమశ్లోక ముపదేశించునపుడు—

"ఇదం తే నా తపస్కాయ నాభక్తాయ కదాచన"

అని యాజ్ఞాపించెను. ఇటులే ప్రతియుపనిషత్తునందు జ్ఞానోపదేశముకొఱకు తనయొద్దకువచ్చినశిష్యుని గురువు ప్రయత్నముతోఁ బరీక్షించి- వాని యోగ్యతాయోగ్యతలఁగనుఁగొని- వానికి బ్రహ్మవిద్య నుపదేశించువాఁడుగ గానవచ్చుచున్నది. కుపితుఁడైన తండ్రి నచికేతస్సును యమునికడకుఁ బంపఁగా నాయముఁడాతని ననేకతుచ్ఛ వరప్రదానములచే లోభపెట్టి నిరసింపఁదలఁచినను విరక యతఁడు పట్టినపట్టు విడువనివాఁడై యుండుటఁ జూచి తుదకు వైవస్వతుఁడు నచికేతస్సునకు బ్రహ్మవిద్య నుపదేశించె నని కఠోపనిషత్తు చెప్పుచున్నది. దివోదాసి కుమారుఁడగు ప్రతర్దనుఁ డింద్రుని సవిధమునకుఁ బోయి

"త్వమేవ మే వరం వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే" (కౌషీ-3 అ ౧౧ వా)

అని యడుగగాఁ దొలుత నింద్రుఁ డతనిని బరీక్షించి పిదప బ్రహ్మవిద్య నుపదేశించెను. ఇటులనే రైక్వుఁడు జానశ్రుతిని సత్యకాముఁ డుపకోసలుని బ్రవాహణుఁడారుణిని- ప్రజాపతి ఇంద్రవిరోచనులను- పరీక్షించె నని ఛాందో

గ్యములోను, యాజ్ఞవల్క్యుఁడు జనకుని పరీక్షించె నని బృహదారణ్యకములోను, శాకాయన్యుడిక్ష్వాకువంశపు రాజగు బృహద్రథుని పరీక్షించె నని మైత్రాయణీయోప నిషత్తులోను జెప్పబడి యున్నది. బ్రహ్మనిష్ఠు లగు పూర్వపు ఋషులందఱును తమజ్ఞానమును గూఢముగా నుంచుకొని రనియు, దానిని బరుల కుపదేశించునపు డుపదేష్టవ్యుల బరీక్షించి యుపదేశించి రనియును బూర్వోక్తకథల వలన స్పష్టమగుచున్నది.

సర్వోపనిషద్వాక్య తాత్పర్యము

అధ్యాసస్వరూప నిరూపణము:—'నీవు నే నను వ్యవహారమునకు గోచరము లగునవి. తేజస్తిమిరములవలె బరస్పర విరుద్ధస్వభావములు గలవి - యగు - విషయ (Object-పరాక్కు) విషయులకు (Subject-ప్రత్యక్కు) అనాదికాలమునుండి యనువర్తించుచున్న అజ్ఞానముచే గలుగు పరస్పరావివేకమువలన జడాత్మక మగు విషయి యందు విషయమునకు దానిధర్మములకు గలుగు పరస్పరావివేకమున కధ్యాస మని పేరు.

ముత్తెపుచిప్ప దూరమునకు దళతళ లాడుచు వెండివలె నగపడును. ఆపాతముగా జూచినవా డిది వెండియని భ్రమజెందును. "ఇది, వెండి" అను నీ యుభయమునకు నైక్య మజ్ఞానవిజృంభితము. ఇదియే అధ్యాస మనంబడును.

దీనిపై నద్వైతసిద్ధాంత మిట్లు నిర్వరింపబడినది:—

నిర్విశేషచిన్మాత్ర మగు బ్రహ్మమే పరమార్థము. తదతిరిక్తమయిన జ్ఞాతృజ్ఞేయాది నానావిధభేదభిన్న మగు నీజగమంతయు బ్రహ్మమందుఁ గల్పింపఁబడిన దగుటచే మిథ్యాభూత మయినది. విశేషమనగా భేదము. నిర్విశేష మనఁగా భేదము లేనిది. సజాతీయభేద మనియు, విజాతీయభేద మనియు, స్వగతభేద మనియు భేదము మూడువిధములు. ఒకజాతిలో జేరిన రెండువస్తువులకు గల పరస్పరభేదము- అనఁగా నొక గోవునకు మఱియొక గోవునకు గల భేదము - సజాతీయభేదము భిన్నజాతిలో జేరిన రెండువస్తువులకు గల భేదము - అనగా నశ్వమునకు మహిషమునకు గలభేదము- విజాతీయభేదము. తనలోఁదనకుండు భేదము- అనఁగా గోవునకు సాస్నా (Dew-lap) లాంగూలాదిభేదము - స్వగతభేద మనం బడును. చైతన్యమాత్ర మగు బ్రహ్మముకంటె విజాతీయమై చేతనాచేతనవిశిష్ట మగు నీ ప్రపంచ మంతయును భ్రాంతివశమున బ్రహ్మమునందు గల్పింపఁబడినది గావున వాస్తవమునకు బ్రహ్మవ్యతిరిక్తముగ ప్రపంచ మనునది యొకటి లేదు. అందువలన బ్రహ్మమునకు విజాతీయభేదము లేదు. బ్రహ్మ మొక్కటియే గాని యనేకబ్రహ్మలు లేరు గనుక యతనికి సజాతీయభేదము లేదు. బ్రహ్మమున కాకారము లేదు గాన నతనికి స్వగతభేదముకూడ లేదు. ఇట్లు త్రివిధభేదశూన్య మగు చైతన్య మే బ్రహ్మము.

ఉపనిషత్తు లీ యర్థమునే దృఢముగా నిట్లు బోధించుచున్నవి.

"సదేవసోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయమ్"

(ఛాం ౬-౨-౧)

అథ పరాయయా తదక్షర మధిగమ్యతే యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం య ద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః(ముండక౧-౧-౬) "సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ"(తై.ఆన.౧-౧) నిష్కళం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరంజనమ్.

(శ్వేతా ౬-౧౯)

యస్యా మతం తస్య మతం మతం యస్య నవేద సః
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్ (కేన. ౨-3)

బ్రహ్మము మననమునకు గోచరము కాఁదగని దని యెవనికి నిశ్చయమో వానికి బ్రహ్మము మననమునకు గోచర మైనదియే యగుచున్న దని నిశ్చయము. బ్రహ్మము మననమునకు గోచరము కాదగినదని యెవనికి నిశ్చయమో వాడు బ్రహ్మము నెఱుఁగనివాడని నిశ్చయము. బ్రహ్మము- జ్ఞానమున కనఁగా శ్రవణమునకు గోచరము కాదగినదని యెవరికి నిశ్చయమో వారికి- బ్రహ్మము- జ్ఞానమున కనఁగా శ్రవణమునకు గోచరము కానిదియే యగుచున్నదని నిశ్చయము. బ్రహ్మము జ్ఞానమున కనగా శ్రవణమునకు గోచరము కాదగనిది యని యెవరికి నిశ్చయమో వారికి బ్రహ్మము జ్ఞానమున కనగా శ్రవణమునకు గోచర మయినదియే యగుచున్నదని నిశ్చయము. శ్రవణమననములకు బ్రహ్మము విషయము కాదని తాత్పర్యము.

"న దృష్టే ర్ద్రష్టారం పశ్యేః నమతే ర్మన్తారం మన్వీథాః"

(బృ. ౫-౨)

"ఆనన్దో బ్రహ్మ" (తై. భృగు. ౬ అను)
"ఇదం సర్వం యదయ మాత్మా" (బృ ౪. అ ౪. బ్రా ౬.)
"నేహ నా నాస్తి కించన, మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి (బృ. ౬-౪-౧౯)
"యత్రహి ద్వైత మివ భవతి తదితర ఇతరం పశ్యతి యత్రత్వస్య సర్వ మాత్మైవాభూ త్తేన కం పశ్యేత్ కేన కం విజానీయాత్"

(బృ. ౪-౪-౧౪)

"వాచారమ్భణం వికారో నామధేయం మృత్తి కేత్యేవ సత్యమ్"

(ఛాం. ౬-౧-౪)

"యదా హ్యే వైష ఏతస్మి న్నుదర మంతరం కురుతే అథ తస్య భయం భవతి" (తై. ఆనంద. ౭-౨)

సూత్రకారుడు నయితము

"నస్థానతోపి పరస్యోభయలింగం సర్వత్ర హి"
(బ్ర-సూ. 3 అ. ౨ పా. ౧౧ సూ)

అను సూత్రమున వేదాంతములయం దంతట బ్రహ్మము నిర్విశేష మని చెప్పబడి యున్నందున స్వాభావికముగ గాని ఉపాధివశమునఁ గాని బ్రహ్మమున కుభయలింగములు - అనఁగా సవిశేషత్వము నిర్విశేషత్వము అను నీ రెండు లక్షణములు- లేవనియును, అది నిర్విశేషాత్మక మగు నేకలింగమే యనియును,

"మాయామాత్రం తు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్"
(బ్ర-సూ. 3 అ. ౨ పా. 3)

అను సూత్రమున నిరూపింప శక్యము గాని స్వరూపము గలది యగుటవలనను స్వప్నమందు గనఁబడు ప్రపంచక మెట్లవాస్తవమో అట్లే పరిదృశ్యమాన మగు నీ ప్రపంచక మంతయును మాయయే యనియుఁ దెలియఁ జేయుచున్నాడు.

వస్తుస్వరూపమును దెలియజేసెడి సకలోపనిషద్వాక్యములును బ్రహ్మసూత్రములును "నిర్విశేషచిన్మాత్ర బ్రహ్మమే సత్యము. మిగిలిన దంతయు మిథ్య" యని తెలియఁజేయుచున్నవి.

మిథ్యాత్వ లక్షణము

మిథ్య యనగా నెయ్యది? ముందు మనచేత నొక వస్తు వొకవిధముగాఁ దెలియఁబడినదై - చక్కఁగా మరల దానినిఁ బరిశీలించుటచేఁ గలిగెడి తద్వస్తుయాథార్థ్యజ్ఞానముచే మొదటఁ గలిగిన జ్ఞానము నివర్తింపఁబడఁదగినది యగును. అట్టి స్థితికి మిథ్యాత్వ మని పేరు.

ఉదాహరణము:—

మనము చీకటిలో జూచి సర్పమని భ్రాంతిగొని భయమునొందు భూదళనము అంబుధార రజ్జువు మొదలగువానిని - దీపము దెచ్చి పరిశీలించి చూచుటవలనఁ గలిగిన వాని యథార్థవస్తుజ్ఞానముచే మొదట మనకు జనించిన సర్పమనెడు భ్రాంతిజ్ఞానము నివర్తించును. ఇచట నంధకార మనెడు దోషమువలనఁ గదా రజ్జువునందు సర్ప మనెడి భ్రాంతిజ్ఞానము గలిగినది. అటులనే చిన్మాత్రస్వరూప మగు బ్రహ్మమునందు- సురనరతిర్యక్ స్థావరాదిభేదభిన్న మగు నీ జగ త్తనెడి భ్రాంతి దోషవశమునఁ గలుగుచున్నది. అట్టి భ్రాంతి బ్రహ్మస్వరూపమును గుఱించిన యథార్థజ్ఞానముచే నివర్తించుచున్నది. కావున కల్పనారూప మగు నట్టి యీ జగమంతయును మిథ్య యనఁబడుచున్నది.

ఇట్లు చిన్మాత్రస్వరూప మగు బ్రహ్మమునందు జగద్రూప మగు కల్పనను గలుగఁజేయుటకు హేతుభూత మగు దోష మెద్ది యనఁగా - వస్తుస్వరూపయాథార్థ్యమును గప్పివేయునది - నానావిధ చిత్రవిచిత్ర విక్షేపములను బుట్టించునది - సత్ (ఉన్నది)- అని గాని అసత్ (లేనిది) అని గాని చెప్పుటకు శక్యము కానిది- యగు నవిద్యయే. (అజ్ఞానము) అట్టి దోషము ఇందులకు-

"అనృతేన హి ప్రత్యూఢాః (ఛాం. ౮-3-౨)

"తేషాం సత్యానాం సతా మనృత మపిధానమ్ (ఛాం. ౮-3-౧)

అను శ్రుతులు ప్రమాణము. యజుర్వేదమందును

"నాస దాసీ న్నో స దాసీ త్తదానీం తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే ప్రకేతమ్" (తై. బ్రా. ౨-౮-౯)

అని పఠింపబడియె. మఱియు:—

"మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్"
(శ్వే. ౪-౧౦)

అనియు చెప్పఁబడినది. భగవద్గీతలలో గూడ—

"మమ మాయా దురత్యయా" (భగ. ౭-౧౪)

"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" (బృ. ౪-౫-౧౯)

అని చెప్పఁబడినది.

"అనాది మాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే"
(మాం. ౨-౨౧)

ఇట్లు పూర్వోక్తము లగు శ్రుతులచే నవిద్య స్థాపింపబడినది. అద్వైతవేదాంతులు దీనినే భావరూపాజ్ఞాన మని వ్యవహరించుచున్నారు.

నిర్విశేషచిన్మాత్ర మగు బ్రహ్మము సదసదనిర్వచనీయ మగు ననాద్యవిద్యచేఁ దిరోహితస్వస్వరూపము గలదియై తనయందుండు నానావిధభేదములను దెలిసికొనుచున్న దని పూర్వోక్తము లగు నుపనిషద్వాక్యములవలన విస్పష్ట మగుచున్నది.

సదసదనిర్వచనీయ మగు నీ యవిద్య — నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మమే ఆత్మ యని తెలిసికొనుటవలన నివర్తించుచున్న దని యీ దిగువ వ్రాయఁబడిన శ్రుతులు తెలుపుచున్నవి.

"నపున మృత్యవే తదేకం పశ్యతి"

"నపశ్యో మృత్యుం పశ్యతి" (ఛాం. ౭-౨౬-౨)

"యదా హ్యేవైష ఏతస్మి న్నదృశ్యే అనాత్మ్యే అనిరుక్తే అనిలయనే అభయం ప్రతిష్ఠాం విందతి, అథ సో ఽభయంగతో భవతి"
(తై. ౭-౨)

"తమేవం విదిత్వా ఒతిమృత్యు మేతి నాన్యః పన్థా అయనాయ విద్యతే" (శ్వే. 3-౮)

"భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"
(ముం. ౨-౨-౮)

"బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి"

ఇచ్చట పైవాక్యములయందున్న మృత్యుశబ్దమున కవిద్య యని యర్థము.

"ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి సదా ప్రమాద మమృతత్వం బ్రవీమి" "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మవిజ్ఞానమానందం బ్రహ్మ"

ఇత్యాది స్వరూప నిరూపక వాక్యములచే నిశ్చయింపఁబడిన నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మమే ఆత్మ యను జ్ఞానము

"అథ యోన్యాం దేవతా ముపాస్తే అన్యోసా వన్యోహ మస్మీతి న స వేద (బృ. 3-౪-౧౦) "ఆత్మే త్యే వోపాసీత" (బృ. 3-౪-౭) తత్త్వమసి సర్వం ఖల్విదం బ్రహ్మ, త్వం వా అహ మస్మి భగవో దేవతే, అహం వై త్వ మసి భగవో దేవతే, త ద్యోహం సోసౌ యోసౌ సోహమ్.

ఇత్యాది శ్రుతిశతములచే నిర్ణయింపఁబడుచున్నది.

ఇట్టి యద్వైతజ్ఞానము గల బ్రహ్మవేత్త యావజ్జీవమును బ్రహ్మము నుపాసించుచు- తుదకు——

"సఖల్వేవం వర్తయన్ యావ దాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతేనచ పున రావర్తతే నచ పున రావర్తతే"

అని శ్రుతిలో జెప్పినట్లు బ్రహ్మసంపత్తిని బొంది మఱల నీ లోకమునందుఁ బుట్టఁడు.

శ్రీ కృష్ణభగవాను లీ యర్థమునే గీతలందు నీక్రిందివిధముగ సెలవిచ్చిరి.

శ్లో. మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః (గీ. ౮-౧౫)

# కుంతీసందేశము

## ద్రోణంరాజు సీతారామారావుగారు

అమరౌఘంబు నుతింప నిందనుత భాగ్యశ్రీల వోనాడి చి
త్తములన్ శాంతివహించి వారలిఁక మీ◆దన్ మీవృథావాక్యవా
దముఁ జాలింపుచు, శౌర్య మేర్పడ సము◆ద్యచ్ఛాత శస్త్రాస్త్ర వా
దము వాదింపుఁడు బూరుపార్థు లగుచున్ ◆ దైవారఁగాఁ బుత్రకుల్.

శా. చంచద్ఘోరగదాభిఘాతములచే ◆ శత్రుక్షమాపాలహృ
త్పంచప్రాణములన్ హరించి సురబృం◆దంబెల్ల హర్షింప న
ప్పాంచాలక్షితినాథపుత్రికపరీ◆భావాగ్నిఁ జల్లార్పఁ గా
వించం జెల్లును శౌర్యమూర్తు లయి మీ◆రీవేళ సత్పుత్రకుల్.

మ. పరమాశ్చర్యనిమగ్నచిత్తులయి మీ◆ప్రఖ్యాతి దేశీయసో
దరు లీక్షించి తదీయమాతృవిమల◆స్తన్యప్రభావం బతుం
చరయన్ జేయుఁడు కీర్తిడిండిమము ప్రో◆యంగా రిపుక్ష్మాతలే
శ్వర రింఛోళిభయప్రద ప్రబల తే◆జస్తాండవుల్ పుత్రకుల్.

మ. కలనన్ శత్రుల నెల్ల గెల్చి జయమున్ ◆ గైకొన్నచో సద్యశః
కలనం జెందఁగవచ్చు శత్రుజన సం◆ఘాతంబుచేఁ గూలినన్
బల భిల్లోక నివాస సౌఖ్యము వహిం◆పన్ వచ్చు నిందేదియో
కవిత ప్రజ్ఞను జేసి నాకు బర లో◆కం బీయుఁ డీపుత్రకుల్.

# జాతీయవిద్య - గురుశిష్యధర్మములు

ముక్తినూతులపాటి వేంకట నారాయణ శర్మ గారు, బి. ఏ., బి. టి.

**" To Teach Krishna Sanscrit, you must not only Know Sanscrit but also know Krishna "**

## I

ప్రతి జాతికిని ప్రత్యేక స్వరూపము గలదు. స్వభావగుణ సంపత్తులును గలవు. వీని తత్వమును సైతము సిద్ధాంతీకరించుట దుర్లభము. విజాతీయు లీ తత్వార్థమును గ్రహించుట యెంతయో కష్టము. స్వజాతి మాత్ర మీ కళాలక్షణములను గ్రహింప గలదు. సమన్వయము చేసికొన గలదు. విజాతీయులు తమ పశుబలము నుపయోగించుచు స్వజాతి దేశ సంపదల నపహరింప వచ్చును. తమ సాంప్రదాయానుసారముగ రాజ్యతంత్రము నడపవచ్చును. తమ పద్ధతుల ననుసరించి విద్యాబీజములను దేశము నంతటను వెదజల్లుటకు అన్ని విధముల కట్టుదిట్టముల చేయవచ్చును. పరాధీన దేశ మేదైన-అనాదినుండి నాగరకతా లక్షణములతో విలసిల్లుచున్న యెడల వైరాజ్యపద్ధతులు తాత్కాలికముగ విజయ వంతములైన కావచ్చును. దేశజాత్యాదర్శములను అరాజకము చేసిన చేయవచ్చును. పర్యవసానమున నవియన్నియు నామావశిష్టములు కావలసినవే! ప్రఖ్యాత భారతరాజ్య చారిత్ర పరిణామము ననాదినుండి చదివిన వారి కిది యొక క్రొత్త విషయముగాదు.

భారతీయులు ప్రప్రథమమున పాశ్చాత్య వ్యామోహమున చిక్కితమజాతీయ స్వరూపమును మఱచి వైరాజుల చేతులలో కీలుబొమ్మలై, వారాడిన ఆటపాటల కన్నిటికిని తాళము వేయుచు గంతులు వైచిరి. తమ జాతిని ప్రశంసించుటకు గొప్ప అవమానముగా తలంచిరి. కాలము లొక రీతిగ నుండునా? జాతీయ చరిత్రమున సందిగ్ధ కాలము సమీపించినది. పురాణ పురుషు లనేకు లవతరించి జాతి నధర్మమునుండి రక్షించి ధర్మ సంస్థాపన మొనర్చు చున్నారు. జాతి మహాత్ముల సందర్శనమున పావనమై తన ప్రస్తుత పరిస్థితులను గ్రహించినది. ఈ విషయమున మహనీయులు చేసిన సేవ ప్రశంసనీయము. భావిసంతతివారీ మహాత్ముల సేవ నెన్నటికిని మఱువజాలరు.

నూతనోద్యమ వాతావరణమునందు ప్రజలు లోకసంగ్రహార్థమై తాము నిర్వహింప వలసిన విధ్యుక్తధర్మములను తెలిసికొనుచున్నారు. సత్వరము తమ గమ్యస్థానమును చేరుటకు ప్రయత్నించుచున్నారు. మహనీయు లెందఱో బయలుదేరి ప్రజల ననుష్ఠానపరులుగఁ జేయుటకు చేయవలసిన సన్నాహములలో విద్య ప్రథమమైనది. అన్నిటికిని అదియే మూలాధారము. అది లేనియెడల ఇతరములన్నియు నిర్జీవములే. జాతికి ప్రాణపదమైనది విద్యయే. మన ప్రాచీనులు విద్యాపరమార్థమును గ్రహించి లోకసేవను చేసి అమరతుల్యులైరి. పాశ్చాత్యదేశముల వారందఱు దీనిని గ్రహించి అన్ని విషయములలోను ప్రపంచము నంతటిని పరిపాలింపఁ గలుగుచున్నారు. ప్రాచీన భారతసంతతియగు సం లగు మనవారీపవిత్రాదర్శములను మూలద్రోసి పెడమార్గము నెన్నటికినను సరింపరు. విద్యయనగేమి? దాని పారమార్థిక మేమి? అనువిషయమును దెలిసికొనినఁ గాని మన ప్రయత్నము లేవియును విజయశీలముగ కొనసాగజాలవు.

పాశ్చాత్య దేశములలో విద్యయొక్క పరమార్థములను నిర్ణయించుటకు అనాదినుండియు చేయబడుచున్న ప్రయత్నము లసంఖ్యాకములు. శిశువునకును ఇతర మృగములకును విద్యారంభమునకు పూర్వము వ్యత్యాస మంతగ లేదనియును శిశువు తన పరమార్థమును, క్రమేణ గ్రహింప గలుగుటకు చేయవలసిన బాధ్యత లన్నియు గురువుల యందే నిమగ్నము లైనవని పాశ్చాత్యుల తలంపు. వీరి యభిప్రాయము ననుసరించి శిశువొక కొయ్య ముక్క. వడ్రంగి తన కళానైపుణ్యమును చూపుచు ఎట్టి వికృతాకారములగు వస్తువులనైన చక్కని రూపలక్షణముల నిర్మించుచుండునో అటులనే ఉపాధ్యాయుఁడు సైత మొక వడ్రంగి. తన సాంప్రదాయానుసారముగ నిర్మించుకొనిన విద్యాపరికరములను శిశువుపై నుపయోగించుచు తన యిష్టము వచ్చినరీతిని జీవమును కల్పింపవచ్చునని పాశ్చాత్యుల భావము. గ్రీకుల రోమను విద్యాలక్ష్యములలో మన మీ సాంప్రదాయములను గాంచవచ్చును. రూసో స్పెన్సరు ఫెస్టిలాజి మొదలగు మధ్యయుగ విద్యావేత్తల బోధనలలో సైతము గాంచనగును. ఒక్క విద్యా విషయమే కాదు. పాశ్చాత్యుల [illegible] కాదర్శములు సైత మీసూత్రముల ననుసరించియే నిర్మింప బడినవి. యుద్ధానంతరము ఈ విపరీతాదర్శముల గమ్యస్థానమును గ్రహించి జాతీయోద్ధరణమునకు సర్వజన సోదరత్వమే ప్రధాన సోపాన మని యందఱును గ్రహించుచున్నారు. ప్రతిమానవునియందును ఆత్మారాముఁడు గలఁడనియు, ఆతని ఆదర్శము లతిపవిత్రము లనియు, వానిని కొనసాగించుటకు చేయు ప్రయత్నములే సత్ప్రయత్నము లనియు, అవి విజయ వంతములుగ కొనసాగినఁ గాని మానవ జాత్యభివృద్ధికి గతి మోక్షములు లేవనియు పాశ్చాత్యు లిపుడే గ్రహింపగలిగినారు.

కుఱ్ఱవాండ్ర భావములను గ్రహించి, వారి స్వభావముల కనుగుణ్యమైనవిద్యను ప్రసాదించుటకు విద్యావేత్తలు చేయుచున్న ప్రయత్నములు అనంతములు. శిశుభావములను గ్రహించుటకు గాను పాశ్చాత్యదేశములలో అనుదినముఁ బ్రకటింపబడు చున్న గ్రంథములకు పత్రికలకు నియమమే లేదు. దీని నొక శాస్త్రముగ పరిగణించుచున్నారు.

విశ్వవిద్యాలయము లన్నింటిలో ఉపాధ్యాయుల కీవిషయమున తగిన శిక్షణ మీయబడుచున్నది. శిశుభావములను గ్రహింపనివారే ఉపాధ్యాయులుగా నుండుటకే అర్హులు గారని పాశ్చాత్య విద్యావేత్తలంబున ఘోషించుచున్నారు.

## II

శిశుభావములను గ్రహించుట కష్టతరము. శిశువునకు తెలివి తేటలలో పెట్టినదే పేరు. తన స్వాభావికలక్షణముల నేరైన పరీక్షించుచున్నారని గ్రహించినచో తన ప్రవర్తనమును సదా మార్చుకొనుచుండును. ఈవిషయమున నుపాధ్యాయుని పని యెంతయో కష్టతరమైనది. గురువు మిత్రభావముతోఁ దప్ప అధికార భావములో శిశువును చేరిన నాతని ప్రయత్నములన్నియు భగ్నములగును. తాను ప్రత్యక్షముగా చూచు శిశురూపము నిజరూపము కాదనియును, ఆయన రూపమంతరాత్మలో నిమగ్నమై యున్నదనియు, జనన మరణము లా ఆత్మారామునికే లేవనియు, సనాతనుఁడనియు ఇంతకుముం దెన్నియో జన్మలగాంచి కీర్తి కాయుఁడై యున్నాడనియు గురువు గ్రహింపవలయును. కొన్ని కొన్ని విషయములలో తన కన్న శిశువునకే యెక్కువ సంగతులు పూర్వజన్మ సంస్కారమునుబట్టి దెలిసియుండినను ఉండవచ్చుననియుఁ దెలిసికొనిన గాని గురువుల ప్రయత్నము లేవియు సఫలము గావు శిశువును సతతము ప్రేమించుచు అతని కార్యసాగరమునకు సంపూర్ణ స్వాతంత్ర్య మిచ్చుచుండవలయును. శిశుప్రవర్తనమునందలి మూలభావమును గ్రహించి తీరవలయును. మూలభావము, స్వాభావిక వికాసకళలతో విలసిల్లుచుండుటకు గురువు శిశువున కన్నివిధముల నవకాశము లిచ్చుచుండవలయును. కుఱ్ఱవాని ప్రకృతి పరిస్థితులు శాంతవంతముగా నుండవలయును.

ఈ విషయమున తలిదండ్రాదులు గ్రహించవలసిన ముఖ్యసూత్రము లెన్నియో గలవు. శిశువు జననమొందిన నాటనుండి అతని పురోభివృద్ధికి గాను అవలంబించ వలసిన వారు ధర్మములను గ్రహించి యుండవలయును. బిడ్డ తమ సొత్తనియు, ఇతర సొత్తుల నిష్టానుసారముగ నుపయోగించుకొను మాదిరిగనే, శిశువును తమ అభిప్రాయముల ననుసరించి, పెంచుటకు ప్రయత్నించకూడదు. శిశు వుదయమైనదాగది పరలోకమున తానింతవఱకు గాంచిన పరిస్థితులను స్మరణకు దెచ్చుకొనుచు అదృశ్యపథమునసే భూతల స్థితిగతులను సైతము గాంచ ప్రయత్నించుచుండును. తన కంటబడిన ప్రతివస్తువునకు నూతన స్వరూపము నిచ్చుచుండును. తెలివి తక్కువ వారగుపిత్రాదులు, కుఱ్ఱవానిచేష్టల యంతరార్థమును గ్రహింపజాలక వాని కార్యముల నన్నిటిని భగ్నము చేయుటకు ప్రయత్నించెదరు. కేవలము ముద్దులని- ఉన్మత్తులని మనము పిలుచుచుండు కుఱ్ఱవాండ్రందఱు బాల్యావస్థలో జననీజనకాదులు చెడగొట్టిన వారు తప్ప మరెవరు గారు. తల్లి దండ్రులు కుఱ్ఱవానికి పెత్తన దారులు. కుఱ్ఱవాని యందు దైవత్వమును గాంచని మాతాపితరులు ఈ గౌరవమున కనర్హులు. అదరు బెదరులు లేనియెడల కుఱ్ఱవాండ్రు చెడిపోదు రనియు, వారిని వినయవిధేయతలతో ప్రవర్తింపఁజేయుటకై శిక్షింపవలయుననియు మనవారి అభిప్రాయము. స్వర్గలోకమున జీవాత్మలకు భయమనుమాటయే లేదనువిషయము మనకందఱికిని తెలిసిన విషయమే. ఆత్మస్వారాజ్యసుఖ సంపదల ననుభవించిన మనకుఱ్ఱవాఁ డీలోకమున నీశిక్షావిధానమువలన నెంతయో కష్టపడుచున్నాడు. తలిదండ్రుల, గురువుల దెబ్బల బారినుండి తప్పించుకొనుటకు తనయింటనొంటలేనికుతంత్రముల నెన్నో పన్నుచున్నాడు. పెద్దయైన తరువాత మానవుడు క్రూరుఁడై ప్రవర్తించుటకు సైతము మన పెద్దలే అవకాశమిచ్చుచు వాని యభివృద్ధిని తొలుతనే అణగద్రొక్కుచున్నారు.

మన మీ పవిత్రాదర్శమును గ్రహింపజాలక బాలక లోకమున కెంతయో కళంకము నాపాదించియున్నారము. కుఱ్ఱవాండ్రే కొంతకాలమునకు పెద్దలై- రాజ్యతంత్రమును నడపుచు- సత్పరిపాలనముఁ జేయుచు లోకమున ధర్మము నుద్ధరించెదరని మనవార లనేకులు ఘంటాపథముగ చాటుచున్నారు. మన యీదుష్ప్రవర్తనమువలన ఈ ఘనకార్యమును కొనసాగింపగలమా? మన కార్య చాతుర్యము రాజ్యతంత్ర నైపుణ్యమును పెడద్రోవల ద్రింపుచు, మనసంఘమున కెన్నో హెచ్చుతగ్గులను కల్పించి సంఘము నరాజకముచేసి పుణ్యము కట్టుకొనుచున్నాము.

## III

పాశ్చాత్యుల శిశువులు నూతనోద్యమవాతావరణము వలన పాశ్చాత్య నాగరకతనుండి రక్షింపబడుచున్నారు. స్వాతంత్ర్యము ననుభవించుచు అభివృద్ధిగాంచుచుండ, మన శిశుసంతతి పరిస్థితుల వంకగాంచువారే గానము. ఇందువలన మన శిశువులెందఱో పడుచున్న కష్టము లనంతము. అచ్చటచ్చట ప్రాచీనభారత సాంప్రదాయములను పునరుద్ధరించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. కాని అవి అనుకొనినంత పని చేయుటలేదు. భారతీయ శిశువు విదేశీయుల పాలనమున స్వీయ గుణసంపదలను పెంపొందింప జేసికొని స్వభావానుగుణముగ, వృద్ధినొందుటకు అవకాశములేక, కూపస్థమండూకమైనాడు.

ప్రాచీన భారతకాలమున మనవారు ఈకష్టముల నేమియు ననుభవించి యుండలేదు. ఆకాలమున గురువులు దైవసంభూతులుగ పరిగణింపబడుచుండెడివారు. విద్యా వినయ సంపన్నులు ఆత్మజ్ఞానులు. భారత శిశువుల విద్యాభ్యాసమున వారికి అగ్రస్థాన మీయబడుచుండెడిది. పిల్లవానికి రెండవ తండ్రు లనియే వారిని మన పూర్వులు పేర్కొనుచుండెడివారు. మన ప్రాచీన గ్రంథసంచయ మంతయు మానవునందు దైవత్వము నిరూపించుచున్నది. ఆ దైవము మానవావస్థలో తనపరిస్థితిని గ్రహించి తన మూలస్థానము సత్వరమున చేరుటకుగాను అన్నివిధముల నవకాశముల నిచ్చుటకు మన శాస్త్రజ్ఞు లనేకులు స్మృతులను వ్రాసియున్నారు. వారిలో మనువును ప్రత్యేకముగా పేర్కొనవచ్చును. ఆయన వ్రాసిన ధర్మశాస్త్రము నందలి సూత్రము లన్ని దేశములకు నన్ని కాలముల కన్వయించుటకు ఎంతయో అవకాశము గలదు. *

* మనుధర్మసూత్రములు ప్రస్తుత పరిస్థితులకు సమన్వయముచేయుచు, బాబూ భగవానుదాసుగారు "[illegible] cial organisation" అను గ్రంథమును వ్రాసియున్నారు.

గురువు శిశు వుదయించిన దాదిగ ఆతని గృహమున కరుదెంచుచు- గృహ సంప్రదాయములను శిశుస్వభావమును చక్కగా పరిశీలించుచుండ వలయునని మనువు శాసించుచున్నాడు. కుఱ్ఱవాడు బాల్యావస్థలో నున్నకాలముననే తలిదండ్రులతో సతతము కలిసి మెలసి యుండి పెద్దవాడైన పిమ్మట ఎట్టిగుణములలో సుప్రసిద్ధుడగునో ఏయే విధముగ మానవసేవ చేయుచుండగలడో వారితో చెప్పుచుండవలయును. అవియివి యననేల గురువునకు జీవిత గమ్యస్థానము కన్నుల యెదుట గన్పట్టుచుండును. ఈ దివ్యజ్ఞానము వలననే ముందు ముందు బాలుడెట్టి విద్యల నేర్వవలసినది- వాని సహజసంపత్తి యేయే విధముగ పెంపొందగలది- గురువు తెలిసికొనుటకు సమర్థుడైయుండెను. విద్యాభ్యాస కాలమును సైతము ఈసిద్ధాంతముచొప్పున ఆయాజాతుల వర్ణముల జీవాత్మల పరిణామము ననుసరించి నిర్ణయించుచుండిరి.

కుఱ్ఱవాడు అన్ని విద్యలలో నారితేరుటకు కొంతకాలము పట్టినను, గురు సన్నిధిని విద్యను సాంతముగా ముగించుకొనుటకు బద్ధకంకణుడై యుండవలయును. జీవితకాల మందలి బాల్యావస్థలను గురు సాన్నిధ్యమున గడపి శాస్త్రము లన్నింటిలో శిక్షితుడై జీవిత గమ్యస్థానమును గ్రహించి, దానిని సత్వరముగ చేరుటకు తగినవిధానమును దెలిసికొనిన పిదప- విద్యార్థి గృహస్థధర్మముల నవలంబింప వలయునని మనువు ఉపదేశించుచున్నాడు. ఈ సుశిక్షణమును బడసినవారే కర్మయోగులని జీవితమున సంభవించుఎట్టికష్టముల నైనను ధైర్యసాహసములతో ననుభవించుటకు సంసిద్ధులైయుండగలరని అనుటలో కొంతయేమిగలదు.

మను ధర్మముల ననుసరించి శిశు వుదయించిన నాది పంచవర్ష ప్రాయమువరకు పిత్రాదుల పోషణమున నుండవలయుననియు, శిశువు తన విద్యుక్తధర్మములను సక్రమముగ నెఱవేర్చుకొనుటకు పెద్దలు అన్ని విధముల తోడ్పడుచుండవలయునే గాని గారాబముగ పెంచ కూడదు. ఈ కాలమున స్వయంసహాయ మత్యవసరము. కుఱ్ఱవాడు స్వంతముగనే దోగాడుటకును ఆటలాడుటకు స్వేచ్ఛ నీయవలయును. చిత్ర విచిత్రములగు పటముల నాతనికి చూపెట్టుచు వాని వింతలను గ్రహించుట కాతనికి యుత్సాహము నీయవలయును. తృతీయ వర్షమున ఈవిషయమున నింకను నెక్కువ అవకాశముల నీయవలయును. ప్రకృతి సౌభాగ్యమును చూచి ఆనందించుటకు అవసరము లగు అవకాశముల నాతని కీకాలమున ప్రసాదించుట అవసరము. బాల్యమునుండి కాల్యకృత్యములను నియతకాలమున నిర్వహించుటకు తగిన శిక్షణ మీయవలయును.

భయ మనుమాటయే ఆతనికి వినబడకుండ చేయవలయును. ఆతని మనోభావములు సతతము సంతోషాస్పదముగ నుంచు బాధ్యత తలిదండ్రుల యందు గలదు. ఆతడు చేయు ప్రతి పనికిని సంతోషము గనుబఱచుచు ప్రోత్సాహముం గనుబఱుపవలయును. ఆతడు చేయు పనులలో దోషము లేవైనయున్న కసరికొట్టక, ఆతని స్వేచ్ఛానుసారముగనే పోనీయవలయును. కాలక్రమేణ తనదోషముల నాతడే కనుగొని దిద్దుకొనగలడు. చుట్టుప్రక్కలవారి కందరికిని కుఱ్ఱవాడు సేవచేయుచుండుట కీకాలమున తగిన అవకాశ మీయవలయును. చిన్ననాట అలవడిన అలవాటులే అభరణము నుండగలవు.

ఇంట బాలకుడు సుశిక్షితుడై కృతకృత్యుడైన తదనంతరము గురుసన్నిధిని చేరి విద్యాభ్యాసము చేయవలయును. ఈకాలమున బాలకుని పిత్రాదులు, బంధు మిత్రాదులు అందఱు గురువర్యులే. వారు వీరన నేల కుఱ్ఱవానిని గురువు తన కుమారుని వలె జూచుచుండవలయును. విద్యార్థులు- రాజ బిడ్డలైనను భాగ్యవంతుల తనయులైనను పేదవారి పుత్రులైనను- గురువులు అందఱను సమానాదర ప్రేమల జూడవలయును. గురు సన్నిధిని అందఱు కలసి మెలసి చదువుకొనుచు, వారికి సదా సేవ చేయుచుండవలయును. శిష్యులు వారి వారి సంప్రదాయానుసారముగ నిర్ణీతకాలము వఱకు విద్యనభ్యసించిన తమతమ వర్ణాశ్రమ ధర్మములను నిర్విఘ్నముగ కొనసాగింపగలరని మనువు వచించుచున్నాడు. శిక్షణకాలము మూడుభాగములుగ విభజింపబడును. ప్రారంభకాలము (7 వ సం॥ మొదలు) బాలుడు దేహపటిమను పెంపొందింప చేసికొని యెన్నికష్టముల కైనను నోర్చుకొనుటకు సంసిద్ధులగుటకు గురువర్యులు పూనుకొన వలయును. ఇతరవిద్యలు సైతము అవసరమే. కాని శరీరవ్యాయామమునకే ఎక్కుడు ప్రాముఖ్యము నీయవలయును. 14 వ సంవత్సరమునుండి బాలకుల చిత్తవృత్తి అతీతముగ వికసించుచుండును. బాలకులు ఒక్కొక్కసారి దాని నాపుకొనుట కశక్తులై ఎంతయో బాధ పడుచుందురు. ఇట్టి కాలమున పెద్దలు తగినవిధమున వారికి తోడ్పడక పోయిన తరువాత వారి జీవితములకే ముప్పు వాటిల్లగలదు. ఈకాలమున చిత్తవృత్తిని జయించి దాని నుత్తమమార్గమున బాలకు లుపయోగింపఁ జేయుటకు గురువర్యులు తగిన శిక్షణము నీయవలయును. 21-వ సం॥ నుండి బాలకులు, శారీర చిత్తవృత్తులను తమకు దాసానుదాసులుగ జేసికొని మేధాశక్తులను నిర్విఘ్నముగ కొనసాగించుకొనగలుగునట్లు గురువులు ప్రసాదింపవలయును.

మను ధర్మసూత్రములు అమరతుల్యములు. ప్రస్తుతపు భారత సంతానము వాని పట్ల నిరాదరణము చూపుచున్నను ఇతర జాతులవారందఱు తత్పరమార్గమును గ్రహించి లోక సేవ చేయుచున్నారు. మన మెంతకాల మీ విషయమున మూకీభావము వహింప వలయును? మన భారత విద్యావేత్తలు ఈమహాశయములను కొనసాగించుటకు ఎంతయో ప్రయత్నములను సలుపుచున్నారు. రవీంద్ర కవి సార్వభౌముని శాంతి నికేతనమునను- ఆనిబిసెంటుగారి జాతీయవిశ్వవిద్యాలయమునను- బందరులోని ఆంధ్రజాతీయకళాశాలయందును- గురుకుల విశ్వవిద్యాలయమునను- ప్రాచీనభారతవిద్యాధర్మములను ప్రస్తుత పరిస్థితులకు సమన్వయము చేయునట్టి ప్రయత్నములు సలుపబడుచున్నవి. ప్రాచీన గురుశిష్య ధర్మావతారముల మన మీవిద్యాలయములలో గాంచగలము. ఇంతటితో తృప్తిపడిన లాభముగలదా? లక్షలకొలది భారత విద్యార్థు లింకను కూపస్థమండూకములుగనుండి పలుకష్టములబడుచున్నారు. వారిని గట్టెక్కించి పుణ్యము గట్టుకొను భారము మన విద్యావేత్తలయందుగలదు. ఈసందర్భమున నుపాధ్యాయుల విద్యుక్త ధర్మములను నివేదింపననవసరము. వారి వృత్తి పవిత్రమైనది. నూతన పరిస్థితులను శ్రద్ధతో గమనించి ప్రాచీన ధర్మముల నుద్ధరించి శిశోద్ధరణమునకు పూనుకొన వలయును. స్వార్థత్యాగమున వారు పెట్టినది పేరు. వారీ సందిగ్ధకాలమున లోకకల్యాణమునకు పూనుకొనక పోయినచో భావిసంతతి వారి నెంత దూరునదియుఁ చెప్ప ననవసరము. పూర్వకాలమున గురువులు లోకరంగమున ప్రవేశించి అమర తుల్యులైరి. ఇప్పటివారు సైతము ప్రాచీనపథమునువిడనాడెదరా! ఎన్నటికిని అటులచేయరు. భగవానుడుమనకుతోడ్పడు గాత!

# నాయకులు

వల్లభనేని వేంకటరావు చౌదరి గారు

ఎట్టి సంస్థాపన మైనను, విధాన మైనను కొంతకాలము కడచిన తరువాత శిథిలమై యందలి గుణములు నశించి దోషములు బయలుపడును. కాలము బమ్మిని తిమ్మిఁ జేయఁగలదు.

మనమతములోని ప్రమాణగ్రంథములకును గురువులకును ఆప్తులకును పూర్తిగా లొంగియుండుట యెంత యవసరమో యెంత శ్రేయోదాయకమో గ్రహించి పూర్వము మతసంస్కర్తలు జనులలో ననుసరణయోగ్యములగు విశ్వాసము, వినయము అను గుణములను మిక్కిలి పెంపొందించిరి.

హిందూదేశమునఁ బైని జెప్పిన వినయవిశ్వాసములు కాలవశమున తాము నశించుటే కాక దేశకాలములను బట్టి యుక్తాయుక్తములను విచారించుకొనగల సామర్థ్యమును జనమునందు నశింపఁ జేసినవి. ఇట్టి దశయం దుండు తరుణమున తురుష్కసంసర్గమును, నాంగ్ల సంపర్కమును వరుసగ సంభవించినవి. మహమ్మదీయ సంసర్గఫలముల విచారించుట కిది తావు కాదు. ఆంగ్ల విద్య మనదేశమున వ్యాపింపక పూర్వము, ఆంగ్లప్రభుత్వమువలన మనకు కలిగిన నష్టము లంతగ గణింపదగినవి కావు. విజాతీయప్రభుత్వములవలన ననేకదేశముల కట్టి కష్టనష్టములు సంభవించినవి. కాని పాశ్చాత్యవిద్యవలన కలిగిన నష్టము వర్ణనాతీతము. నలునికి కర్కోటకదంశనమువలన కలిగిన మార్పువంటిది. స్వరూపమే పోయి నపుడు వేఱుగ జెప్పున దేమున్నది?

ఆత్మవిశ్వాస మడుగంటి పోయినది. పైపెట్టుగ పాశ్చాత్యవిద్యవలన నాప్తవిశ్వాసము పోయి యాంగ్ల విశ్వాస మేర్పడినది. హిందూదేశముకొఱ కెంత సంకుచితముగఁ జేయబడినను స్వతంత్రదేశమందు పెరిఁగిన పాశ్చాత్యవిద్యావిధానమందు కొన్ని చిహ్నములు విడిచినవి కావు. విద్యకు మతసంపర్కము లేకుండఁ జేసిరి. విద్యార్థికి ప్రతివిషయమును యథేష్టముగ నాలోచించుకొను స్వాతంత్ర్య మొసఁగిరి. తపస్సమాధిలో నున్న విశ్వామిత్రుఁడు కన్ను తెఱచినతోడనే యెదుటకు మేనక గపబడినట్లు పాశ్చాత్యనాగరకతాపధూటియును, క్రీస్తుమతాభిచారికయును, విద్యార్థి స్వతంత్రాలోచనము బయలుదేఱినతోడనే తారసిల్లినట్లు నియోగింపఁబడెను.

అదంతయు నట్లుండనిండు. ప్రకృత మేమన నాంగ్ల విద్యాసంస్కార మేపాటియైనఁ బొందిన ప్రతిహైందవునకును దుస్స్వతంత్రత యలవడినది. యథార్థముగ తనకంటె సర్వవిధముల నధికు లగువారి నేరీతిగ నెంతదనుక ననుసరించి యుండుట ధర్మమో, శ్రేయోదాయకమో తెలియలేకైరి. ఆరంభముననె గురువుతో సమానుఁడనని శిష్యుఁ డనుకొనుచున్నాఁడు. నీతుఁడు నాయకునితో సమానుఁడ ననుకొనుచున్నాఁడు. నేనొక నాయకుఁడ నని కాని నేనే నాయకుడ నని కాని తలంచుచున్నాఁడు.

ఉత్తమగృహస్థుఁడు గాని, యతి కానేరఁడు. శిష్యులలో నుత్తముఁడు కానిది గురువు కాజాలఁడు. నీతోత్తముఁడు కాకయే నేతయగుట యసంభవము. మహావినయసంపన్నుఁడు కాని యత్యున్నతాధికారమునకుఁ బనికిరాఁడు. అహంకారము నడఁచిపెట్టఁగల్గినఁ గాని తనకును, తనయెదుటివానికిని గల తారతమ్యము గోచరము కాదు.

యథార్థస్థితి కనఁబడదు. యథార్థజ్ఞానము గలవాఁడు, ఇతరునియందలి గుణాధిక్యతను గ్రహించినవాఁ డగుటచే, నప్రయత్నముగా నుత్తముల ననుసరించి లొంగి, వారిలో లీనమైయుండును. ఇట్టివారే, యీప్రథమావస్థ చాలకాలము కడచినతరువాత, ఇచ్ఛ లేకయే నాయకు లగుచున్నారు. యతులు గురువులు నగుచున్నారు.

వ్యష్టిదృష్టి నశించి సమష్టిదృష్టి ప్రబలినకొలంది పురుషునికి ప్రేమ వృద్ధి యగును. ద్వేషము నశించును. అజ్ఞానము వీడిపోవును. ప్రథమదశలో నిది స్థిరముగా నుండదు. శాంతముగా విచారించినప్పుడంతయుఁ జక్కఁగా కన్పబడును. కాని యాచరణములోఁ బెట్టుట కలవి కాదు. సంఘకార్యములకంటె స్వకార్యములే బలవత్తరములై యుండును. ఇది పరోక్షజ్ఞానము.

ఇట్టివారు వీరైనప్పుడు వ్యాసరూపమునఁ గాని యుపన్యాసరూపమునఁ గాని యితరులకు బోధింప నారంభించుదురు. వీరెన్నఁడును నాయకులు కాఁజాలరు. సమష్టిదర్శనమున వీ రారంభదశలోనివారు. ఇఁక రెండవదశలోనివారికి వ్యష్టిదృష్టితో సమముగా సమష్టిదృష్టియు నుండును. స్వకార్యములందున్న ధ్యానము ఆసక్తి

ప్రవృత్తి సంఘకార్యములందుకూడ నుండును. సంఘసేవ చేయునపుడును స్వకుటుంబసేవవలన కలిగినట్టి సంతృప్తి కలుగుచుండును. వెనుకటి కార్యసాఫల్యముచేతను జయముచేతను, జనుల యభినందనములచేతను ముందు కార్యములను నిర్వహించుటకుఁ దగిన సామర్థ్యము చేకూఱును. వీనిలో నేదియు లేనివాఁడు హృదయమున నివృత్తి యంకురించుచుండును. మరల నుపశమించుచుండును. కార్యమధ్యమున కలుగుకష్టములకు లోలోన వెఱపు జనించుచుండును. కాని యంతమాత్రమున కార్యమును విసర్జింపరు. అంతరాయములు కలిగినను మరల మరల పూని, నిర్వహించుచునే యుందురు. ఇట్టిదశలోని నాయకులు అధమనాయకులు. నాయకత్వసంపాదకములగు గుణములలో ప్రధానమైనవానిని సమష్టిదృష్టితో విభజించుచున్నాను. ఇతరలక్షణములు గుణములు లేనిది నాయకుడింతమాత్రమున కాగలడని నా యభిప్రాయము కాదు. కాని సమష్టిదృష్టి ప్రబలినకొలంది జీవుఁ డింద్రియముల నొనఁగూర్చుకొనినట్లు, అదియే తక్కిన గుణసామగ్రిని క్రమముగా సమకూర్చుకొనును.

ఇఁక మాధ్యమికదశయందు వ్యష్టిదృష్టి క్షీణించిపోవును. స్వకార్యములే యుండవు. స్వకుటుంబవ్యాపారములను జనులయాదరణమే నడపుచుండును. ప్రాథమికదశలోవలె కాక ఈదశలో స్వజనులుకూడ వీనికి లోఁబడుదురు. వీనినే యనువర్తింతురు. ఈ దశయందలి నాయకుని త్యాగము అపారముగా నుండును. లోకమునకాశ్చర్యము కలిగించును. ప్రాణత్యాగమునకు వెనుదీయఁడు. ప్రతిపక్షులుకూడ నిట్టివానిని హింసింప జంకుదురు. అసాధారణమైన శక్తి యొక్కటి వీని నావహించును. ఆ యభిమానప్రతికార్యమునను జయమునే పడయుచుండును. ... న్ని లక్షణముల నుత్తమనాయకుఁడే యను భ్రమ ... కలు జేయుదు. కాని యెట్టి బుద్ధిశాలులకును దుర్గ్రాహ్యమగు రూపమున వ్యష్టి వీని నాశ్రయించి యుండును. జీవులలో నొక్కజాతినో, కొన్నియెల్లలకు లోఁబడిన భూఖండమునో యాశ్రయించుకొని వీని దృష్టియును హృదయమును వ్యాపించియుండును. విషమస్థితులు వచ్చినప్పుడు గాని యీ విషయము, ఇతరులకును వానికిని తెలియదు. సంకుచితత్వ ... బయల్పడును. తన యెల్లలను దాఁటి పుడు ... వెలవెలఁబాడిపోవును. ఇట్టివారు మధ్యమనాయకులు. ఈ కాపు

మహాసంస్కర్తలందఱు నిట్టివారే యని చెప్పవచ్చును.

ఉత్తమదశలోనివారిని గుఱించి చెప్పదగినది విశేషముండదు. పూర్తిగా వ్రాయఁగలుట యసంభవము. వారికి వ్యష్టియన నేమో తెలియదు. పుట్టుకే యట్లు పుట్టుదురు. ఒకానొకప్పుడు సామాన్యజనులవలె నుద్భవించినను కొలఁదికాలములోనే మాఱిపోవుదురు. అట్టివారు చేష్టలందును నభిరుచులందును బాలురవలెఁ గాని పిచ్చివారివలెఁ గాని యుందురు. సామాన్యముగఁ జనసంఘములకును మతములకును నుండు నియమములలో నొక్కటియైన పాటింపరు. సర్వసంఘములకు సమానములైన నీతినియమములుకూడ వారి కన్వయింపవు. వా రతిమానుషప్రజ్ఞులు. వారికి దోషము లంటవు. వారి శరీరేంద్రియములు తేజోమయములు. ఏకార్యమందును వారికి ప్రవృత్తి యుండదు. ఒకొక్కప్పుడు లీలామాత్రమున కొన్ని పనులు చేయుచుందురు. అవి పిచ్చిపనులుగా నుండును. కొన్నివేళల నీతిబాహ్యములును దుర్మార్గములును కావచ్చును మనదృష్టికి. అట్లొందుకుఁ జేయునది మనకు గోచరింపదు. ఇది యట్టివారి సామాన్యలక్షణము. వీరు ప్రేమపూర్ణులు. వీరిప్రేమ మనుష్యజాతియందు కాదు సర్వప్రాణులయందును వ్యాపించియుండును. అఖండశక్తి గర్భితమై వీరియం దుండును. ఇట్టివారి ప్రయత్నము లేకయే జను లాకర్షింపఁబడుదురు. ప్రథమమున సన్నిహితు లగు బుద్ధిమంతులకు వారిశక్తి గోచరమగును. క్రమముగ నందఱకును విదితమగును. ఎట్టి యభినివేశము గలవానికిని, అట్టి యుత్తముని సమీపించినతోడనే, తన యల్పత్వము మోమునఁగొట్టినట్లగపడును. అవ్యక్తమైన దేదియో పొందదగిన దున్నదని గోచరించును.

అట్టి జ్ఞాను లుత్తమనాయకు లగుదురు. జనులే వారిని ప్రార్థించి, పురస్కరించుకొని తమ్ము సంస్కరించుకొందు రని చెప్పవచ్చును. ఆ జ్ఞానుల సంకల్పములమోఘములు. వీరి దర్శనమాత్రమున ప్రతిపక్షులుకూడ వీరి ననుసరించెద రని చెప్పినను, వీరి సామర్థ్యమును వర్ణింప నక్కఱ లేదు. దేవాంశసంభూతు లని వీరి నందురు. క్రూరవన్యమృగజాలము సైతము వీరికి లోఁబడును. భూఖండము నేభాగమున నుంచినను వీ రొక్కతీరుననే యుందురు. బుద్ధుఁడు, క్రీస్తు మొదలగువా రిందుల కుదాహరణములు. గాంధిమహాత్ముఁడు యుత్తమనాయకులలో కడపటివాఁ డని చెప్పవచ్చును.

# ఆదిభరతుడు

కొండిపర్తి వీరభద్రాచార్యులు గారు

పూర్వకాలమున మనదేశము మోటుజాతులవారితో నిండి యుండెననియు, క్రమక్రమముగా మధ్య ఆసియానుండి పలుతెగలవారు వేరువేరు కాలములందు వచ్చి యిచ్చటి యాదిమవాసులను కొండలకు, గుట్టలకు, అడవులకు దరిమివేసి వాసయోగ్యములగు మైదానములను దాక్రమించుకొనిరనియు చరిత్రకారు లనేకులు వ్రాయుచున్నారు. ఆర్యులు నట్టివారిలో నొకతెగవారని వారి యభిప్రాయము. ఇందుకు భిన్నముగా ఆర్యులు స్థలాంతరమునుండి వచ్చినవారు కారనియు, వారెప్పుడు నీదేశముననే వెలసినవారనియు కొందఱు చరిత్రకారులు పక్కాణించుచున్నారు. ఏదెటులనున్నను సుమారు నాలుగువేల వత్సరముల క్రిందట ఆర్యులు హిందూదేశపు వాయవ్యభాగమున నుండిరనియు, అప్పుడు వారొకజాతిగా గలిసి యైకమత్యముతో వెలయుటకు మారుగా దమలోదాము పోరాటములు సలుపుచు భిన్నభిన్నములగు కూటములుగ నుండిరనియు నందఱు నంగీకరించుచున్నారు.

ఆకాలపు టార్యులు సంపూర్ణమగు సంఘీభావము లేనివారయ్యును, వారిచుట్టును నివసించుచుండిన యితరసంఘములకంటె సరళస్వభావులును, దైవభక్తియుతులును, సాంఘికనీతియం దనురక్తిగలవారును, పరశ్రేయస్సహిష్ణుత కలవారునై యుండిరి. ప్రతికుటుంబమును వేరువేరుగ నివసించుచుండెను. ఆ కుటుంబమునకు మూలపురుషుడు అనగా తండ్రి సర్వాధిపతి. తక్కినవా రందఱును వాని యధికారమునకు లోబడి నడువవలయును. ఆవులు, ఎడ్లు గొఱ్ఱెలు వారిసంపద. ఈ పశువులకు మేతయును, దమకాహారమును నెక్కడ సులభముగ దొరకెడిదో యచ్చటికెల్ల పోవుచుండెడివారు. వారికి స్థిరములగు నివాసస్థలములు లేవు. వర్షకాలములందు కొండగుహలలోను, లోయలలోను, తలదాచుకొనుచు వానలు లేనప్పుడు బయళ్ళమీదను, నరణ్యపరిసరములందును ద్రిమ్మరుచుండిరి. ఒక్కచోట తమమందలకు దొరకిన మేత యైపోగానె మఱొకచోటికి బోవుచుండిరి. ఇట్లు సంచారములు చేయుచు నొకకుటుంబ మొకపర్వతపార్శ్వమున జేరియుండ, ఆపర్వతమునకు మఱొకవైపున వేరొండుకుటుంబము వసించుచుండవచ్చును. అప్పుడు వారిమందలు వీరిమందలు నొకానొకచోట కలిసిపోయెడివి. తగవులు పొసగెడివి. సాధారణముగా శాంతముతోడనే వివాదలను దీర్చుకొనుచుండెడివారు. సఖ్యతతోనే యెవరోయొకరు స్థలాంతరములకు వెడలిపొయ్యెడివారు. కాని క్రోధపూరితులై పోరి యొండొరుల నిర్జించుకొనుచుంటయు నప్పుడప్పుడు పొసగుచునే యుండెడిది.

ఒకొక్కకసమయమున ననార్యులగు మోటుజాతులవారితో యుద్ధములు వాటిలుచుండెడివి. ఆర్యులు సామాన్యముగా సరళస్వభావులని చెప్పియున్నాము. వీరితో దలపడుచు వచ్చిన యనార్యులటుల గాక తీవ్రస్వభావులును, కఠినహృదయులునై యుండి వీరిని బాధించుచుండెడివారు. కక్షలబలాబలము ననుసరించి జయాపజయములు వాటిలుచుండెను. అరుదుగ మైత్రి పొసగుటయు గలదు.

ఆ కాలపు ఆర్యులు నిరాడంబరజీవులు. వారి జీవితావశ్యకపదార్థములు కడుంగడు స్వల్పములు. శరీరమున ప్రాణములు నిలుపుకొనుట కవసరమగు నాహారము, శీతమునుండి గాచుటకు దగిన దుస్తులును నున్నచో తృప్తి నందెడివారు. పశుసంపదను మించిన సంపద వారికి లేదు. లోహరూపమగు ధనము వా రెఱుగరు. మిక్కుటముగ ఆస్తిని కూర్చిపెట్టుకొనుట వారికి తెలియదు. ఒండొరుల బాధించుకొని సాధించుకొనుటకు దగిన దుష్ప్రేరణలు వారికి లేవు. సుస్థిరగృహముల నిర్మాణమునకు వారు గడంగలేదు. ఎచ్చట వీలుగనున్న నచ్చటికేగెడివారు. వారి నొక్కస్థలమునకు బంధించియుంచు పరిస్థితులును శూన్యములు. అందుమూలముననే వేరువేరు కుటుంబములకు మైత్రి గల్పించుకొనవలయుననిగాని, యొండొరుల సహాయము చేకూర్చుకొనవలయు ననిగాని, పరస్పరసానుభూతితో పెద్దపెద్ద సంఘముల నిర్మింపవలయు ననిగాని వారిని ప్రేరేపించు పరిస్థితులు మొదట లేవయ్యెను. ఇందులకు మారుగా వారిని వేరువేరుగా నుంచు పరిస్థితులే మెండుగ నుండెను. సంఘబాహుళ్యమైనకొలది వారి కొక్కచోటనుండుట యసంభవమగుచుండెను. అందఱికి నాహారము దొరకుటయు, నందఱిమందలకును మేత దొరకుటయు గష్టమగుచుండెను. పరుల సంపర్కము లేకుండ దమను గాపాడుచుండు డనియే ప్రతికుటుంబమువారును దేవుని ప్రార్థించెడివారు. ఋగ్వేదమును బరిశీలించిన నప్పటి యార్యుల సంఘస్థితియు జీవితాదర్శములును తెల్లము గాగలవు.

ఈస్థితి చాలకాలము సాగినది. జనసంఖ్య హెచ్చుచు రాగా కుటుంబములు పెరుగుచు రాగా వారు ద్రిమ్మరుటయు నెక్కువయ్యెను. క్రమక్రమముగా విశాలతరప్రదేశములకు చేరిరి. పెద్దపెద్దబీళ్లు గలచోట్లకు చేరిరి. ప్రవాహతీరములకు చేరిరి. అక్కడ ఒకొక్కకుటుంబమునకును, వారిమందలకును వసతు లమరుటేగాక రెండుమూడు కుటుంబములు సుఖముగ జీవింపగల్గిరి. వైరములు, స్పర్థలు లేక మనగల్గిరి. అతిసంచయపద్ధతి లేనివారు గాన నొకరు సేకరించిపెట్టుకొనినదానిని మఱొకరపహరించుట సంభవింపలేదు. అందఱికిని చాలినంతయాహారము సులభముగ లభించుటచేత వారు వెంటనే స్థలాంతరములకు బోవలసిన యావశ్యకత తొలగినది. చిరకాల మొక్కచోట గలిసిమెలసి యుండు రెండుమూడు కుటుంబములకును మైత్రి యేర్పడినది. పరస్పరానురాగము సిద్ధించినది. కొన్నాళ్లకే రెండుమూడు కుటుంబములు నొక్కశ్రేణిగ గూడు

చువచ్చిరి. పూర్వ మొక్కొక్క కుటుంబ మితరకుటుంబములయెడ వర్తించినటుల నిప్పుడు ఒకశ్రేణి యితరశ్రేణులయెడ వర్తింపసాగెను. కాలక్రమమున శ్రేణులు పెరుగసాగినవి. ఇదివరలో ప్రవాహమున కూడుచు విడిపోవుచు నుండు పుడకలమాదిరి ఒక్కస్థలమునగూడుచు, నొండొరులతో బంధములులేక నిశ్చింతగా విడిపోవుచు వచ్చిన కుటుంబములు పెద్దపెద్ద శ్రేణులుగా నేర్పడినవి. అంతసులభముగా విడిపోజాలకుండెను.

శ్రేణులలో జనము హెచ్చుగ నుండుటచేతను, వారు సులభముగా విడిపోజాలక యొకేస్థలమున జిరకాలము నివసించుచుంటచేతను, సిరతరనివాసస్థానము లేర్పడసాగెను; మఱియు వారందఱి యాహార పానీయములకై యన్ని ఋతువులందును బ్రకృతిని నమ్మియుంటకు వీలులేదయ్యెను. పదార్థముల సేకరించి పెట్టుకొను నాచారము సాగినది. పదార్థముల యుత్పత్తిఁగూర్చి శ్రద్ధవహింపవలసినవారైరి. ఇందుకొఱకై వారు పంచభూతములరూపమున ప్రకృతిశక్తులప్రసాదము నర్థింపవలసినవారైరి. ఎండవానలు గాడ్పులు నీటిధారలు వీరికష్టసుఖములకు మూలాధారములై పూజనీయములైనవి. వీనియన్నింటికి నిలయమగు తమనివాసస్థానము సకలేప్సితార్థప్రదాయినియై యుత్తమదేవతయై వెలసినది. తల్లి బిడ్డకువలె జన్మస్థానము ప్రధానపోషకురాలుగ నుండెను. మరణానంతరము సుఖముల నిచ్చు స్వర్గముకంటెను నుత్తమముగ గ్రహింపనయ్యెను. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ యని వారు గానము చేయుచుండిరి.

ఇప్పటికి కొన్ని స్థిరావాసములును కొంతకొంత స్థిరచరాస్తియు నేర్పడినవి. ఏదినమున కాదిన మాహారపదార్థములను సంపాదించుకొనుటకు మారుగా కూర్చి పెట్టుకొనినదాని ననుభవించు వసతు లేర్పడినవి. మమకారలోభములు పెరుగసాగినవి. ఈగుణములు మత్సరములకు దారిచూపినవి. ఒకరియాస్తిని జూచి మఱొకరు మాత్సర్యమూనుట, తస్కరణములు సాగినవి. క్రమముగా కుటుంబములకు గుటుంబములకు శ్రేణులకు శ్రేణులకు గలహములు తలసూపినవి. ఇట్లు వీరిలోవీరు గలహించుటేగాక వీరినివాసములకు పరిసరములందు నివసించు ననార్యులదాడులును హెచ్చుపెరిగినవి. స్థిరచరాస్తులతోపాటు రణములు, జయాపజయములు, కక్షలు, పరస్పరద్వేషములు, ఈ ద్వేషముల సాధించుకొనునిమిత్తము వేర్వేరుతెగలవారికి మైత్రి చిత్రవిచిత్రములుగ సాగినవి. పూర్వ మున్న సంతుష్టి, శాంతి, యానందము దూరములైనవి. మఱియు వానియం దాసక్తియు పెరిగినది.

సఖ్యభావమును బెంచుకొని యొండొరుల క్షేమమును బాటించుచు కొన్ని నీతులను రచించుకొని సంఘనిర్మాణమునకు గడంగిరి. సాంప్రదాయసామరస్యము గలవారికి మున్ముందు సఖ్యత సనుకూరగలదు. కావున వేర్వేరు ఆర్యశ్రేణులు తా మొకజాతి యని నిర్ణయించుకొని తమలో దేశకాలముల ననుసరించి యుద్భవములైన భిన్నభిన్నయాచార సాంప్రదాయములయెడ సహిష్ణుతయు, పరస్పరసానుభూతియు గౌరవమును వహింప నిశ్చయించుకొనిరి. సమయానుకూలము లగు మార్పులను సవరణలనుగావించుకొని యార్యసంప్రదాయము నొకదానిని నిరూపించుకొనిరి. ఈమహార్యజాతినిర్మాణమునకు మూలపురుషుడై, వివిధశ్రేణుల సఖ్యముగూర్చి, యందఱిభక్తిగౌరవముల జూరగొనిన మహానీయుని చారిత్రము సర్వత్ర పూజనీయ మనుటకు సందియముండదు. వీని చరిత్రము ఋగ్వేదమున గానసగును. వీనిచే గావింపబడిన మహాత్కార్యములు ఐతరేయ బ్రాహ్మణమున వర్ణితములై యున్నవి. ఈమహాపురుషుని నామము భరతుడు. భరతుడను నామముగల వీరులు మనగ్రంథములలో ననేకులు గాన్పించుచున్నారు. వారిలో నీతడు ప్రథముడును మహార్యజాతినిర్మాణకుండు నై యున్నాడు. కావున వీనిని ఆది భరతు డని ప్రశంసించియుంటిమి.

భరతుడు జన్మించునాటికి ఆర్యశ్రేణులు అనేకము సింధుగంగానదీయాశయముల నచ్చటచ్చట స్థిరనివాసముల నేర్పఱచుకొనియుండిరి. వానియం దత్యంతము నభిమానమును గుదుర్చుకొనిరి. తమయున్నతికిని గౌరవమునకును నవియే మూలాధారములని గ్రహించిరి. ఎవరికివారు తమజన్మస్థానముల స్వర్గముకన్న మిన్న యని గానముచేయుచుండిరి; వానిని పూజింపుచుండిరి. కాని వీరందఱికిని సమష్టిభావము గుదుర్చుట సులభమైనపని కాదు. వీరందఱు నొకే కూటమునుండి ప్రభవించినవారైనను తామందఱు నొక్కమూలము నుండి యుద్భవించితి మను జ్ఞానము వారికి లేదు. పూర్వమును మఱచియుండిరి. ఏకసంప్రదాయము కలవారయ్యును కాలానుసరణిని వారి నావరించియున్న పరిస్థితులను బట్టి కల్గిన కించిద్భేదములను [illegible]నేసి సంఘీభవించుట కొల్లకుండిరి.

భరతుడు దేశాటనముచేసి యాయా యార్యశ్రేణుల పెద్దలతో గలిసి సంభాషించి, వారివారి యాచారవ్యవహారముల విమర్శించి, పైపైన బేరుకొనిన భేదము లెన్ని యున్నను వానియడుగున బఱగు నేకత్వమును నిరూపించి ప్రకటించి వివిధశ్రేణులవారికి సమష్టిభావమును బురికొల్పెను. వారిసంప్రదాయమునందలి మూలభావము లెవ్వియో, ప్రధానాంశము లెవ్వియో, అప్రధానాంశము లెవ్వియో వివరించి చూపి యందఱిదృష్టిని ప్రధానాంశములపైకి ద్రిప్పగల్గెను. అప్రధానములను గొన్నింటి మార్చియు, గొన్నింటి సవరించియు, గొన్నింటి దొలగించియు నవీనార్యసంప్రదాయము నొకదానిని సర్వాంగసుందరముగ బయలుదేరదీసెను. ఎంతయో కష్టపడెను. వాని కష్టము ఫలించినది. సింధునదీయాశయమున నెల్లగల యార్యశ్రేణుల నతడొక్క మహాజాతిగ సమ్మేళనము గావింపగల్గినాడు.

వేర్వేరుకుటుంబము లేకమై శ్రేణులుగట్టి జీవించుట కేది యాధారభూత మయ్యెనో ఆజన్మస్థానాభిమానమునే భరతుడు ముఖ్యాధారముగ గ్రహించెను; ఆజన్మభూమియొక్క పావనవిగ్రహమునే ఘనతరముగ నొనర్చెను. అదివఱకు మిగుల సంకుచితమై పూర్ణతయేలేని యాకారమున కితడు అవయవస్ఫూర్తి గావించి యొక దివ్యసుందరవిగ్రహమును నిర్మించి వారియెదుట బ్రతిష్ఠించెను. అందఱును సమష్టిని పూర్ణాభిమానముతోడను, భక్తిశ్రద్ధలతోడను నర్చించుట కనుకూలముగ నొనర్చెను.

ఆసంపూర్ణసుందరవిగ్రహమున కొకనామము కావలెను గదా. నామరూపముల ననుసరించియే జగత్తు వెలయుచున్నది. ఇవి లేనినాడు జగమే లేదు. నామరూపములును విడివడి యుండజాలవు. నామములేనిది రూపముగాని, రూపములేనిది నామముగాని స్మరణీయము గాజాలదు. ఇప్పుడే సంఘీభవించిన వేర్వేరు శ్రేణులందఱికిని హితవుగ నుండగల నామ మేది? అంతకు బూర్వము కొన్నికొన్ని శ్రేణులవారు తమ నివాసస్థలములకు జంబూద్వీపము, ఆర్యావర్తము, సప్తసింధువు, మొదలుగాగల పేరుల బెట్టి వ్యవహరించుచుండిరి. సింధూనదీయాశయమంతయు నీనామముచే గ్రాహ్యమగుచుండెను. కాని వీనిలో దేనికి బ్రాముఖ్యము నిచ్చుట యను ప్రశ్న గలుగ నూతనోపపాదన బయలుదేరినది. దాని నందఱును మహానందముతోడ స్వీకరించిరి. "భారతవర్షము" అనునదియే యది! చెల్లాచెదరై యుండి, దుర్బలములై మనుచున్న తమతమ శ్రేణుల నన్నింటిని సమ్మేళనము గావించి యొక్క మహార్యజాతిని నిర్మించి తమనందఱిని గణనీయులుగ నొనర్చిన భరతుని కింతకంటె వారు కృతజ్ఞతను జూపగల యుపాయ మే ముండగలదు! అప్పటినుండి యార్యనివాసము లన్నింటికిని సమష్టినామము భారతవర్షమై పఱగెను. భారతవర్ష మనగా భరతుని నాయకత్వముక్రింద సమ్మేళనము గాంచిన ఆర్యశ్రేణు లన్నియు నివసించు సమష్టిభూభాగము.

భరతుడు మహావీరుడు. సప్తసింధువు నాశ్రయించియున్న యార్యశ్రేణుల నొక్కటిచేసి వారందఱికి నాయకుడై క్షాత్రధర్మమును నెలకొలిపినాడు. నాయకుని శ్రేష్ఠత్వము వానినాయకత్వము నొప్పుకొని వర్తించునందరికిని క్షేమము సమకూర్చుట ననుసరించి యుండును. అందఱి కష్టములను దనవిగ భావించి వానినివారణ తనవిధిగ నెంచి యతడు వర్తింపవలసియుండును. నాయకుడనగా నందఱి పొగడ్తలను, నమస్కృతుల నందగోరువాడు కాడు. అందఱికొఱకు పాటుపడువాడు. అందఱికి సేవచేయువాడు. సర్వమాన్యుడగు సేవకు డని యర్థము. భరతు డట్టి నాయకశ్రేష్ఠుడు. వానినాయకత్వమున జేరినవారి నావరించి యనేకముగ అనాగరకజాతు లుండెను. వారివలన నార్యశ్రేణులకు పెక్కు ఇక్కట్టులు మూడుచుండెను. ఈయనార్యులు వీరి గోవులను, పంటలను, పశువులను, స్త్రీలను సయితము దొంగిలించుకొని పోయెడివారు. ఆటంకపఱుపబడినప్పుడు ఘోరయుద్ధముల సలిపి క్రూరముగ బాధించెడివారు. బుద్ధికుశలతయం దెట్లున్నను పశుబలమున ననార్యులు బలిష్ఠులుగ నుండిరి. కేవలము సరళమార్గమున బోయెడి యార్యులను మాయోపాయముల బన్ని భంగపఱచుచుండెడివారు. వీరినే దస్యులు, రాక్షసులు, దైత్యులనని యార్యులు వ్యవహరించుచువచ్చిరి. వీరితో దలపడి వీరిని నిర్జించుట భరతునకు ప్రధానవిధిగ నేర్పడినది.

కావున భరతుడు కొంత యోధగణమును సిద్ధపఱచెను. రణనీతి ప్రచారము గావించెను. యుద్ధవీరులకు శిక్షణము నమర్చెను. దస్యులతో సంగ్రామముల సలిపెను. విజయముల భగవంతుని కర్పించుచు యాగముల సలిపెను. ఈతడు జయించిన కిరాతులు, హూణులు, యవనులు, పౌండ్రులు మొదలగు ననేకజాతులవారిని ఆర్యసంఘమున జేర్చెను. వారిని అనేకవిధముల సంస్కరించెను. ఈతని శిక్షణ ధర్మము వ్యాపించినంతవఱకు దేశమున కంతటికిని ఆర్యావర్తమను నామ మమరినది. ఆర్యులును వారితో జేరి సఖ్యము గావించుకొనిన ప్రజలందఱును ఈదేశభాగమును ప్రబలమగు నభిమానముతో జూడగల్గిరి. అందఱిదృక్కులును ప్రేమగౌరవపూరితములై భరతునిమీద కేంద్రీకరించుచుండెను. భగవద్భక్తిపూరితుడును, నిగర్వచూడామణియు నగు నీతడు, ప్రజల యైకమత్యమును, పరస్పరాభిమానమును నొక్కవ్యక్తి నరునిపై నాధారపడి యుండకుండ, వారిసకలకష్టసుఖములకును, నైశ్వర్యములకును నాలవాలమగు నివాసభూమిపై స్థిరముగ స్థాపితమగునటుల గావించెను. మాతృభూమిని దైవముగ బ్రకటించెను. ఆదివ్యభూమి వర్ణనను స్తోత్రములం దిమిడ్చెను. అనుదినారాధనయం దీ స్తోత్రపాఠమును విధిగా నిర్ణయించెను. ఈపూజావిధానము స్థిరమగుటకు ప్రజాసామాన్యమునందు బ్రచారము చేయ వలయును. కావుననే ఆర్యులు తమ నివాసభూమియొక్క దివ్యమంగళవిగ్రహమును సమగ్రముగ వారియెదుట బ్రతిష్ఠించి, దాని నిట్లు ధ్యానము చేయుడని విధించిరి.

"ఇమం మే గంగే యమునే సరస్వతి
శుతుద్రి స్తోమం సచతా పరుష్ణ్యా
అసిక్న్యా మరుద్వృధే వితస్తయార్జీకీయే
శృణు హ్యా సుషోమయా"

దీనిభావ మేమనగా ఓగంగా యమునా సరస్వతి శుతుద్రి పరుష్ణి నాప్రార్థనల గైకొనుడు. అసిక్నీనదితో గలియు మరుద్వృధా, ఓవితస్తా, సుషోమానదితో గలియు అర్జికీయా నాప్రార్థనల నాలకింపుడు" ఈస్తోత్రము నార్యులెల్లరు ననుదినము పఠించెడివారు.

ఈస్తోత్రముకంటె నప్పటి ఆర్యుల మాతృభూమిని సమగ్రముగ బ్రదర్శింపజాలునదియు శ్రేష్ఠమునగు సులభోపాయ మేమియుండగలదు. ఈదేశమాతృపోషణమున నున్నవా రందఱు నొక్క కుటుంబము. వీరందఱికిని భారతవర్షము మాతృదేవత. స్వర్గముకంటెను గరిష్ఠురాలు. దేశాభిమాన మిట్లు పావనతమ మగు మతధర్మముగ నేర్పడినది.

ఇట్టు లార్యులు స్వదేశమును దేవతగా భావించి ధ్యానించుట క్రొత్త గాదు. అంతకు పూర్వము సింధునదీయాశయమున మాత్రమే యార్యనివాసము లేర్పడియున్నప్పుడు దానిని "ఆర్యావర్త" మని పిలుచుచు, మహాపుణ్యభూమి యని పూజించెడివారు. ఆకాలమున దాని నిట్లు వర్ణించిరి:

"శతద్రుశ్చ విపాశాచ తృతీయే రావతీ తథాః చంద్రభాగా వితస్తాచ సింధుః షష్ఠా వహిర్గిరేః."

ఆదిభరతుడు ప్రచారములోనికి దెచ్చిన ఈ దేశమాతృపూజా విధానమే భారతదేశ స్వరూపవికాసమునకు దరువాతనుగూడ నాచరణలో నుంచబడినది. ఈమహాపురుషుని నాయకత్వముక్రింద సుస్థా

పితమైన సూత్రమే వానితదనంతరము విశాలతరదేశమున వ్యాపించిన ప్పుడు ఆర్యులు ప్రయోగించి ఈమాతృమూర్తిని సంపూర్ణవికాసము గలదానిగ నొనర్చిరి. దక్షిణదేశమునగూడ ఆర్యులు చొచ్చినప్పుడు ఈదేశభాగమును గూడ నొకయంగముగ గ్రహింపజాలిరి. ఇంకొక విశేషము గలదు. ఆర్యులు క్రొత్తగా నాక్రమించిన దేశములం దది వఱకే నివసించుచున్న ప్రజలను సదా శత్రులనుగ భావించి వారిని నాశము చేయజాలక, తమ సంప్రదాయము నంగీకరించిన పట్ల వారిని గూడ దమలో జేర్చుకొనుచు వచ్చిరి. వారి యాచారములను గూడ గౌరవించుచు వచ్చిరి. ఇటు లనేక జాతులవా రార్యులలో గలిసి పోయి అందఱు నార్యుల మని చెప్పుకొనుచుండిరి. ఆంధ్రులు ఆర్యు లగుట కీ సూత్రమే ఫలించినది. ఇట్లు క్రొత్తగ జేరినవారి ప్రాముఖ్య మును నిలువబెట్టుటకు ప్రేమాతృమూర్తిని పూర్ణవికాసకలితముగ నొనర్చి

"గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి
నర్మదే సింధుకావేర్యా జలేస్మిన్ సన్నిధిం కురు."

అని ఆర్యు లనుదినమును పఠించుచు ముఖ్యనదుల నెల్ల నావాహించి పూజించు చున్నారు. మన కృష్ణాగోదావరినదులు ద్రావిడుల కావేరీ నదియు స్తోత్రమున జేర్పబడినవి. క్రమక్రమముగా, ప్రధానములగు పర్వతములును, తటాకములును, నగరములును గూడ ధ్యానశ్లోకములం దిముడ్చుట చేకూరినది. అఖండభారతమాతృస్వరూపము సమష్టి నందఱికిని ధ్యేయమై వెలుంగుచున్నది. దీని కంతకును మూలపురు షుడు ఆదిభరతుడు. ఆతడే యీ విశాలతరభూఖండమున నివసించు నన్ని జాతులను, జాతిమతవర్ణ భేదము లేక యొక్క మహాకుటుంబముగా జేర్చి యొక్క మహామాత నాశ్రయించియుండు దివ్యమార్గము నేర్ప ఱచి యున్నాడు. ఈసూత్రము నంగీకరించి ఆధునిక భారతీయులు హిందూదేశము నాశ్రయించియున్న సమస్తజనమును, హిందూమహమ్మ దీయపారసీకక్రైస్తవాదిమతభేదములు లేక, ఐరోపా యమెరికా టర్కీ గ్రీసు యిండియా యను భేదములును లేక ఈదేశమున నివసించుచు ఈదేశమాత నారాధించుచు, ఈదేశక్షేమమునకై ఆత్మార్పణము గావించి ప్రవర్తించుచు నందఱును సోదరప్రజగా భావించి మహానందమును పొందనగును. ఇట్లు దలపోసి ఆదిభరతునకు మన మెంత కృతజ్ఞత జూపవలసియుండునో వానిస్మృతిని మన మెట్లు గౌరవింపవలసియుం డునో సాసోదరు లెల్లరును యోచింపవలయును.

# సహాయనిరాకరణోద్ధారణము

## చింతలపల్లి రామకృష్ణశాస్త్రిగారు

ఉత్తగిన జాతీయ విద్యాపాఠశాలల, నెలకొల్పి కళల మన్నింపరయ్య!
ప్రతియింట రాటముల్ పరమాదరత నిల్పి, వడికి నూలును నేతఁ గడఁగరయ్య!
భారతదేశ సద్భావజనంబులును నేక, మతు లౌచు భేదంబు మానరయ్య!
ఖద్దరు హైందవాఖండగౌరవచిహ్న, మని యెంచి ధరియించి తనరుఁడయ్య!
తే. సత్య ధర్మంబులు నహింస సతత మూని, నిర్మలాత్మక దీక్షావినీతు లగుచు
శాసనోల్లంఘనము లేమిఁ జప్పఁబడక, మిగులు పరికిరభంబుల విజృంభింపరయ్య.

సీ. ఎసగంగవలెఁ గదా! హిందూమహమ్మదీ, యులకు సఖ్యంబు సంయోగములును;
స్థాపింపవలెఁ గదా! సరగ గ్రామములఁ, బంచాయతీన్యాయపుం సంఘములను;
వహియింపవలెఁ గదా! సహనంబుతో 'న కాల్యాదివీరు' లన సత్యాగ్రహంబు;
సాగింపవలెఁ గదా! సాత్త్విక సార్వజనికమైన శాసన నిగ్రహంబు;
తే. శాంత దౌర్జన్యరాహిత్య సహితముగనె, రాఁగలదు పుష్పవృష్టి సురాళి నింప;
భారతీయులు కృషిసల్పఁ బట్టు విడక, బూజ్యపూర్ణస్వతంత్రస్వారాజ్య మపుడు.

# వ్యవసాయము — జలాధారములు

**మందపాటి సత్య నారాయణ రాజు గారు**

పైరులకు నీరు లభింపనిచో నెటువంటి భూమి యైనను లాభము లేదు. ఏపైరు వేసినను నెంత శాస్త్ర జ్ఞాన మున్నను కడు నిరర్థకము. ఏదేశమం దైనను నీరు లేని వ్యవసాయము నూహింప శక్యము గాదు.

మన దేశమందు వ్యవసాయమున కుపయోగించు భూమియొక్క పరిమితి రమారమి 625 మిలియనుల ఎకరములు. అందు 223 మిలియనుల ఎకరములు మాత్రము సేద్యము క్రింద నుండెను. ఇందు $\frac{1}{5}$ భాగము మనుష్యనిర్మితము లైన ఆనకట్లు మొదలైనవానివలనను, 39 మిలియనుల ఎకరములు నదులు కాలువలు నూతులు మొదలైనవానివలనను తడియుచున్నవి.

మఱియు కట్టడములవలన పంజాబునందు $\frac{1}{2}$ వంతు; సింధు $\frac{1}{4}$; మదరాసు $\frac{1}{8}$; సంయుక్తరాష్ట్రములు $\frac{1}{8}$; బిహారు, ఒరిస్సాలలో $\frac{1}{10}$ వంతు సాగు చేయఁబడుచుండెను. హిందూదేశమం దంతటిలోను పంజాబునందు చాల బాగుగ నుండెను.

ఇతర దేశములలో ఈజిప్టునందు 6 మిలియను ఎకరములు, అమెరికా 14, ఇటలీ 3.7 స్పెయిను 5 లక్షలు, ఫ్రాన్సు 4 లక్షలు ఎకరములును తడియుటవలన సాగు చేయఁబడుచుండెను. ఆయాదేశములలో నీటివసతులను కల్పింపనిచో సదరు భూములు పంటలు లేక వృథగా నుండవలసివచ్చును.

మనదేశమందు గవర్నమెంటువారు 44 కోట్లు వెచ్చించుటవలన 2 కోట్ల రూపాయలు ప్రతిసాలున నికరలాభము వచ్చుచుండెను. ఇతర పనులకు $4\frac{1}{2}$ కోట్లు ఖర్చు చేయుటవలన $10\frac{1}{2}$ లక్షలు నష్టము వచ్చుచుండెను. ఇది గాక పడవల రాకపోకల సౌకర్యముల నేర్పఱుచుటకును తక్కిన చిల్లర పనులకును మొత్తమునిూద కోటి రూపాయలు నష్టము పోగా 1 కోటి రూపాయలు ప్రతిసాలునను లాభము వచ్చుచుండె నని పది సం॥ముల క్రిందటి లెక్కలవలననే తేలెను. ఇటీవల గవర్నమెంటు వారు ఎంతఖర్చు చేసినదియును ఎంతలాభ మున్నదియు జలాధారముల యభివృద్ధి ఎంతవఱకు జరిగినదియు నూహింపవలసి యున్నది. అధమపక్షము గవర్నమెంటు వారికి వచ్చు లాభము నైనను ప్రతిసాలున నీటికట్టడములకు వినియోగించినచో వ్యవసాయము ప్రస్తుతముకంటె నెన్నియో రెట్లు అభివృద్ధి పొందవలసి యుండెను.

ఇది యిట్లుండగ యుద్ధమునకు ముందు గవర్నమెంటువారు రయిల్వేల యభివృద్ధి నిమిత్తము ప్రతిసాలునను 15 కోట్లు వెచ్చించుట 350 కోట్లు ఇన్వెస్టు చేయుట బ్రిటీషు ప్రయివేటు కంపెనీదారులు 100 కోట్లు ఖర్చు చేయుటవలన ఇనుపదారులు పెరిగినవి. ప్రస్తుతము ఫలించు సరకులకు పదిరెట్లు రవాణా చేయుటకు వీలుగా నుండెను. ఇట్టి యవస్థ మాఱి ఎగుమతి కంటె సప్లయి పదిరెట్లు దేశమందు లభించునట్లు చేయవలసి యుండెను. నీటి కట్టడములకు డబ్బును విస్తారముగా వెచ్చించి వ్యవసాయమును వృద్ధిచేసినప్పుడే దేశమందలి దరిద్రదేవత వదలును. కాని విస్తారముగ డబ్బును వ్యవసాయపు డిపార్టుమెంటు క్రిందను, దానికి సంబంధించిన భవనముల క్రిందను మాత్రమే వెచ్చించినచో "కొండనాలుకకు మందు వేసిన నున్న నాలుకయు నూడిపోయిన" దన్నట్లు వ్యవసాయము వృద్ధిపొందుటకు మాఱుగా క్షీణింపవచ్చును.

మనదేశమందలి జలాధారములయొక్క దురవస్థ కుదాహరణముగా విశాఖపట్టణముజిల్లానుతీసికొనినచో బాగుగ విశదము కాఁగలదు. ఇందులకు కారణము మహారణ్యములు లేక కాదు. వర్షపు లేమి కాదు. నదులు కాలువలు లేక కాదు. భూములు నిస్సారములు కావు. రయితులకు వ్యవసాయజ్ఞానము లేక కాదు. మఱేదియన్నచో నదులలోని నీరు వృథగా సముద్రములపా లగుటయే. ఇందులకు ముఖ్య కారణము పాలకుల ఉపేక్ష, ప్రజలబీదతనము నై యున్నది. ఇటువంటి జిల్లాలలో నెన్ని వ్యవసాయకళాశాలలు పెట్టినను, ఎంతమంది బోధించినను, ఎటువంటి మెరువులు

వేసినను నెంతనేర్పుతో కృషి సల్పినను కడు నిరర్థకము. వ్యవసాయదారుఁడు చేతులు జోడించి ఆకాశమువంక చూడవలసిన దేగదా! ఒకమూనుసూన్ నెగవేసిన కాటకము కౌఁగిలించుకొనక మానదు.

ఏదేశమందైనను వర్షముల లేమిచే పంటలు పోయిన వని చెప్పుట పరిపాటిగాని సరియైనది కాదు. ఎచ్చటనైనను సర్వకాలములందును శాశ్వతముగ నిట్టి సమస్య ఉండదు. సం॥ము పొడవున కాకపోయినను కొన్ని నెలలలో నైనను వర్ష ముండును. జల ముండును. కాని దానిని నిలువచేయుటకు పాలకులు పూనుకొనరు. రయితు నీటిని నిలువచేసి కొని యుక్తముగా నుపయోగించుకొనుశక్తి లేనివాఁడై యుండును. చైనా జపాను ఇటలీ ఫ్రాన్సు మొదలైన దేశములలోకంటె హిందూదేశమందు వర్షము తక్కువకాదు. అమెరికా కుత్తరభాగమందు 24-52 పదునుల వర్షము మాత్రమే కలదు. పెర్సియా ఆఫ్ఘనుస్థానము క్వీన్సులండు విక్టోరియా దక్షిణాఫ్రికా కేపుకాలనీ ఆల్గేరియా స్పెయిను అమెరికాకుత్తరభాగమునందునువిశాఖపట్టణపు జిల్లాలోకంటె నెక్కువ వర్షము లేదు.

హిందూదేశమందు విశాఖపట్టణమువంటిజిల్లాలలో నయితము సరాసరిని సంవత్సరమందు చదును ప్రదేశములలో 42 పదునులకు, కొండప్రదేశములలో 56 పదునులకు పైగా వర్షించుచుండెను. దీనినిబట్టి చూచినచో కఱవులకు కారణ మేమై యుండునది తెలియఁగలదు. పెక్కుచోట్ల జలాధారములహక్కు గవర్నమెంటువారిది కొంత, సామంతరాజులు జమీనుదారులు మొదలైన వారిది కొంత యగుటచేతను, అట్లు కానిచో ఒక నది యొక్క హక్కు పెక్కుమంది కుండుటచేతను జలాధారములు అభివృద్ధికి మాఱుగా దావాలు తటస్థించి నశించుచుండెను. అట్లు కానిచో బల్గేరియావంటి యిసుక యెడారులలో నహితము 145 అడుగుల లోఁతు గల నూతులను త్రవ్వి వ్యవసాయమునకు వీలు కల్పించినప్పుడు మన దేశమందు కఱవని చెప్పవలసి వచ్చునా? చైనాదేశమందు మెట్టపల్లములతో నిండిన పెక్కుమైళ్ల భూమిని పదును చేయుట కాలువలు త్రవ్వుట మొదలైనవి చేసి చూచుటకును మిక్కిలి సొగసుగాను, పంటలు పండించుటలో నన్ని దేశములలోకంటె నధిక మైనదిగాను చేసిరి. అమెరికాదేశమందు ప్రైవేటుకంపెనీదారులు 60 కోట్ల రూపాయలు ఖర్చు చేసి 10 మిలియనుల యకరములకు నీటివసతులను కల్పించుకొనిరి.

ఇట్టి పనులు మన దేశమందు జరుగక పోయినను జలాధారముల అభివృద్ధికొఱకు పాలకులు చాల కృషి సల్పియుండిరి. ఒకప్పుడు మదరాసు గవర్నమెంటువారు విశాఖపట్ణం జిల్లాలోని చెఱువుల అభివృద్ధి కొఱకు నొక పార్టీని నెలకొల్పిరి. వారు $1\frac{1}{2}$ లక్షలు ఖర్చు చేసి 142 చెఱువులను అభివృద్ధి చేయవచ్చు నని తెల్పిరి. మఱొకప్పుడు జలాధారముల కమీషనువారు 20 సంవత్సరములలో 44 కోట్లు వెచ్చించినచో $6\frac{1}{2}$ మిలియను ఎకరములు తడుపుటకు వసతులను కల్పింపవచ్చు నని సూచించిరి. ఇటీవల చాటర్టను మహాశయుఁడు నీటి యంత్రములను గుఱించి అపారమైన కృషిని సల్పి ఒక పెద్ద గ్రంథము వ్రాసెను. సదరు సూచనలు గాక, యీ దర్మిలాను జలాధారములు ఎంతవఱకు అభివృద్ధి నొందినది ఎల్లరకు తెలిసినదేను. దీవి దిబ్బలలో 18 లక్షలు ఖర్చు చేయుటచే 50,000 యకరములు సాగుచేయుటకు వీలుగా నుండెను. గవర్నమెంటువారు రైతుల బాగుకొఱకు భూముల యభివృద్ధి ఆక్టును శాసించి రయితులకు ఋణము లిచ్చుటకు నేర్పాట్లు గావించిరి. సదరు సంగతి పట్టణములలోని వకీళ్లకే తెలియును గాని పల్లెటూళ్లలోని రైతుప్రజలకు తెలియనే తెలియదు. బోరింగునూతులను త్రవ్వుటవలన చాల లాభకారిగ నుండగల దని యొక డిపార్టుమెంటును గవర్నమెంటు వారు పోషించుచుండిరి. కాని అందలిఫలితము మాత్రము అంతగా కనిపించుట లేదు.

వ్యవసాయము ఏదేశమందైనను జలాధారముల యభివృద్ధి లేనియెడల కడు నిరర్థకము. ప్రభుపాలన మైనను ప్రజాపాలన మైనను జలాధారముల యభివృద్ధికి ప్రతిసాలునను తప్పనిసరిగా కొంతసొమ్మును వినియోగించుట అన్నిటికంటెను ముఖ్యము. మఱియు వ్యవసాయ శాఖాధిపతులకు దానికి సంబంధించిన శాఖలపై నధికారము లేనిచో నదియు కడు నిరర్థకము. ఒకప్పుడు మదరాసు అభివృద్ధిశాఖా మంత్రిగారు వ్యవసాయాభివృద్ధికి గల అసర్థకములను తెలియఁజేయుచు నుడివిన వాక్యముల నీ దిగువఁ బొందుపఱచుచున్నాను.

అభివృద్ధికి మంత్రులే గాని అడవులు మాత్రము వారి స్వాధీనమున లేవు.

'పరిశ్రమలకు వారు మంత్రులే గాని, ఫ్యాక్టరీలును విద్యుచ్ఛక్తులును వారి స్వాధీనమునందు లేవు.

వ్యవసాయమునకు వారు మంత్రులే గాని, ఇరిగేషను మాత్రము వారి స్వాధీనమున లేదు.

ఇరిగేషనులేని వ్యవసాయము నూహింప శక్యము గాదు. ఇట్టి పరిస్థితులు వారికి గోచరమై దేశాభివృద్ధికి ప్రధానమైన వ్యవసాయమును వృద్ధిచేయుటను సర్వవిధములను బ్రయత్నించుచుండిరి. ఇట్టితఱి ప్రజలు మౌనము దాల్చి యూరకుండక ప్రభుత్వమువారికి సర్వవిధములఁ దోడ్పడి వ్యవసాయాభివృద్ధికి ప్రయత్నింపవలసి యున్నది. అట్లు గానిచో మొక్క మొలవనిచోట మొలపించుటకును, ఒక వెన్నువేయు సస్యము పది వెన్నులు వేయునట్లు చేయుటకును నే మహానుభావుఁడు మనదేశమందు నుద్భవించునో తెలియదు! దేశీయులకు శాస్త్రజ్ఞానము కొఱకు నెన్ని కళాశాలల నెలకొల్పినను, నెంతమంది బోధించినను, నెంతడబ్బును వెచ్చించినను కొంచెమైనను లాభ ముండదు.

ఏది యెట్లున్నను, స్వయంసాహాయ్యమునకు మించినది మఱియొకటి లేదను లోకోక్తి ప్రకారము వ్యవసాయదారులు సంఘములుగాఁ గూడి జలాధారముల యభివృద్ధి కొఱకు కృషిసల్పి మరమ్మత్తులు మొదలైనవి చేయించుకొనవలసి యున్నది. విద్యాధికులు ధనాఢ్యులు జమీన్‌దారులు మొదలైనవారు రైతుప్రజలకు సర్వవిధములఁ దోడ్పడి జలాధారముల యభివృద్ధికొఱకు అపారమైన కృషిని సల్పినచో దేశమునందలి దరిద్రదేవత తొలఁగుటయును కలుగును. ఇందువలన వ్యవసాయాభివృద్ధియును ప్రజాసౌఖ్యమును దేశఖ్యాతియును నిస్సంశయముగ చేకూఱును.

# వార్షిక ప్రకృతి

బోరుపాటి శివ రామ శర్మ గారు

అపరదిక్కాంత యంశుమా♦ల్యగ్ని సేయ
దాన జనియించు ధూమంపు ♦ తతియనంగఁ
దోఁచెఁ జదలు; తద్ధూమంబు♦తోడ నెగయు
విస్ఫులింగంబు లన నొప్పె ♦ వింటునుడులు
పద్మినీప్రభాకరుల వి♦వాహవేళ
నడుమ బట్టిన నీలంపు ♦ టుడు పనంగ
సవితృ తీవ్రపాదములను ♦ సైఁపలేక
ప్రకృతికాంత దాల్చిన యాత♦పత్ర మనఁగ
మొయిలు చూపట్టె ముద్దుల ♦ ముచ్చటొదవ
నందనవనంబునందు ♦ నమందవృత్తి
మలయుపవనుండు వైయాళి ♦ సలుపునపుడు
రాల్ప నిల రాలిన లతాంత♦రాజి యనఁగ
భరతమాత దాస్యంబును ♦ కథము దలఁచి
విన్నపడఁతి భోరన ♦ విలపించునాఁడు
కనులనుండి రాలిన యశ్రు♦కణము లనఁగ
జల్లుజల్లున జల్లులు ♦ జల్లు మనియె
నరునిపాటు కనుంగొని ♦ తరులుగూడ
కనుల నించిన యశ్రుల ♦ కణము లనఁగ
సాలపర్ణస్థితాసార ♦ జలకణతతి
జలజలని రాలె మలయా♦నిలంపు వీఁక
నడచు పటికంపు మబ్బుల ♦ నశ మదోఁచి
చలువవెన్నెలజనిసీమ ♦ చందమామ
పడఁతి! నీమోము పసకోడి♦పఱచుచున్న
వాఁడు నాఁగఁ జూపట్టెడు ♦ భావమునకు.

# హైందవకళాసాంప్రదాయము

పాకాల వేంకట రాజమన్నారు గారు, బి. ఏ.

లోకమునఁ గేవలము స్థూలదేహపరంబును, భౌతికవిధంబు నగు వస్తుసంచయ మంతయు నాశనము నొందునట్టిదియే. కాలమును ధిక్కరించి జీవించుటకు భౌతికాతీతంబగు గుణము నిలయమై యుండుట ఆవశ్యకము. కాలచక్రము ప్రచండవేగమునఁ దిరుగుచున్నది. తద్వలయమాత్రకారణంబున దేశము - జనసంఘములు- రాజ్యములు- రాజ్యాంగములు- ఉద్భవించి- వృద్ధినొంది- నశించుచున్నవి. పురాతనచారిత్రక విషయ మంతయు నిదియే.

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం జెందరే
వారేరీ సిరి మూటగట్టుకొని పోవంజాలిరే.

అని బలిచక్రవర్తి నుడివిన దెంతసత్యము ! అట్లు నశించిన దేశములందు, రాజ్యములందు ఏమి మిగిలియున్నది ? ఆజనసంఘములం దెవరు కడతేరి యిక్కాలమువఱకును జీవించియున్నారు? అపూర్వవైభవమున- ఆపూర్వజీవితమునఁ బ్రస్తుతకార్యక్రమమున కుపయుక్తమై అర్థపూరితమై యున్న విషయ మెయ్యది? విచారించి చూచినచో- అట్లు శేషించి నిలిచినవన్నియు భావపరములగు అనుభవవిశేషములే. మన మిప్పటికిని స్మరించునామములు అట్టి అనుభవవిశేషములకుఁ గర్తలైనట్టి ప్రతిభాసమన్వితుల నామరాజములే. పురాతన గ్రీసు రాజ్యము నశించి సుమారు రెండువేలసంవత్సరము లైనవి. ఆరాజ్యమునందలి పట్టణము లన్నియు రూపుమాపైనవి గాని మిగిలిన వెయ్యవి? 'గ్రీసు' అనినంతనే స్ఫురించువా రెవరు ? ప్రస్తుతకాలమున సైతము జీవపూరితమై విలసిల్లిన దెయ్యది? ప్లేటో, అరిస్టాటల్, సాక్రటీస్, మొదలగు మహనీయుల తత్త్వవాదములు. ఆధ్యాత్మికవిచారములు. అనుభవాభిప్రాయములు. ఈస్కలస్ యూరిపిడీస్, సోఫోకలీస్ మున్నగు కవిసార్వభౌముల నాటకరాజములు. హోమర్ ఆదిగాఁ గలవారి ఇతిహాసరత్నములు. ఫిడియస్ ప్రముఖుల శిల్పకళానైపుణ్యము. ఈవిషయములు ఇప్పటికిని కాలచక్రాధికారమునకు లొంగక జీవించి మనజీవితములందు నివాస మేర్పఱచుకొనినవి. గ్రీకులు నశించినను వారి భావములు నశింపలేదు. భావోత్పన్నములైన కృతులును నశింపలేదు, అవియే మానవాభివృద్ధికి ముఖ్యము లైనవి. కాన జీవింపఁ దగినవి.

ఈసత్యము అన్ని దేశములకు ననుసరించును కావుననే దేశాభిమానము జాత్యభిమానము గలవారు తమవారి పూర్వప్రతిభ పూర్తిగ నశింపకుండుటకు పురాతనగ్రంథరాజములను చిత్రలేఖనములను శిల్పములను సేకరించి - భద్రపఱచి - వానిని ఆదరముతోఁ బరీక్షించి- వాని సుగుణంబులను లోకమునకుఁ బ్రకటించుచున్నారు. ఆంగ్లేయు లిట్టిపనియందుఁ బ్రాముఖ్యముఁ గన్నవారు. వారి జాత్యభిమానమున నూఱవవంతు సైతము మనకు లేదనిన చదువరులు కోపింపఁబనిలేదు. అట్లు ఆజాతియొక్క పురాతనప్రతిభావిశేషమును గ్రహించుటచే నాజాతియొక్క ప్రస్తుతప్రతిభ వికసించును. లేకున్న నడుగంటును. ఏక్షణమున నొకదేశముగాని జనసంఘముగాని తన పూర్వపరిజ్ఞానవిశేషమును విడనాడునో ఆక్షణమునుండియు దాని ప్రత్యేకప్రతిభ నానాటికి క్షీణదశ నొందసాగును. ఈలోకమున దేశదేశమునకును ఒకజాతికి నింకొకజాతికిని, అభివృద్ధిమార్గానుసరణమునఁ బరస్పరవిరుద్ధభావము తటస్థింపక తప్పదు విశ్వప్రతిభ సంపూర్ణవిలసన మందుటకీవిరుద్ధభావముకతన నుద్భవిల్లు పోరాటమున నేయొక్క దేశముగాని జాతిగాని దుఃస్థనొంది వ్యక్తిత్వము గోల్పోయినచో ఆభాసము సిద్ధించును. గాన నన్నివిధములను విశ్వక్షేమంకరమైన తెఱంగు ఆయాదేశమును జాతియు తమ తమ ప్రతిభను పోషింపఁజేయుటయే యని యెఱుంగవలయును.

ప్రతిభ మూర్తీభవించెడు నుదాహరణములలోఁ గళలు గణనీయములైనవి. వానియందుఁ బ్రతిభ నెలకొని పదార్థముతో మిళితమై యుండును. గాన నొకదేశపు పూర్వప్రతిభ నెఱుంగవలయు ననిన ఆ దేశపు పురాతనకళలను పరీక్షించుచు వానియందు స్థితమై వానికి మూలాధారములైన ముఖ్యసూత్రములను కనుఁగొనవలయును. అట్లొనర్చిననే మనకు సరియైన దృష్టి కలుగును. అప్పుడే మనకళలందలి రసమును పూర్తిగ గ్రహింపఁగలము. అట్లు లేకున్న నవి అర్థశూన్యములగును. మనపూర్వశిల్పములేమి చిత్రములేమి ఆదురవస్థయందే యున్నవి. అవి ఏసూత్రముల నాధారముగఁ జేసికొని యేభావములకు సాకారమొసగినవో ఆ సూత్రములను మఱచిపోతిమి ఆభావములు మనకు గ్రొత్తవైనవి. మనకళాపరిజ్ఞాన మంతయు మబ్బుమూయై పోయినది. మన కిప్పుడు కళాజ్ఞానము నొసంగుజ్యోతి అప్పుదెచ్చుకొనిన దీపమై పోయినది. మనప్రతిభను గుఱించియు నాగరకతను గుఱించియు కళలగుఱించియు సారస్వతమును గుఱించియు మనకుఁ గల యభిప్రాయములు మనవి గావు. ఎరవు దెచ్చుకొనినవి. తల్లిపాలు వఱగలు కట్టుచుండగా త్యజించి దాదిపాలు కుడుచుచుంటిమి. కాన దాదిగుణములే తలకెక్కినవి. దాది కట్టుకొనిన నల్లచీరవలె లేదని అమ్మధరించిన దివ్యాంబరమును చూచి నవ్వుచుంటిమి. ఈపరితాపకరమైన స్థితిని గాంచియే కొందఱు విలపించుచు గ్రంథములను వ్రాసియున్నారు. శ్రీ ఆనందకుమారస్వామిగారి గ్రంథములన్నిటియందును మనపూర్వప్రతిభ దీనారవముతో మనల వేఁడుకొనుచుండుట వినవచ్చును. ఇప్పటికైనను మీఱిపోలేదు. మేల్కాంచి పాశ్చాత్యపరిజ్ఞానమునకన్న భిన్నమైన పరిజ్ఞానము మనకుఁ గలదని యెఱింగి, తల్లక్షణములను గ్రహించినఁ

జాలును. మనకళలను గాంచి నవ్వక, సత్యదృష్టితో వానిని బరికించి, తదాధారములైన ముఖ్యసూత్రములను పాటించి తత్సంప్రదాయమును అర్థయుక్తముగఁ జేసిననే మనము తల్లిమేలు మఱవకుండిన ట్లగును.

హైందవకళాసాంప్రదాయము నెఱుంగుటకు ముఖ్యకష్ట మేమన ప్రస్తుతము మనము పరదేశకళాసాంప్రదాయముతోడనే పరిచితులమై యుండుట. ఆసాంప్రదాయమున కాధారమైన భావములకును మన సాంప్రదాయమునకు నాధారమైన భావములకును భేదము అపారము, అగాధము. కొన్నివిషయముల నొకటి ఈవలిమొన, ఒకటి ఆవలిమొన, అందుచేఁ గొందఱకు మనకళాసౌభాగ్య మంతయు ఆనందజనకము గాకుండుటయే గాక అసహ్యకరముగను సౌందర్యరహితముగను ఉండు నను టందు నాశ్చర్యములేదు. కారణ మేమనఁగా వారుమనకళలను పరుల కళాసాంప్రదాయము ననుసరించి పరికింతురు. ఆదృష్టి మాఱినఁగాని మనకళలు విలసిల్లనేరవు.

ప్రస్తుత పాశ్చాత్యకళాసాంప్రదాయము పలువిధముల కేవలము నైహికపరంబైయున్నది. ఆశయములందుఁగాని, విషయములందుఁగాని, నిలయమైన భావములందుఁగాని, ఆధ్యాత్మికగుణము విదిత మగుటలేదు. ఇఁక మనకళలయం దన్ననో బాహ్యాకృతియం దెన్ని భేదము లుండినను, అంతరాత్మికముగ నన్నిటియందును ఆధ్యాత్మికభావము నివసించియే యున్నది. ఈవిషయమే యొకరీతిని శుక్రనీతిసారమందును నొక్కి చెప్పఁబడి యున్నది.

దేవానాం ప్రతిబింబాని కుర్యా చ్ఛ్రేయస్కరాణిచ

..................................

అపిశ్రేయస్కరం నౄణాం దేవబింబ మలక్షణం
సలక్షణం మర్త్యబింబం నహి శ్రేయస్కరం యథా.

సలక్షణముగా నుండినను మానవుని ప్రతిమ నొనర్చుట శ్రేయస్కరము గాదట! అనఁగా ఆధ్యాత్మిక భావము నెలకొనియుండనిచో నది దృక్కునకు సంతోషజనకమైనను శ్రేయస్కరమైనది గాదు. ఏకృతి ఐహికాతీతంబో ఆకృతియే యుత్తమము. ఈసూత్రము నెఱుంగనిచేతనే గదా నవీనసాంప్రదాయమగ్నులగు మనవారు సైతము "మనపూర్వుల కేమి వచ్చును? ఎంతసేపును దేవతావిగ్రహములే! చూడుడు. ఐరోపాదేశములను. ఎంత చక్కని వనితల బొమ్మలు! ఆ యవయవ విలసన మెక్కడ! మనవారి వక్రాకారములైన విగ్రహము లెక్కడ!" నని యందురు. ఈభేదమునకుఁ గారణము దెలిసినచో నట్లనరు. మనవారి పూర్వకళలు ముఖ్యముగ దైవసంబద్ధములై యుండినవి. కేవలము మనవారివే గాదు. మనదేశమంతటి పురాతనదేశములవారందఱికళలు నట్లే- ఈజిప్టు, బాబిలోనియా, మొదలగునవి. హైందవకళ లన్నిటియందును, అందునఁ బురాతనకాలమున సర్వసాధారణముగ మతసంబంధము గాని శిల్పమే మృగ్యము.

దైవసంబంధములు ఆధ్యాత్మికపరంబులు నగు విషయములే కళల కాధారము లైనవని చెప్పినంతమాత్రమున హైందవకళాసాంప్రదాయము బోధపడదు. ప్రపంచమున నన్ని దేశములయందును అట్టి విషయములు కళలయందుఁ బ్రకటింపఁబడియే యున్నవి. పురాతన గ్రీకుశిల్పములం దనేకములు వారి దేవతాదిగ్రహములే. మన సూర్యభగవానునకుఁ బ్రతియగు అపాలో- మన రతీదేవికి జోడగు వీనస్- మన దేవేంద్రునకు జతయగు జూపిటర్- మొదలగు దేవతల విగ్రహములనే ఆ శిల్పులు ప్రతిమలొనర్చి గ్రీకుకళాసౌభాగ్యమును పోషించిరి. క్రైస్తవమతము వృద్ధియై ఐరోపాఖండమంతయు వ్యాపించినపుడు ఇటాలియను చిత్రకారులు క్రైస్తుజీవితమునే తమ చిత్రములకు విషయముగ చేసికొనిరి. క్రీ. వె. ౧౨ మొదలు ౧౫-వ శతాబ్దుల మధ్య జీసస్ అతని తల్లి మేరీ ప్రభృతులే విషయముగ రచింపఁబడిన చిత్రలేఖనముల సంఖ్యకు మితియే లేదు. అప్పుడే కాదు. ఈ కాలమున సైతము ఐరోపాదేశమున క్రైస్తవమత సంబంధమైన చిత్రపటములును శిల్పములును లేకపోలేదు. అయినను వీని యన్నిటికిని పురాతన హైందవ శిల్ప చిత్రలేఖనములకును ముఖ్యమైన భేదము లెన్నియో గలవు. దేవతారూపములను ప్రతిమలందుఁ బ్రతిబింబింపఁజేసినపుడు, ఇతరదేశ శిల్పులు మానవరూపములందే అత్యుత్తమావయవలక్షణసౌభాగ్యము పొందుఁబఱిచిరి. అపాలో ప్రతిమకును ఆ కాలమునాటి సుందరపురుషునకును అవయవలక్షణభేదమే యుండదు. గ్రీకుశిల్పులకు దేవతాస్వరూపములనిన మానవస్వరూపములకన్న నతీతములైనవి గావు. వారి భావనాశక్తి యంతటితో నిలిచినది. ఇఁక నిప్పుడు ఐరోపాదేశమున రచింపఁబడు చిత్రము లన్ననో! అందలి దేవతాస్వరూపములు మానవుల యాకారములనుండి ప్రత్యక్షముగ వ్రాయఁబడినవి. ఇప్పటి చిత్రకారుఁడు, గంటకు ఒక షిలింగో రెండు షిలింగులో యిచ్చి యెవరినో యొకరిని కూర్చుండఁబెట్టి చూచి యతని ప్రతిబింబమును రచించి దానికి "జీసస్" అని నామ మిడును. ఇంతయేల, ఐరోపాకళాసాంప్రదాయమునఁ బుట్టి పెఱిగిన మనదేశపు చిత్రకారుఁ డగు రవివర్మ సైతము అదేపద్ధతి ననుసరించెను. పూర్వభారతపద్ధతి పైనిజెప్పినదానికి వ్యతిరేకమైనది. శిల్పిగాని చిత్రకారుఁడు గాని కృతిని రచించుటకు మున్ను మనోదృష్టిని ఆదివ్యాకారమును తదేకాయత్తచిత్తముతో గ్రహింపవలెను. అందులకు నావశ్యకమైనది ధ్యానయోగము. దేవతాప్రతిమానిర్మాణమునకుఁ బ్రథమసోపానము ధ్యానయోగమే!

స్వారాధ్యదేవతాధ్యానైః ప్రతిమా స్తేషు యోజయేత్
ధ్యానయోగస్య సంసిద్ధ్యై ప్రతిమాలక్షణం స్మృతం
ప్రతిమాకారకో మర్త్యో యథా ధ్యానరతో భవేత్
తథా నాన్యేన మార్గేణ ప్రత్యక్షేణాపి వా ఖలు.

—అధ్యా ౪. ప్ర ౪. శుక్రనీతిసారము.

గమనింపుడు! ధ్యానయోగమే అనుసరణీయమార్గము వేరు మార్గమే లేదు. "ప్రత్యక్షేణాపి వాఖలు" పురాతన భారతశిల్పమున కంతయు ముఖ్యాధారమైన యీ మహాసూత్రము నెఱింగినవారు సైతము ప్రస్తుతము మనవారిలో యరుదు. సాధారణముగ మనము వినవచ్చు దేవతావిగ్రహములపై విమర్శన లెట్టివనఁగా "ఇదెట్టి ప్రతిమ! ఇట్టి హస్తములు- ఇట్టినడుము- ఇట్టి నేత్రములు- పాదములు- ఎవరికైన నుండునా? రెండుచేతు లుండవచ్చును గాని నాల్గు చేతులా? ఈవిధ

ముగ నెవ్వరైనను కూర్చుండురా?" అను ప్రశ్నలే. అనఁగా వారి దృష్టియంతయు నైరోపాకళాసాంప్రదాయము ననుసరించినదే. కేవలము స్థూలదేహమే కళలయందు రచింపనగు నని వారి యభిప్రాయము. పంచేంద్రియములకుఁ దెలిసిన భౌతికపదార్థములే కళావిషయములై యుండవలయునని వారి యెన్నిక. భారతసంప్రదాయముల ప్రకారము అట్లు గాదు. ఆధ్యాత్మికచింత మనకు వెన్నతోడఁ బెట్టినది. కాన మన కళలయందు తద్భావములు సూక్ష్మబుద్ధిగ్రాహ్యంబు లైనను ఆకార యుక్తంబులుగఁ బ్రదర్శింపఁబడినవి. కాన నవి భౌతికసూత్రములచే బంధింపఁబడఁజాలవు.

పై సూత్రమున కనుబంధమైన యింకొక ముఖ్యసూత్రమును వివరింపనగును. ఈ సూత్రముకతననే ప్రాచ్యపాశ్చాత్యకళాసాంప్రదాయములకు నత్యంతభేదము సిద్ధించుచున్నది. పాశ్చాత్యకళాకోవిదుల యభిప్రాయమున కళలు అనుకరణములు. హైందవకళాసాంప్రదాయమున కళలు అనుకరణములే గావు. పాశ్చాత్యులచే రచింపఁబడిన ప్రతిమగాని చిత్రముగాని తద్విషయముయొక్క ప్రాపంచిక బాహ్యాకృతి నెంతసమీపించిన నంత గొప్పది యగును. నృత్యము సేయుచున్నట్లున్న వనిత చిత్రమును విమర్శించుటకు ఆధారమేమనఁగా- అట్టిస్థితియందే ప్రకృతియందు వనిత యెట్లుండునో ఆస్థితిని ఈ చిత్రము ఎంత యనుకరించుచున్నది?- అని పాశ్చాత్య చిత్రకారు లెంతసేపును సామ్యము సంపూర్ణముగ నుండుటకుఁ బ్రయత్నింతురు. వారి పద్ధతి యంతయు నదియే. హిమాలయమును చిత్రింపవలయు ననిన ప్రయాణమైపోయి యెదుటఁగూర్చుండి ఫలకముపై రంగులతోఁ జిత్రింతురు. కన్నులపండువగు నా సౌందర్యమును ప్రయాసతో ననుకరింప యత్నింతురు. అనుకరణము మూలము నెంత సమీపించిన నంత సంతసింతురు. చిత్ర మంత గొప్పదగును. వేయేల — ఐరోపాకళాసాంప్రదాయమున అనుకరణము ప్రధానము. ఆసియాకళాసాంప్రదాయమున- అందునను భారతకళాసాంప్రదాయమున - అనుకరణము కళకు అప్రధానము. మఱి యేది ప్రధానము? అనిన- భావము. భావములేనికళ రసశూన్యము, అర్థశూన్యము. ఆనందహీనము. కళకు జీవము నొసగునది అనుకరణము గాదు. భావోత్పన్నమైన సృష్టి. సృష్టిలేనికళ కళయను నామమున కర్హము గాదు. మామిడిచెట్టును ఆకుపిందెలనుండి తూచాతప్పక మూలమునకు సరిగ వర్ణించినచో నా వర్ణన వృక్షశాస్త్రపరమైన వ్యాసము గావచ్చునే గాని కావ్యము గానేరదు. అట్లే ఆచెట్టును ఉన్నది యున్నట్లు పటముపై డింపిన నా చిత్రము కళ గానేరదు. అనుకరణమే ప్రధానమైనచో అట్టి చిత్రమునకును ఫోటోకును భేదమేమి? "ఫోటో యందు పురుషుని శక్తికుశలత్వము కొంతయేనియు లేదు. కాని చిత్రము నందు గలదు. లేనియెడల నందఱును ఆరీతిని వృక్షమును చూచినట్లు వ్రాయఁగల్గుదురా?" అని కొందఱు ఉత్తరపూర్వకముగఁ బ్రశ్నింప వచ్చును. ఆ వాదమువలనఁ దేలిన దేమనగా- అభ్యాస మెంత యెక్కుడైన చిత్రకారుఁడుగాని శిల్పిగాని యంత గొప్పవాఁడగునని. ఏలయన, మూలము ననుసరించి వ్రాయుటకు వలసినవి—అభ్యాసము నేర్పు శ్రద్ధ ఓర్పు శాస్త్రజ్ఞానము. కాని ఇవన్నియు నుండిన కళకుఁ జాలునా? ఒక్కనాటికిఁ జాలదు. కవి- చిత్రకారుఁడు - శిల్పి—వీరిని మనము నుతించి గౌరవించుట పై గుణముల కారణముననా? కాదు. వారి యెడ వీరికిఁ బయింబయిన నొక్క మహాగుణము గలదు. అది సృష్టి ప్రతిభ. స్థూలపదార్థపరంబైన సృష్టి మానవునకు దుర్లభము. మఱి యీ సృష్టి యెట్టిదనిన—భావసృష్టి. భావపూరితమైనదే కావ్యము. శిల్పము. చిత్రము. కట్టి యనుకరణమునకు ఈ గౌరవనామము లర్హములు గావు. ఈ సత్యము ననుసరించియే మన పూర్వకళాకోవిదులు అనుకరణమును శిరసావహింపక, ప్రాధాన్యమని యెన్ని భావోల్లాసయుతంబైన నిర్మాణ శక్తినే పోషించిరి. ఈ సత్యమునే ఇప్పు డిప్పుడు పాశ్చాత్త్యకళా విమర్శకులలో కొందఱు గ్రహించి దాని ననుసరింప సమకట్టుచున్నారు.

కావున మన పూర్వశిల్పములను చిత్రములను పిచ్చిచేష్ట లనియు వక్రము లనియుఁ జేతరాక రచింపఁబడినవనియు విమర్శింపక మున్ముందు యోచింపవలసిన దేమన—వానిని రచించినవారు ఏ యాశయములతో ఎట్టి కళావిషయమును నిర్మింప సమకట్టిరి? ఆ యాశయములు కొనసాగినవా? లేవా? అని. ఈచిత్రములందు అనుకరణగుణము అతిస్వల్పము గాన వీనిని చిత్రించినవారికిఁ జిత్రవిద్య రాదని చెప్పుట అసమంజసము. అట్టి విమర్శనము సత్యదృష్టితో నొనర్చినది కాదు. పురాతన హైందవ కళా సాంప్రదాయమున ననుకరణసూత్రము త్యజింపఁబడినది. అందు ముఖ్యస్థానమున వసించునది భావసృష్టిసూత్రము. ఆ భావసృష్టి సిద్ధించుటకు మార్గము ధ్యానయోగము. ఈ మార్గము దప్పిన వేరు మార్గము శ్రేయస్కరమే కాదు.

దేవతా సంబంధమైన విషయములైన శిల్పిగాని చిత్రకారుఁడుగాని ధ్యానయోగము ననుసరింపఁగలరు. కాని కేవలప్రాపంచిక విషయములపట్టున ననుకరణ ముండవలసినదే కదా యని కొందఱు ఆక్షేపింప వచ్చును. అయినను ఇచ్చోటసైతము పాశ్చాత్త్యకళాపద్ధతికిని మనపూర్వ పద్ధతికిని పైవివరించిన భేద మింకొకరూపమునఁ గలదు. ఏదేని యొకసుందరమగు ప్రకృతి రంగమునో కాక పురుషునో రచింపవలయుననిన నైరోపాచిత్రకారుఁడు వ్రాయఁబోవు విషయముప్రక్క గూర్చుండి అతిజాగ్రత్తతో దాని ననుకరింప మొదలుపెట్టును. హైందవచిత్రకారుఁడన్ననో విషయమును తదేకధ్యానముతోఁ దిలకించి గృహమున కేగి మనోఫలకమున నెలకొనిన ప్రతిబింబమును రచించును. అనఁగా నొకడు కేవలము అభ్యాస కౌశలమును అనుకరణశక్తిని మాత్రము వినియోగించును. ఇంకొకఁడు భావనా శక్తియు సృష్టిప్రతిభను వినియోగించును. మన కళల సౌభాగ్యమును బాగుగ నెఱింగి, అనేక గ్రంథముల రచించి పేరెన్నికఁ గన్న ఇ. బి. హావెల్ గారు తమ హైందవ శిల్పచిత్రవిద్యా చరిత్ర (History of Indian Sculpture and Painting)లో నిట్లు వ్రాసియున్నారు. "నేత్రములతోడనే గాక మనస్సుతోఁ జూచుటకును వస్తువులు ఎముకలు కండలు మాత్రము ప్రధానగుణమును విదితమొనర్చుటకును చిత్రించుటకును — అన్నిటికిని పయింబయిన,

రచించు విషయముయొక్క ఆత్మలో లీనమొంది ప్రకృతినంతయుఁ బరిపాలించు ధర్మమును విశదపఱచుటకును హైందవచిత్రకారుఁడు ఎల్లప్పుడును ప్రయత్నించుచుండును"

పాశ్చాత్త్యకళా సంప్రదాయమునకును పురాతన హైందవ కళాసంప్రదాయమునకును ఎట్టిభేదము లున్నవో కన్గొంటిమి. పై వర్ణించినసూత్రములను పరీక్షించి- వాని యర్థమును గ్రహించి- మన పూర్వకళలను గౌరవించి - తత్సాంప్రదాయము నశింపకుండ ప్రస్తుతమున సైతము ఆ సూత్రములనే ఆధారము చేసికొని - మనకళలను వృద్ధి నొందింప సమకట్టవలెను. ఈ విషయమున శ్రీ అరవిందయోగి వాక్యములు మన్నింపఁదగినవి. "పాశ్చాత్త్యాశయముల మాలిన్యమును- మన కనుకూలము గాని పరదేశపద్ధతులను- మనము త్యజింపవలయును. పురాతన హైందవకళాప్రతిభను పునర్జీవయుతంబుగఁ జేయవలెను. ఆ ధ్యానదృష్టియు, భావోద్రేకమును, ఈ కాలమున సైతము పురాతన సాంప్రదాయముల ననుసరించు కొందఱికడఁ గానవచ్చుచున్నవి. మనవారి ప్రత్యేక ప్రతిభాకౌశలములు — హైందవ నైపుణ్యమును హైందవ జ్ఞానదృష్టియు—నశింపకుండఁ జేయవలయును. దేశమంతయుఁ బూర్వపరిజ్ఞానౌన్నత్యమునకుఁ దెచ్చి బెంపొందఁజేయవలయును—అంతియ కాదు, ఇంకను నున్నతస్థానముఁ జెందవలెను."

# కొండపల్లి దుర్గము

బుద్ధిరాజు హనుమంతరావు గారు

అన్నవేమారెడ్డి । అంతఃపురంబులు, శుకపికాదులకును । జోటు లాయె
ధీరగజపతుల । వారువశాలలు, పలువిధమెకముల । శాల లాయె
శూరవనితల విహారసౌధంబులు, మేటిరక్కసులకుఁ । జోటు లాయె
శిల్పచాతుర్యముఁ జేఁ బ్రకాశించెడి, చిత్రపుమేడలు । శిథిల మాయె
గీ. కోటబురుజుల వరుసలు । గూలిపోయె, పటుఫిరంగుల శాలలు । పాడువడియె
కటకటా! ఎట్టి దుస్థితి । వట్టె నయ్యొ, కొండపల్లి రెడ్డివరుల । కోట కిపుడు!

సీ. గజపతిరాజులు । కరుణతో పాలించు, కోట వానరులకు, । జోటు లాయె
కృష్ణభూపాలుడు । కృపతోడఁ గాపాడు, కోట వానరులకుఁ । జోటు లాయె
అనవేమభూపతి । యనుజులు రక్షించు, కోట వానరులకుఁ । జోటు లాయె
మహామదుషా యను । భామినీరాజేలు, కోట వానరులకుఁ । జోటు లాయె
తే. గీ. రెడ్డిరాజులు గట్టిన । దొడ్డకోట, మేటిటాకులు గల్గిన । మేటికోట
కటకటా! ఎట్టి దుస్థితి । పట్టె నయ్యొ, కొండపల్లి రెడ్డివరుల । కోట కిపుడు.

సీ. గజపతిరాజులు । నిరతము విహరించు, రమ్యంపు టుద్యాన । రాజు లెచటొ
దొడ్డకీర్తిని గన్న । రెడ్డివనిత లుండు, రమణీయ కాంతఃపురంబు లెచటొ
వీరరాజన్యులు । పౌరులతో గూడి, కొలువును దీర్చెడి । స్థలము లెచటొ
వైరివీరుల సులభంబుగా నోడించు నిఱుకైన గూఢపుదారు లెచటొ
గీ. మాన్యవరు లుండు సుందర । మహలు లెచటొ, కానరావు నేఁడు మనకుఁ । గంటికైన
కటకటా! ఎట్టి దుస్థితి । పట్టె నయ్యొ, కొండపల్లి రెడ్డివరుల । కోట కిపుడు.

# ఆర్యభాష - తదుద్ధరణము

కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మ గారు

"నిందతు నందతు వా సన్ అసూయు రనసూయు రత్ర కింతేన యత్సన్మానసగమనాయై వేదం మమతు పాథేయమ్" రామకవి.

భారతఖండము జ్ఞానకర్మ ప్రధానాచారములంబట్టి జ్ఞానభూమి (పుణ్యభూమి) యనియు, కర్మభూమి యనియు రెండుగా విభజింపఁబడినది. ఈవిభాగము సామాన్యలోకవ్యవహారముల విషయమై కాదు. మతాచారవిషయములకే యని తెలియఁదగియున్నది. వింధ్యోత్తరదక్షిణభాగములయందుఁ గనఁబడు నాచారభేదములే పైభావమును స్పష్టపఱచుచున్నవి. ఈయాచారద్వయమందును ఫల మొక్కటియే యైనను స్మృతులనుబట్టి పరికించినపుడు ఫలము సమము కాదని తోఁచును. వింధ్యదక్షిణభాగము, కర్మభూమిగాఁ గీర్తిగాంచినది. శ్రౌతకర్మములయం దంతటను ఆచార మొక్కటియే యైనను స్మార్తకర్మకలాపమునందు దక్షిణోత్తరభాగవాసులకు మిక్కిలి భేదము లగుపడుచున్నవి.

ఈభాగద్వయవాసు లగు హిందువులు మతాభిమానము గలవారే గాని మత మనునది నామమాత్రమని భావించువారు కారు. మతసూత్రనిబద్ధులౌటచేతనే ఆచారమున నించుమించుగా శ్రుతిస్మృతి పురాణములను బ్రమాణముగా గ్రహించుచున్నవారు. కావున భరతఖండమం దంతటను మతము ప్రధానమైనది. ఆచారవ్యవహారములును తదనుగుణములుగా నడచుచున్నవి. ఐహికమునకన్న నాముష్మికము ప్రధానమని వీరికి నమ్మకము గలదు. కాఁబట్టి పుణ్యపాపములు తత్ఫలానుభవములు మొదలగువానిం దెలుప శ్రుతిస్మృతిపురాణాదు లవసరము లైనవి.

శ్రుతిస్మృతిపురాణాదిసద్గ్రంథములు ఏకాలమున బుట్టినవి? కర్తలెవరు? అను నీమొదలగు చప్పిడిచర్చలయందు వీరికి వాంఛ యంతగా లేదు. ఆచర్చలవలనఁ బురుషార్థ మించుకంతయు లేదనియు, వృథాకాలక్షేపము చేసినట్లగుననియు, అద్దాని కంగీకరించినను దానఫలము శూన్యమనియు, అంతమాత్రమే గాక నాస్తికత జనించుననియు, పరమున్నదనుట సంశయముగా మార్పునొందుననియు నిహఫలములే ప్రధానము లనుభావము స్థిరపడవచ్చుననియు నతీంద్రియవిషయములం దెల్పు సద్గ్రంథముల విషయమై యిట్టిచర్చలు చేయకుండుటయే యుక్తమనియు వీరి ముఖ్యవాంఛ.

ఎప్పుడేనొకప్పు డిట్టిచర్చలు వచ్చినను సమాహితచిత్తంబులవానిం బాటింపక సత్కర్మానుష్ఠానమును బోధించు నవ్వానియందు మిగులఁ బూజ్యబుద్ధి నెలకొల్పుకొనుచుందురు. ఇట్టియాచారము సాగుచుండుటంబట్టియే రాజద్వేషము లోనగు క్రూరగుణములు వీరియందుఁ దోఁపవు. అష్టదిక్పాలకాంశసంభూతుఁడే ప్రభువని భావించుచుందురు. దీనికిం గారణము ప్రాచీనగ్రంథగౌరవమే యని చెప్పుట కావంతయు శంకయుండదు.

ఇంతియ కాక ఆగ్రంథపఠనము లోనగువానివలన భక్తిజ్ఞానములు కుదిరి, బాహ్యప్రపంచానుభవములు బుద్బుదప్రాయము లనియు నాంతరంగికానుభవములు శాశ్వతము లనియుఁ దోఁచి వీరిని సన్మార్గప్రవర్తకులనుగాఁ జేయుచున్నవి. పునర్జన్మాదిసిద్ధాంతములు శ్రుత్యాద్యర్థపరిజ్ఞానమువలననే కలిగినవి. ఈవిషయములఁ బూర్వ మితరఖండవాసులు నిందించినను ఇపుడిప్పుడు శిరసావహించుచు నమ్ముచునే యున్నారు. భరతఖండమతగ్రంథములు ఖండాంతరుల అఖండగౌరవము గాంచుచున్నవి.

భరతఖండవాసులు అనఁగా హైందవులు- మతనిబద్ధు లనుట నిర్వివాదాంశము. మతధర్మముల నుల్లంఘించువారు కొంద ఱుండకపోరు. మొత్తము మీఁద మతధర్మముల నొకరీతి నాచరించుచునే యున్నవారు మెండు. దానఁ గ్రూరకృత్యములయందు భీతి దోఁచుటయే సత్ఫలము. భూతదయ గలుగుటకన్న గొప్పగుణ మేదికలదు?

మతగ్రంథము లనఁగా శ్రుతిస్మృతిపురాణేతిహాసాదు లని యర్థము. ఏ యితిహాసము చదివినను గథారూపమున నొకధర్మమును గ్రహింప వీలగునే కాని వేఱు కాదు. ఆగ్రంథము లన్నియు నొకభాషతోనే వ్రాయఁబడినవి. ఆభాష యేవిషయమునఁ గాని లోపభూయిష్ఠము కాదు. మనుష్యనిర్మిత మిట్టిదొకటి యుండునా యనునంతటి యాశ్చర్యమును బుట్టించుచుండును. చతుష్షష్టివిద్యలు దీన్ని బద్ధములు. ఆభాష దేవభాషయే యనుపేరొందినది. పదములలోపమా? లేదు. అది సముద్రమువంటిది. తక్కినభాషల కది మాత. వికారమును బొంది నానాత్వముగ నదియే ప్రసరించుచున్న దనవచ్చును. కాని యట్లనుట దాని కొకకళంకమును దెచ్చిపెట్టిన ట్లగు. నిస్సారములగు పదములుగల తక్కినభాష లెక్కడ? ఇక్షుఖండమువలె సర్వత్ర రసనిబద్ధపదవిలసనమున వెలయు నాభాష యెక్కడ? అది విరాట్పురుషునితోఁ బోల్పఁ దగినది. సాటిలో ననన్వయాలంకారమున కదియే యుదాహరణము.

ఆభాషను దేవభాష యని వాడుచున్నారు. ఇటీవల కొందఱు మహర్షికల్పులు దానిని భాగద్వయముగ నొనరించి యొకభాగము వేదప్రతిపాదక మని, తక్కినది ఇతరగ్రంథప్రతిపాదక మని వ్యవస్థ యేర్పఱచినట్లు కొందఱిమతము. కాననే సంస్కృతమని దానిని వాడుచున్నారందురు. ఆయుక్తుల కేమిగాని ప్రాకృతాదిభాషలనుండి సంస్కరింపఁబడినది గాన నాపేరు గల్గెననుట బాగున్నయది. అయితే సంస్కృతమను వాడుకలోనున్న భాషకు వేదభాషకు చాల భేదము గలదు. దీనికున్న వ్యాకరణము దానికిఁ జాలదు. దానివ్యాకరణము వేఱు. కాఁబ

ట్టియే దేవభాష. రెండుభాగములుగా నొప్పుచున్నను సమానగౌరవమును బొందుచున్నది. వేదము పఠనమునఁ బుణ్య మొసంగునన్న విఖ్యాతి నొందినది. తక్కిన స్మృత్యాదులు పఠనము అర్థావబోధము అనువానివలన సత్ఫలము నొసంగునవి యని విఖ్యాతి నొందినవి. ఈరెండు భాగములకు దేవభాష యని పేరు.

ఖండాంతరవాసులు గూడ ఈగీర్వాణము నభ్యసించి యిందలి సద్గ్రంథములం బఠించి వానిని దమభాషలోనికి మార్చుకొని లోకాద్భుతకరకృత్యముల నొనరించి ప్రఖ్యాతి గాంచిరి. కాంచుచున్నారు. కాంచగలరు. అట్టివా రందఱు దీనిని మాతృదేవతనుగాఁ బూజించుచు నానందాంబుధి నోలలాడుచుండఁగా మనము వీనులార నావార్తల నాలకించుచు-నట్టిమాన్యులం జూచుచు-వారు రచించిన గ్రంథములఁ జదువుచు నున్నారమే కాని వారి కున్నంతగౌరవము మనలోఁ జాలమందికి లేదనుట నిక్కము. కొందఱు సభలలో నభిమాన మున్నదనుట వెల్లడించుచుందురు గాని తత్పఠనమున నిరుత్సాహులే. కొందఱద్దానిని బహిరంగముగా దూషించుచు నుందురు. కాని ప్రకృతము ఆగీర్వాణభాషామతల్లి కీసృష్టియం దెల్లయెడలఁ దనమహామహిమను ప్రకాశింపఁజేయుచు ననన్యసామాన్య విఖ్యాతిచే నలరారుచున్న దనుట సాహసమా ?

భరతఖండమున కేమాత్రము గౌరవము గల్గినను దానినుండియే కాని వేఱుకారణమునఁ గాదు. సాధారణ ప్రాపంచిక విషయముల వలన విఖ్యాతి గల్గుట యట్లుండ నిహపరములలో రెండవ దేమిటి? యని ప్రశ్నించువారిని గూడ "నిహము ననిత్యము, పరమే శాశ్వతము" అను నభిప్రాయము గలవారినిగా మార్చినది. నాస్తికులను ఆస్తికులనుగా నొనరించినది. ఇంతకన్న వే ఱుదాహరణము లేల?

హిందూమత మనఁగా నతితుచ్ఛ మను దురూహ దూరద్వీపనివాసులకుఁ గల్గియుండెను. కాననే వారు నవీనమగు తమ మతమే శ్రేష్ఠమని నమ్మి దీనిని బలువిధములఁ దోఁచినటు దూషింపసాగిరి. అంతతో బోక వీరిని వారిమతములోఁ జేర్చుకొనం బ్రయత్నించిరి. మతగురువులను బంపిరి. కాని వారి కాముష్మికజ్ఞానము శూన్యము. అయినను చాల శ్రమ పడి వారును దమది సత్యమత మని బోధించుచు రామకృష్ణాద్యవతారములను దమ కుయుక్తులతో దూషించుచు నుపన్యసించుచుఁ గాలము గడపుటయేగాక కొందఱను దమమతములోఁ జేర్చుకొనిరి దీనిచే వారికి మఱింత యుత్సాహము కలిగి హిందూమతము మతమే గాదని గట్టిగా బల్లలు గ్రుద్ది యుపన్యసించు నవకాశము గలిగెను.

కాని ఇది భగవంతుఁ డోర్చునా? దేవభాష యంగీకరించి యూరకుండునా? కొలఁదికాల మిట్లు జఱిగెను. అంతట భరతఖండమున నొకమహాత్ముఁ డుదయించెను. దేశాంతరభాషాకోవిదుఁ డయ్యెను. మతము నుద్ధరించి దీనిప్రాశస్త్యమును ఇతరులకుం దెలుపు నభిప్రాయము గలవాఁ డయ్యెను. కాని యీభాషారహస్యవిషయజ్ఞాన మాస్వల్పవయస్కాలమున కెట్లు లభించును?

భగవంతుఁడే యీదారిం ద్రొక్కుమా యని యాసజ్జనశేఖరునిం బ్రోత్సహించెను గాఁబోలు. అట్టితఱి నాతరుణుఁ డొకయోగిశేఖరు నాశ్రయించెను. అదియుఁ గొలఁదికాలమే కుదిరెను. ఆయోగియుఁ గపటయోగిశిఖామణి గాఁడు. సత్యయోగి. ఈశిష్యుఁ డెందులకుఁ దన్నాశ్రయించెనో ఆతఁ డెఱుఁగును. కాఁబట్టి యీయంతేవాసిని జూడఁగనే భగవదిచ్ఛ యిట్టిదని గ్రహించి సనాతనపూజ్యతమమతమునకుఁ గలిగిన కళంకమును దీర్చుట సముచిత మని నిశ్చయించి - మతసార మగు యోగము నుపదేశించెను. భగవదిచ్ఛతోడ్పాటుగ నున్నది గాన నచిరకాలమందే యీశిష్యుఁడు దానఁ బరిపూర్ణుఁ డయ్యెను.

అంతట నీశిష్యుని లెమ్ము పొమ్మని భగవదిచ్ఛ పురికొల్పసాగెను. కాఁబట్టి ధనహీనుఁ డైనను దక్షిణదిగలంకార మగు నొక రాజధానిం జేరి యచ్చటి సజ్జనశేఖరుల సాయమున నాఖండమునకుం బోయెను. అప్పు డందొక మహాసభ సాగుచుండెను. అందు మతవిషయములే ముఖ్యముగ నుపన్యసింపఁబడుచుండెను. ఈయోగిని జూచినప్పు డచ్చటి వా రెల్ల నవ్విరి. హిందూమతోపన్యాసకుఁడు! అని తలలూచిరి. దూరదేశమునుండి వచ్చినాఁ డన్న గౌరవముచేత నాలుగుమాటలు మాటలాడనిత్త మని ఇంచుక సమయ మొసంగిరి.

శిష్యుడు పీఠము నెక్కెను. సమయము కొంచెమని సంశయింప లేదు. గురుకృపాతరంగితాంతరంగుఁడు, గాన భగవత్కృపాపాత్రుఁడు గాన-ఝంఝామారుతమురీతి- నుపన్యసింపసాగెను. ఆవాగ్ధోరణి-త్రిభువనజననియన నొప్పు దివిషన్నదివలె-ననన్యాదృశమై-వెలసెను. వా రెల్లరుఁ జేష్టలు దక్కి యూరక వినుచు నిదియేమి ధాటిరా తండ్రీ యనుకొనసాగిరి.

ఇంతతో ముగిసినదా కేళిక. పరీక్షకు లొంగవలసి వచ్చెను. యోగపరీక్ష యనఁగా వదరుటయే కాదు. వాయునిరోధాదులు చూపఁదగినవి. కేవలోపన్యాసకుల కది సాధ్యమా? ఆయోగి యాయోగపరీక్షయం దాఱితేఱెను. వారి కత్యాశ్చర్యమును కల్గించెను. వారును ఇట్టి మహనీయవిషయములు హైందవమతమునఁ గలవా యని విస్మయంపడి తచ్ఛిష్యులైరి. దేవభాష నభ్యసించి యందలి గ్రంథములఁ బఠించినఁ గాని యామతము కనుఁగొన నవకాశ ముండదని నిరంతరముగ తత్పఠనాసక్తులైరి.

క్రమక్రమముగా దానింబఠించి పునర్జన్మాదు లగు సిద్ధాంతముల నంగీకరించిరి. ఇందలి గ్రంథరాజములఁ దమభాషలోనికి మార్చుకొనిరి. రసగ్రహణపారీణులు గాన నిపుడిపుడు హిందూమతమును దూషించుట పాడిగా దని గ్రహించిరి.

ఇట్టి యుత్కృష్ట గ్రంథరత్నాలంకృత యగు గీర్వాణభాషను మృతభాషయనుట కన్న గొప్పతనము వేఱేమున్నది. ఏదేశమున నా దేవభాష విహరించు నవకాశ ముండునో ఆదేశము కళావంతముగ నుండును, లక్ష్మి యందే స్వేచ్ఛగా నాడుకొనుచుండును. ఆభాష కేదేశమున గౌరవము లేదో ఆదేశమునఁ దృప్తియుండదు. లక్ష్మి యూగులాడుచుండును, కళలు నశించును. కాఁబట్టి దేశాభివృద్ధిని గోరువా

శాభాషకు చేయూఁత నొసంగి గౌరవించుచుండవలయును. గౌరవమనునది మాటలలో గాక మనోవాక్కాయములచే కనఁబఱుపవలయును. అట్లు చేయ నంగీకరించనో తత్ఫలము క్రమక్రమముగా స్పష్టమగుచుండును.

భరతఖండమున నెందరో పండితులు గలరు కదా యనవచ్చును. నిజమే. పండితులుగలరు. కాని వారికి గౌరవ మెచ్చట? కొందఱు పండితు లుండినఁ జాలదు. దేశభాషవలె నావాణికిఁ బ్రాముఖ్యస్థాన మొసంగవలయు. అప్పు డన్నిగ్రంథములు పఠనార్హములై మహోపకారము చేయఁజాలును. మతధర్మములు ఎల్లరకుఁ బట్టుపడును. శీల మలవడును.

వంగదేశమున నిపుడు తక్కుభాగములకన్న నాదేవవాణికిఁ దాపు విశాలబుద్ధితో నచ్చటివా రొసఁగినట్లు కనుపట్టు. జనసామాన్యమున కుపయోగములగు పరీక్షలు వివిధవిషయములలో నున్నవి. నవద్వీపమునందును, ఢక్కాయందును దానికిఁ బరీక్షలు గలవు. నిర్బంధములు లేవు. ఇచ్ఛానుసారము తోఁచినవిషయములఁ జదివి పరీక్షకు వెళ్లవచ్చును. క్రమక్రమముగా భాషాపాండిత్యము సంపాదించుకొనవచ్చును. అట్టియవకాశము లందుండుటంబట్టి యాప్రాంత్యముల జనులలోఁ జాలమంది సంస్కృతమును బఠించుచున్నారు. ప్రాచీనగ్రంథము లన్నియు వృద్ధిదశయం దున్నవి. ఆపరీక్షలు దొరతనమునకే సంబంధించినవి కావు. విద్యార్థి యెచ్చటఁ జదివినను జదువవచ్చును. పరీక్షాస్థానములు పెక్కు లున్నవి. పరీక్షాకాలమున విద్యార్థులకుఁ బెక్కుసదుపాయము లానగరవాసులచేఁ జేయఁబడును. ఇంతియకాక ఉపాధ్యాయునకు గౌరవము కలదు. గౌరవ మనఁగా మాటలచేతఁ గాదు. ద్రవ్యరూపముగఁ బరిణమించును. కాఁబట్టి యొక్కొక్కరు పెక్కుమందివిద్యార్థుల సిద్ధపఱచి పరీక్షలకు బంపుచున్నారు.

ఈపద్ధతినే దొరతనమువారు నవలంబించిరి. పరీక్షలను సకలశాస్త్రములలో నేర్పఱచిరి. వయోనియమ మక్కఱలేదు. ఎచ్చటఁ బఠించినను బఠింపవచ్చును. పరీక్షలో కృతార్థుఁ డైనం జాలును. ఉపాధ్యాయగౌరవ మాదొరతనపుఁ బరీక్షలలో జరుగుచున్నది. ఇట్లుండుటఁబట్టి యందు దేవభాష విశేషముగా వ్యాపించినది. జనసామాన్యమున కద్దానియందు మిగుల గౌరవము కలదు. దాన నవీనగ్రంథములు వెలువడుచున్నవి. ప్రాచీనగ్రంథములకు నవీనవ్యాఖ్యలు చేయఁబడుచున్నవి. అవి పాఠ్యగ్రంథములుగ నేర్పఱుపఁబడుచున్నవి. దాన విద్యార్థులకు నుపాధ్యాయులకు నుత్సాహము గలుగుచున్నది.

దక్షిణదేశమున నాపద్ధతి గానరాదు. పండితాఖండలు గలరు. ఏమిలాభము? సభలో వాక్పారుష్యమును జూపుదురు. గ్రంథరచనకు వారి కవకాశము బొత్తిగా లేదు. వారి కాపాండిత్యము కష్టజీవికకాధారమగుటఁ బట్టి విసుగు గలుగఁజేయుచున్నది. కాశ్యాదిమహానగరములకుం బోయి చదివివచ్చుట తగ్గుచున్నది. అట్టిపండితులు మరణించినవెనుక వారివంటివా రుండుట చాల తక్కువగాఁ గనుపట్టుచున్నది.

దొరతనపుఁ బరీక్ష లున్నను నియమములు మెండు. దాన దేవభాష యెల్లరకు సులభసాధ్యము కానేరదు. దానిచే లాభముగూడ నంతియే. పరీక్షలు విద్యార్థులకు ప్రోత్సాహము నొసగుచుండవలయు. అబ్బా యనిపించరాదు. కాఁబట్టి నవద్వీపాదుల పరీక్షలవలెఁ బ్రజలే యొకసభ నేర్పఱచి పరీక్షలు చేయవలయును. పరీక్షాస్థానములు విశేషముగా నుంచవలయును. అచ్చటి సత్పురుషు లాకాలమున నుచితముగ నన్నదానము చేయునట్టి పద్ధతుల నొనరింపవలయు. పరీక్షాగ్రంథములు జనసామాన్యమునకు భాష యలవడఁజేయునవిగా నుండవలయు. తర్కవ్యాకరణములే గాక యితరశాస్త్రములు, స్మృతులు, పురాణములు గూడ పరీక్షలో నుండవలయు. పరీక్షకు విద్యార్థులను బంపువారికి ద్రవ్యగౌరవరూపమగు బహుమానము- విద్యార్థులకు బిరుదము- లుండవలయును.

దేవభాషతోఁటి దేశభాషయు నించుక పఠనార్హముగ నుండవలయు. పరీక్షలనఁగా విద్యార్థి క్రమముగాఁ బఠించి యుత్తీర్ణుఁ డగునట్లుండవలయు. ప్రతివిషయమునందును మధ్యమోత్తమోత్తమ పరీక్షలుండవలయు. బిరుదములు నట్టివియుండవలయు. తొలిపరీక్షకుం బోవుట విద్యార్థికి సులభతమముగను, రెండవది సులభముగను, మూఁడవది యించుక కష్టముగ నుండవలయునే గాని మనస్సు చెదఱునట్లు, గుండెలు బ్రద్దలగునట్లు, ఉత్సాహమడుగంటునట్లు ఉండరాదు. ఇట్టి యేర్పాటులు చేసినయెడల దేవభాష పెక్కుముఖముల నావహించి విహరింపఁగలదు. మతగ్రంథములు వృద్ధి నొందఁగలవు. దాన నైకమత్యము సద్బుద్ధి సత్ప్రవర్తనము, గురు దేవతాభక్తి వృద్ధినొందఁగలవు. అప్పు డాదేశస్థితి పొగడఁదగియుండును

మనలో నెన్నెన్నిరీతులనో ధర్మములను జేయుచున్న మహనీయులు గలరు. అట్టివా రీవిషయము నాలోచించినట్లు కనుపట్టదు. ఈధర్మమున కారంభింతురేని సకలహైందవధర్మములు చక్కఁగా నభివృద్ధి నొందఁగలవు. ఎంతకాలము దీనిం దృణీకరింతురో యంతకాలము ప్రాచీనధర్మములు వృద్ధి నొందఁజాలక పోవుటయే గాక నశించుచు నుండును. ఇంతియే గాక స్వమతాభిమాన మడుగంటును. కుబుద్ధు లెక్కువయగును. గురుభక్తి దేశభక్తి రాజభక్తి దైవభక్తి తగ్గుచుండును

కావున నాంధ్రమహాజనులారా! మనదేశమున సంస్కృతాంధ్రపరీక్షలు మహాజనుల పక్షమున జేయుట కేర్పాటు లొనరింపుఁడు. పండితులు వృద్ధియగుదురు. ప్రాచీనసద్గ్రంథములు వృద్ధినొందును. ప్రతిజాతివారును సంస్కృతాంధ్రములలో గొలదిగనో గొప్పగనో పాండిత్యము సంపాదింపఁజాలుదురు. దానఁ బ్రజలయందు మతాభినివేశము పాదుకొనును, దానిచే సత్ప్రవర్తనము బాలుర కలవడును. సకలవిద్యలు కళలు మనదేశమున విహరింపఁగలవు. అంతకంటెఁ బురుషార్థమేది కావలయును. ఇదియే స్వరాజ్యసంపాదనమునకు గాని స్వారాజ్యసంపాదమునకు గాని అనువగు త్రోవయని మనవి.

# మతము - సంగీతము

విఁజమూరి వరాహ నరసింహాచార్యులు గారు

శ్లో. చైతన్యం సర్వ భూతానాం వివృతం జగదాత్మనా, నాదబ్రహ్మ తదానన్ద మద్వితీయ ముః ౘ

శ్రీయఃపతి సంకల్పమాత్రంబున నిఖిల చరాచర ప్రపంచంబును స్వేదోద్భిద జరాయ్వణ్డజములను నాలుగువిధములచే సృజించెను. అందు మానవ కోటి తక్కుంగల ప్రాణులకన్న జ్ఞానమనుశక్తిచే నుత్కృష్టతను పొందినది. జ్ఞానాభివృద్ధివలన సదసద్వివేకచతురులై వేదాంతయుతమతప్రవర్తకులై శ్రీమన్నారాయణుని చేరుదురు. ఇట్టి జ్ఞానావలంబనకరము లగు విద్యలందు ఆధ్యాత్మికతత్వనివేదనసమర్థంబగు విద్యలలో సంగీతవిద్యయనున దొకటి. భగవంతుని యనంతలీల లనుభవింపఁజేయు నీవిద్యాప్రభావ మెఱింగిన మహానుభావులుండ నేనీవ్యాసమును వ్రాయగడంగుటకు మన్నింతురు గాక!

సంగీతమునగల మహాశక్తి ప్రపంచమున నీశ్వరుని భావరాగముల నుద్బోధించుటయే! మానవునిమాటయేల? గోవులు సర్పములు మున్నగు జ్ఞానవిహీనజీవులే సంగీతమునకు వశము లనుమాట మఱువ నగునా? పాములు నాగస్వరమున కెట్లు తల నుంకించుచు పాములబట్టువాని కెట్లు వశము లగుచున్నవో మనము చూచుటలేదా? మురళీనాదప్రభావవశమున గోవులు శ్రీకృష్ణుని బరివేష్టించి యమాయికానంద మనుభవింపగలిగిన వని పురాణవిదితము. తోడిరాగప్రభావమును వర్ణించుచు "దవ్వుననున్న వివిధస్థానములనుండి లేళ్లు వినుటకుఁ బరువిడి యద్దాని విని"నట్లు సంగీతగ్రంథముల వ్రాయబడినది అసత్యమా? మృగాదులమాటయే యిట్లుండ జ్ఞానాతిశయముగల మానవకోటి సంగీతమునకు వశులగుదురన్న నాశ్చర్యమేమి? రాళ్లు మున్నగువానిని సైతము కరగించుశక్తిగల సంగీతము మానవుని భావరాగముల సరికట్టి శాశ్వతానందమున నుంచుననుట వింత యగునా? నవరసయుతమైన నాదము మానవుని నిశ్చేష్టితునిగఁజేయఁజాలకఁ బోవునా? వీణెమాటయేల? నాగస్వరపు ధ్వనిని వినినంతనే ప్రశాంతమగు నానంద మెవరికి కలుగదు? కావుననే ఎట్టి శుభకార్యములందైనను మంగళకరమైన ఈ వాద్యమునే మనవారు వాడుచుండిరి. పిల్లనగ్రోవియొక్క చల్లని వెన్నెలవంటి నాద మెంత సుఖముగనుండును యుద్ధసమయముల భేరీపటహడిండిమ దుందుభి శంఖాది వాద్యముల ప్రభావము వర్ణనాతీతము. శత్రువులకు దనప్రాణముల నర్పించుటకు వెరువనంతటి త్యాగశక్తి దేశోద్ధరణదీక్ష కలుగఁజేయున దీసంగీతమే!

సంగీతము మానవుల మనస్సుల నరికట్టి సత్స్వభావమునుద్బోధించుశక్తికలది. కావునఁ బ్రతిజాతియు బ్రతి మానవుఁడు దమతమ మతానుసారము ఈవిద్యకు వశులై యద్దానిని దమతమ మతము స్థిరత్వము వ్యాపకముపొందుటకై యుపయోగించుచుండిరి. భారతీయులు ప్రధమమునుండియు నీవిద్యను యాధ్యాత్మికభావమునఁ బ్రాధాన్యమిచ్చిరే కాని భౌతికవిషయములఁ గాదు.

శ్లో. గాయం శ్చరి ప్రాణి రథాంగపాణేః
స్మృత్యా న్నిరస్తా ఖిలకర్మబంధః
నిరంకుశ స్సర్వసమో విరాగీ
కైవల్య మభ్యేతి ముకుంద భక్తః.

అను నారదస్మృతివలన సర్వవస్తువులందు వాసుదేవభావనచేతను మనోవాక్కాయ కర్మలచేతను దేవుని భజించునట్టి భక్తిని బోధింపదగు మోక్షసాధనము సంగీతమున కన్న వేరు లేదని తెలియుచున్నది. గాన విద్య రాగద్వేషాదుల నరికట్టి నిశ్చలభక్తిని బురిగొల్పి భగవత్సాక్షాత్కారమునకు హేతువైనది. కావున మతమున కిది కూడ నావశ్యక మగుచున్నది.

ఇట్లే పాశ్చాత్యులుకూడ దమతమ దేవాలయములలో నేమి ప్రార్థన మందిరములలో నేమి సంగీతమునుపయోగించుచుండిరి. గానమును వినుచుండినంతకాలము మనస్సునకు స్థిరత్వము ఏకవాంఛ ఘటిల్లును. కావుననద్దానిఁ బ్రతిజాతియు మతసంరక్షణకు కొఱకుపయోగించుచుండి రనవచ్చును. తదితరజాతులకన్న భారతీయులు ముందునకు జని లోకము లన్నియు నాద బ్రహ్మవశము లని కనుఁగొని—"ఓంకారప్రభవా స్స్వరాః, ఓంకారప్రభవా వేదాః ఓమిత్యేకాక్షరం బ్రహ్మ

అను మున్నగువానిని నిర్దేశించి పరమాత్మయన నోంకార స్వరూపమే యనియు నాదోపాసన ప్రణవవిజృంభణమే కావున నాదమునకు బరమాత్మకు భేదము లేదనియు జెప్పుచుండిరి.

శ్లో. కావ్యాలాపాం శ్చ యేకేచి ద్గీతాని సకలానిచ
శబ్దమూర్తిధర స్యైతే విష్ణో రంశా మహాత్మనః.

అని శ్రీ విష్ణుపురాణమున జెప్పబడినట్లు శబ్దరూపకమైన కావ్యములు సంగీతము భగవంతుని యానంద మొనగూర్చునని తెలియవలయు. ఇట

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్"

అనుటచే నానందమనఁగ బ్రహ్మానుభవమే కావున మతము మానవుని శాసించి భగవంతునిజేరునట్లు చేయుపనినే సంగీతముకూడ చేయుచున్నదని తెలియవలయును.

ఇట్లీ గానవిద్య మానవునకు పరమాత్మానుభవము కలిగించి శ్రీమన్నారాయణుని సాన్నిధ్యముఁ బ్రసాదించును. కావున మత మీా సంగీతము నొక యాధారముగ జేసికొనిన దనవచ్చును. ఎట్లన జీవాత్మకు ప్రకృతి సంబంధములో మంచి జ్ఞానముతోఁ గూడిన మనుష్యశరీరము తటస్థించినప్పుడు భగవద్ధ్యాన భగవదారాధనాది సత్కర్మలే చేయవలయునని ప్రతిమతము బోధించును. ఇట్టివానిచే భగవత్ప్రాప్తియే పురుషార్థమని వ్యక్తమగుటచేత నాదమున చిత్తవృత్తుల భోగ్యవిషయములందు ప్రవర్తింపనీయక పురుషార్థ ప్రాప్తికరముగ నగుటచేత నీపనినే నెఱవేర్చుచున్నదగుటచే మతమున కిదికూడ సహకారి యగుచున్నది. కావుననే శ్రీ శంకర రామానుజాది మతప్రవర్తకులేమి- చైతన్య తులసీంద్రులు మొదలగుతత్త్వవేత్తలేమి- త్యాగరాజు మొదలగు భక్తవరు లేమి గానము నాధారముగ జేసికొని తమతమ మతములను విజృంభింపజేయగలిగిరి. శ్రీమద్రామానుజాది మతప్రవర్తకులు పాశురములు మున్నగు భక్తితత్త్వకీర్తనములను ద్రావిడమున గానముచేసి మార్గావలంబకులైరి. 15-వ శతాబ్దమున చైతన్యుఁ డుత్తర హిందూస్థానమునందు తనసంగీతకౌశల్యముచే భక్తిప్రబోధము గావించెను. రామాయణతత్త్వమును పాడి హిందీ లోకమునకు మార్గదర్శకుడైనట్టి తులసీదాసు నెవ రెఱుగరు? భారతీయులవలె- హెబ్రూలు- చైనాదేశస్థులు- పారసీకులు- జపాను మున్నగు దేశములవారుకూడ సంగీతమును ప్రార్థనస్థానములం దుపయోగపఱచియో భగవత్సంబంధములైన కీర్తనములచేతనో సృష్టికర్తను తెలియుటలో పరమోపకారకమైనదిగ నిప్పటికిని యెంచుచున్నారు.

ఇక సంగీత మెట్లు భగవద్ధ్యానకర మగుచున్నది యను మానవుల చిత్తవృత్తులను భౌతికవిషయములందు బ్రవేశింపనీయక యుత్కృష్టమైన భగవ దనుభవజ్ఞానదాయినియై మానవుని భగవత్సాన్నిధ్యమునకు గొంపోవు మార్గములలో ప్రణవోపాసన మొదలగు సాధనములకన్న నీ సాధన మెట్లు ప్రాధాన్యమైనదియును తెలిసికొందము. జీవునకు స్థూలసూక్ష్మ కారణములను మూఁడు శరీరములు కలవు. ఒకపాత్రలో కొంచము నీళ్లుపోసి దానిలోఁ జక్కెర వేసిన నది కరిగిపోవును. ఆనీటిలో గుడ్డ నద్దిన గుడ్డ తడిసి ఈ తడిగుడ్డలో నీరున్న నీటిలో జక్కెర యున్న వ్యాపించియుండును. ఇట్లే స్థూలశరీరము స్థూలపంచభూతములచే నేర్పడియుండును. సూక్ష్మశరీరము సూక్ష్మమగునవియును - స్థూలశరీరపువానికన్న శీఘ్రగమనము కలిగినవియును- అగు అణువుల తరంగములచే నేర్పడియుండును. కారణశరీరము సూక్ష్మశరీరముకంటె నతిసూక్ష్మమై స్థూలసూక్ష్మశరీరములందు తడిగుడ్డనీటిలో జక్కెర నిండియుండునట్లు వ్యాపించియుండును. సూక్ష్మశరీరమందు స్థూలపదార్థములలో కఠిన పదార్థములు ద్రవపదార్థములు వాయుపదార్థములు ఆకాశపదార్థములు (Ethers) అనునట్టి పరిణామములు గల వివిధ సూక్ష్మపదార్థము లన్నియును చేరియుండును. ఈ వివిధ పరిణామములుగల అణువులు వానివాని గమన వేగమున సంచరించుచు సంగీతపు అణువుల కదలికవలన నేర్పడిన కెరటజాలముల జక్కఁగ గ్రహించుచుండును. ఇట్టివి స్థూలమగున (Coarser) వాశాబద్ధములుగను సూక్ష్మమగునవి ప్రేమాబద్ధములుగను అగుచున్నవి. పదార్థపణువులగను చలనమువలె చిత్తవృత్తులు చలించును. కావున సూక్ష్మభూతపణువుల గమనమువలన చిత్తవృత్తు లేర్పడుటచే శ్రోత సంగీతమునగల భావరాగము లనుభవించును. కావుననే సంగీతము మానవుని చిత్తవృత్తుల నరికట్టి తన భావరాగముల నుద్బోధింపగలుగుచున్నది. మానవుని కర్ణము భౌతికమందుగల గాలినుండి వచ్చిన శబ్దతరంగములను మాత్రమే వినగలుగును. కావున నియ్యది దివ్యదృష్టికి మాత్రము గోచర మగును. పెక్కు స్వరసమూహములు పలుకునప్పుడు కదలికగల పెక్కుతరంగము లుద్భవించును. వీనిని సూక్ష్మశరీరపు స్థూలభూతపు అణువు లనుభవించు

ను. శ్రావ్యమైన శ్రుతులమాత్రము సూక్ష్మశరీరపు సూక్ష్మభూతపంచకము లనుభవించును.

ఇట ధ్వని శ్రుతులు వీనికిగల భేదమును తెలిసికొందము. నియమానుసరణము కానివియును కలసినవియును అగు శబ్దతరంగములవలన నివి కలుగును. రైలుబండి పోవునప్పుడు కలుగున దీ ధ్వనియే. ఇట్టిధ్వని చెవికి కఠోరముగ నుండును. కాని శ్రుతి నియమముగలవేగముతోను శ్రావ్యమైన నాద తరంగములచేతను గలుగును ఇట్టిశ్రుతులు చెవికి వినసొంపుగ నుండి హృదయమును పల్లవింపజేయును. ఇవి చెవికి వినబడునట్టియును (ఆహతనాదము) వినబడనవియును (అనాహతనాదము) కూడ గలవు. సూక్ష్మశరీరమున చిత్తమునకు గ్రాహ్యమైన శ్రుతులు ఆహతనాద మగుచున్నవి. చెవికి గ్రాహ్యము కానివి- అనఁగా అనాహతనాదమును- ఋషులు మున్నగువా రనుభవింతురు. సంగీతమునందున్న సూక్ష్మభేదములుకల శ్రావ్యమైనశ్రుతులను సూక్ష్మశరీరపు సూక్ష్మభూతపంచకములును, స్థూలభేదములను స్థూలభూతపంచకములును గ్రహించును. కావుననే యీరహస్య మెఱింగినవాఁడు తన కైహిక ఫలితములు కావలయునో అయ్యా పరిణామముగల ధ్వన్యాసముల జేర్చుకొని మంత్రము లని చెప్పుకొనుచు తనకోరికల నెఱవేర్చుకొనును. ఆయా మంత్రము లాతనికోరికల బట్టి ఫలితము లిచ్చును. దయ్యములు మున్నగువానిఁ బోగొట్టువారి కట్టిమంత్రము లట్టి ఫలములనే యిచ్చును. భగవద్విషయైక మంత్రములు భగవంతుని సాన్నిధ్యమును ప్రసాదించును. గాయత్రీమంత్ర మిట్టిది కాదా? వాంఛల ననేకవిధములైన పరిణామము కలవిగ జేసికొనవచ్చును. కావున సంగీతమునగల సూక్ష్మభావములను కలుగజేయునట్టి త్యాగము అమాయకపను రాగము భగవద్ధ్యానము వీనత్వము మున్నగు సూక్ష్మభావము లానందమయకోశమున నుద్భవించుటచే నాద తరంగ ప్రభావముచే మానవుడు దేవలోకానుభవవర్తి కాగలడు.

ఇట్లు సంగీత మీదేశమందేమి పాశ్చాత్యదేశము లందేమి మతమునకు దోడగుచున్నది. పాశ్చాత్యదేశపు సంగీతసరణికన్న భారతదేశపు సంగీతము మిగుల భగవద్ధ్యానకర మగుచున్నదని చెప్పగలను. వీణె వేణువు మున్నగు వాద్యములేమి- భేరి దుందుభి డిండిమ శంఖాది వాద్యములేమి - మానవుని చిత్తవృత్తుల నరికట్టి సూక్ష్మ కారణశరీరముల సూక్ష్మాణువులందు చలనము కలిగించి ఆత్మను విజృంభింపజేసి భగవంతునియెడల ఆత్మైకసంధానమును కలుగజేయును. నిశ్చలమైన ధ్యానయుతుల మగుచుమన్న స్థూలశరీరమందు దుర్వాంఛలు రాగద్వేషములు మున్నగు భౌతికవిషయము లన్నియు నడ్డుపడి మానవుని మనస్సును హరించి చంచలింపజేయుచున్నవి. అప్పుడు నిశ్చలభక్తి నొనగూర్చునది సంగీతమే! వేదాంతయుతమైన నాదవిద్య ఇట్టివాని కవకాశ మియ్యక స్వకీయమైన భావరాగములను మానవునియందు పురికొల్పి యాతని శాంతిపరచి తన భావములందు లీనము గావించి నిశ్చలధ్యానయుతునిగ జేయగలుగుచున్నది. మానవునియెడ మత మెందులకు పాటుపడుచున్నదో ఆ పనినే సంగీతముకూడ జేయుచు నిశ్చలధ్యానయుతునిగ జేయు తక్కిన సాధనములకన్న మిన్నయై మోక్షమార్గమునకు ప్రధానకారణమై మతమునకు మహోపకారి యగుచున్నది. ఒండొంటి సహాయమువలననే మతము సంగీతవిద్య కూడ నుత్కృష్టతను పొందుచున్నవి. ఇట్లు నాదవిద్యసహాయమున మతము మానవుని శ్రీమన్నారాయణుని యనుభవించు వేదాంతునిగఁ జేసి తరింపఁజేయు నను నట్టి సంగతు లింకను పెక్కు లూహ్యములు.

# మర్మకవిత్వము

దువ్వూరి రామిరెడ్డి గారు

పాశ్చాత్యదేశములందు శాస్త్రవిజ్ఞానము పెచ్చుపెరిఁగి లలిత కళల స్థానమును సైతము నాక్రమింపఁ జొచ్చెను. కావ్యములయందు మనోమోహనమైన దివ్యానుభూతికి మాఱు మేథోవ్యాపారము అధికారస్థాపనము గావించెను. ఆ తరుణమునఁ ఫ్రాంసు దేశమునందు నిందుకుఁ బ్రతీకారముగ నొక కవితోద్యమము బయలుదేఱెను. ఆ యుద్యమకారకులు సమకాలీనకవిత్వముతోఁ దృప్తిపడి యుండక యింద్రియముల నంతర్ముఖములఁ గావించి యగాధమును విశాలము నైన సూక్ష్మప్రపంచమును జొచ్చి యందలి యనిర్వచనీయమైన సత్యమును సౌందర్యమును గానము చేసిరి. ఈతెగకు సంబంధించిన కవులను పాశ్చాత్యులు మర్మ (Myst'c) కవు లనియు సాంకేతిక ( mblo-gists) కవు లనియు నామకరణము గావించిరి. బాడిలేర్ అను ఫ్రెంచికవి యిటువంటి కవిత్వమునకు మొదట మార్గము సిద్ధపఱిచెను. అనంతరము వెర్లైన్, మ్యాలర్మీ, అనుకవులు సుప్రసిద్ధు లైరి. ఈ మర్మ కవిత్వము యూరపుఖండమందుఁ దన ప్రకృతి కనుకూలించిన దేశము లందెల్ల వేరు నాటుకొనెను. జర్మనీదేశమందు డెమ్మెల్ అను యువక కవియు అతని యనుచరులును, అయిర్లాండునందు, ఈట్సు యే. యి. ఆర్థరు సిమ్మన్సు, * జేమ్సు, హెచ్. కజిన్సు మున్నగుకవులును ఈమర్మ కవిత్వసంప్రదాయమునకు సంబంధించినవారు.

మర్మకవిత్వము సామాన్యముగ గీతి (Lyric) రూపమున నుండును. ఆగీతములందు గానమునకును భావమునకును సమానగౌరవము గలదు; ఒకవేళ గానమే ప్రాధాన్యము వహించిన దని గూడఁ జెప్పుటకు వీలున్నది. కావ్యరూపములలో గీతమె యుత్తమోత్తమ మని కొందఱి యాధునికుల యభిప్రాయము. మర్మకవులు తక్కువ పదములలో నెక్కువగానమును, సూచనలను గర్భీకరింతురు. పాల్ వెర్లైను ఈతెగకవిత్వమునకు లక్షణముగఁ గ్రింది గీతముల రచించెను.

Music, Music before all things
The eccantric still prefer,
Vague in air, and nothing weighty,
Soluble, yet do not err,
Choosing, words ; still do it lightly,
Do it too with some Contempt ;
* *
Music alwa)s, now and ever
Be thy verse the thing that flies
From a soul that's gone, escaping,
Gone to other loves and skies.

ఈ కవిత్వమునకు మర్మకవిత్వ మని యేల పేరు రావలయును? ఈకావ్యములయందు సామాన్యప్రజల కగమ్యగోచరము లైన విషయము లుండును. సాధారణముగ నీతరగతి గీతములవస్తువు ఆధ్యాత్మికవిషయముగ నుండును. కవియొక్క యాంతరంగికానుభవమును విశ్వజనీనతయు గీతములయం దంకితమై యుండును. కవులయం దాధ్యాత్మిక స్వభావము నిర్ణిద్రము. కావున వారు బహిరింద్రియనిర్ణీతము లైన సీమలను దాఁటి సూక్ష్మప్రకృతినిఁ బ్రవేశించి యందుఁ గలిగిన యనుభూతిని ధ్వనిమూలకముగనో- సూచనగనో- సాంకేతికముగనో- వెలిపుత్తురు. ఈమర్మకవిత్వము కేవలము ఆత్మానుభవజనితమును ఆత్మోపభోగ్యము నై యున్నది. జీవనముయొక్క యవ్వలిగట్టు ఈగీతములందుఁ బొడకట్టు చుండును. యూరపుదేశపు సామాన్యజనులకు ఆధ్యాత్మికగంధము శూన్యము. కావున వారి కీ కవిత్వము మర్మముగఁ దోఁచినది. బాడిలేర్ కవిత్వము ఆధునికపాశ్చాత్యమర్మకవిత్వమునకు మార్గదర్శక మైన దని యిదివఱకుఁ దెలిపియుంటిని. అతని రచనలలోఁ జాలప్రసిద్ధ మైన యీ క్రింది పద్యములలోని యగాధాశయములను గమనింపుడు.

Earth is a templo, from whose pillared mazes
Murmurs confused of living uttterences rise ;
Therein man thro' a forest of symbols pces,
That cotemplate him with fam liar eyes.
As prolonged echos, wandering on and on,
At last in one far tenebrous depth unite,
Impalpable as darkness, and as light,
Scents, sounds, and colours meet in unision.

ఈ తెగకవులలో మఱల ఫ్రెంచివారికిని అయిరిషువారికినిఁ గొంత భేదము గలదు. అయ్యది దేశకాలపరిస్థితులకు సంబంధించినది. అయిరిషుకవుల కుండినంత ప్రకృతిసాంగత్యము ఫ్రెంచికవులకు లేదు. అందువలన వారి కావ్యములందుఁ గొంత కృత్రిమత పొడకట్టుచున్నది. మనకు సమకాలీనుఁ డైన ప్రసిద్ధ అయిరిషుకవి ఈట్సు రచియించిన యీ పేరిన తేనెగడ్డను జవిచూడుఁడు.

In all poor foolish thigs that live a day
Eternal beauty wandering on her way.

ఈకవి తన యాత్మానుభూతిని పైరెండు పాదములలో నిమిడ్చి యున్నాఁడు; అనంతసౌందర్యమును బ్రతివస్తువునందు సందర్శించినాఁడు.

....................." సత్కవీశ
భావలోచన మెరువుగాఁ బడయకున్నఁ
గాంచనేర వంతర్లీనకాంతిసరణి" (కృషీవలుఁడు)

* ప్రస్తుతము కజిన్సుగారు అడయారునందలి జాతీయవిశ్వవిద్యాలయమునందు ఇంగ్లీషు అధ్యాపకులుగా నున్నారు.

సత్యము! సత్కవీశుని భావలోచనము గాక, అంతర్లీనకాంతిని సౌందర్యమును తక్కినకన్నులు చూడఁగలుగునా?

మర్మకవిత్వమునం దొకవిధమైన యస్పష్టతయు ననూహ్యమైన భావనేంద్రజాలమును గోచరించుచున్నది. ఆగీతములందు భావములు అంటీయంటక - చిక్కీచిక్కక - దక్కీదక్కక - మనలో దాగుడుమూత లాడుచుండును. "ఆకావ్యమునుండి నీ వేమిగ్రహించితివి?" అని యితరులు ప్రశ్నించినపుడు "ఏమో నేను జెప్పఁజాలను గాని యొక విధమైన యవ్యక్తమాధుర్యమును, ఆనందమును అనుభవించితిని" అని చెప్పుటకుమాత్రము సాధ్య మగును. కళయొక్క పరమావధియు నిట్టి యనిర్వచనీయ మైన రసానుభూతిని గలిగించుటయే యని యన్నిసంప్రదాయములకు సంబంధించిన రసజ్ఞులును శిల్పులును నిర్ణయించిన విషయమే. "When one art can fully be explained by ancther then, it is a failure" అని రవీంద్రుఁడు కళయొక్క యనిర్వచనీయతను బోధించెను. "It (art) is to be felt! not to be explained." శిల్పము అనుభవింపఁదగినది గాని వివరింపవలసినది గాదని డాక్టరు అవనీంద్రనాథటాగూరు నుడివియున్నాఁడు. ఇట్లనుటవలన నుత్తమశిల్పమునందు వివరించి చెప్ప నలవిగాని యొక విధమైన రసస్ఫురణము గలదని మనము తెలిసికొనవచ్చును.

అడయారునందు జేమ్సు- హెచ్చి- కజిన్సుగారి యింట నేను మూడు చిత్రపటములను జూచితిని. ఒకటి నందనలాలువసువు రచియించిన "శివనాట్యము." మఱిరెండు కజిన్సుగారు జపానునుండి తెచ్చినవి. వానిలో నొకదానియందు జపానుస్త్రీలు మంచుకాలమునఁ గాగితపు గొడుగులు వేసికొని సంచరించుట చిత్రింపఁబడియున్నది. మఱియొక దానియందు కేవలము సన్ననిగీతలతో — నవియు నేడెనిమిదింటితో నొక జపానుదేశపు స్త్రీముఖము అత్యద్భుతముగ లిఖింపఁబడియున్నది. ఈమూడుచిత్రములు నాహృదయమును హరించినవి. మర్మకవిత్వము (Mystic p etry) యొక్క రహస్యము ఆ చిత్రపటముల మూలమున నేరుగ నామనమున నంకితమైనది. అంతవఱకు ఆకవిత్వములోని యస్పష్టత (Vagueness) యొక్క గుణమును నేను పూర్ణముగ గ్రహింపలేకుంటిని. "శివనాట్యమును" మంచుకాలమున జపానుస్త్రీల సంచారము చిత్రింపఁబడినపటమును సాధారణమైన బొమ్మలపటములవలె పరిస్ఫుటముగ రంగులు పూయఁబడినవి కావు. వానిలోని యాకృతులు మనకు స్పష్టముగఁ బొడకట్టును. ఆయస్పష్టత శిల్పకళానైపుణ్యము యొక్క పరసీమయని తలఁపవలయునేగాని, అల్పకౌశలముగల చిత్రకారుల కచ్చిరాని బీరకాయపీచుఁదనము గాదు. అట్లు చిత్రించుటకు శిల్పి చాల కళాభిరుచి గలవాఁడుగను, జేయితిరిగినవాఁడుగను, వర్ణసమ్మేళనాది విషయములందుఁ బరిపూర్ణజ్ఞానము గలవాఁడుగను నుండవలయును. ఆ పటములయందలి రూపములనుఁ దిలకించినపుడు మనమనకు గాలిలోఁ దేలిపోవునటులఁ దేలికయై చిత్రసారూప్యమును బొందినట్లుండును. ఆరూపము లేదో యొక యగాధరహస్య వాతావరణమున వెన్నెలరాత్రియందుఁ దేలియాడు మేఘశకలములవలెఁ బొడకట్టును. చూడఁజూడ నవి గాలిలోఁ గఱగిపోవుచున్నవా యేమి యను సంశయముగూడ పొడమును. ఇట్టి యస్పష్టతామాధుర్యమే నాకు మర్మకవిత్వమునఁ దోఁచుచున్నది. రేఖలతో లిఖింపఁబడిన పటమును గాంచినపుడు "ఎన్ని కొద్ది గీరలతో నెంత సుందరమైన యాకృతిని నేర్పరియైన చిత్రకారుఁడు సృజింపఁగలఁడు" అను నాశ్చర్యము దోఁపకమానదు. జపానుకవుల * "హొక్కు" కవిత్వమునందువలె నీ చిత్రపటమునందును అనవసర కళాప్రదర్శనము నాకగపడలేదు. అయినను నందు సౌందర్యమును నిరాడంబరతయుఁ దొలకాడుచున్నవి. అట్టి యస్పష్టతయు సంక్షిప్తతయుఁ గేవలము అనల్పకళానైపుణ్యసాధ్యము లని నేను గ్రహించితిని.

మర్మకవిత్వమునందలి యస్పష్టతను గుఱించిన కొందఱి యభిప్రాయముల నిట సంకలించితిని.

1. And the very perfection of such poetry often appears to depend, in part, on a certain suppression or vagueness of mere subjects, so that the meaning reaches us through ways not distinctly traceable by the understanding.

2. Vagueness is often virtue; a god lives in Walter Pater. A loud; truth cannot be put on one's finger tip.

Yone Noguchi.

3. I think there should be nothing but allusions. The contemplati n of objects, the flying image of reveries evoked by them are song.......... To name an object is to take the three q arte s from the enjoyment of the poem, which consists in the h ppyness of guessing little by little; to suggosts, that is the dream.

J les Huret.

ఈలక్షణములు ముఖ్యముగ గీతకవిత్వమున కన్వయించును.

---

* జపానుకవిత్వ పద్యభేదములందు "హొక్కు" అనునది చాల చిన్నపద్యము. అది పదునేడు నేకాచ్చ శబ్దముల పరిమితి గలది. ఈ పద్యములలోని విషయము జపానుదేశస్థులకుఁ దప్ప, ఇతరులకు సాధారణముగ బోధపడనంత సంక్షిప్తముగ నుండును. అందువలననే జపాను వాఙ్మయవిమర్శకులు "కవి యెట్టివాఁడో పాఠకుఁడును నట్టివాఁడుగ నుండవలయును" అని చెప్పుట. హొక్కుపద్యముల రచించుట చాల కష్టమనియు, బాషో అను సుప్రసిద్ధ "హొక్కు" కవి తన జీవితకాలమునందు మూడునూర్ల పద్యములను మాత్రమె రచియింపగలిగెననియు యోన్ నొగూచి తెలిపియున్నాఁడు. విషయముఁ దెలుపుట కొక నుదాహరణము ననువదించితిని.

కాలిపోయెను కొల; రాలెడుపూవు, లెంత నిశ్చలకాంతి నెసగెడు నిపుడు!

తనయిల్లు కాలిపోవు సమయమున రాలెడుపూవుల నిశ్చలకాంతిని గమనింపఁగల కవిమనోవస్థయే యీ పద్యమునందలి విశేషము.

మర్మకవిత్వమును టాల్‌స్టాయి "శిల్పమన నేమి" అను తన గ్రంథమందుఁ జాల తీవ్రముగ ఖండించియున్నాఁడు. అందు కా కవిత్వమునఁ గల యగమ్యగోచరత్వము కారణము. అయినను టాల్‌స్టాయి తర్కమంత సహేతుకముగఁ దోఁపదు. ఆయన ప్రజాపక్షవాది. కావున సామాన్యజనుల కర్థముగాని శిల్పము వ్యర్థమనియు నింద్యమనియు ఆయన యభిప్రాయము. ఈయపూర్వమైన మానదండమును గల్పించి టాల్‌స్టాయి రషియాదేశమునందలివే గాక యూరపుఖండమునందలి యన్నిదేశముల లలితకళలను దానితోఁ గొలిచి, సరిపడనివానిని తనవిపరీతపు విమర్శనమునకు గుఱిగావించెను. ఒక పెద్దసౌధమును గాని క్రైస్తవుల ప్రార్థనాలయమును గాని దిలకించినప్పుడు వానిసౌందర్యముఁ దోఁచుటకుఁ బూర్వమే "ఈకట్టడము లెందరి పాటకపుజనుల నిట్టూర్పులతోడను గన్నీటితోడను, కడుపుమంటలతోడను రూపొందినవో" యను కారుణ్యమూ దయాశాలి మెత్తనిమనసును తడిసేయును. కావున టాల్‌స్టాయి నిర్వచనములందుఁ గళాన్యాయ్యానిర్ణయమున కంటెఁ గరుణారసమె యెక్కుడుగ నుండును. ఒకకళయొక్క శ్రేష్ఠత్వము దాని నర్థముచేసికొనఁగల ప్రజలసంఖ్య ననుసరించి యుండుననియు, నట్లుగాక యెవరోకొందఱి భాగ్యవంతులకును కేవలము శిల్పాభిరుచి గలవారికిని మాత్రమె పనికివచ్చు కళ యొకకళగా దనియు నాయన సిద్ధాంతీకరించెను. ఇది చాల యన్యాయ్యమును శిల్పతత్త్వమునకు పరమవిరుద్ధమైన తీర్మానముగను నున్నది.

మన మొక కావ్యమును జదువునపుడు హృదయము రసాతిరేకమైనదా లేదా యనుదాని ననుసరించియు, అయినయెడల దాని తీవ్రతను బట్టియు ఆకావ్యముయొక్క గుణాగుణములను నిర్ణయింతుము. ఒకప్పుడు కావ్యము రమ్యమైన దయ్యుఁ జదువరిహృదయము సంస్కారపక్వము గానియెడల రసోత్పాదనము గాకపోవచ్చును. ఈరెండుసందర్భములయందును కృతికిని జదువరిస్వభావమునకుం గల సంబంధము ముఖ్యము. కాని "ఇతరు లెంద ఱీకావ్యమును జదివి యానందించిరి?" అను ప్రశ్నపై ఆతని యనుభూతి యాధారపడి యుండవలసిన యక్కఱ లేదు. చిత్రముల విషయముగూడ నిట్లే యూహింపవలయును.

టాల్‌స్టాయి సిద్ధాంత మంగీకరింపఁబడినయెడల లోకమునందలి చాల యుత్తమోత్తమము లగు చిత్రములు కావ్యములు శిల్పములు కట్టడములు ధ్వంసము కావలసియుండును. ఒక రచనయొక్క రసవత్తతయుఁ గళానైపుణ్యమును సూక్ష్మబుద్ధిగ్రాహ్యము లగు గుణవిషయములును మెచ్చుకోఁలది వానిని గ్రహించి తదనురూపానందమును బొందు రసికులసంఖ్యయుఁ దగ్గుచుండును. కావుననే కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలము జంగమకతలవలె సామాన్యప్రజానురంజకము కాకుండుట. రసజ్ఞత కుశాగ్రముగ నుండనిదే యుత్తమమైన కళాసృష్టిని మెచ్చుకొనుటకు సాధ్యముగాదు. అట్లు మెచ్చుకొనుటకు శిక్షితమైన యభిరుచియు నవసరము. అట్టి రసజ్ఞత ప్రజాసామాన్యమునందు నభివృద్ధి చెందియుండదు. వారికిఁ దగినశిల్పము లుండనేయున్నవి. ఇంకను గావలసినయెడల అట్టివి వేనవేలుగఁ గల్పించి క్రమక్రమముగఁ బ్రజల యభిరుచిని శిక్షించి యుత్తమశిల్పముల మెచ్చుకొనున ట్లొనరింపవచ్చును గాని, యాదర్శమును మాత్రము జనబాహుళ్యమునకుఁ దెలియఁగల క్రిందిమెట్టులోనికి దింపరాదు. మేఘసందేశములోని రామణీయకము ఒక పల్లెటూరికాఁపునకు గోచరింపని కారణముచేత దానిని సరస్వతీదేవి యంకపీఠమునుండి క్రిందికిఁ ద్రోయవలసినదేనా?

కాళిదాస భవభూతులు సమకాలీనప్రజల యభిరుచి ననుసరించి వారినాటకములను రచియింపలేదు. అట్లే వారు రచియించి యుండినయెడల అవి యెల్లకాలమునకు నాదర్శప్రాయములుగ నుండనోపవు. ప్రజల యభిరుచి మాఱినవెనుక వానిమొగము చూచువా రుండరు. కాని శకుంతలనాటకము కాళిదాసుని యభిరుచి ననుసరించి సృష్టింపఁబడిన దగుటచేతనే చిరంజీవియైనది. ఈవిషయము కవులకుఁ దెలియనిది గాదు. తననాటకములోని సారమును భవభూతిమహాకవి తెలిసికొని సమకాలీనుల యజ్ఞానజనితమైన నిరాదరణము నిట్లు తూలనాడెను.

యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తా న్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే౽స్తి మమ కో౽పి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.

ఈ విశాలప్రపంచమునందు ననంతకాలమునఁ దనతోడి సమానధర్మముగలవాఁ డెవ్వఁడైన జన్మించి తననాటకమును జదివి యానందింపఁడా యను తలంపు భవభూతిని నూఱడించినది. ఎంతసహనము! ఎంత స్వార్థత్యాగము! నేఁటికవులు అప్రయాసలభ్య జనరంజకత్వమునకయి తమశక్తిని వ్యర్థపుచ్చుచున్నారు.

మాలర్మె ప్రభృతుల కావ్యములలోనిసూచనలను, అస్పష్టతను దోషములుగఁ బరిగణించి టాల్‌స్టాయి ఖండించుటయందుఁ దప్పులేదు. ఏలయనఁగా నాయనకుఁ దోఁచినట్లును ఆయన భావించినట్లును దాపటికములేక విమర్శించెను. ఇది చాల గొప్పతనము. కాని సామాన్యప్రజల మనస్తత్త్వమును బ్రమాణముగఁ గొని ఆ కావ్యములలోని విషయములు వారి కగ్రాహ్యములు గాన దోషము లని తీర్మానించుట సాహసము.

మనదేశమునందు "మర్మకవిత్వ" మనాదియైనది. దానిని మర్మకవిత్వ మని పేర్కొనక యాధ్యాత్మికకవిత్వ మని వ్యవహరించెదను. ఏలయన ఆలాటిరచనలను మర్మకవిత్వముగ మన మెన్నఁడును భావించినది లేదు. హైందవజనసామాన్యమున కవి మర్మములు గావు. పంచేంద్రియగోచర మగు స్థూలప్రపంచమున కన్నభిన్న మగు మఱియొక యంతఃప్రకృతి గలదనియు, నశించునది పాంచభౌతికశరీరమే గాని యాత్మ గాదనియు, జన్మాంతరము గలదనియు నేమియుం దెలియని కూలివానిమొదలు సకలశాస్త్రపారంగతుఁ డగు పండితునివఱకు హిందూదేశమున నందఱును విశ్వసింతురు. ప్రతిదినముమనయింటికి బిచ్చమునకు వచ్చు దాసరిగూడ—

"మనది తనది యనుచు నరుడా, మాయలో బడబోకురా
మరణ మొందిన మనది తనది మంటలో నే మానురా!

బంకమట్టీ యిల్లురా యిది బగ్గిబుగ్గీ యౌనురా
ఆత్మ యొక్క బె బ్రహ్మరూప మ్మంతటా తా నుండురా."

అని పాడుచుండును. కావున మనవారు ఆధ్యాత్మికగీతములను కీర్తనలను మర్మకవిత్వ మని పేర్కొనలేదు.

మొట్టమొదట ఆర్యావర్తమున వేదములయందే యాధ్యాత్మిక కవిత్వము జన్మించి యుపనిషత్తులయందు బరిపూర్ణత నొందినది. అనుక్షణము విస్తరించుచుండిన వైదికకవి యాత్మబహిః ప్రపంచమునఁ దనివినొందక, యంతర్ముఖేంద్రియ మై యగాధమైన యమృతానందమున నోలలాడి యాయనుభూతిని వెలికి నిట్టూర్చినది.

"శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రా, ఆయే ధామాని దివ్యాని తస్థుః
వేదాహ మేతం పురుషం మహాన్త మాదిత్యవర్ణం తమసః పరస్తాత్"

అని వైదికఋషి ఘోషించినాఁడు. ఇంతటి మహానందము వెలికిఁ ఱకక కవిహృదయమున నెట్లు దాగియుండగలదు? పిపీలికాది బ్రహ్మపర్యంతమగల ప్రాణికోటులను- అమృతసంతానములారా! యని సంబోధించినాఁడు. ఎంతప్రేమ! ఎంతయానందము! ఎంతసత్యము! తాను దర్శించిన తేజస్సు అప్రాకృతము. కావున నది వర్ణింప నలవిగానిది. సామ్యముచే మాత్రము నూహింప సాధ్యమైనది. అదియు విలోమమార్గమున —

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతో ఽయ మగ్నిః
తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా
సర్వ మిదం విభాతి"

ఆత్మానుభవజన్యమైన యిట్టి యపూర్వసత్యములను వైదికఋషులు వర్ణించిరి. వారు ఆధ్యాత్మికకవిగురువులు, ప్రథములు.

వివిధమత సంప్రదాయములయందును ఇట్టి కవిత్వ మంకురించి శాఖోపశాఖలుగ నభివృద్ధి నొందినది. వైష్ణవకవుల కీర్తనలయందు రసమాధుర్యములు పొంగి పొరలినవి. ఇందుకుఁ గొన్ని కారణములు గలవు. వైష్ణవులకు భక్తి ప్రధానము. ప్రేమ యాలంబము. ఆత్మకును బరమాత్మకును గల సంబంధమును రాధాకృష్ణుల ప్రేమలీలలుగ సంకేతించి వారు సంకీర్తనము చేసిరి. నేను రచియించిన "రాధయుత్కంఠ" యను ఈ క్రిందిద్విపదను దత్సంబంధసూచకమైన యొక యుదాహరణముగఁ గైకొనవచ్చును.

చల్లనిపన్నీట ♦ జలకంబులాడి
యగరుధూపము వెట్టి ♦ యలకంబులార్చి
నుదుటఁ గస్తురిబొట్టుఁ ♦ గుదుటుగాఁ దీర్చి
కన్నుదమ్ములఁ గ్రొత్త♦కాటుకదిద్ది
గోరంట పూగుత్తి ♦ కొప్పునం దురిమి
కమ్మతావుల నీను ♦ కలపంబు నలఁది
పొడికప్పురంబులఁ ♦ బడకింటఁ జల్లి
పాన్పుపైఁ బువ్వులు ♦ పఱపుగాఁ బఱచి
యేలరాఁడో సామి ♦ యింకేలరాఁడో
యనుచుఁ బోరము నానుకొని వేచియుంటి
స్వాంత మాలస్యంబు ♦ సైరింపలేక
వేదనాభరమున ♦ ప్రీలంగఁ జొచ్చె.
గనికని దారులు ♦ కన్నులు నొచ్చె;
నాసామి కృష్ణుండు ♦ ననుఁ గాంచరాఁడు.
సంజ కెంజాయలు ♦ శమియించి పోయెఁ,
బతులు గూళ్లకుఁ ♦ బరుగిడసాగె.
మందలకావులు ♦ మరలిపోయెడిని
నేణుగానంబులు ♦ వీనులసోకెఁ
గోయిల క్రొమ్మావి ♦ గుబురులోఁ గూసె
సందెచీకటి పొగ ♦ చద లావరించెఁ
జుక్కల రసగుండ్లు ♦ జొంపంబు లలరె
నేలరాఁడో కృష్ణుఁ ♦ డిం కేల రాఁడో?
కప్పురపుం దివ్వె ♦ కడమట్టపెగ్గెఁ
బాన్పుపై పువ్వులు ♦ వసివాళ్లువాడె
మంచిగందపు బూత ♦ మైఁ జిట్లిపోయె
నిద్రమాంద్యమ్మున ♦ నేత్రముల్ మొగిడెఁ
బడమటి దెస ♦ కేఁగు నుడుగణంబులను
గనుచు ద్వారముకడఁ ♦ గన్నుకూర్కితిని.
నాసిగ్గుపుచ్చంగ ♦ నళినబాంధవుఁడు
వెయ్యిదివ్వెలతోడ ♦ వెలుగుచు వచ్చె.
కూర్కులేమిని ♦ గన్నుఁగొన లెఱ్ఱవాఱఁ
బొరలుచిట్టిన ♦ మేనిపూఁతలు రాలఁ
జెమ్మట ముత్యాలు ♦ చెక్కిళ్లజాఱ
ఘల్లుఘల్లని ♦ చేతిగాజులు మ్రోయ
మజ్జిగఁ జిల్కుచు ♦ మధురగీతములఁ
గాంతుఁ డొనర్చిన ♦ కఠినంపుసేఁతఁ
దుమ్మెదపైఁ ♦ బెట్టి దూఱుచునుండ
నాముద్దుకృష్ణుండు ♦ వావెన్క నిలిచి
ముసిముసినవ్వుల ♦ మురియుచు నుండె.

* * *

వేచియుండినయప్డు ♦ విభుఁ డరుదేఁడు
వేసవివానల ♦ విధముగా నతఁడు
కలవలె వచ్చును గనిపించి పోవు!

విరహిణియైన నాయిక యెన్ని యవస్థలకుఁ బొల్పడునో తన్ను రాధనుగను సర్వేశ్వరుని కృష్ణునిగను సంకేతించుకొన్న భక్తుఁడును అన్ని యవస్థల ననుభవించును. నాయకుని నెడఁబాసిన నాయిక పునః సమాగమముకొఱ కెట్లు త్వరపడుచుండునో, అటులనే పరమాత్మవిశ్లేషమును సహింపఁజాలని భక్తుఁడును వేదనఁ బొందుచుండును. ఇట్టిపారవశ్యము సాధారణముగ నందఱిభక్తులకుఁ గలుగునది గాదు. ఇది భవముయొక్క పరపారము నంటు కడపటియవస్థ. పన్నిద్దరాళ్వారులలో నమ్మాళ్వారులకే యాదశ కలిగెను. చైతన్యుఁడును నట్టియవస్థ ననుభవించెను. రామ

కృష్ణపరమహంసయు నట్టి విశ్లేషవేదన నొందెనని వివేకానందస్వామి నుడివియున్నాఁడు. నమ్మాళ్వారులు రచించిన "తిరువాయిమొళ్లి" యంతయుఁ గొంచె మించుమించుగ విరహిణీగీతములని చెప్పవచ్చును. మీరాబాయియు మహారాష్ట్రదేశపు భక్తులును అట్టికీర్తనలను రచియించిరి.

తెలుఁగుదేశమున మఱియొకవిధమైన యాధ్యాత్మికకవిత్వము ప్రచారములోనికి వచ్చినది. * పోతులూరి వీరబ్రహ్మము, అతని శిష్యుఁడగు సిద్ధయ్య, వేమన్న మొదఁలగు తత్త్వజ్ఞాను లీసంప్రదాయమున ముఖ్యులు. బ్రహ్మంగారి కాలజ్ఞానకీర్తనలను వేదాంతకీర్తనలను తరుణాయిదాసరులు పాడుచుండఁగ మనము చాలమాఱులు వినియుందుము. భక్తిగీతములందువలె వానియం దంతరసము చిప్పిల్లుటకు వీలు లేదు. అయినను అవి నీరసములుగ నుండవు. ఇచ్చట నొకటిరెండు ఉదాహరణములు అప్రస్తుతములు గావని తలంచెదను.

1. తెలుసుకోండి యన్నలార తేటతెరువు బట్టాబయలు
నట్టినడుమా పుట్టాలో గురునాథూ డున్నాడు
మూడుచుట్లా కోటాలోన ముప్పయిమూర్గూ రున్నారన్నా
ధ్యానామూ కోటాను ఎక్కూ- పెడితే తలుపూలు దీసేమన్నారు.
ఇంపుగాదూ మెప్పూగాదు ఎన్నరాని యీ బ్రహ్మపదవి
చప్పరించీ చూడండన్న సారా మున్నాది.

2. తనకు బొంకేకు ఎపుడో తగులాట మాయెను
నీ కెవ్వరో గురుడ! నా కెవ్వరో!
పుట్టి బూరుగమాను పూసి లెస్సా కాసి
గట్టిగ కొమ్మలు కదిలాడగా
నుడిగాలి దెబ్బకు తొడిమజాతీన పండు
తొడిమాతో యేమైన నుడివిపోయిందా?
తనకు బొంకేకు..................
నీ కెవ్వరో గురుడ..................

చిత్తాస్వాతులు రెండు సంధింప ముత్తేపు
చిప్పాలో పడ్డాది చినుకొక్కటి
ముత్యమై నీళ్లలో మునిగీ పొయ్యేనాడు
చిప్పతో యేమైన చెప్పి పోయిందా?
తనకు బొంకేకు..................
నీ కెవ్వరో గురుడ..................

వేమనపద్యములలోని భావములను గ్రహించి కొందరు, వానినిఁ గీర్తనలలో నిమిడ్చిరి. అట్టి కీర్తనలే యిప్పటికి తెలుగుదేశమునందుఁ జాల వఱకు వ్యాపించియున్నవి.

సమకాలీనమైన యాధ్యాత్మిక కవిత్వమునుగుఱించి కొంత విచారించి యీవ్యాసమును ముగించెదను. బెంగాలుదేశమున రవీంద్రనాథటాగూరును, ఆయన కవిత్వమార్గమును మెచ్చుకొని దానినవలంబించు సత్యేంద్రనాథదత్తు మున్నగు నితరయువకకవులును ఆధునిక కవిత్వసంప్రదాయమునకు సంబంధించినవారు. ఈతెగకు రవీంద్రుఁడు మార్గదర్శకుఁడు. కావున మొట్టమొదట ఆయన కవిత్వమును గుఱించి తెలిసికొందము. రామమోహనరాయలు కలకత్తానగరమున బ్రహ్మసమాజమును స్థాపించిన వెనుక బెంగాలీసారస్వతమున నూతనజీవనసంచలనము ప్రారంభమయి దినదినాభివృద్ధి గాంచినది. బ్రహ్మసమాజపుఁ బ్రార్థన మందిరములందుఁ జదువుటకును మతప్రచారము గావించుటకును క్రైస్తవుల పాటలు (psalms) వంటి గీతములు రచియింపఁబడినవి. ఈ గీతారచనమె బెంగాలుదేశపు ఆధునికాధ్యాత్మిక కవిత్వమునకు బీజము. రవీంద్రుఁడు బాల్యమునందె యింగ్లీషువాక్యములను జదివెను. అందు ముఖ్యముగఁ గీట్సు, షెల్లి, బ్రౌనింగు అను ఇంగ్లీషుకవుల కవిత్వములలోని సారమును దనివిదీఱ నాస్వాదించెను. కాళిదాసుని శాకుంతలము కుమారసంభవము మేఘసందేశము రవీంద్రునిహృదయమును ప్రబలముగ నాకర్షించిన వనుటకు ఆయన "ప్రాచీనసాహిత్యము" అను గ్రంథమునఁ గావించిన తత్సంబంధము లైన విమర్శనములే సాక్ష్యములుగ నున్నవి.

చైతన్యుఁడు జయదేవుడు మున్నగు వైష్ణవభక్తుల కీర్తనలను టాగూరు గానము చేసిచేసి యానందించెను. ఆ కీర్తనల యధికారము ఆయన రచించిన "భానుసింహపదావళి" యను గీతములందు సుస్పష్టముగ నంకితమై యున్నది.

కీట్సు సౌందర్యమును బోషించిన కవి. షెల్లీ యింద్రియాతీతము లైన యాధ్యాత్మిక విషయములను గానము చేసిన తపసి. రవీంద్రుని కవిత్వమందు గీట్సు రచనలలోని రామణీయకము- షెల్లి కావ్యములలోని యాధ్యాత్మికతత్త్వమయు వైష్ణవగీతములలోని భక్తిపారవశ్యమును- వీని మూటిని ఆత్మసాక్షాత్కరించుకొని మించిన స్వకీయ ప్రతిభావ్యక్తిత్వములును సామరస్యము నొందినవి. కావున రవీంద్రుని యాధ్యాత్మికకవిత్వము ప్రాచ్యపాశ్చాత్త్యమన స్తత్త్వముల కనుగుణమైన సంధిస్థానమై యున్నది.

"తుమి హేన్ ఒఖ్ ఆకాశ్ ఉదార్
అమి హేన్ ఎఁయ్ అసీమ్ పాథార్
ఆకుల్ కొరేచె మాఝు కానే తార్
ఆనందపూర్ణిమా" (మానసి – ధ్యానము)
నీవు విశాలమైన ఆ యాకాశమవు;
నేను సీమారహితమైన యీసముద్రమును;

* ఈతరహతి కవిత్వమును ప్రచారమునకు తెచ్చుటలో ఏగంటివారు, సిద్ధరామదేవుడు మున్నగు కవులు అనేకులు (11-12 శతాబ్దులవారు) పేర్కొనబడవలసియున్నారు. వీరబ్రహ్మము వేమన ప్రభృతులు వైవాంకంటె చాల నవీనులును, వారివాఙ్మయమునే ఆదర్శముగా గొని సమర్థించుకొన జాలని అసమగ్రభావనా విభవులును మాత్రమే.—సంపాదకుడు.

వాని రెంటిమధ్య ఆనందపూర్ణిమ
తాండవించుచున్నది.

ఆంగ్లేయసారస్వతసంబంధమువలన బెంగాలునందువలెఁ దెలుఁగు దేశమున నైతముఁ గొంత యాందోళనము గలిగినది. యువకకవులు సంప్రదాయసిద్ధములైన పురాతనపద్ధతులను త్యజించి స్వతంత్రముగఁ గ్రొత్తదారులు త్రొక్కసాగిరి. ఇప్పుడు తెలుగుదేశమున నాంగ్లేయ వాఙ్మయపరిచితి గల యువక కవు లందఱు కొద్దిగనో గొప్పగనో (Romantic) కవు లనుటకు యోగ్యులు. రవీంద్రుఁడు "నోబుల్" బహుమానముచే సత్కరింపఁబడి యాతని కావ్యములు హిందూదేశ మంతటను వ్యాప్తిచెందిన యనంతరము తెలుగు రొమాంటిక్ కవిత్వము ఆధ్యాత్మికకవిత్వముగఁ బరిణమింప మొదలుపెట్టెను. తత్పరిణామ చిహ్నములు ఇప్పు డిప్పుడు తెలుగుకవుల రచనలయందు బొడకట్టు చున్నవి. కాని యిది ప్రథమదశ యగుటవలనఁ గొందఱి రచనలయందు అనవసరపదాడంబరత్వమును కళాకౌశలములవలనఁ బ్రాప్తమైన భావ సేంద్రజాలముగాక, భావప్రకటనము గావింపఁజాలని గజిబిజితనమును గోచరించుచున్నది. ఈ లోపము మొట్టమొదట యనివార్యమైనది, కావున సహింపఁదగినది. ఇందుకు లక్ష్యములుగ సమకాలీనుల కావ్య ములనుండి కొన్ని యుదాహరణములను సంకలింపవచ్చును గాని అనవసర వివాదహేతువుగఁ బరిణమించు నని మానితిని.

# సాగరుఁడ!

## ఎస్. శివరావు గారు

అమితగాంభీర్యనిధివి రత్నాకరుఁడవు.
భువనసామ్రాజ్యభరణ ప్రభుండ వయ్యు
యల్లకల్లోలపడి యెప్పు డఱచెదేల
సత్వసంతానయుతుఁడవు సాగరుండ!
త్రిజగదాహ్లాదకరుఁడు సందీప్తయశుఁడు
కువలయం బేలు చల్లనికొడుకు రాజు
రాజితనుండు దోషానురక్తుఁ డగుచు
గరములఁ గలంచి పీడింప మొఱయుదేమొ.
జగము లన్నియు రక్షించు జాణవైన
యల్లటపుటల్లుఁ డింటగు పెల్ల నెఱిఁగి
వైరులం గూడి మథియించి వలయునిధులఁ
జూఱగొని లక్ష్మిఁ గైకొన స్రుక్కుదేమొ.
దుర్దినమ్ములఁ దన్నేచఁ దొడఁగు ఘనుని
నీదు గాలియె కాఱింప నెగడునట్టి
మిత్రుఁడే శత్రుఁడై తన్ని మిత్తి మిడిన
యప్పులను బల్మి లాగుట నడలెదేమొ.
ఆకులమటుంగు పిందెలై యడర లేక
నీదు భువనప్రపంచమం దీఁదు నట్టి
జీవు లన్యోన్యకలహసంభిన్ను లగుట
నరసియు నడంపలేకట్టు లడలెదేమొ.
ఘనవిభవశోభితుండ వౌ కాలమందు
పొరలి పైఁబడి తద్భూతిఁ బోఁ గృశింప
దగ్గఱకు రాక విరసమై తొలఁగు నీదు
కుటిలవేణుల నడతకుఁ గుందు దేమొ.
దుష్టసాంగత్యమున గురుం దూఱువారు
గుట్టెఱింగి విరోధుల గూడువారు
మేలునకుఁ గీడు సేయఁగా మెలఁగువారు
మించి యన్యోన్యవైరముల్ పెంచువారు
సిరికినై కృత్రిమపుమైత్రి సేయువారు
గలుగువారికి భంగముల్ తొలఁగ వనెడి
తత్త్వమును మాకు బోధింపఁ దలఁచి తెఱఁది
నిన్నె సాదృశ్యముగఁ జూప నిలిచియుండి
యల్లకల్లోలపడి యెప్పు డఱచెదేమొ
యమితగాంభీర్యనిధివి రత్నాకరుఁడవు.
భువనసామ్రాజ్యభరణ ప్రభుండ వఱయు
సత్త్వసంతానయుతుఁడవు సాగరుండ!

# భారతీయుల ప్రజాప్రభుత్వములు - తత్సంప్రదాయములు

న్యాపతి నారాయణ రావు గారు, బి. ఏ., బి. ఎల్.

హిందూదేశస్థులు మతమునందు నిమగ్నులై పరిపాలనము నందు వైదుష్యము నొందలేదనియు ఆంగ్లప్రభుత్వము స్థాపితమైన పిదపనే ప్రజాహితప్రభుత్వాభిలాషలు మనదేశజనుల మనంబుల జనించెననియు నొక్క వాదుక గలదు. కాని ఆధునిక రాజకీయ పరిజ్ఞానవేత్త లుద్భవించకపూర్వమే మనదేశములో రాజకీయపరిజ్ఞాన సంపన్నులు రాజకీయపద్ధతులు రాజకీయ ప్రతిష్ఠాపనలు విలసిల్లుట గల్గినది. హిందువులు రాజకీయశాస్త్రము నందు గొప్ప అభినివేశము గలవారై యుండిరి. కౌటిల్యుడు రాజకీయశాస్త్రమున కగ్రస్థాన మొసగెను. దానియందు వార్త (Economics) దండనీతి (Politics the science of Govt) జేర్పబడినవి. తత్త్వము వార్త దండనీతి అనునవి మానవపరిజ్ఞానము నావరించియుండె నని మానవులు చెప్పియున్నారు. బృహస్పతి- సంస్కారశాస్త్రము వార్తాదండనీతి శాస్త్రములే- నేర్చుకొనదగినవనియు, దండనీతిశాస్త్రమును నిజముగ పఠించి అనుసరింపదగిన దనియు ఘోషించెను. మహాభారతమునందు నిట్లు చెప్పబడెను. "వివిధధర్మములు నీతిశాస్త్రమునందే సిద్ధించును. సర్వశాస్త్రములు నీతిశాస్త్రమునందే గూడును. మానవజాతియంతయు ధర్మశాస్త్రమునందే పనిజేయును" శుక్రుడు చెప్పినట్టులు నీతిశాస్త్రము మానవజాతికి చాల నుపయోగకారి. మానవసంఘపోషణమునకు ముఖ్యమైన సాధనము. సత్ప్రవర్తనము ధనము సుఖము ముక్తికి సాధనములు. నీతిశాస్త్రపారంగతు లగుటచే రాజులు శత్రువుల జయించి ప్రజలను ప్రేమించి రాజ్యపరిపాలనము నందు నిపుణు లగుదురు. అది 'పరిపాలనా సంఘములను దేశములను సంపాదించి కాపాడుటయందు గొప్ప సహకారి' యని కామందకుడు నుడివెను. థామస్ మొదలగు రాజకీయవేత్తలును నీవిధముగనే జెప్పిరి. "క్రీస్తుకు పూర్వము 4-5 శతాబ్దులలో హిందూదేశమున మానవ బార్హస్పత్య ప్రభృతు లగు సంప్రదాయములును పారాశరాది పరిజ్ఞానవేత్తలును ఉండిరి. వీరిభావములనే మనువు మొదలగు శాస్త్రకారులును వ్యాపింపజేసిరి.

హిందూతత్త్వవేత్తల భావములను ఆధునిక రాజకీయపరిజ్ఞానము ననుసరించి చూచినప్పుడు ముక్కుమూసికొని దైవధ్యానతత్పరు లగు హిందువులు ప్లేటో కెంతయోపూర్వమే రాజకీయములందు అసమానమగు చాకచక్యమును గనబఱచిరని తెలును. మనవారు రాజుయొక్క ఉత్పత్తివిధానముల నన్నిటిని విచారించిరి. ఏకముఖవర్తనులై ఒక యొడంబడికను చేసికొనిరి. దుర్మార్గుల తరిమివేయవలయు ననిరి. ఈ సంఘపు టొడంబడికయే రాజ్యపు టొడంబడిక 'గామారి మనువును రాజుగా ప్రజలు ఎన్నుకొనిరి. ఆయొడంబడిక పరస్పరలాభములమీద నాధారపడియున్నది. కౌటిల్యుని అర్థశాస్త్రమునందు ఈరాజకీయపు టొడంబడిక విషయమై నీ విధముగ జెప్పబడి యున్నది. అరాజకస్థితియందు నివసించుటకు మనుష్యు లసహ్యపడియున్నప్పుడు చిన్న చేపలను పెద్దచేపలు తినెడిస్థితిలో నున్నప్పుడును మనువును రాజుగా నెన్నుకొని వారిగ్రాసములో నాఱవవంతును వణిజుల లాభములో పదియవభాగము నిచ్చి మనలను రక్షించుట కిది పన్ను అని చెప్పియుండిరి. ఆదాయమునందాధారపడి వారల సంరక్షించి వారి సౌఖ్యమును సురక్షితముగ కాపాడుటకు బద్ధకంకణుడై యుండక, ధర్మమును నిరోధించి దోషుల శిక్షింపక యుండిన యెడల రాజు జనులపాపములకు జవాబుదారు కాకతప్పదు. ప్రజలయొక్క శరీరములను ఆస్తులను సంరక్షించుటయందు ప్రభువునకుగల జవాబుదారీ ఎంతవరకు నుండె ననగా- "వణిజులయొక్క సరుకులు దొంగిలింపబడి దొంగ నిర్దేశింపబడనపుడును, సరుకు దొరకనప్పుడును రాజు ఖామందుకు నష్టమును పూర్తిచేయవలసి యుండును." ఏలయన మనుస్మృతి చెప్పినట్టి ఒడంబడిక ననుసరించి రాజు ప్రజలనుండి కప్పముల గొనినపుడు ప్రజలయెడల న్యాయమగు విధులను నివర్తింపవలెను. ప్రజలే ఖరారు నమలులో పెట్టవలయును. ప్రజలను రక్షింపని దుర్మార్గపు రాజును సంహరింపవలె నని మహాభారతములో చెప్పబడినది XIII (69, 62, 77) అందువలననే 'యథా రాజా తథా ప్రజాః' అని ప్రజలపాపముల ప్రభువు భరింపవలెనని మారినది. దీనినే కౌటుల్యుడును ననుకరించెను. ఏలయన "ప్రజలసౌఖ్యమే ప్రభువు సౌఖ్యము. వారి యారోగ్యమే ఆయన ఆరోగ్యము" అని రాజు పేరునకధికారియైనను, నిజమునకు ప్రజలయొక్క దాసుడు (నౌకరు). అన్ని వేళల జనులను సంరక్షించుకొనుటకు పన్నులమూలమున బత్తెమును గొనును. ఆయనను 'భర్తరక్షణి' అనికూడ వాడుదురు. ఆయనకు రాజ్యము అధీనము చేయబడెను. తనబాధ్యతకు విరోధమును కలిగించినయెడల చిల్లిపడిన పడవవలె ఆతడు వర్జింపబడవలెను. రాజు నెన్నుకొను విషయములోకూడ మనహిందూదేశము ప్రఖ్యాతిని గాంచినది. జనులు వారిలో నొకరిని నేకగ్రీవముగా రాజుగ నెన్నుకొనియెదరు. అప్పుడు యీ విధముగా జెప్పెదరు. "జనులందరు రాజ్యాధికారము నివర్తించుటకు నిన్ను కోరుచున్నారు. నీవు రాజ్యమును వృథపరచవలదు. కనుక రాజుగా మీరుఎన్నుకొనబడితిరి." ఒకజాతివారినే ఎన్నుకొనవలయు నని విధిలేదు. శూద్రప్రభువులును గలరు సామాన్యముగ క్షత్రియులు ప్రభుత్వశాఖగా వాడబడుదురు. సుగుణసంపత్తి ననుసరించి రాజు నెన్నుకొనియెదరు. పంజాబులో అమృతసరు ప్రాంతమునందును శారీరకాంతి ననుసరించి ఎన్నుకొనబడియెద రని చరిత్రకారులు నుడివిరి.

హిందూరాజ్యాంగములో నంతరాంగములు పెక్కుగలవు. "రాజు మంత్రులు, ప్రజలు రాజ్యము, కోట నగరము, ధనాగారము సేన, స్నేహితులు" అని. రాజుయొక్క ముఖ్యవిధి ధనము సంపాదించుట. తగిన బీదలకు దానిని సద్వినియోగము చేయుట. ధనవంతులు పన్నుల నెక్కువగా నియ్యవలయును. ప్రజల సౌకర్యమునకే పన్నుల వసూలు చేయవలయును. (ప్రజానామేవ భూత్యర్థం సతాభ్యో బలి మగ్రహీత్) "భోగ్యవస్తువులును, రాజ్యారిష్టము లగు వస్తువులును త్యజింపవలయును. రాజ్యములో గనులు, పరిశ్రమ ప్రతిష్ఠాపనలను సృష్టించి శోధింపవలయును. ఏలయన వాణిజ్యము పరిశ్రమ సంఘమును ధరించును. ప్రభుత్వము సంఘాభివృద్ధికే పాటుబడును" అని మహాభారతము చెప్పుచున్నది 1913 సంవత్సరమున రస్ డేవిడ్ గారు నీనిధముగ వ్రాసిరి. "బౌద్ధుల అధీనములో నున్న హిందూదేశభాగములలో కొన్ని ప్రభు సంబంధమైన ప్రజాప్రభుత్వములు (aristocracted republics) ప్రబలి నిప్పటికి సజీవులై యున్నవి. అదియునుగాక ప్రభుత్వరాజ్యములతోబాటు సంపూర్ణస్వతంత్రాధికారములు గల ప్రజాప్రభుత్వములును గలవు. విన్సెంటుస్మిత్ సహితము పంజాబుదేశమునందు ఇప్పటి అమృతసర్ కాంగరా మొదలగు ప్రాంతములందును తదితరములందును ప్రజాప్రభుత్వరాష్ట్రము లుండెనని సెలవిచ్చిరి. దీనివిషయమై చర్చవచ్చినప్పుడు సంస్కృతములో నుండు కొన్నిమాటలను బట్టి కొన్ని నగరములు సంఘములు రాజులవల్ల పరిపాలింపబడక ప్రజాప్రభుత్వాధికారాధీనములై యుండెనని తేలెను. అప్పుడే సంస్కృతపదమగు "గణ" అను శబ్దమును బట్టి నైయూహను స్థిరపరచగలిగిరి.

యవనదేశస్థులు ప్రజాప్రభుత్వప్రియులు. కాన పంజాబు, సింధు, మాలవదేశములలో ప్రజాప్రభుత్వములు ప్రబలెనని నుడిపిరి. క్రీస్తుకు పూర్వము 302 సంవత్సరములో చంద్రగుప్తునికొల్వుకు రాయబారిగా వచ్చిన మెగాస్తనీస్ యీవిధముగ జెప్పెను. "డోరియనుపరిపాలన నుండి చంద్రగుప్తుని కాలమువరకు 6042 సంవత్సరములు పరిపాలించిన కాలములో ప్రజాప్రభుత్వములు మూడుపర్యాయములు స్థాపింపబడెను. కొన్ని పురుషాంతరములు గడచిన పిదప ప్రభుత్వపాలనము నగరములం దంతరించి ప్రజాప్రభుత్వమునకు స్థాన మిచ్చెను" మెలోయి ఆక్సిడ్రోకై, కేతోయి, జాతులు స్వాతంత్ర్యాభిలాషులై చాల కాలము తమస్వేచ్ఛను అవిచ్ఛిన్నముగ సాగించిరనియు, నాశయిను అను జాతివారలు స్వతంత్రజీవులై, అధ్యక్షునకు లోబడి ప్రజాపరిపాలన సంఘములు పరిపాలనము జేయుచుండెను. శబర జాతివారలు ప్రజాప్రభుత్వమునకు నధీనులై యుండిరని అనేకచరిత్రకారులు నుడివిరి. పాటియాలాదేశము రాజుయొక్క యధికారము లేక ప్రజలే పాలించుకొనుచుండిరి. అట్లె బ్రాహ్మణపట్టణము లుండెను. అలగ్జాండరుని దండయాత్రలప్పుడు సింధుదేశమునం దుండెడి ప్రజాప్రభుత్వాధికారులకు నెక్కువ ఉత్సాహము నిచ్చి యవనులదాడికి నిరోధమును గలిగించి వారిస్వేచ్ఛను పునరుద్ధారణ చేయువఱకు పోరాటమును సాగించుటకు ప్రబలకారకులైనవారలు యీ బ్రాహ్మణ ప్రజాప్రభుత్వాభిలాషులె. కొన్ని ప్రభుత్వములు కలిసి ప్రప్రథమమున పోరాడెను గాని అన్నిటికి స్నేహభావము కుదరనందున అలెగ్జాండరుయొక్క దాడిని పూర్తిగ నిరోధింపలేకపోయెను.

మలోయి, కతేయి, ఆక్సిడ్రోకై ప్రజాప్రభుత్వజాతులు జయప్రదముగ అలెగ్జాండరుని దాడిని నిరోధించెను. వీరు వారి అంతఃకలహములను మాని పోట్లాడిరి కాని పైజెప్పిన కారణమున పూర్ణజయమును పొందలేదు. ఆక్సిడ్రోకైరాజ్యమున 80 వేల కాల్బలములు, 10 వేల గుఱ్ఱములు, 700 రథములు గలవు. తూర్పు రాజపుటానా మాల్వా దేశములలో అర్జునాన్ మాలవాస్ అంభియాన్ అను స్వతంత్ర జాతులు నప్పటికాలములో ప్రబలియుండిరి. యాధేయ జాతివారు సట్లెజినదీప్రాంతము లందును, పంజాబు మధ్యభాగములందును దరకాస్ అను జాతివారును ప్రజాప్రభుత్వ ప్రతిష్ఠాపన పాలనాధికారములో నుండిరి. ఎడ్విన్ బీవన్ చెప్పినట్లు అలెగ్జాండరు దండయాత్ర కాలమునందు పంజాబునందు రాజ్యాధికారము లేక వారివారి కులీనులచేత పరిపాలింబడిన స్వతంత్రజాతులు గలవు. ప్రభుత్వపరిపాలన రాజ్యములకును, ప్రజాప్రభుత్వరాజ్యములకును కొంత సంఘట్టనము కలిగినది. వేదములకాలములో నొక కుటుంబమువల్ల గాని కులీనులసంఘములచేత గాని పరిపాలింపబడు జాతులు గలవని థామస్సుగారు చెప్పెదరు. ఈ సినారయొక్క మల్లకలు వైశాలియొక్క లికలిస్ దీనికి తార్కాణములు. గొప్పరాష్ట్రాభివృద్ధిచేత క్రమముగా నివి నశించినవి. మౌర్యసామ్రాజ్యములో నవి అంతరించినవి. కాని మాలవప్రజాప్రభుత్వము మాత్రము నిలిచినది.

ఐతరేయబ్రాహ్మణమునందు భోజస్వరాట్ అను ప్రజాప్రభుత్వములు చేర్కొనబడినవి. ఆ సందర్భమునసే ఉత్తర కురు ఉత్తర మద్ర అనునవి రాజులేక సంఘము యావత్తు పరిపాలనకు నధికారము న్నట్టు చెప్పబడినవి. మధ్యదేశమునందును ప్రాగ్దేశమునందును గంగాయమునా ప్రాంతములందుమాత్రము ప్రభుత్వరాజ్యములు గలవని దానియందు చెప్పబడెను. పతంజలి మహాభాష్యములో ప్రజాప్రభుత్వాధ్యక్షుని రాజుగ నిర్ణయించెను. మహాభారతమునందు ప్రభువునకు లోబడక స్వతంత్రముగ పరిపాలించుకొను స్వతంత్రసంఘములకు 'గణముల'ని పేరుపెట్టబడెను. శాంతిపర్వమునందు గణములు ప్రజాప్రభుత్వముల విషయమై వర్ణింపబడినది. గణములయొక్క బలాబలములు రాజులు వానియందు కనుపఱచవలసిన సానుభూతిని వర్ణించిరి. ఆ సందర్భమున యుధిష్ఠిరునకు భీష్ముడు చెప్పియున్నాడు. "ప్రభుత్వముపట్ల ఏకత్వము సంఘీకృత కార్యము రాజ్యకార్యములందు గూఢము నాయకులందు నమ్మికనను నవి గణములయొక్క గొప్పచిహ్నములు" అని. ప్రజాప్రభుత్వవాదులు, మహాజ్ఞానులు, చట్టనిబంధకులు, న్యాయమునకు కట్టుబడువారు. తమలో తమకును విదేశీయులకు సహాయము చేయుటయందు నభిలాషగలవారు. బలవంతములగు ప్రజాప్రభుత్వములు నీరసములగు సంఘములకు సహాయము చేయుచుండెడివి. వారి ఏకత్వము శౌర్యమును గుర్తెరిగి విదేశీయులు వారిప్రాపును గోరుచుండెది."

మౌర్యరాజ్యస్థాపనకు ఈ ప్రజాప్రభుత్వములు నెక్కువ నాటంకముగ నుండెను. అర్థశాస్త్రమునందు కౌటిల్యుడు ఈ స్వాతంత్ర్యప్రజాప్రభుత్వముల రూపుమాపుటకు యుక్తిని చెప్పెను. ఆయా దేశములలో నల్లకల్లోలముల గలిగించి, వానిని నీరసముగ జేసి వానిని నాక్రమింపవలయునని తనరాజుకు నుపదేశించెను. ప్రజాప్రభుత్వవాదులకు అంతులు వేసి వారి నెక్కువగ బాధలుపెట్టి క్రమముగ నాశనము చేయుటయందు మనుస్మృతియు కొంత బనిజేసెను. మఠాధిపతులును, ప్రభువులును ప్రజాప్రభుత్వమువలన జనులు స్వేచ్ఛాభిమానులై స్వతంత్రమనియెడు స్వచ్ఛందజలమును పానముజేయువారని ఇప్పటి మన ఆంగ్ల ప్రభువులవలె అసహ్యించుకొని వారి ననేకక్షోభలుఁబెట్టి వారియందు ఆయున్నతౌదార్యములను ఆశలను నిర్మూలము జేసిరి. ఆ విధముననే మౌర్యగుప్త సామ్రాజ్యములను ప్రజాప్రభుత్వములు సాకల్యముగ నంతరించినవి.

మన హిందూదేశమున 26 ప్రజాప్రభుత్వములు విజృంభించెనని కౌటిల్యుడు నర్థశాస్త్రమునందు చెప్పియున్నాడు. వానిలో అంగ, మగధ, కాశి, కోసల, వ్రజ, కురు, పాంచాల, అవంతి, గాంధారి, శాక్య ముఖ్యమైనవి, కాంభోజి మొదలగు రాష్ట్రములలో క్షత్రియులు నెక్కువమంది యుండెడివారు. అవి సైనా ప్రజాప్రభుత్వములుగ ఖ్యాతకెక్కినవి. యూరోపుఖండములో స్విస్ ప్రజాప్రభుత్వము నందువలె వారిని యుద్ధమునందు వినియోగింపబడిరి. లికిలీల్, వజాస్, మద్రాక్షి, కురు, ప్రభుత్వములు సరియైన ప్రజాప్రభుత్వములు. కొన్ని రాజ్యములు రాజాధీనములో నుండి క్రమముగ ప్రజాప్రభుత్వములుగ మారినవి.

శాక్య ప్రభుత్వములో పదిలక్షలజను లుండెడివారు. వారు నాయకులలో నొకరిని నధ్యక్షులుగ నెన్నుకొనిరి. ఆయన రాజు అను నామములో రాజ్యమును నిర్వాహక ప్రాముఖ్యముగ నుండి వారియొక్క ఆలోచన, సభలయందు అధ్యక్షత వహించియుండెడివాడు. వారి హోదా సంకేరం సామాన్యజనులవలె పరిగణింపబడెడివారు. బుద్ధుని తండ్రియగు శుద్ధోధనుడు ఎన్నుకొనబడిన అధ్యక్షుడు. అధికారానంతరము ఆయన సామాన్య పురజనునివలె పరిగణింపబడెను.

వైశాలి ప్రభుత్వము విజ్జుముక్ ప్రజాప్రభుత్వములు కలిసి యుండెను. వారిలో నధ్యక్షులు రాజులని పిలువబడెడువారు. వైశాలి అనునది ఒక గొప్పపట్టణము. ఆ పట్టణమునందు ప్రజాప్రభుత్వము గలదు. అందు 7 వేలమంది సభ్యులు గల సభ గలదు. ప్రతిసభ్యున కొక గజ ముండెను. వారికి యువరాజు గలడు. వారి చట్టములు ఆచారముల ననుసరించి చేయబడుచుండెను.

యాదేయ ప్రజాప్రభుత్వమునందు శూరత్వముగల జను లుండెడివారు. వారికి ఆరువేల తోటులు 60 వేల కాల్బలములు గలవు. వీరి రాజ్యము క్రమముగ చంద్రగుప్తుని సామ్రాజ్యమునందుఁ జేర్పబడినది. వీరు మహాభారతములోఁ జెప్పబడిన యాదవులసంతతివారని కొందఱుఁ జెప్పుదురు. మాలవప్రజాప్రభుత్వమును సట్లేజిప్రాంతముల ప్రబలినది. ఈ ప్రజాప్రభుత్వములు తమంతటతాము వృద్ధిపొందెను. కొన్ని సమ్మేళనము (Frederation) గా జేర్చి యొక్కువబలము గలిగియున్నవి. వృజ్జిస్ సమ్మేళనము స్విస్‌సమ్మేళనమువలె బౌద్ధమత కాలమునందే ప్రబలెను. అదియే ఉత్తరజాతులయొక్క సమ్మేళనము. అది ఇప్పటి బీహారు దేశమును ఆక్రమించుకొని చివఱకు అజాతశత్రువువల్ల తరుమబడెను.

బుద్ధుడు ప్రజాప్రభుత్వస్వరూపము ననుసరించి ఆయన తత్త్వాశ్రమ సిద్ధాంతమునుఁ బొందుపరచెను. ఆయనకు ప్రజాప్రభుత్వమన్న నెక్కుడు ప్రీతి. జైనులు ఏకముఖత్వమున సభల గావించి వారి పనులను గొనసాగించిన యెడల వారు ఎప్పుడు గొప్ప యుచ్ఛస్థితియం దుందురని ఆ మహానుభావుడు చెప్పెను. వారిలో అంతర్గర్భితములైన లోపములవల్ల మౌర్యగుప్త సామ్రాజ్యములో నవి అంతరించిపోయినవి. హిందూదేశమున ప్రజాప్రభుత్వములు జనసామాన్యముయొక్క జీవనమున కతీతములు కావు. చిన్న పెద్దలు స్త్రీలు ఆలోచనసభలందును చట్టనిర్మాణమునందును, పాలనమందును జోక్యము పుచ్చుకొనుచుండెడివారు. రాజ్యవ్యవహారములలో జోక్యము పుచ్చుకొనుటకు గర్వమును బొందిన గ్రామవాసుల (స్త్రీలతోసహా) తోడ్పాటుకు ప్రభుత్వము ననుకరించుచుండెను. రాజును కార్యనిర్వాహకసభ్యులను సేనాధిపతిని ప్రజలే ఎన్నుకొనుచుండిరి. కేంద్రప్రభుత్వమునకు స్థానికప్రభుత్వమునకు సఖ్యము బాగుగ నుండెడిది. కేంద్రప్రభుత్వము ననుసరించియే స్థానిక ప్రభుత్వము గ్రామసంఘములు పారిశుద్ధ్యసమితులు స్వరూపస్థాపనఁ జేయబడెను. రాజనగరములందు మోతేవాలువలె పట్టణములందును, గ్రామములందును తగినరీతిని సభామందిరము లుండెడివి. మౌర్యచక్రవర్తులు ప్రజాప్రభుత్వస్వరూపములనే అనుకరించిరి. వారు రాజ్యమును ఏకత్వముగ నుంచి రాష్ట్రములఁ బాలించుటకు రాష్ట్రాధికారుల నియమించిరి. గ్రామ పట్టణ మండల రాష్ట్రాధికారులు వారివారిప్రదేశములలో జరుగు వ్యవహారములను కేంద్రప్రభుత్వమునకు పంపుచుండిరి. మనదేశములో ప్రజాప్రభుత్వములు గుప్తసామ్రాజ్యమువల్ల నాశనమైనను కేరళదేశమున 18-వ శతాబ్దివఱకు స్వతంత్ర ప్రజాప్రభుత్వము తలయెత్తుకొనియుండెను. దానిలో స్థానిక ప్రభుత్వవిషయములో 1748 సం॥ వఱకు జనులు సభలద్వారా పరిపాలించుకొను చుండిరి. ముఖ్యప్రజాప్రభుత్వసభను 'నాడు' అని పిలుతురు. ఈ సభకు ప్రతి గ్రామములనుండి గ్రామభాగములనుండి గ్రామకూటములనుండి ప్రతినిధులు ఎన్నుకొనబడిరి.

ఇంతియగాక ఒకవిధమగు నధికారము స్వతంత్రము గల స్థానిక 'జాతీయ (Tribal) సంఘములు' గలవు. వానినే శుక్రనీతియందు గణములు' అని చెప్పబడెను. ప్రతికులమునకు ప్రతిశ్రేణికి ప్రతిగణములకు దొంగతనము బందిపోటు తప్ప ఇతరనేరముల విచారించి శిక్షితుల దండించుటకు నధికారము గలదు. కొన్ని సంఘములు కొన్ని నేరములను- కొన్ని సంఘములు కొన్ని నేరములను- వారివారి సామర్థ్యమును బట్టి అధికారమును చలాయించుటకు నిర్ణయింపబడెను.

దక్షిణహిందూస్థానములో నయితము కొన్నిగ్రామములు కూటమిగ జేరి తమలో తాము పరిపాలన జేసికొనుట మొన్నటివరకునుఁ గలదు. చోళరాజ్యములో అనేకగ్రామములు సభల నేర్పరచుకొని అంతర్వ్యవహారములఁ బరిష్కరించుకొనుచుండెను. పరాంతక యను చోళరాజు కాలములో పరిపాలనమును నిర్వహించుటకు అఱు ఉపసంఘములు గలవు. సాంవత్సరికోపసభ (Annual Committee) వ్యవసాయసంఘము-పారిశుద్ధ్యసంఘము-కోశసంఘము-న్యాయసంఘము కార్యనిర్వాహకసంఘము అని. అం[illegible]కలలో స్త్రీలుకూడ పనిజేయుదురు. తరువాత కొన్నిగ్రామములలో [illegible] యుతి' అను పేరుతో తమ వ్యవహారముల బరిష్కరించుకొనుచు[illegible] అయితే ఆంగ్లనిరంకుశప్రభుత్వము వలన జనులయందు ప్రభుతా[illegible]శించెను. దానిచేతనే ఆ జనులు నిస్సహాయులైరి. అఖిలామ[illegible]నుటకు సరియైన స్వాతంత్ర్యము జనుల కొసగవలయును. [illegible] సమానము పోయి వారి దేశ వ్యవహారములను పరిష్కరించు[illegible]గిన యవకాశము వారి కియ్యవలెను.

# ఆంధ్ర తేజమ వందనం బందికొనుము

తాపీ - ధర్మారావు గారు, బి. ఏ.

౧

విజయనగరాంజనేయు సే।వింప నేఁగి
క్రూర విరచిత పరిభావ । ఘూర్ణితాత్మ
ఁబెల్లు వగఁ ద్రెళ్లి, మది తల్ల।డిల్లి, యుల్ల
మందునం బాపసందేహ । మల్లికొనఁగ
"నాంధ్ర తేజంబు గలదె యీ । యవని నింక?"
నంచుఁ గించిజ్ఞతఁ మించ । నెంచినాఁడ;
కాని సందేహమును బూని।నాను గాన
దోస మూనెను మది కిదె. । దోసి లిడెద
నాంధ్ర తేజమ వందనం । బందికొనుము.

౨

మౌర్యవంశసంస్థాపనా।చార్య వర్యుఁ
డైన చంద్రగుప్తుఁడు చం।డాంశులీల
యవనజనమును గవనున । కవల నునిచి,
దండితారాతివీర ప్ర।కాండుఁ డగుచుఁ
బాలనము సేయుమగధకుఁ । బాటవమునఁ
గయ్యమునకు వియ్యమునకు । నెయ్యమునకు
నీడుజో డనఁగూడుని।ప్రౌఢ యనఁగ
మన్ననలఁ గన్న వన్నెయే । మాఱియున్న
తెలుఁగు నెఱుఁగక పొరపడి । తెగఁ దలఁచితి,
దోసమూనెను మది, కిదె । దోసి లిడెద
నాంధ్ర తేజమ వందనం । బందికొనుము.

3

కైదు వనఁ బాప మని యశో।కక్షితీశుఁ
డాత్మ పరితాపబోధనీ।యానురాగ
పూరితం బగు సందేశ।ముం బనుపఁగ,
విమలదర్పణప్రక్షిప్త । బింబ మటులు
"ప్రణయభరితాత్ములమె మేముఁ । బగఱకొఱకె
"యాయుధాంకితపాణుల । నలరినార"
మిన్ని నాళులు; పశుబల । మెన్ని తాత
పడయని జయంబు [illegible] । బడసి తనుచు,
ఖడ్గధారలఁ బ్రేమ[illegible]ములఁ జేసి,
భువి నశోకంపు వ[illegible] । ముంచి యెత్తు
నాఁటి తేజంబు గల [illegible] । మాట లేమి
దోస మూనెను మది కిదె । దోసి లిడెద
నాంధ్ర తేజమ వందనం । బందికొనుము.

౪

అవల, నన్నూట యేఁబది । హాయనంబు
లొక్కఫక్కిని దిక్కుల । నుక్కు మిగిలి
యుర్వి సర్వంబు నేలు చ।ఖర్వమతిని
"వేల లింకేల మాకలా।లీలల" కని
మణిమయూరాది దేదీప్య।మాన మైన
వస్తువులతోడ విహరింప । వనిధి నెల్ల
నంచితోద్యానసరసిఁ గా।వించి మించి;
దుర్గ మాహార్యముల నెల్ల । తొల్చిమల్చి
'స్వర్గ మీచోట భూమికి । సాఁగి వచ్చె
నేమొ' యనునట్లు సొంపుల । నింపు నింపు
దేవళంబుల శాశ్వత।ఠీవి మెఱయఁ
గట్టి గట్టిగ భక్తినిఁ । జెట్టఁబట్టి;
గహ్వరంబుల కుడ్యభా।గంబు లెల్ల
పటము లొనరించి, తా మెంత । ప్రాఁత వడియు
నైగనిగ్యంబు వోని వ।ర్ణములతోడ
బళిరె నేర్పున రచియించి । భారదీయ
చిత్రలేఖన కొకకొంత । యాత్ర ముడిచి
వజ్రమున కన్న పరుసనై । వైరిపట్లఁ
గష్ట మన్నను గుసుమంబు।కన్న మెత్త
నగుచు లోకంబు మెచ్చఁగా । నలరినట్టి
తేజ మున్నది మఱియొక్క । యోజ ననుచు
నెంచఁ జాలక యే సంశ।యించినాఁడ
దోస మూనెను మది, కిదె । దోసి లిడెద
నాంధ్ర తేజమ వందనం । బందికొనుము.

౫

వేఁగిదేశానఁ బాలన।విధమునందు
నిగమసభలను నిర్మించు । నేర్పు మించు
సౌష్ఠవముఁ జూపి దేశభా।షా ప్రపంచ
సార్వభౌమత నర్థించి । సాహితీవి
శుద్ధవాహినీగతబుద్ధి । నుద్ధతు లయి
నాఁటికిని నేఁటికినిఁ గూడ । సాటియన్న
మాట లేకుండు రత్నాల।మూట లనెడు
కృతుల నతులితగతుల స।న్నుతుల నందు
నాచళుక్యాది నృపుల క।ళ్యాణకాల
మందుఁ గల తేజ మింకొక । చంద మంటఁ
గాంచనేరక మది సంశ।యించినాఁడ

దోస మూనెను మది కిదె దోసి లిడెద
నాంధ్రతేజమ వందనం బందికొనుమ.

౬

ఖండనాపరరుద్రులు, ఖండితారి
నికరభద్రులు కీర్తినిర్నిద్రు లలఘు
వితరణసముద్రులును రుద్రక్షితివిభు లట
నోరుగల్లున విలసిల్ల నుల్లసమున
మొలకుఁ దురకల డీకొని నలకుటొండె
రమ్యకావ్యంబులను బరిశ్రమలయందు
కాలమును బుచ్చియొండె విఖ్యాతిఁ గాంచి
రుద్రమాంబిక సామ్రాజ్యభద్రపీఠి
నెక్కి నెక్కట సర్వంబుఁ జక్కఁజేసి
'అబల యఁట! పాలనంబున సాబ గదేటు!
మేలు మే లని పరులును జాలఁ బొగడ
వైభవమునఁ దులఁదూఁగి వన్నెఁ గన్న
నాఁటితేజంబు దాఁ బరిణామ మంది
యున్న దీనాఁడుఁ గనఁజాల కున్నకతన
దోసమూనెను మది కిదె దోసి లిడెద
నాంధ్రతేజమ వందనం బందికొనుము.

౭

సప్తవప్రావృతంబు ప్రాసాద సీమ
దక్షిణాపథమెల్ల నుద్యానవనము
విజితవైరిరాట్ శ్రీ లక్ష్మీవితతి గాఁగ
హాయి విహరించి యాకాశ మంటుచుండు
స్వీయకేతనచేలాగ్రసీమ పవన
చాలనంబునఁ దటతట సద్దుసేయు
నంతమాత్రాన శత్రుహృదంతరములు
దడదడని కొట్టికొనునంత ధాటిఁజూపి
మణిగణపురాసు లచటి విపణులలోన
లోచనంబులఁ దనివారఁ జూచి చూచి
నవసుధా ధారలను మీఱు నవ్యభవ్య
కావ్యపీయూషపాన సౌఖ్యంబుఁ గాంచి
యెందుఁ జూచినఁ దనవారె ముందుగాఁగ
సర్వతోముఖసుస్థిరైశ్వర్య మంది
విజయనగరాన ప్రతిభమై వెలయు నాఁటి
తేజ మీనాఁడుఁ గ్రాలుటఁ దెలియకుంట
దోస మూనెను మది కిదె దోసి లిడెద
నాంధ్రతేజమ వందనం బందికొనుమ.

౮

అన్నిదిశలను మన్నన లంది యవని
నల్లుచున్న నీభుజబలం బైనఁగాని
జలధివలయిత మేదినీచక్రమందు
నిదియు నదియును ననకుండ నెల్లయెడల
కరగి మాన్యత మనెడి సాహసము గాని!
అద్వితీయపరాక్రమ మరులు మెచ్చ
నాహవక్షోణిఁ జూరు ధైర్యంబు గాని;
శీతనగ మంటి దీప్తి రాజిల్లుచున్న
ప్రాభవస్ఫూర్తిలో నెక్కు పాలు గాని;
కడలి మొదలుగ నల చలిగట్టువఱకుఁ
గలుగునాములఁ బోడిమిఁ గాంచుచున్న
భవ్య భవదీయ పాలన ప్రౌఢిఁ గాని;
న్యాయశాలల నున్న యగ్రాసనములఁ
గొలువు నెలకొని శోభలఁ గులుకుచున్న
యమల విజ్ఞాన వైభవ మైనఁ గాని;
కార్యసాఫల్యమునకు గంకణము గట్టి
యెట్టి యిక్కట్టు లలమిన నీసడించి
ముందె నడచెడి నీదగు పూన్కి గాని;
'ఆత్మశిక్షను జేకూఱు నలఘుభాగ్య'
మనెడి నానుడితత్త్వంబు నరసి చూపు
నబ్బురం బగు త్యాగంబు నైనఁ గాని
దేనినైనను నొక్కింత యైనఁ గాని
యరసినంతన నద్దిరా యాంధ్రతేజ
మంతరింపఁగ లేదు రూపాంతరముల
నలరుచున్నది నేఁడును ననఁగ దగదె!
అట్లు చూడంగ లేక నే నక్కటకట!
కానిసందేహమును బూని నాను కాన
దోసమూనెను మది కిదె దోసి లిడెద
నాంధ్రతేజమ వందనం బందికొనుమ.

౯

ఆంధ్రతేజంబు గలదింక నలరఁగలదు
చూడఁజాలక బేలనై గోలుమంటి
శోకపుంబార కప్పె నాలోకనముల
సందియం బంధకారమై క్రందుకొనియె
బాగునోగు నెఱుంగని పాడువంత
వింతచింతలఁ బైకొని యింతఁ జేసె
అక్షయ మనశ్వరము సిద్ధ మక్షరంబు
నైన నినుఁగూర్చి సందేహ మందినాఁడ
దోసమూనెను మది కిదె దోసి లిడెద
నాంధ్రతేజమ వందనం బందికొనుమ.

Late Rao Bahadur
Varada Mallappa Sholapur



కీ. శే. రావుబహద్దరు
వారద మల్లప్ప షోలాపూరు

Sree Matsyavamsam
Sree Jagannadha Bhupati Deva Varma



శ్రీమత్స్యవంశం శ్రీజగన్నాధభూపతి దేవవర్మ

Sriyut
Pulavarty Venkatraya Sarma



శ్రీయుత పులవర్తి వేంకట్రాయ శర్మ

Sriyut G. Ranganayakulu



శ్రీయుత జి. రంగనాయకులు

Sriyut
Doma Venkataswamy Gupta



శ్రీయుత దోమా వేంకటస్వామి గుప్త

Barrister A. Venkata Ramana, Narsapur



బారిష్టరు ఎ. వెంకట్రమణ

Sriyut Chivukula Sree Ramlu



శ్రీయుత చివుకుల శ్రీరాములు

Sriyut Guntur Venkatasubbayya



శ్రీయుత గుంటూరు వేంకటసుబ్బయ్య

Sriyut Kalluri Subbarayulu



శ్రీయుత కల్లూరు సుబ్బారాయులు

Sriyut Atmakuri Govindacharyulu Released on the 5th Sep. 1922



శ్రీయుత ఆత్మకూరి గోవిందాచార్యులు 5-9-22 న వదలబడిరి

Sri Iticala Sooryanarayana



శ్రీయుత ఇటికాల సూర్యనారాయణ

Sri Kotagiri Venkata Krishna Rao gar



గంపలగూడెం కుమారరాజా శ్రీ కోటగిరి వెంకటకృష్ణారావు గారు

Sriyut Mattım Bala Subrahmanya Gupta



శ్రీయుత మఠం బాలసుబ్రహ్మణ్య గుప్త

# * మన జాతీయపాఠశాలలు ఏల విచ్ఛిన్నము లగుచున్నవి?

ఎమ్. సాంబశివరావు గారు, బి. ఏ., ఎల్. టి.

వెనుక నొకసారి కాకినాడలో మహాకవి రవీంద్రనాథ ఠాకూరు గారి సందర్శనము లభించినపుడు కవిపుంగవుని నీక్రింది ప్రశ్న మే మడిగియుంటిమి. "వంగదేశమునందు జాతీయవిద్యాపీఠము స్థాపింపబడి యంతరించుటకు కారణ మేమి?" దానికి మిక్కిలి సరసముగాను, యుక్తియుక్తముగాను, కవిసార్వభౌమునకు సహజమైన భావగుంభనముతోను వా రిట్లు సమాధాన మొసగిరి. "అది జాతీయము కాకపోవుటయే దాని విచ్ఛిన్నమునకు కారణము" అని సెలవిచ్చిరి. వ్యంగ్యప్రధానం కావ్య మను నార్యోక్తి ననుసరించి మహాకవి వాక్యములయందు వ్యంగ్య ముండుట సహజము. కాన, నీపై వాక్యమునం దొక కావ్య మినిడి యుండవచ్చు నని మాలో కొందఱకు దోఁచినను, వారి ప్రత్యుత్తరము తాత్కాలికముగా మాకు సరియైన సమాధాన మిచ్చినట్టు మాత్రము సంతృప్తి గల్గలేదు. కాని వత్సరములు గడచినకొలదిని దాని నిజవ్యాఖ్య ప్రకృతపరిస్థితులలో "అనేక జాతీయపాఠశాలలు" మన యాంధ్రదేశమున నుద్భవించుటయు, నవి కొలదికాలములోనే నామమాత్రము లగుటయును కన్నులార గాంచి, పరిశీలించినవారికి సుబోధకమగుచున్న దని నేనూహించుచున్నాను. నా యూహాప్రపంచమును, నామిత్రుల దిద్దుబాటునకు బద్ధుడనై, వాత్సల్యపూర్వకముగా నీక్రిందివాక్యములలో పొందుపరచుచున్నాను.

## జాతీయపాఠశాలల చరిత్రము

సంగ్రహముగా వీని యుత్పత్తియును వృద్ధిక్షయములును నొకింత విచారణీయములు. ఈమధ్యను అందందు "జాతీయపాఠశాల" లను నామముతో వెలసిన వ్యవస్థ లన్నియు తోకచుక్కలవలె నావేశఫలితములును, క్షణికములునగు ఉల్కలవంటివియే కాని స్వయంప్రకాశమాన మగు తారకామండలివంటివి గావు. అట్లు చెప్పుటవలన వాని ప్రయోజనము శూన్యమని మాత్రము పాఠకు లర్థము జేసికొనగూడదు. ఉల్కలకును ధూమకేతువులకును భగవత్సృష్టియందు ప్రయోజనము లేదని ఏమూఢుడైనఁ జెప్ప సాహసింపఁగలఁడా? అట్లే వీనికిగూడ తాత్కాలిక ప్రయోజన ముండి యుండవచ్చును. అట్టి యవస్థగూడ జాతీయతానిర్మాణమునందు అవసరమై యుండనోపును. ఈపాఠశాలలు ఆవేశజనకములని చెప్పియుంటిని. ఏలయనఁగా అవి రాజ్యాంగరథమును త్వరలో గమ్యస్థానమును జేర్చుటకు సాధనములుగా పరిగణింపబడినవే గాని, కష్టముల కోర్చియైనను సంపాదింపవలసిన సాధనవస్తువులుగా పరిగణించి పాటుపడుటకు కావలసిన కాలపరిమాణమును, వివేచనశక్తియు లేకపోయెను. సాధనముగా పరిగణింపబడినవస్తువు సాధ్యముగా నెన్నటికినిఁ బనికిరాదు. కాలక్రమమున నవసరము తీరినవెంటనే దానిని పరిత్యజింపవలసినదే. అట్లే మన జాతీయపాఠశాలలును, రాజ్యాంగరథముయొక్క గమనము మందగించినతోడనే స్రుక్కి వాడిపోయినవి. ఒకయుదాహరణమువలన దీనిని బాగుగ వివరించెదను. ఇదివఱకు రాజ్యాంగసభలకు జాతీయవిద్యాపాఠశాలల బాలురను తీసికొనిపోయి ఉద్రేకపూరితములైన పాటలు పాడించుచుండెడివారు. అప్పుడు అందఱకును ఆనందముగనే యుండెడిది. కొంతకాలమునకు అట్టిసభలే కట్టిపెట్టవలసి వచ్చినది. అప్పుడీబాలుర యుత్సాహమునకు తావు కనబడలేదు. ఆవిధముగా సాధనమాత్రము లైన నివిగూడ, క్రమముగ సాధ్యవస్తువు లోపించుటచే లోపింపవలసివచ్చినవి.

కాఁబట్టి మన జాతీయపాఠశాలలకు సాధ్యాభావమే ముఖ్యలోపములలో నొకటియని పైన వివరించితిని. అట్టివిగాక మఱికొన్ని ఏదో ఆదర్శమును పెట్టుకొని పని ప్రారంభించి యిప్పటికిని నిలిచి వృద్ధి పొందుచున్నవి కొన్ని యచ్చటచ్చటఁ గలవు. వాని కీవిమర్శ వర్తించదు. అవి తదాదర్శప్రాప్తికై సర్వకాలము వర్ధిల్లుగాక. ఈసందర్భమున నా మిత్రుఁడును-ఆంధ్రజాతీయకళాశాలా ప్రధానాచార్యుఁడును- మన దురదృష్టవశమున కీర్తిశేషుఁడును-నగు- శ్రీయుత కోపెల్ల హనుమంతరావు పంతులు గారి దూరదృష్టిని మిక్కిలి కొనియాడవలసి యున్నది. ఆమేధావి ఎంతమాత్రమును ఈమధ్య విజృంభించిన రాజ్యాంగకల్లోలమునందు పాల్గొనకుండిన విషయము సంద ఱెఱుగుదురు. అయినను నీపరిస్థితుల వలన లభించెడి లాభములను ఆయన తనకళాశాల కొఱకుగూర్పక విడిచి పెట్టెనా? ఎంతమాత్రమును లేదు. వచ్చెడిలాభములను గ్రహించుచు సుడిగుండము మధ్యకు కళాశాలనీడ్వక చక్కఁగ నేర్పరియైన కర్ణధారివలె కళాశాలను నడిపించి కీర్తిశేషు లైన మహానుభావుఁడు ఆయనయొక్కఁడే! దానికిఁ గారణము ఆయన సాధ్యవస్తువుకు ఎట్టి ఆవేశకారణ మున్నను, మఱపుదగులక యుండుటయే. అట్టి ప్రజ్ఞావిశేషములు గలవారు మరికొందఱు గూడ నచ్చటచ్చట పాఠశాలలను నడపుచున్నారు. వారును మన కృతజ్ఞతకును, మన్ననలకును పాత్రులే. అట్టివారు కొందఱైనను ఉండుటఁబట్టియే, అవియు నిలచియున్న వని యెంచవచ్చును.

మనజాతీయపాఠశాలలో జేరినవారందఱును, విద్యార్థులును, ఉపాధ్యాయులును గూడ- ఆంగ్లపాఠశాలల నుండి వెలువడినవారే గాని, తదితరులు విశేషముగా లేరు. వారికి ఆజన్మతః జాతీయత యన నేమియో, యెట్టిదియో ఏ ఆంగ్లపాఠశాలయందును జెప్పియుండకపోవుటచే

* నేనీవ్యాసమును వ్రాయుట ఆత్మవిమర్శనముకేగాని పరదూషణమునకు గాదు. కనుక నిందలిపారుష్యములను పాఠకులుక్షమింప ప్రార్థితులు—మం. సా.

వారికది గగనకుసుమమనంటిదైనది. ఏమైనను కొలదిగ గృహసంబంధమున వచ్చిన నది మొదటవచ్చిన చెవులకంటె తరువాత వచ్చిన కొమ్ములు వాడి యనునట్లు, ఆంగ్లవిద్యాసంపర్కమువలన నశింగంటిపోయి యుండును. అట్టివారే అనేకులు కర్ణధారు లైనారు. వారు చేయునదేమి? వారి యభిప్రాయము లెట్లుండును? వారు ఆంగ్లవిద్యావాసనను వదలించుకొనగలరా? ఎక్కడనో ఒకరుండిన నుండురుగాక! ఆంగ్లపాఠశాలలలోని విద్యాభ్యాసమును మించిన విద్యయే తామొసగవలెనని వారి యాదర్శము. ఆ యాదర్శమును ముందుపెట్టుకొని ఇంగ్లీషు భాషను హిందీని డ్రాయింగునను చిత్రకళాసంగీతములును ఆనందవాచమునను ఆంధ్రనామసంగ్రహమును చేర్చినారు తడిసిమోపెడు అనునట్లు, జాతీయహృదయుల దయాదృష్టిచే జాతీయవిద్యాభ్యాసము బహుభారమై, తనభారముచేత తాను క్రుంగిపోవుచున్నది. ఇట్టి జాతీయపాఠశాల లైనను బాలికలకు గూడ నున్న దేమో యనలేదు. వారిని ఇతరులచేతులలోనే విడిచిపెట్టినాము. ఇట్టివియా జాతీయపాఠశాలలు!

ఇప్పటికిని అచ్చటచ్చట మనచే మిక్కిలి హీనముగా చూడబడు "వీథిబడు లనునవి గల"వని మనవారికి దెలియునా? తెలిసినను అవి జాతీయసాంప్రదాయమును ఇప్పటికిని నిలవబెట్టుచున్నవని మనము గుర్తించితిమా? హేళనచేయవలయునని యున్నప్పుడే వానిని తలపెట్టుదుము. గాని జాతీయవిద్యాపాఠశాలల పాఠక్రమ మేర్పఱచుటకు మనము పూనుకొనినప్పుడు అవి మన మానసవీథి నైనను బొడగట్టవు. పాఠక్రమమునకు గాకపోయినను మూలసూత్రములకొఱకైన ప్రాణావశిష్టమైన నీపూర్వసంస్థలను మన మెప్పుడైన పృచ్ఛకరించినామా? ఆపని చేసిన మన కిప్పటికే నూతన జాతీయవిద్యావిధాననిర్మాణము సులభసాధ్యమై యుండెడిదికాదా?

## వీథిబడుల మూలసూత్ర మేది?

వీథిబడులలో ముఖ్యమైనవాడు ఒక్కడే పంతులు. వానిక్రింద సహాయోపాధ్యాయులుకాని బడిపెద్దకాని లేడు. ఎగవేయువాడు. డొకడును దిగదీయువాడు మఱియొకడును లేడు. ఎట్టి ఉపాధ్యాయసంఘర్షణము లేదు. అందఱును పంతులుమాటమీద నడువవలసినవారే గాని, వాని మాట కడ్డుచెప్పువారు లేరు. ఆ పంతులకు ఒక్కవిషయమునందెక్కుడు ప్రావీణ్యముండును. ఒకవడిపెట్టుటయందో, లేక కోటిలెక్కలు చెప్పుటయందో, లేక పద్యములు పురాణశైలిని శ్రావ్యముగా చదివించుటయందో, స్తుతి దేనియందో! కొందఱు కవిత్వము నేర్పగలవారు నున్నారు. ఇట్లు వారిప్రతిభను బట్టి ఎవరికి దేనియందు రుచి గలదో అట్టిబాలురను ఆకర్షించుచు, ఎవరి కేది కావలయునో దానినే వారికి నేర్పుచు, ఎవరిది యిచ్చిన దానినే స్వీకరించుచు, ధనము ఆవశ్యకము కాదని తన జీతమువల్లనే బోధించువాడు. ఇట్టి ఆదర్శముతో నిండియున్న వీథిబడిని జాతీయపాఠశాల యని మన మెంచితిమా? వానిపేరునైనను తలపెట్టితిమా! వాని మూలసూత్రములనైన గుర్తించి మనలో నిమిడ్చికొంటిమా? ఇమిడ్చికొనుటకైనను ప్రయత్నించితిమా? అట్లు చేయకపోవుట మనలోపమని ఇప్పటికైనను మనము గుర్తించి ప్రతివీధికిని ఒక వీథిబడిని మనము పెట్టగల్గినవో జాతీయవిద్య సఫలము కాగలదని మనము నమ్మవచ్చును.

అయితే మనము వీథిబడులను సంస్కరింపవలసిన యావసరము లేదాయని ప్రశ్న రావచ్చును. సంస్కరింపవలసినదే. వాని మూలసూత్రములకు భంగము గలుగకుండ- వానిస్వరూపమును నాశనము చేయకుండ- వాని యాదర్శములను దిగకుండ- మన మేమిచేసినను అవి తమపూర్వకార్యమును నిర్విఘ్నముగా జరుపుకొనుచు జాతీయతకు తోడ్పడు నను టకు సందియము లేదు.

వందలకొలది పిల్లలను ఒక్కచో చేర్చి ధనము స్వీకరించి విద్య నేర్పుట మనసంప్రదాయమున కనుకూలము గాదు. పెద్దపెద్ద భవనములు బోధనసామగ్రి విశేషముగా నుండినగాని విద్య నేర్పుటకు వీలులేదని తలచుట నవీనపాశ్చాత్త్యసాంప్రదాయమే కాని, మన భారతసాంప్రదాయము కాదు. మనవ్యవహారములకు సూర్యచంద్రులును నక్షత్రములునే సాక్షులు గాని, దేవాలయములోని పూజారులును రిజిస్టరులును సాక్షులు గారు. పాశ్చాత్యసంసర్గమువలన మన సత్యప్రియత్వము అంతరించినకొలది ఇట్టి బాహ్యాడంబరములే ముఖ్యము లనియు, నంతశ్శుద్ధి అనావశ్యక మనియు నమ్మకము విస్తరించి పోయి, భారతజాతిని మూలచ్ఛేదము చేయుచున్నది. కాబట్టి మన జాతీయతను కాపాడుటకే మనజాతీయవిద్య నిర్మితము గావలయును. మన జాతీయసాంప్రదాయములనే మన మనుసరింపవలయును.

మన జాతీయ విద్యా నిర్మాతలు జేసిన గోపము మఱియొకటి కలదు. వీథిబడులను తిరస్కరించుట యొకటియే యైన క్షంతవ్యమే. జాతీయ సాంప్రదాయసిద్ధములైన వృత్తులను వేనినిగూడ మనము అంతగ ప్రోత్సహించియుండలేదు. ఏపల్లెటూరిగానో ఒకమూలను ఏయరుగుమీదనో లేక దేవాలయమంటపమునందో ఒక ఘనాపాఠిగారు నలుగురు బ్రహ్మచారులను నుసుకూర్చుని అధ్యయనము చెప్పుచున్నారు. కడియం అనుగ్రామములో ఒక మహాకవి శతావధానిగారు కొందరు విద్యార్థులను ప్రోగుచేసి వారివారిసహాయమువలననో లేక తనచేతి సొమ్ము వలననో, ఒక పాఠశాలను స్థాపించి—అందులో కావ్యములు కవనము కౌముది యిత్యాదివిద్యలను నేర్పుచున్నాడు. మఱియొకయూరిలో ఒక జ్యోతిష్కుడు తన శిష్యునిచేత పంచాంగమును గుణింపజేయుచు శుక్రాదిగ్రహగతులను సంవత్సర మంతయు నిమిషము లైనను తప్పకుండ లెక్కింపజేయుచున్నాడు. మఱియొకయూరిలో ఒకసిద్ధాంతి కొందఱకు జ్యోతిషమునందలి జాతకభాగమును నేర్పుచు, మహాదశల, అంతర్దశల ఫలమును శాస్త్రప్రకారము లిఖింపజేయుచున్నాడు. ఇట్టి పాఠశాలలు అనేకము లున్నను అవియే నిజమైన జాతీయవిద్యలను నేర్పుచున్నను వానిని "జాతీయపాఠశాలలు"గా గాని తుదకు పాఠశాలలుగా గాని మనము గుర్తించియుండలేదు. వానికి సహాయము చేయవలసి యుండునని మనము కలలోనైనను తలచియుండలేదు. ఉన్నవానికి సహాయము నిచ్చి పోషింపకపోవుటయే గాక క్రొత్తవానిని విజాతీయపాఠశాలల నమూనామీద స్థాపించి వానినైనను సరిగా నడుప

జాలక మహాదోషము నొనర్చుచున్నాము. అందువలన కొన్ని అంతరించి పోవుచున్నవి. అందుకు విచారపడవలసిన అవసరము లేదు. ఏలయనఁగా వానియందు జాతీయమైన జీవకళ యేమియు లేకపోవుటయే వాటి విలయమునకు కారణము. నిలచియున్న వానిలోను అట్టి జీవకళ ఏదో యొకటి గలదనియే మనము నమ్మవలసి యున్నది. ఇందుకు బందరు ఆంధ్రజాతీయకళాశాలవంటి కొన్ని సంస్థలే నిదర్శనములు. ఇంతియు కాదు. మనయూరిలో నొక మూలను చిన్న గుడిసెలో కుమ్మరివాడు తన కుమారునిచే మన్ను కలిపించుచు తాను సారెమీద కుండలను తయారుచేయుచున్నాడు. ప్రక్కను వానిభార్య కుండలు సొట్టలు దీర్చి సరిచేసి ఆవమునకు సిద్ధముచేయుచున్నది. మన యూరిలోనే మఱియొక మూలను చిన్న సెంకుటింటిలో కంసాలి యిత్తడిగిన్నెలు పోత పోసి ఎదిగిన కుమారుడు చక్రము త్రిప్పుచుండగా తాను గిన్నెను సానపట్టుచున్నాడు. ప్రక్కను చిన్నకుమారుడు మంటితో క్రొత్త చెంబులకు మూసలు తయారుచేసి ఆరబెట్టుచున్నాడు. ఈపైని వర్ణింపబడినవి జాతీయపాఠశాలలగునా? కావా యని చదువరులను ప్రశ్నించుచున్నాను. వానిని మనము గుర్తింపకపోవుట మనదోషము గాదా? ఇట్లే యితరవృత్తులలో సంబంధించిన పాఠశాలలను పాఠకులే యూహించుకొనవచ్చును. నే నిచ్చట వర్ణించి కాలమును వృథాపుచ్చ నవసరము లేదు.

కాబట్టి పైని వ్రాసిన విషయములను బట్టి సిద్ధాంతీకరింపవలసిన దేదియనఁగా— మనము జాతీయపాఠశాల లని పేరుపెట్టి ఏ శామ్యుయల్ గారి బంగాళాలోనో పెట్టునవి నిజమైన జాతీయపాఠశాలలు కావనియు; నిజమైన జాతీయ విద్యకు పోషణము ఏ చిన్ని కుటీరములందో, ఏ మాఱుమూలలనో లభించుచున్న దనియును గుర్తించుట ముఖ్యము. అట్లు గుర్తించినఁగాని మన జాతీయ విద్యను గూర్చి కలపోయుటకైనను మనకు అర్హత లేదనియును మన జాతీయవిద్య లన్నియు జీవనాధారములగు వృత్తులకుఁ ద్రోవఁ జూపుచు, బ్రహ్మానందమునకును మోక్షమునకును గూడ అర్హతను గల్గించు చతుష్షష్టి (అఱువదినాలుగు) కళ లని చెప్పబడు విద్యలే యనియును వానిని స్థాపించి పోషించి పెంపుఁజేయుటయే జాతీయవిద్యయొక్క పరమావధి యనియును మనము తెలిసికొనవలసి యున్నది. కాబట్టి జాతీయ విద్యాలయముల పట్టికలలో పైని పేర్కొనబడిన పాఠశాలల నన్నిటిని జేర్పవలసినదనియే నాయభిప్రాయము. నేను "జాతీయవిద్యాలయముల" లోని యుపాధ్యాయు లందఱితోను ముచ్చటించినప్పుడు "మీ యూరి యందు ఎన్ని జాతీయపాఠశాల లున్న"వని నే నడిగినప్పుడు "ఒక్కటి" లేక "రెండు" అనియే వారి సమాధానము వచ్చినదే గాని మఱియొకటి లేదు. వారి యభిప్రాయములో ఆంగ్లపాఠశాలలు విడిచిపెట్టి బయటికి వచ్చినవారికొఱకు కేర్పడినవే జాతీయపాఠశాలలు. ఆంగ్లపాఠశాలల మొంగ మెప్పుడును జూడక వాటిలో చిక్కి చెడిపోవక, పుట్టిన నాఁటనుండియు జాతీయతతప్ప మఱొక టేమియు నెఱుఁగని పాఠశాలలు ఎన్నియో గలవనియు, అవే నిజమైన పాఠశాలలనియు మనలో ననేకుల దృష్టికి గోచరింపకపోవుట మన జాతీయభావము ఎంతవఱకు అధఃపతితమైనదో మేర ఏర్పఱచుచున్నది. వేదాధ్యయనము చేయుటవలన మోక్షము లభించునను నమ్మక ముండుటచేతనే అనేకులు వేదవిద్య నభ్యసించు చుండెడివారు. కావలసినవారి కది జీవనోపాధిగఁ గూడ నుండి భుక్తిముక్తులకు రెంటికిని సాధన మయ్యెడిది. మనలో నన్ని విద్యలకును తుదకు పరమావధి మోక్షమే. చివరకు వ్యాకరణశాస్త్రమునకుగూడ నదియే పరమావధి. కాబట్టి జాతీయజీవనమునకు సాధనమైన విద్యలను పోషించుటయే మన జాతీయపాఠశాలల విధి. జాతీయపునర్నిర్మాణమునకు జాతీయవిద్యయే సాధనము. ఈ విషయమును చాల సంవత్సరముల క్రిందటనే గుర్తించినట్టి మహనీయులు కొందఱు గలరు. వారిలో కీర్తిశేషులగు కోపల్లె హనుమంతరావు పంతులుగా రొకరని ఇదివఱకే చెప్పియుంటిని. వారిని గౌరవింపఁదలచినచో వారి యభిప్రాయములను గ్రహించి వారిచే స్థాపితమైన సంస్థను పోషించి, పెంపుజేసి యట్టి వానిని అన్నిచోట్లను నిర్మించుట యవసరము. కాబట్టి నేనింతవఱకును వివరించిన విషయములు సరిగా గ్రహించిన, మన మెప్పటికిని మన పాఠశాలలయందు పిల్లలు లేరని, కాని పాఠశాలలు నిలిపివేయవలసివచ్చుచున్నదని కాని వగవము. పాఠశాలలు మన కనేకము లిదివఱకే యున్నవి. క్రొత్తవి స్థాపింపవలసిన యవసరము ఉన్నదని నే ననుకొనను. ఉన్న వానిని వృద్ధిచేసి, పోషించుట యెట్లనియే మన మాలోచింపవలసినది. ఇదియే ప్రకృతపు కఠినసమస్యగాఁ దోఁచుచున్నది. అందులకు నాకు తోఁచినమార్గముల గొన్నిటిని ఈక్రింద సూచించెదను.

౧. ఆపాఠశాల లెచ్చటెచ్చట నున్నవో కనుగొని, లెక్కవేయవలెను.

౨. ఆపాఠశాలలను మనలో నిముడ్చుకొనుటకు ప్రయత్నము చేయగూడదు. అట్లుచేసిన నవిగూడ మన సాహచర్యమువలన భ్రష్టము లగును. మనము వానిలోనికి స్వయంసంఖ్యలుగా జేరి, ఆయావిషయములను గ్రహించి జీర్ణింపజేసికొని, వానిలో నైక్యమగుటకు అర్హత సంపాదింపవలెను. ఒక్క ఉదాహరణము వలన నా యభిప్రాయమును తేటపఱచెదను. కొన్ని గ్రామములలో ఒక్కపంతులు వీథిబడి పెట్టుకొని విద్య గఱపుటను మన మెఱిగియున్నాము. వారిమీఁదికి బోర్డువారు పోటీకి వెళ్లి, వారితో సమానముగా తమ పాఠశాలను నడుపజాలక చివరకు, వాని తమ పాఠశాలలలో వేతనముమీఁద నుపాధ్యాయునిగా బిలిచిన నిదర్శనము లెన్నియో గలవు. దానితో ఆ పంతులకును పిల్లలకును గూడ భ్రష్టత సంభవించి, కలిమహాదశ ఎత్తికొనినదనే చెప్పవచ్చును. నిజముగా జరుగవలసిన పని బోర్డుపాఠశాలలను, వారి కప్పగించి, మన సాధనములను గూడ వారికిచ్చి, "ఇది నీయది. నీకు మేము సహాయము చేయుటకు వచ్చినామే గాని నిన్ను మాతో సమానభ్రష్టులను చేయుటకు రాలేదు. మా సహాయమును స్వీకరించి, ఎక్కుడుత్సాహముతో నీపని నెఱవేర్చుకొని, నీవు కాపాడుచున్న జాతీయతను నిలవబెట్టి, దానికి చుట్టును కోట నిర్మింపుము." అని చెప్పవలసినది. ఇట్టి దెక్కడను జరిగియుండలేదు. మన జాతీయవిద్యా విచ్ఛిన్నమునకు ఇదియే మూలకారణమైనది. కాబట్టి ప్రతివీథిలో నొకవీథిబడి పెట్టించి

దానికి ఒక్క పంతులనే నియమించి, జాతీయతను పెంపుచేయవలెను. మనము దానిలో నైక్యము గావలయుననినమాట కర్థ మిదియ.

3. వానిలో బాలురను విశేషముగా జేరనీయక ఎక్కువ మందియున్న నెక్కువగా పాఠశాలలను స్థాపింపవలయును. చాలమందిని ఒక్కచో చేర్చుట మంచిదిగాదు. అట్లు చేసిన ఇప్పటి పాఠశాలల వలెనే ధనాకర్షణముకొఱకు చాలమందిని చేర్చుచున్నా మను అపవాదు మనకు కూడ వచ్చును.

౪. ఆగ్రామములోని వృత్తులన్నియు ఈపాఠశాలకు అనుబంధములుగా నుండవలెను. ఉదయము సాధారణవిద్య అందఱకును సమానముగా నేర్పిన తరువాత, మధ్యాహ్నము ఏవృత్తికి సంబంధించిన బాలురు ఆవృత్తి పాఠశాలలలోనికి పోయి చిన్నవయసువారు మొదట చూచుచుండుటయు, తరువాత చిన్న చిన్న పనులు, పనిముట్లు సరిచేయుట పట్టుకొనుట, ఉపయోగించుట క్రమక్రమముగా నేర్చికొనవలయును.

౫ అక్షరాభ్యాసము మొదలు 8 సంవత్సరములు వచ్చువఱకును ఒక్కపలకబలపముతోనే కాలక్షేపము చేయునట్లును చాలవఱకు నోటిపాఠముగనే అన్ని విషయములును నేర్చికొనునట్లు చేయవలెను జ్ఞాపకశక్తి విశేషముగా పెంపుజేయుటకు ఇదే తరుణము. విశేషముగా నోటిపాఠమేగాని, పుస్తకపఠనము తగ్గించి వేయవలెను. పుస్తకముల నెప్పుడు తీసివైచితిమో అప్పుడే బాలునియందు స్వయంకృషి స్వాతంత్ర్య వికాసము లేర్పడి, వాని యభ్యున్నతికిని, శరీర సౌష్ఠవమునకును కారణము లగును.

౬. 8 సం॥ మొదలు 12 వఱకు పుస్తకపఠనము ఏర్పఱుపవచ్చును. ఇక్కడ ఇదివరకు నేర్చికొనిన దంతయును పుస్తకములలో నున్నదనియు, దానిని కొంత మఱచిపోయినను ఇబ్బంది లేదనియు, క్రొత్త విషయములు చదివి తెలిసికొనుట యావశ్యకమనియును వానికిఁ దెలియునట్లు చేయవలెను.

౭. ఇంతవఱకును వానికి ఒక్క మాతృభాషనే నేర్పవలయును, అప్పటికి వానికి ఒకవిధమైన పాండిత్యము కుదురును. తరువాత సంస్కృతము ప్రారంభించి నేర్పవలయును. 12 మొదలు 16 వఱకు ఈ రెండుభాషలును జోడుగా నడుచుచుండవలెను.

౮. తరువాత ఇంగ్లీషుగాని హిందీగాని లేక రెండును గాని ప్రారంభింపవచ్చును. ఇవన్నియు ప్రొద్దుననే నేర్పుచు, మధ్యాహ్నము వానివృత్తి ఏదియో ఆవిద్యను నేర్పుచు నుండవలయును. 20 సంవత్సరముల వయస్సున వాని బ్రహ్మచర్యము తీరి, గృహస్థాశ్రమము జొచ్చుటకు అనుజ్ఞనీయవలయును. ఇప్పటికి వాని జ్ఞానము సర్వతోముఖముగ వికసించుటయే గాక, శరీరసౌష్ఠవ మేర్పడి, స్వతంత్రజీవనము చేయుటకు వలయు వృత్తి విద్య చేతఁజిక్కి వాఁడు ప్రకాశించును. మొట్టమొదటి నుండి నూ వృత్తి విద్యను సామాన్యవిద్యతోబాటు అభ్యసించి యుండుటచేత వృత్తినిరసనము గలుగక, వృత్తులు నిలవఁబడును. ఇప్పటి విద్య వృత్తిచ్ఛేదము చేసి, విద్యార్థులను కొఱమాలిన వారినిగా జేయుచున్న సంగతి సర్వవిదితము. ఈ ఆపద గలుగకుండ జేయుట జాతీయవిద్యయొక్క ముఖ్యోద్దేశముగా నుండవలయును.

పైని చెప్పిన విషయములలో నీక్రింది సంగతులు చదువరులు గ్రహింతురుగాక. ఇవి మనపూర్వులచే నాచరింపబడిన మహత్తరమైన విద్యాసూత్రములు. బ్రహ్మచర్యాశ్రమము అనఁగా విద్యార్థిమహాదశ నాలుగు విభాగములు. అందు మొదటిది 8-12 సం॥ వఱకు బాల్యముతో సంబంధించినది. ఇప్పుడు బాలుడు పుస్తకపఠనమునందు కాలమును వ్యర్థపుచ్చక, నోటిపాఠముగానే మాతృభాషయందే అన్నివిషయములను నేర్చికొనుచు, జ్ఞాపకశక్తిని ధారణాశక్తిని మిక్కిలిగా వృద్ధి చేసికొనవలసియున్నది. మొదట చక్కగా పెంపుచెందిన జ్ఞాపకశక్తి తరువాత వానికి విషయగ్రహణమునందు మిక్కిలి తోడ్పడి సత్వర జ్ఞానాభివృద్ధికి సహాయకారి యగును. ప్రస్తుత విద్యావిధానములో అనేకవిషయములను అనవసరముగా కుది గ్రుచ్చుటచేత బాలుని జ్ఞాపకశక్తి వృద్ధిజేయుటకు అవకాశమే లేకున్నదని నాయభిప్రాయము

8-వ యేఁట రెండవభాష ఇంగ్లీషు ప్రారంభించుచున్నారు. ఇట్లు చేయుట కేవలము వినాశకరము. 12 సం॥ ల లోపున రెండవభాష ప్రారంభించుట మాతృభాషకు ద్రోహముచేసినట్లే యగును 8-వ యేఁట ఉపనయన మయినతోడనే వాని జ్ఞాననేత్రము వికసించునని మనవారు చెప్పుదురు ఇంతవఱకును వానికి చిన్న అక్షరములు గల పుస్తకముల యందు దృష్టినిలిపి చదువుటకు గలశక్తి కండ్లకు ఏర్పడదు అందువలననే "పుస్తకము పట్టించుటకు" అనువైనవయస్సిది. ఇదిమొదలు 12 వఱకు పుస్తక సహాయమున మాతృభాషలోనే విద్య జరుగుటచే, వానిమనస్సు మఱింతగా వికాసము జెందును. తరువాత మనకు ఆదిభాషయు, దేవభాషయు నైన సంస్కృతమునే జెప్పవలయును గాని పరభాష ఎంతమాత్రమును జెప్పగూడదు. సంస్కృతము పరభాషయని చెప్పవీలులేదు. మనశాస్త్రము లన్నియును ఆభాషలో నుండుటచే నది తప్పక నేరుపవలసియే యున్నది.

16 వత్సరముల తరువాత పరభాషను దేనినైన ప్రారంభించిన మనశ్శక్తి వ్యర్థముగాకుండ, సులభముగా తక్కువ కాలములో గ్రహించుటకు వీలగును. కొందఱు జాతీయవాదులు ఇంగ్లీషునకుబదులు హిందీ నేర్పవలయు నని చెప్పుదురు. నాయభిప్రాయములో నేదైన నొకటే. నవనాగరకతకు సంబంధించిన విషయములు హిందీయుండికంటె ఇంగ్లీషునుండి సులభముగా గ్రహించుటకు వీలు గలదు గాన ఇంగ్లీషుకే ప్రాముఖ్యమీయవలయు నని నాయభిప్రాయము. ఈ వయస్సులో ఇంగ్లీషుభాష ప్రారంభించుటచేత దానివలన గలుగువ్యామోహమునకు విద్యార్థి లోను గాఁడు కనుక నిర్భయముగా దాని నభ్యసింపవచ్చును. ఇంతకుముందే దానిని ప్రారంభించిన మనవలెనే మనబిడ్డలు గూడ నవనాగరక వ్యామోహమునఁ బడి, దేశద్రోహు లగుదురు.

5-12 వఱకు ప్రారంభవిద్యాకాలము. ఇంతటితో మానుకొను వానికి మాతృభాషయందలి ప్రవేశమును, వృత్తివిద్యయు నలవడి జీవనోపాధి ఏర్పడును.

12–16 వఱకు మధ్యమవిద్య. ఇందు మాతృభాషాసంస్కృతము లందు కుశలత ఏర్పడును. వృత్తి విద్య వృద్ధిని జెందును.

16–20 వఱకు ఉన్నతవిద్య. పై రెండుభాషలే కాక మూఁడవ భాషకూడ నేర్చి యుండును. వృత్తివలన స్వతంత్రజీవనమునకు లోటు లేదు.

20 సం॥ తరువాత స్వయంకృషిచేతనే ఏదో యొకదానియందు ప్రావీణ్యమును సంపాదించి పేరుగాంచినవాఁడే "ఆచార్యుఁ" డగును. దీనికి పాఠశాల లవసరములేదు.

ఈసందర్భములో ఒక్క విషయమును గూర్చి ముఖ్యముగఁ జెప్పవలసి యున్నది. ప్రస్తుతము నవనాగరకతాప్రభావము వలన జాతీయత అడుగంటి యున్నది. వేదపండితుఁడువచ్చి మన గుమ్మములో ఎంతసేపు నిలవఁబడినను మనము వానివైపు కన్నెత్తియైనచూచుటలేదు. మన కుమ్మరివారు చేయుచున్న మట్టికుండలవలన గలుగు లాభములను, వానితో భోజనపదార్థములను వండుటవలన లభించు ఆరోగ్యమును తెలిసికొనఁజాలక, పైపై మెఱుగులు గల అల్యూమినపు సామగ్రి వెంట పరుగిడుచున్నాము. ఇట్టి నిరర్థకపు నష్టదాయకపు అనారోగ్యకరపు వ్యామోహము లెన్నిటిచేతనో, మనము బంధింపఁబడి యున్నాము. వీని నన్నిటిని వదలుకొనిన గాని మన జాతీయత పెరుగ నేరదు. జాతీయత పెరిగినగాని జాతీయవృత్తులతో మిళితమై యున్న జాతీయవిద్య పెంపొంద నేరదు. వృత్తులనుండి విద్యను విడదీయుటకే వీలు లేదు. రెండును సమానార్థకములనియే మనము గ్రహింపవలయును.

నే నీవ్యాసమును వ్రాసిన ముఖ్యోద్దేశము జాతీయపాఠశాలల యందు మాత్రమే విద్యావిధాన మిట్లు మార్పు జెందవలయునని గాదు. దేశమందున్న పాఠశాలలన్నియు నిట్టి విధానమునే అవలంబించి, జాతీయతను పెంపుజేసి, భారతవర్షమును పూర్వపు ఔన్నత్యస్థితికి దీసికొని రావలయుననియు; అందు ముఖ్యముగా దేశీయవిద్యామంత్రి జాతీయ విద్యాస్వభావమును గుర్తెఱిగి, తన యధికారముక్రిందనే ఇట్టి జాతీయ పునర్నిర్మాణమునకు సత్వరముగ బూనవలయుననియును అప్పుడే వారు తలపెట్టిన వృత్తివిద్యలకు సాధన మేర్పడ గలదనియును వృత్తివిద్య యను పేరుతో విదేశ సంబంధ విషయములను పాఠశాలలలో బోధించుట వలన విదేశవ్యాపారము వృద్ధియగునేగాని మనకు వృత్తివిద్యలవలని లాభము లేకపోవుటయేగాక అట్టి వానివలన జాతీయత క్రమముగా నశించు ననియును మనవిచేయుచున్నాను.

నా యభిప్రాయములు చాలకాలమునుండి ఏర్పడిన వగుటచే, నిప్పటికి నీరూపు దాల్చినవి గాన మిత్రులందఱును వీనిని పరిశీలించి సంస్కరించి మెఱుఁగుపెట్టవలయు నని వేఁడుచున్నాను.

# అస్పృశ్యులయాలాపము

## సోమంచి సూర్యనారాయణశర్మ గారు

[illegible]నుచారులము మహా♦త్మా గాంధి కనువారు, కనికరమ్మున మమ్ముఁ ♦ గనరదేల?
దొరలదురంతము ♦ ల్మరచిపోమనువారు, మాయగచాట్లను ♦ మఱతురేల?
స్వాతంత్ర్యమునకు గ♦ర్వమ్మొసంగెడివార, లీక నేని నుమ్మాద♦రింపరేల?
సంఘైక్యమునుసల్ప ♦ సాగుదు మనువార, లంటరాదని మమ్ము ♦ గెంటనేల?
గీ. సోదరుల మమ్మునింత ని♦రాదరణము, సేయ దగునయ్య మీకది ♦ శ్రేయమయ్య!
గెలిచి యింటను రచ్చను ♦ గెలుపుఁడయ్య, పుణ్యమతులార ♦ భారతపుత్రులార!

సీ. కుష్ఠరోగుల ప్రక్కఁ ♦ గూరుచుందురు గాని, వీథినైనను మమ్ము ♦ వెడలనీరు
కుక్కలఁ బ్రక్కల ♦ నెక్కించుకొందురు, వీధినైనను మమ్ము ♦ వెడలనీరు
పంక్తిని బిల్లుల ♦ భక్షింపనిత్తురు, వీథినైనను మమ్ము ♦ వెడలనీరు
కోళ్ల వాకిళ్ల నెక్కుడు ♦ గూర్మిఁ బెంతురు, వీథినైనను మమ్ము ♦ వెడలనీరు.
గీ. ఏమి పాతక మొనరించి♦నామొ మేము? ఏల దేవుఁడు మమ్ము సృ♦జించినాఁడొ
ఎపుడొ మాకు ♦ విముక్తి? వచింపరయ్య, పుణ్యమతులార ♦ భారతపుత్రులార!

సీ. పరునిఁ దిట్టినయట్టి ♦ పాపంబునకుఁ ఒది, మాడలో రొంతో ♦ జుర్మాన కలదు
అప్పుఁదీరుపనట్టి ♦ తప్పున కొకొక్కయు, మాసాల చెఱ♦సాలవాస మబ్బు
దొంగిలించినయట్టి ♦ దోసంబునకు నొక్క, యేఁడొ రెండేఁడులో ♦ హెచ్చు శిక్ష
హత్య నొనర్చు ద్రో♦హంబున కురియొ ద్వీ, పాంతరవాసమో ♦ పాడి యగును
గీ. మే మొనర్చిన పాతక ♦ మేమొ యెన్ని, తరములకు మాదు శిక్ష కం♦తంబు లేదు
అరయఁ గదరయ్య! యీఘోర ♦ మాయ్యలార! పుణ్యమతులార ♦ భారతపుత్రులార!

# పార్లమెంటులోని లేబరుపక్షావలంబులు

దేశభట్ల లక్ష్మీనరసింహము గారు

ఆధునికయుగపు ప్రజాపరిపాలన మనగా ప్రజాప్రతినిధిపరిపాలన మని యందఱకు దెలిసిన విషయము. ఆంగ్లరాజ్యమునన్నట్లే దేశీయప్రతినిధులు దేశజనమనోభీష్టానుసారముగ రాజ్యవ్యవహారము నడుపుదురు. ఆంగ్లప్రజాప్రతినిధిసభయే పార్లమెంటు. రాజకీయ వ్యవహారములలో జనాభిప్రాయప్రాయ మేకాభిముగ నుండదు. తదనుసారముగ దేశముచే నెన్నుకొనఁబడిన పార్లమెంటుసభ్యులుకూడ భిన్నాభిప్రాయులై భిన్న పక్షములవారుగ పరిణమించుట న్యాయ్యమే గాక దేశపరిపాలనకత్యవసరమగు విషయము. కారణ మేమనగా సర్వసభయందుండ నేకమతము వారైనచో- వారిచే నిర్మింపబడిన రాజకార్యనిర్వాహకసంఘుసభ్యులు తమవిధుల నెఱవేర్చుటలో జరుపులోపముల నాక్షేపించువా రుండరు. ఎదుటివాని యాక్షేపణభయముచేతనే గదా ప్రతి మనుజుడును ప్రతి సంఘమును తమశీలము నభివృద్ధిపఱచుకొనుట.

1922 వ నవంబరునెలలో జరిగిన యెన్నికలఫలితముగ లాయిడు జార్జిగారి యాధిపత్యముక్రింద నుండిన మంత్రివర్గము మాఱిపోయి- బోనరులాగారి యాజమాన్యమున నూతనమంత్రివర్గ మేర్పడుట పార్లమెంటులోని వివిధపక్షములవారి అభిప్రాయభేదములచేతనే. పూర్వాచారపరాయణు లని పిలువబడు నీపక్షమువారు ఇతర పక్షములవారందఱికన్న సంఖ్యలో నెక్కుడుగ నుండుటచేత, పార్లమెంటువారిచే నిర్మింపబడు మంత్రిసంఘము వీరిసంఘమే యని యర్థమగుచున్నది. ఇప్పుడు పార్లమెంటులో నీపక్షమువారు 347 గు రున్నారు. ప్రతి పక్షులసంఖ్య లిట్లున్నవి :—

లేబరుపక్షమువారు 142, స్వతంత్ర విశాలమనస్కులు (Independent Liberals) 65, జాతీయవిశాలమనస్కులు (National Liberals) 49, ఇతరులు (చిల్లరపార్టీలు) 12 అనగ నెదుటి పక్షములవా రందఱు గలసి 268 మంది. ఇందు లేబరుపక్షమువారి సంఖ్య హెచ్చుగ నున్నది. జయశాలు రెన్నుకొనబడిన స్థానములబట్టి చూడగ పరిశ్రమల కునికిపట్టయిన ఉత్తర పశ్చిమోత్తర భాగములనుండి లేబరు పక్షమువా రనేకు లెన్నుకొనబడినట్లు తెలియవచ్చుచున్నది. ఇఁక నెన్నుకొను భాగ్యము కలిగిన వోటర్ల సంఖ్యలవలన 55 లక్షలవోటర్లు బోనరులా పక్షమువారికిని 42 లక్షల వోటర్లు లేబరుపక్షమువారికిని వానికన్న చాల తక్కువమంది వోటర్లు ఇతరపక్షములవారికిని వోట్లనిచ్చినట్లు తెలియుచున్నది.

రాజ్యమును నడుపుచున్న బోనర్లాపక్షమువారికి నితరపక్షములవా రందఱు గొప్పరాజ్యాంగవిషయములలో వ్యతిరేకాభిప్రాయు లగుటచే నొకకట్టుగ నుండుట సహజము. అందు లేబరుపార్టీ బలిష్ఠమైనదై పలుకుబడికలిగినదగుటచే లేబరుపక్షాధ్యక్షులలో నొకరగు రామ్సే మెక్డానల్డుగారిని ఎదుటిపార్టీలవా రందఱు తమనాయకునిగ నెన్నుకొనిరి.

ఇఁక లేబరుపక్షపు కట్టుబాట్లను గుఱించియు వారి ముఖ్యోద్దేశముల గుఱించియు చరిత్రాత్మకముగ చర్చింపవలసియున్నది. ఇంగ్లండులో 18 వ శతాబ్దిమధ్యమున పారిశ్రామికాందోళనము వెలువడినది మొదలు కర్మాగారవ్యాప్తి హెచ్చి దేహబలముచే కూలినాలిచేసికొని బ్రతుకు పనివాండ్రయవస్థ దురవస్థ కాసాగెను. కష్టము వారిది. ఫలితము కర్మాగారనిర్మాతలది. లాభము హెచ్చుగనున్నపుడు గూడ లాభకారకులలో నొకయంగ మగు పనివాండ్ర జీతము లభివృద్ధి యగుట అరుదగ నుండెను. అంతకన్న నెక్కుడుదురవస్థ—సావకాశముగ నాహారమును భుజించుటకు వలయు విరామమైనను వారనుభవింప నోచుకొనకుండిరి. దినమునకు 12, 14 గంటల కాలము వారు కర్మాగారములలో పనిచేయవలసియుండెను. విద్యాగంధ మన్న వారికి సున్న. వసతిగృహములు సహింపరాని స్థితిలో నుండెను. 7, 8 సంవత్సరములవయస్సు గల పసిపనివాండ్రు కూడ నీ కష్టములపాలై యుండిరి. అట్టి జీవనమున వారు పెద్దవారగుకొలది బలహీనులుగను కురూపులుగను నగుట యొక వింత కాదు. పనివాండ్రు సమాజములుగ నేర్పడి తమ పురోవృద్ధికొఱకు పాటుపడెదమన్న నాకాలపు చట్టములువారికివ్యతిరేకములుగనుండెడివి.

పార్లమెంటు ధనాధికుల యధీనమున నుండుటయే యిట్టి దురవస్థలకు గారణము. అయిన నాకాలమున గూడ పనివాండ్ర కష్టముల జూచి జాలినొందని మహాపురుషు లుండకపోలేదు. మైఖెయెల్ సాడ్లరు, ఆష్లీ మున్నగువారు పనివాండ్రస్థితిని బాగుచేయుచట్టములను పార్లమెంటులో నిర్మింపజేయగల్గిరి. కాని 19-వ శతాబ్ది మధ్యకాలమువఱకు పనివాండ్రగతి చాలమట్టునకు మాఱలేదు. అయితే వారికి తమ సమాజముల నేర్పఱచుకొను స్వేచ్ఛ లభించెను.

అప్పటినుండి వారి సంఘములు పెక్కులు దేశమున స్థాపింపబడినవి. ఈ సంఘముల మిశ్రసంఘ మొకటి గొప్పది క్రమముగ నేర్పడెను. ధనస్వాములతోఁ బోరాడ శక్తివచ్చినను, పార్లమెంటులో తమ ప్రతినిధులె సభ్యులుగ నుండినగాని తమకు విముక్తి కలుగదని నిశ్చయించి, లేబరుపక్షావలంబులు రాజకీయసంఘ మొకదానిని నిర్మించుకొని తద్ద్వారా తమ యాశయమును సాధింప మొదలిడిరి. 20-వ శతాబ్దము నాటికి నీసంఘమున రెండులక్షలకన్న నెక్కువగ సభ్యు లుండిరి. లేబరుపక్ష సంఘము తరపున కేరుహార్డి షాకిల్టన్ ఆర్థర్ హెండర్సను మున్నగు కొందిమంది పార్లమెంటులో సభ్యులుగ నెన్నుకొనఁబడగల్గిరి. ఇందు కేరుహార్డిగారు లేబరుపక్షమున కొసగిన సహాయ మింతయని చెప్ప నలవికాదు. 1892 సం॥ననే కార్మికుల తరఫున పార్లమెంటులో సభ్యుఁడై పనివాండ్రకష్టముల దొలగించుట కెంతయో తాను పాటుపడుచుండెను. అయినను వందలకొలది ప్రతినిధులున్న పార్లమెంటులో ముగ్గురు నల్గురు లేబరుపక్షసభ్యులు సముద్రములో వేయబడిన రవ్వల

చుక్కలవలె నుండిరి. అంతమాత్రమున దేశములోని లేబరుపక్షావలంబులు నిరుత్సాహులు కాక పాటుపడి, తమపక్షమునకు నెందఱనో తమ ప్రత్యర్థులఁ ద్రిప్పుకొనగలిగిరి. 1910 సం॥న జరిగిన ఎన్నికలలో 40 మంది లేబరుపక్షమువారిసభ్యులు కాగలిగిరి. 1918-వ సం॥పు ఎన్నికలలో 70 మందికన్న నెక్కువమంది జయమొందిరి. ఆ సం॥న జరిగిన కార్మిక మహాజనసభలో లేబరుపక్షోద్దేశములు కట్టుబాట్లు సర్వజనాభీష్టముగ నుండగలందులకై సవరింపబడెను. ఈ సవరణల ప్రకారము—లేబరు సంఘోద్దేశములకు సానుభూతిఁ జూపించు ప్రతిపురుషుఁడును స్త్రీయును దేశములోని యే లేబరుసంఘములలో నైనను సభ్యులుగ నుండవచ్చును. లేబరుపక్షము తరఫున పార్లమెంటు సభ్యత్వము కోరువారు తామున్న యుపసంఘములయొక్కయు పక్షపువారి మహాసంఘముయొక్కయు ననుమతిఁ బడయవలయును. తాము వోటర్లతో ముచ్చటించునపుడు లేబరుపక్షముననే- తాము అభ్యర్థులుగ నున్నామని- లేబరుపక్షమువారి ముఖ్యోద్దేశములు ఫలానివియని-స్పష్టముగ వోటర్లకు దెలియఁజేయవలెను.

ఆంగ్లదేశమునఁ బ్రతిపక్షమువారును తమ పక్షాభివృద్ధికొఱకు వివిధవార్తాపత్రికల స్థాపించుకొనియున్నారు. లేబరువారికి మాత్రము ధనసహాయము కొలఁదియగుటచే నిప్పటికిని స్వంతవార్తాపత్రిక లెక్కువగ లేవు ఒకటి రెండు వారపత్రికలును మాసపత్రికలు నున్నవి. మఱియు జార్జిలాన్సుబరీగారిచే నడుపబడు మున్న "డెయిలి హెరాల్డు" అనుపత్రిక లేబరుపక్షమునకు గొప్ప సహాయకారి. "నేషను అథీనియన్" "న్యూ స్టేట్సుమెన్" మున్నగు కొన్ని పత్రికలును తమకు వీలైనపుడు లేబరువారి కనుకూలములగు వ్యాసములు ప్రకటించుచున్నవి ఇట్లు చాల శ్రమపడి లేబరునాయకులు తమ యుద్యమము నభివృద్ధిపఱచుచున్నారు. తమ యత్నములు సఫలము లగుచున్నవనుటకు మొన్నయెన్నుకొనఁబడిన పార్లమెంటులో 142 గురు లేబరుపక్షసభ్యులగుటయే గాక తమ నాయకుడే గవర్నమెంటుపక్షమువారికి వ్యతిరేకముగ నున్న పార్టీలవారిని నడిపించుటయే తార్కాణము.

ఇఁక లేబరుపక్షపు ముఖ్యోద్దేశములఁ జర్చింతము. చేతితోగాని బుద్ధిచేగాని పనిచేసి ద్రవ్య మార్జించువారి యీపక్షము, భూరూపమున గాని, కర్మాగారరూపమునగాని నాణెములరూపమున గాని యున్న ధన సంపత్తిగలిగిన వారిపక్షము కాదని స్పష్టమగుచున్నది. ద్రవ్యవంతులు దేశమున నెక్కువమంది కాకపోయినను సహజముగ పలుకుబడి యున్నవారగుటచే జనసామాన్యలగు బీదపనివాండ్ర యభివృద్ధిని పాటింపకున్నారు. తమ ధనసంపత్తి తగ్గిపోవు నను భయమే దీనికి కారణము. గవర్నమెంటులో గూడ వారికి పలుకుబడి యుండక తప్పదు. అందుచే నీ కాలపు గవర్నమెంటువారు పనివాండ్రవిషయమై తగినంత శ్రద్ధ వహించుట లేదని లేబరుపక్షమువారి వాదము. ఏవృత్తిలోని పనివాండ్రైనను (అనఁగా, కార్మికులు, భూమి సాగుబడిచేయు కూలివాండ్రు, గనులలో పనిచేయువారు- రైలుమార్గములలో నున్నవారు- ధనికుల క్రింద గుమాస్తాలుగ నున్నవారు- తదితరులు) అభివృద్ధికావలయునన్న ధనికుల యౌన్నత్యము విడిపోవలెను. సంసారపోషణార్థము సరిపోవు బత్తెము పనివాండ్రకు దొరకవలయును. జనసామాన్యమును పీడించు పన్నులు తొలగిపోవలయును. పని లేనివారికి పని కలుగవలయును. అప్పుడే లోకము క్షేమమార్గమునకు వచ్చును. అను నివి లేబరువారి యాశయమూలములు.

అంతే కాదు. లోకములోని బలిష్ఠములగు రాజ్యములు బలహీనములగు రాజ్యముల నణఁచి యార్థికసామ్రాజ్యము వహించుటయు ధనపిశాచగ్రస్తతచేతనే. ఆర్థికవిషయములలో నన్ని దేశములవారికి సమానములగు సదుపాయము లుండినగాని వారు సర్వభ్రాతృత్వబుద్ధితో మెలగుటకవకాశ ముండ దని లేబరుపక్షమువారి నమ్మకము.

పై యుద్దేశములు దేశాంతర్విషయములలో వలయు మార్పులు దేశబాహిరవిషయములలో వలయు మార్పు లని సహజముగ రెండు భాగము లగుచున్నవి. ఈ యుద్దేశ్యముల నాచరణలోనికి తెచ్చుటకై లేబరుపక్షమువా రీ క్రింది కార్యక్రమమును సూచించుచున్నారు.

పనివాండ్రకు న్యాయ్యముగ కావలసిన దేహారోగ్యవసతులు- విద్య- విశ్రాంతి- జీతము లేర్పడవలెను. వీలగునంతవఱకు నిర్వ్యాపారస్థితి వారికి రాకుండఁజేయు నుపాయములను గవర్నమెంటువారు వెదుకవలయును. నిర్వ్యాపారమనఁగ పనివాండ్రు తమంతట తాము పనిని వదలుకొనుట కాదు. తమ శక్తికి మించిన ప్రబలవైపరీత్యములు- అనఁగ తాము వ్యాధిగ్రస్తులగుటయో- తమ వృత్తులే యడుగంటుటయో- మున్నగు నిట్టి కారణములచే దాము నిరుద్యోగు లగుట యని యర్థము. అట్టిస్థితి ఐరోపామహాసంగ్రామానుగతముగ నిప్పుడు దేశమున ప్రబలియున్నది. రమారమి 10 లక్షల పనివాండ్ర కుద్యోగములు లేవు. తన్నివారణార్థము పార్లమెంటులో నీక్షణమున నెట్లు లేబరుపక్షప్రముఖులగు మాక్డొనల్డు, లాన్సుబరి, క్లైన్సు, సెక్లత్ వాల మొదలగువారు చర్చలు జరుపుచున్నారో దినవార్తాపత్రికలమూలమున మనకు వెల్లడియగుచునేయున్నది. ఈ విషయమున లేబరుపక్షమువారి ముఖ్యాభిప్రాయ మిది. సర్కారువారు తమ తరఫున జరుగవలసిన పనులన్నియు నిర్వ్యాపారులచే జరిపింపవలెను అప్పటికిని నిర్వ్యాపారము హెచ్చుగ నున్నదని వారికి తోఁచినపక్షమున యుకకలగుపనివాండ్రు చేయుపనియొక్క దినప్రమాణము బాగుగ తగ్గింపవలెను. దేశములోని చిన్నవాండ్ర విద్యాభ్యాసకాలము హెచ్చింపవలయును. సర్కారువారు నిర్వ్యాపారుల యిన్స్యూరెన్సు అను నిధిని ప్రతివృత్తిలో నున్న ప్రతిపనివానికి నందున ఏర్పాటులు జరుపవలెను. అట్లు చేసినచో నిర్వ్యాపారసమయమందు తనసంసారమును పోషించుకొనుటకు వానికిఁ దగినవసతియుండును.

దేశములోని భూస్వాముల నిరంకుశాధికారము నణపవలయును. వ్యవసాయదార్ల యభివృద్ధికై దేశములోని సాగుబడిభూమి నంతయు కేంద్ర ప్రజాప్రభుత్వముక్రిందికిని స్థానికప్రభుత్వసంఘములవారి క్రిందికిని తెచ్చు సాధనములు జరుగవలయును. స్థానికప్రభుత్వసంఘములు వ్యవసాయములు స్వయముగ నడిపింపవలయును. దేశములో కో-ఆపరేటివు సంఘములకును కొన్ని చిన్నభూభాగముల నిచ్చి వాని ద్వారా వ్యవసాయమును సాగింపవలయును. మఱియు వ్యవసాయములో లాభాపేక్షతో గాక వ్యవసాయశాస్త్రాభివృద్ధి జేయ నిష్టమున్న జనులకు నట్లే భూభాగముల నీయవలెను. పైవారందఱును పనివాండ్రకు వ్యవసా

యము చేసినందుకు న్యాయ్యమగు కూలి నియ్యవలయును. ఇట్లు భూమి సాంఘికము జరిగిన, భూస్వాములు నిర్దయతో రైతులయొద్దనుండి శిస్తులు లాగు దురాచారము పడిపోవుటయె గాక, భూమిమీద పని చేయు వ్యవసాయదారులస్థితి బాగుపడును. భూమిమీద వచ్చు లాభము సంఘమునకే చేరును. అందుచేత కూలివాండ్రకు తమ సేద్యకార్యములో మఱింత యుత్సాహము పుట్టి భూమిని మఱింతగ ఫలింపజేయుదురు. భూమి యిచ్చు భోజనపదార్థములు గూడ స్థానికసంఘముల యధీనమునను సహాయసంఘముల యధీనమున నున్నచో ప్రజలకు సరకులు చౌకగ దొరకును. లాభము సంఘమునకే యుండును. ఈ ప్రకారముగ దేశములోని యినుపమార్గములు నీటిరహదార్లు విద్యుచ్ఛక్తిప్రతిష్ఠాపనలు బొగ్గుగనులు కర్మాగారపరిశ్రమలు మొదలయినవి ధనస్వాముల యధీనమునుండి తప్పించి సంఘస్వామ్యముగ జేర్చుట న్యాయ్యమని లేబరువారి మతము.

ఇక సర్కారువారి ఆయవ్యయములలో పెక్కుమార్పులు జరుగవలయు నని లేబరువారి యభిప్రాయము. దీని ప్రకారము సర్కారు పన్నులు విధించుటలో ధనాధిపుల మూలధనముపైని చాల నెక్కువగ విధించి వారి సంసారసౌఖ్యార్థముకన్న నెక్కువగ నున్న యావత్తు ద్రవ్యమును క్రమముగ సర్కారునకు (అనగా సంఘమునకు) జేర్చు మార్గము న్యాయ్యమైనది. ఇట్లు చేయుటవలన కలుగు లాభము లివి- ఇటీవలి మహాసంగ్రామఫలితముగ రాష్ట్రీయఋణము చాల పెరిగిపోయినది. సర్కారునకు సంవత్సరపు వరుంబడిలో సగముకంటె నెక్కువభాగము ఋణము తీర్చుటయందే ఖర్చగుచున్నది. అట్టి స్థితిలో నిర్వ్యాపార సమస్య బరిష్కరించుటకు సర్కారునకు దగినసాధనము కనబడలేదనుట సహజము. ధనాధికుల మూలధనముపై తీవ్రముగ పన్నులు విధింపబడుట రాష్ట్రీయఋణము తగ్గుసాధనమె గాక నిర్వ్యాపారత్వసమస్యకును సులభసాధనము. మహాసంగ్రామ కారణముననో తత్కార్యముననో దేశీయు లనేకులు కోట్లకొలది ధనము నార్జించిరి. 2000 సవరలపైబడిన ప్రతివాని మూలధనముపై బాగుగ పన్ను విధింపవలయును. మూలధనము హెచ్చుగ నున్నవారు హెచ్చుగ పన్నుల నిచ్చుట న్యాయ్యము. కాని దేశములోని భోజనపదార్థముల ధరలు హెచ్చుగుటకు గారణభూతములగు పన్నుల విధించుటకు లేబరువా రొప్పుకొనరు. అనేకులు మరణశాసనముల ద్వారా తమయాస్తిని తమ సంసారముల కందజేయుచున్నారు. అట్టి యాస్తులు హెచ్చుగ నున్నచో వానిపైగూడ "మరణపుపన్ను" అనుపేర పన్నులు హెచ్చుగ విధింపవలయును. లోకములోని వస్తువులధరలు వృద్ధియగుకారణమున భూస్వాములకు శిస్తులు హెచ్చుచున్నవి గదా. అనాయాసముగ జేకూఱు నిట్టి యాదాయభాగము న్యాయముగ సంఘమునకు జేరవలసినదే. కాన దానిపైని పన్నుల విధింపవలయును. ఇట్లనేకవిధముల సంఘద్రవ్యమును వృద్ధిచేసి దేశక్షేమమునకు పాటుపడుట లేబరుపక్షమువారి యుద్దేశము.

ఇక దేశబాహ్యవిషయములలోని కార్యక్రమము అంతర్జాతీయ కలహములన్న నెవరి కిష్ట ముండదు. అట్టి కలహములను దీర్చుటకై నానారాష్ట్రీయసభ యూరపుఖండమున నిటీవల స్థాపితమైనను, అది తగిన యుపయోగకారిగ నుండుట లేదనియు దానిని ఉత్కృష్టమైన సభగ మార్చుట ముఖ్యమనియు లేబరువారి నమ్మకము. అట్లయినచో నార్థికకారణములు మూలములుగ నున్న సమీపప్రాచ్యసమస్యలవంటి యనేకక్లిష్టసమస్య లన్నిరాష్ట్రములవారి కనుకూలములుగ పరిష్కరింపబడును. అంతర్జాతీయవ్యాపారము బాగుగ సాగును. అట్టి యుద్దేశము ననుసరించియె పరదేశములనుండి యాంగ్లదేశమునకు వచ్చు సరకులమీద సర్కారువా రేకారణముచేతనైనను శేవు కప్పముల విధించుట న్యాయ్యము కాదని లేబరుపక్షమువారు చెప్పుచున్నారు. ఎందుకనగా శేవుపన్నులు విధించుటవలన, నా సరకులయొక్కయు వానిమూలమున నితరము లగు కొన్ని సరకులయొక్కయు ధరలు పెరుగును. ధరలు పెరిగినచో, ధనస్వాములు బాగుపడుదురు గాని, కూలివాండ్రజీవనము మఱింత హీన మగును. అంతర్జాతీయవ్యాపారవిషయములను పరిష్కరించుటకు నానారాష్ట్రీయసభ ప్రత్యేకముగ నార్థికవిషయములపట్ల నెక్కుడుశ్రద్ధ వహించి ప్రపంచవ్యాపారరంగములో లేనిపోని తొందరలు కలుగకుండు మార్గముల వెదకుచుండవలెను.

ఇట్టి కారణములచేతనే ప్రస్తుతమున బ్రిటిషురాజనీతిపారంగతులచే చర్చింపబడుచున్న "ఇంపీరియల్ ప్రిఫరెన్సు" అను వ్యాపారవిధానమునకు లేబరువారు విముఖులుగ నున్నారు.

పైచర్చించిన లేబరుపక్షమువారి కార్యక్రమము జనక్షేమాభివృద్ధికి దోడ్పడునట్లు కనంబడుచున్నది. దానికి తోడుగ లేబరుపక్షనాయకులగు క్లైన్సు, మెగ్డానల్డు, హెండర్సను, వెడ్జివుడు, బెన్సొఎరు, మొదలగువారు-రాజనీతికోవిదులు-కార్యక్రమమును నడిపించుటయందు ఘనులు కాన మఱియొకమాఱు రాబోవు నెన్నికలలో లేబరుపక్షమువారు సంపూర్ణజయము నొంది రాజ్యభారము వహింపగలరని యూహింపవచ్చును. అయితే లేబరుపక్ష కార్యక్రమమునందు దాపక్షమువా రందఱు ఏకాభిప్రాయులుగ లేరు. కొందఱు రష్యాదేశములోని లెనినుప్రముఖులవంటి తీవ్రవాదు లున్నారు. అంతియ కాదు, లేబరుపక్షమువారు రాజ్యభారమును వహించినతర్వాత తమ కార్యక్రమము నాచరణలోనికి దెచ్చుటలో నెన్నియో చిక్కులు పడుదురనుట వాస్తవము. ఒకటి రెండుదాహరణములు చాలును. కర్మాగారముల నితరధనార్జనసాధనముల ధనస్వాములు సంఘమాస్తిగ మాఱ నిచ్చగించినతర్వాత వారికేమి ప్రతిఫలము కోరెదరో వారి నెట్లు గవర్నమెంటువారు తృప్తి పఱచెదరో తెలియకున్నది. పరిశ్రమలు ధనస్వాముల యధీనమున నున్నంతకాలము పరిశ్రమాభివృద్ధికిని వ్యాపారాభివృద్ధికిని వారెంతో పాటుపడుట సహజము. అవి సంఘముక్రిందికి వచ్చినతర్వాత నంత యభివృద్ధి గాంచునా యను సంశయము మనకు పుట్టక మానదు. ఒక గొప్ప నౌకాస్వామి సర్ జాన్ యెల్లరుమెన్ గారు వచించినట్లు ద్రవ్యము పెక్కుమంది జనులయొక్క మితవ్యయబుద్ధిచేతను, కూడబెట్టు నిచ్చచేతను, భోగపరిత్యాగముచేతను, దేహకష్టమున కోర్చి పనిచేయుటచేతను గూర్పబడుచున్నది. తన మరణానంతరము తన భార్యకో తన సంతానమునకో పోషణార్థమనియె తన వార్ధకదశయందు స్వపోషణార్థమనియో ధనము నార్జింప ప్రతి మానవుడును బురికొల్పబడుచున్నాడు. మూలధనముమీది పన్నులవల్ల ప్రతివానికిని భవిష్యత్తునందలి నమ్మకము చెడిపోయి తా నార్జించిన ద్రవ్య మంతయు తన జీవితకాలమునందే వెచ్చపెట్టును. సర్కారువా రప్పు డేమి చేయుదురో యూహించుట శక్యము గాకున్న దని యనేకుల యభిప్రాయము. ఇంతకును కాలదేవత యార్థిక ప్రపంచమునం దెన్నిమార్పుల జరుపనున్నదో వేచి చూతము.



Andhra Lady Volunteers, Chittoor Conference ఆంధ్రమహిళా స్వచ్ఛందసేవకులు, చిత్తూరుమహాసభ



National School, Chittoor జాతీయవిద్యాలయము, చిత్తూరు

# గోరక్షణము

కామఋషి మృత్యుంజయ వర్మ గారు

ఇదిగో దుర్భరభయ కంపి♦తాంగి యగుచు
నంబ! యంబా! యటంచు బి♦ట్టఱచి యఱచి
యస్వతంత్రురా లగుటఁ గా♦ర్యంబు దోప
కునికి దీనాస్యయై బావు♦రనుచు గంటు
నీరు గ్రుక్కుచు నిటునటుఁ ♦ దారిపోవు
నావును వెనువెంటఁ దగిలి ♦ యమునిదూత
కరణిఁ గొనిపోవుచున్నాఁడు ♦ కటికవాఁడు

* * * *

వానికెంత నిర్దాక్షిణ్య ♦ మానసంబొ
యట్టి క్రూరకర్మల కమ్మ ♦ నదయుఁ డెవఁడొ
మ్లేచ్ఛుఁడై యుండవలయు నా♦తుచ్ఛుఁ డట్టి
వాఁడు మనభారతీయుఁడౌ ♦ గాఁడు. నిజము.
నోరులేని జంతువు నిట్లు ♦ క్రూరమతుల
కమ్మఁ జూపుట కంటెఁ బా♦పమ్ము గలదె?
కటికవానికిఁ బసుల ని♦ష్కారణముగ
నప్పఁజెప్పి గొంతులఁ గోయు ♦ మనుట తగునె?
మాసములు పది కడుపున ♦ మోసి మోసి
గర్భవేదన సహియించి ♦ కన్నతల్లి
పాలుచాలని యప్పుడే ♦ పాట్లఁ బడిరొ
పరయువతులను బ్రతిమాలి ♦ పాలు సంగ్ర
హించి పొట్టనింపి శిశువుఁ ♦ బెంచు తల్లి
వృద్ధురాలంచుఁ గ్రూరుఁడై ♦ బుద్ధిమాలి
యెవ్వఁడు ధనార్థియై విక్ర♦యింపఁ దలఁచు?
గన్నతల్లికి విషమిచ్చు ♦ కఠినుఁ డెవఁడు?
పనికిమాలినవాఁ డంచు ♦ జనకుఁ జెనకు
పాపి యెవ్వఁడు? తనతల్లి ♦ పాలుఁ ద్రావి
రొమ్ము నెవఁడు కృతఘ్నుఁడై ♦ రొప్పజేయు?
పసులరక్షింప నట్టి ద్వి♦పాదపశువు
వసుధ నుండెడు నిప్పటి♦పాతబుద్ధి
నీయవస్థ విచారించి ♦ యూహలంబు
నుద్ధరింపవలయు శ్రమ♦కోర్చి యెట్లొ

* * *

తలఁపఁగాఁ గోటిరెట్లు భూ♦దానఫలము
కంటె నన్నదానఫలము ♦ కంటె సప్త
సంతతిఁ బడయుకంటె మో♦క్షఫలదాయ
కమగు సువ్రతము పశుర♦క్షణము దాని
కంటెఁ దారకోపాయ మెం♦కండు లేదు
గోధనం బెన్న నిహపర♦సాధనంబు
భారతీయులే గోక్షీర♦పాన కలన
సర్వరోగవిముక్తులై ♦ సత్వగరిమ
నెగడినారొ శుక్లంబు శో♦ణితము మొదలు
కండ బెంచుట కెయ్యది ♦ కారణంబు
కుక్షిగతమైన యష్టోద♦ర క్షయాది
బాధలకుఁ బాలు నిర్మూల ♦ సాధకంబు
పాప మా గోవులకు దుర♦వస్థ యిట్లు
పరిణమించెనె! నేటి కీ ♦ ధరణియందు
కామధేనువై యర్థుల ♦ కామితముల
నిచ్చు నాశ్రమభూముల ♦ స్వేచ్ఛఁ దిరిగి
జీవనదుల శుద్ధజలము ♦ ద్రావి యెక్కు
డక్కడఁ గల మెత్తని పూరి ♦ మెక్కిమెక్కి
యడిగినంతనె పాలు మీ♦గడలయుఁ బెఱుగు
వెన్నయు ఘృతంబు నొసఁగుచుఁ ♦ గన్నతల్లి
కంటె మిక్కిలి ప్రేమచేఁ ♦ గనుచు నెల్ల
జీవరాసులఁ బోషించు ♦ గోవు ఘనత
యెన్నఁబడు గాదె? విప్రుల ♦ కన్న మున్న
పాడిపంటల కీ జాతి ♦ మూలధనము
గడ్డిఁ దిని వడ్లనిచ్చును ♦ గడుగు నీటి
ద్రావి పాలిచ్చునిట్టి వ♦దాన్య కదవె!

* *

మహిని స్వార్థపరిత్యాగ ♦ మహితమతము
గలుగు గోజాతి రక్షింప ♦ వలయు సతము
దానబలులార! వ్యవసాయ♦దారులార!
సకలవైద్య వాణిజ్య సం♦స్కారులార!
మీకుఁ దోఁచినంత ధనంబు ♦ సేకరించి
బక్కపశువులఁ బోషింపఁ ♦ బాటుపడుఁడు
మానవులు నిక్కలుషితాభి♦మాను లగుచుఁ
బట్టుదలఁ గల్గి గో పరి♦పాలనంపు
భారమును దమశక్త్యను♦సార మెట్లొ
నిర్వహింపంగ నెంచిన ♦ సర్వపుణ్య
తీర్థయాత్రాఫలము గల్గు ♦ దీనికంటె
నన్యతారక పుణ్యకా♦ర్యంబు లేదు.
ధరణి శ్రీహరి కృష్ణావ♦తార మెత్తి
పశులగాపతియైన పా♦వనచరిత్ర
దలఁచి స్మరియించి తరియింప ♦ వలదె నరులు?
సర్వలోకోపకార వి♦జ్ఞాన మూర్తి
యైన గోవును సేవించి ♦ మానవుండు
సంతతాయురారోగ్య ప్ర♦చారుఁ డగుత!

# స్త్రీల విద్యా విధానము

పాలపర్తి ఆంజనేయులు గారు

ఇటీవల ప్రభుత్వమువారు కొన్ని ముఖ్యపట్టణముల యందు ఉన్నతబాలికాపాఠశాలలను స్థాపించి యున్నారు. కాకినాడ పురస్త్రీలు తమపురమున నొక పాఠశాలను స్థాపింపవలసినదిగా విజ్ఞాపనము నంపుకొని యున్నారు. గుంటూరుపురమున స్త్రీలకు విద్య గఱపుటకై 'శారదానికేతనము' ఏర్పాటు చేయబడినది. ఈ ప్రకారముగా ప్రభుత్వమువారును దేశీయులును కూడ కొంత శ్రద్ధను జూపుచున్నందులకు మనము సంతసింపవలసినదే. కాని యిప్పటి జాతీయావసరముల ననుసరించి స్త్రీవిద్య యెట్లుండవలయునో యింకను నిర్ణయము కాక నిలచియున్నది. ఈవిషయమై విచారించుటకుపూర్వము సంఘమునందు స్త్రీలస్థానమును, స్థితిని నిర్ణయింపవలసియున్నది.

ఈశ్వరదృష్టియందు మానవకోటి యంతయు ఒక్కటియే. ఆధ్యాత్మికదృష్టితో విచారించినను స్త్రీపురుషభేద మావంతయు లేదు. స్త్రీగాని పురుషుడుగాని ఎవరికర్మను వారు అనుభవింపవలయును. ఎవరి ముక్తిని వారు సాధించుకొనవలయును. స్త్రీలయందొక యాత్మయును పురుషులయందు మఱియొకయాత్మయును లేవు. సమస్త మానవకోటియందును ఆ పరమాత్మయొక్క యంశమే ప్రకాశించుచున్నది. ప్రపంచమందలి సమస్తభేదములును ప్రాకృతికములై యున్నవి. అటులనే మానవకోటియందును స్త్రీ పురుషభేదము స్వజాత్యభివృద్ధికై యేర్పడిన ప్రాకృతికభేదము మాత్రమే. కావుననే స్త్రీపురుషులకు సమానమైనహక్కులు ఉండవలయునని కోరబడుచున్నది. ఇట్టి కోరికయందు విపరీత మెద్దియును లేదనుట స్పష్టము.

కాని మానవసంఘమందలి అంతరములు కేవలము మానవనిర్మితములా లేక పరిస్థితులనుబట్టి యేర్పడినవియా యని కొంతవఱకు యీసందర్భమున విచారింపవలసి యున్నది. సంపదనుబట్టి ధనికులును దరిద్రులును- సభ్యతనుబట్టి నాగరకులు ననాగరికులును- విజ్ఞానమును బట్టి వివేకులు నవివేకులును- ఏర్పడుచున్నారు. ఇవి కేవలము మానవనిర్మితము లనుటకు వీలులేదు. ఇక బ్రహ్మక్షత్రియాది భేదములు సంఘసౌలభ్యముకొఱకు ఏర్పడిన వనుట స్పష్టము. ఈభేదము లెల్లప్పుడు నుండినను ఉండకపోయినను ఏవియో కొన్ని భేదము లుండుట నిస్సంశయము. ఏలయనఁగా మానవాత్మ స్వతంత్రము గలది. దాని యభివృద్ధి సంఘమునకు సంబంధించి యుండినను వ్యక్తిగతమై యున్నది. ఒకేవిధమైన పరిస్థితుల యందు. ఒకేవిధమైన సాధనయందు- ఇద్దఱు మనుష్యులు కృషిసలిపినచో వారిద్దఱును ఒకేవిధమైన సంస్కారమును పొందుదు రని చెప్పుటకు వీలు లేదు. మానవాత్మ స్వతంత్రవ్యక్తిత్వము గలదియే గాని అంధప్రాయముగా ననుసరించునది కాదు. కావునఁ బ్రపంచములో భేదములు సహజముగా నుండితీరును. సర్వసమత్వమును స్థాపింపదలచినను సాధ్యము కానేరదు. కాని సత్యమేమనగా భేదమే చైతన్యమునకు మూలముగ, అభివృద్ధికి హేతువునై యున్నది. అట్టిస్థితిలో స్త్రీపురుషులకు(మానవకోటియందు) సర్వతోముఖమైన సమధర్మములను ప్రతిష్ఠింపగలుగుటయు నసంభవము. కాని తగినఅవకాశముల కల్పించుటయు నిచ్చుటయు సమంజసము. ఒక్క విషయముమాత్రము గమనింపదగియున్నది. స్త్రీపురుషధర్మములు పరస్పరసహకారములు గాని, విరుద్ధములును, సమములును కావు. కావున వారి విద్యకూడ పరస్పరము లాభప్రదముగా నుండవలయునే గాని ఒకటేవిధమైనదైనచో ప్రయోజనము లేదు.

మానవసంఘమునందు స్త్రీయొక్క ప్రధానధర్మ మేమి? ఇప్పుడుండుస్థితిలో నామె యాధర్మమును సక్రమముగా నిర్వహింపగలుగుచున్నదా? యని మనము విచారింపవలయును. విశ్వజననిగర్భమునుండి యీవిశాల విశ్వము ప్రభవించినటులే స్త్రీయొక్క గర్భమునుండి మానవకోటి యావిర్భవించుచున్నది. కావుననే సంఘమునందు స్త్రీ మాతృస్థాన మాక్రమించుచున్నది. స్త్రీకి యొసంగబడు విద్యయును ఈ మాతృత్వ ధర్మమునకు పోషకముగ నుండవలయును.

శ్లో. గురూణాం చైవ సర్వేషాం మాతా పరమకో గురుః,
మాతా గురుతరా భూమేః ఖాత్పితో చ్చతర స్తథా.

మానవసంఘమునందు అత్యున్నతమైన స్థానము నాక్రమించిన స్త్రీ ఆఫీసులలో నౌకరీనిగాని, కోర్టులలో ప్లీడరీనిగాని, సైన్యములో నాయకత్వముగాని, దుకాణములలో అమ్మకముగాని పూనుకొనినచో నట్టిపని మాతృత్వధర్మపోషకము కాగలదా ? కనుక నిట్టి యుద్యోగములు స్త్రీలకు సర్వథా అయోగ్యములు. కాని యీపదవులకు స్త్రీలు అసమర్థులని కాని అనర్హులని కాని న్యాయుద్దేశము కాదు. తగిన యవకాశముల నిచ్చినచో స్త్రీయును పురుషునితో సమానముగా ప్రాపంచికవ్యవహారముల నన్నిటిని నిర్వహింపగలరు. కాని స్త్రీలయందు సహజముగాగల కోమలత్వము మార్దవము ప్రేమయు ద్యోగధర్మత్వేనచేయు కఠోరచర్యలచే శోషించును. స్త్రీ ప్రేమకు నిధి. జడమైన శుద్ధభౌతికకర్మకలాపములందు ప్రేమకు తావులేదు. ఇట్టి కర్మలయందు స్త్రీయును ప్రవేశించిన మానవునియందు దినదినప్రవర్ధమాన మగుచున్న పశుత్వము స్త్రీయందును పెంపొంది మానవజీవితము దుర్భరము కాగలదు. పురుషుఁడు ప్రాపంచికవ్యవహారములం దెట్టి యకృత్యముల నొనరించినను గృహమునకు మఱలినంతనే ప్రేమశాంత్యాదిగుణస్వరూపిణి యగు తల్లిని గాని, భార్యను గాని గాంచినతోడనే తిరిగి మానవత్వము అతనియందు తలయెత్తుటకును, ఎప్పటికైన నాతఁడు ముక్తిఁజెందుటకు నవకాశము గలుగుచున్నది. కావున నిట్టి యుత్తమ మాతృత్వధర్మమునకు పోషక మగు విద్యనే స్త్రీలకు గఱపనగును.

స్త్రీయందు గల మఱియొకధర్మము సతీత్వము. ఇంతకన్నను దాంపత్య మనిన నది స్త్రీపురుషుల కిద్దఱకు సమానముగా వర్తింపగలదు. మనదేశమందేమి తదితర దేశములందేమి యీధర్మము క్రమముగా గ్రహింపబడి యాచరింపబడుట లేదు. మనదేశమందు స్త్రీయొక్క అస్వాతంత్ర్యమువలనను, అన్యదేశములందు స్త్రీయొక్క స్వేచ్ఛవలనను దాంపత్యధర్మము వికాసమునొందుట లేదు. కట్టుబాటులయొక్క శూన్యతగాని బహుత్వము గాని యభివృద్ధికి ననుకూలము కాదు. అభివృద్ధి మానవాత్మయొక్క సహజలక్షణము. నదికి సర్వదా గతి సహజలక్షణము. అట్టిగతికి అడ్డుగ గట్టువేసిన సహజముగా నుండవలసిన కట్టలను సహితము తెగగొట్టి విచ్చలవిడిగా ప్రవహింపవచ్చును. నదికి ఇరుపార్శ్వములను కట్టలు లేనియెడల నది స్వరూపముగాని, గతిగాని యుండనేరదు. అరీతిగనే, స్త్రీకిగాని పురుషునికి గాని తగిన కట్టుబాటులలో అభివృద్ధికి తగిన అవకాశ ముండవలయును. అట్లు లేనిచో సంఘము చిందఱవందఱ కాగలదు. హిందూసంఘమునందు స్త్రీకిజ్ఞానాభివృద్ధికి హేతువగు విద్య లేకపోవుటయును బాల్యముననే సంసారముచేయుటను గృహమునందస్వాతంత్ర్యము గౌరవము లేకుండుట, నిర్బంధవైధవ్యము మొదలగునవియు నామెయొక్క అభివృద్ధికి ప్రతిబంధకములుగానున్నవి. ఈఅడ్డంకు లన్నియు తొలగినగాని స్త్రీకి గౌరవస్థానము రాదు. అత్తయందు మాతృత్వము, భర్తయందు సోదరభావము, పెంపొందినగాని హిందూసంఘమున కోడఱికపువిషయమున గల అపకీర్తి పూర్తిగ నశింపదు. భర్తలు దాంపత్యధర్మమును మఱచి భార్యలు కేవలము తమ శరీరసౌఖ్యముకొఱకు మాత్రమే నిర్మింపబడిన బొమ్మలని భావించెదరు. భార్య అర్ధాంగలక్ష్మి- సహధర్మచారిణి- యనెడి ప్రాచీనార్యభావము వారి మనస్సునకు సోకదు. బానిసయను భావము నంతరించి సహధర్మచారిణి యను భావముదయించినఁగాని హిందూసంఘమునందు స్త్రీకి నిజమైన గౌరవము గాని, గృహమునందు నిజమైన ఆనందము గాని కలుగజాలదు.

శ్లో. సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవచ
యస్మి న్నేవ కులే నిత్యం కళ్యాణం తత్ర వై ధ్రువం.

కావుననే స్త్రీ దాంపత్య మాతృత్వధర్మముల బాధ్యతతో నిర్వహింపవలయునన్నచో విద్యావంతురాలై యుండవలయుననుట స్పష్టము. విద్యావంతులు కానివారు గృహధర్మములను నిర్వహించుట లేదా? యని ప్రశ్నింపవచ్చును. అట్లని విద్యవల్ల ప్రయోజనము లేదని చెప్పగలమా? స్త్రీపురుషు లిద్దఱును విద్యావంతులైనచో వారి దాంపత్యమేమి, సిరిసంపద లేమి, యెట్టి శోభతో ప్రకాశించునో చెప్పవలయునా? దురదృష్టవశమున స్త్రీ విధవ యయినచో ఆమెస్థితి యెంతహీనముగా నున్నదో వర్ణించుట లజ్జాకరము. అట్టిస్థితిలో నామె విద్యావంతురాలైనచో గౌరవముగా జీవితమును గడపవచ్చును. ఒకవేళ జీవనోపాధి లేకున్నను ఎవరికిని నూడిగము చేయ నవసరము లేకయే మర్యాదగా సంపాదించుకొనుటకు వీలుండును. స్థితిమంతురాలైనచో అనేకవిధముల దేశసేవ చేయవచ్చును. విద్య, విద్యకొఱకే నేర్చుకొనదగిన దైనను

మనదేశస్థితినిబట్టి కూడ స్త్రీలు ఎక్కువగా విద్యావతులు కావలసియున్నది.

మనము నూతన స్త్రీవిద్యావిధానమును సూచించుటకు పూర్వము, ప్రస్తుతము స్త్రీవిద్య యేరీతి నున్నదో విచారింపనగును. ప్రభుత్వము వారిచేతను- క్రైస్తవ మిషనరీలచేతను- ఇతర స్త్రీవిద్యాభిమానుల చేతను- బాలికాపాఠశాలలు స్థాపింపబడి నడిపింపబడు చున్నవి. ఇవిచాలవఱకు ప్రాథమికపాఠశాలలు మాత్రమే. ఈ పాఠశాలలయందు చదువుట వ్రాయుట లెక్కలు మాత్రమే నేర్పుదురు. కాని ప్రభుత్వమువారిచేతను మిషనరీలచేతను స్థాపింపబడిన ఉన్నతపాఠశాలలందు బాలురకువలెనె, బాలికలకు సైతము నిరుపయోగ మైనట్టి విద్య గఱపబడుచున్నది. మీదుమిక్కిలి భాషేతరవిషయములు- అనగా భూగోళము, లెక్కలు, చరిత్ర మొదలగునవి- ఆంగ్లభాషలోనే బోధింపఁబడుచున్నవి. ఇది మిక్కిలి శోచనీయమైన స్థితి. ప్రభుత్వోద్యోగముల నాశించు బాలురకు లేనినిర్బంధము వీరి కెందులకో తెలియకున్నది. భాషేతరవిషయములు అన్యభాషలో జదువుట అనవసర శ్రమ యని బాలురకే తీసివేయబడినప్పుడు బాలికలకు ఆపద్ధతిని అల్లియుంచుట కేవలము మూర్ఖత కాదా. మఱియు బాలికాపాఠశాలలందు గల ఉపాధ్యాయినులు చాలవఱకు హైందవసంప్రదాయముల నెఱుగని- యూరపియను వేషభాషలయందు వ్యామోహము గలిగిన క్రైస్తవనారీమణులై యున్నారు. వీరి ప్రోత్సాహము వలనను, అనుకరణమువలనను, ఆదర్శమువలనను జాతీయములపై నిరసనమును- విజాతీయములపై వ్యామోహమును- చిన్ననాటనే బాలికలకు గలుగుట దేశక్షేమకరమా? మఱియు నిది గృహమునం దశాంతికి కూడ హేతువు కాగలదు.

ప్రస్తుతపు విద్యావిధానము నిరుపయోగ మైనదనుట నిర్వివాదాంశము. ప్రభుత్వోద్యోగశాఖలు నిండిన వెనుక బాలురు పదిపండ్రెండువత్సరములు విద్య నభ్యసించినను స్వతంత్ర జీవనము చేయుటకు శక్తిలేక యెట్లు అల్లాడుచున్నారో మనము చూచుచున్నాము. విద్యావతులయిన స్త్రీలు ప్రభుత్వస్త్రీవిద్యాశాఖయందు నుపకృతుల నేర్పఱచుకొనుచున్నారు. తక్కినయుద్యోగములు పురుషులకే చాలుటలేదు. ఇవి స్త్రీలకువాంఛనీయములు కావని యిదివఱకే సూచించియున్నాను. ఈ అభిప్రాయము స్వాతంత్ర్యదేశముల నివాసము గాంచిన ఫ్రాన్సు అమెరికాదేశములందే వ్యాపించి యున్నది. ఆదేశములందు ఉద్యోగములను జేయుచున్న స్త్రీలను "మీకొమార్తెలును ఉద్యోగముల జేయుట మీకు యిష్టమేనా?" యని ప్రశ్నించినప్పుడు తమకు ఇష్టములేదని చెప్పియున్నారు. మఱియును గృహనిర్వాహకమే స్త్రీకి ఉత్తమమయిన ధర్మమని అంగీకరించి యున్నారు. ఒకవేళ ఎవరైనను ఉద్యోగముచే కుటుంబపోషణ చేయవలసిన యవసరమున్నచో నట్లు చేయుటకు వారికి అవకాశము మాత్రముండవలయునని కోరియున్నారు. కావున స్త్రీలకు సంపూర్ణమైనహక్కులు ఉండవలసినదే. కాని దైవవిహితధర్మమును విడిచి పురుషులతో సమస్తకార్యములందు పోటీకి నిలుచుట దేశసేవగాని మానవసేవగాని ఎన్నటికిఁ గాజాలదు. ఎవరిధర్మమును వారు నిర్వర్తించుటయే ఉత్తమమైన ధర్మము. ప్రత్యేకపరిస్థితులలో స్త్రీలు ప్రజాహితజీవనమందును, ఉద్యోగములందును ప్రవేశించుట అవసరము కావచ్చును.

పైని వివరించిన సందర్భములను బట్టి జాతీయావసరములకును, సంప్రదాయములకును అనుకూలమైన యొక స్త్రీవిద్యావిధానపుచిత్తును ఇచ్చట వ్రాయుచున్నాను. దీనిని విద్యాధికులు విమర్శించెదరుగాక.

శిశుభాగము

పదియవ సంవత్సరము ఆఖరువఱకు ఇందు నాలుగు గాని అయిదుగాని తరగతులు నేర్పడవచ్చును. ధారాళముగా చదువుటయు వ్రాయుటయు బజారులెక్కలును మాత్రమే ఇందు నేర్పదగును.

బాలికాభాగము

11 సం॥ మొదలు 13 సం॥ ఆఖరువఱకు మూడు తరగతులు ఉండవచ్చును.

మాతృభాష.

చిత్రలేఖనము సంగీతము నిబంధములు సైన్సు చరిత్ర భూగోళము వీనినిగూర్చి సూక్ష్మమైన జ్ఞానము మూడుసంవత్సరములలో కలుగజేయవచ్చును. వడుకుట కుట్టుపని అల్లికపని నవారు నేత మొదలగు వానిని బొమ్మలు మొదలగు ఆటవస్తువులు చేయుట మొదలగు గృహపరిశ్రమలలో గొన్నిటిని నేర్పింపవలెను.

యువతీవిభాగము

14 సం॥ మొదలు 16 సం॥ ఆఖరువ

తరగతులు. ఇందు తెలుగు సంస్కృత ...

ఇంగ్లీషు ఈ భాషలలో నేవియో రెండును; గృహవిద్య గృహవైద్యమును; సంగీతము చిత్రలేఖనములలో నొకటియు; గృహపరిశ్రమలలో నేవియైన రెండును నేర్పదగును.

వీనిలో కొన్ని ప్రత్యేకముగా విశదపఱచుట అవసరము. గృహవిద్య యనగా వంటచేయుట ఇల్లు చక్కబెట్టుట మొదలగు గృహనిర్వాహకమునకు సంబంధించిన పనులు. ఈపనులు పెద్దబాలికలకు కొద్ది ఉపకారవేతనముల నిచ్చి తగిన గృహవసతుల నేర్పరచి నేర్పింపదగును. గృహవైద్యమనఁగా, సామాన్య ఆరోగ్యవిధానములు శిశుపోషణ. శిశువైద్యము అనగా మనదేశములో తల్లులు పిల్లలకు వాడు ఓషధులయొక్క ఉపయోగము. నిర్భయముగా వాడదగిన అల్లోపతి హోమియోపతి మందుల ఉపయోగము. ప్రథమచికిత్స (ఫస్టు ఎయిడ్) మంత్రసానితనము అయియున్నది. స్త్రీలు పురుషులకంటె ఎక్కువ రసజ్ఞులును సౌందర్యాభిలాషలును. రసజ్ఞానము మానవప్రకృతిలోగల సహజగుణము. ఇది జీవితమునకు నూతన వికాసమును, ఉత్సాహమును ప్రసాదించును. కావున నిది పోషింపదగిన గుణమై యున్నది. కాని వెఱ్ఱితలలు దాల్పకుండునట్లు మాత్రము చూడవలసియుండును. ఈరసజ్ఞతను పోషించుటకే సంగీతము చిత్రలేఖనము జవళిపని అల్లికపని, మొదలైనవి చేర్పబడినవి. నిర్మలమైన ఆనందమును సౌందర్యమును అనుభవించుటకు అవకాశ మున్నచో విపరీతభావములమీదికిగాని, వికారచేష్టలమీదికిగాని మనస్సు పోవుటకు వీలుండదు. కావున దీనివలన నైతికలాభము కూడ కల దని చెప్పవచ్చును.

ఈ విధానమందు విద్య పదునాఱు సంవత్సరముల వఱకుమాత్రమే యేర్పాటు చేయబడినది. సాధారణముగా మనబాలికలు అంతకుమించి చదువుట తటస్థింపదు. ఈ విధానమైనను- తల్లిదండ్రులు బాలురయందు జూపు శ్రద్ధను బాలికలయందు గూడ జూపినఁగాని కొనసాగజాలదు. స్త్రీవిద్యయొక్క ఆవశ్యకతనుగూర్చి ముఖ్యముగా తల్లిదండ్రులను ఉద్బోధింపవలసి యున్నది. వారి తోడ్పాటు లేనియెడల నెన్నివిద్యాలయములను స్థాపించినను ప్రయోజనము కలుగదు. దేశసౌభాగ్యమును మానవకల్యాణమును గోరువా రందఱును ఈవిషయమై శ్రద్ధ పూనుదురు గాక.

# ఆంధ్రులు - ఆంధ్రభాష

దేశిరాజు రామదాసు గారు

యతియును ప్రాసయు ♦ నలరియుంటను గదా, యడుగంటకుండె నీ ♦ యాంధ్రభాష
మధువుకన్నను మించి ♦ మధురంబుగా నుంట, నడుగంటకుండె నీ ♦ యాంధ్రభాష
గీర్వాణముంబలె ♦ సర్వపూర్ణం బౌట, నడుగంటకుండె నీ ♦ యాంధ్రభాష
రాజులపోషణ ♦ రవ్వంత ప్రిదులుట, నడుగంటకుండె నీ ♦ యాంధ్రభాష
గీ. కాకయుండిన నీభాష ♦ కప్రయోష, నవ్యమరకతమంజూష ♦ నరవిభూష
సకలజనతోష యాంధ్రహృ♦ద్సద్మపోష, కటకటా! నేటికే ♦ యడుగంట కున్నె.
సీ. భాషాజనుల నొక్క ♦ భాగంబునను జేర్చి, సౌకర్యములఁ గూర్చు ♦ జాడలేదు
ఆంధ్రవిద్యార్థుల ♦ కనువైన యొకవిశ్వ, విద్యాలయము నిల్పు ♦ విధము లేదు
దేశపరిశ్రమల్ తిరిగి ♦ వృద్ధిని జేయు, తగు ప్రయత్నం బొండు ♦ తలఁప లేదు
సైరుపంటులకును ♦ వాణిజ్యమునకైన, కాల్వలఁ బొడిపించు ♦ క్రమము లేదు
గీ. కటకటా! యాంధ్రదేశంపు ♦ కర్మ మిద్ది, ఆంధ్రభాషకు జారియెం ♦ దైనఁ గలదె
తొంటి యౌన్నత్యములు మది ♦ దోఁచియున్న, ఆంధ్రులు స్వహస్తముల ♦ దాని నానకున్న.
సీ. ఆంధ్రవిప్రుల కుండు ♦ నమితశాంతియు శుచి, మన్ననల్ నేడు ♦ లేకున్నఁ బోయె
ఆంధ్రవీరుల కుండు ♦ నత్యంతశౌర్యంబు, క్రొన్నెత్తురులఁ బార♦కున్నఁ బోయె
ఆంధ్రవైశ్యుల కుండు ♦ నతిమాత్రధనములు, కోట్లకు పడగ లే♦కున్న బోయె
ఆంధ్రకర్షకులకు ♦ నగరెడు నోపిక, మన్ననఁ గలసి ♦ లేకున్నఁ బోయె
గీ. నాల్గుజాతులవారు మ ♦ నంబు మనము, గలిపి యైకమత్యంబుతోఁ ♦ గ్రాలిరేని
తొంటిజవమును నైర్మల్య ♦ మంటకున్నె, లక్ష్మి వసియింపదే యాంధ్ర♦రాష్ట్రమందు.

# సంతానము—దాంపత్యనియమములు

పిన్నంరాజు వేంకటసుబ్రహ్మణ్యశర్మ గారు

సకలజగదాధార భూతుండగు కమలాసనుఁడు నిఖిలమానవ సృష్టికై శుక్రమే ప్రధానమని నిర్ణయించె. ఆశుక్రము శరీరనిష్ఠసర్వ ధాతువులలోను శ్రేష్ఠమై మూలాధారమై తేజరిల్లుచున్నది. అట్టిది దుష్టంబుఁగాక పవిత్రమై, బహునియమసంరక్షితమై యుండినగాని ఆరోగ్యవంతమగుసత్సృష్టికిఁ గారణము గానేరదు. నియమసంరక్షిత శుక్రసామర్థ్యముచే లోకపావనులై తేజోవీర్యజ్ఞానబలోపేతులై, స్వకార్యకరణదక్షులై పొలుపారుసంతానములు జనించుచున్నవి. ఈ శుక్రము మనుజుని బాల్యము మొదలు చేయుచున్న ధర్మాధర్మకృత్యముల యందలి దోషాదోషంబులచే దుష్టాదుష్టరూపము నొందుచున్నది. దుష్టముకాని రేతస్సు సత్సంతానమునకు కారణమగుచున్నది. దుష్టమగు రేతస్సు దుస్సంతానమునకు హేతువై లోకకంటక మగుచున్నది. అందుననే త్రికాలవేదు లగు ప్రాచీనమునిపుంగవులు ధర్మసాధనమగు దేహమును గాపాడుటకై, సంతానమూలాధారమగు శుక్రమును పవిత్రంపజేయుటకై బహునియమముల నేర్పరచిరి. స్త్రీ గర్భమును ధరించినది మొదలు కొన్ని మంత్రసంస్కారములచే రక్షింపుచుండ వలయును. ఈవిషయమునే సుశ్రుతమందు సూత్రస్థానములో ద్వితీయాధ్యాయమున "లబ్ధగర్భాయా శ్చైతే వ్యహస్సు లక్ష్మణావటశుంగా సహదేవా" అను మొదలు కొంతభాగము గర్భసంరక్షణకై కొన్ని యౌషధక్రియల నుడివియున్నారు. జనించినపిదప జాతకర్మనామకరణ చూడాన్నప్రాశనచౌలోపనయనాదిక్రియలచే పునీతుంజేసి గురుకుల వాసంబున కంపవలయు. అచ్చట గురువును యథావిధిగ నుపాసింపుచు సంధ్యావందనాగ్నికార్యభైక్షాచరణాది సత్కర్మల నాచరించుచు ద్వాదశవర్షములు బ్రహ్మచర్యనియమముతో స్వాధ్యాయము చేయవలయు. ఆబ్రహ్మచర్యంబు నాచరించు కాలంబున సంధ్యావందనాగ్నిహోత్రాదిమంత్రంబులందు గాయత్రీవీతిహోత్రులను తనబ్రహ్మచర్యరక్షణకై ధ్యానింపుచున్నాడు. ఓమిత్యేకాక్షరాది మంత్రములందు గాని మిత్రస్యచర్షణీధృతః సూర్యోపస్థాన సూక్తములందు గాని అగ్నికార్యమంత్రంబులందుగాని తనకు బ్రహ్మచర్యము సిద్ధింపవలయుననియు, తేజోబలవీర్యాదుల ప్రసాదింపు మనియు, అజస్రత్వంబు ననుగ్రహింపుమనియు గాయత్రీవీతిహోత్రాదుల నచంచలమానసుండై సర్వకాలసర్వావస్థయందును ; తదేకధ్యానచిత్తుండై చిత్తకుహరంబున ధ్యానింపుచు స్వాధ్యాయము చేయుచున్నాడు. ఇట్లు బ్రహ్మచర్యవిధిచే సంరక్షింపబడిన రేతస్సు సత్సంతానమునకు గారణ మగుచున్నది. గర్భాష్టమమందు ఉపనయనముచేసి ద్వాదశవత్సరములు బ్రహ్మచర్యము నాచరించుటచే వానిమనంబు కల్మషరహితమై దేదీప్యమానంబై ప్రకాశించు- ఆ బ్రహ్మచర్యవ్రతాచరణకాలంబున వానిమనంబు విషయాసక్తము గామిఁజేసి నిశ్చలగుచున్నది. అట్టి నిశ్చలమనస్కునికి నిద్రియంబులు వశ్యంబులై నడచుచున్నవి. ద్వాదశవర్షంబు లట్లింద్రియములు స్వాధీనము లగుటంజేసి దుష్టవిషయంబులం దాశ జనింపనేరదు. కాని యిప్పటికాలపు బాలురు నియమములకు లోనై పోషింపబడుటలేదు. బ్రహ్మచర్యముకన్న సత్సంతానమునకు వేరుమార్గమే లేదు. దీనిని మనోవాక్కాయకర్మలందు జ్ఞాపక ముంచుకొనవలయును వృక్షోత్పాదనసమర్థంబగు బీజంబువలెనె సంతానమునకు మూలభూతమగు రేతస్సును గూడ బహుజాగరూకతతో గాపాడి దానిని సజాతీయక్షేత్రమునందు దేశకాలాదుల గుర్తెఱింగి నాటి కాపాడినగాని యారోగ్యసంతానమును బడయనేరడు. చెట్టునుండి సుఫలము నొందుటెంత కష్టమో సత్సంతానమును బడయుటయు దానికన్న వేయిమడుంగులు కష్ట మని ఆయుర్వేదము ధర్మశాస్త్రము నారెంటను దేహసంరక్షణోపాయబోధకములై అవినాభూతములై మార్గంబులబోలి యెడబాటు చెందకుండ నైకకంఠ్యముగ ధర్మముల బోధింపుచున్నవి. రేతస్సు సకలజగత్సార మని బృహదారణ్యకోపనిషత్తునందు జెప్పఁబడియున్నది.

"ఏషాంవై భూతానాం పృథివీరసః, పృథివ్యా ఆపః—అపామోషధయః, ఓషధీనాం పుష్పాణి, పుష్పాణాం ఫలాని, ఫలానాం పురుషః, పురుషస్య రేతః, సహ ప్రజాపతి రీక్షాంచక్రే హంతాస్మై ప్రతిష్ఠాం కల్పయానీతి సస్త్రియగ్ం ససృజే తాగ్ం సృష్ట్వాధ ఉపాస్త".

పైని వివరించినరీతిని సర్వజగత్సారమై సర్వజగదధిష్ఠానమై, యమూల్యమై వెలింగెడి నీరేతస్సును భ్రంశముచేయుట పండితునికి వ్యవహారము కానేరదు.

మరియు నీ బ్రహ్మచర్యమున కనుకూలంబుగ స్త్రీపురుషులు తమ శుక్లశోణితములు దుష్టంబులుగాకుండుటకై భోజనాదుల నియతితో నుండవలయు. కాన లోకమందలి మనుజులయొక్క భోజనాదిభేదముల చేతను, ఆచారవ్యత్యాసములచేతను, శౌచవిధుల పరివర్తనంబులచేతను, శుద్ధాశుద్ధంబుల నొందుచున్నవి. స్త్రీపురుషులు ఆహారములను గ్రహించు నవసరంబున హితముగను, నుండువాటిని దేశకాలాదులను వాతపిత్తశ్లేష్మ గుణములను, బాగుగా నెఱింగి తగునట్లు నాయా యాహారముల భుజింపవలయు. ప్రాతఃకాలికకృత్యములను, వైశ్వదేవాతిథిపూజాదులను, బూర్తిగావించుకొని, పదంపడి యాహారమును గైకొనునవసరంబున "ఓ ఓదనమా! నీవు పరబ్రహ్మస్వరూపుడవు. నీవు నా దేహమందు ప్రవేశించి యమృతమయమగు రసస్వరూపమును బొంది నన్ను తేజోబలవీర్యజ్ఞానోపేతునిగ జేయుము." అని ప్రార్థించి భుజింపవలయు.

ఇట్లు భుజింపబడిన యాహారము హృదయమందు జఠరాగ్నిచే బచనమై రసస్వరూపము నొంది క్రమక్రమముగ సప్తధాతువుల బొందును.

"రసా ద్రక్తం తతో మాంసం మాంసా న్మేద స్తతోస్థిచ
అస్థ్నో మజ్జా తతశ్శుక్రం శుక్రా ద్గర్భః ప్రసాదజః".

మఱియును ప్రతిమనుజుఁడును ఆహారముల గుణాగుణముల గుర్తెఱింగి సద్గుణజనకంబులును సాత్వికములును నగు నాహారము గైకొనవలయు. ఆయాహారములు సాత్విక రాజస తామస భేదంబులచే మూడువిధములుగా నున్నవని కృష్ణభగవానులు చెప్పియున్నాడు.

"ఆయు స్సత్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్వికప్రియాః
కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః
యాతయామం గతరసం పూతిపర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యమ్ భోజనం తామసప్రియం".

ఇట్లే చరకమందును ఆత్రేయభద్రకాప్యీయాధ్యాయమునను "యచ్చాపి దేశకాలాగ్ని సాత్మ్యాసాత్మ్యాదిభిః" అను పర్యంతము విరుద్ధాహారముల గ్రహించుటచే దేహపాటవము చెడునని వానిని సేవింపరాదని నియమము చేసినారు. మరియు చరకమందే అన్నపానవిధ్యధ్యాయమున వస్తువర్గముల వానిగుణముల నుపయోగము బాగుగా విమర్శించిరి. కావుననే మితాహారముల దేశకాలాదుల నెఱింగి యుపయోగించుటయే సమంజసమై యున్నది.

పురుషులవలెనే వనితయు బ్రహ్మచర్యమును ఆహారవ్యవహారములందు నియమములను, గలదై వర్తింపవలయు నని నియమము చేసిరి. అందున స్త్రీయొక్క ఆర్తవమును శుభ్రముగ దోషరహితముగ నుంచుకొనవలయు. పురుషునిరేతస్సు పవిత్రముగా నుండినను స్త్రీశోణితమును మనోభావనలు దుష్టంబులైనచో నాయబలయందు నిషిక్తమగు రేతస్సు సఫలమొందక యూసర క్షేత్రమునందలి శాలిబీజమువలె నిష్ఫలంబగు. అట్టి కారణంబులచేత బురుషునిరేతస్సుగాని స్త్రీయొక్క శోణితముగాని, వారిద్దరి మనోభావనలుగాని వారి పరస్పర బ్రహ్మచర్యాద్యాచారవ్యవహారములు గాని యివియన్నియుఁ గలసి సత్సంతానమునకు మూలకారణంబులై విరాజిల్లుచున్నవి. కాన స్త్రీయొక్క శోణితము పరిశుద్ధముగ నుండవలయు. వనితల దేహమందుండు యపరిశుద్ధశోణితము ఋతుకాలంబున బహిర్గతమై తదాదిగ శుద్ధశోణితము వృద్ధిబొందుచున్నది. కనుకనే ఆ కాలమునందు వారికి భోజనమందుగాని యాచారములందుగాని నియమముల గల్పించిరి. ఇట్లు నియమముల గల్పించుట స్త్రీల దేహసౌఖ్యముకొరకును, జనించుసంతాన మారోగ్యవంతమై బలవంతమై జ్ఞానవంతమై యుండుటకొరకే గాని వేరు కాదు.

ఋతుమతియగు వనిత యెట్టినియమముల నాచరింపవలయునో యాచరింపని యెడల కలుగు యనర్థము లెవ్వియో వానినన్నింటిని కృష్ణయజుర్వేదీయసంహితలో ద్వితీయకాండ పంచమప్రశ్నమందు వివరముగ నిరూపించిరి. ఆవిషయమునే సుశ్రుతమందు సూత్రస్థానములో ద్వితీయాధ్యాయమున "ఏవ మదుష్టశుక్ర శ్శుద్ధార్తవా" అనునది మొదలు "అతఃపరం మాసాదుపేయాత్" అనుపర్యంతము చెప్పియుండిరి. స్త్రీకి గల యార్తవదోషము ఋతుకాలమందలి యాచరణలచే బోవుచున్నది. స్త్రీ ఋతుమతియైన ప్రథమ దివసము మొదలుకొని మూడు దివసములవరకు బ్రహ్మచర్యవ్రతమును బరిపాలనము చేయుచు నియమవంతురాలై పగటినిద్ర అంజనము రోదనము స్నానము చందనానులేపనము అభ్యంగనము నఖచ్ఛేదనము పరుగులిడుట దుముకుట నవ్వుట అధికసంభాషణము అధికశబ్దశ్రవణము మొదలగు పనుల నాచరింపరాదు. ఆట్లాచరించినచో సంతానము రోగవంతమై జనించును కనుక ఈనియమములను పాటింపఁజేసి ఋతుమతియగు కాలమందు స్త్రీమనోభావనలు చంచలములు గాకుండునట్లు కాపాడవలయు. మన ప్రాక్తనమహర్షులు వాటి యుక్తాయుక్తముల, గుణాగుణముల కాలాకాలముల ననుసరించి మనసంరక్షణముకొరకై వారిజీవితముల ధారబోసి గ్రంథముల బహునియమముల నేర్పరచిరి. మనమువాటి సారమును గ్రహింపనేరక కష్టములకు బాల్పడుచున్నాము. నాల్గవ దినంబున స్నాతయై శుభ్రవస్త్రధారిణియై యలంకరించుకొని ప్రప్రథమమున భర్తనే జూడవలయు.

"పూర్వం పశ్యేదృతుస్నాతా యాదృశం నరమంగనా
తాదృశం జనయే త్పుత్రం భర్తారం దర్శయే దతః
తతో విధానం పుత్రీయ ముపాధ్యాయ స్సమాచరేత్
కర్మాంతే చ క్రమం హ్యేన మారభేత విచక్షణః"

అని సుశ్రుతమునఁ జెప్పినట్లు ఋతుస్నాత యగుస్త్రీ వెంటనే యెట్టిపురుషుని దర్శించునో అట్టిపుత్రుడే జనించును. కాన నాకాలమున భర్తను తప్ప మరియెవ్వరిని జూడరాదు. అట్లు భర్తనుఁ జూచుటచే తాదృశరూపవీర్యబలతేజములుగల జ్ఞానవంతుడగు పుత్రుఁ డుదయించు.

"న కశ్చి ద్యోషితః శక్తః ప్రసహ్య పరిరక్షితుం
ఏతై రుపాయయోగైస్తు శక్యా స్తాః పరిరక్షితుం
అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్
శౌచే ధర్మే న్నపక్త్యాంచ పారిణాహ్యస్య వేక్షణే."

అని స్త్రీకి స్వాతంత్రము నిచ్చు సందర్భములను మనువు పేర్కొనుచున్నాడు. ఈవిధానమువలన స్త్రీల మనంబు నిర్మలమై సంతోషతరంగితమై పవిత్రమై యొప్పును. అట్టిస్త్రీకి బ్రహ్మచర్యవ్రతమింతకంటె వేరుగానరాదు.

కాన తాదృశబ్రహ్మచర్యవ్రతాచరణ పరాయణ యగు స్త్రీకిని బాల్యమునుండి బ్రహ్మచర్యము నార్జించిన పురుషునకును గలుగు సంతానమారోగ్యవంతమై నిష్కలంకమై తేజోవీర్యబలాదులచే నొప్పునదై జన్మించు.

వీటి కన్నింటికిని వివాహసంబంధములు ప్రధానములై యున్నవి. ఆవివాహముల నెనిమిదివిధములుగ మన్వాదులు విభజించిరి. వానిలో

ప్రాథమికము లగు నాలుగువివాహములు మాత్రము శ్రేష్ఠము లనియు, మిగిలిన వివాహములు నీచములు నింద్యము లనియు నిర్వచించిరి. వానిలో ప్రాథమికము లగు బ్రాహ్మ ప్రాజాపత్య దైవార్షములు మాత్ర మాచరణీయంబు లని నిర్ధారణ చేసిరి. అదియుంగాక పురుషునికి స్త్రీరత్నమునకు వివాహయోగ్యకాలమును నిర్ణయించిరి. పురుషునికి 24 వత్సరములకు వివాహము చేయవలయు ననియు, స్త్రీకి యోని మిదవవర్షమున వివాహము చేయవలయు ననియు మనువు జెప్పెను. ఇరువదినాల్గవవర్షమున వివాహమాడువాడు పురుషార్థచతుష్టయంబును బరిసమాప్తి నొందించువాడగును. ఇట్లు బ్రహ్మచర్యవ్రతముతో నుండి సజాతీయయగు స్త్రీని వివాహమాడి యావనితతో గార్హస్థ్యధర్మమును యథాక్రమముగ నాచరించువాఁ డారోగ్యసంతానవంతుడగుచున్నాడు. ఇదియుంగాక సత్సంతానమును బొందుటకు "ఋతావుపేయాత్" అనుశాస్త్రము ననుసరించి వర్తింపవలయు. అట్లు వర్తించుటయు ఆరోగ్యసంతానమునకు హేతు వగుచున్నది. స్త్రీ ఋతుమతియైన పదియారుదినములలో ప్రథమదినత్రయము కప్ప మిగిలినరోజులలో సమాగమం బొనరించుటచే సత్సంతాన మేర్పడుచున్నదని ప్రమాణము గలదు. కావున స్త్రీ పురుషులు పుట్టినదిమొదలు శిశూత్పత్తిపర్యంతము బ్రహ్మచర్యమును గాపాడుకొనుచు ఆహారవ్యవహారాదుల నియమములతో నాచరించుచు నుండిరేని, జన్మించువారు దీర్ఘాయుష్మంతులై ఆరోగ్యభాగ్యసంపన్నులై జ్ఞానతేజోవీర్యబలోపేతులై సత్కర్మాచరణదక్షులై లోకపావనులై జననీజనకులగౌరవము గాపాడువారై యుండెదరు.

ఇట్టి యాచారవ్యవహారములతో నున్నను రోగిష్ఠులు దుర్మార్గప్రవర్తనులు పుట్టగూడదా యని యాక్షేపింతురేని అట్టిసంతాన మేర్పడుటకు పూర్వజన్మోపార్జితపాపఫలము బలవత్తరము గుచే నిట్టికర్మల నాదరించినను రోగిష్ఠులు కలిగెదరు. దానికంతయు మనము గర్తలము గానేరము. ఎప్పుడు మనము కర్తలముగాజాలమో యట్టి సమయంబున నాకర్మల నేల జేయవలయు నని యాక్షేపింతురేని తాసు జేయవలసిన కృత్యములఁ జేయక యుపేక్షించుటచే పాపఫలము పెరిగిపెరిగి వీనిని నశింపజేయును ఇదియే పర్యవసానమగును. ఈసందర్భమున సుశ్రుతాచార్యుల ఈక్రిందివాక్యములు మననార్హములు.

"భావితాః పూర్వదేహేషు సతతం శాస్త్రబుద్ధయః ।
భవన్తి సత్వభూయిష్ఠాః పూర్వజాతిస్మరా నరాః,
కర్మణా చోదితో యేన తదాప్నోతి పునర్భవే
అభ్యస్తాః పూర్వదేహే యే తానేవ భజతే గుణాన్"

# సంధ్యారాగము

పెనుమర్తి వేంకటరత్నము గారు

బంధుజీవసుమమ్ములఁ । బరిభవించి
గరిమ దాసానిపువ్వులఁ । గాకుసేసి
యలరు కంకేళిసుమముల । నవఘళించి
పశ్చిమంబునఁ గెంజాయ । పరిఢవిల్లె;
అమల కాసార సంస్థితాబ్జముల నుండు
భృంగసంతతి ఝమ్మని । మొగురుచుండె;
ధవునకై దుఃఖమొందుచుఁ । దనరుచుండె
అంబుజాకరమందున । నలరుతమ్మి;

సారెఁదెఁ జీకటులు తెల్లెడఁ । విరియఁజొచ్చె
నని నిశాంగన, దుఃఖాబ్ధి । నలరుచుండు
తమ్మివెలఁదిని గాంచి తద్దయు హసించె
కిసలయమ్ములఁ మెసవి కోకిల యొకండు
మావిగున్న నధిష్ఠించి । మధురముగను
సాంధ్యగీతంబుఁ బాడె హర్షము సెలంగ
మానవప్రపంచకం బెల్ల । మానసములఁ
మఱచి గానాంబురాశి నిమగ్నులైరి:

అన్ని వ్యాధులకు తగిన అద్భుతాయుర్వేదౌషధములు శాస్త్రీయములైనవి

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులుగారి

# ఆయుర్వేదాశ్రమమున దొరకగలవు

పరిశ్రమ వ్యవసాయ వస్తుప్రదర్శనోత్సవమున ప్రదర్శింపబడిన

1906-వ సంవత్సరమున కలకత్తా నగరమునందు జరిగిన

మా ఆయుర్వేదౌషధముల చిత్రపట సూక్ష్మరూపము.

కలరామందులు సెట్టు ర్పూ 1-2-0 లు.

ఇన్ఫ్లుయెన్జామందులు సెట్టు ర్పూ 1.12-0 లు.

**ప్లేగుమందులు** పెద్దసెట్టు ర్పూ 2-2-0 లు. చిన్నసెట్టు ర్పూ 1-6-0 లు.

పై 3 ఘోరవ్యాధుల మందులే గాక, ఈక్రింది మందులును ఇతరమందులును అనేకము లీ యాశ్రమమున గలవు.

☞ క్యాటలాగు ఉచితము. వ్రాసిన పంపెదము.

బలమునకు పుష్టికి:-జీవామృతము 6 ఔన్సుల సీసా 3-4-0

తలంటునకు:-అమృతామలక తైలము 6 అ॥ సీసా 1-0-0

సవామేహమునకు:-రక్తశోధక 6 అ॥ సీసా 8-0-0

పంచతిక్తగుగ్గులు ఘృతం 6 అ॥ సీసా 6-0-0

విచిత్రరత్న లేపము (పైపూతకు) డబ్బా 2-0-0

మధుమేహమునకు:-ప్రమేహభంజని డబ్బా 8-0-0

గోమూత్ర శిలాజిత్తు తులం 2-0-0

ముట్టుకుట్టునకు:-అశోకవటి సీసా 0-14-0

అశోకారిష్టము 6 అవున్సుల సీసా 1-2-0

మదమూర్ఛలకు:-అబలాసంజీవని 8 అ॥ సీసా 1-12-0

పక్షవాతమునకు, ఆమవాతమునకు:-

నారాయణ తైలము 8 అ॥ సీసా 8-0-0

దగ్గుకు, ఉబ్బసమునకు:-చరకవటి డబ్బా 0-14-

చ్యవనప్రాశన 1 సేరు 8-0-0

వాశారిష్టము 6 అ॥ సీసా 1-2-0

గనేరియాకు:-భృగువటి డబ్బా 1-12-0

చందనాసవ 6 అ॥ సీసా 1-8-0

గర్భిణీస్త్రీలకు:-మాతులుంగరసాయనము 8 అ॥సీసా 1-12-0

అన్ని మందులకును, ప్యాకింగు, పోస్టేజి వగైరా ఖర్చులు ప్రత్యేకము.

తంతివిలాసము:—"పండిట్" మదరాస్

ఆయుర్వేదాశ్రమం, 41, ఆచారప్పన్ వీధి, మద్రాసు.

# గోపరాజు రామమంత్రి

నడింపల్లి జగన్నాథ రావు గారు

రామమహామహుని నామము నీయాంధ్రదేశమున నెఱుంగనివారు లేరు. బ్రాహ్మణులకు గ్రామ స్థావరవృత్తులను అనగా కరణీకపుమిరాశీలను యిచ్చినది ఇతఁడే. ఇతఁడు కరణీకోద్ధరణమును గావించినటుల చాల స్థానికపురాణములయందును కొండవీటిదండకవిలెలందును జెప్పఁబడియున్నది. ఇతనినిగూర్చి కొండవీటిదండకవిలెలో నీక్రింది విధముగ జెప్పబడియున్నది.

శ్లో. గోత్రశాస్త్రాంబరేందూనాం (1067) సంఖ్యాబ్దే శాలివాహనే,
గ్రామస్థావరవృత్తీనాం ప్రథమో గణికాగ్రణీః.
శ్రీమాన్గణపతి ర్భూభృత్, గజపత్యన్వయోద్భవః,
అస్తి భూమండలే తస్య బహవ స్సంతి మంత్రిణః,
తేషాం శ్రేష్ఠతమామాత్యో యాజ్ఞవల్క్యస్తమోద్విజః,
గోపరాజాన్వయోత్పన్నో రామాఖ్యో గణకాగ్రణీః,
రక్తాక్ష్యబ్దే మాసి భాద్రపదే బహుళపక్షకే
దర్శేర్కగ్రహణే పుణ్యకాలేంగారకవాసరే
గణకానాం హితార్థాయ సద్యశ స్థాపనాయచ,
తిష్ఠత శ్చక్తిమార్తాండౌ యావత్తావచ్చ వర్ధతాం
తేషాం రాజా గ్రహత్యాణాం కృష్ణవేణీ తటే తథా
గ్రామస్థావరవృత్తీనాం సాక్షిణ్య స్సర్వదేవతాః
తస్మాద్ధర్మవృత్తీనాం సాక్షిణ స్సర్వదేవతాః
తస్మాద్ధర్మ మిదం సత్యం నిర్మితం యో దురాత్మనాం
కరోతిచే దన్యథాసౌ జాయతే ఖరయోనిషు
ఆపస్తంబసూత్రస్య శాఖాభేదః స్మృప్రోచ్యతే
యాజ్ఞవల్క్య తివిఖ్యాతో గోత్రం కాశ్యప ఇత్యథా
విప్రాణాం శాప ముద్వేషం వేదబాహ్య శ్చకారయత్
తచ్చ శాపవిముక్తిత్వం భానుశక్త్యాద్యపండితః
మాఘమాసే సితేపక్షే విజయే వత్సరే తథా
పంచమ్యాం రవివారేచ యాజ్ఞవల్క్య భవోభవత్.

దీనినిబట్టి గోపరాజు రామప్రధాని యాజ్ఞవల్క్యశాఖాబ్రాహ్మణుఁడనియును కాశ్యపగోత్రుఁడనియును గజపతివంశీయుఁడగు గణపతిదేవుని కడ ప్రధానమంత్రిగా నుండి శా. శ 1067 సం॥ (క్రీ.శ. 1145) సం॥రము భాద్రపద బ 30 లు రోజున సూర్యగ్రహణ పుణ్యకాలమున కృష్ణవేణీతటమున రాజానుమతమును బొంది బ్రాహ్మణులకు స్థావరవృత్తుల నొసంగె ననియును దెలియుచున్నది.

ద్వాత్రింశన్మంత్రిచరిత్రమునందు నీగోపరాజు రామప్రధానిని గూర్చి చెప్పు సందర్భములో "గణకనిర్వాహంబు గావించె నూరారమహి గోపరాజు రామప్రధాని" యని చెప్పఁబడియున్నది.

ఇటులనే యాంధ్రదేశమునందలి ఏస్థానిక చరిత్రమును జూచినను గోపరాజు రామమంత్రి బ్రాహ్మణులకు కరణీకముల నిచ్చినటుల గాన్పించుచున్నది. జనప్రతీతియు నటులనే గలదు. వీని నాధారము జేసికొని కర్నూలుమండలములోని త్రిపురాంతకనివాసి యగు ఊరె వీరభద్రకవి "కరణీకోద్ధారిణి" యను గ్రంథమును రచించియుండెను. ఇతఁడు బ్రాహ్మణులకు కరణీకముల నిచ్చుటను గూర్చి స్థానికచరిత్రల యందును ద్వాత్రింశన్మంత్రిచరిత్రమందును యీక్రిందివిధిగ జెప్పఁబడియున్నది. జనప్రతీతియు నిటులనే యుండెను.

గోపరాజు రామప్రధాని మాదలగ్రామమునకు వెళ్లినటులను, (మాదలగ్రామము సత్తెనపల్లితాలూకాలో సత్తెనపల్లికి దాపున నున్నది.) ఆదిన మాతనితండ్రియాబ్దిక మగుటచే నాగ్రామమందలి బ్రాహ్మణునొకని నిమంత్రణకు నియమించినటులను, ఆగ్రామకరణ మగు విశ్వబ్రాహ్మణుఁడా బ్రాహ్మణుడు ప్రభువున కీయవలసిన పన్ను నీయనందున నాపన్ను చెల్లించనిది విడువనని దండనను విధించి యా బ్రాహ్మణునకు బండకొయ్యవేసినటులను, కాలాతిక్రమణ మైనను నిమంత్రితుఁడైన బ్రాహ్మణుఁడు రామికి కారణమారసి తనపితృకార్యమును నెరవేర్చుకొనువఱకా బ్రాహ్మణుని వదలవలసినదిగా కరణమునకు కబురుచేయగా నవసర మున్నచో పన్నును చెల్లించి విడిపించుకొని వెళ్లవలసినదిగా నా కరణము జవాబుపంపెను. ఆబ్రాహ్మణుఁడీయవలసిన పన్నును రామప్రధాని చెల్లించి బ్రాహ్మణుని విడిపించుకొని తనకార్యమును నెఱవేర్చుకొనినటులను, ఆ ప్యది మది నిడుకొని కరణీకములనుండి వారిని తొలగించి బ్రాహ్మణుల కిప్పింపఁదలఁచి సమయమునకై వేచియుండి సూర్యగ్రహణకాలమున రాజు కృష్ణానదీస్నానము గావింప కృష్ణానదికేగ నటుకు బ్రాహ్మణు లెవ్వరును రాకుండునట్లు జేసినటులను, ప్రభువు కృష్ణానదిలో స్నాన మాచరించు నెడ సంకల్పముఁ జెప్పుటకు బ్రాహ్మణు లెవ్వరు లేకుండుటను జూచి రామప్రధానితో బ్రాహ్మణులు లేరే మని ప్రశ్నించినటులను తాను బ్రాహ్మణుఁడనే ననియు, సంకల్పము జెప్పి పురోహితకృత్యమును నెరవేర్పసమర్థుఁడ ననియు చెప్పినటులను అందు పై రాజు నియోగికి దానమియ్యరాదడుగదా యని నటులను, అప్పుడు

ఉ. మానఘనుండు బ్రహ్మకుల ♦ మండనమూర్తి పరోపకారి దు
ర్దానదురాన్నముల్ గొనఁడు ♦ తప్పడు స్వామిహితైక కార్యముల్

దీనులఁబ్రోచు బాంధవవిధేయుఁడు ♦ డస్సియు వేడబూనఁ డిం
పూనిన భక్తితోఁడుత ని♦యోగి కొసంగిన దాన మల్పమే.

యని రామప్రధాని యనినటులను, నీవు గణికాగ్రణివి. కావున దాన మియ్యఁగూడ దని రా జనినటులను,

ఉ. వ్రాయుట దోసమా? విక్రృతివైదికమా? సుతదారరక్షణో
పాయముకై నియోగి నయి పార్థివసేవ యొనర్చునంత నే
పాయును వంశశీలములు? ♦ బాగుగ మున్నలచిత్రగుప్తులున్
వ్రాయరె యెల్లలోకముల ♦ వారలు చేసిన పుణ్యపాపముల్."

అని రామప్రధాని సమాధానము చెప్పినటులను పిమ్మట నీవు కవివిగాన నీకు దానమియ్యఁగూడ దని రా జనినటులును,

చ. కవి కమలాసనుండు త్రిజగ♦త్పతి యైనపినాకపాణియు
న్గవిరొ తలంపఁగాఁ గవులు♦గారె పరాశర బాదరాయణుల్
కవికృతపుస్తకగ్రహణ ♦ గర్వితు లల్పులు పూజ నొందఁగా
కవులట! పూజపాత్రు లిల♦గారట! యిట్టివిపో విచిత్రముల్!

అని రామప్రధాని జవాబియ్య రాజు లజ్జపడి యాతనిచే సంకల్పము జెప్పించుకొని స్నాన మాచరించి దానమియ్య బోవఁగా తాను కోరినవరమిచ్చెదనని ముందుగ చేతిలో నుదకము విడువుమని రామప్రధాని కోరినటులును రా జారీతిగావించిన పిమ్మట తాను కోరినప్పుడు రాజముద్రిక నేడు గడియలు తన కొసంగి తా నారాజముద్రిక వేసిన ప్రతియుత్తర్వున కేయభ్యంతరమును జెప్పక నెఱవేర్చెద నను వర మిమ్మని కోరినటులును రాజు సంకోచించు మండ తనయుద్దేశ్యమును జెప్పి రాజుచే వరమును బొంది గ్రామకరిణీకములనుండి విశ్వబ్రాహ్మణులను తొలగించి బ్రాహ్మణుల నేర్పాటు గావించియుండినటులును జెప్పఁబడియున్నది.

కొండవీటిదండకవిలెయం దీవృత్తాంతము చెప్పఁబడియుండలేదు గాని బ్రాహ్మణులకు కరిణీకముల నిచ్చినటులుమాత్ర మున్నది. రామప్రధాని కరిణీకముల నియోగుల కిచ్చియుండె ననియు వారలే యార్వేలనియోగు లయి రనియు కొందఱు చెప్పెదరు. గాని అయ్యది సరి కాదు. నియోగులకు మట్సహస్రవిశేషణము శంకరశిష్యవ్యాపకమునలనఁ గలిగెను. రామప్రధాని యొసంగిన కరిణీకముల పట్టిక నొకమాఱు చూచిన వైదికి నియోగి భేదములు లేకుండ వివిధశాఖల బ్రాహ్మణులకు కరిణీకముల నిచ్చినటుల స్పష్టముగ గాన్పించును.

గణపతిదేవచక్రవర్తికడ రామప్రధాని మంత్రిగ నుండినటులు ఈమంత్రి పేరు దెలుపు నాధారము లేవియు గాన్పింపమిచే నీరామమంత్రికథ యెంతవఱకు సత్యమో యని కొందఱు చరిత్రకారులు సందియముఁ జెందుచుండిరి. కొందఱు పుక్కిటిపురాణములలో నొకటిగ నెంచుచుండిరి. ఇయ్యది యెంతవఱకు సత్యమో యెఱుంగుట యాంధ్రులకు కర్తవ్యము.

ఆంధ్రదేశమున కాకతీయవంశజుఁ డగు గణపతిదేవచక్రవర్తి నామము ప్రతీతిగ నున్నది. ఆతఁడు క్రీ. శ. 1199 మొదలు క్రీ. శ. 1262 సంవత్సరము వఱకు కాకతీయసామ్రాజ్యమును పరిపాలించినటులు గన్పట్టుచున్నది. ఆకాలమున నీకొండవీడురాజ్యప్రదేశము కాకతీయసామ్రాజ్యములో చేరియుండెను. గోపరాజు రామప్రధాని కరిణీకోద్ధరణమును శా. శ. 1067 (క్రీ. శ. 1145) సంవత్సరమున గావించినటులు చెప్పఁబడియున్నది. రామప్రధాని గజపతివంశీయుఁ డగు గణపతిదేవునిదగ్గఱ మంత్రిగ నుండినటులు చెప్పుకొనియున్నాఁడు. కావున కాకతీయగణపతిదేవుని శాసనములలో నీమంత్రి పే రుదాహరింపబడుట యసంభవము. అటులు పేర్కొనఁబడినంతమాత్రమున నీరామమంత్రి యుండెనా లేదా యను సంశయమున కాస్పదము కానేరదు. మఱియు కొండవీడు రాజ్యప్రదేశమును గజపతివంశీయు లగు విశ్వంభరదేవుఁడును ఆతనియనంతర మాతనికుమారుఁ డగు గణపతిదేవుఁడును పరిపాలించినటులు కొండవీటిదండకవిలె నుడువుచున్నది. ఆ విశ్వంభరదేవునకు గణపతిదేవుఁడు బాలభాస్కరదేవుఁడు నరహరిదేవుఁడు విశ్వంభరదేవుఁ డను కుమారులు నల్వు రుండినటుల దండకవిలె చెప్పుచున్నది. ఆకాలమున కొండవీడుప్రాంతరాజ్యమున గణపతిదేవుఁడు, బాలభాస్కరదేవు లనువా రుండినటులు గన్పట్టిన వారిలో గణపతిదేవుని కడ రామమంత్రి యుండినటులు గ్రహింపవచ్చును. దానినిబట్టి కరిణీకోద్ధరణమును గూర్చి, పైన చెప్పఁబడిన శ్లోకములలోని సంగతుల యాథార్థ్యము నెఱుంగవచ్చును. వీ రొసంగినదానములనుగూర్చి కొండవీటిదండకవలె యీక్రిందివడువున నుడువుచున్నది.

శ్లో. గజపత్యన్వయో భూపో గణపత్య వనీశ్వరః
బ్రాహ్మణేభ్య శ్చతుశ్చత్వారింశ జ్జనపదం దదౌ."

శ్లో. శ్రీమచ్ఛకాబ్దే రసబాణఖేందు (1056)
సంఖ్యాప్రవృత్తే ద్విజపుంగవేభ్యః
దండాత్రిభౌ శ్రీమతు దుగ్గిరేల
పూడిం దదౌ త్యాగపరాగతాభ్యః.

* * *

శ్లో. శేష స్తక్షకపద్మనాభకులికానంతాబ్జకర్కోటకః
వాసుక్యాది మహార్ధనాగవిచదం పండాత్మజానందనం
భీమం పాండవభీమవిక్రమనిభం శ్రీఖండవాటీశ్వరం
క్రూరారాతిమహీధ్రవజ్రతులితం రక్షంతభూపోత్తమమ్.

శ్రీ శ్రీ శ్రీ స్వస్తిశ్రీమత్త్రిభువనచక్రవర్తి శ్రీరుద్రరాజవిజయరాజ్యవత్సరములు శాహి ౧౦౫౬ అగు నేటి ప్రమాదీచ నామ సంవత్సరము నందునను బాలభాస్కరదేవు యీవనిపాలములోను ఖండ్రపాటిదుర్గి రేలపూడి అలాహిదాగాను పొలిమేరహద్దు చేసి బ్రాహ్మణులకు పండ్రెండుగోత్రాలవారికి వృత్తులు యిరువయి ఖండ్రపాటి గ్రామం యిచ్చెను.

"శ్రీమచ్ఛకాబ్దే రసబాణఖేందు(1056)సంఖ్యాప్రవృత్తేద్విజపుంగవేభ్యః
ముప్పాలపూడి మపి పండితేభ్యో దదౌ పంత్యాః పరాగదేభ్యః."

(సూచన:—ఇందు చెప్పఁబడిన ఖండవాటి యనునది కొండవీడునకు పూర్వపు పేరు.)

శ్లో. హ్రస్వశాకపురీ (చినకూరపాడు) ధాత్రి షష్టిత్రిశతిసంఖ్యకే
అంబరం గజకర్ణంచ ఖండలీ గణపతి ర్దదౌ.
శ్లో. అర్కసంఖ్యాకగోత్రాణాం విప్రాణాం చ మహాత్మవాన్
షష్టిత్రిశతిసంఖ్యానా మూర్వీం గణపతి ర్దదౌ.

స్వస్తిశ్రీ త్రిభువనచక్రవర్తి శ్రీరాజరాజ దేవరవిజయరాజ్య సంవత్సరములు శ్రాహి ౧౦౫౬ అగు నేటి ప్రమాదీచనామసంవత్సరము నందునను దుగ్గిరేలపూడి, ముప్పాలపూడి మొదలుగాను గణపతిదేవు గజపతి నలుభయినాలుగు గ్రామాదులు బ్రాహ్మణులకు వృత్తిక్షేత్ర అగ్రహారములు యిచ్చెను."

ఇటులనే గజపతింవంశీయు లగు గణపతిదేవుడును, బాల భాస్కరదేవులును శా. శ 1056 (క్రీ. శ 1134) సంవత్సరమున నలువది నాలుగు అగ్రహారము లిచ్చినటుల గ్రామనామములను జేర్కొనుచు దండకవిలె వాకొనుచున్నవి. శా. శ. 1056 సంవత్సరమున గోరంట్ల మొదలగు గ్రామముల నగ్రహారముగ నీగణపతిదేవుడిచ్చినటుల బ్రిటిషు దొరతనమువారిచే తయారుచేయింపబడిన యీనాముల ఫెయిరు రిజస్టరు(Inams fair Register)ల యందును వ్రాయబడియున్నది. గోపరాజు రామమంత్రి కరిణీకము లిచ్చినటులు చెప్పబడిన సంవత్సరము శా. శ. 1067 (క్రీ. శ. 1145). ఇంక నాప్రాంతకాలమున గణపతిదేవుడు బాలభాస్కరదేవు లనువా రుండినటులు శాసనదృష్టాంతము లెవ్వియైన గన్పట్టునేమో కొంచె మాలోచింతము.

శా. శ. 1056 (క్రీ. శ 1134) సంవత్సరమున గణపతిదేవుని సోదరుడగు బాలభాస్కరదేవుడు ఖండవాటిలోని దుగ్గిరేలగ్రామమును 22 భాగములు చేసి 12 గోత్రముల బ్రాహ్మణుల కిచ్చినటులును ఇటులే యింకను 43 గ్రామములను బ్రాహ్మణుల కిచ్చినటులను దుగ్గిరాలయందలి శాసన మొక్కటి చెప్పుచున్నది. (See Mack. M. S. S. B. xx pp. 67-70).

కంచెఱలకోటదగ్గఱ వెలనాటి గొంకనరేంద్రుని బావమఱదియు, సేనానియు నగు శాముడను వాడు గణపతిసైన్యముల నెదుర్కొని ఆయుద్ధములో జనిపోయినటులును ఆతనిసోదరుడగు సరణుడు గణపతి సైన్యముల నోడించి జయమును చేకూర్చినటులును, వెలనాటి గొంక రాజు మెచ్చుకొని కొండపడమటిదేశమున జేవరము నిచ్చినటులును నర్సారావుపేట తాలూకాలోని తిమ్మాపురమునం దున్న శిలాశాసన మొక్కటి చెప్పుచున్నది. ఆశాసనము శా. శ. 1081 (క్రీ. శ 1159) సంవత్సరమునాటిది. దాని నీవ్యాసముచివర గనబరచితిని.

ఈ శాసనమునుబట్టి చూచిన శా. శ 1158) సంవత్సర ప్రాంతమున గణపతి యనురాజొక డుండినటులును, ఆగణపతికిని వెలనాటి చోడగొంకరాజునకును యుద్ధములు జరుగుచుండినటులును బోధపడ గలదు. ఆకాలమున నీకొండవీటి ప్రాంతరాజ్యములోని పరిపాలనాది విషయములు లోకించుక యోచించిచూచిన నీదేశము రాజవిప్లవదశ ననుభవించుచుండినటులు గన్పడుచున్నది. సామంతాధిపులు సామ్రాట్టగు చోళరాజుయొక్కయు చోళరాజుప్రతినిధు లగు వెలనాటిచోడుల యొక్కయు అధికారమును నిరసించి తమకు తామే స్వతంత్రరాజ్య స్థాపనము గావించుకొను ప్రయత్నములు సల్పుచుండినటులును, అట్టియెడ వెలనాటిచోడులు తమ యధికారమును నిర్వహించుకొన విశ్వప్రయత్నములు గావించినటులును గాన్పించుచున్నది. అట్టి ప్రయత్నములలో వెలనాటిచోడులకు బంధువులగు కొండపడమటిరాజులును ధరణికోటయధిపతియును వారికి దోడ్పడియుండిరి. కొండవీటిదండకవిలె ననుసరించి యీప్రాకార మాకాలమున గజపతివంశీయులు కొండవీడును రాజధానిగ జేసికొని కొండపైన నొక పెద్దకోటను గట్టుకొని పరిపాలించుచుండిరి. వెలనాటిచోడుల యధికారమును ధిక్కరించి వారలు స్వతంత్రరాజ్యస్థాపన మొనర్చుకొని కృష్ణానదికి దక్షిణమునను పశ్చిమమునను నుండు దేశము నెల్లను పరిపాలించుచుండినటులు గన్పట్టెడి. ఆ కారణమున వెలనాటిచోడులకును వారికిని యుద్ధములు జరుగుచు వచ్చెను. అట్టియుద్ధములలో తిమ్మాపురము శాసనమున జెప్పబడిన కంచెఱల కోటదగ్గఱి యుద్ధ మొక్కటి యై యుండును. తిమ్మాపురము శాసనములో చెప్పబడిన గణపతి యీ గజపతివంశీయుడగు గణపతిదేవుడనియే చెప్ప నొప్పుచున్నది. లేక కాకతీయగణపతిదేవుడనినచో నాతడు 150 సంవత్సరములపైకాలము జీవించియుండినటులును 125 సంవత్సరములపైకాలము రాజ్యపాలన మొనరించినటులును చెప్పవలసి వచ్చును. అయ్యది అసంభవమును చరిత్రాంశములకు విరుద్ధమునై యుండును

కావున కాకతీయగణపతిదేవుడు గాక యాతనికి పూర్వము కొండవీడుప్రాంతదేశమున గణపతి యనురాజొకడు శా. శ. 1080 సంవత్సరప్రాంతమున నుండినటులు శాసనదృష్టాంత మగపడుచుండుటచే కొండవీటిదండకవిలెలో చెప్పబడిన గజపతివంశీయుడగు గణపతిదేవుడాతడే అయ్యుండు ననియు నాతనికడనే గోపరాజు రామమంత్రి ప్రధానమంత్రిగ నుండి శా. శ 1067 సంవత్సరమున కరిణీకోద్ధరణము గావించియుండుననియు చెప్పదగియున్నది. ఈ గణపతిదేవుడు 38 సంవత్సరములు పాలనము చేసినటులు స్థానికచరిత్రలు కొన్ని చెప్పుచున్నవి. తిమ్మాపురము శాసనము తేది యగు శా. శ. 1081 సంవత్సర మాతనిపరిపాలనాంతిమకాల మని యెంచినను, దుగ్గిరాలశాసనము తేదియగు శా. శ. 1056 సంవత్సర మాతనిపరిపాలన మారంభమయిన తేది యని యెంచి శా. శ. 1067 సంవత్సర మాతని పరిపాలనాకాలమునం దుండె ననుట నిర్వివాదాంశ మనియే చెప్పదగియున్నది.

## శాసనపు ప్రతిలిపి

శ్రీజయలక్ష్మీర్ధామః పరమండలీకాన్వయాబ్జదే (*) నహి మధామః
వైభవజితమహేంద్రో జయతి కులోత్తుంగచోడ గొంకనరేంద్రః.

ఇట్టి శ్రీగొంకరాజుల కిష్టభృత్యులైన సరణయసామావళి రయిట్టిదె,

శ్రీవిలను ద్విలాసజిత జిష్ణునిచే నహిసీమ క్రిష్ణచే
దేవసమాను శేత సగదేవశిఖామణిశేత శాన్యశా

టీవర వ్రిత్తి శాసనపటీయశిలాంటగి మేలునాయక
శ్రీవిభు డొప్పె బోతయపశీక్రిత సజ్జనలోకుడై భువిన్.
జితకాశిదూబవాడకు బలివోతయనాయకునకు భావజరాజ్యా
న్వితలక్ష్మియుదయమయ్యెను సుతను శ్రీవిజితరంభసౌక్కమధరణిన్.
మితగుణరూపశీలములె మేనక నూర్వశి రంభ బోలి సం
స్తుతి కెక్కినట్టిమై వెలయు సౌక్కమశీలమునందు మానవీ
వితతి నధఃకరించి సుకవిద్విజబాంధవ * * బృందస
మ్మతవిప్రలార్తశాన మహిమం బ్రభదాలిన ధన్య పెంపునన్.
ధర సనదప్రోలి పణ్డీశ్వరదేవరన ర్తకియం త్రివర్గఫలశ్రీ
కరసౌక్కమమాహేశ్వర శ్రీ పరివారస్త్రీలలోన బ్రస్తుతిఁదనరెన్.
సుకవనితావిలాస యగు సౌక్కమ కుద్భవ మైరి దేవతా
నగమున వైరివీరభటవంశవిరాముణ్డు గాముణ్డును మహీ
నరనుత శౌర్యమూర్తి సరసణ్డును కొంనుమాళు దేవియై
పరగిన లక్ష్మిగేవియునం బ్రస్తుతి కెక్కిన కామదేవియున్.
నరనుత రాజకలామ గుణ్డు గులోత్తుంగ చోడగొంకధరిత్రీ
శ్వరుం డీశ్వరాంశ మగుటం బరగిన శ్రీకామిదేమి పార్వతింబోలును
కామాంబిక నిజాగ్రజుంగ గామని పరభటువారని * మన * బుధ చిం.
తామణి నవ్వయవనజ నభోమణి * * * ందగు నభోమణి తేజును.
అనింగం (చె) ఊలకోటను గణపతి సైన్యంబు నోడిచి ఘనుగొంకమహీమ
వంశజు మెచ్చించి సురాంగనలకుం గాముణ్డొసరియె గాముణుమహీమను.
వీరుణ్డు సగనయచోడును మహారాజేంద్రుణ్డుమెచ్చ * * రియనిని
శూరారిం జెండగాయని వారిధి సౌరనగిచి వైరివర్గము జంపను.
సరణియశౌరియమగ్రిపనయు గురుణ్డు గులోత్తుంగ గొంకధరిత్రీ
శ్వరుణ్డు నిలమెచ్చి యిచ్చెం బాగిన జేవరము గొణ్డ పడమటిలోనను.
పరగు శకాబ్దములు జగ త్కరివియ దిందుమితి నొనరంగ నిమ్మహివి
స్ఫుర దుత్తరాయనంబు గిరి పశ్చిమ జేవరమునం గీర్తనం దనరెన్.
వర గోకీశ్వరనామధేయమున సర్వజ్ఞుం బ్రతిష్ఠించి సు
స్థిరత న్నిత్యనివేద్య భూసురభుజద్దీపార్థమై యొప్పం గా
శరణ్డిటుందటాకమును ధరయు శశ్వత్తైలయయెంత్రంబునా
స్ఫురదిందుమ్యదీశాంబరాంబర కుచ్ఛి ద్భూతారకం బై చనన్.
శ్రీరామరామంద్రిప శేఖరవిష్ణుమూర్తి
వీరాగ్రగస్య భుజవిక్రమపార్థివేంద్ర

మారారియంఘ్రియుగ మానసరాజహంస
కారుణ్య దానసహకార మహీజరాజా.

అద్రిపశ్చిమభూమియందు ప్రసిద్ధమై జీవపోషణ సేయు జేవరంబు భండనభీమండిబడిగోలార్జునమ్రోలం బెక్కగయ్యములందు నేసుకొనినం బలిమెచ్చి శాసనబద్ధంబు సేయుడు నందు గోకీశ్వరదేవర నిలిపి వరకామని లక్ష్మివల్లభు వల్లభిగామిదేవుల పేర గట్టి చెఱువు రుద్రునకు నిచ్చి ధర్మభివృద్ధి గాంగదీపవర్తికి గాను పద్రిడము సేసి భూసురోత్తము వరులకు భూమిదాన మిచ్చినవిండ్లునిలిపి తాని న్నీవట్టి సోదరీపతుల దానంబు శాశ్వతముగ * మము గానువార్తియై ధర్మము.

(తర్వాత కొంత కనుపించుట లేదు.)

స్వస్తిశకాబ్దము ౧౦౮౩ గు నేంటి ఉత్తరాయణసంక్రాంతి నిమిత్తమున జేవరమున సరణము శ్రీ గొంకరాజునకుం గామిదేవికం ధర్మార్థముగం బెట్టిన ధర్మములు గోకీశ్వరదేవరకు * * నీరినేల మత్తులు ౨౦ వెలిపొలమునని పెట్టము ఖ౧గడ్యవమడి ఖ౧మల్లికార్జునదేవర గడ్యవము ఖ౧ యీదేవర్లకు పూజారి మేమతప్పటి మూలస్థానదేవరకు గడ్యవమహిం ఖ౧ దీని పూజారిచుపన నారాయణదేవరకు నివేద్యముఖ౧ గడ్యవమడి ఖ౧ దీని పూజారిపోతే దేవరశంకవాని ఖ౧ చిట్టకుండురు కేశవభట్లు ఖ౩ దేవప్రతిష్టలకు లగ్నము సెప్పిన రిమభట్లు ఖ౩ వీరికి బ్రహ్మసముద్రము వెనుక నీరిదరి పొలము మత్తులు అప్పన ఖ౨ పోలె భట్లు ఖ౧ విద్దరజు యామునభట్లు ఖ౨ మాధవబట్లు ఖ౧ జాల్లెభట్లు ఖ౧ కేశవభట్లున ౧౦ అల్లెభట్లు ౧౦ వామనభట్లు ఖ౨ విద్యభట్లు ఖ౧ స్వదత్తం పరదత్తం * * * * * యీధర్మము చెరిచినవారు వారణాసి వ్రచ్చినవారు పెద్దకొడుకు వధించినవారు.

(సూచన :—

ఈశాసనములో అరసున్న లుండవలసినచోట నిండుసున్న లున్నవి. కొన్నిచోట్ల "న్" కారమునకు బదులు "ను" వ్రాయబడినది.

శాసనములోని యక్షరములు కొన్నిచోట్ల బాగున్నను గన్పించుటలేదు. ఎటుల పోల్చుటకు వీలయ్యెనో అటుల పోల్చివ్రాయుటచే కొన్నిచోట్ల తప్పులు గన్పట్టుచున్నవి. శాసనమును సవరించక నేటిధి వ్రాయబడియెనో అవిధిని గనంబఱచడమైనది.

# త్రిదోషములు

ముదిగొండ బుచ్చయ్య లింగము శాస్త్రి గారు

ఈకాలమునందు వాతపిత్తశ్లేష్మములను పదార్థము లనియు గుణములనియు శక్తులనియు అనేకు లనేకవిధముల విచారించుచున్నారు. వాతపిత్తశ్లేష్మములను శాస్త్రానుభవముల నెఱసి నిశ్చయించుకొనుట మన కర్తవ్యము. ఆయుర్వేదమునందు త్రిదోషములకు పదార్థగుణ శక్తులలోనొక నామంబైనను బేర్కొనియుండ లేదు. శాస్త్రకారుల అభిప్రాయములు అగమ్యములు. త్రిదోషములు వాయ్వాది పదార్థజన్యము లని స్పష్టముగా జెప్పునపుడు పదార్థము లెటుల గానేరవు. పదార్థము లగునపుడు గుణశక్తు లుండకమానవు. ఈ త్రిదోషములకు వారు ప్రత్యేకనామంబుల నిడుట యనవసరమని విరమించియున్నారు. పదార్థగుణములకు ఆకాశాదిపంచభూతములే ఆధారములు. అయినను శాస్త్రానుభవముల నాలోచింపుము.

ఈశ్వరసృష్టియందలి వ్యక్తులయొక్క త్రిదోషతత్త్వములనరయుటకై ప్రథమమునందు సృష్టిక్రమమును కనుగొనుట యత్యావశ్యకము.

మొదట ఆత్మవలన నాకాశము నాకాశమువలన వాయువు, వాయువువలన నగ్ని, అగ్నివలన జలము, జలమువలన పృథ్వి, పృథ్వివలన ఓషధులు, ఓషధులవలన అన్నము, అన్నమువలన పురుషుడు, పురుషునివలన నీసమస్తమని సూక్తవచనము.

ఈ పురుషుని గుఱించి నిసుశ్రుతము (పంచభూతశరీరిసమవాయః పురుష ఇత్యుచ్యతే) పంచమభూతసంబంధము పురుషుడనియు ఈపురుషుని శరీరి యనియు ఈశరీరికి శరీర మాధారమనియు శరీరమునకు (దోషధాతుమలమూలంహి శరీరం) త్రిదోషములు సప్తధాతువులు త్రిమలములు మూలకారణము లందురు. ఈ త్రిదోషములు కాలచక్రమునకు సరిపోవుచున్నవి.

శ్లో. శీతాంశుః క్లేదయేత్సర్వం వివస్వాన్ శోషయత్యపి,
తావుభావపి సంశ్రిత్య వాయుః పాలయతి ప్రజాః.

చంద్రుడు అమృతకిరణములచే దడుపుచుండును. సూర్యు డుష్ణకిరణములచే నెండిరపజేయుచుండును. ఈ రెంటి నాశ్రయించి వాయువు ప్రజలను పాలించుచుండును. సూర్యచంద్రుల ననుసరించి కాలచక్రము నడుపుటకు జగదాయువగు వాయువే ప్రాణాధారమై యుండుట లోకప్రసిద్ధము. శీతోష్ణస్వభావముగల చంద్రసూర్యుల నడుపునట్టివాయువు పంచభూతములలో రెండవ భూతము.

రూపరహితస్పర్శవా న్వాయుః

రూపము లేక స్పర్శగలదై (సర్వశరీరవృత్తిః) సర్వశరీరములకు నాధారమగుచు (శరీరాంతస్సంచారీవాయుః ప్రాణశ్చ) శరీరాంతర్గతసంచారము గలది వాయువు. అదియ ప్రాణము. వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి యను వచనముచే వాయువునకు బ్రహ్మత్వ మేర్పడుచున్నది. ఇట్టి బ్రహ్మపదార్థము కాలచక్రమును నడుపునదియె గాక శరీరచక్రమును నడుపుటకు సర్వసమర్థ మని నిస్సంశయము. వైద్యశాస్త్రసంబంధమును గమనింపుము. వాయు రాత్మా వాత్మా పిత్త మాగ్నేయం శ్లేష్మా సౌమ్యా ఇతి.

వాయువు స్వతంత్ర మగు ఆత్మ యనియు పిత్త మాగ్నేయ మనియు శ్లేష్మము సౌమ్య మనియు జెప్పబడియున్నది. కాలచక్రమునందు శీతోష్ణము గల చంద్రసూర్యుల నడుపునట్టి వాతము శీతోష్ణములు గల శ్లేష్మపిత్తములను శరీరచక్రమునందు నడుపుచున్నది. సాదృశ్యమును గమనింపుము.

విసర్గా దానవిక్షేపైః చంద్రసూర్యానిలా యథా
ధారయంతి జగద్దేహం శ్లేష్మపిత్తానిలా స్తథా

చంద్రుం డమృతము నిచ్చుట సూర్యు డాకర్షించుట వాయువు రెంటిని వ్యాపింపజేయుట ఈ మొదలగు కర్మలచే ప్రపంచ మేవిధముగా ధరింపబడుచున్నదో నదే విధముగ పిత్తశ్లేష్మవాతములు శరీరమునుధరించుచున్నవి. ఇందుకు ప్రమాణము. దోషధాతు మలమూలంహి శరీరం అని గలదు. కాబట్టి శరీరధారణమునకు దోషధాతుమలములు కారణములు. అందు త్రిదోషములు ముఖ్యకారణములు.

వాతపిత్తశ్లేష్మాణ ఏవ దేహసంభవహేతవః-

వాతపిత్తములే శరీరమునకు ప్రధానకారణము లని యున్నది. కాలచక్రమున కెటుల సోమసూర్యానిలములు ప్రధానకారణములో అటులే శరీరచక్రమునకు వాతపిత్తకఫాదులు పరమకారణములు. ఇట్టి శీతోష్ణముల ననుసరించి వాతము శరీరమందంతటను సంచరించును. వాతమునకుగల సంచారము పిత్తశ్లేష్మములకు లేదు. ఏలయన పిత్తశ్లేష్మములు వక్రములు.

పిత్తం పంగు కఫః పంగుః పంగవో మలధాతవః
వాయునా యత్ర గచ్ఛంతి తత్ర గచ్ఛంతి మేఘవత్-

కఫపిత్తములు పంగువు లనియు వీటిసంచారమునకు వాయువే ఆధార మనియు మేఘములను నడుపు వాయువువలె శరీరమునందలి కఫపిత్తములను నడుపు వాయువును వాతమనియునందురు. ఈవాతసహాయము వినాకఫపిత్తములకు చలన ముండనేరదు. కాబట్టి కాలచక్రమునకు శరీరచక్రమునకు ఈషద్భేదమైన నుండనేరదు.

షడృతువుల ననుసరించి కాలచక్రము మాఱినట్లు శరీరచక్రము మాఱుచుండును. మధురామ్లలవణకటుతిక్తకషాయములు ఋతువుల ననుసరించి మాఱునట్లు శరీరప్రకృతులు మాఱుచుండును. త్రిదోషప్రకోపోపశమనంబులు చంద్రసూర్యులవాయువులవలె అయనములయందును ఋతువులయందును మాసములయందును పక్షములయందును అహోరాత్రములందును శరీరమునకు మార్పులను గలిగించుచుండును. కాలచక్రశరీరచక్రంబులు సమానంబులు.

సృష్ట్యాదియందు (వాయోరగ్నిః రగ్నేరాపః) శబ్దస్పర్శలు గల వాయువువలన శబ్దస్పర్శరూపములు గల అగ్నిజననము. అగ్నివలన శబ్దస్పర్శరూపగ్రహణధారణయోగ్య మయిన యుదక మావిర్భవించిన దనియు కలదు. అటులే వ్యాపకశక్తిగల వాతముచే పిత్తమగు. పాచకరంజకాదిస్వభావము గల పిత్తముచే కఫము శరీరమునందు గలుగుచున్నది. అవకాశముగల యాకాశమునందు సంచరించు వాయువువలె శరీరాకాశమునందు సంచారముగల వాతము భక్షించినయాహారపదార్థములను పిత్తముచే పాకావస్థను జెందించుచు బలస్థైర్యాదుల నిచ్చు శ్లేష్మమును జనింపఁజేయుచు శరీరమును వృద్ధి పొందించును. పంచభూతములగుణములను తెలియఁబఱచు శరీరమునందలి త్రిదోషములేవైషమ్యమువలన వృద్ధిక్షయకారకము లగుచున్నవి.

సూ. వాతపిత్తకఫాదీనాం వైషమ్యా ద్వ్యాధి రుచ్యతే.

ఈవాతపిత్తకఫాదులు ఋతుచర్యలవలన షడ్రసోపయోగములవలన వృద్ధిక్షయకారణము లగుచున్నవి. కాబట్టి చంద్రసూర్యానిలములతత్త్వములను దెలిసికొను మేధావంతులు శరీరమునందలి వాతపిత్తశ్లేష్మముల తత్త్వములను దెలిసికొను నవసరము లేదు. శరీరమునందలి యుష్ణశీతములు పిత్తశ్లేష్మము లనియు వీటిని నడుపునట్టిది వాతమనియు శాస్త్రాభిప్రాయము. పంచభూతములు పదార్థములు. అట్టి పంచభూతజన్యము లగు త్రిదోషములను పదార్థములే యగును. త్రిదోషములు శరీరికి ప్రధానములవంటివి యగుటచే గుణములు త్రిదోషములే. శరీరమును నడుపునవి గావున శక్తు లనియు ఈత్రిదోషములకు మూఁడునామములు గాక నిజము దెలిసికొని నూఱునామంబుల నిడవచ్చును. ధీమంతులు త్రిదోషములను విచారింప సమర్థులు. ఈ తత్త్వమును సక్రమముగా నాలోచించుటకు వైద్యనామకులు ప్రార్థితులు.

# కలికాలవాహినీతరంగపరంపర

## కొణిదెన బాలకృష్ణయ్య గారు

జాతిన్ వెల్వెలయించు వేద♦విహితాచారంబుఁ గోల్పోవ, వి
ఖ్యాతి న్గూర్చు నుదారసాహస కళా ♦ కౌశల్యము ల్మాయ, దు
ర్నీతి న్బ్రోకడఁబెట్టు శాస్త్రత♦తియున్-నిర్జీవమై సెల్ల, నౌ
రా! తా భారతధాత్రి యుండెఁ గలికా♦లప్రాప్త యోగంబునన్.

చ. కులమరియాదఁ గట్టువడఁ ♦ గూడును గుడ్డయు దూర మౌను, లో
కుల నడుగంగఁబోక నోడఁ ♦ గూడినదాన సుఖింతమన్నఁ గ
న్నులఁ గని యోర్వలేరు, సుగు♦ణుండగు వాఁ డెటులైన యున్న బా
ధల నలయింత్రు నీచులు వృథాఁ ♦ గలికాలవిచిత్ర మయ్యరే!

చ. కలుషయుతు ల్మహాకఠిన♦కర్ములు సత్య-దయావిహీను ల
ల్పులు నిజధర్మమారగులు ♦ లుబ్ధులునై నరు లిద్ధరిత్రి మూ
కలుగొని యున్నవారు కుల♦గౌరవము ల్సెడె ధర్మవర్తనల్
మలినము లయ్యె నేఁడు కలి ♦ మాయ యవారణలీలఁ బైకొనన్.

ఉ. పాపము పుణ్యమం చనకఁ ♦ బాఱులె బారులు గట్టి వృత్తుల
న్మాపఁగ దారసిల్లుట స♦మంచిత ధర్మమడంగ నందుచేఁ
జేపడె వర్ణసంకర మి♦సీ యది గాదె యరిష్టకోటికిన్
దాపురమై వసుంధరకుఁ ♦ దప్పని ముప్పును దెచ్చిపెట్టుటల్.

ఉ. జాతియు నీతియు న్జపము ♦ సంధ్యలు నింద్య మటంచుఁ బుచ్చి దు
ర్జాతులఁ గొల్చు టొక్కటె శ♦రణ్యముగాఁ దలపోసి యాత్మవి
ద్యాతతివైదుషీభవ స♦మంచితకీర్తిని వీటిఁబుచ్చి మో
హాతురులై ధరామరు ల♦హారె తొలంగిరి ధర్మపద్ధతిన్.

ఉ. యాగము లుజ్జగించి యడి♦యాసల మున్గుచు రేఁబవల్లు ను
ద్యోగము లాత్మభోగము ల♦థోగతిమార్గము లంచు గొంచకన్
జోగులఁ జేయు కామముఖ ♦ ఘోరసమర్పితచిత్తవృత్తులై
వ్రేగగుచున్నవారు పృథి♦వీసురు లిక్కలి భూపురంధ్రికిన్.

సీ. అరరె! దోసముగూర్చు ♦ నడ్డబొట్టిడుచుందు, వాయని అంకెలు ♦ వేయువారు
బాగాయె! నిట్టులు ♦ పంగనామము దిద్దఁ, బాడియే యనివాదు ♦ లాడువారు
అద్దిరా! సమసె నీ? ♦ అంగార మక్షత, లంచుఁ దీండ్రించి గ♦ర్జించువారు.
మాయురే! తిలకంబు ♦ మలినంబు గదియించు, నలికంబు లగునని♦పలుకువారు
గలిగి బొట్లకు జుట్లకుఁ ♦ గట్టులకును, బోరుచున్నారు మాత్సర్య♦పూర్ణు లగుచు
దయయు సత్యంబు శౌచంబు♦దలఁపఁబోరు, అఘనిధానంబు కలిప్రవా♦హంబు ముంప

మ. కలునంగళ్లను గుత్తకు న్గొనుట శుం♦పక్కా-న్యాజ్యము ల్వేటి మూ
ఢులఁ బోరించి ధనంబుఁ గైకొనుట యో♦గ్యున్ లగ్గఁ జింతింపకే
వెలుచ న్పల్లెలఁ బట్టణంబులను గా ♦ శీటీదుకాణంబులన్
నిలుపన్ నాటక మాడుచున్ బ్రదుక ని♦ర్ణీతంపు వృత్తు ల్గలిన్.

సీ. శాంతంబు శమియింప ♦ శమము స్తమింపఁగా, బ్రాహ్మ్యంబు దాస్యంపు ♦ బ్రదుకుఁగనియె
విక్రమక్రమ మెల్ల ♦ వక్రతఁ బొల్పడ, క్షాత్రంబు దాఁబోయి ♦ క్షమనుగొనియె
గోరక్షణము కృషి ♦ గూడఁ దార్మాలుగాఁ, వైశ్యత్వ మడుగంటి ♦ వలనుదప్పె
దాస్యంపు నడవళ్లు ♦ తప్పుదారులఁ బట్టి, శూద్రతాగరిమంబు ♦ చూరఁబోయె.
నేవి వర్ణంబు లెచ్చటి ♦ కేగె వృత్తు లెవ్వ రధికులు నిశ్చయ ♦ మెవఁడు జెప్పఁ?
సృష్టి యంతయుఁ బాపభూ ♦ యిష్ఠముగను గానవచ్చెడి కలికాల ♦ కైతవమున.

చ. తరుణులు భర్త లన్నలును ♦ దమ్ములు నొండొరుఁ బోరి యాత్మ నె
బ్బెరికము మాని వ్యాజ్యము ల ♦ పీల్లను జేయుచు కోర్టుకెక్కుటల్
బిరుదుల నాడిగంబులను పెంపువహింపఁ దలంచి స్వీయసో
దరుల నడంగఁ ద్రొక్కుటలుఁ ♦ దార్కొనె భారతభూమి నిక్కలిన్.

చ. ఉడుగవు మారిసంకటము ♦ లోషధు లీయవు సత్ఫలంబు లె
ప్పుడు గఱువుల్ గలంచెడిని ♦ పోయెను చక్కని సంప్రదాయముల్
వెడగులు మందులై ప్రబలి ♦ వీఁగుచు నుండిరి నైకమత్యము
న్నడిచె ధరిత్రి నెట్టికసు ♦ మాలపుఁ గాలమొ శ్రీహరీ హరీ!

మ. తమవస్తు ల్దమవేషభాషలను స♦ద్ధర్మంబు దేశంబులన్
దమభావంబుల జాతినీతులను మం♦దప్రజ్ఞులై త్రోసి, య
న్యమతాదర్శము నూతఁగాఁ గొని యస♦హ్యంబైన కర్మంబులన్
దవులన్ సాగెను గా జనంబు విపరీ♦తంబౌ కలివ్యాప్తిచేన్.

మ. తమ విజ్ఞానధనంబు పాడటిన వ్య♦ర్థంబౌచు జాతీయచి
హ్నము లస్తంగతమైన మేల్కొలుపు వి♦ద్యల్గూలినన్ సుంత స్వాం
తములన్ జింత వహించి సిగ్గుపడ రి ♦ ద్ధాత్రీజను ల్జాతి మ
ర్మము ధర్మంబును దీఱఁ దీఱుటయె కా ♦ మానంబు ప్రాణంబునున్.

మ. అవనిన్, "మాలలు వీరు, మాదిగలు మీ ♦ రౌ నే సమీపింపఁ 'బొం
డసలన్ దూరముగా" నటందు రొగి వా ♦ రాంగ్లేయము న్నేర్చి, క్రై
స్తవులై రాఁగ సలాముల న్సలిపి హ♦ స్తస్పర్శనం బిచ్చి వా
చవులన్ గొల్పెడి విందుబెట్టెదరు వా♦త్సల్యం బి దెట్లబ్బెనో!

చ. అరయ ధనంబు నౌకరియు ♦ నాఁగిలము న్గలవారె పెద్దలున్
సరసు లుదారు లత్యధిక ♦ శాంతులు సత్కులజాతు లం చొగిన్
బరఁగుచు నున్నవారు ఋజు♦పద్ధతి వైదికధర్మనిష్ఠ బం
ధురకులగోత్ర గౌరవయు♦తు ల్మతిమాలినవార లిక్కలిన్.

ఉ. ఆయువు లల్పముల్ చెడుగు ♦ నబ్బెసము ల్కొఱలేవు, ఎంచ దు
ర్జ్ఞేయపువర్తనంబు, విప♦రీతపు జేష్టలు, రిత్తతర్కముల్
చేయు గుణంబు, న్యాయము ని ♦ సీయని నిందయొనర్చు బుద్ధియున్
బాయనివై జనంబులకుఁ ♦ బట్టువడెన్ గలిప్రేరణంబునన్.

మ. దివికిన్ బ్రాఁక, వసుంధరన్ దిరుగ, నెం♦తే ద్రవ్యమున్ దోయఁ గై
తవపున్ బుట్టువు నొంది మానవులకున్ ♦ దర్శింప నాసన్నమృ
త్యువులో నాఁగఁ దనర్చి గర్జిలుచున్ ♦ ధూమధ్వజాటోపముల్
రవళిన్ గొల్పఁగ మాయయంత్రములు నా♦రా దాపురించె న్గలిన్.

మ. కరుణాసాంద్రుఁడు గాంధినాముఁడు జగ♦త్కల్యాణసంపాదనో
ద్ధురభావాన్వితుఁ డాతఁ డెట్లనియె సం♦తోషంబుతో నట్ల యి
ద్ధరణిన్ భారతు లాచరించెదరు గా♦తన్ వేదమార్గంబు సం
కరము న్గాంచక యుండుగాత ప్రజ వి♦జ్ఞానంబుమై ప్రాలుతన్.

Spinning Class at the Sabarmati Ashram



సబర్మతీ ఆశ్రమములో నూలు వడకుటను నేర్పుట

Spinning Class at the Sabarmati Ashram



సబర్మతీ ఆశ్రమములో నూలు వడకుటను నేర్పుట

G

# ధర్మమే జయము - అహింసయే పరమసిద్ధాంతము

మల్లెల లక్ష్మీ నరసింహరాయ శర్మ గారు.

శ్లో. యదాయదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత । అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్ । ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

ప్రతియుగంబందుఁ బరమేశ్వరుం డుద్భవించును. ఆమహానుభావుం డుద్భవించుకాలంబు సమీపింపలేదు. సమీపింపఁ బోవుచున్నది. మహాత్ములే పరమేశ్వరస్వరూప మని విశ్వసింపనగును. కొన్నికొన్ని సమయములలో వృక్షములందును పర్వతశిఖరాగ్రములందును స్వభావజముగా అగ్ని జనించి తన్నాశంబుగల్గించునట్లు ఘోరపాపకర్మంబులే వృద్ధియై ప్రజాక్షయంబులకు కారణంబు లగుచున్నవి. కొన్నికొన్ని దేశములయందు పానీయంబులకు నీరంబులు లేక ప్రజ లపరిమితమగు కష్టములపా లగుచున్నారు. దయామయుడగు భగవానుఁడు మన కెన్నిసౌకర్యముల దయచేసినను వానింగానక దుర్గమమార్గంబులంబడి అనేకములైన విపత్తులపా లగుచున్నాము. నిఖిలచరాచరభూతనిర్మాణుండైన భగవానుఁడు ప్రప్రథమున సూర్యుని సృష్టించెను. ప్రపంచములో మిక్కిలి ప్రకాశమానమైన పదార్థము సూర్యుడు గొప్ప అగ్నిగోళమువలె ప్రాతఃకాలమున నతడుదయించి తనధర్మముపూర్తిచేసి దివసావసానకాలమున నస్తమించును. నిశానాథుండైన చంద్రుడును నక్షత్రములును రాత్రియంతయు వెన్నెల నిచ్చి అదృశ్యము లగుచున్నవి. అనంతకోటిసంవత్సరంబులనుండి ఇట్లు జరుగుచున్నది. ప్రత్యక్షదైవంబులగు సూర్యచంద్రాదులు బోధించు నుపదేశవాక్యంబులు మన చెవి నాటవు. సర్వాంతర్యామి యగు పరమేశ్వరుని జ్ఞానవాక్యంబులు అసహ్యకరంబు లగుచున్నవి. తొల్లి శిబిహరిశ్చంద్ర బలి ప్రముఖులు తమ సత్యవాక్యపారీణత చేతనె గదా కష్టములకోర్చి జయంబుంది తమఖ్యాతినలుదిశల ప్రవర్తింపఁజేసిరి?

పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాపించియున్న చిత్కళయే పరబ్రహ్మ మనఁబడును. అట్టిపరబ్రహ్మమును అట్టి నిరామయస్వరూపమును అట్టి నిష్కళంకాత్మను మాయామూర్ఖగ్రహణముచే దెలిసికొనజాలక మూఢులమై మూర్ఖచిత్తులమై ప్రవర్తిల్లుచున్నారము. నిఖిలజగత్సృష్టికర్త యగు పరమేశ్వరునిచే సృష్టింపబడిన జీవజంతుసముదాయంబులయందును మానవుడు శ్రేష్ఠుడు. అట్టి మహోత్కృష్టమైన పదవి ఆదయామయునిచే మానవజాతికి ప్రసాదింపబడినది. ఆ దయామయునకు భేదభావంబులు లేవు. ఆజగద్రక్షకునకు జరామరణంబులు లేవు. ఆ స్వయంభువునకు రూపాది దుర్వికారంబులు లేవు. నిరాకారుడై నిరంజనుడై నిశ్చలచిత్తుడై నిర్వికల్పుడై సదా ప్రాణుల యోగక్షేమంబు లారయుచుండును. ఆమహామహుడు ప్రతి జీవునకు బుద్ధిబలమును ప్రసాదించియున్నాడు. ఆబుద్ధిబలంబుచే తిరిగి సాన్నిధ్యంబును జేరగల మహాశక్తియు దయచేసియున్నాడు. అయినను దురేచ్ఛాసక్తులై పాపకర్మంబుల నొనర్చుచున్నారు. అయ్యో! ఎన్ని జీవులు హింసింపబడుచున్నవి. సృష్టిలోగలఎన్ని పరమాణువులు నశింపజేయబడుచున్నవి. ఇట్లొనర్చుట మహాదోషము. ఇట్టి మహాదోషమునకు ప్రాయశ్చిత్తము లేదు. ఎంత దుష్కృతము ఆచరింపబడునో అంతయు అనుభవించియే తీరవలయును.

విద్య యనఁగా పుస్తకజ్ఞానము కాదు. బహువిషయగ్రహణమును కాదు. తనలోనుండు అంతరాత్మప్రసాదమును వెలిపుచ్చి అర్థానికి తగినశిక్ష యొనర్చుటయే. అట్టి విద్యయే ప్రపంచమునకు అత్యంతోపకారకము. ఏవిద్యచే మన అంతరాత్మ లింతవఱకు నుభయకారాగారవిముక్తములు గాకపోయెనో, ఏవిద్యచే మన సంఘదోషంబులు దినదినాభివృద్ధి గాంచుచుండెనో, ఏవిద్యచే మనపూర్వాచారములు నశించెనో, అట్టి పాశ్చాత్యవిద్యలు మనభారతదేశంబునకు హితంబులు గావు. మన అంతరాత్మకు స్వేచ్ఛ ఎప్పుడు కల్గునో అప్పుడే మనసంఘదురాచారములు అన్నియు నశించును. అప్పుడే

మనము మనభగవానుని ప్రియవాక్యంబుల నాకర్ణింపగల్గుదుము. అహింసావ్రతోన్ముఖుల మగుటకు మన అంతరాత్మను ప్రబోధింపవలయును. సూర్యచంద్రాదులు నక్షత్రంబులు మొదలగునవి మన ప్రత్యక్షదైవంబులు అవి రాత్రిందివంబులు భగవానుని సేవ జేయుచు అమ్మహామహుని దివ్యవాక్యంబుల మనచెవి నాటుచున్నవి.

పండువెన్నెలలో నయితము మధురగానంబుల బాడుచు సత్యమే జయ మనియు ధర్మమే ఆచరణీయ మనియు అహింసయే పరమసిద్ధాంతమనియును నిరాడంబరమే మానవధర్మజీవన మనియు నొక్కినొక్కి వక్కాణింపుచున్నవి. ఇక్లిష్టదినంబులు సహింపగలరు? తన కూర్మిబిడ్డలహింసలు ఆతడు గాంచుట లేదా? నిరీక్షించుచునే యున్నాడు. కావున నోమహాశయులారా, నా మనవి చిత్తగించి వేగమే మన సహోదరబృందంబులను సత్కార్యాచరణమతులుగా జేయుడు. త్వరపడుడు. త్వరపడుడు. విరామము లేదు. భగవానుని కృపాపాత్రుల మగుటకు ఇదియేసమయము. ఇట్టి మంచి తరుణము దొరకబోదు. పరోపకారబుద్ధి మీ మనంబుల నిశ్చలతగా నిల్పుడు. ధర్మ మాచరించుటయే పురాణోక్తమని భావించి తదాచరణంబునకే ప్రయత్నింపుడు. మన ఆత్మలకు స్వేచ్ఛ నొసంగి తదాజ్ఞానువర్తులరై మీ మీ భ్రాతృజనంబులకు మార్గదర్శకులు గండు. సాధుహృదయులు, నిరపేక్షకులు, నిరాడంబరవర్తనులు, నిశ్చలచిత్తులు, నిష్కాములు, మహాత్ము లని యెంచబడుదురు. అట్టివారే దేశసేవాపరాయణత్వమునకు తగియుందురు. అట్టివారినే భగవానుడు ప్రేమించును. అట్టివారే అమ్మహామహుని కరుణకు పాత్రు లగుదురు.

# మహాత్మా గాంధీ సందేశములు

ఎస్. రామమూర్తిగారు

గాంధీమహాత్ముని-ఘన యుపదేశముల
కడువేడ్కతో నొందుడీ-జనులార మీరు, కడు॥
సర్వజనసంస్తూయమాన మ-ఖర్వశాంతనికేతనమును-
పర్వనాయకభోగదము రిపు-గర్వనిర్మూలంబు నగు —శ్రీ గాంధీ.

అవనిమర్త్యుల నేచు-ఆర్తిదొలగగ జేయ-నసహాయ మనుమంత్రము
అవనిజనులెల్లరును దానిని-యంతరంగములందు నిడుకొని-
యసందర్భపురనుల జేయుట-కాసక్తిని జెందబోకుడు —గాంధీ.

తొల్లిమంత్రంబుల-నెల్ల పాలనజేయ-నుల్లమని కట్టడ-లెల్ల జేసిరి మునులు-
కల్లగా దీమంత్రమునకు-తొల్లి కట్టడ లనవసరములు-
చల్లనగు దౌర్జన్యరహితము-కొల్లగా నుండినను జాలు —గాంధీ.

ఇట్టిసులభమంత్రం బికదొరకగాబోదు అట్టిమిమ్మందరిని-పట్టి చెప్పగనేల-
ఇట్టిమంత్రము గానక నుండిన-యట్టి మన మందబుద్ధు వంట
కట్టియలకై కల్పతరువును- గొట్టినట్టె సుండి చూడగ - —గాంధీ.

# మ హా త్మా గాం ధీ సం దే శ ము లు

ఎత్తై[redacted]క్షేత్రముల నన్నిటిని-మొత్తముగానుంచక-రిత్తవడితిమయయ్యో
ఇత్తఱిని మన మందఱము నొక-మొత్తమై యామంత్ర మెడఁదల
హత్తికొనగా జేసి నడచిన-రిత్తవడు మన యాపదలు —శ్రీ గాంధీ.

మన మేలుకొఱకే యా-మహాత్ముడు హిందూ-మహమ్మదీయు స-మ్మతమొనరించెను-
ఎందుకిదియని తెగడకను మన-మందఱము మహమ్మదీయుల
యందు సోదరభావ ముంచిన-జెందెదమ యానందమును —శ్రీ గాంధీ.

స్వదేశవస్తువుల-ముదముతో గొనక - విదేశవస్తువుల-వెలయించినా
ఆలిగతి నారయక యే వెల-యాలిఁ బొందియు పెక్కు-విధముల
చాలడబ్బును గోలుపోయిన-కూళతో సరి మనము కూడ —శ్రీ గాంధీ.

రాటముంచుడియంచు-చాటిచెప్పుచునుండె-ఏటికి మహాత్ముని-మాట లనక మనము
రాటముల నెలకొల్పి వానికి-చేటరులమై పాటుపడినను-
హాటకచేలునిచే వలువల-కోటి ద్రౌపది గొనుట కెన —శ్రీ గాంధీ.

తల్లి విడిచినట్టి-పిల్లలవలె మన-మెల్లనొందెడి శ్రమ-లెల్ల ద్రుంపగడంగి
ఎన్ని విధములనైన నెరు లే-మన్న నూరక నుండి జడియక
నున్న కోర్కె ఫలించు నని మన-కెన్నుసారులు దెల్ప —శ్రీ గాంధీ.

మద్యపానంబనెడి-విద్య నడచి నిశ్శబ్ద్యమనస్కులకు-సాధ్యులమై యుండుడనె.
మద్యపాననిషేధ మొనర్ప-సాధ్యమగు నిహపరసుఖంబులు
వధ్య మాధనవ్యయము మన మా-సాధ్యులగుదుము శత్రులకు —శ్రీ గాంధీ.

ఉద్యోగస్థులమను దురుద్దేశములచేత-బద్ధులమై చెడుట ని-బద్ధియని తల్చనిచో-
ఎద్దులచే వ్యవసాయ మొనర్చి-కొద్దితృణ మాహార మొసగియు
దద్ద కృషికుడు సస్యసమితిని-రద్దుజేయక గొనుట కెన —శ్రీ గాంధీ.

జాతీయభాషాతను-జాతులకు గఱపక రోతతో సరియా పరజాతీయభాష నేర్చిన-
పీతమా స్వభాషగణనా-తీతమై పరభాషత్వర నున
చేతి మోద్పుల మనశిరస్సుల-కాతతముగ నొనంగు నుడి —శ్రీ గాంధీ.

కోర్టులలో న్యాయంబు కొదువ లేకుండు నని కుతుకంబుతోడ నాకోర్టులకు జనగూడి
న్యాయస్థానములనక యవి య-న్యాయస్థానములని యెరుంగుడి
మోయగల ధనమెల్ల గొనియెడి- మాయజనులకు ఇండ్లు నుడి —శ్రీ గాంధీ.

భారతసూనులమై యభాగ్యులమైయుంట-భాగు లేదని మీలో భావించరయ్యయ్యో-
భరతభూమియె బహువిధంబుల-భాగ్యదాయక మైయుండియు
పరులచే గడి చిక్కియుంటచె-భాగ్యహీనుల మైతి మిల —శ్రీ గాంధీ.

న్యాయమను ధనువం దన-హాయంబను శరముంచి-కాయమున శాంతంబను కవచంబును ధరి
న్యాయధనువును ధైర్య మనియెడి-నారిచేతను యెక్కు-వెట్టపఎఁన [యించి-
హాయబాణములోడ గొట్టిన- మాయమగు నస్వతంత్ర వైరి —శ్రీ గాంధీ.

# గ్రీకు నాటక యుగము

పాలకోడేటి వేంకటరామశర్మ గారు

గ్రీకునాటక యుగ మనగా గ్రీసుదేశమందలి ఏథెన్సునగరము వైభవదశయందుండి మహాబలవంతు లగు పారసీకదండయాత్రలను అరికట్టిన పెరికిల్సు కాలము. ఇది క్రీస్తుకు పూర్వము 500-వ శతాబ్ది. మఱియొక గ్రీకునాటకయుగము కలదు. ఆయుగము అలెగ్జాండ్రియా పట్టణము మెసిడోనియనురాజుల కాలములో ప్రాముఖ్యము వహించిన కాలమున బడుచున్నది. అది సుమారు క్రీస్తుపూర్వము నాల్గవశతాబ్ది.

హిందూదేశమున నాటకయుగ మొకటి పాణినికి పూర్వముననే కలదు. భరతనాట్యశాస్త్ర మనెడి నాటకవిమర్శన మొకటి క్రీ. పూ. ఐదవశతాబ్దముననో ఆఱవశతాబ్దముననో రచింపబడెను. అదియునుగాక కంసవధ బలిబంధనము మొదలగు విషాదనాటకములు పాణిని తనవ్యాకరణశాస్త్రమునందు పేర్కొనియున్నాడు. అక్కాలములో హిందూరాజ్యములు ఇప్పటి పరిషియాదేశమువఱకు వ్యాపించి యుండుటయే గాక అసంతతివారే యగు నార్యరాజులు అస్సైరియా మొదలగు రాజ్యములకు చక్రవర్తులుగా నుండి ఆర్యవిజ్ఞానమును ఇప్పటి పడమటి ఆసియాఖండమునంతను వెదజల్లిరి. మఱియు హిందూరాజులు కొందఱు పారసీకరాజులకు కప్పములు చెల్లించుచు యుద్ధసమయముల సైన్యసహాయమును చేయుచుండిరి. అదియుఁగాక బౌద్ధమతము నెమ్మదిగా పెక్కువిధముల పడమటిదేశములందు వ్యాపించుచుండెను. అందువలన చాల నౌన్నత్యదశయందుండిన పారసీకరాజుల పట్టణములందలి సభలందును నాటకకళాకౌతూహలమును ప్రోత్సాహపరచు హైందవపండితులుగాని వారి యనుచరులుగాని యుండకపోరా?

ఆకాలమందు మధ్యధరాసముద్రతీరము గ్రీకులచే ఆవరింపబడి యుండెను. పారసీకదేశపునాగరకతను వారు పూర్తిగ సంగ్రహించి యుండిరి. వారిలోను పండితులు పామరులు గలరు. ఆపండితులు పారసీకరాజులసభలలో నుండుటచే వారు పెక్కు విషయములను గ్రహించిరి. అట్టులు గ్రహించినకళలలో నాటక మొకటి. ఆరాజులలో హిందూజ్ఞానపు ఆధిక్యమును గ్రీకుపండితులు కొనియాడిరి. తక్షశిల మొదలగు పట్టణములసంగతి వారికి తెలియును.

అట్టిసమయములో పారసీకులకును గ్రీకులకును ఘోరయుద్ధము సంప్రాప్తమాయెను. మహమ్మదీయులు కాన్‌స్టాంటునోపిలు నాక్రమించుకొన్న యనంతరము యూరపుఖండమంతయు నూతనోజ్జీవముతో అంధకారయుగము నెట్లు పారద్రోలి నూతనయుగము ప్రారంభింపఁజేసెనో, అటులే పారసీకులు ఆసియాఖండమందలి గ్రీకులను పారద్రోలినవెంటనే ఏథెన్సునగరమున నూతనభావములు అంకురించెను. దేశాభిమానమునకుఁ దోడు కళాభిమానమును వృద్ధియై, ఏథెన్సునగరము మహావైభవముతో తులదూగుచున్న పారసీకదేశము నెదుర్కొనగలిగెను. అట్టిసమయమున గొప్పయోధులు పండితులు కళాభిమానులు ఏకదృష్టితో తమదేశమునకు సేవజేయఁదొడఁగిరి.

ఆకాలమందు వృద్ధికివచ్చిన కళలలో నాటకము ప్రాముఖ్యము వహించెను. పండితులు నాటకములద్వారా జ్ఞానమును వెదజల్లుచుండిరి. అధికారులు నాటకకర్తలకు పోటీపరీక్షలు స్థాపించి ప్రోత్సాహమును జూపుచుండిరి. వారిమతము నాటకములద్వారా ప్రతిఫలించుచుండెను. మతమే నాటకము. మతవిషయికము లగు సంగతులు నాటకమును పోషించుచుండెను.

అయిరోపాఖండవాసులు నాటకరంగమును థియేట రందురు. మనకు రామాయణమహాభారతము లెట్టి పురాతనగ్రంథములో, అట్లే హోమరునిచరిత్రలు గ్రీకుదేశస్థులకు ముఖ్యగ్రంథములు. బహుపురాతనములు. బౌద్ధునిశిష్యు లగు మందగుల్యాన, ఉపతిష్యులయెదుట నాటకమాడగా బౌద్ధులు చూచిరటులు బౌద్ధపురాతనగ్రంథములందు చెప్పబడుటయేగాక వత్తు నాటకసంఘు మనెడి పదములు మహాభారతరామాయణాదిగ్రంథములం దెట్లు గలవో, అట్లే ఈ హోమరుచరిత్రలో నొకచో గ్రీకునాటకమునను ముఖ్యాంగ మగు కోరస్సును గూర్చి గలదు. కాని ఇది ఒక నాటకబీజమే. అట్టి బీజములు పెక్కులు కలియకచే నాటకము పూర్తిగ నగుచున్నది. గ్రీకుథియేటరు పురాతనమయినది. ప్రథమమున యిది నోసస్సు అనువానిచే కట్టింపబడెను. ఇది ఒకహాలు. ఏవిధమైన విందులైన వింతలైన ఆనందించుటకు కట్టినమందిరము. తరువాత నాటకము లందు ఆడబడుచుండెను. ధర్మరాజునకు మయుని మందిరము ఎట్లు ఉపయోగకారిగనుండెనో, గ్రీకు పురాతనమందిరములు కూడ నటువంటి విషయములనే ఉపయోగపడెను. తదనంతరము నాటకబీజములను అసంపూర్తిగ కూర్చి నాటకపితామహుఁడని పేరు పొందినది తెస్పిసు. ఇందు ప్రథమకోరస్సు యీరెండింటి సంభాషణయు గలవు. ఇట్టి సంభాషణలు మన పురాణములందు పెక్కుచోటుల గానగు. కాని కోరస్సు అనునది సుద్దులవంటిది. కోరస్సు అనగా పల్లవి. సాధారణముగా మనదేశమందలి పల్లెటిగ్రామములందు మనము గాంచుచుందుము. సుద్దులు పాడునపుడు పలువురుగూడి పాడుదురు. నాయకుడు ఒకప్రక్కను, ఇతరులు మఱొకప్రక్కను దారి కడ్డముగ నిలువబడి నాయకు డొకపల్లవిని పాడగా దానికి సహచరులు మరొకపల్లవిచే సమాధానము నిచ్చెదరు. ఇది నాటకబీజముల కలయికయందు ప్రారంభావస్థ. ఇట్టిదియే తెస్పిసు వర్ణించిన పల్లవి. అది నాటక మెట్లగును? అయినను గ్రీకునాటకములకు ఈతనిని మూలపురుషునిగా భావించిరి.

# బాలికలు - వృద్ధవివాహములు

వేమరాజు వేంకటరావు గారు.

వగఁటిమి సడలిన ♦ ముదుసలికైనను, పెండ్లిమాట వచింప ♦ పేర్మిగాదె
కుష్ఠురోగముచేత ♦ దుష్టుడైయున్నను, బాల నిత్తుమటన్న ♦ పరము గాదె
చిల్లిగవ్వయు లేక ♦ యల్లాడుచుండిన, పిల్లఁ గూర్తు ననంగఁ ♦ బ్రియము గాదె
బహుసతీనాథుఁడై ♦ పరఁగెడువానిని, కన్నెఁ గైకొనుమన్న ♦ యెన్నగాదె
విద్యావిహీనుఁడై ♦ వింతగాజీవింప, వనితఁ గైకొనుమన్న ♦ వరముగాదె.
సతులవరుసఁ దెలుప ♦ సంతోషమడుగరే? చిన్నికన్నెపొత్తు ♦ నెన్నుమంచు
కలిగి యుండవలదె ♦ ఘనతసర్వాతలను? కామరోగ మెవని ♦ కానరాదు.

సీ. తొంబదియేండ్లతో ♦ తులఁదూఁగువానికి, కన్నియబాము లే♦కరణిఁ దెలియు
పెద్దరోగముచేత ♦ పీడింపఁబడువాఁడు, బాలసౌఖ్యంబు లే♦భాతి నరయు
బహుసతీనాథుఁడై ♦ బహుశ్రమపడువాఁడు, రమణితలంపు లే♦రీతిఁ గాంచు
యిల్లుగుల్లగనుండు ♦ ప్రల్లదుఁడగువాఁడు, వనితకష్టంబు లే♦విధము జూచు
అయ్యో, తలిదండ్రులార ♦ మీబాలికా, స్థితుల నరయరయ్యా! ♦ తీర్పరయ్య
స్వవరుగోరువరము ♦ భావింపరయ్యయో ♦ తండ్రులనుట మిమ్ము ♦ దారుణంబు.

సీ. చీకి కూలఁగఁబోవు ♦ చిన్నగుడిసెలలోన, నుద్భవంబైరి వి♦శుద్ధమతులు
చీమలుపోసిన ♦ చెనఁటికలుఁగులలోన, జన్మించినార లా♦జన్మగురులు
ఎండి కూలఁగఁబోవు ♦ చెట్టులు నెలవుగా, ప్రభవించినారలు ♦ పరమధనులు
తిండి నెఱుఁకలేక ♦ మండుకొండలపైన, స్థావరమూర్తులే ♦ సత్యనరులు
వారు నేర్పిన విద్యలే ♦ వాసికెక్కె, వారు నేర్పినధర్మములు ♦ వసుధనిలిచె
వారు కీర్తి ధరిత్రిని ♦ బంధులైరి, వారుజారినజారిసే ♦ వారినీతి
గాని బాలవిధవ ♦ కాంతునొరొకసారి, పొందసర్వమనుట ♦ పూజ్యమకట
మగువసుఖములన్న ♦ మానసంబొలదు, ఏటిపశువు లయ్య ♦ బోటు లకట.

సీ. చిన్నిబాలసుఖము ♦ జూడగా రోయుట, బాలవితంతుల ♦ బాపమయ్య
మతమందులేనివి ♦ మతికొన్నికల్పించి, ధనహీనలను ద్రొక్క ♦ ధర్మమయ్య
విద్యనేర్పుటఁ గొప్ప♦వింతగా జెప్పుచు, వనిత బానిసఁజేయు ♦ ఘనతయయ్య
తగుకాలమందున ♦ తగునాథుఁ బడయఁగా, ఘోరమంచును జెప్ప ♦ కార్యమయ్య.
పుత్రికలుపుత్రులకునీడు ♦ గాదటయ్య ? వారిసుఖములు మనలకు ♦ పరములయ్య
అట్టియెడ పుత్రిక నడంప ♦ నర్హమయ్య? తల్లిదండ్రులు మనకివి ♦ చెల్లఁదగునె.

సీ. పుత్రికాసౌఖ్యముల్ ♦ పుణ్యంబుగాఁ దోఁప, దాని సౌఖ్యములేల ♦ పూనఁదగదు
పుత్రిజీవితమెల్ల ♦ పూజ్యంబుగాఁ జేయ, విద్యాప్రదానంబుఁ ♦ జేయరాదె
మంచియౌవనమందు ♦ మన్మథుగోరగా, స్వీయనాథు గ్రహణ ♦ జేయదగదె?
బాలవితంతుల ♦ బాములఁబాపఁగా, నూత్నసద్విభులకు ♦ నొసఁగరాదె
పుత్రికాధనంబు ♦ పూజ్యంబుగాదయో! తండ్రులగుటమీకు ♦ ధర్మమగునె
స్వయములాభమన్న ♦ సుతలాభమగునయ్య, తండ్రులార ! మతవితండ్రులార.

సీ. అన్యోన్యమనురాగ ♦ మన్నిఁటనొప్పఁగా. వరజాలమొసగదే? ♦ స్వయమువరము
భాగ్యాభివృద్ధిని ♦ భాసిల్లఁగాఁజేయు, వరజాల మొసఁగదె ♦ స్వయమువరము
నవకశోభానులా ♦ నందను లలరఁగా ♦ వరజాల మొసఁగదే? ♦ స్వయమువరము
సంసారరంగంబు ♦ సౌఖ్యాబ్ధి జేల్పఁగా, వరజాలి నొసఁగదే? ♦ స్వయమువరము
దంపతులసౌఖ్యరాశికి ♦ ధాత్రివోలె, భాగ్యసుఖ మిచ్చుసు♦స్వయమువరము
సర్వసౌభాగ్యభద్రంబు ♦ సాధిధింబు ! వనితభాగ్యంబు, పురుషుల ♦ వాంఛితంబు.

సీ. ధర్మంబుబోధించి ♦ దానివృద్ధిగఁ జేయు, దేవసంభవులు భూ♦దేవులార
ధర్మంబు రక్షించి ♦ ధాత్రి నలరఁబ్రోచు, కర్మసంభవులు స♦క్షాత్రులార
ధర్మంబువ్యాపింప ♦ తగువృత్తిఁగాఁ బూను, వీర్యసంభవులు స ♦ ద్వైశులార
ధర్మంబు వృత్తిగా ♦ తగనుసరించెడి, శూరసంభవులు స♦చ్ఛూద్రులార
మతమునందు లేని ♦ మర్యాదలేలొక్కో? పుత్రికలసుఖంబుఁ ♦ బూన రకట
ధర్మ మరయరయ్య ♦ తగుస్వయంవరములు, బుద్ధిభాషలార ♦ పూజ్యులార.

ఈనాటకబీజములు ప్రతిజాతియందును గలవు. కాని బీజములన్నియు పొందుపరచి నాటకమును రచించినకవి గొప్పజ్ఞాని. దేశనాగరికతను బట్టి యీబీజముల కలయిక యేర్పడును. అట్లు విజ్ఞానభావము అంకురించినది పెరికిల్సు కాలము. ఈకాలమందు ముగ్గురునలుగురు కవులు ప్రధాననాటకకర్తలుగ భావింపఁబడిరి. అనేక నాటకములు అక్కాలమున రచింపబడెను. అనేకకవులు వెలసిరి. ఆకవులలో ముఖ్యులు ఏయిస్కిలిసు యూరిపిడీసు సోఫొక్లిస్సు అను ముగ్గురు విషాదాంత నాటకరచనయందు ఘనతకెక్కిరి. అరిస్టోఫేనిసు అను నాతడు సాటిర్సు అనబడు విమర్శనమృదంత నాటకరచనయందు ప్రఖ్యాతి వడసె కాని గ్రీకురంగమనగా విషాదాంతనాటకరంగమే కాని మృదంత నాటకరంగము గాదు. విషాదాంతనాటకములే కళాసమృద్ధత గలిగియుండెను. ఏయిస్కిలిసు సత్యముగా గ్రీకునాటకపితామహుడు. ఈతడు గొప్పకవియును, మంచి యోద్ధయును. గ్రీకుపరిషియను యుద్ధములో నీతడు పోరెను. అప్పటికి యూరిపిడీసు చాల చిన్నవాడు. సోఫొకిల్సు బాలుడైనను అప్పటికి యుద్ధభావములను బాగుగ గ్రహించియుండెను. ఒకబహుమానపరీక్షయందు సోఫొకిల్సు, ఏయిస్కిలిసు నోడించి కీర్తిగాంచెను. వీరిద్దఱు నాటకములందు పాత్రలను వృద్ధిగావించినను ప్రాతగాథలనే నాటకరూపముగ మార్చుచుండిరి. కాని యూరిపిడీసు అట్లుగాక కథ నల్లగలశక్తినిగూడ జూపెను. కథాచమత్కృతిని బాగుగ పరిశీలించెను. ఈతడు నాటకకర్తలలోనెల్లను ఘనుడైనను అప్పటి పరీక్షకు లగు న్యాయవేత్తలు ఈతని కెన్నడును బహుమతి నీయలేదు. కాని తుదకు దేశమును వీడిపోవలసినవాఁడాయెను. కళానైపుణ్యమున - కథాచమత్కృతి - నూతన భావములను వ్యాపింపజేయుట యందును అక్కాలమందు ఈకవిని మించినవాడు లేడు. యూరిపిడీసు రచించిన నాటకములు షేక్స్పియరు నాటకములవలె, బహుజనానందకరములుగ నుండినను సులభశైలిని రచింపబడి కళాసంపూర్ణత గలిగినను పరీక్షాధికారులు వీటిఘనతను గ్రహింపజాలరైరి.

వీరినాటకము ఎట్టిదో మన మాలోచింతము. నాటకమునకు ప్రధానసోపానము కోరస్సు లేక పల్లవి. కాని యీముగ్గురుకవులు ఈ కోరస్సును మూడు తీరుల సమర్థించిరి. కోరస్సు అనగా నేదియో యిదివరలో ఒకమోస్తరుగా చూపియుంటిని. ప్రారంభమునుండి తుదివఱకు కోరస్సు రంగస్థలమును వీడ కేరదు. అనగా రంగస్థలమందు మార్పులేదు. పాత్రలు వచ్చుచు పోవుచునుండును. కాని రంగస్థలము మాత్రము మారదు. ఏయిస్కిలిసు, సోఫొకిల్సులు, కోరస్సును ఒకపాత్రగానే భావించి యితరులతో అన్నివిషయముల ముచ్చటించుటకు నిర్ధారణ గావించిరి. కాని యూరిపిడిసుని కోరస్సు పాత్రలతో సంబంధము కొద్దిగాగలిగి వారినడతలను విమర్శించి జ్ఞానివలె న్యాయములు పలుకుచుండును. ఇట్లు కోరస్సును ఈకవులు వివిధవిధముల సమర్థించినను, వారు తమ కవిత్వశక్తిని యీకోరస్సును సృష్టించుటయందే వ్యయపరచిరి. అందువలననే నాటకకర్తలభావములు వారివారి కోరస్సులచే వెల్లడియగుచుండును. కోరస్సు గ్రీకుకవుల హృదయము. అట్టి కోరస్సును గ్రీకునాటకమునుండి యూడబెఱికినయెడల తొండములేనియేనుగువలె మొదలులేని చెట్టువలె నిర్జీవమై యుండును.

గ్రీకునాటకమే మత మని చెప్పితిమి. అనగా నాటకబీజములకు ఖ్యాధారములు మతవిషయకకర్మలు నిబంధనలు మొదలగునవి జపము కర్మము న్యాయము పాపము శిక్ష మొదలగు విషయములను, గుఱించి గ్రీకులకు గల భావములు నాటకములద్వారా తెలియనగు, యుద్ధము చావు మొదలగునవి నాటకరంగస్థలమున జరుగగూడదని నియమము గలదు. కాని యిట్టిసంగతులు తెలియజేయుటకు హిందూ నాటకములందలి ఆకాశవాణివలె దూత యొకడు గలడు. దూతప్రవేశము నాటకకళయందలి ముఖ్యవిషయములలో నొకటి. పూర్వులు చేసిన పాపము వంశపారంపర్యముగా వచ్చుననెడి గ్రీకున్యాయము ప్రతి నాటకమందును స్పష్టముగా కానవగు. గ్రీకునాటకము నృత్యము, పంటలు ఫలించుటకు చేయబడు మతాచారకృత్యములనుండి పుట్టెన పెక్కురువిమర్శకుల యభిప్రాయము. అడుగులతో ఆడుటయేగాక అన్ని అవయవములచేతను భావములను తెలియజేయవలెను. పంట యను నది దేవుడు. అతనిమరణము మన చావువంటిదే. అతని పునర్జన్మమునకై ప్రార్థనలు నృత్యములు సలుపవలెను. అట్లుచేయనియెడల ఘోరమగు కఱవు ప్రాప్తమగు నని వారినమ్మకము. డైనోసియసునుగూర్చి చేయు కర్మలన్నియు నిట్టివియే. అట్టిసమయములో ఆడుటకు నాటకము ఉపయోగపడుచుండెను. అట్టినాటక మెట్లుండవలెను ?

కోరస్సు ముఖ్యము. దూత కావలయును. మరణవార్త చెప్పుటకు ఉదూత కావలయును. శృంగారరస మింకుటకు వీలులేదు గదా. యుద్ధము, ఆపద అట్టివే మనకు గలవు గాన విచారరసము నాటకమునకు ఒకభావము. ఒకపుడు సౌఖ్యముగూడ గలుగును గాన ఆనందరసముగూడ నిందు మిశ్రమగును. దేవునిపునర్జన్మము వైభవము. కాని యిట్టి చిక్కులనుండి వదలించుకొనుట మనుష్యునితరము గాదు గాన దేవసంబంధముచే గాని యీచిక్కులు వదలుట కష్టము.

ఇట్లు గ్రీకునాటకములకు ముఖ్యాంగము లేమన (1) కోరస్సు లేక పల్లవి (2) దూత (3) దైవసంబంధము (4) యుద్ధమరణములు రంగస్థలమున గానరాకుండుట (5) పాత్రలు స్వల్పముగా నుండుట (6) రంగస్థలము మాఱకుండుట (7) కాలపరిమాణము యిరువదినాలుగుగంటలకు లోపుగ నుండుట (8) కథాకల్పన చమత్కృతిగా నుండవచ్చును గాని కథలో కథ గానరాకుండుట :—యివి ముఖ్యవిషయములు.

ఈగ్రీకునాటకములు యూరపునకు చేసిన యుపకారము ఇంతంతయని చెప్ప నలవికాదు. అరిస్టోటిలు వీటిని ఆధారపఱచుకొని నాటకరచన ఎట్లుండవలెనో విమర్శనమొకటి వ్రాసెను. రోమునాటకకర్తల కాధారము కొంతవఱకు నిదియే. షేక్సపియరు వీటిని అనుసరించి పెక్కుమార్పులు గావించెను. అందువలననే యీకవి, నాటకకర్తలలో కెల్లను ప్రధానుడు. షేక్స్పియరువంటి సుప్రసిద్ధకవులు యూరిపిడీసు మొదలగు గ్రీకునాటకకర్తలకు జోహారు లొనర్చియుండ గ్రీకునాటక కర్తల మహిమము వేఱుగా జెప్పవలయునా ?

# బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమ్మేళనము

పొన్నాడ కృష్ణమూర్తి గారు

బ్రాహ్మణులు స్వార్థపరులయి పూర్వకాలమునుండియు ప్రభువులను చక్రవర్తులను లోబరచుకొని, సర్వాధికారములను బొంది, విద్వాంసులయి, మతముపేరిటను గూడ సర్వోన్నతులయి, బ్రాహ్మణేతరుల నున్నతస్థితికి రానీయక అణంగం ద్రొక్కిరని బ్రాహ్మణేతరులలోని హూణవిద్యాధురంధరు లగు నాయకులు చెన్నరాజధానియం దీయుద్యమమును లేవదీసిరి. ఈ యుద్యమపక్షమునకు న్యాయపక్ష మను పేరు పెట్టి యుద్యమవ్యాప్తికై యాంగ్లేయాంధ్రములందు దైనికపత్రికలను గూడ నడపుచున్నారు. వీరు బ్రాహ్మణులగురించి తీవ్రమగు నిందావాక్యముల నుపయోగించుచుందురు.

బ్రాహ్మణు లాదికాలమునుండియు మత రాజకీయ సాంఘిక వ్యవస్థలయం దధికులయి, యున్నతస్థాన మాక్రమించుకొని యున్నమాట వాస్తవము. ఎందుచేత ననఁగ బ్రాహ్మణు లింతవఱకు నాధిక్యము సంపాదించి యన్నిటియందును ముఖ్యముగ సంఘమునందు నున్నతస్థానమునం దుండుటచే నీసమ్మేళనబాధ్యత వారియం దెక్కువగ నుండక మానదు. బ్రాహ్మణేతరసోదరులును బ్రాహ్మణులయందలి లోపములను గోరంతలు కొండంతలుగ గణించి ద్వేషభావ మూనక వారిని తమ పూర్వులవలెనే ఆదరణబుద్ధితోఁ జూచి - మఱి యందఱ కెక్కుడవసర మగు దేశమాతయొక్కయు జాతీయతయొక్కయు క్షేమమునందు బుద్ధినిలిపి పరమేశ్వరుని స్మరించి, యీభేదోద్యమమును చాలించి, యైకమత్యము కలిగి యుండవలసిన తరుణ మాసన్నమైనది.

వెనుక నేను హిందూమహమ్మదీయ సమ్మేళనమునుగూర్చి యొక వ్యాసము వ్రాసి యాంధ్రపత్రికలయందుఁ బ్రచురింపించి యున్నాను. అందు విభేదకారణములం దెలిపి వానిని సవరించుకొను పద్ధతుల సూచించియున్నాను. ఇప్పుడు హిందూమహమ్మదీయులు మైత్రి కలిగి యున్నారు. ఈ బ్రాహ్మణబ్రాహ్మణేతర సమస్య యంతకన్న నెక్కువ చిక్కయినది కాదు. ఉభయులును హిందువులే. మతాచారాదులం దేకాభిప్రాయులు. ఉభయపక్షములందలి ప్రధాననాయకులును కలసి ఉభయులను చీలదీయు నంశములను సవరించుకొనినం జాలును. బ్రాహ్మణేతరుల కోరికలు ముఖ్యముగ నివి- 1. ఉద్యోగములు 2. శాసనసభలు 8. విద్య 4. వర్ణాధిక్యమును గుఱించినవై యున్నవి. బ్రాహ్మణున కుద్యోగము ప్రధానవృత్తి కాదు. తపోవిద్యలు బ్రాహ్మణునకు ప్రధానవృత్తిగా భారతాదిగ్రంథములు శాసించుచున్నవి. విద్య యనఁగ హూణభాషాదిలౌక్యవిద్యలు కావు. అధ్యాత్మవిద్య ("అధ్యాత్మవిద్యా విద్యానాం" భగవద్గీత అ ౧౦. శ్లో 3౨. మఱియు బ్రాహ్మణకర్మనుగూర్చి కూడ భగవద్గీతయం దిట్లున్నది.

"శమో దమ స్తపః శౌచం క్షాంతి రార్జవ మేవచ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజం"
(అ ౧౮ శ్లో ౪౨)

ఇట్టి స్వచ్ఛందజీవనమున కవకాశ మియ్యదు కనుకనే బ్రాహ్మణునకు కొలువు వర్జ్యమని మనపూర్వులు శాసించియున్నారు.

ఇంతకు పూర్వము బ్రాహ్మణులు లౌక్యవిద్యాదక్షులై యుద్యోగములయం దుండి విద్యావిహీనులును అజ్ఞానులు నగు బ్రాహ్మణేతరులగు ప్రజాసామాన్యమును నిరంకుశాధికారముగ పాలించుచుండుటచేతనే బ్రాహ్మణేతరపక్ష మేర్పడినది. కావున బ్రాహ్మణులు లౌక్యవిద్యాభ్యాసమును విరమించి యుద్యోగము లన్నిటిని మన బ్రాహ్మణేతరసోదరులకే విడిచిపెట్టుట ధర్మము. ఇందుచే శాసనసభ్యత్వములకు కూడ బ్రాహ్మణులు నిలువఁబడక బ్రాహ్మణేతరసోదరులకే వాటిని లభింపఁజేయుటను గూర్చి వేఱుగ నుడువవలసిన యావశ్యక ముండదు. ఇక మిగిలినది వర్ణాధిక్యము. దీనినిగూర్చి విమర్శించుటకీ చిన్నవ్యాసమున చోటు చాలదు. అది ప్రత్యేకవ్యాసముగ నుండవలసి యున్నది. అయినను కమ్మవారిలో కొందఱవలె బ్రాహ్మణేతరసోదరు లెవరైన నుపనయనసంస్కారములఁ బొంది వేదవేదాంగపారంగతులై వైదికకర్మదీక్షితులుగ గాం గోరికేని బ్రాహ్మణులు వారికోరిక తీర వారియందు శిష్యవాత్సల్య ముంచి పనిచేయుట ధర్మము.

బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులయం దీర్ష్యయును ద్వేషమును కలిగియున్నారను వారి భావముతో నే నేకీభవింపఁ జాలను. వా రట్టి భావముల కలిగియుండినట్లంగీకరించినను పైవిధులను మనమనుసరించి పని సల్పితి మేని, బ్రాహ్మణేతరసోదరులకు మనయం దంకురించిన యీర్ష్యాద్వేషములు అంతరించిపోక తప్పదు.

ఉద్యోగములును పౌరోహిత్యమును మాని బ్రాహ్మణు డెట్లు కుటుంబపోషణఁ జేసికొనఁగలఁడని బ్రాహ్మణులలో కొంద ఱడుగవచ్చును. బ్రాహ్మణధర్మము భోగైశ్వర్యప్రసక్త మగునది కాదు. భోగపరాయణత్వము మాని యింద్రియజయ మలవరచుకొని మితాహారులు కావలెను. ఇందుచే బ్రాహ్మణుల కాధ్యాత్మికచింతనమునకు వీలుకలిగి తపశ్శక్తిసంపన్నుఁడయి భూదేవుఁ డనిపించుకొని తొల్లిటి యున్నతగౌరవమును సంపాదించుకొనఁగలుగును. ఏనాఁడు బ్రాహ్మణులు భోగైశ్వర్యాసక్తులయి స్వధర్మమగు బ్రాహ్మకర్మను విడిచి- స్వచ్ఛందజీవనమునకు తిలాంజలి నొసంగి- పారతంత్ర్యపంకనిమగ్నులైరో, ఆనాఁడే బ్రాహ్మణత్వముఁ గోల్పోయి దేశము నధోగతికిఁ దెచ్చిరి. భోగపరాయణత్వము లేక మితజీవనపరులైనచో బ్రాహ్మ

ణునకు వ్యయభారము చాలవఱకు తగ్గిపోవును. పూర్వకాలమునందువలె బ్రాహ్మణుఁడు శిలోంఛవృత్తులచే నీకాలమున జీవింపజాలఁకున్నను వ్యవసాయము వాణిజ్యము మొదలగు స్వతంత్రవృత్తులచే కుటుంబమును పోషించుకొనవచ్చును. బ్రాహ్మణుఁ డెప్పు డాడంబరరహితజీవనుఁడై స్వార్థత్యాగియై తపశ్శక్తిసంపన్నుఁ డగునో యప్పుడే దేశము నిజమగు స్వరాజ్యసుఖ మనుభవింపఁగలదు. బ్రాహ్మణుని తొల్లిటిగౌరవమును నిలువబడును. బ్రాహ్మణులు తమమేలంతయు బ్రాహ్మణేతరుల నున్నతస్థితికిఁ దెచ్చుటయందే కలదనివిశ్వసింపవలయును.

ఇఁక బ్రాహ్మణేతరులకును గూర్చి నొకసంగతి నివేదింపవలసి యున్నది. వారును వినశ్వరమగు భోగైశ్వర్యములందును నుద్యోగముల యందును కేవలము నిమగ్నులై కృషిసల్పక తమదృష్టిని యాధ్యాత్మిక చింతనమునకును దేశక్షేమమునకునుకూడ మరలించి తమస్వార్థత్యాగము చేతను సమదృష్టిచేతను ఆత్మోన్నతిని బడసి శాశ్వతసౌఖ్యస్థితికి దీక్షబూను టావశ్యకము. బ్రాహ్మణేతరులు తమోగుణసంజనిత నిద్రావస్థనుండి మేల్కొని ప్రస్తుతము రజోగుణ పకల్పితాడంబరపటాటోపమునం దున్నారు. దైవకటాక్షమున నచిరకాలమున నే సత్యమును గ్రహించి సాత్వికవృత్తి నవలంబించి- నిరాడంబరజీవనాభ్యాసులై- యాధ్యాత్మిక చింతాతత్పరులై-సర్వసములై -మనభరతవర్షమును పూర్వపు మహోన్నత దశకుఁ దెచ్చి కృతయుగమును మరల బ్రతిష్ఠింపవలయును.

భరతవర్షమున బ్రాహ్మణులును బ్రాహ్మణేతరులును గూడ సత్వర స్వరాజ్యము నాకాంక్షించుచున్నారు. కాని యది యాచ్ఞావృత్తివల్లను కపటతాంత్రికములవల్లను లభించునది కాదు. అట్లు లభించినను స్థిరముగ నిలువజాలదు. అందువలన నుపయోగమును నొండదు. స్వార్థత్యాగము చేతను ఐకమత్యముచేతను నాత్మబలముచేతను దానిని తప్పక పొందవచ్చును. కాఁబట్టి యుభయులు నెన్నఁ డేకీభవించి కృషిసల్పుదురో నాఁడు తప్పక హిందూదేశము స్వరాజ్యమును బడయఁగలదు. వెనుకటి సంగతులఁ ద్రవ్వక యన్యోన్యప్రేమపూరితులై మీరందఱొకటి గండు. మీరు కృతకృత్యు లగుదురు.

పై విషయముల నస్పృశ్యులుకూడ గమనింపవలసి యున్నది. వారిసంఘ మింకను చాల వెనుకబడి యున్నది. శుచియనవా రింతవఱ కెఱుఁగనే యెఱుఁగరు. వారు- తక్కినవారికన్నను నధికశుచివంతులైననే కాని యితరులతో కలసికొనలేరు. వారియం దిపుడు బుద్ధిమంతులు బయలుదేఱి సరియగు మార్గాన్వేషణము సేయుచుండుట శుభసూచకము. నిమ్నజాతుల విషయమై జరుగవలసిన పని కంఠశోషణ మైనది. పాలకులును వారికృషికి సహాయభూతులగుచున్నారు. వారియందు త్రాగుడును అవాచ్యము నసహ్యకరము నగు నీచసంభావణమును పూర్తిగ తొలఁగిపోవలెను. మాంసాహారవర్జితులైరేని వా రతివేగమున ముందునకు రాఁగలరు. ముఖ్యముగ నిమ్నజాతులు తమయభివృద్ధి తమ కృషియందే గలదని పూర్తిగ విశ్వసింపవలెను. వీరికులస్థులగు చొక్కామేళుఁడు కనకదాసు మొదలగువారు శుచివంతులై, యజ్ఞోపవీతులై పరమభక్తాగ్రేసరు లయి బ్రాహ్మణులచేగూడ పూజలం బడసిరి. ఈకీలకమును తెలిసికొని పనిచేసిరేని వీరి యస్పృశ్యత పటాపంచలై పోవును. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులుకూడ వీరికి బోధించి హైరీతిని వీరిని శుచివంతులఁ జేసి తమదరిఁ జేర్చి యాదరింపవలెను.

# ఉచితమైన సామ్రాజ్యకాంక్ష

కందా భీమశంకరము గారు బి. ఏ. (ఆనర్సు)

దూరమున నున్న బంగారు । తీరములను
నింగి కెగయ దిగ్విజయాబ్ధి । పొంగిపొరలి
ఇచ్చటను మనలోన । హెచ్చుచుండు
రాత్మలకు నోగిరము లేమి । నడలు జనులు
మీదుశాస్త్రంబు వృథ । మీదుకళయు
మీజయము వృథ వృథయగు । మీయశంబు
ఎడప మేధాదరిద్రము । క్షుత్పిపాస
వన్యపుటెడార్ల హాహారవంబు సెలఁగ
అపయశ మధర్మ మజ్ఞాన । మను నడవుల
మీదు విజిగీష కిచ్చోట । లేదె నెలవు
క్షాత్రమే లేదె యశమిచ్చు । కార్యములకు?
లెండు! గెలువుఁడు! భుజశక్తి । యుండునపుడె;
మీదునడుమనె విడిసిన । మీవిరోధి
గణము గెలిచి నిర్మింపుఁడు । మనుజచిత్త
మందసత్వర సామ్రాజ్య । హర్మ్యవరము

# లేఖన ప్రమాదము

పారనంది రామశాస్త్రి గారు

ప్రస్తవా రిప్పుడు లిపులనుబట్టి, కాలము నూహించుచు దానిని బట్టి యొకవిషయమును నాకాలము నాఁటి దని నిశ్చయింప యత్నించుచున్నారు. ఇంక నీలిపిభేదమువలన నొక యక్షరమును వేఱొకదానిఁగా భావించి దానికి సంబంధించినట్లు కొన్ని కార్యములను కల్పించుచున్నారు. ఇది సరియైనదే యని నిశ్చయింపరాదు. పోలికలెట్టివారికిని గొన్నిచోట్ల భ్రమమును కలుగఁజేయఁగలవు. మొదట నొకరిప్రమాదమువలనఁ బిమ్మటివారు భ్రమపడఁగా దానిం జూచి యాపిమ్మటివారు వారిభ్రమమునే ప్రమగాఁ దలఁచి దానివలన కార్యములను జేయఁగలరు. కంఠధ్వని జ్ఞాపనముకొఱకు లిపి యేర్పడినది. ఇది యన్నిభాషలలోను గలదు. ఒక్కభాషలోనే యనేకవిధములగు లిపులు నుండును. సంస్కృతమున నాగరాక్షరములు వేఱు. ఆంధ్రద్రావిడాద్యక్షరవ్యక్తులు వేఱు. వీనిలో నొక్కజాతిలిపి యైనను లేఖకులను బట్టియు లేఖ్యములఁ బట్టియు లేఖనసాధనములఁ బట్టియుఁ గొంచెము కొంచెము భేదిల్లుచుండవచ్చును. ప్రకృతమున నాంధ్రలిపిలో కవర్గీయానునాసికము "ఙ" కార మిట్లుండును గదా. ఇది "నఙ" "తఙ" ఇత్యాది కేవలస్థలములలోను "దిఙ్నాగ" "వాఙ్ముఖ" ఇత్యాదిసంయోగస్థలమందును స్పష్టముగాననునాసికధ్వని కలదయియే వినఁబడుచున్నది. "జ్ఞాన" "జ్ఞాతి" ఇత్యాది సం   గములోను ననునాసికోచ్చారణమే వినఁబడుచున్నది. వ్రాఁతలలో మాత్ర మిచ్చట చవర్గీయము (ఞ) కారముగాఁ గాన్పించుచున్నది. ఇచట మనయుచ్చారణము తప్పా? వ్రాఁత తప్పా? "యజ్ఞ" "రాజ్ఞి" ఇత్యాదులలో వ్రాఁత సరిగాను నుచ్చారణము తప్పయినట్లును గానవచ్చును. అట్లుగాక యీ "జ్ఞ" అనునది ప్రత్యేకాక్షరమా? అయినచో వర్ణసమామ్నాయములో వేఱొకయక్షరముగాఁ జేర్పఁబడినదా? అట్లు లేదు. దీనిని సంయోగముగానే యందఱును భావించుచున్నట్లు మాత్రము కాన్పించుచున్నది. అయినప్పుడు వేఱె సంయోగము అనువిచారము మాత్రము చేయఁబడినట్లు కానరాదు. ఈసంయోగములో మొదటిది కవర్గీయానునాసికము. ఙ కార మిట్లే వ్రాఁతలలోఁగూడ పూర్వ ముండియుండును. ప్రాచీనవిద్వాంసు లట్లే భావించియున్నట్లును గానవచ్చుచున్నది. జ్ఞాపకము ధ్వనియట్లుండఁగా తిక్కనసోమయాజి దీనికి 'క' కారమును విశ్రమాక్షరముగాఁ బెట్టి భారతము శాన్తిపర్వము ౪-వ ఆశ్వాసము ౨౯౫ "క జ్ఞానము కేవలకృప న జ్ఞానికి నుపదేశవిధి బ్రకాశము సేయన్ అనుచోటను జ్ఞానంబువడయుటకు వాఙ్మానసములు సునియమములుగావింతురు" ౫ ఆశ్వా ౯౦ అను చోటను దెల్పియఁజేసి యున్నాఁడు. వీనిలో మొదటి యుదాహరణమును మాత్ర మప్పకవి యిచ్చియున్నాఁడు. సోమయాజినాఁటి కుచ్చారణములోను వ్రాఁతలలోఁగూడ ససందిగ్ధముగా నున్నది. "ఙ" కారమునకు "క" కారమును నాయన విశ్రమముగాఁ బెట్టుటయు నప్పకవి దాని నొప్పికొనుచుఁ దననాటికి వ్రాఁతలో మాత్రము 'ఞ' కారమువలెఁ గాన్పించుటచే నది యొక 'విశేష వళి' యని చెప్పవలసివచ్చుటయు స్పష్టము. అట్లు చెప్పుటకు కారణము తనకు పూర్వపు ఛందోగ్రంథములందలి భ్రాన్తియేయై యుండును. ఇకనిచట నిది విచారణీయము, ఈ 'ఙ' కారము 'ఞ' కారముగా వ్రాఁతలోని కెట్లు వచ్చెనని విచారింతము. తాటాకులపైని గంటములతో వ్రాయుకాలమున నొకరు క్రొవ్వాడిగలదానితో వ్రాయునప్పుడు 'ఙ' కారమునకు కంఠస్థానమందుండు నడ్డుగీత— దీనిని బెట్టుటకుఁ దాటాకు చిఱుగునని తిన్నఁగఁ బెట్టక కొంచెము క్రిందికిని మీఁదికినివంకర చేసి ' ' ఇట్లు పెట్టఁగాఁ బిమ్మటివా రొకరు దానిం జూచి యావంకర నట్లేయుండ

వలయునేమో యని తలఁచి దానిని మఱికొంత స్ఫుటముగాఁజేసి వ్రాయుటలో మీఁదిబొట్టునుఁ గలియఁగా నది 'జ' కారమునకు కంఠస్థానమందుండు కొమ్ము '౨' వలె నేర్పడి యుండ నప్పటినుండి యందఱు వ్రాతలలోను నట్లే పడియుండవచ్చును. దీనింజూచి యప్పకవి 'జ్ఞ' సంయోగములోని మీఁది యక్షరమును తాలవ్య 'జ' కారముగా భావించి యప్పకవీయము 3 ఆశ్వాసము 191 "సీ" విజ్ఞానమునకు - అను దీనిలో సంస్కృతవ్యవహార మధ్యావసానంబుల ద్వితీయసరళమునకు"అని సరళమును కల్పించి తాలవ్యకంఠ్యములకు విశ్రమము నంగీకరించు కొని దానికి తద్భవవ్యాజవిశ్రమ మని యొకవ్యాజమును కల్పించి లక్షణమును జెప్పినాడు. ఓహో వ్యాజమెన్నికల్పనలనైనఁ జేయించునుగదా? వ్యాజవిశ్రమ మనుటకంటె విశ్రమవ్యాజ మన్న మేలేమో? పూర్వకాలమున "జ్ఞ" కార మిట్లె వ్రాతలలోఁగూడ నుండియుండును. "ర్వ" దీనినే "వ్ర" ఇట్లును వ్రాయుచున్నారు. ఉచ్చారణముమాత్రము సరిగానేయున్నది. "జ్ఞ"ను అట్లే వ్రాతలో వ్యత్యాసము నొంది యుండును.

# స్వాలకస్మృతి

## బండారు తమ్మయ్యగారు

అన్నా! యీశ్వర! యెంతచేసితివి ♦ శైవాచారసద్భక్తి సం
పన్నున్ శ్రీకరణార్థివంశకరు న♦మ్మన్నాఖ్యు, మత్సాన్యులకున్
గ్రన్నన్ ముప్పదిరేండ్లు నిండని యెల♦ప్రాయంబునన్ మ్రింగితే
యన్నా! నీజఠరాగ్ని యింకయినఁ జ♦ల్లారంగదా దీనితోన్.

తే. కరుణ యేకాలమందును ♦ గానరాక, నిలువునను జాలిగుండెవై ♦ నీవు మిగుల
నలరుటనె పో శిలారూప♦ములను నిన్ను, నర్విజను లెల్లఁ బూజించు♦చుందు రభవ.

సీ. హరికథాకథన చా♦తురియందు నీయంత, వాఁడు లేఁడను కీర్తి ♦ వడసినావు
కర్ణపేయంబైన ♦ గానమాధురిచేత, నెల్లర మదుల హ♦రించినావు
కోరినగ్రంథాళిఁ ♦ గూర్చుచు నాదు భా,షాక్రమంబునఁ దోడు ♦ సలిపినావు
శ్రీనాథకవిగుణ ♦ శీలముల్ గీర్తింపఁ, గోర్కె మైననుఁ బురి♦కొల్పినావు
గీ. ఇట్టి నీగుణగణముల ♦ నెల్ల స్వప్న,వార్తలుగఁ జేసి శరణార్థి ♦ వంశచంద్ర
అమ్మనాఖ్య! నన్నీవియో ♦ గాబ్ధిముంచి, ముప్పదవయేట శతవర్ష♦పూర్తిఁ గంటె!

సీ. కాశినాథునివంశ ♦ కలశాబ్ధిచంద్రుండు, నాగేశరాయఁ డ♦నంతగుణుఁడు
పరమభక్తినిసోము ♦ బసవపురాణంపుఁ, బరిశుద్ధముద్రణ♦కరణమునకుఁ
దివిరి వసెడివార్తఁ ♦ దెలిపినంతనె పూర్వ, ముద్రితప్రతి నొండు ♦ మోద మలరఁ
బంపి శీఘ్రమె తాళ♦పత్రప్రతులఁగూడఁ, బడసి పంపెద నంచు ♦ వ్రాసినాఁడ
తే. వకట! యామాట జరుపకే ♦ యన్నృతవాది, వై మఱిపదిదినాలకే ♦ యస్తమించి
తౌర! యాగ్రంథమును జూచి♦యలరునంత, వఱకయిన నుండఁడాయె నిన్ ♦బసవఁడైన.

చ. అరసి యలభ్యకావ్యనిచ♦యంబులఁ గూర్ప నిజామురాష్ట్రసం
చరణము నాతికాలమున ♦ సల్పఁగ నెంచితి మింతలోనె నిన్
హరణ మొనర్చె నే విధి మ♦దాశయముల్ విఫలంబు సేసి; స
త్కరణము లెన్న విఘ్నకలి♦తంబు లటున్న బుధోక్తి తప్పునే.

తే. నీవు వసియించుకతమున ♦ నిడదవోలు, నిశుదయా మందంబును నాకు ♦ నించుచుండె
నట్టిశే నేఁడు నిన్నుఁ బొట్టఁ ♦ బెట్టుకొనుటఁ, గాలుప్రోలయి తోఁచి శో♦కంబు నించె.
తే. కలనుఁ దైవము గరుణాత్మ♦కలితుఁడైనఁ, నొక్కడే గాక మఱి వేలు ♦ దిక్కు లేమి
సత్యయానందమును నీదు♦నాత్మ కెపుడు ఘటనసేయఁగఁ గొలుతు శం♦కరుని శివుని.

# భిషగ్వరుఁడు

## నారాయణం కేశవాచార్యులు గారు

ఎల్లదేశములందును ఎల్లకాలములందును వైద్యవృత్తి మిక్కిలి గౌరవమైనది. "వైద్యో నారాయణో హరిః" అను నార్యోక్తి ననుసరించి 'భిషగ్వరుని' విజ్ఞానముయొక్క తరతమాదిభేదముతో 'సోఁకి' బనిలేదు. రాజులకు వైద్యముఁజేయు వైద్యులును గలరు. కుగ్రామములలో వైద్యముజేయు వైద్యులును గలరు. శ్రీమహారాజులచే వారల ఆస్థానమునందుండు రాజవైద్యు లెట్లు గౌరవింపబడుదురో, అటులనే కుగ్రామములో వైద్యముజేయు వైద్యులును చికిత్సఁబొందు రోగులచే గౌరవింపబడుదురు. కనుక వైద్యవృత్తి సదా గౌరవ భాజనమై యున్నది. రోగులలో కొందఱికి వైద్యులయందు మిక్కిలి నమ్మకమును, కొందరికి భయమును కొందరికి భక్తియు గలిగియుండుట లోకవిదితము. కావుననే, వైద్యులపలుకులకు ప్రజలు వ్యతిరేకులు కాజాలరు. ఇందుకు తార్కాణముగ 'భిషగ్వరుఁడు' చికిత్సయందు పొందు కొన్ని ఫలములు తెలియుచున్నవి.

శ్లో. క్వచిదర్థః క్వచిన్మైత్రీ క్వచిద్ధర్మః క్వచిద్యశః,
కర్మాభ్యాసః క్వచిచ్చేతి చికిత్సా నాస్తి నిష్ఫలా.
భిషగ్భూషణే ౧ అధ్యాయః.

మఱియును వైద్యులు మంచిజ్ఞానవంతులైనచో ప్రజలను సరియైన మార్గమున నడిపింపఁగల శక్తిగలవారగుదురు. వైద్యపదమున కర్థమేమి? 'విద్' అనగా తెలిసికొనుట తెలిసికొనినవారు వైద్యులు అని అర్థము దేలుచున్నది. కాన అట్టి 'వైద్యుని' యందు రోగికి మంచినమ్మకమును గౌరవము (మర్యాద) నుండినచో, వారోగి సిద్ధిఁజెందును.

శ్లో. ఏతాన్నోపచరేద్వైద్యో బహూన్దోషా నవాప్నుయాత్.
న స సిద్ధ్యతి వైద్యస్తు గృహే యస్య నపూజ్యతే.

రాబోవునది ప్రజాయత్తమగు చక్కని పరిపాలనము. 'భిషగ్వరులలో, నైకమత్యముండి సోదరభావముతోఁ బనిజేసినచో తమకును సంఘమునకును దేశమునకును ఎంతటి ఘనకార్యమునైన జేకూర్పగలరు.

కనుక వైద్యవృత్తి నవలంబించు ప్రతిభిషగ్వరుఁడును తనచే చికిత్సపొందు 'రోగుల' యొక్క బాధలను మాత్రము తొలగించుటయే గాక బీదలగు రోగులయొక్క బాధలనుగూడ తొలగించి వారియందు ద్రవ్యాపేక్షఁ బెట్టుకొనక ప్రేమపూర్వకముగ బనిచేసినచో ఇహపర సౌఖ్యములు బడయఁగలరు.

పూర్వమునుండియు మనదేశమునందన్ని శాస్త్రములకన్నను ఎక్కువగా మూలఁబడిపోవుచున్నది ఆయుర్వేదము. ప్రకృతమున కొంత కాలమునుండియు ఆయుర్వేదాభిమానులు కొందఱు మాత్రము దాని నుద్ధరింపఁ బూనుకొనుచున్నను- పాశ్చాత్యవైద్యముకన్న వెయ్యిరెట్లధిక గుణ మొసగుశక్తి మన ఆయుర్వేదీయౌషధములయందు గాన్పించుచున్నను- దీర్ఘకాలమునుండియు మన ఔషధముల ప్రభావము తెలిసికొనజాలక పాశ్చాత్యవైద్య డాంబికములచే జనసామాన్యమునకు మన ఆయుర్వేదమునందలి గౌరవము తగ్గినది. గతంబేమన-

"క. ఏదేశపు మానవులకు
నాదేశపు మందె తప్ప నన్యము హితమిం
కేదియుఁ గాదను నాయు
ర్వేదము వచనమున మనసుఁ బెట్టు కుమారా!"

కనుక ప్రజలను 'ఆరోగ్యభాగ్యుల'ను జేయుట 'భిషగ్వరుని విధియైనచో' వారందఱికిని 'భిషగ్వరుఁడు వారి జీవితమం దంతయు మఱువరాని మేలుజేసిన వాఁ డగుటకు సందేహమేమి? ఆకారణమును బట్టియే "దేశము నాగరకతఁ జెందుచుండిన కొలఁదిని' భిషగ్వరుఁడు శుక్లపక్షచంద్రునిపగిది దినదినాభివృద్ధిని గాంచు"నని గ్లాడ్‌స్టన్ అను ఒక పాశ్చాత్యమహనీయుఁడు జెప్పియున్నాఁడు.

ప్రజలకు వైద్యవిద్య నభ్యసించు కుతూహలము లేకుండుటచే, సంఘాభివృద్ధికి భంగకరములగు దురాచారములు నెలకొనుచున్నవి. కావున ప్రజలకు ముఖ్యముగ వైద్యజ్ఞానమును ప్రజ్వలింపజేయు విద్య నభ్యసింప వీలగు సదుపాయములు కలిగింప శాసననిర్మాణసభ్యులు ముఖ్యముగ యోచింపవలయును. అందులకు ప్రభుత్వమువారును చేయూత నొసంగవలయును.

గతవత్సరము ప్రభుత్వమువారు 'దేశీయవైద్యవిధానమును నభివృద్ధిజేయుటకు నియమించిన సంఘమువారు వారినివేదికను తయారు గావించుటలో దేశీయవైద్యు లందఱికి నెంతటి మహోపకార మొసగ దరో జూడవలసియున్నది.

అయితే దేశీయ వైద్యవిధానసంఘ కార్యదర్శిగారగు డాక్టరు శ్రీనివాసమూర్తి బి.ఏ.బి.యల్.ఎం.బి.సి.యంగారు తయారుగావించిన నివేదిక ప్రభుత్వమువా రామోదించినచో పాశ్చాత్యవైద్యమువలె ఆయుర్వేదవైద్యమునకును ఔన్నత్యము కలుగునని వదంతిగ నున్నది. అది యునుంగాక మదరాసునందొక ఆదర్శకళాశాల నొకటి ప్రభుత్వమువారు నెలకొల్పవలయు ననియు నందులకు ప్రభుత్వమువారు వత్సరమునకు ఒకలక్ష యేబదివేల రూప్యములను గ్రాంటు నివ్వవలయుననియుఁగూడ వారి నివేదికయందు వ్రాసియున్నారు కనుక ఆయుర్వేదమునకు జయమో అపజయమో బడ్జెటుతీర్మానమపుడు స్పష్టమగును.

ఇక గిల్బర్టు స్లేటరుగారు గతవత్సరం మదరాసు శాసననిర్మాణ సభలో, ఉపపాదించిన తీర్మానము సభ్యులచే నేకగ్రీవముగ ఆమోదింపబడినది. ఆ తీర్మానము ననుసరించి ఆయుర్వేద వైద్యులకు తగు సౌకర్య మొసంగుట- బిరుదముల నిచ్చుట- దేశీయవైద్య విధానము నభివృద్ధిపరచుట- దేశీయవైద్యులకు ప్రత్యేకముగ శాసననిర్మాణసభలలో కొన్ని స్థానము లొసంగుట మొదలగునవి గావించి దేశీయవైద్యులకు ప్రభుత్వమువారు తప్పక ప్రోత్సాహ మొసంగవలయునని ఘంటాపథముగ జెప్పిన డాక్టరు గిల్బర్టు స్లేటరుగారు ప్రశంసార్హులు. డాక్టరుగారు మన దేశీయులు కాకున్నను, ఆయుర్వేదమునం దాదరణలేని మనసభ్యులవలె గాక, మిక్కిలి ప్రశంసార్హముగ ప్రవర్తించినందులకు వంద్యులు. ఈవిషయమునందు మన దేశోద్ధారకులగు మనమంత్రిపుంగవులయొక్క ఆదరణ ఆయుర్వేదమునం దేరీతిగ నుండునో, తెలిసికొను సమయము సమీపించుచున్నది.

ఏది యెట్లున్నను సాధారణముగ ఆయుర్వేద వైద్యవిద్య వృద్ధికి రాకుండుటకు కొన్ని కారణములు గలవు. అవియెవ్వియన ఎల్లప్పుడును "భిషగ్వరుఁడు వైద్యవృత్తియందె తన బుద్ధిని వినియోగించును గాని వైద్యవిద్యాభివృద్ధికి కావలయుమార్గములు అతనికి కాన్పింపవు. కావున, సజ్జనులగు సర్వజనులందరు వైద్యవిద్యనభ్యసించువిధానము మనసంఘ సౌఖ్యనిర్మాణమునకు ప్రథమసోపానమని ముమ్మాటికి జ్ఞాపకముంచుకొని, జేసిన వారమగుదుము.

# బమ్మెర పోతరాజస్మృతి

తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు

శ్రీమద్బమ్మెర పోతనార్యా! యశ। స్సీమంతినీ కామ! శ్రీ
రామస్వామి పదారవింద భజనా। ప్రహ్లాద! రాజద్గుణో
ద్దామా! కేసన పుత్ర! ధీర సుకవీం। ద్రా! దివ్యచారిత్ర! నీ
సామర్థ్యం బెఱింగింప నల్వకయినన్। శక్యంబె ముమ్మాటికిన్.

మ. బళిరే! నీపదకోమలత్వమును నీ। పాండిత్యమున్ నీ విని
ర్మల నారాయణపాదభక్తియును నీ। మాధుర్య పాకంబు నీ
లలితంబైన పదప్రయోగము రసా। లంకారచాతుర్యమున్
దలఁపన్ వేఱొక సత్కవీంద్రునకు ల। బ్ధంబౌనె? నిక్కంబుగన్.

సీ. ఘనపండితోత్తము ల్గని మెచ్చి శీర్షంబు లూఁచుచందంబున। నొక్కచోట
సత్కవిప్రకరంబుఁ। జదివి సెబా సంచు నుల్లాసపడురీతి। నొక్కచోట
పౌరాణికశ్రేణి। పరికించి యిది పురాణోత్తమం బనునట్లు। లొక్కచోట
భక్తాగ్రగణ్యులు। బఠియించి హరిభక్తి జిక్కి చొక్కెడు। లీల నొక్కచోట
గీ. నాంధ్రదేశీయులెల్ల రా। హాయనంగ, భాగవతసత్పురాణంబు। భవ్యశయ్యఁ
దెనుగుఁజేసిన నిన్నుఁ గీ। ర్తింపఁ దరమె? బుధనుతివిరాజ! బమ్మెర। పోతరాజ.

ఉ. నన్నయ తిక్కనాది కవి। నాథు లనేకులు సంస్కృతంబునం
దున్న పురాణరాజముల। నొప్పుగ వ్రాసిరి తెన్గుబాసయం
దెన్నఁగ నాంధ్రభాగవత। మీవు రచించితి వాపురాణముల్
విన్నను వైన మీ మృదుక। విత్వవిధేయత జూపకుండునే?

సీ. పాఱుఁబోతునకైనఁ । బౌరుషం బొదవు నీ, సంగ్రామవర్ణనల్ । జదువుచున్న
రహి నపుంసకుఁడైన । రమణులఁ గోరు నీ శృంగారవర్ణనల్ । జేరివిన్న
గటికివానికినైనఁ । గఱఁగుఁ జిత్తంబు నీ కరుణారసార్ద్రిస । త్కథలఁ గన్న
నజ్ఞానియైన ది । వ్యజ్ఞానరాశియై, పొదలు యుష్మద్భక్తి । బోధ నెన్న
గీ. క్షితి భవద్విరచిత భాగ । వతపురాణ, రత్నమున కెద్దిసాటి పు । రాణకోటి
మాన్యచారిత్ర! కేసన । మంత్రిపుత్ర! సద్యశస్సాంద్ర! పోతరా । సత్కవీంద్ర!

సీ. అనఘ! నీకావ్యక । న్యామోహితాత్ములై, నీ చెంత కరుదెంచి । నిఖిలనృపులు
షడ్రసోపేత భో । జనముఁ బెట్టెద మన్న, గూడ దంచుంబలి । గ్రోలినావు
పసిడిమేడలలోన । వసియింపుఁ డీ రన్న, నెప్పక పాకలో । నుండినావు
పట్టుపుట్టంబులఁ । గట్టఁబెట్టెద మన్న, గాదని పేలిక । గట్టినావు
గీ. యెన్ని శుల్కంబు లొసఁగెద । మన్న నీ చ, మానవున కిచ్చెదనె నాదు । మాన నీయ
కావ్యకన్య నటంచు సత్కృతుల గోరి, చెలగి శ్రీరామమూర్తి కి । చ్చితివి బళిరె!

చ. వినుతకవీంద్ర! కొంద ఱవి । వేకులు గాకవు లందునం డలా
తుణికుఁ డటంచు మిమ్ములనుఁ । జాటిరి ధానఁ గొఱంతగల్గునే!
ఘనతర గంధసింధురము । గ్రామమునం బయనం బొనర్చుచో
శునకము లన్నియున్ మొఱుఁగు । చో గజరాజున కేమి లోటగున్?

సీ. పాపనాశన మిహా । పరసౌఖ్యదము, భాగవతపురాణంబు భ । వద్రచితము
నీయిష్టదైవంబు । నిఖిలేశ్వరుం డగు, రఘుకులాభరణుండు । రామమూర్తి
మదినెంచ నీబావ । మఱంది సర్వకళాస, నాథుఁడై వెలయు శ్రీ । నాథసుకవి
కవిశిరోమణి యనం । గణుతికెక్కినయట్టి, మల్లన్న నీకు కు । మారకుండు
గీ. బళిరె నీవంటి సత్కవి । ప్రవరు గన్న, యాంధ్రమాత యదృష్ట మే । మనఁగవచ్చు
వసుధ నేతల్లి గాంచె నీ । వంటి కొమరు, భూరిగుణధుర్య బమ్మెర । పోతనార్య!

సీ. ఆంధ్రకవిశ్రేష్ఠు । లందఱు ని న్గవి, సార్వభౌముఁడ వంచు । సన్నుతింప
వ్యాకరణాచార్య లోకచూడామణి, వని తత్కళావిదుల్ । వినుతిఁజేయ
తర్కశాస్త్రజ్ఞులు । తార్కికోత్తముఁ డవ, టంచు నిన్నెంతయు । నభినుతించ
స్థిరభక్తి వేదాంత । జిజ్ఞాసువులు మహా, వేదాంతివని నిన్ను । వేడుచుండ
గీ. పరమ భక్తుఁడవని భక్త । వరులు గొల్వ, జగతి హాలికవృత్తి స్వా । చ్ఛందజీవ
నం బొనర్చిన నిను వర్ణనం బొనర్పఁ, బుడమి నెవఁడోపు బమ్మెర । పోతరాజ!

# మానవవిధి

## కావ్యనిధి చెలికాని లచ్చారావు గారు

ప్రాపంచికసృష్టి యంతయుఁ జరాచరాత్మకంబు లయిన జీవనిర్జీవప్రతిమలతో ద్వివిధంబై యొప్పుచున్నది. అందుఁ దరుపాషాణాద్యచేతనపదార్థములు నిర్జీవము లనియు, పశుపక్ష్యాది మానవప్రభృతులు సచేతనములు జీవపదార్థము లనియుఁ జెప్పంబడుచున్నయవి. ఏతాదృశసమవాయములో నెల్ల మానవుఁ డధికతముఁడయి ప్రాదుర్భవించుచున్నాఁడు. తా నట్లు ప్రాదుర్భవించియు మృత్యుదంష్ట్రాపదంశము కాకుండ నుండనోపఁడు. 'జాతస్య మరణం ధ్రువం' ప్రపంచకమునందు బొడమెడి జీవరాశి యంతయు నెప్పుడో యొకప్పుడు నశించుట స్వాభావికమై యున్నయది. అట్లయినను, మనుజుఁడుమాత్రము తనజీవితకాలములో స్వాత్మేతరప్రాణికోటికంటె నత్యధికం బగు జ్ఞానసంపదచే నవాచ్యసౌఖ్య మనుభవించుచు నిత్యానందుఁడై వఱలఁగలఁడు. మానవునియందు జ్ఞానాధికతావిశేష మొకటి కానంబడుచున్నది. తాదృశహేతుమూలముననే "దుర్లభో మానుషో దేహః దేహినాం క్షణభంగురః, తత్రాపి దుర్లభం మన్యే వైకుంఠప్రియదర్శనః" అని మానవజన్మంబే జీవన్ముక్తికి సాధనభూత మని యుద్ఘోషింపఁబడుచున్నది. ప్రాపంచకమున పిపీలికాదిబ్రహ్మపర్యంతము గల జీవకోటియేగాక 'యద్దృశ్యం తన్నశ్య' మని గుర్తెఱుంగనోపు. మానవుఁడు స్వకృతపుణ్యపాపఫలంబులం బట్టియే స్వేతరరూపంబు పొందునటులు జడపదార్థములు గూడ వినిమయము లగుచుండుట లేదా? చూడుఁడు — జల మావిరిగాను, అగ్ని బొగ్గుపులుసుగాలిగాను మాఱుచుండుట మనకుఁ బ్రత్యక్షప్రమాణంబై యున్నది. మానవుఁడు మృతిఁ బొందిన పదపడి నిజసుకృతదుష్కృతములమూలముననే స్వర్గనారకసుఖదుఃఖంబుల నందుచున్నాఁడు. మఱియు నిహలోకంబున సౌఖ్యసంపదలతోఁ దులఁదూఁగువారు పుణ్యులుగను, పంగ్వంధబధిరమూకాది దుర్గుణోపేతులై కఠోరదారిద్ర్యాదినీచదశల నందువారు పాపిష్ఠులుగా నగుదు రని పరిగణింపఁబడుచుండుట మనకు ప్రత్యక్షదృష్టమై యున్నది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులచే నవఁగా, త్వక్చక్షుః, శ్రోత్ర జిహ్వాఘ్రాణంబు లనెడు జ్ఞానేంద్రియములచేఁ దెలిసికొనఁబడు ప్రత్యక్షప్రమాణంబులకు భౌతికశాస్త్రం బనియు, నింద్రియముల కగోచరంబై యనుమానాస్పదమై ప్రత్యక్షప్రమాణములకు లోఁగని జీవాత్మపరమాత్మస్వర్గనరకాదుల బోధించు శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాదులకును, యుక్తి, యాప్తవాక్యము మొదలగువాని మిగుల నాదరించువానికి నాధ్యాత్మికశాస్త్రంబు లని పేరిడిరి. ఈయది "బ్రహ్మ సత్యం జగ న్మిథ్య, సర్వం కల్పితం బ్రహ్మ" యని పరమార్థమును బోధించుచున్నయది. లోకమంతయు నీపరోక్షాపరోక్షద్వివిధసిద్ధాంతములచే నిండియున్నది. ప్రతిపదార్థము ప్రత్యక్షానుభవంబు చేయుట దుర్లభము. యుక్తిచేతను శాస్త్రప్రమాణాదులచేతనుగూడ గమనింపవలసినదై యుండు. కేవలము 'తాఁ బట్టినకుందేటికి మూడే కాళ్లను వితండవాదము తగదు. "పర్వతో వహ్నిమాన్" కుతః "యత్ర ధూమ స్తత్రాగ్నిః" పొగ యున్నతావున నగ్ని కల దని విశ్వసించులాగున, రాజానుమతిం బట్టి శాస్త్ర(లా)విధి చొప్పున, కృతప్రమాదునకు శిక్ష విధింపఁబడుచున్నది. నాకు శిక్ష విధించినరా జెక్కడ? శాస్త్రకారుఁ డెవఁడు? కనఁబడుపుఁడు. నేను వారలతో వాదించెదనఁ జెల్లునా? ఎన్నో వత్సరముల క్రిందట గతించినవార లిప్పుడు దర్శనీయులా? విశ్వసింపవలయును. లోకము సముద్ధరింపవలెను. భౌతికశాస్త్రశోధనము లన్నియు నింద్రియగోచరంబులు. ఆధ్యాత్మికశాస్త్రబోధన లనుమానంబులు అతీంద్రియములునై యున్నయవి. పాశ్చాత్యులు భౌతికము నెక్కుడాధారముగాఁ గైకొనుచున్నారు. వారు ప్రతిక్షణము విలువగలదిగా భావించుచున్నారు. తాత్కాలికసౌఖ్యంబు లపేక్షించుచున్నారు. అనంతసౌఖ్యమునందు లక్ష్య మదృశ్యము. హిందువు లనంతసౌఖ్యప్రాప్తికై వెదకుదురు. తాత్కాలికసౌఖ్యమునందు వారికి శ్రద్ధ తక్కువ. వారు కాలము క్షణికం బని యెప్పటికప్పుడే నిర్వర్తింతురు. మఱియు భవితవ్యము కాకమానదు. సర్వము దైవమే యని పారమార్థికచింతతోఁ గాలము గడపుచుందురు. ఈ విషయమును గ్రహించియే వివేకానందస్వామి భారతీయులు భౌతికాధిక్యమునను పాశ్చాత్యులు ఆత్మీయవిజృంభణయందును శిక్షితు లగుచోఁ బ్రపంచకమున కెంతయేని మేలు కలిగియుండు నని నుడివియుండె; నిట్టి పరస్పరగుణగ్రహణంబున నూతననిర్మాణంబు లేర్పడి లోకకల్యాణంబున కెంతయుఁ దోడ్పడునుగదా. పాశ్చాత్యులు నైజశక్తివిభవము చూచికొని మురియుచు గర్వోపేతులై తాత్కాలికసుఖాయత్తులై పరఁగుచుండిరి. కాని, యగ్రదృష్టియం దాసక్తి చూపుట లేదు. ఇతరులబుద్ధివైభవమును జూడక నిజశక్తియుక్తులపై నాధారపడి యాత్మబుద్ధికభేదంబును దేశానర్థకము నగుయుద్ధప్రభృతి మారణోపాయంబులం దుపయోగించుచుండిరి. తదీయదృక్పథ మిట్టిసంకుచితబుద్ధులకుఁ బ్రాభవ మగుచుండెను. నేఁటికి జర్మనీసమరాదులవలన నేతదనర్థముల గ్రహింపఁజొచ్చిరి. మహాకవి రవీంద్రనాథుని, శాస్త్రజ్ఞుఁడగు జగదీశచంద్రుని గౌరవింప మొదలిడిరి. జర్మనీదేశము హిందువుల గౌరవించుచున్నది. అమెరికా భారతీయులమానసశాస్త్రమున కర్హత నొసంగుచున్నది. ఇంత యేల? పాశ్చాత్యులు ఆధ్యాత్మికసంపదఁ జూచి యచ్చెరువు నొందుచున్నారు. ప్రాచ్య పశ్చిమదేశీయుల పరస్పరాక్షేపణములందుఁ బ్రాచ్యుల భౌతికవైరాగ్యమువలనఁ బ్రాచ్యులను పాశ్చాత్యుల కర్మయోగపాండిత్యమువలన పాశ్చాత్యులును తమతమ యుత్కృష్టతను దెల్పుకొనుచున్నారు.

పరోక్షమున భారతీయవైరాగ్యమునకుఁ దగిన ప్రతిఫల మేది కలదో వక్కాణింప బలవన్నిదర్శనములు కన్పట్టవు. పశ్చిమవాసులకు భౌతిక విజ్ఞానఫలము ప్రత్యక్షముగాఁ గానఁబడుచున్నది.

అంతమాత్రమున భిన్న గాదు. హిందువులధర్మబలము గానను వారిది పశుబలము గాను పరిగణింపఁబడుచున్నది. ఈ రెంటికిని భౌతికాధ్యాత్మికములు, జీవుఁడు కలఁడని యొకటి, సర్వేంద్రియవ్యాపారములే జీవుఁడని మఱియొకటియుఁ గలవు. ఉభయంబునందు భేదభావ మున్నప్పటికి నవినాభావసంబంధము కలదు ఈ యుభయము సృష్టి స్థితి లయ కారణంబులకుఁ గారణభూతం బగు నొండొకమహాశక్తి కల దనియు సద్దానిచే నీలోకము ప్రతిపాదింపఁబడుచున్న దనియు నంగీకరింపఁబడుచున్నది. ఏది లేకున్నను లోకము నిలుచుట దుస్తరంబే. దేవుఁడు లేఁడనిన, పాలకుఁడు లేనిరాజ్యమువలె శిక్షాభీతి లేమింజేసి యరాజకంబై దుష్కృతప్రావృతంబై లయమందు, కలఁడన్నమాత్రమున, ప్రమాదము లేదు. పైశిక్షకుఁ డొకఁడు కలఁడనఁ బ్రపంచకమెల్ల భయభక్తులతో నుండుట గాక మానవులు పొందవలసిన సౌఖ్యసంపదలఁ బొందుదురు. కావునఁ బారమార్థికచింత ముఖ్యవిధియై యున్నది. ఈజీవరాశియంతటిలోను మానవునియందు వాక్కు మేధావిశేషత, పరిశీలనాశక్తి, స్వాతంత్ర్యము మొదలగు గుణరాజంబులు పెక్కు లుండుటంజేసి మానవజీవితము సౌఖ్యప్రదముగాఁ జేసికొనుట కనువగుచున్నది. ఈ సాధనసంపత్తి యుండుటచేత నీజన్మంబు సర్వోత్కృష్టంబుగా శ్లాఘింపఁబడుచున్నది.

“పునర్విత్తం పునర్మిత్రం పునర్దారా పునర్మహీ, సర్వేషాం పునరావృత్తి ర్నశరీరం పునః పునః” లోకంబున నేదియైన సాధింప నలవడును గాని మానవదేహముమాత్ర మట్లలవడదు. “దుర్లభో మానుషో దేహః దేహినాం క్షణభంగురః” మానవశరీర మతిదుర్లభ మైనను జీవుఁడు క్షణభంగురుఁ డని చెప్పఁబడుచున్నది. కాఁబట్టి మానవునియందు నావిర్భూతమైయున్న దివ్యశక్తులఁ బ్రజ్వలింపఁజేసి నిత్యానిత్యవస్తువివేకంబు కలిగి మానవజన్మమందే పరమానందపదవి నొందు సాధనం బాలోచించి కృతార్థత జెందవలయు. మఱియు మానవుఁడే యిహలోకంబున కాధారభూతుం డని యెఱింగి యుషఃకాలమున నే యుత్థితుఁ డైనవెంబడి ప్రతిమానవుఁడు దైనందినమును లోకమువిషయమై తాఁ బాటుపడి యొనర్చు పరోపకారాదిమహాకృత్యంబులఁ బరిగణించుచు దినచర్యలను లిఖించుట ముఖ్యకర్తవ్య మని యెఱుంగనగు.

తన్నుఁ దాఁ దెలిసికొని లోకంబునకుఁ దనకు నుండెడిసంబంధము గ్రహించి మసలవలయు. మానవునియందు వివిధరూపములైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది మాయాశక్తులును శమ, ద, మోపరతి, తితిక్షా, శ్రద్ధా సమాధానాది గుణశక్తులును గలవు. వీనిలో నొండొంటికిఁ బరస్పరమైత్రి కల్ల. మానవుఁడు స్వాత్మబుద్ధివిశేషముచేత నీయింద్రియంబులకెల్ల నధికారి యయినమనస్సును లోఁబఱచుకొనవలయును. మానవుఁ డేకర్మ మొనరించినను బరిశుద్ధమయినదిగాను సద్భావనఁ దనకును లోకమునకును శ్రేయ మొసగూడునదిగాను కనుఁగొనుచుండవలయును. తాత్కాలికసుఖప్రాప్తికై మనస్సును బోనిచ్చిన నొకప్పుడు సౌఖ్య మలవడినను పెక్కనర్థంబులకుఁ దావలం బగును. స్వార్థత్యాగబుద్ధితో సంచరించువాఁ డుత్తముఁ డనఁబరఁగు. లోకత్రయవంద్య మగుభగవత్ప్రేమకుఁ బాత్రుఁ డగును. మంచిని సంపాదించుట సామాన్యపశుధర్మ మనియు మంచితనమే స్వభావముగాఁ గలిగియుండుట యుత్కృష్టగుణం బనియుఁ ‘మిల్టన్’ మహానీయుఁడు నుడివియున్నాఁడు. మానవునిశక్తి ‘నిజేచ్ఛ’ పారమార్థికచింత యంతయు భగవదనుగ్రహమునకు నాతనిదరిఁ జేరవలె నని దృఢసంకల్పము కలిగనేని మానవునివిశ్వాసము నిబిడీకృతమై ధీరత నంది భౌతికప్రపంచకమును వదలి యాధ్యాత్మికప్రపంచకమున వ్యవహారముచేయుటకు మొదలిడు స్వాత్మికాహంకారాదిశత్రుగుణంబుల భస్మీపటలముచేసి మహారాజువలె సంచరించు. మాయలేనిపసిపిల్లవలె నిష్కలంకహృదయుండై నిత్యసంతోషియై ఘోరారణ్యమధ్యమున భయంకరములైన ప్రతిధ్వనులకు జంకక మసలు కేసరికిశోరమువలె నడయాడును. ఎట్టి మాలిన్యము చేనైన నశుచి వడయక బంధింపఁబడక స్వేచ్ఛగా విహరించుమలయమారుతమువలె నిర్మలమైనమనస్సు కలిగియుండు. పంకిలకలితంబగు కమలంబువోలె నిజహృదయము మాలిన్యము అంటక నిశ్చలమై పరిశుభ్రమై వికసించు ఇట్టిమానవులే తమగమ్యస్థానం బగుపరంధామునిఁ జేరఁగలరు. ఇట్టిమానవులే యాత్మపరిశుద్ధులై లోకపూజ్యులై యిహపరసౌఖ్యానందపరవశులై వర్ధిల్లి నిత్యానందసౌఖ్యంబు గాంచుచుఁ బ్రవర్ధిల్లుచుందురు. సద్విద్యాగోష్ఠి, సజ్జనసాంగత్యము, పారమార్థికచింత, స్వార్థత్యాగము, జితేంద్రియత్వము, సర్వసోదరభావత్వము, అహింస, సముచితభాషణము, సత్యము, పితృ, మాతృ, గురుదైవభక్త్యాదులు కలిగి వర్తించువాఁడే ధన్యుఁడు. మఱియు మానవుని కుండవలసిన విధ్యుక్తధర్మములను గ్రహించి శ్రుతిస్మృత్యాదులయందు విధించినరీతిఁ గర్తవ్యాకర్తవ్యముల నెఱింగి యనుభవస్థులనుండి గ్రహించి తదుక్తరీతిని స్వశక్త్యనుసరణంబుగ కర్మల నాచరింపవలయు. కర్తవ్యంబులందుఁ బ్రవృత్తియు, నకర్తవ్యంబులందు నివృత్తియుఁ గలిగి వర్తింపవలయు. ప్రవృత్తికి ధర్మశాస్త్రము, నివృత్తికి వేదాంతశాస్త్రము ముఖ్యములు. ప్రవృత్తికి రాగము, నివృత్తికి ద్వేషము నిమిత్తంబులు. మఱియు సదాచారమువలన బాహ్యశుద్ధియుఁ బరమేశ్వరప్రీతికరమైన సత్కర్మానుష్ఠానమువలన చిత్తశుద్ధియుఁ గలుగఁజేసికొనవలయు. ఇందు కర్మలు అనియతఫలకంబులు (ధర్మార్థకామములను గోరుబుద్ధితో నాచరించునవి) అని ద్వివిధంబు. నిషిద్ధకర్మంబులు పాపచర్యలు త్యజింపవలయు. పరస్త్రీపరధనాపహరణము దుర్వ్యసనాసక్తియు దుస్సంసర్గము కన్యావరశుల్కంబులు మొదలుగాఁగల దుష్కార్యంబులనుఁ బరిత్యజింపవలయును.

ధర్మవిరుద్ధమైన ధనార్జనమును అర్థవిరుద్ధ మగు ధర్మమును ధర్మార్థవిరుద్ధమైనకామమును జేయదగదని చెప్పఁబడుచున్నది. మాతృ పితృ గురు దైవభక్తులు గలిగి సత్య, జ్ఞాన ఆర్జవ, సమత్వ, సంతోష, శౌచ, దాన, ఉత్సాహ, సాధుసంగ, ఆస్తికత్వ, దయా, ధర్మ, శాంతి, క్షమాది సద్గుణములు గలిగి దేశక్షేమ మెఱిఁగి స్వశక్త్యనుచితమైన త్యాగ

భోగములతో వర్తింపవలయును. మఱియు మానవుని సుఖదుఃఖములకును బంధమోక్షములకును మనస్సే ప్రధానకారణంబై యొప్పు. మనస్సు వ్యాకులితమై నిరుత్సాహ మైయున్న నెట్టికార్యంబునైనఁ జేయ నసమర్థుఁడై యుండు. అది యుత్సాహవంతమై యున్నప్పుడు ధైర్యంబుచేఁ బ్రజ్ఞగలిగి సకలకార్యంబు లొనరింప సమర్థుండై యుండు. ఉత్సాహంబున మనోబలంబు విజృంభించి యెంతెంతఘనకార్యంబులైన గోటిమీటునఁ జేయ నగును. శతయోజనాయతం బగుసముద్రంబును వాయునందనునిచేత లంఘింపఁజేసినది యుత్సాహబలంబని శ్రీమద్రామాయణంబున వినియుంటిమి గదా. మహారథుం డగుకర్ణుని రణరంగంబున మరణింపఁజేసినది శల్యసారథ్యనిరుత్సాహ మని మహాభారతంబువలనఁ దెలిసికొని యున్నాము గదా. ఉత్సాహ మింతంత బలవంత మైన దని చెప్ప నశక్యము గాన మనస్సు నుత్సాహప్రోత్సాహనిమగ్నతయం దుంచు జతనంబు సముచితము. అక్కాలంబునఁ నెంతధనసంపన్నుఁ డైనను మహారాజైనను మానసోల్లాసము గల పేదవానికంటె యథస్థితుఁడగుచున్నాఁడు. ఇఁక మనుజుని కన్ని విధముల దుర్బలత్వము కలుగఁజేయునది కోపంబు. ఇయ్యది మొట్టమొదట రజోగుణంబున నుద్భవించి తమోగుణమువలన వృద్ధిఁగాంచును. ఈకోపంబు క్రమక్రమంబుగా రోషంబుగాను, రోషంబు క్రోధంబుగాను, త్రివిధంబుగా మాఱును. ఇయ్యది ముదిరెనేని మనుజుండు కోపఘూర్ణితమానసుండై బంధుమిత్రుల, పండితపామరుల, సాధుసజ్జనుల, ఆలుబిడ్డల - పాపపుణ్యంబు లారయక వికృతాకృతిని గలిగించి మంచిచెడ్డ లరయనీక మిగుల దుర్భరవ్యథలపాలు చేయును.

కాన నిట్టి దుర్మరణ, దుర్మద, క్రోధ, వ్యాధి, ముదురకుండ తమ సత్త్వగుణౌషధంబుచే నిగ్రహింపఁజేయుట సుహృల్లక్షణంబు.

మనుజునకు లోకానుభవజ్ఞానము, ఆత్మజ్ఞానము అను రెండును నావశ్యకంబులై యున్నవి. ఇందు కేవలము పాత్తముల(?)వలనను, విద్వత్సహవాసమువలనను పరులనుండియుఁ దాను గ్రహించుజ్ఞానముకంటె లోకానుభవజ్ఞానము. ఇట్టిజ్ఞానమె మఱపునొందక కలకాలము నిలిచి లోకోపకారము మొదలగు నితరగుణములకు తోడ్పడును. వీనియొండొంటికి నవినాభావసంబంధము కలదు. సర్వేశ్వరుండు సృజించిన లోకంబునందు ప్రాణికోటి లన్నిటికన్న మనుజునకు బుద్ధివిశేషత యధికము. కావున మానవుఁడు వివేకపరిశీలనాదులచే యుక్తాయుక్తములను కార్యాకార్యములను బరిశీలించి యయుక్తము లగు కార్యములను బరిత్యజించి మెలంగుట విధియై యున్నది.

మనుజునియం దార్భవించియున్న బుద్ధిని విద్యావివేకాది లోకానుభవ ప్రభృత్యధికగుణసంపత్తిసాధనలచేఁ బ్రేరేపించి వికసింపఁజేసినకొలఁది నెంతెంత ఘనకార్యములనైనఁ జేయఁగలఁడు. నీటిమీఁద ఆవిరివలన ఓడలను భూతలమున బండ్లను నడుపుచున్నాఁడు. వాయుపథమున విమానములను తీఁగలేనివార్తలను నడపుచున్నాఁడు. ఇంతయేల? తుదకు ప్రాణంబులు సైతము పోయఁగలఁడు. మనుజునిబుద్ధి అతీతమైనది అని మనవారలే గాక పాశ్చాత్యతత్త్వజ్ఞులు నుడివియున్నారు. తదనుగుణముగా (లేత్సు) అను విధానమున ప్రాణములు పోయినట్లు వైద్యులు తలఁచినతరువాతఁగూడ మరల నూపిరి యాడునట్లు చేయు పద్ధతి జపానువా రన్నోయేండ్లనుండి యెఱింగి యున్నట్లును నద్దాని పాశ్చాత్యులలో ఎస్ ఎర్ మ్ గ్లక్లాను గారు వీరినుండి నేర్చికొని ప్రయోగించినట్లును, మనము వార్తాపత్రికలమూలమున తెలిసికొని యున్నాము. మఱియు బ్రేజిలుదేశపు యువజనుఁడును, శాస్త్రవేత్తయు నగు 'ఆక్టోవో ఫెలిక్సు ఫెడ్రో' అనునతఁ డొకవిధానము కనిపట్టి మసిబొగ్గువంటి కారునలుపు గల నీగ్రోలను తెలుపువారుగా మార్చివేయుచున్నాఁడుగదా. ఇన్ని గుణములు గలిగియు మనుజుఁడు లోకోపకారమును శక్తికొలఁదిఁ జేయవలయును నదియే జన్మమున కధికఫలము, పరమావధి యని తెలియఁదగును. ఇఁక వీనియన్నిటికన్న దేవుఁడు గలఁడనునమ్మిక ప్రధానంబు. ఇయ్యదియే యాస్తికత్వ మనఁబడు. మనుజుఁ డెయ్యదియేని కార్యంబు తలపెట్టినపుడు నద్దాని నెఱవేర్ప జతనంబు సలిపి సఫలమనోరథుఁ డైనపుడు అయ్యది న్యాయైక మైనదై, యది నెఱవేనిచో విచారము మనమునం దిడుకొని 'దైవము కలఁడా' యని దైవమును దూఱఁజనదు. కొన్ని కార్యంబు లప్రయత్నముగ సిద్ధించుటయుఁ గొన్ని యెంత ప్రయత్నించినను గాకపోవుటయుఁ జూడ నది ప్రాగ్భవవాసనాప్రతిబంధకములవలన లభింపనట్లును స్పష్ట మగుచున్నది. ఇఁక భగవంతునియెడల శంకింప ననవసరంబు గదా! పూర్వజన్మకృతపుణ్యపాపకర్మలంబట్టి యవి నడచుచుండును - మఱియు నీ శుభాశుభంబులు ప్రారబ్ధకర్మవలననే సంభవించు నని స్థిరపఱచుకొని యుపేక్షింపఁజనదు. స్వశక్త్యనుసరణముగ పౌరుషము (మానుషత్వము)నఁ జేయవలయు. అట్లు కానియెడల పౌరుషముకన్న బలమయినప్రారబ్ధము ప్రతిబంధక మైనటులు భావింపవలయు. కార్యసిద్ధి యైనయెడల పౌరుషమునకు దైవము తోడ్పడినటు లెంచవలయు. సర్వమును దైవాధీనముగానే తలంచి వర్తింపవలయును. తనవిధిప్రకారము తాను సంచరింపవలయును. తనకార్యంబు తాత్కాలికముగ సఫలీకృతము గానుండినను, తత్ఫలితమెన్నఁటి కైనను కలుగకపోదని దృఢవిశ్వాసంబున వర్తింపవలెను. వినను కాకపోయినను అట్టి దృఢవిశ్వాసంబే యాత్మానందకరమై వెలయును. 'ఆనందో బ్రహ్మ' యనునది గ్రహించునది. ఇట్లు సర్వంబును భగవంతునిపై భారము మోపి సత్కార్యానుష్ఠానపరు లగువారు లోకంబున గౌరవప్రపత్తులు గలిగి సంసారబంధ విముక్తు లగుటం జేసి పరమేశ్వరానుగ్రహంబునకు పాత్రులై నిత్యానందపదవి గాంచి నిరంతరసుఖులై వఱలుదురని గ్రహించి మానవవిధి నిర్వర్తించి సుఖవంతు లయ్యెదరు గాక.

## అలట్రోన్ అనగా నేమి?

ఇది శుద్ధవనమూలికలచే తయారుచేయబడినది. దీనిని సేవించుట చే చర్మవ్యాధులు, సవాయిపొక్కు, బిళ్ళలు, పొక్కులు, బొబ్బలు, కురుపులు, రాచకురుపులు, మొదలగువ్యాధులను, రక్తమును చెఱచునట్టి ఇతరవ్యాధులును, తప్పక గుణమగును. సవాయి పొక్కువ్యాధి ఎట్టిస్థితిలోనున్నను అందరికిని ఆశ్చర్యముకలుగు నట్లు అద్భుతముగా బాగైనది. ఒకటికాదు పదికాదు.

అయితే వేలకొలదిమంది ఇన్‌జక్షన్ చేయించుకొని స్వస్థతచెందక ఈఔషధమును సేవించి బాగుగా స్వస్థతచెంది మంచి ఆరోగ్యస్థితియందున్నారు.

రక్తమును శుద్ధిచేయుటయందు దీనికి సమానఔషధము ఆంగ్ల లేక ఆయుర్వేదఔషధములందెద్దియును లేదు. ఇది క్రొత్తగా కనిపెట్టబడి, నాగరిక ప్రపంచమందు అంతటను పరీక్షించబడి, గొప్ప వైద్యశిఖామణులచే వాడబడుచున్నది. ఉపయోగములేదని చేయివదలిన వ్యాధులు దీనిచే కుదిరినవి. శుద్ధరక్తమును కోరునట్టి ప్రతియొక్కరును దీనిని సేవింపుటమంచిది.

అయొడైడ్లు, సీసము, పాదరసము, పాషాణము, ఇతర అపాయకరమైన మందువస్తువులు ఇందులో కలియుట లేదు.

బుడ్డి 1-కి ధర రూ 5-12-0

పోస్టు ప్యాకింగు ఖర్చులు వేరు.

## ట్రికోలిన్

ఇది మూడుచికిత్సల కుపయోగించును.

గర్భాశయవ్యాధులు, నొప్పి గానున్నట్టి, యీడ్పు సంబంధమైనట్టి ఋతుశూల మామూలుగా గలుగు గర్భస్రావము మొదలగు మూడువ్యాధులకు దీనికి మించిన యౌషధమే లేదు. స్త్రీలు దీనిని సేవించిన తప్పక గర్భమును ధరించి సుఖప్రసవ మగుదురని అందరచే పొగడబడుచున్నది.

యిట్టి మూడుచికిత్సలు గల ఈ ట్రికోలిన్ ధర రూ 12-4-0

ప్యాకింగు, పోస్టుఖర్చులు ప్రత్యేకము.

**పి. ఎస్. బొమ్మ అండు కంపెనీ,**

తపాలపెట్టె నెం. 198,

మద్రాసు, ఇ.

## విద్యాభివర్ధని మాసపత్రిక

వేంకటగిరిటవున్, నెల్లూరుజిల్లా.

ఇందు వ్యవసాయము, పశుసంరక్షణ, ఆయుర్వేదము, దేహారోగ్యము, వృత్తులకు సంబంధించిన శాస్త్రవిషయములు, నానాదేశచారిత్రములు, మహానీయుల జీవితములు, దేశాభివృద్ధికరంబు లగు నితర ధర్మకార్యములను గురించియు గ్రామజనుల ఉపయోగార్థమై తేటమాటలతో ప్రచురింపఁబడును.

ఈపత్రిక విశేషజనులచే జదువబడుచున్నది. చిన్న వ్యాపారస్థులకుగాను ప్రకటనచార్జి తగ్గించి యున్నాము.

ప్రకటనపద్ధతులు:—నెలకు పుటకు రు 3, ½ పుటకు రు 2 లు, ¼ పుటకు రు. 1-8-0.

సంవత్సర చందా:—పోషకులకు రు. 10, సహాయులకు రు. 5, సామాన్య సభ్యులకు రు. 3, స్త్రీలకు విద్యార్థులకు, పల్లెటూరి ఉపాధ్యాయులకు రు. 2-0-0. నెమలి - సుబ్బరావు, పత్రికాధిపతి.

## అమృతాంజనము

వాయువునొప్పులకు పరమామృతము




నెత్తురునందు మూత్రామ్లజము మొదలగు చెడుపదార్థములు చేరి యవి సంధిబంధనములందు నిలిచి యుండుట వలన సంధివాత మేర్పడుచున్నది. కీళ్లువాచుట, జ్వరము, కీళ్లపోటును మొదలగు నవి దీనికి లక్షణములు. బాధ గలిగిన వెంటనే రోగికి విశ్రాంతినిచ్చుట యవసరము వాయువునొప్పుల కుపయోగించుమందులు దీనికి నుపయోగపడును.

తలనొప్పిని తక్షణము మాన్పును.

వెల డబ్బి 1-కి 0—10—0 మాత్రమే.

అమృతాంజనము డిపో, బొంబయి—మదరాసు.

# బాలికా లీలలు

### శిఖరము కోటేశ్వర గుప్త గారు

ఏనక్క లచ్చి నీయిల్లు మాడుత్తాను । అమ్మగారూ తెంగ డంచుఁ బిలుచు
నేను వెంకమ్మను నీళ్లు చేత్తానంచు । నిటునటుఁ జేతు లాడించు వంగి
బుచ్చమ్మగద నేను పొట్టున్నదే యింక । చెరుగు బాగాయని చెప్పుమనును
తోటకూరా తెత్తి చేటలో వెలతేండి । యీయఁ గాసుకు నంచు నేగుదప్పు
తల్పుమూయర మడిదాల్తు నేనంచు లోపలి కేగి వేఁబొందుబట్టఁ గట్టు
వంట సీరాముల వడ్డిస్త ఊచోండి । బువ్వతిందు రనును ముద్దుగాను
అప్పడాలను జేసి యవి కాల్చి నెయి రాచి । తాతప్రక్కన పెట్టుతానె యనును
కూర్చుని నేలపైఁ గూరలేరగఁ దల్లి । మాయుఁ జీరయనుచు వేయుఁబీట
తొడలపై బొమ్మల నిడుకొని ముద్దాడు । పాలుపోయును జోలపాట చెప్పు
తెలవాఱ మేల్కని తలముద్దు చెయిముద్దు । బుగ్గముద్దని తమ్ము ముద్దులాడు
ఎందుకురా తండ్రి యేడ్వకు మూస్తాను । నేనంచుఁ దమ్ముని నిద్రపుచ్చు
చూలుకుపోతాను చూడండి యని చేతఁ బట్టి । పుస్తకములు బయటి కరుగు
జాబు రాత్తాను పెంచలు కాతమీా యని । యడిగి యున్నను వ్రాయఁ దొడగు నెమ్మి
నన్ను పట్టూ రాండి నాతోన పరుగెత్తి । ఒం టు త్రీయని ముందు నోడు నెలమి
ఊయని కూయుచు నూరికి పోతాను । వచ్చింది రైలని పడిగ నడుచు
పిక్కాయలను చూచి పేరంటకిని రాండి । బిడ్డ కారతి యని వెట్టు బొట్టు
తలనొప్పి చలి యని తప్పు చాలువయని । పండుకొనును జాపపైన నొదిగి
తండ్రి ధ్యానముఁ జేరఁ దాఁగాంచి పవ ళించు । పలుకరించిన లేప వలదను నగి
రామరాం సీతరాం రామంచు హస్తముల్ । తట్టుచును భజింపుఁ జుట్టుతిరిగి
బుట్ట కెలం దాల్చి చెట్టుమ్రోల న్నిల్చి । పూలుదెచ్చును ద్రుంచి పూజకొఱకు
తలిసేయఁ బరికించి తనయాటఁ బావిని । నిలిపి పూజసలుపు నలరుల గొని
సారిగమా యంచు జాలుగా నుడువుచు । వీణె వాయించును వ్రేళ్ల జరిపి
మందు తీచోండి నూరుందని చెయిసూచి । లేడిడాక్టరు నాట నాడుకొనును
గొట్టమెటుల వేసికొందు నొంచను గద । నొట్టి యన్న యనును ముక్కుసూపి
చీట్లు వెట్టి కరానఁ బట్లుపట్టి బిఱాన । రెండు బేస్తు లనుచు లెక్కసెప్పు
ఎంతనేర్చితివిర యిది యేమి యరెయరే । యని వింత కేకల ననుకరించు
అలుకవచ్చిన వేళ నబ్బబ్బ యిది యెంత । రగళర యం చార్చు రట్టుగాను
బాబు కోపముసేయఁ బసిబిడ్డ కద నేను । నిది న్యాయమా యనుఁ గమరఁ గరుణ
తనపీకి యూరికిఁ జన నవ్వ లేకున్న । నెట్లుందు నిట నంచు నేడ్వసాగు
పేరంటమున కేగ వారు బువ్వకుఁ బిల్వ । నిదె సొమ్ము డ్రెస్సుందె యెట్టులనును
ఒక్కపనిం జేయ వొకమాట వినవని । గద్దలించును నింటిపెద్దవోలె
బువ్వతింటిరి మీరు పోండి కోటుకు నంచు । హెచ్చరించును దండ్రి ముచ్చటగను
మాయమ్మ యని చీఱ నాయనా తొడపైన । పండుకొమ్మని చేర్చుఁ బజ్జకలరి
గృహము లో నెవరేని భేదంబుతో నున్న । నవ్వ నవ్వా యనుం దండఁ జేరి
అలిబలిగా నాడుఁ గలకల నవ్వును । చెండాడు దుముకును జిందుద్రొక్కు
చిలుకపలుకులు పలుకును జెలువ మమర । సంతసము గూర్చు చూపఱచింతఁ బాపు
రెండుమూడేండ్ల బాల్యంబు నిండకమును । రాజరాజేశ్వరీబాల రమ్యశీల.

# శ్రీమదాదిశంకరులు ఆంధ్రులే

కర్లపాలెం వేంకట నారాయణప్ప గారు

పరశురాములవారు దశరథరామునిచేఁ బరాభూతుఁడై తపస్సు చేసికొనుటకు పశ్చిమసముద్రతీరమునకేగెను. అక్కడ స్థలము లేకపోవుటచేతఁ బశ్చిమపర్వతముమీఁదనుండి సముద్రముపై పునకుఁ దన గండ్రగొడ్డలిని విసరివేసెను. అప్పుడు పశ్చిమసముద్రమునుండి మలయాలదేశమనఁబడెడు కేరళదేశ ముద్ధరింపబడెను. అహిక్షేత్రమునుండి యీయనతోఁగూడ బ్రాహ్మణులు వచ్చిరి. ఒకానొకసమయమం దాబ్రాహ్మణులందఱు వీరితోఁ బోట్లాడి లేచి తమపూర్వదేశమునకుఁ బోయిరి. ఆకారణముచేత మలయాలదేశమునందు బ్రాహ్మణులు లేకపోయిరి అప్పుడు పరశురాములవారు బెస్తవారికి నసఁగాఁ జేపలుపట్టువారికి జందెములు వేసి బ్రాహ్మణులను జేసెను. పరశురామస్మృతి వ్రాసి యార్యబ్రాహ్మణులకు నుండెడు నాచారములకంటె భిన్నాచారముల నేర్పఱచి (మగవారికి ముందు జుట్టుంచుటయును, ఆడువారికి రవికలులేకుండుటయును, మొదలైనవి) ఇంకను గొన్నికట్టుదిట్టములుచేసి తా నాదేశమునందే తపస్సుఁ జేసికొనుచుండెను. మఱికొంత కాలమునకీబ్రాహ్మణులు పరశురాములవారికి నొకయపరాధము చేసి తిరస్కరించిరి. అనంతరమందు పరశురాములవా రాబ్రాహ్మణులను తిరిగి బెస్తలగునట్లు శపించెను. అప్పటినుండియును నామలయాలదేశమం దార్యబ్రాహ్మణులుగాని, మఱియొకజాతిబ్రాహ్మణులు గాని లేకుండిరి.

అనంతరమందు కొంతకాలమునకు కదంబవంశములోని మయూరవర్మ గోదావరీతీరమందలి యహిక్షేత్రమునుండి యార్యబ్రాహ్మణులను కేరళదేశమునకుఁ దీసికొని పోయెను. వీరలేమలయాళదేశమందలి యిప్పటిబ్రాహ్మణులు. వీరిలోనుండియే శ్రీ శంకరాచార్యస్వాములవా రుద్భవించిరి. అహిక్షేత్రమునుండి వెళ్లిన బ్రాహ్మణులు భట్టాచార్యులశిష్యులు. కదంబవంశ మొక చారిత్రియరాజవంశము.

పైదానివలన మలయాలదేశ మనఁబడెడు కేరళదేశము సముద్రమునుండి యుద్ధరింపఁబడినట్లును, ఆదేశమందు బ్రాహ్మణులు లేకపోఁగా గోదావరీమండలమునుండి యార్యబ్రాహ్మణు లక్కడకు తీసికొనిపోఁబడినట్లును మనము గ్రహింపవచ్చును.

పైనిఁ జెప్పఁబడిన మయూరవర్మ యొక చారిత్రియపురుషుఁడు. అహిక్షేత్ర మాంధ్రదేశములోని గోదావరీతటమందున్న పిఠాపురమునొద్ద నుండెడు సర్పపురమే (=సర్పావరము). 'సర్పపురమాహాత్మ్యము బ్రహ్మకైవర్తపురాణములో వర్ణింపఁబడియున్నది. ఈమాహాత్మ్యమును అభినవవాగనుశాసనుఁ డనియును, కవిసార్వభౌముఁ డనియును మహాప్రసిద్ధిగాంచిన కూచిమంచి తిమ్మకవిశ్రేష్ఠు లాంధ్రీకరించి యశఃకాయులైరి.

అహిక్షేత్రము తూర్పుదేశమందలి యొక రాజ్య మనివామనశివరామ్ ఆప్టే గారి యింగ్లీషు—సంస్కృత నిఘంటువులో వ్రాయఁబడియున్నది. భట్టాచార్యులవారే భట్టపాదాచార్యులవారు, భాట్టుఁడు, లేక కుమారిలభట్టు. మలయాలదేశమునకుఁ దీసికొనిపోఁబడిన బ్రాహ్మణులు భట్టాచార్యులశిష్యు లగుటంజేసి, యాంధ్రులే - భట్టపాదాచార్యులవా రాంధ్రులే యని యాంధ్రులచరిత్ర మొదలగు గ్రంథములయందు వ్రాయఁబడి యున్నది భట్టపాదాచార్యులవారి శిష్యులలో ఆంధ్రులు మాత్రమె గాక యితరదేశీయులు గూడ నుండవచ్చును. కాని భట్టపాదాచార్యులవారి కాలములోనే శ్రీమచ్ఛంకరాచార్యులవా రద్వైతమతమును స్థాపించిరి. భట్టాచార్యులవారి కాలములోనే శ్రీశంకరాచార్యులవారికి నవ్యవహితపూర్వమునం దుండిన భట్టపాదులవారిశిష్యులలో ఆంధ్రులు తప్ప నన్యులుండ నేరరు. అంత స్వల్పకాలములో నాదినములలో, రయిళ్లు, టప్పాలు, తంతులును లేవు గనుక, నితరదేశములకు భాట్టమతము వ్యాపించుటకు వ్యవధి లేదు. భట్టపాదాచార్యులవారి కాలముననే మయూరవర్మ బ్రాహ్మణులను తీసికొనిపోయెను. అట్లు కానియెడల భట్టాచార్యులవారిని వారిమరణసమయమందు దర్శించిన శ్రీశంకరాచార్యులవారు భట్టాచార్యులవారి శిష్యులలోనుండి యుద్భవించుట సంభవింపదు. భట్టాచార్యులవారి శిష్యులు మలయాలదేశమునకు వెళ్లిన చాలకొద్దిదినములకే వీరిలోనుండి శంకరాచార్యులవా రవతారమెత్తిరని వ్రాయఁబడియున్నది. భట్టపాదాచార్యులవారును శ్రీమచ్ఛంకరాచార్యులవారును ఏకకాలమువారయినట్లు చెప్పుచున్నారు.

శంకరవిజయమునందును శ్రీకళ్యాణానంద భారతీస్వాములవారిచే వ్రాయ బడిన భారతవర్షసంగ్రహచరిత్రమందునుగూడ శ్రీమచ్ఛంకరాచార్య స్వాములవారియొక్క దర్శనానంతరమే భట్టపాదాచార్యులవారు నిర్యాణముచెంది రని వ్రాయఁబడియున్నది.

ఈపైని వ్రాయఁబడినదానిని బట్టి మలయాలదేశమందలి బ్రాహ్మణులును వారిలోనుండి యవతరించిన శ్రీమచ్ఛంకరాచార్యులవారును, ఆంధ్రులని స్పష్టపడును. ఇందువిషయమై యితరులగు పండితులు వ్రాసినదాని నుదాహరించుచున్నాను.

“దక్షిణయిండియావర్ణములు, తెగలు” అను గ్రంథము.

ఈగ్రంథము ఏడుసంపుటములు గలిగి మద్రాసు దొరతనమువారిచేఁ బ్రచురింపఁబడినది. మలయాలదేశబ్రాహ్మణులనుగుఱించి యిట్లు వ్రాయఁబడినది.

"బ్రాహ్మణులయొక్క లిఖితములైన కొన్ని గ్రంథములలో కదంబవంశములోని మయూరవర్మకాలములో ఆంధ్రబ్రాహ్మణులు కొంతమంది దక్షిణకన్నడమునకు తీసికొనిపోఁబడిరి."

పైగ్రంథమందు, నంబూతిరిబ్రాహ్మణులను గుఱించిన శీర్షికను చూడుము. మఱియును పీఠికలో చూడుము.

పైగ్రంథమందె యిట్లు వ్రాయఁబడియున్నది.

(2) "బ్రాహ్మణుల కాలగణనము ప్రకారము, మయూరవర్మ క్రీస్తునకుపూర్వము ౪౫౫—౪౭౫ సంవత్సరములవఱకు రాజ్యము చేసెను."

(౩) "బ్రాహ్మణులు" అను శీర్షికక్రింద నీవిధముగా వ్రాయఁబడెను.

"దీనితర్వాత (పరశురాముని శాపానంతరము) కదంబవంశములోని మయూరవర్మ, అహిక్షేత్రమునుండి తూలుబ్రాహ్మణులను తీసికొనివచ్చువఱకు ఆదేశమందు బ్రాహ్మణులు లేరు."

(4) ప్రస్తుతమందున్న తూలుబ్రాహ్మణులను మయూరవర్మ తీసికొనివచ్చినట్లు చెప్పుటయందు సాంప్రదాయికపరంపరాకథ లన్నియును ఏకీభావమును వహించుచున్నవి.

(౫) "ఉత్తరకన్నడము మండలము (జిల్లా) లోని బనవాసి, యొక్క (ఇందు రాజ్యముచేసిన) కదంబవంశమునకు మూలపురుషుఁడు "మయూరవర్మ" యని శాసనములు చెప్పుచున్నవి.

(6) "గోదావరితీరమందున్న అహిక్షేత్రమునుండి బ్రాహ్మణులు తీసికొనిరాఁబడినట్లు చెప్పఁబడుచున్నారు."

(7) "నంబూతిరీలు- వీరిసాంప్రదాయికకథలు మయూరవర్మ వఱకును పోవును."

(8) "మయూరవర్మచేత బ్రాహ్మణులు తీసికొనిరాఁబడినప్పుడు వారు భట్టాచార్యులవారి శిష్యులుగా నెంచఁబడిరి. కాని పడమటి తీరమునకు వీరు వచ్చినవెంటనే, మలయాలదేశపు వేదాంతగురు వగు శంకరాచార్యులవారి సిద్ధాంతముల నంగీకరించిరి."

(9) ఆగ్రంథమందే అయిదవసంపుటములో సుబ్రహ్మణ్య అయ్యరుగా రిట్లు వ్రాయుచున్నారు.

కేరళమాహాత్మ్యములో వ్రాయఁబడిన దంతకథాపరంపర, (ప్రైడిమను) నంబూతిరీలను, అహిక్షేత్రమునుండి వచ్చినట్లుగాఁ జెప్పును. "ఇక్కడనుండి పరశురాముఁడు తాను క్రొత్తగానుద్ధరించిన దేశములోనికి బ్రాహ్మణులను తీసికొనిపోయెను." అని వ్రాసిరి.

ఈకథ లన్నియును, కేరళమాహాత్మ్యము, కేరళోత్పత్తి యను సంస్కృతగ్రంథములనుండి గ్రహింపఁబడెను.

ఈ పైప్రమాణవాక్యములనుఁబట్టి, మలయాలదేశమందు బ్రాహ్మణులు లేనప్పుడు, ఆంధ్రదేశమునుండి వారు తీసికొనిపోఁబడిరనియును, వెంటనే వారిలోనుండి శంకరాచార్యులవా రుద్భవించి రనియును గ్రహింపవచ్చును.

ఈపైదానియందు ముఖ్యవిషయములు (౧) కేరళదేశము సముద్ధరింపఁబడుటయును, (౨) ఆంధ్రదేశమునుండి మలయాలదేశమునకు బ్రాహ్మణులు తీసికొనిపోఁబడుటయును, వెంటనే వారిలోనుండి శ్రీమచ్ఛంకరాచార్యులవా రుద్భవించుటయును, అయియున్నవి.

(౧) కేరళదేశము పరశురాములవా రుద్ధరించి రని యిదివఱకే వ్రాసియున్నాను. దేశము లప్పుడప్పు డుద్ధరింపఁబడుచుండు నని భూగర్భశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. పశ్చిమభూభాగము సహ్యాద్రి, శేషాచలము మొదలైనవి శ్రీమహావిష్ణువు యజ్ఞవరాహరూపమున సముద్ధరించె నని మనపురాణములయందును, శ్రీ వేంకటాచలమాహాత్మ్యమునందును వర్ణింపఁబడి యున్నది. హిమాలయపర్వతముమీఁదను, పశ్చిమపర్వతములమీఁదను, సముద్రమందుండెడు, నత్తగుల్లలు, చిప్పలు మొదలైనవి దొరకుచుండుటచేత నవి సముద్రమునుండి పైకివచ్చినవి యని శాస్త్రవేత్తలు, చెప్పుచున్నారు. మఱియును, అట్లు పైకివచ్చుటచేతనే పూర్వము సముద్రమయముగా నుండెడు ఉత్తరహిందుస్థానము గంగాసింధుమైదానము పైకిలేచి భూభాగమైనదనియును, ఆఫ్రికాను, ఇండియాను కలిపెడు భూభాగము సముద్రములో మునిఁగిపోవుటచేత, నాఫ్రికాకు ఇండియాకును సంబంధము తెగిపోయిన దనియును వారు చెప్పుచున్నారు. కాఁబట్టి యీ పశ్చిమపర్వతభాగము అనఁగా కేరళదేశము పైకి వచ్చినమాట సత్యము.

(౨) ఒకదేశమందు బ్రాహ్మణులు లేనప్పుడు మఱియొకదేశమునుండి బ్రాహ్మణులు తీసికొనిపోఁబడుటయును సహజమే. గౌడదేశమందు (బెంగాలులో) బ్రాహ్మణులు లేకుండినప్పుడు బ్రాహ్మణుల నితరదేశమునుండి తెచ్చి రనియును వారే యిప్పటిబెంగాలులోని బ్రాహ్మణు లనియును చెప్పుచున్నారు. నాలుగువంశములబ్రాహ్మణులను తీసికొనివచ్చిరఁట.

(1) ముఖోపాధ్యాయుఁడు (2) బంధోపాధ్యాయుఁడు (౩) చతుర్థోపాధ్యాయుఁడు (4) గంగోపాధ్యాయుఁడు — పేర్లు గల కుటుంబములు.

ఈపైవారు శ్రోత్రియులుగా నుండినపుడా నామములనె నిల్పుకొనిరి. లౌకికులు (1) ముఖర్జీ (2) బనర్జీ (౩) చతుర్జి (4) గంగూలి యని పిలువఁబడిరి. అనంతరమందు వారికివారికి గలిగినబిరుదులనుఁ బట్టి వేఱువేఱుకుటుంబములవారైరి.

(1) రాయి (2) విద్యాసాగర్ (౩) సర్వాధికారి. (4) నియోగి మొదలైవి.

మయూరవర్మ భట్టాచార్యులవారును శ్రీశంకరాచార్యులవారును సమకాలికులుగాఁ గనఁబడుచున్నారు. శ్రీమదాచార్యులవా రాంధ్రులని నే నొక్కరుండనే వ్రాయుటలేదు. ఆంధ్రమహాసభవారిచే ప్రచురింపఁబడిన 'ఆంధ్రప్రచారకము' అను చిన్నిగ్రంథమును- ప్రథమాంధ్రసభ

యనంతరమందు గాఁబోలును ప్రచురింపఁబడినది.—మఱికొన్ని దంతకథలును, పైవిధముననే చెప్పుచున్నవి.

ఒకదేశమునుండి వేఱొక దేశమునకు బ్రాహ్మణులుగాని, మఱియొకరు గాని వెళ్లినపుడు తమజాతిత్వమును వెంటనే కోలుపోరు. కొన్ని నూఱులయేండ్లు గడచి తమ వేషభాషాదులను, తమదేశమునుగూడ మఱచిపోవుట తటస్థించినప్పుడు మాత్రమే యనేకశతాబ్దములయనంతరమందు నూత్నదేశీయులుగాఁ బరిగణింపఁబడవచ్చును. అట్లు మఱచిపోకుండుటకు దృష్టాంతములుగా నీక్రిందివానిని గ్రహింపవచ్చును.

(1) ఇప్పు డాంధ్రదేశమందున్న ద్రావిళ్లు, అఱవదేశమునుండి వచ్చి యాంధ్రదేశమందు గాఁపురమున్నను వారిపూర్వపునామముచేతనే పేర్కొనఁబడుచున్నారు. వారియందు ద్రావిడాచారములు కొన్ని కనుపట్టుచునేయున్నవి.

(2) మహారాష్ట్రదేశమగు విదర్భదేశము(బెరారు=బీదరు)దేశమునుండి రెడ్డిప్రభుత్వకాలములో (౧౩౨౫ అనంతరకాలములో) నాంధ్రదేశమునకు వచ్చి నిల్చిపోయిన విదర్భజులు (అనఁగా వెలినాటి వైదికులు) తమభాషను దేశమును మఱచిపోయినను, వారి భాషాచిహ్నములు కొన్ని, వారిభాష పూర్వము మహారాష్ట్రభాష యనియును, వారు మహారాష్ట్రు లనియును చెప్పుచునేయున్నవి. (ఈవిషయమై నేను గ్రంథ మొకటి వ్రాసినాను. అదియు నింకను ముద్రింపఁబడలేదు.)

(3) దక్షిణదేశమునకుఁ బోయిన ఆంధ్రులు ఇంకను తమయాంధ్రత్వమును మఱచిపోలేదు.

త్యాగరాజుగారిని యాంధ్రుఁ డనియే యెన్నుచున్నాము. ఈ మహనీయుఁడు సంగీతమందు మహావిద్వాంసుడుగదా.

కాఁబట్టి శ్రీమచ్ఛంకరాచార్యులవారు కేరళదేశమందు జననమొందినను వారాంధ్రులే యని నిస్సందేహముగాఁ జెప్పవలెను.

(4) మతవ్యాపనము; దిగ్విజయము.

శ్రీ కళ్యాణానంద భారతీస్వాములవారిచేత వ్రాయఁబడిన "భారతవర్షసంగ్రహచరిత్రము" నం దిట్లు వ్రాయఁబడియున్నది.

## పరమహంసపరివ్రాజకాచార్యవర్యసామ్రాజ్యము

"అఖండవేదమూర్తియననొప్పు కుమారిలభట్టునకు నంత్యదివసంబున బ్రహ్మవిద్య నుపదేశించి, తత్క్షణమునుండి యఖండతేజంబున బ్రహ్మవిద్యావైభవంబును సహస్రముఖంబుల బోధచేసి భారతవర్షమునఁ బ్రజ్వరిల్లిన జైన బౌద్ధాది వేదబాహ్యమతంబుల డెబ్బదిరెంటిని ధ్వంసము గావించి వైదికధర్మమునఁ బ్రసరించిన దురాచారములఁ ద్రోసిపుచ్చి యాసేతుశీతనగమధ్యదేశము దమదిగ్విజయంబుచేఁ బవిత్రముచేసి జగద్గురుండై యను యశమును దిగంతములకు నాచంద్రతారకముగా కోటిసూర్యులతేజంబుపగిది విజృంభింపఁ జేసిన పరమేశ్వరమూర్తి యగు శ్రీశంకరభగవత్పాదాచార్యులు షోడశకలాపరిపూర్ణుండగుపున్నమచందురునిబోలె షోడశవర్షపరిమితవయస్కులై కుమారిలభట్టుయొక్క యాశ్రమమున నఖండయశమును బడసె."

ఈవిషయమును జైనవిజయ మిట్లులు వక్కాణించుచున్నయది.

"పశ్చాత్ పంచదశేవర్షే శంకరస్యగతేసతి, భట్టాచార్యకుమారస్య దర్శనంకృతవాన్ శివః."

లోకశంకరుం డగు నీమహామహునిచరిత్ర మేరికిని నించుకేనియు నోకవింత గాదు. మహామహుండగు శంకరుండు నేఁటికిని సకలజనుల మధ్యను, సకలదేశంబులందును మూర్తీభవించియుండుట యటుండ భారతవర్షమున నాసేతుహిమాచలము ప్రతియడుగున నఖండతేజోవైభవంబున ప్రకాశించుచుండ నామహాపురుషునిగూర్చి గ్రంథాడంబరముఁ జేయ యత్నించుట హాస్యాస్పదము, కావున నామహావతారముయొక్క సామాన్యవిషయములను అత్యద్భుతకార్యముల నటుంచి ప్రకృతపు చరిత్రోపయుక్త మగు విషయముల మాత్రము సూచించుచున్నవారము. ఇట్టి మహాకార్యముల నాచరించిన మహాపురుషుఁ డీ మానవశరీరమున జనించి భారతవర్షమును బావనముఁ జేసినకాల మత్యల్పము. అద్దాని బుధు లిట్లు ప్రశంసించుచున్నారు.

"అష్టవర్షే చతుర్వేదీ, ద్వాదశే సర్వశాస్త్రవిత్,
షోడశే కృతవాన్ భాష్యం, ద్వాత్రింశే మునిరభ్యగాత్."

లోకశంకరునిచారిత్ర మంతయు బుధు లీయుప్పదిరెం డక్కరములలో సంగ్రహముఁ జేసిరి. ఈమహానుభావుఁడు కేరళదేశమున గాలటి యను నగ్రహారమున నఖండవేదమూర్తి యగు శివగురునిపుత్త్రుండు. ఈయన కలి 2593-వ సంవత్సరం బగు (3102—2593=509 క్రీస్తుపూర్వము) నందనసంవత్సర వైశాఖ శుక్లపంచమీ భానువారమున పునర్వసు నక్షత్రమున ధనుర్లగ్నమున నవతరించె. ఈవిషయమును ప్రాచీనశంకరవిజయ మిట్లు ప్రశంసించుచున్నయది.

"తిష్యేప్రయా [1]త్యనల, [2]సేవధి, [3]బాణ, [4]నేత్రే,
యోనందనే దినమణా వుదదధ్వభాజి,
రాధేదితేరుదు వినిర్గతమంగలగ్నే,
ప్యాహూతవాన్ శివగురుః సచ శంకరేతి.

౧. అగ్ని=3. ౨. సేవధి=శంఖాదినవనిధులు=౯. 3. బాణ=౫. ౪. నేత్ర=౨. చివరనుంచి మొదటికి ౨౫౯3.

కలి 2593-వ వత్సరమున నవతరించి యైదవవత్సరమునఁ గృతోపనయనుండై యెనిమిదివత్సరములవయస్సు వచ్చువఱకు నాలుగు వేదముల నధ్యయనము గావించి సర్వకర్మసన్న్యాసంబు గావించి నర్మదాతీరంబున నమలేశ్వరక్షేత్రంబున నత్యుత్కృష్టతమంబగు నాశ్రమంబున బ్రహ్మవిద్యాపీఠమును నెలకొల్పియున్న శ్రీగోవిందభగవత్పాదుల యథావిధి సందర్శించి వారికడ నాలుగుసంవత్సరములలో సకలశాస్త్రముల నభ్యసించి యనుజ్ఞవడసి పండ్రెండవ సంవత్సరము పూర్తియైనదిమొదలు నాలుగువత్సరములలోన బ్రస్థానత్రయభాష్యముల రచియించి, పదునాఱవ సంవత్సరముమొదలు ముప్పదిరెండవ వత్సరమువఱకుఁ గల పదునాఱువత్సరములును భారతభూమినంతయుఁ దమపాదపద్మములతోను వాగమృతధారలతోడను బవిత్రముఁ జేసి బౌద్ధాది వేదబాహ్యమతముల

డెబ్బదిరెండింటిచే భారతవర్షమున బయలువెడలిన యధర్మనిమహావాయువులను బరిశ్రమజేసి నేటివఱకు నఖండయశంబున మూర్తీభవించి యున్న వైదికధర్మవృక్షంబులను బ్రహ్మవిద్యావనంబులను బ్రతిష్ఠఁజేసెను. ఈమహానుభావుని యుద్యమంబున పద్మపాద, హస్తామలక, తోటక, సురేశ్వరాచార్యాది మహానుభావులు పదునలువురు కృతకృత్యులై నేటికి నఖండయశమును బడసియున్నవారు. మహాశయుండగు శ్రీశంకరభగవత్పాదులు సాంగోపాంగముగ నాలుగువేదముల గ్రహించి యట్టివేదములతత్త్వమును సుకరముగ లోకమునకు వెల్లడి యగునటు లప్రతిహతంబులగు గ్రంథరాజముల రచియించి యవ్వాని మహాశయులును బరమహంసపరివ్రాజకులునగు శిష్యులకు బ్రవచనంబు సేయుచు భారతవర్షంబున దిగ్విజయము గావింపనెంచి బయలువెడలి తమ యఖండవిద్యావైభవంబుచే సకలరాష్ట్రీయప్రభువులను సకలవిద్వాంసులను దమశిష్యులనుగా గైకొని యఖండసామ్రాజ్యాధిపత్యమునువహించి వైదికధర్మప్రతిష్ఠకై చేసినయేర్పాటు లేవి యన:—

వైదికధర్మాసక్తులును, తద్ధర్మపరిపాలకులు నగు ప్రభువులు లేమిచేఁ గద యిదివఱకు వైదికధర్మము క్షీణించె. అట్టికొఱతను బూర్తి చేయఁ గ్రొత్తవిధమున భారతవర్షీయరాజ్యాంగతంత్రమును సంస్కరించె. కలియుగమునకుఁ బూర్వమునను కలియందు 1050 సంవత్సరముల వఱకును క్షత్రియులు పరిపాలనము గావించుచుండెడివారలుగదా. వారలు వైదికధర్మవిదులును, తదాసక్తచిత్తులు నగుటంజేసి సర్వవిధముల ధర్మసంగ్రహమార్గముల ననుసరించుచు నావశ్యకమైనపు డెల్లకాలముల యందు నగ్రగణ్యులగు బ్రాహ్మణులవలన ధర్మమును గుర్తెఱిఁగి ప్రవర్తించుచుండెడివారలు. దానంజేసి బ్రాహ్మణులు తాటస్థ్యమున నుండి తమతమకార్యముల యథోచితముగఁ జేసికొనుచు గాలమును గడపుచుండెడివారలు. ప్రస్తుతమునఁనో యట్టిపరిపాలకులులేనిచో దేశ మధోగతిని జెంద సిద్ధముగానున్నకాలమున నట్టిదుస్థితిని తొలగింపఁ బరిపాలనాధికారమును బ్రాహ్మణులు వహించునట్లుచేసిరి. అదెట్లులనిన ప్రజల యోగక్షేమములఁ బరసి దండనాధికారమును, రాష్ట్రీయప్రభువులకు సర్వవిధములఁ గార్యనిర్వాహకత్వమున జ్ఞానమును, బ్రదర్శించుబాధ్యత బ్రాహ్మణులయందు నునిచె. బ్రాహ్మణులయినను గృహస్థులైనచో రాగద్వేషాదులతో నొప్పియుండుటచే నకలంకముగ నిష్పక్షపాతబుద్ధి జనించుటదుర్ఘటము. కావున వైదికధర్మరక్షణతంత్రమును నడుప నిరీహులును, నిష్కాములును, విద్వాంసులును నగు పరమహంసపరివ్రాజకులను నిలిపి, వారల యాజ్ఞానుసారముగ రాష్ట్రీయప్రభువులు పరిపాలించునటులు నియమించి యొక్కొక్క రాష్ట్రీయప్రభువున కొక్కొక్క పరమహంసపరివ్రాజకాచార్యుని గురువుగ నేర్పఱచి, వారలయాస్థానమునం దుండునట్లు శాసించె. అట్టిశాసనమునకు సాక్ష్యముగ నించుమించుగ బ్రతిప్రభునగరమందును నొకరాజగురుమఠమును, రాజగురువును, నేటి వఱకును నుత్తరదేశమున గొంతవఱకుఁ జూడఁగలము. ఈరాజగురువులందఱును దమకు సన్నిహితమగు పీఠస్థానమునుండి యవసరమగు కార్యనిర్వాహకతను గుర్తెఱుఁగ భారతవర్షమున వైదికధర్మరక్షణ దుర్గంబులో యననొప్పు నైదుమహాపీఠంబుల పరమహంసపరివ్రాజకాచార్యుల కాకరముగనుండునట్లు ప్రతిష్టించె. అవెవ్వి యన:—

(1) కలి 2611 నకు సరియైన క్రీ॥ ము॥ 490-(౪౯౦) సాధారణసంవత్సర మాఘశుక్ల సప్తమియందు ద్వారకాక్షేత్రమున హస్తామలకాచార్యుల యాధిపత్యముక్రింద బ్రతిష్ఠింపఁబడిన శారదాపీఠము.

(2) కలి 2616 నకు సరియైన క్రీ॥ ముందు॥ 485 (౪౮౫) రాక్షససంవత్సర పుష్యపూర్ణిమయందు, తోటకాచార్యుల యాధిపత్యముక్రింద బదరికాశ్రమమున బ్రతిష్ఠింపఁబడిన జ్యోతిర్మఠము.

(3) కలి 2617 నకు సరియైన క్రీ॥ ము॥ 484 (౪౮౪) నలసంవత్సర వైశాఖశుద్ధ దశమియందు పద్మపాదాచార్యుల యాధిపత్యము క్రింద శ్రీజగన్నాథక్షేత్రమునఁ బ్రతిష్ఠింపఁబడిన గోవర్ధనమఠము.

(4) కలి 2618 నకు సరియైన క్రీ॥ ము॥ 483 (౪౮౩) పింగళసంవత్సరపుష్యపూర్ణిమయందు తుంగభద్రాతీరమున శృంగగిరి క్షేత్రమున సురేశ్వరాచార్యుల యాధిపత్యముక్రింద, బ్రతిష్టింపఁబడిన శారదాపీఠము;

(5) కలి 2620 నకు సరియైన క్రీ॥ ము॥ 480(౪౮౦) సిద్ధార్థినామసంవత్సర వైశాఖపూర్ణిమయందుఁ గంచిక్షేత్రమునఁ దమకు వాసయోగ్యముగా నుండఁ బ్రతిష్ఠించిన కామకోటిమఠము.

ఈ యయిదుమఠము లటుండ నెచ్చటెచ్చట బౌద్ధాదిమతస్థానములుండెనో యచ్చటచ్చట నాబౌద్ధుల పరాభవించి వారలస్థానములయందుఁ బరమహంసపరివ్రాజకులను దుర్మతములు ప్రబలకుండునటులు గాపాడ నియమించె. రాజగురుస్థానంబులును, నితరస్థానంబులును, సామాన్యపీఠములు, పైనుదాహరింపఁబడిన యైదన్ననో యధికారపీఠములు. ఇట్టియైదుపీఠములయాజ్ఞల ననుసరించి సర్వజనులు వర్తింపవలయు నను శాసనముచే పరమహంసపరివ్రాజకాచార్యవర్యుల సామ్రాజ్యాధిపత్యమును క్షత్రియపరిపాలనస్థానమున నెలకొల్పి, అందులకుఁ దగునియమములను జక్కఁగ నుపదేశించి వ్యవహరింపఁజేసి ప్రతిగ్రామమునందును పీఠశాసనానుసారముగ ధర్మమును బ్రవర్తింపఁజేయ పరిషత్తులను, సభాపతుల నేర్పఱిచె. నేటికిని నవ్వానియొక్క ఛాయలు వ్యవహారమునందు నిలిచియేయున్నవి. ఇట్టి గ్రామపరిషత్తులను, నగరపరిషత్తులను విమర్శింపఁ బర్యటనయతులయందు భారమునిచ్చి, వారలు వత్సరమున నెనిమిదిమాసములుచేయు విశ్వరూపయాత్రయం దక్కడక్కడ వ్యవహారములఁ బ్రత్యక్షముగఁ జూచి పీఠములకు నివేదింప నియమించె. ఇట్టి పర్యటన యతులన్ననో - బౌద్ధాదివంచకయతులవలె స్వచ్ఛందముగఁ జరింపకుండ - వైదికధర్మప్రయుక్తసన్న్యాసంబును యథావిధిపీఠములకడ దీసికొని వర్తింపవలయు నని శాసించె. ఇట్లు పలువిధంబుల బౌద్ధాధికమతంబులదుర్నయముల వారించి సన్న్యాసధర్మమును యథావిధిగఁ బ్రతిష్టించి వైదికధర్మసామ్రాజ్యమును నఖండయశమునఁ బ్రతిష్ఠించి యప్రతిహతంబును, నఖండమును నగు నేకచ్ఛత్రాధిపత్యముతోఁ గలి 2625 నకు సరియైన క్రీ॥ ము॥ 477=(౪౭౭)వ సంవత్సరమున వారు బ్రహ్మలోకమునఁ జేరిరి. అదిమొదలు మహామహిమగల యశోకము భారతభూమి

యందుఁ బ్రవర్తించువఱకు నాజగద్గురుండగు శ్రీశంకరభగవత్పాదులచేఁ బ్రతిష్ఠింపఁబడిన వైదికధర్మసామ్రాజ్యమున భారతభూమి సర్వవిధముల బరిపాలనము చేయఁబడియె. ఇట్టిసామ్రాజ్యచిహ్నము నేఁటివఱకును భారతభూమియందు నిలిచియుండుటచేత నక్కాలమునఁ బరమహంస సామ్రాజ్యము వర్తిల్లెనని యాధునికచరిత్రకారులుగూడ సుకరముగ గ్రహింపవచ్చును. కావున నాటంగోలెననఁగా కలి 2625 నకుసరియైన క్రీ॥ పూ॥ 477 (౪౭౭) వ సంవత్సరమునుండి నేటివఱకు నవిచ్ఛిన్నముగ శ్రీశంకరభగవత్పాదపరంపర యభివృద్ధినొందుచు భారతవర్షచారిత్రమున్న వేనోళ్ల బ్రకటించుచున్నయది. పైనుదాహరింపఁబడిన యైదు మహాపీఠములును ప్రధానస్థానములుగను, రాజగురువులమఠము లుపస్థానములుగను, రాష్ట్రీయప్రభువులు కార్యనిర్వాహకప్రముఖులుగ నించుమించుగ కలి 4302 నకుసరియైన క్రీస్తునకు వెనుక (తర్వాత) 1200 (౧౨౦౦) సంవత్సరములవరకును భారతవర్షమంతయును నఖండముగు పరమహంసపరివ్రాజకాచార్యసామ్రాజ్యముచే నకలంకముగఁ బరిపాలింపఁబడెనని నిస్సందేహముగఁ జెప్పనగును. ఇట్టి యఖండసామ్రాజ్యమున రాష్ట్రీయప్రభువులచరిత్ర మంతరించినదని యోజించుట గూడ నొక యవివేకంబ. ఇక్కాలమున పీఠపరంపరయందుఁ గ్రమముగ సామ్రాజ్యమును జేసికొనినవారలనామములు పీఠములయందు నిరంకుశముగ నెలకొలుపఁబడియేయున్నవి. గ్రంథవిస్తరభీతిచే నట్టిపీఠపరంపర నిచట నుదాహరించుట విరమించితిమి.

# రాట్నపు గీతికలు

సోమంచి సూర్యనారాయణశర్మ గారు

శీలమును గాపాడు నొసఁగును-శ్రీలఁ గడు నీ మేలిరాటము
నూలువడుకుము నూలువడఁకుము-ప్రాలుమాలక సోదరీ

కాటకంబుల దాటుటకు నిదె-మేటిసాధన మింక సందియ
మేటికని మాటికిని పెద్దలు-చాటుచుండిరి సోదరీ

పారతంత్ర్యముఁ బారద్రోలియు-భారతావనిఁగావఁ బ్రబలా
ధార మీరాటంబె యనుచు-న్నారు ధీరులు సోదరీ

నల్లవారల నుద్ధరింపఁగ-నిల్లిదే సాధనమటంచుఁ బ్ర
ఫుల్లచంద్రుఁడు చేయు బోధలు-తెల్లమయ్యెనె సోదరీ

కచురు చల్లగ నున్నచో నేఁ-గదలుతును గోల్కొండ నని యొక
ముదిత మును పాడెనఁట యర్థము విదితమయ్యెనె సోదరీ

శుక్రశిష్యుల జఱచు నాహరి-చక్రమే యీరాటచక్రము
అక్రమముఁగు విక్రమంబుల-నడఁచివేయును సోదరీ

కదురుకవ్వము లాడుచుండెడు-సదనమున నేవేళ నిందిర
కుదురుకొను నను సూక్తిభావముఁ-గూర్మి నెఱుఁగుము సోదరీ

అల్పముగఁ దలఁకకుము నీ యిల-వేల్పు రాటము భద్రరీతిని
నిల్పి భారతమాతృయశమును-నిల్పఁ దివురుము సోదరీ

ముతుకనూలని కొతుకకుము నీ-వతిప్రశస్త పునరణి నేర్పుతో
సతము పనిచేసిన వడుక నే-రుతువు శీఘ్రమ సోదరీ

తెలివితేటలు పూన్కి కరకౌ-శలముఁ బలువురు గాంచి యలరఁగ
నెలమి వడుకుము నూలు విడు మిఁక-నలసబుద్ధిని సోదరీ

# సాంఘిక దురాచారములు

తల్లాప్రగడ వెంకటేశ్వర రావు గారు

ఏదేశముగాని, యత్యున్నతదశలో నున్నది యనగా, నాదేశపు ప్రజలు యావన్మంది, యెల్లపుడు సంతుష్టాంతరంగులై, యెట్టి యిడుమలబడక, తమజీవితమునందలి నిజార్థమును తెలిసికొని, కాలము గడుపుచుండుటయే యని యర్థము. ఎప్పుడు వారసంతుష్టులై మెలగుచు, కష్టములపాలై, ధర్మవిదూరు లగుచుందురో యప్పుడే, నాదేశము మిగుల హీనస్థితియం దున్నదని వేరుగ చెప్ప నవసర ముండదు. ప్రాచీనకాలమందు ఋషులు, జాతులను, కొన్ని సంఘములుగా విభజించి, ప్రతిసంఘమునకు, కొన్ని నియమముల నేర్పరిచి, యానిబంధనలకు వ్యతిరేకముగ ప్రవర్తించినయెడల సంఘమునుండి బహిష్కరించుచు వచ్చుచుండిరి. మఱియు వారానిబంధనలను నాయాకాలాను సరణి నేర్పరచిరి. వానిని మనము యీకాలమునకు సరిపడులాగున, మార్చుకొననియెడల, సంఘమునకే ముప్పువాటిల్లు సూచనలు కనుపట్టుచున్నవని చెప్పకతీరదు. ఇప్పుడు, మనము మనసంఘమున నుండు దురాచారము లేవియో, యిప్పుడవి మార్చుటకు గలకారణము లెట్టివో మార్చిన కట్టి యవకాశము లైవకలవో లేవో, యించుక విచారించుట మనకర్తవ్యము. అందులో ముఖ్యమగు వాటిని యీక్రింద పొందు పరచుచున్నాఁడను:

## బాల్యవివాహములు

చాలకాలమునుండి మనమీ ఘోరపాతకమునకు నొడిగట్టుచున్నామని వ్రాయ సాహసించుచున్నాఁడను. ఏదేశమునకుగాని, యేజాతికిగాని, యేకుటుంబమునకుగాని, స్త్రీలవలననే, ప్రతిష్ఠ గాని యప్రతిష్ఠ గాని సంభవించుట తథ్యము. వారు శక్తిస్వరూపిణులు. అట్టి స్త్రీలను మనమే దుర్మార్గదారులకు త్రిప్పి, మనపూర్వపుస్త్రీల ఔన్నత్యమునకు భంగము తెచ్చినవార మగుచున్నారము. పలుతావుల మనము కనిపెట్టున దేమన, నీబాల్యవివాహమువల్ల, భార్యాభర్త లిరువుర కన్యోన్యప్రేమాతిశయములు లేకపోవుటయే. కారణ మేమన, వారి చిన్నవయస్సు నందే, అనగా, భర్తయన నెవరో, భార్యాభర్త లిరువుర కుండు సంబంధ మెట్టిదో, తెలియకమునుపే, వివాహములు చేయుట సంభవించుటయు, వయోవిద్యారూపములయం దిరువురకు హెస్తిమశకాంతము పోలిక గలిగియుండుటయు యిత్యాదిగాగల కారణములు సమకూడుచున్నవి. ఇందువలనవారు తమధర్మపథమునుండి పతితు లగుట సంభవించుచున్నది. ఇదియునుగాక, దీనివిషయమై, పత్రికలమూలమునను, కరపత్రములమూలమునను, ప్రచురణ జరిగియు కొందఱువ్యక్తులకు స్వానుభవమునకు వచ్చియు, దేశభాగమున చాలవరకు, యీదురాచార ఫలితమును గాంచియు, యింతవరకు సోదరు లాచరణకు తీసికొనిరాక పోవుట కడుశోచనీయము.

## స్త్రీలకువిద్య

ఈ విషయముపై పలువురు పలువిధముల యభిప్రాయములకు లోనయి, వారికి తోచినరీతిగా దీని నాచరణలోనికి తీసికొనివచ్చుచున్నారు. స్త్రీల కెట్టి విద్య కావలె ననియే ప్రశ్న. వారివిద్య యెప్పుడును, ముందువారు జరుపబోవు ఆశ్రమమునకు తగురీతి నుండవలె నని నాయభిప్రాయము. పురుషులమగు మనము, విద్య నభ్యసించి (ప్రస్తుతవిద్యావిధానమునందు లోపము లున్నప్పటికిని) ఒకప్పుడు గాకపోయిన, మరొకప్పుడైనను, మన ఆదర్శకపురుషులను జ్ఞప్తికి తెచ్చుకొని, వారి ననుసరించుటకు ప్రయత్నింతు మనుట సత్యము. అటులే స్త్రీలుకూడ తమపూర్వపుస్త్రీలవర్తనములను మనస్సునం దిడుకొని, తమ ఆశ్రమధర్మమును నెఱవేర్చుకొనెద రనుట వాస్తవము. కనుక నీతిదాయకమగు విద్య వారికి గఱపవలసియున్నది. భగవంతుని దృష్టికి నందఱు సమానులు. వారివారి కర్మానుగుణముగ మరల జన్మము లెత్తుచుందురు. అందుకొఱకై తమజీవితమునందలి యథార్థమును తెలిసికొని ప్రతిమానవుడును ప్రయత్నింపవలసియున్నది. తమలోనణగియున్న జ్ఞానతేజస్సును, విద్యయనుదానిచే వృద్ధిచేసి, కర్మకు గడంగవలసియున్నది. ఇదియే పశువులకును, మనకు నుండు భేదము. సోదరీతుల్యలగు మనస్త్రీలకు విద్య రానియెడల వారుకూడ, పశువులు పక్షులు మొదలుగాగల తిర్యగ్జంతువులతో సమానమేకదా! కాన వారివిద్యకై తగురీతిని మనము ప్రయత్నింపవలసియున్నది.

## కట్నములు

భారతావనియందలి ప్రజలు చాలవఱకు ప్రతివిషయములోను వ్యామోహమునఁబడి తాము మోసపోవుచున్న సంగతికూడ గుర్తెఱుంగరుకదా! ఈదేశమున, నందులో ఆంధ్రావనియంతటను, కట్నమనెడి మహాపిశాచము కొంతకాలమునుండి స్థిరస్థాయియై, ప్రజలను ఒకకొన నుండి, పిప్పి పీల్చివేయుచుండ, సామాన్యులందఱు దానివాతబడి, చివరకు తినుటకుతిండికూడ లేక, అల్లల్లాడుచుండ, కనివినియు, నాయకులును, సంస్కర్తలుకూడ, తనకు గాదన్నట్లు, మౌనముద్రను దాల్చియుండుట, కడు శోచనీయముగ నున్నది. బహుశః సంస్కర్త లందఱు ఏకోన్ముఖులై! దేశమున, సంపూర్ణస్వాతంత్ర్యము కలిగినగాని, తమసమస్యలు ఫలోన్ముఖమునకు రావని తలచి, తదభిలాషులై, పని చేయుచుండవచ్చును గాని, సంపూర్ణమగు హక్కు కలిగినను, దీని కొక శాసన మవసరము లేదు. ఇది ప్రతివ్యక్తికిని సంబంధించిన విషయముగాన వారివారి మనస్సులు పరివర్తనము నొందిన చాలును. ఈకాలమున విదేశవస్త్రమునందు, వ్యామోహ మెటులు తగ్గుచున్నదో, యటులనే,

కట్నములందును వ్యామోహము తగ్గుననుటలో నాశ్చర్యముండబోదు. అందులకై ప్రజలకు తగు రీతిని ప్రబోధము అవసరమై యున్నది.

ఈ కట్నమనెడి మాట తలఁచుకొనిన గుండె ఝల్లుమనుచున్నది. దీనినిగురించి వివరించుట అనవసరము. అయినను, ఒక చిన్న సంగతి జూచెదము. సాధారణుడగు మానవుడొకఁడు, ఏతాలూకా ఆఫీసులోగాని లేక మరి యేయితరడిపార్టుమెంటులో గాని, ఒక గుమాస్తాగా నుండి నెలకు 35,40 లు తెచ్చుకొనుచుండె ననుకొందము. ఇతనికి ఇదితప్ప మరియేయితరఆస్థులు గాని లేవని తలపుఁడు. ఈ కఱవు కాలములో, ఈ స్వల్పపుసొమ్ముమీద ఆధారపడి ఉదరపోషణము గావించుకొనుటయే మిగుల కష్టతరముగ నుండును. ఇటులుండ, మానవప్రకృతి గాన, ఈతనికొక ఆడశిశువు కలిగినయెడల అంతటినుండి ఏమని తలపోయును? "ఈ శిశువునకు క్రమేణ వయస్సు రాగలదు. పదిసంవత్సరములు వచ్చుసరికి వివాహము చేయవలెను గదా! మనము కట్నమేమియు నియ్యలేము. ఏమాత్రమయినా అథమము 500-0-0 అయినా యిచ్చినగాని సామాన్యుడయినా రాడు. ఇది ఎటులు పొసగును దైవమా!" యని కుందసాగును. అంతటినుండి తాము ఒకపూట తిండిమానియో, లేక, ఒక ప్రక్క కాల్చుకొనియో కొంతసొమ్ము నిలువ చేయసాగును. ఇటుల ఎన్ని సంవత్సరములు కష్టపడిన అతనియొక్క యిక్కట్టు లీడేరును? అతనిజన్మ మంతయు యిటుల సాగవలసినదేనా? దేశీయులారా! మన కీ చిన్న విషయము చాలదా! అనేకసంసారములు ఈకట్నములవలన దివాలా తీయుచున్నవి. అదియును గాక, యీ వివాహములలో నింకను, దుర్వ్యయములు మానుటలేదు. ఇదియంతయు మనసంఘమునకుండు స్వయంకృతాపరాధమేయనినమ్ముడు. ఎందులకు, మీర లీదుర్వ్యామోహమున బడియెదరు? ఎవరైనను సరే, "నేను యిప్పటినుండి కట్నము నియ్యను" యని ప్రతిజ్ఞ జేసికొనవలయును. ఇతరు లెవరైనా, తిరుగ నిట్టిదుర్వృత్తిలో పడుచుండినయెడల వారిని ఇట్టిపనిలోనికి దిగకుండనట్లుగా బోధించవలెను అప్పటికీ వినని యెడల బహిష్కరణాయుధము ప్రయోగించవలెను. తప్పదు. ఇప్పటికైనను మేలుకొనుడు! ఆంధ్రమహాజను లందఱు మహాసభలు, రాష్ట్రీయ సభలు జరిపినచోటుల నెల్లడను, రాజకీయవిషయములతోపాటు యీ సాంఘికసమస్య ముఖ్యముగా జర్చింపఁ ప్రార్థించుచున్నాఁడను.

# దీనసంరక్షకుఁడు

## పొన్నలూరి నరసింహము గారు

ధనమునం గూర్పఁగ నెంచి కొండ ఱిల రే◆ధర్మంబులన్ జేయకన్
తనవారంచును పేదలంమను దయా◆దాక్షిణ్యము ల్వీడి తీ
రని కష్టంబులఁ బెట్టి లోకు లతిచి◆త్రం బంద వే దుఃఖభా
జనమౌ ద్రవ్యముఁ గూర్తు రెందులకొ? కృ◆ష్ణా! దీనసంరక్షకా.

మ. 'బలవంతుండను నే' నటంచు మదిలో◆ భావించి గర్వంబునన్
యిలలో నందఱ నన్నిమార్గములఁ దా◆ హింసించు దుష్టాత్ముఁ డెం
దులకు న్గాక దురంతకష్టములఁ బొం◆దు న్గాన శాంతంబునై
తలనే వాల్చి మెలంగ మే లిల ముకుం◆దా! దీనసంరక్షకా.

మ. అనఘా! యంగవిహీనులై నిరతమున్ ◆ యత్యాపద నొ్పంది కూ
డును గుడ్డన్ గడియింపలేక నతిగో◆డుం జెందు నాపేదలం
గని కారుణ్యము మీఱ శక్తికొలదిం◆గా సత్వరం బిచ్చు బు
ద్ధిని నాకిమ్ము సతమ్ము సత్కృపను తం◆డ్రీ! దీనసంరక్షకా.

మ. వరదా! దుష్టులమైత్రిఁ జేయకను నీ◆వారిం సదా చేరి ని
ద్దర సత్కార్యము లాచరింప నతిశ్రద్ధన్ నాద సద్ధర్మముల్
జరుపంగా నిడు మంచిబుద్ధి యని యాసన్ ◆ వేఁడుచున్నాఁడ నీ
కరుణన్ నా పయిఁ జూపవే భువనర◆క్షా! దీనసంరక్షకా.

మ. ధనవంతుం డెవి చేసినన్ యదియె స◆త్యంబంచు మోమోటమిన్
జనముల్ వాకొనుచుంద్రు లోకమునఁ గృ◆ష్ణా! దాని నేనేరకన్
ధనహీనుం డొనరించినన్ గని మహా◆దర్పంబునన్ యోర్వలే
కను శిక్షింతురు పాడియే? కుజనశి◆క్షా! దీనసంరక్షకా.

The Andhra Youngmen's Association, Kharagpur



ఖరగపురము ఆంధ్ర యువజనసంఘము

The Panchama Association - Ellore

ఏలూరు ఆదిమాంధ్ర సంఘము

M. & S. M. Head Office New Buildings-Madras



మదరాసు రైల్వే నూతన ప్రధానకార్యాలయము-చెన్నపురి

Esplanade Row - Madras



ఎస్ప్లనేడు రో - చెన్నపురి

# జాతీయవిద్యావిధానము

పోతాప్రగ్గడ నరసింహం గారు

ఉ. చెప్పఁగలేము హిందువులు । చేసినకర్మ మదేమొ సర్వదా
ముప్పదిమూఁడుకోట్ల సుర । పుంగవులన్ భజియించునట్టి యీ
ముప్పదిమూఁడుకోట్ల జనమున్ । వశులై రొకయేడుకోట్లకున్
గుప్పున దోమకుత్తుకను । గుంజరయూథము చొచ్చు కైవడిన్.

ప్రజలయందు వైరములను రూపుమాపి, ఐక్యభావమును గల్పించి, వర్తకవ్యాపారముల వృద్ధిపఱచి, పాలనశక్తుల బెంచి, అగమ్యములగు మత, సాంఘిక, రాజ్యాంగార్థికవిషయములను నిర్ధారణ చేయునదియే జాతీయవిద్య. దేశీయులభౌతికనైతికాధ్యాత్మికసంపత్తును పెంపొందించునదియే జాతీయవిద్య. సృష్టివైచిత్ర్యముం జూచి బెగడొందక, ఇంద్రియగ్రహణప్రపంచమే యథార్థమని మోసపోక, నిర్మలజ్ఞాననయనంబున సర్వంబును ఆత్మమయంబుగ నెఱుంగుచు, యోగాభ్యాసముచే నాగరసభరితమైన విశ్వరూపంబు లోనం గనుంగొను దివ్యసామర్థ్య మీ ఆర్యభూమిం దక్క యొండెడ వెలయలేదు. అట్టి ఆర్యవిజ్ఞానమును స్వస్థానమందు పునరుద్ధారణ జేయుటయు నవనాగరకత యందలి ముఖ్యాంశములతోడ సమన్వయముం జేయుటయు జాతీయ విద్యయొక్క ప్రథమప్రయత్నము. ఇటులు నూతనముగ నేర్పుజ్ఞానము పూర్వసందర్భముతోడ వికటము గాకుండ జూపవలయును. పాశ్చాత్య విజ్ఞానము పంచేంద్రియవ్యాప్తము. రాగరసప్రధానము. వాంఛలను నింపి పెంపుఁజేయునది. విశ్వమును గెల్చి వశీకరణముం జేయనెంచు గొప్పశక్తి గలది. భగవంతునికొఱకు బహిఃప్రపంచమును శోధించు మహాపౌరుషము గలది. నెమ్మది విరామము మౌనము మున్నగు సుగుణముల కిక్కడ చోటు లేదు. ఆర్యవిజ్ఞానము శాంతిరసప్రధానము. ఇంద్రియనిగ్రహమున జ్ఞాననయనంబున విశ్వమంతయు మానససంకల్పముగ నెఱింగినది. భక్తిరసంబున సృష్టియందలి మాధుర్యముం గ్రోలినది. చిత్తశుద్ధిచే నాత్మజ్ఞానముం బడసి నిశ్చలపరమానందమును గుర్తెఱింగినది. ఇట్టి ద్వివిధపరిజ్ఞాన సమాశ్రయము, జాతీయవిద్యాలయములయందు చూపట్టవలయును ప్రస్తుత మక్కడక్కడ స్థాపింపబడిన జాతీయకళాశాలలలో ననేకమంది యుపాధ్యాయు లసమర్థులుగ నున్నా రని వ్రాసినందులకు మన్నింతురుగాక. విద్యాబోధనము మహత్తరమగు కార్యములలో నొకటి. పారమార్థికచింతతో నీఘనకార్యమునకు దొడంగిన బోధకుడే బోధకుడు. అట్టి గురుసమ్ముఖమునఁ బఠించినశిష్యునకు లభించిన విద్యయె విద్య. గురుశిష్యుల మనంబులు కళంకరహితములై యుండునపుడె బోధనామహాకార్యము సఫలమగును. విద్యాబోధనాసమయము ఆత్మతో నాత్మ సంభాషించుపవిత్రసమయము. ఇట్టిసమయమున గురుశిష్యులలో నేరి మనంబు గాని హేయమగుతలంపులకు లోనయ్యెనేని యీపవిత్ర కార్యమునకు విఘ్నము గలుగును. శిష్యుని మనోనేత్రమున కెప్పుడును గురువుయొక్క విద్యాసంపత్తి లోతు తెలియని మహాసముద్రమువలె మహాకారమును దాల్చియుండవలెను. ప్రాచీనగురుశిష్యసాంప్రదాయము జ్ఞప్తికి రావలె. బాలకుని మనఃకుసుమమును వికసింపజేయుట తన ముఖ్యధర్మ మని యితడు గుర్తెఱుంగవలయును. భారతజాతీయ జీవనము చిరకాలము నిద్రావస్థం దగుల్కొనినది. కళలు తేజోహీనములై క్షీణించినది. కళలు జీవపోషకములు. కళావికాసమే సౌందర్యము ప్రకృతిసౌందర్యమయము జాత్యభ్యుదయమునకు, చిత్రలేఖనము వర్ణలేపనము, జీవకళలు, తత్పునర్వికాసప్రకాశ మావశ్యకము. అదియు జాతీయవిద్యలో నొక అంగము. హిందూదేశముయొక్క ప్రాచీనౌన్నత్యము సంస్కృతభాషామూలకముగ తెలియుచున్నది. సంస్కృతభాష సూర్యప్రభవలె శాశ్వతమై ప్రకాశమానమై వెలుఁగుచున్నది. హిందూదేశమున ప్రపంచోత్పత్తిస్థితుల నభివృద్ధికి దెచ్చుటకుగూడ తపఃప్రభావవిలసితులు బహుళప్రయత్నములు గావించిరి. ఋషు లైహికాముష్మిక బోధకులుగా నుండిరి. సంస్కృతభాషావిషయము లిప్పుడు సర్వప్రపంచపర్యటనము సల్పుచున్నవి బుద్ధిబలము గలవారి కది కామధేనువువలె ఫలించుచున్నది. హిందూదేశమునకును సంస్కృతభాషకును అవినాభావసంబంధము తత్కారణముచే సంస్కృతము జాతీయవిద్యావిధానములో ముఖ్యాంగముగ నుండవలెను. సార్వజనికభాష హిందీయును, మాతృభాష ఆంధ్రభాషయును, విధాయకము లగుటచే జాతీయకళాశాలలలో, ముఖ్యముగా నేర్పవలెను. సాధ్యమగునంతవఱకు కళాశాలలు, పత్తనములమధ్య నుండక సుప్రసిద్ధము లగు నదీతటములను విశాలమగు ఆరామములలో నిర్మింపఁబడి అభిగమ్యములుగ నుండవలయును.

విద్యావిషయమైన యాకద్విషయములును యూరపుఖండమున చాలవఱకు దృప్తికరముగనే పరిష్కరింపఁబడినవి. కారణము అక్కడ పాలకులు పాలితులు ఏకజాతీయులు. ఇక్కడనన్నో పాలకులు విజాతీయులు. తత్కారణముచేతనే ప్రస్తుతప్రవిద్యావిధానము ఆర్యజాతిని మధ్యయుగంబునాటి బానిసత్వముకంటె నధోగతిలోనికి దెచ్చుచున్నది.

ప్రపంచమంతయు పశ్వవస్థలో నుండినప్పుడు ధనాగార మని జగద్విఖ్యాతిని గాంచిన భారతవర్షము నేడు చిన్నయినుకముక్కకు పరుల నాశ్రయింపవలసివచ్చెను. భరతఖండమునందు సహజసంపదలకు లోటు లేదు. బొగ్గుగనులు లోహపుగనులు వజ్రపుగనులు బంగరుగనులు గలవు. అటవీపదార్థములు గలవు. జలాశయములు గలవు. కాని వానివికాసము బాగుగ జరుగుటలేదు. భరతఖండమునందలి కర్మకారులకు వంశానుగతంబైన నైపుణ్యము గలదు. కర్మకారులు సామాన్యముగ పాశ్చాత్యదేశములందువలె భోగపరాయణులు గాక నిగ్రహగుణశీలురు. జనులకు వంశానుగతంబైన కర్మకౌశలము గలదు. ప్రజలయందు నిక్షిప్తమైన కర్మకౌశలమును దేశవికాసమునకు వినియోగపడునటుల పనిపూనుట ముఖ్యధర్మము. ఆర్యావర్తమును తొల్లింటియౌన్నత్యమునకు దీసికొని రావలెనన్న మన బాలురకు నిజమైన దేశచరిత్ర నందజేయవలెను. ఏచరిత్రములు, భారతజాతీయహృదయమును బహిర్గతము గావించుచున్నవో ఆచరిత్రములనే జాతీయకళాశాలలవారు సంపాదింపవలెను. అట్టి గ్రంథరాజములు భారతభాగవతరామాయణము లని ప్రఖ్యాతి గాంచినవి. తద్గ్రంథములను బోలిన యుత్కృష్టగ్రంథము లెందును కానరావు. రుద్రమదేవి, మీరాబాయిలచారిత్రముగాని రసపుత్రుల శౌర్యధైర్యవీరోద్రేకములు గాని రాణాప్రతాపసింగునుగూర్చిగాని శివాజినిగూర్చిగాని, ఆధునికచరిత్రబోధకగ్రంథములలో నొకవాక్యమైనను చెప్పకుండుట కడుచోద్యము. మతోద్ధారకుల మహాప్రబోధముచేత పతివ్రతాశిరోమణుల పాదధూళిచేత కవిశిఖామణుల కవితానైపుణ్యముచేత వణిక్సంఘాగ్రేసరుల వాణిజ్యనైపుణ్యముచేతను, శిల్పమున కంతకును దిగ్భ్రమను గల్గించిన భారతవర్షము నేడు ప్రతినిత్యము, జ్యూసెస్సు, నెపోలియన్, షేక్స్పియర్, టాలస్టాయి విక్టోరియాల నామములనే స్మరించు, పుత్రులను గనుట పూర్వజన్మకృతఫల మనవలెనో మరేమనవలెనో దెలియకున్నది. పాశ్చాత్యఖండముల చరిత్రములు చదువవలసినదే. అందు తప్పులేదు. కాని తనమాతృదేశచారిత్రమును విపులముగా వల్లెవేయుచు దానిప్రక్కను అన్యదేశీయులచరిత్ర పఠించుట బాగు. జాతీయకళాశాలలలోని తరగతులుగూడ ప్రభుత్వపు కళాశాలలవలె నాలుగు ప్రాకారములమధ్య బంధింపబడుట వెగటుగ దోచును. బాహువీర్య మభివృద్ధిచేయు, శరీరవ్యాయామము ప్రస్తుతము స్థానభ్రష్టమైయున్నది. అరగంట నడచిన, ఆయాసము. పావుగంట పరుగెత్తిన పడిపోదుము. పుస్తై - పుడక - పూస, అమ్మి, ముష్టి నష్టి యెత్తి పదిమంది చేరి పట్టణవాసకాపురము చేసి, యిల్లుగుల్లచేసి, భోగులెల్ల జోగులగుచున్నారు. ప్రస్తుతవిద్యావిధానములో మన హిందూ మతమునకు స్థానము లేకుండుటచే, ఆకార్ఖానాలలలో తయారైన, యువకు లందరకు, తన్మతమునందు గౌరవము నమ్మకము శూన్య మగుచున్నది.

జాతీయకళాశాలలలో చిత్తహస్తంబులవృత్తులకు సంయోగము గల్పించువిద్య నొసంగవలెను. చేతికిని, కంటికిని, మనస్సునకును సంధానంబగునట్లు నొసంగెడు విద్యయె మనకు సరియైనది. ఇట్టివిద్యవలన, ధైర్యము - సాహసము - నూతనస్థితిగతులనుండి జయముగైకొనుటకు గావలసిన సద్యస్సంసిద్ధత - కుశాగ్రబుద్ధి మున్నగు సుగుణంబులు తిరిగి విజృంభించును. పట్టువిడువక యెదిరించుచున్న జాతీయవిద్యావిధాన మంతయు దేశభాషలలో జరుగవలెననుట కెట్టి అభ్యంతర ముండనేరదు. అది సర్వజనాంగీకృతమే. జాతీయకళాశాలలు పూర్వకాలపు గురుకులవాసపు పద్ధతి నవలంబింపవలెను. గురువునకును శిష్యునకు నెక్కువ సంబంధ ముండవలెను. గురువు కేవలము దనయుపదేశములచే శిష్యునకు బోధించుటయే గాక, స్వార్థత్యాగాది గుణంబులచేత శిష్యునకు ఆదర్శపురుషుడుగ నుండవలెను. జాతీయకళాశాలలకు వీలయినంతవరకు మానవసంబంధములయొక్క విలసనమున కవకాశ ముండవలెను. ప్రస్తుతము నాగరికత వృద్ధినొందుచున్న స్థలములు పురాణేతిహాసప్రసిద్ధరంగంబులకు దూరంబులై వెలసియున్నవి.

వేయేల? అడుగంటి పోయిన ఆర్యమతమును - దగ్ధమైపోయిన దేశచరిత్రమును - పటాపంచలై పోయిన పరిశ్రమలను - దూరమైపోయిన దేహపటుత్వమును - బూడిదపాలైన భౌతికవిద్యను - అధఃపాతాళమున కరిగిన ఆధ్యాత్మికజ్ఞానమును - పునరుద్ధారణజేసి, మన తొల్లింటి ప్రతిభను కాపాడుట భారతీయుల ధర్మము. బలహీనునకీ భూస్థలిని స్థానము లేదని గ్రహించి జాతీయవిద్యావిధానమును సర్వజనమున కందుబాటుగ నుండునట్లు చేయ దేశీయులందఱును ప్రార్థితులు.

# జిహ్వ

తల్లాప్రగడ సూర్యనారాయణ రావు గారు

జిహ్వా! నీకేల వచ్చె ♦ నీచేటుకాల
మేది చూచిన పాపంబు ♦ నీది కాదె?
పాపముల కన్నిటికి ♦ నీవె ప్రాది వౌదు
నింద్రియోద్రేకమే గదా ♦ యొసఁగఁజేయు
పాతకము లెన్నిటి సయినఁ ♦ బోలుగొనఁగ.
నీవు పాల్గొనకుండిన ♦ నేడనుండి
గలుగు నుద్రేక మింద్రియ♦గ్రామములకు
తిన్న తిండియె కాదె యు♦ద్రేకమునకు
నింద్రియ ప్రాభవమునకు ♦ హేతు వరయ
నియమ మాహారమున గల్గి ♦ నెగడునెడల
నింద్రియమ్ముల కుద్రేక ♦ మొసఁగు నొక్కొ?
కంటి కగపడినది యెల్ల ♦ పంటనూదఁ
దలఁతు వే మిది ♦ ప్రీతి యొదవిసఁ జాలు
క్షుత్తుతోఁ గూడఁ బనిలేదు ♦ క్రూరగముగను
బట్టి తిందువు పడఁగొట్టి ♦ ప్రాణివితతి
నేడఁ గన నీదుకోర్కె ♦ చెల్లించుకొనుకె
జగతి యత్నము లన్నియు ♦ జరుగుచుండు.
పశువితతి మాట యట్లుండ ♦ ప్రాజ్ఞులైన
బుద్ధిజీవులు గూడను ♦ శుద్ధిబద్ధ
మించుకంతయు లేకుండ ♦ నెసఁగుమంద్రు
పశువులే మేలు ♦ వీరలభంగి గనిన
కడుపు నిండిన నవి ♦ యెందుఁ గదలఁబోవు.
దినములును హాయనములును ♦ దిండికొఱకె
పడఁగ నేరవు తిప్పలు ♦ బహువిధముల
కడుపు నిండిన నవ్వి ♦ సుఖంబు గాఁగ
గాఢముగ నిద్రపోయెడుఁ ♦ గదలకుండ
నెపుడు లభియింపకుండిన ♦ నపుడు పడెడు
బాధయే తప్ప నితరంపు ♦ బాధ లేదు.

ఐహికసుఖంబు లయ్యవి ♦ హాయిగాఁగఁ
బొందు చుండెడుఁ; బొందవు ♦ ముందుబాధ
యొదవుదానితో సంతుష్టి♦నొందుచుండి
మనుజు లటుగాదు ♦ తిన్నఁగ దిండి దినక
యున్న వేళలఁ గూడను ♦ నున్న యంత
సకలబాధలు పడుచుంద్రు ♦ సంతరింప
రేపటికి దాఁచియుంచంగ ♦ రేపుమాపు
దేవుఁడిచ్చినదానితో ♦ దృప్తిపడక
దేహసౌఖ్యంబులకు వేఱె ♦ యెన్నొ గనక
కృత్రిమోపాయములను ♦ భజియింపరెన్నొ.
వానికోసము పడరాని ♦ పాట్లుపడుచు
నైహికముగూడ లేకుండ ♦ నలరుచుంద్రు
పరసుఖముమాట చె♦ప్పంగవలెనె యింక
దాని తలఁపైన జొరనీరు ♦ మానసమున
అంగముల నెల్ల ♦ నీవు గుహ్యాంగకమును
పాపకర్మలలో నెల్లఁ ♦ బాపకర్మ
లందునను నీవు ప్రథమ♦గణ్యవు నిజంబు
వినదియుఁ గానిదియుఁ గూడ ♦ నారగించి
యఘములకుఁ ద్రిప్పుచుందు ♦ గుహ్యాంగకమును
గట్టుదిట్టములకు నీవు ♦ కట్టువడిన
నైహికాముష్మికములును ♦ నమరుగాదె
ఆధియును వ్యాధియును♦గూడ నైనయట్టుడు
కానియపుడును దినుటచే ♦ కాదె గలుగు
రోగులందఱు నిను ♦ ముందు గాన నందు
లాపసలమును నీనోట ♦ నట్టె గొట్టి
నీటితో నిన్ను సరిఁబెట్టి ♦ రోటు! ఇంక
మంతరింపంగ జేయఁగ ♦ జాడనాడ
గాలితో నిన్ను గడతేర్చి ♦ గాంత్రు ముక్తి.

# రక్తభ్రమణ సిద్ధాంతము

శ్రీ రంగం సంగమేశ్వర శాస్త్రి గారు

మనుష్యశరీరమందు రక్తముయొక్క భ్రమణమును గురించి ఆయుర్వేదవిద్వాంసులలో కొందరికి భిన్నాభిప్రాయమున్నట్లు కనబడుచున్నది. వీరిలో కొందఱు రక్తమునకు చలనమే లేదనియు, చలించునది వాయువుమాత్రమే యనియు మఱికొందఱు రక్తమునకు చలనము గలదుగాని భ్రమణము లేదనియు అభిప్రాయపడుచున్నారు. ఇప్పటి పాశ్చాత్యతంత్రములనుబట్టి రక్తమునకు చలనమును, భ్రమణమును గలవని సర్వసమ్మతము. రక్తచలనభ్రమణములను గురించి ఆయుర్వేదతంత్రాభిప్రాయములను కొంచము విమర్శింతము:
(1) రక్తముయొక్క పూర్వరూపము రసము అనబడును. ఈ రసోత్పత్తిని గురించి సుశ్రుతమం దిట్లు వ్రాయబడియున్నది.

"సమ్యక్పరిణతస్యాహారస్య యస్తేజోభూతస్సారః పరమసూక్ష్మస్స రస ఇత్యుచ్యతే. తస్య హృదయం స్థానం సహృదయాచ్చతుర్వింశతి ధమనీ రనుప్రవిశ్య కృత్స్నం శరీరం అహరహ స్తర్పయతి వర్ధయతి ధారయతి యాపయతి జీవయతి చ"

బాగుగా పక్వమగు ఆహారమునుండి మిక్కిలి సూక్ష్మమును, తేజోవంతమును నగు ఒక సారము కలుగుననియు ఈ సారము రస మనబడుననియు, ఈరసమునకు హృదయము ముఖ్యస్థానమనియు, నీరసము హృదయమునుండి 24 ధమనులను ప్రవేశించి సర్వశరీరమందును వ్యాపించి తర్పణ వర్ధన ధారణాది కృత్యములను జరుపుననియు పై వాక్యములు చెప్పుచున్నవి.

ఆహారము జీర్ణకోశ (కోష్ఠ) మందు పక్వమయి రసమగును. చలనము లేనియెడల కోష్ఠమునుండి హృదయమునకును, హృదయమునుండి ధమనులకును, వీనినుండి సర్వశరీరములకును నెట్లు పోవును? చలనకారణము వాయు వన్నను రసచలనము ఒప్పుకొనక తీర గదా? (2) "రసగతౌ-అహరహ ర్గచ్ఛతీతి రసః" ఈవ్యుత్పత్తిబట్టి రసమునకు చలనము సిద్ధము. (3) "సఖ ల్వాప్యోరసో యకృత్ప్లీహానౌ ప్రాప్య రాగముపైతి॥ శ్లో॥ రంజితా స్తేజసా త్వాపః శరీరస్థేన దేహినాం, అవ్యాపన్నాః ప్రసన్నేన రక్త మిత్యభిధీయతే"॥

జలభూయిష్ఠమగు సారసము యకృత్ప్లీహాలకు పోయి యెఱ్ఱబడును. శరీరములో తిరుగుచుండగా రససంబంధమగు నీరు ప్రసన్నమగు శరీరసంబంధమగు తేజస్సుచేత నెఱ్ఱగా చేయబడి రక్త మనబడును. అనగా శరీరములో రసము పోవుచుండగా కొంత యెఱ్ఱబడుచు యకృత్ప్లీహాలలో చేరినప్పుడు బాగుగా నెఱ్ఱబడునని భావము. ఇందువలన రసము పోవుచునే కొంత యెఱ్ఱబడుచు యకృత్ప్లీహాలలో చేరినప్పుడు బాగుగా నెఱ్ఱబడునని భావము. ఇందువలన రసము పోవుచునే రక్తముగా మారుచుండు ననుటచేత నిట్లు మారుచుండు రక్తమునకు చలనము స్పష్టముగదా? రసమునకు యెల్లప్పుడు గతిచెప్పుచు యకృత్ప్లీహాలలో యెఱ్ఱబడు ననుటచేత అక్కడనుండి పోవుననియు భావించుట సాహసము. (4) "సఖలు త్రీణిత్రీణి కళా సహస్రాణి పంచదశకళా ఏకైకస్మిన్ ధాతా వవతిష్ఠతే ఏవం మాసేన రస శ్శుక్రో భవతి".

ఈరసము రక్తాదిధాతువులయందు 3015 కళలు- అనగా సుమారు 5 దినములు (600 కళలు ఒకదినము) ఒక్కొక్కదానియందు నుండును. ఈ ప్రకారము సర్వదా గమనస్వభావము గల యీరసమే రక్తాది ఉత్తరధాతువులుగా మారుచు ఒకమాసములో శుక్రముగా మారును. (5) "రక్తం వర్ణప్రసాదం మాంసపుష్టించ కరోతి" రక్తము శరీరమునకు వర్ణమును, మాంసమునకు పుష్టిని కలుగజేయును. ఈ రెండుకర్మలను జేయుటకు రక్తమునకు శరీర మంతటను వ్యాప్తియుండవలెను.

(6) "యస్మాద్రక్తం వినా దోషై ర్నకదాచిత్ ప్రకుప్యతి తస్మాత్తస్యాయథాదోషం కాలం విద్యాత్ప్రకోపణే"॥

వాతపిత్తకఫములతో కలిసియే రక్తము ప్రకోపించును గాని దీనికి ప్రత్యేకముగా ప్రకోపము కలుగదు. అని పైవాక్యసిద్ధాంతము.

"ఏవం దోషాః కదాచి దేకశః ద్విశ స్సమస్తా శ్శోణితసహితావా అనేకధా ప్రసరన్తి తద్యథా; వాతః పిత్తం, శ్లేష్మ, శోణితం; వాతపిత్తే వాతశ్లేష్మాణౌ, వాతశోణితే, పిత్తశ్లేష్మాణౌ, పిత్తశోణితే, శ్లేష్మశోణితే వాతపిత్తశోణితాని, వాతశ్లేష్మశోణితాని, పిత్తశ్లేష్మశోణితాని, వాతపిత్తకఫశోణితా నీత్యేవం పంచదశధా ప్రసరన్తి".

"వాత పిత్త కఫ శోణితములు ప్రత్యేకముగాను, రెండేసిగాను మూడేసిగాను, అన్నియుకలిసి శరీరమందు ప్రసరించును" రక్తమునకు చలనము లేనియెడల ప్రకోపప్రసరము లుండుట యెట్లు? పై కారణములచే రక్తమునకు శరీరమందు చలనము ఒప్పుకొనకతీరదు.

ఇటుపిమ్మట రక్తభ్రమణమును గురించి విచారింతము.

(7) "విసర్గాదానవిక్షేపైః సోమసూర్యానిలాయథా ధారయంతి జగద్దేహం కఫ పిత్తానిలా స్తథా"॥

సూర్యుడును, చంద్రుడును, గాలియు (అనగా ఉష్ణమును శీతమును గాలియు) ఎట్లు బలమును, నీటిని తీసికొనుట, విడిచిపెట్టుట, పంచిపెట్టుట, అనుపనులను చేయుచు జగత్తును కాపాడుచుండునో,

అట్లే పిత్త కఫ వాయువులు శరీరమును కాపాడుచున్నవి. భూమధ్య రేఖాప్రాంతములనుండి ధ్రువప్రదేశములకు ఉష్ణవాయువును, ధ్రువప్రదేశముల నుండి భూమధ్యప్రదేశములకును శీతవాయువును ఎల్లప్పుడును వీచుచుండుటకు ఆవిసర్గాదాన విక్షేపశక్తులే కారణములు. సాముద్రభౌమవాయువులకును నీశక్తులే కారణములు. వర్షకాలపు వృష్టికిని, ఈ శక్తులే కారణములు. సముద్రపునీటిని శీతోష్ణములను ప్రపంచమందు పంచిపెట్టి కాపాడుట యీశక్తుల ప్రయోజనము. ఇట్లే వాత పిత్త కఫములు అనగా వాయు, ఉష్ణ, శీతములు పైని చెప్పిన మూడుశక్తుల చేతనే, శీతోష్ణవాయువులను రసాదిధాతువులను, శరీరమంతటను ఎల్లప్పుడును వ్యాపింపజేసి కాపాడుచుండును. పైశక్తులవలన ప్రపంచమందు, అహోరాత్రపరివర్తనమును, ఋతుపరివర్తనమును, అయనపరివర్తనమును కలుగుచున్నవి. శరీరమందు ఉష్ణ శీతవాయు రస, రక్తాది పరివర్తనములు (పరిభ్రమణములు) కలుగుచున్నవి. ఇది సార్వకాలికము.

(8) "యేనౌజసా వర్తయన్తి ప్రీణితా స్సర్వదేహినః, లియద్ధృతే సర్వ భూతానాం జీవితం నావతిష్ఠతే, య త్సార మాదౌ గర్భస్య యోసౌ గర్భరసా ద్రసః, సంవర్ధమానం హృదయం సమావిశతి య త్పునః"—

చరకము ఏ ఓజస్సులేనిది సమస్తభూతములును జీవించలేవో, ఏది మొదట గర్భముయొక్క సారమో, ఏది గర్భరసములవల్ల మొదట రసధాతువుగా నుండునో, ఏది హృదయమును పోషించుచు తిరిగి వచ్చి హృదయములో ప్రవేశించుచుండునో అని పైదానికి అర్థము. దీనివలన కూడ రసాదిధాతుభ్రమణము స్పష్టముగా సూచింపబడుచున్నది. ఆద్యంత్యధాతుగ్రహణముచేత అన్నిధాతువులకును గ్రహణము.

(9) "మాసేన యాతి శుక్రత్వం అన్నం పాకక్రమాదిభిః। సంతతం భోజ్యధాతూనాం పరివృత్తి స్తు చక్రవత్" (అష్టాంగహృదయము)—

అన్నము పాకక్రమముచే రసాదిధాతువులుగా మాఱుచుడుదకు ఒకమాసమునకు శుక్రముగా మాఱును. ఎల్లప్పుడును రసాదిధాతువులకు చక్రమువలె పరిభ్రమణము కలుగుచునే యుండును.

ఇంకను భావప్రకాశయందును దీని వ్యాఖ్యయందును ధాతుభ్రమణమును సూచించు ప్రమాణము లనేకములు గలవు. ఇట్టి ప్రమాణము లనేకము లుండగా రక్తభ్రమణము ప్రాచ్యతంత్రసమ్మతము కాదనియు కేవల పాశ్చాత్యతంత్రవేద్య మనియు చెప్పుట మిక్కిలి సాహసము. ధన్వంతర్యాది గ్రంథకర్తలును ఉభయసిద్ధాంతవేత్తలును నగు బ్రహ్మశ్రీవల్లంపల్లి భైరవమూర్తిగారును శ్రీయుత మహామహోపాధ్యాయగణనాథసేను గారును రక్తభ్రమణసిద్ధాంతము ప్రాచ్యతంత్రములయందు పాశ్చాత్యతంత్రములు పుట్టుటకు ముందు పెక్కు వందల సంవత్సరములకు పూర్వమే స్పష్టముగా స్థిరపఱుపబడిన దని తమయభిప్రాయమును తమగ్రంథములయందు తెలిపియున్నారు. మాత్సర్యమును విడిచి మాధ్యస్థము నవలంబించు మహాత్ములకు అతివిస్తరవిమర్శన మనగత్యము.

# ఆదర్శ పురుషుఁడు

డి. చంద్రశేఖరయ్యా గారు

ఆంతర్మహోధ్వను । లబ్ధిఘోషంబు
 మీఱి తాఁకుచు వచ్చె । మిత్రయులకెంపముల;
ప్రకృతి యానంద బా । ష్పముల నర్పించె;
లోకబాంధవుఁ డూర్ధ్వ । లోకంబునుండి
తల యూఁచి మానవ । ధర్మసామ్రాజ్య
పట్టాభిషేకార్హు । పరమావతార
మానందముగఁ గని । యాశీర్వదించె;
సురపుష్పవృష్టి భా । సురముగఁ గురిసె;
నంత గాఢతమిస్ర । మధ్యంబునందు
దీపదర్శనమట్లు । దీనహృద్వర్తి
నాజ్ఞానతిమిరంబు । నరికి భంజించు
లోకాయతమతంబు । లుత్తరంబుఁ జేయు
జ్యోతిగాన్పడె నమ్మ । చూడరే మహితు.
గాంధీమహాయుగ । ఘనత నేమందు
దేశదేశమునను । దివ్యప్రబోధ
మును జేసె నమ్మహా । త్ముని బోధనములు;
ప్రణయానుబంధ ప్ర । పంచమధ్యమున
నుద్దీపనంబుగ । యోగిసామాన్య
జనుల సామ్యంబుగఁ । జను నేది పరమ
మైత్రి స్వార్థత్యాగ । శాత్రవహరణ
కార్యంబులకు నేది । కల్పవృక్షంబు;
అమితసంసారాంబు । రాశిమధ్యమున
నుల్లోలకల్లోల । ములఁ జిక్కి పార
మొరదఁగా లేక వ్యా । మోహ మరదుచును

భ్రమియించు చిత్త మా।ప్యాయన మొంది
తరియింపఁ జేయు స।త్తారకం బేది?
యట్టి శాంతియె సుమ్ము । పరమావలంబ
నము గాని యన్యోన్య । ఘర్షణమతిని
చెడిపోకుఁడీ యని । చెప్పెఁ గదమ్మ;
నిద్రాణమైయున్న । నిఖిలభారతము
వాక్యపటహధ్వని । వర్తింపఁ జేసి
యాత్మీయ బలవిశ్వ।సనము నేర్పించె;
"ఆత్మవ త్సర్వభూ।తాని" యటంచు
సర్వజీవుల నొక్క । సమభావమునను
ప్రేమైకజీవన ప్రీతి । బోధించె;
ఆత్మరాజ్యమె (స్వ) రాజ్య।మగుఁగాని యెందుఁ
దాన యమ్ముడుపోయి । ధర యెల్లఁ గల్గ
నేమి భావ్య మటంచు । నెఱిఁ జెప్పె నమ్మ;
అస్పృశ్యు లొక్కరు । ధరణిఁ గల్గుదురె
పరమాత్మఁ డొక్కండ । పరఁగ నాతనిసు
తులు గారె మానవు । లేల భేదంబు;
మాత్సర్యమును వీడి । మహితాత్మ లగుచుఁ
జేచేయి కలుపుఁడీ । శివ మగు మీకు;
నిష్కామమత మన । నిలుకడఁ గల్గి
పరమాత్మనైక్యంబుఁ । బడయుట గాని
శ్రోత్రమాత్రము గాదు । సంస్కృతిఁ జూడ
"సర్వధర్మాన్ త్యజ్య" । యను వాక్యమునకు
నించుక భేదంబు । లేదు యోజింపఁ;
గావున హిందూ మ।హమ్మదమతస్థు
లార సాంఘికభావ । లలితాత్మ లగుచు
భారతవర్షంబు । ప్రాచీనఘనతఁ
దారసిలం జేయుఁ । డారహి మీఱ;
శాంతియు దాంతియు । స్వావలంబనము
గాని మార్గము వేఱు । గాదు మీకిపుడు;
మానినీమణులార । మహితకార్యంబు
వేచి యున్నది యిల్లు । విడిచిరం డిపుడు
పాశ్చాత్య నాగరి । కాశ్చర్యమాన
సులయి చెడి రిపుడు । నూవె మీపతులు
వారిఁ బురస్కరిం।పను నింక మీరు
ముందంజ వేయుఁడు । ముదమున ఖాది
వసనములనె తాల్పుఁ।డా సతతంబు
రాట్నముల నిజస్వ।రాజ్య గీతంబు
మధువులు చిందఁ బా।డుదము రం డిపుడు;
సుతులార! సతులార! । సోదరులార!
మాతృదైవము కమ్ము । పితృదేవు డగుము
ఆచార్యదేవుఁడ।వగు మను వాక్య
సంతతి విపులార్థ । జాలంబు దెలిసి
పరమాత్మ నింపారు । పట్టపురాణి
భారతీస్వాతంత్ర్య । ప్రాలంబమాలఁ
బరహస్తములనుండి । పాఱఁ జేయుదము
లెండు రండని చెప్పె । లెం డమ్మలార!
భీతిలేని ప్రశాంత।వీరుం డితండు
స్వాతంత్ర్య వినువీథి । ద్యోతకంబైన
మూర్తి దాల్చు ప్రతిజ్ఞ । మాని యితండు;
దేశ మన్యాధీన । దీనమై యుండఁ
గృష్ణజన్మస్థానకీర్తి । స్వాతంత్ర్య
మరయ సత్యంబున । కయి ప్రాణమాన
ధనముల నర్పింత । మని వచియించు
నార్యధర్మాధ్వరా।ధ్వర్యుం డితండు;
సతిసుతులను వీడి । సంపద వీడి
మానావమానముల్ । మమతలు వీడి
మానవసేవయే । మాపతిసేవ
యటు గాక ముక్తిందు । గాఁడంచుఁ దెల్పి
యట్లె తా వర్తించి । యరిగె బంధనము
నకు 'సత్యమేవహి । నానృతం జయతి'
యని గుణకంధి మ।హాత్ముఁడు గాంధి
జయ భారతీపుత్ర । జయ ధీపవిత్ర
జయ పుణ్యచారిత్ర । జయ శుభగాత్ర
జయము లోకోత్తర । జయ లోకతార
జయ దీనమందార । జయ శాంతవీర
జయజయ జయదేవ । జయ గాంధిదేవ!

# పంచలింగాలు

చింతా దీక్షితులు గారు, బి. ఏ., ఎల్. టి.

ఒక్కకాలమున నాంధ్రదేశమం దున్న పుణ్యతీర్థములలో వాసికెక్కిన పుణ్యతీర్థములు పంచలింగాలు. కృష్ణానదీతీరమున కొండలనడుమ నున్న అయిదు గ్రామములలో వెలసిన అయిదు లింగముల కీపేరు వచ్చినది. సంగమేశ్వరము, సిద్ధేశ్వరము, కపిలేశ్వరము, సోమేశ్వరము, మల్లేశ్వరము అని అయిదు గ్రామములు. ఇందు మొదటిమూడు గ్రామములు ఇంగ్లీషురాజ్యములో నున్నవి. కడపటి రెండు గ్రామములు నైజాము రాజ్యములో నున్నవి. ఇందు కపిలేశ్వరము మాత్రము కృష్ణానదీశాఖ యగు భవనాశీతీరమున నున్నది. ఒక్కొక్కప్పుడు భవనాశి పొంగి సమీపగ్రామముల తన నీరములచే ముంచివేయుచుండును. కపిలేశ్వరదేవాలయము కూడ నెన్నిమాఱులో భవనాశిలో మునిగిపోయినట్టు గ్రామస్థులు చెప్పుదురు.

ఒక్కకాలమున నీదేవాలయము లన్నియు ఆంధ్రుల భక్తికి లక్ష్యములై యుండినవి. మహారాజులపూజ లందినవి. నేడు చూచువారు లేక, కొన్నింటికి పూజారులు సయితము లేక శిథిలస్థితియం దున్నవి.

తపస్సు జేసికొనుట కనువగు తావులయందు, కొండలనడుమ, ప్రశాంత మెల్లకాలముల తాండవించు కాననములకడ నీ దేవళము లలరారుచున్నవి.

హంపీ విరూపాక్షప్రాంతములందు శిథిలస్థితి నొందియున్న కొన్ని దేవాలయముల గాంభీర్య మిప్పియు పొడసూపుచున్నవి.

దేశభక్తిపరాయణు లగు ఆంధ్రు లందఱు హంపీవిరూపాక్షస్వామిదర్శనమును తప్పక చేసికొనుచుండు విధముననే నీపంచలింగముల దివ్యదర్శనమును గావించి కృతార్థు లగుదురు గాక!

స్కాందపురాణాంతర్గత మగు శ్రీశైలఖండమున నీ పంచలింగముల మాహాత్మ్యము వర్ణింపబడినట్లు తెలియుచున్నది.

కర్నూలువద్ద రైలు బండి దిగి యాత్రికులు నందికొట్కూరు గ్రామమునకు బండి కట్టించుకొనవలెను. అచ్చట విశ్రమించి మరల రెండెద్దులబండిమీద సంగమేశ్వరము పోవచ్చును. కర్నూలునకును నంది కొట్కూరునకును సుమా రిరువదిమైళ్లదూరము. నందికొట్కూరునకును సంగమేశ్వరమునకును సుమారు 15 మైళ్లదూరము. బాటలు సరిగా లేకపోవుటచే ప్రయాణము కొంచెము కష్టముగానే యుండును. సంగమేశ్వరము పొలిమేర భవనాశి కలదు. అచ్చటనే యది కృష్ణవేణితో సంగమించుచున్నది. దీనిని దాటగనే సంగమేశ్వరము.

౧. సంగమేశ్వరము:—ఒకతట్టున ఎత్తైనకొండ గలదు. పర్వతపాదమున సంగమేశ్వరగ్రామ మున్నది. గ్రామమునకు కొన్నిగజముల దూరమున దేవాలయమున్నది. ఒకదిక్కున కృష్ణానది సర్వదా ప్రవహించుచుండును. ఒకదిక్కున భవనాశి కృష్ణను గలియుచున్నది. మధ్య దేవాలయమున్నది. ఈగ్రామమునకు కొలదిదూరములో నున్న చిన్నసంగమేశ్వరముకడ తుంగభద్రానది కృష్ణను గలియుచున్నది. ఇచ్చో కృష్ణ కొండలను మలుపుదిరిగి పోవుచున్నది. భవనాశి వచ్చి కృష్ణను కలిసి అడ్డముగా నున్న కొండను పడద్రోచి, నదీగమన మవ్యాహతముగ జేసినట్లు చెప్పుకొందురు. శాఖల నన్నిటిని తనలో జేర్చుకొని కృష్ణానది కొండను దాటలేక అచ్చో నిలిచియుండెనట. అప్పుడు భవనాశి వచ్చినదట. వచ్చి "మీరిచ్చట నిల్చితి" రే మని ప్రశ్నించినదట. "ఈపర్వతము మా గమనమును నిరోధించినది. కుందు (కుందేరు) వచ్చువఱకు మే మిచ్చట నిలిచి తరువాత కొండను ద్రోబ్బుదుము" అన్నదట. అప్పుడు భవనాశి "కుందు కుండెడు తెచ్చిన నెంత, తేకున్న నెంత, ద్రోబ్బు కొండను ద్రోబ్బు" మన్నదట. అప్పుడు భవనాశియౌద్ధత్యముచే పర్వతము దారి విడిచినదట! ఇది జానపదులందు వాడుకలో నున్న యితిహాసము.

ఇచ్చట నొక్కచో కొలిమిరాళ్లు విశేషముగా లభించుచున్నవి. పూర్వ మొకప్పు డిచ్చో కొలుములుపెట్టి యినుపపని చేయువారట. సంగమేశ్వరమున నున్న లింగము ధర్మరాజు ప్రతిష్ఠచేసినట్లు వాడుక. అది దారులింగమని కూడ వాడుక. కాని దారువును బోలిన మలచనిశిలాలింగమే యిప్పుడు చూడనగును.

తొలుత ధర్మరాజు శిలాలింగమును ప్రతిష్ఠజేయ నుద్దేశించి భీముని దానిని దే బంపెనట. భీముడు సకాలమునకు రాలేకపోగా ధర్మరాజు సమీపమున నున్న వేపచెట్టును కొట్టించి దారులింగమును ప్రతిష్ఠ చేసెనట. పిమ్మట పెద్దశిలాలింగమును భీము డెత్తుకొని వచ్చి ప్రతిష్ఠ జరిగిత సంగతి విని కినిసి దానిని కృష్ణలో పడునట్లు విసరెనట. నేటికిని అది కృష్ణలో తటమునకు కొంతదవ్వున కొంచెము ఒరగి నిలిచియున్నది. ధర్మరాజు తమ్ముని నోదార్చి దారులింగమును కొల్చుటకు ముందు భక్తులందఱు భీమలింగమును కొలుతురని చెప్పెనట. ఆరీతినే నేటికి సైతము భక్తులు భీమలింగమును పూజించినపిమ్మటనే దారులింగమును గొల్తురు.

సంగమేశ్వరదేవాలయమున రెండు శిలాశాసనములు గలవు. ఒక్కటి మండపస్తంభముపై చెక్కబడియున్నది శా॥ శ॥ 1485 సంవత్సరమునాటిది. రెండవశాసన మొకపెద్దబండపై చెక్కబడి యున్నది. ఆబండ క్రిందబడియున్నది. ప్రతాపరుద్రకాలమునాటి దీశిలాశాసనము కావచ్చును. పర్వతమునకు క్రిందిభాగమున రాతితేరని జనులు పేర్కొను వేఱొకదేవాలయము గలదు. దేవాలయముపై చక్కనిశిల్పకళ చూడనగును. దేవాలయములో, కప్పురాతిపై గూడ శిల్పము మనోహరముగా

నున్నది. చక్కనిరాతితో నాలయము నంతయు నిర్మించిరి. గోడలు రెండుతట్టుల కీర్తిముఖములపై నిల్చియున్నట్లు చూపబడినవి. ఆకారణముచేతనే కాబోలు జనులు ఈ ఆలయమును రాతితే రందురు. చక్రములు భూమిలో పూడియున్నట్లు గూడ జెప్పుదురు. చక్కగా చెక్కబడిన విగ్రహము లెన్నో గల్గి ఈ ఆలయము చూచుటకు మనోహరముగ నున్నది. ఆలయమున ప్రతిష్ఠింపబడినలింగ మున్నతముగా నున్నది. దీపారాధనము గాని, పూజలు గాని నేఁడందు జరుగుచుండుట లేదు.

ఈ యాలయమునకు కొలదిదూరములో వేఱొక యాలయము గలదు. ఇందు వేర్వేఱుగదులలో వేర్వేఱుచక్కనివిగ్రహము లమర్పబడియున్నవి. ఒక్కచో శ్రీరామపట్టాభిషేకమును వ్యక్తపఱచు విగ్రహములు గలవు. శ్రీరాముడు, (ధనుర్ధరుడు) లక్ష్మణుడు, సీత, ఆంజనేయులు—అన్నియు సుందరమైన విగ్రహములే. వేరొకచో శంఖచక్రగదాధారి యగు విష్ణువిగ్రహమును, ఇంకొకచో వేంకటేశ్వరుడును, శివుడును. ఇంకొకతట్టు పొంకమగు సరస్వతీ విగ్రహమును గలవు. ఆంధ్రులశిల్పచాతుర్య మిచ్చో గొంత కాననగు. ఇందలి సరస్వతీ విగ్రహము మల్లేశ్వరమం దున్న సరస్వతీవిగ్రహమును బోలియున్నది. దీనినిబట్టి పంచలింగాలలో విగ్రహముల జెక్కిన శిల్పు లొక్కరే యని తోచుచున్నది.

ఈవిగ్రహములకు నేడు పూజలు లేవు. ఈగ్రామమం దున్న పురాతనదేవాలయములను, కర్నూలు పురవాసులును, చతుర్థాశ్రమమును స్వీకరించినవారు నగు శేషావధానులుగారు చందాలమూలమున ధనమును వసూలు చేసి బాగుచేయుచున్నారు.

౨. సిద్ధేశ్వరము:— సంగమేశ్వరమునకు సుమారు మైలు దూరమున సిద్ధేశ్వర మున్నది. కృష్ణానదీతీరము నంటి పర్వతపాదమును చుట్టిపోవలెను. నది యిచ్చో మిక్కిలి విశాలముగా నున్నది. ఎల్లయెడల నల్లని పెద్దపాషాణములు నీటినుండి పైకి కాన్పించుచుండును. నున్నగా నున్న కొన్నిబండల నిక్కడివారు పాళముబండ లందురు. కొన్ని బండలపై సీతాదేవి తన చీరల నారవేసికొనినట్లు ఆనవాళ్లను జూపుదురు. త్రోవలో కొండపై కామాక్షీదేవాలయము కలదు. లోపల నెప్పుడు చీకటి. దీపముతో పట్టపగలు లోనికి ప్రవేశింపవలయును. ఈప్రాంతముల విశ్వామిత్రుడు తపస్సుచేసెనట.

సిద్ధేశ్వరము సంగమేశ్వరమువలెనే చిన్నగ్రామము. ఆలయము కూడ చిన్నదే. ప్రాచీనాంశములు లేవు. శిల్పము లేదు. ఆప్రాంతముల సిద్ధులమఠము లుండెడి వని చెప్పుదురు.

సిద్ధేశ్వరలింగము పెద్దది. చేతది. ఉన్నతముగా నున్నది. రెండు పూటల పూజలు జరుగుచున్నవి.

3. సోమేశ్వరము:—సిద్ధేశ్వరమున కద్దరి సోమేశ్వరము గలదు. ఇది నైజాముراజ్యములో నున్నది. కృష్ణానదిని అరిగెలపై దాటి సోమేశ్వరమునకు పోవలయును. ఇచ్చట కృష్ణానదీజలములందు మొసళ్లు మెండుగా నున్నవి. వెదురుపేళ్లతో గుండ్రముగా పెద్దబుట్టవలె నల్లి అడుగున చర్మములతో గుట్టి దానిని తెడ్లతో నదిపై నడిపింతురు. దీనినే 'అరిగె' యందురు.

సోమేశ్వరుని యాలయము చాల పెద్దది. కడు శిథిలస్థితిలో నున్నది. గ్రామముమధ్య నున్న దీయాలయము. గుడిలో అన్నివైపులను లింగములును నందులును గలవు. కాని ఒక్కసోమేశ్వరలింగమునకు మాత్రమే పూజలు జరుగుచున్నవి. తంబళవా డొక్కడు పూజారి.

ఇక్కడ ఒక పురాతనశిలాశాసన మున్నది ఎవరో 'మహారాజులు' వ్రాయించినది. శాసన మున్న శిలను ఒక స్తంభమువలె బోటుగా పెట్టినారు. దానికి నాల్గువైపుల వ్రాత యున్నది.

స్తంభములపై శిల్పము బాగుగా నున్నది. చూడదగినది ఇంత అందమైన పెద్దదేవాలయము గ్రామముమధ్య నుండియు శిథిలస్థితియం దుండుట కడుశోచనీయము. ఒకగుడికడ కొలిమి పెట్టి పనిచేయుచున్నారు కొందఱు కమ్మరవాండ్రు. ఎట్టియాలయమున కెట్టిపాట్లు వచ్చినవో!

౪. మల్లేశ్వరము:— ఏటి కావలగడ్డ సోమేశ్వరమునకు సుమారుమైలు దక్షిణముగా నున్నది. ఆలయము రెండుకొండలనడుమ నున్నది మల్లేశ్వరగ్రామ మాలయమునకు కొంతదవ్వున నున్నది. ఈ గ్రామమును నైజాముराజ్యములో నున్నది.

ఆలయము పెద్దది. మల్లేశ్వరుడు స్వయంభువు. ఒకతంబళి ప్రతిదినము వచ్చి దీపారాధనము చేసి పూజచేయుచుండును. సోమేశ్వరదేవాలయమువలెనే యీదేవాలయమును ఒకప్పుడు మిక్కిలి ప్రసిద్ధిజెందిన యాత్రస్థలమైనట్లును మహారాజులచే మన్ననల బడసినట్లును తోచుచున్నది మల్లేశ్వరున కెదురుగా పార్వతీవిగ్రహము గలదు.

దేవాలయములో అగస్త్య లోపాముద్రల విగ్రహములు గలవు. ఇచ్చట అగస్త్యుడు తపస్సు చేసెనట. ఈలింగము నామహర్షి ప్రతిష్ఠచేసినట్లు గూడ జెప్పుదురు.

ఒక్కచో చక్కని వాణీవిగ్రహము కలదు. లోన కప్పునగాడిపై నటరాజవిగ్రహమును చుట్టును అష్టదిక్పాలకవిగ్రహములును చెక్కియున్నారు సంగమేశ్వరమునందువలెనే.

ఒకగోపురముమీద చిన్నగుహ ఏర్పాటైయున్నది. గుహ చీకటికోణము.

ఆలయమునిండ ఎన్నోలింగములు నందులు కలవు. వేనికిని పూజలు లేవు.

స్తంభములపై చెక్కడములును పునాదిపైభాగమున ఆలయము చుట్టును గల చెక్కడములును సుందరముగా నున్నవి. ఆంధ్రుల శిల్పచాతుర్యమును చాటుచున్నవి.

సమీపమున నున్న కొన్నిదేవాలయములు కడుశిథిలస్థితిలో నున్నవి.

ఒక్కచో రంగస్వామి శేషశాయియై యుంట గాననగును. నల్లనిరాతితో చెక్కిన విగ్రహము చెక్కుచెదరక యున్నది.

# ఆర్. వేంకటేశ్వర్ అండు కంపెని,

## లోన్ స్క్వేర్, మద్రాసు

### సద్ధర్మమంజరి

ఇది విశిష్టాద్వైతమునం దభిమానముగల ప్రతివారికిని చదువఁదగినది. ఇందలి విషయములు పంచసంస్కారముల స్వరూపప్రమాణఫలములు. ఇదివఱ కామతమువారైనచో వానిని తెలియుటచే ఆస్తిక్యము, శ్రద్ధ వృద్ధియై సుఖపడుదురు. కాని వారిందలివిశేషములు తెలిసికొని అచార్యులనాశ్రయించి శ్రేయమును పొందవచ్చును. కావున నీ యుత్తమగ్రంథము నొక్కసారి చదువఁగోరఁబడుచున్నారు. అందఱకును సులభమయిన తెనుఁగు భాషలో వ్రాయఁబడినది. దీనివెల 0 8-0 మాత్రమే.

### స్వారోచిషమనుచరిత్రము

#### పెద్దనామాత్య ప్రణీతము

ఇందు కృతిపతిచారిత్రము, కవిజీవితము, కవిత్వవిమర్శనము గలవు. భారతము, హరివంశము, కళాపూర్ణోదయము, భీమఖండము, దశావతారచరిత్రము, వసుచరిత్ర మున్నగు గ్రంథములలోని యేకాభిప్రాయములను సూచించు పద్యములను, మనుచరిత్రములోని యట్టిపద్యములతో ఉపమానరీతిగాఁ జర్చింపఁబడినవి. పాత్రలయొక్క స్వభావనిరూపణయు, కథాసందర్భముల నిచ్చుచుఁ బొందుపర్చఁబడినది. కథాసంగ్రహముకూడ వచనమునఁ గలదు. మార్కండేయపురాణమునందలి కథననుసరించి మనుచరిత్ర వ్రాయఁబడినదని సహేతుకముగా నిరూపింపఁబడినది. టీకాతాత్పర్యసహితము రూ. 2.

### శ్రీమదాంధ్రవచన మహాభాగవతము

సంస్కృతమునందు వ్యాసప్రోక్తమైన శ్రీభాగవతమును తేటగా నీటుగులుకు శైలిని పటములనుజేర్చి ముద్రించియున్నారము. ఇందు శ్రీధరీయము, తిలకము, అనెడి అనేక వ్యాఖ్యలయందుఁగల విశేషాంశములను జేర్చియున్నారము. ఈగ్రంథమును చిన్నసైజున మేలైన కాగితములపై నచ్చొత్తించియున్నారము. భాగవతోత్తము లందఱును ఆదరాతిశయమును జూపి చందాదారులుగాఁ జేరి మా కుత్సాహము గలిగింతు రని యువ్విళ్లూరుచున్నారము.

### శ్రీసీతారామాంజనేయ సంవాదము

#### టీకాతాత్పర్య విశేషార్థ సహితము.

ఇయ్యది ఆంధ్రంబున నొక్కటియే వేదాంతగ్రంథం బని తెలియంబడుచున్నది. ఇందు అద్వైతము ననుసరించి, జీవాత్మ పరమాత్మస్వరూపమును జీవాత్మ పరమాత్మలైక్యమును పొందుటయును తత్సాధనమును తత్ఫలమును తన్మార్గమును వివరింపఁబడుచున్నవి. ఇచ్చట శ్రీ హనుమంతుఁడు శ్రోత. శ్రీరాముల వారు వక్త. ఇందు, భగవద్గీత ఉపనిషత్తులు శ్రుతులు పురాణములు సమస్త వేదాంతగ్రంథములయందలి విశేషాంశములను తీసి అచ్చటచ్చట చక్కఁగ నిరూపింపఁబడియున్నవి. వేదాంత విషయ మగుటవలన విషయము అతిగుహ్యముగా నుండినను అందఱకిని సుగమముగ నండుటకై ప్రచురింపఁబడియె.

వెల రు 3-4 0.

### శ్రీరామదాసు చరిత్రము

ఇయ్యది కొండపల్లెయనెడి గ్రామమునందు జన్మించి భద్రగిరియందు కైంకర్యము చేసిన గోపన్న యను పేరుగల రామదాసుగారి వైభవమును తెలుపుచున్నది. ఇతఁడు శ్రీరామభక్తుఁడు. ఇందు భద్రాచలమాహాత్మ్యమును గలదు. భద్రగిరియందు ప్రస్తుతముండు ఆలయమును, అందలి సీతారామలక్ష్మణుల ప్రతిమయు మొదలుగాఁగల అతిసుందరమైన 8 పటములును జేర్పఁబడి మేలైన బైండుగలది. వెల రు 1-0-0. డిటో కాలికోబైండుది. రు 1-2-0.

ఇచ్చట నాలుగుప్రాతశాసనము లున్నవి. సూర్య చంద్ర వృషభ చిహ్నితములు. ఒకటి పూర్తిగా అస్పష్టము. ఒకటి మంటపము దూలమురాతిపై నున్నది. రెండు క్రింద పడియున్నవి. ఒక చిన్నముక్క ఆయుగుయిటికల నొకటి యైయున్నది.

ఈ రెంటికిని నాల్గువైపుల జెక్కియున్నారు. పచ్చళ్లు నూరుటచే శాసనములబండ లఱిగిపోవుచున్నవి!

ఆలయమున కెదురుగా కొంచెముత్తరముగా చక్రతీర్థమున్నది. కృష్ణానది యిచ్చట సుడితిరుగుచుండును. యాత్రికు లిచ్చట స్నానమాచరించి కృతార్థు లగుదురు. ఆలయముచుట్టును కొండలు. అడవి. ఆలయమునకును ఏటికిని నడుమ ఒక్క పెద్దద్వారము నిలిచియున్నది. ఎందుల కచ్చట దానిని నిర్మించిరో తెలియదు. మహారాజులు తులాభారము జూచుకొనుట కిట్టిద్వారముల నుపయోగించువా రని వినికి.

౫. కపిలేశ్వరము:— సంగమేశ్వరమునకు సుమారు నాలుగుమైళ్లదూరమున భవనాశిగడ్డ నున్న దీగ్రామము దేవాలయము చిన్నది. శిథిలస్థితిలో నున్నది. లింగము పలకలుగా నున్నది. స్వయంభువు ఎక్కువ మహత్తు కలదట. ఈదేవునకు మడిమాన్యము లున్నను పూజాదుల జేయువా రెవ్వరును లేరు. ప్రాచీనాంశము లేమియు లేవు. తరచుగా భవనాశి వఱదలుగా పారివచ్చి దేవళమును ముంచుచుండుటచే నచ్చటి విశేషము లంతరించి యుండవచ్చును. మహర్షులు తపస్సుచేసి కృతార్థత నొందిన ఈపుణ్యక్షేత్రములు, మహారాజు లాదరించిన ఈ పుణ్యక్షేత్రములు, ఆంధ్రుల కైహికాముష్మికసౌఖ్యము లొసంగిన ఈ పుణ్యక్షేత్రములు నేడు కాలమహిమచే చూచువారు సైతము లేక స్మరణీయము లగుచున్నవి. ఈదేవుళ్లమాన్యము లేమైనవో, ఎవ్వ రనుభవించుచుండిరో కనుగొనువా రైన లేరు. శిథిలము కాకుండ నాపుటకు దొరతనమువా రైన పూనుకొనలేదు.

ఆంధ్రుల ప్రాచీనౌన్నత్యమును చాటుచు ఆంధ్రుల చరిత్రను కొంతవఱకు దెలుపు నీదేవాలయములను, పుణ్యక్షేత్రములను ఆంధ్రు లాదరింతురు గాక!

# వసంతకుసుమములు

అధికార్ల సూర్యనారాయణరావు గారు బి. ఏ., బి. ఎల్.

డెస్టిమోనా ఒథెల్లోతోడ:—

వెన్నెలల నీఁగి చంద్రుఁడు ♦ వెల్లనాయె,
కాంచుమండఁగ నీ రేయి ♦ కదలిపోయె.
మిగుల శ్రమఁ జెంది కోకిల్లి ♦ మేను వ్రాలె.
జాల మీలీల నొనరించి ♦ తేల నాథ?
రమ్ము! నిదురింపు మోయి ప♦ర్యంకమందు
చల్లగాలులు నెమ్మనఁ ♦ జల్లుదాన,
వలపుబాసలతో జోలఁ ♦ బాడుదాన.
చాలు! నింకను జాలంబు ♦ మేలె నాథ?
రావొ! కన్నులఁ గోపంబు ♦ రగిలె నేల?
మందహాసచంద్రిక లేల ♦ మాయ మయ్యె?
అనలభయదరోషారుణ ♦ మాయె నేల?
భానుమండల మట్లు నీ♦వదనసీమ?
ఆవెలుంగున నయనంబు ♦ లరుణరుచులఁ
దిరుగు వేళల నరిభయం♦కరుఁడ వీవు:
సఖుఁడ! రవ్వంత యేని దో♦షమ్మెఱుంగ!
కాని భయ మొందు నేలొకో ♦ మానసంబు!
ప్రియుఁడ! నీయధరంబు కం♦పించుచుండె
మరణదండన మత్తులు ♦ పలుకుచుండె
దాసియెడ నేఁడు సహజమౌ ♦ దయ తొలంగి
ప్రళయరుద్రుఁడ వైతేల ♦ ప్రాణనాథ?
తలఁపులెట్టివి నీమదిఁ ♦ గలఁచుచుండె?
ఒడలు నేఁడేల యీరీతి ♦ వడఁకుచుండె?
కోమలాంగముఁ గాల్చెడు ♦ కోపమిల్ల
దాసిపైఁ గాదనుచు నెంచు♦దాన నాథ!
నీదుశత్రునియెడల నే ♦ నెనరుఁ జూప,
నించుకేనియు నీయాజ్ఞ ♦ మించి నడువ;
ఆఁగుమాఁగుము నాథ! భ♦యంబుఁగొలుపు
రీతిఁ గాలుఁడ వౌచు వ♦ర్తించె దేల?
మఱచినాఁడవె నీప్రేమ ♦ మఱచినావె
పరుల నొల్లక నిన్నె చే♦పట్టు టెల్ల?
చెలి నెఱుంగవె! సుంతేని ♦ కలుష మెఱుఁగ
వధయె సుమ్మిది బలికాదు ♦ ప్రాణనాథ
శాంత మొందుము ప్రాణేశ! ♦ చంపకయ్య
నను మహాకాననంబుల ♦ కనుపు మోయి!
వేఁడుదాన నీ రేయి జీ♦వింపనిచ్చి
జీవ! నీతేమ రేపు వ♦ధింపు మోయి!

తేఁపు వధియింపవద్దు. యీ♦రేయి వద్దు.
ప్రాణవల్లభ ! ఒకజామెం ♦ బ్రతుకనిమ్ము!
ఆఁగు మొకసారి - పరమేశ ♦ నాత్మలోన
సంస్మరించెద - నీశ్వరా ♦ శరణు శరణు!

* * *

### సోదార్చుబంధు లెవరు ? :—

తెగిన మంగళసూత్రమో? ♦ మిగిలియున్న
మోము దురదృష్టరేఖలో? ♦ మాలమాల
వడఁగిపోయిన ప్రేమంపు ♦ టలలగతులో
పతి గతించిన నోదార్చు ♦ బంధు లెవరు?
మేన జ్వాలలగొను మాన♦సానలంబొ?
కాలి యాశ లొక్కొక్కటుడి ♦ రాలుగతియొ!
ఆఱియాఱని పొత్తు ప్రా♦ణాల నిగురొ?
పతి గతించిన నోదార్చు ♦ బంధు లెవరు?
చీఁకటులు ముందు లోకమో ♦ చింతఁజివికి
వన్నె వాసిన ప్రకృతిరూ♦పంబొ వగచి
యెంత వేఁడిన దయరాని ♦ యీశ్వరుండొ?
పతి గతించిన నోదార్చు ♦ బంధు లెవరు?

* * *

### ప్రణయ వేదాంతము :—

కనుము జానకి! సెలయేఱు ♦ కలియు నదిని
నదులు సాగరంబులఁ జేరఁ ♦ గదలుచుండు
స్వర్గవాయువు లేనాఁడు ♦ సంగమించు
విపులమై తీయనైన సం♦ప్రీతితోడ.
లోకమున నండ దేదియు ♦ నేకతముగ
సకలవస్తుప్రపంచంబు ♦ నొకటితోడ
నొక్క టైక్యము చెందుచు ♦ నుండు దైవ
నిర్మితంబగు ధర్మంబు ♦ నెక్కొనంగ.
చెలియ! మన పట్టు లైక్యంబు ♦ చెందరాదె!
చుంబన మొనర్చు నచలంబు ♦ లంబరమును
భంగ మొండొంటితో నంటి ♦ కౌఁగిలించు
రమణుఁ జెలిపూవుగారవం ♦ బమరఁ జూచు;
భానుసందీప్తి జగమునఁ ♦ బర్వియుండు
చంద్రకిరణముల్ ముద్దిడు ♦ సాగరమును
ముద్దులివి యన్ని యేటికే ♦ ముద్దుగుమ్మ!
నీవు నన్నట్లు ముద్దిడ ♦ కావకున్న.

* * *

### భూలోకస్వర్గము :—

నీకలపుపలుకే కి♦న్నెరుల గానంబు
నీమోవి తేనె ది♦వ్యామృతరసము
నీప్రేమ దివిజగం♦గా ప్రవాహంబు
నీరత్నమౌలనవ్వె ♦ పారిజాతంబు
నీపిపిముద్దులే ♦ నిఖిలసౌఖ్యంబు
నీకౌఁగిలింపులే ♦ యింద్రభోగంబు
నీనిత్యప్రణయంబె ♦ నిర్జరత్వంబు
నాజానకీ! నీవె ♦ నాదుస్వర్గంబు.

* * *

### తుది మొదలు :—

చదలపక్షినై రెక్కల ♦ చాఁచిచాఁచి
ఆకసవ్యాప్తి కంతంబు ♦ నరయనైతి;
అబ్ధి మీనంబునై యీఁదు ♦ లాడియాడి
కడలినీటికి పారంబు ♦ గాననైతి;
ధరణి జానకీవిభుఁడనై ♦ తలఁచితలఁచి
వలపుకలిమికి తుదిమొదల్ ♦ తెలియనైతి.

# అత్రిమహర్షి - కారాగృహము

పా. శేషాచలార్యులు గారు

కం. దుష్టుల దౌష్ట్యము మాన్పగ, శిష్టులపై శిష్ట్యములను జెప్పగ నిష్టా, నిష్ట వివేచన సేయుదు గష్టము దీర్ఘంగజాలు కారాగృహముల్.

అత్రిమహర్షి కారాగృహవాసము అత్యంతప్రబోధప్రద మగుట వలన ప్రకృత మిప్పుడు విచారణ సేయబడుచున్నది ఈవిషయ మున నీక్రిందిమంత్రము ప్రథమమున జూడ యోగ్యము.

ఋషిం నరా వంహసః పాంచజన్య
మృబీసా దత్రిం ముంచథో గణేన
మినంతా దస్యో రశివస్య మాయా
అను పూర్వం వృషణా చోదయంతా.

ఋగ్వే. ౧. ౧౧౭. 3.

అర్థాత్ - దుష్టశత్రువులయొక్క కుటిలత్వములను తెలిసికొనుట అకుటిలనీతిని పరాజయము జేయుట శాత్రవులను క్రమముతో పారద్రోలుట శత్రువుల జైలునుండి పంచజనులకు హితకర్త యగు ఋషిమహాత్ముని మరియు ఋషిస్నేహితులను విడిపించివేయుట ఇవి బలముగల నాయకులయొక్క ప్రశంసనీయ మైన కర్మమై యున్నవి. పై మంత్రమువలన నీక్రిందిమాటలు స్పష్టమగుచున్నవి.

"అత్రిమహాఋషి" పంచజనులకు హితకార్యములు చేయు చుండెను. వారిలోకూడా నలుగురు సజ్జను లుండిరి. అశుభమును కోరెడి శాత్రవులు అత్రిమహాఋషిని వారియనుచరులను కారాగృహ మునం దుంచిరి. అత్రిమహాఋషిని కారాగృహమం దుంచుటకు కారణము వారు పంచజనుల హితముకొఱకు కార్యములు చేయుచుండెను. మరియు అది అశుభశత్రువులకు అభీష్టము లేకయుండెను. దీనివలన "అశుభశత్రువులయాధీనము అయిదుగురు మహాపురుషులై యుండిరి, అథవా, అయిదుగురుమీద వారి రాజశాసన ముండెను. మఱియు నశుభ శత్రువుల యాధీనములో సంపూర్ణశాసనాధికార ముండెను. అన్యథా అత్రిమహాఋషిని కారాగారమునకు పంపుట సంభవమైయుండెను" అని స్పష్టమగుచున్నది.

అత్రిమహాఋషియొక్క సర్వజనహితకారకతనువలన నశుభ శత్రువులకు భయోత్పన్న మగుచుండెను. కాబట్టి వారు స్నేహితుల సమేతముగ అత్రిమహాఋషిని జైలునందు బందుజేసి యుండిరి.

చివరకు సామర్థ్యముగల నాయకుల ప్రయత్నములవలన నశుభ శత్రువుల కుటిలనీతియొక్క జ్ఞాన మందరకు నాయెను. అటుగా తెలిసెను. తరువాత వారా శాత్రవులను పారద్రోలి సర్వజనహితకారి యగు నత్రిమహాఋషిని నాయకులనుయాయులతో బంధముక్తు జేసిరి.

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు మరియు నిషాదులు వీరు పంచజనులగుచున్నారు. వీరియం దత్రిమహాఋషి యుత్పన్నమై యుండెను ఎవరు సంపూర్ణజనత్వముకొఱకు హితము జేయుటకు ప్రయత్నము జేయుచుండిరో వారు. కాబట్టి రాక్షసులు వారిని వారిస్నేహితులతో సహా పట్టుకొని జైలునం దుంచియుండెను.

ఈకారాగారము నూరుద్వారములతో యుక్తమైయుండెను. మఱియు ఋషికి కష్టమగుటకొఱకు కారాగారముయొక్క నాలుగువైపులను తుషాగ్నిని రగుల జేయుచుండిరి. ఈకారణమువలననే వేడి యుత్పన్న మగుచున్నదో, దానివలన ఋషికి మిక్కిలి క్లేశము జేరుచుండెను. ఇవన్నియు రాక్షసుల రాజనీతి. మఱియు నిటువంటి కష్టములను సహించుచు ప్రజలయున్నతి కొఱకు ప్రయత్నములు జేయుచుండిరి. ఈవిషయమున నీక్రింది మంత్రము జూడయోగ్యము.

భద్ర మిచ్ఛంత ఋషయః స్వర్విద
స్తపో దీక్షా ముపసేదు రగ్రే
తతో రాష్ట్రం బల మోజశ్చ జాతం
తదస్మై దేవా ఉపసంనమన్తు (అథర్వవే. కాండ ౧౯.౪౧౧.)

ఆత్మజ్ఞానులగు ఋషులు సంపూర్ణజనత్వముయొక్క మంచి గోరుచున్నటువంటి వారలై ఏప్రయత్నము జేయుచున్నారో, దాని వలన రాష్ట్రయత్నము, మఱియు సంఘశక్తి యుత్పన్న మయ్యెను. ఈ మంత్రమునందు ఋషులప్రయత్నముయొక్క యేవర్ణన యున్నదో దానిని మనము పూర్వమంత్రమునందు జూచియే యున్నాము. అత్రి ఋషి ఋషిస్వాభావానుకూలముగ జనత్వమునకు మంచిజేయుటకు ప్రయత్నము జేయుచుండెను. మఱియు అసురులు తమయాసురీస్వభావానుకూలముగ వారికి విరోధము జేయుచుండిరి. ఈప్రకారముగ నిది అసురులకును ఋషులకును నొకవిధమైన యుద్ధముమాత్రమై యుండెను. ఆత్మజ్ఞానులుమాత్రమే యీప్రకారమైనయుద్ధము జేయగలుగు చున్నారు. యోగీశ్వరు డైన శ్రీకృష్ణభగవానుడు శ్రీభగవద్గీతతో ఆత్మజ్ఞానోపదేశము జేసినతరువాతనే అర్జునునియొక్క మోహము దూర మయ్యెను. మఱియు న్యాయ్యస యుద్ధముజేసి ధర్మక్షేత్రమునందు విజయ ప్రాప్తిని జేసెను శ్రీవసిష్ఠమహాఋషి శ్రీరామచంద్రునకు ఆత్మజ్ఞాన మిచ్చిన తరువాతనే రామచంద్రుడు రాక్షసులతో యుద్ధముజేసి యశ స్సంపాదన జేసెను. ఈప్రకారముగ అథర్వవేదమునందుకూడా కాండ

...గ వరాల నుండి ౧ వరకు ప్రాణశక్తి బ్రహ్మచర్యము కాలబ్రహ్మము ఆత్మజ్ఞానముయొక్క వర్ణన జేసినతరువాత, సూక్త ౯-౧౦ లలోను యుద్ధనీతియొక్క యుపదేశమున్నది అని. ప్రథమమున "ఆత్మజ్ఞానము" తరువాత ఆత్మగుణములో యను యుద్ధమని నియమమున్నది. మరియు నిదియే సార్వభౌమిక నియమమై యున్నది. ఈనియమానుసారమే ఆత్మజ్ఞానులగు ఋషులు జనులయొక్క యున్నతికొఱకు విరోధులతో "తపోమయయుద్ధము" జేయుచుండిరి. అర్థాత్తు ఈయుద్ధము క్షత్రియులయొక్క "శస్త్రయుద్ధము" గాక యుండెను. ఇది ఆత్మశక్తియొక్క సాత్వికశక్తితో మాత్రమే యుద్ధమైయుండెను అని పూర్వోక్తమంత్రమునందు జెప్పిరియే యున్నది.

హిమేనాగ్నిం ఘ్రంస మవారయేథాం పితు
మతీ మూర్జ మస్మా అధత్తమ్
ఋబీసే అత్రి మశ్వినా వనీత మున్నిన్యథుః
సర్వగణం స్వస్తి "అథర్వ. కాం ౧. ౧౧౬. ౮"

సాయణభాష్యము.—అత్రేః ముఖ్యాయికా. అత్రిం ఋషిం అసురాః శతద్వారే పీడాయంత్రగృహే ప్రవేశ్య తుషాగ్నినా౭దాధిమత......అశ్వినౌ అగ్నిం ఉదకేన ఉపశమ్య తస్మాత్పీడాగృహాద్ అవికలేంద్రియవర్గం సంతం నిరగమయతాం ఇతి......హిమేన ...ఉదకేన ఘ్రంసం దీప్యమానం అత్రేర్బాధనార్థం అసురైః ప్రక్షిప్తం తుషాగ్ని మవారయేథామ్......అపిచ అస్మై అసుర పీడయా కార్శ్యంప్రాప్తాయ అత్రయేపి యమతీ అన్నయుక్తం ఊర్జం బలప్రదం రసాత్మకం క్షీరాదిక మధత్తం ప్రయచ్ఛతం ఋబీసే అపగత. ప్రకాశే పీడాయంత్రగృహే౭ వనీతం అవాఙ్ముఖతయా అసురైః ప్రాపితం అత్రిం సర్వగణం......స్వస్తి అవినాశో యథా భవతి తథా ఉన్నిన్యథుః తస్మాద్ గృహాదుద్గమయ్య యువాం స్వగృహం ప్రాపితవన్తౌ.

ఈసాయణభాష్యముకూడా నిచట ఉదాహరణయోగ్యమై యున్నది. ఈ మంత్రమువలన నీ క్రిందివ్రాసిన తాత్పర్యము వచ్చుచున్నది. ఏ కారాగృహమున అత్రిమహాఋషిని అసురులు బంధుజేసియుండెనో దానియందు చీకటియుండెను. అర్థాత్ చీకటికొట్టునందు ఋషిని బంధుజేసియుండెను. ఆగదివెలుపల అగ్నిని గాల్చి ఋషికి కష్ట మిచ్చుటకు యోజనలు అసురులు జేసియుండెను. ఆగదియం దింత చిన్నస్థానముండెను. "దేనికారణమున అత్రిమహాఋషికి, అవ-నీతః=అవాఙ్ముఖము అర్థాత్ క్రిందిముఖము జేసియే యుండుట ఆయెనో" అంత:—మతియు.పై జైలుకారణమున ఋషి కెన్ని కష్టములై యుండెనో, దీని కల్పన నీక్రిందిమంత్రములవలన గాగలుగుచున్నది.

తప్తం ఘర్మమోమ్యావన్త మత్రయే ఋగ్వే.౧.౧౧౨.౭.
యువ మత్రయే వనీతాయ తప్త మూర్జ మో
మాన మశ్వినా వధత్తం ఋగ్వే ౧. ౧౧౮. ౭.

హిమేన ఘర్మం పరితప్త మత్రయే ఋగ్వే ౧. ౧౧౯. ౬.
యువం హి ఘర్మం మధుమంత మత్రయే౭పో
నక్షోదో౭వృణీ మేషే. ఋగ్వే ౧. ౧౮౦. ౪.

ఈమంత్రము లన్నింటి తాత్పర్య మిది. "అత్రిమహాఋషికి అగ్నికారణముగలన నగుచున్న కష్టములను జలముద్వారా అశ్వినీదేవతలు దూరము జేసిరి." అని జేలుఖానాయందు అత్రిమహాఋషికి భయంకరమైన కష్టము లేవిగాయుండెనో, వానియన్నింటిని యీప్రకారముగ నివారణ జేయబడెను. ఇన్నిభయానకకష్టములను సహించుచున్నవారై ఋషిగణము పంచజనమునకు హితము జేయుకార్యములను జేయుచునే యుండుచుండిరి. శారీరకక్లేశముల కారణముల ప్రారంభము జేసియు యిటువంటి శ్రేష్ఠకర్మలను సత్పురుషు లెప్పుడును వదలుటలేదు. ఇదియే సత్పురుషుల సత్పురుషత్వమై యున్నది.

పూర్వోదాహృతమగు జైలునందు (౧) ప్రకాశము లేనికారణమున అత్రిమహాఋషికి పెద్దకష్టముగ నుండెను. సూర్యప్రకాశ మన్ని ప్రాణులకు ప్రాణమై యున్నది. అదిమాత్రము బందగు కారణమున నెంత యవస్థ కాగుటయో సంభవమైయున్నది, దీని కల్పన ప్రతివారికి కాగలుగుచున్నది. రెండవకష్టము నాలుగువైపుల నగ్నిని రగుల్చుట కారణమున ఋషికి మిక్కిలి కష్టమగుచుండెను. తనగదికి నాలుగువైపుల నగ్ని మండుచుండినట్లయితే గదియందు కూర్చొనుటకూడా పడదు. ఈప్రకారముగ ఋషికి కష్టములయందు గడుపుటపడెను. మూడవ కష్ట మిదియైయుండెను. ఋషికి క్రిందిముఖము జేసి- అర్థాత్ తల్లక్రిందుగా- కూర్చొనుట యైయుండెను. ఇటువంటి కష్టములయందు ఋషిశరీర మెంత కృశమైయున్నది. దీనికల్పన పాఠకులు స్వయముగ జేయగలుగుచున్నారు. "ఋషిశరీరము మిక్కిలి క్షీణమైయుండెను" అని. అశ్వినీదేవత లుత్తమమైన భోజనమిడి వాని శరీరస్వాస్థ్యము బాగుజేసిరని ఈ మంత్రములవలన దెలియుచున్నది.

పితుమతీ మూర్జమస్మా అధత్తమ్ "ఋగ్వే. ౧. ౧౧౬. ౮.
ఊర్జమోమానమశ్వినావధత్తమ్ "ఋగ్వే ౧. ౧౧౮. ౭.
చిత్రంహ యద్వోభజనం స్వస్తి స్వత్రయే
మహిత్వంతం యుయోతం
యోవామోమానం దధతేప్రియః సన్
ఋగ్వే ౭. ౬౮. ౫.

అత్రిర్యద్వామవరోహన్నృబీసమజో
హవీన్నాధ మానేవయోషా
శ్యేనస్య చిజ్జవసానూతనేనాగ
చ్ఛత మశ్వినాశంతమేన-ఋగ్వే ౫. ౭౮. ౪.

ఎప్పుడు గొప్పవారు కారాగృహములకు వెళ్లుచున్నారో, అప్పుడు వారు వారి యిష్టదేవతల ప్రార్థన జేయుచున్నారు. ఈప్రార్థనయే వారికి కష్టసమయమున శాంతి నిచ్చుచున్నది.

అత్రిమహాఋషి తన సన్మార్గమును వదలియుండలేదు. మరియు వారు ఇచ్చియున్న కష్టములనుకూడా లక్ష్యముజేసి యుండ లేదు. సత్యమును స్థాపనజేయుట కిదియే యొక మార్గమై యున్నది. అస్తు అట్లే. అటుగాక, పూర్వమంత్రములయం దేవర్ణన వచ్చియున్నదో దానివలన అశ్వినీదేవులయొక్క సహాయమువలన నత్రిమహాఋషికి ముక్తి అయ్యెను. ఈమాట సిద్ధాంత మయ్యెను. ఈప్రకారముగ నింద్రుని సహాయముకూడా నైయుండెను. ఈవిషయమున నీక్రిందిమంత్రమును జూడుడు.

ఉతాత్రయే శతదురేషు గాతువిత్ ఋగ్వే ౧. ౫౧. 3.

జైలునుండి సెలవుబొందుటకు మార్గమును నింద్రుడు జూపెను. మరియు అశ్వినీదేవులసహాయమున నత్రిమహాఋషి బంధముక్తుడయ్యెను. ఈప్రకారముగ నత్రిమహాఋషి కారాగృహవాసముయొక్క వర్ణనము వేదమునం దున్నది.

ఇకను అత్రిమహాఋషిని అసురులు కారాగృహమునం దెందుకు చేర్చియుండెను అసురులకు విరుద్ధముగ నత్రిమహాఋషి నటన యొందునైయుండెను అసురు లేమి జేయుచుండిరి అత్రిమహాఋషి యేమి కోరుచుండెను అను విచారణను జేయుసమయమున నీక్రింది మంత్రములు మిక్కిలి యుపయోగములు.

ఆదగ్నే అప్పణతో ఽత్రిః సా సహ్యాద్ద
స్యూన్విషః సాసహ్యా న్నౄన్ "ఋగ్వే. ౫. ౭. ౧౦.

ఇవి నాలుగువాక్యము లున్నవి. ఏవి అత్రిమహాఋషి కార్యములు మరియు నత్రిమహాఋషి శత్రువులస్వరూపము లనుచున్నవో, అవి. కాబట్టి వీటియర్థము నిప్పుడు జూడుడు.

అప్పణతః దస్యూన్=స్వార్థులు, అకారులు, లోభులు, కృపణులు, దయాహీన అత్యాచారు లెవరున్నారో, వారిని దూరముజేయుట అత్రిమహాఋషి కార్యమై యుండెను. కదాచిత్ వారిని బాగుజేయుట యగును. అథవా వారిని దూరముజేయుట యగును. అత్రిమహాఋషి కార్యములదెలను జూపెడి శబ్దము "సాసహ్యాత్" పూర్వోక్తమంత్రమునం దున్నది. అత్రిమహాఋషి యేప్రకారమైన నటనజేయుచుండెనో, దానినిశ్చయము, ఈశబ్దార్థమువలన కాగలుగుచున్నది. "సహ్" ధాత్వర్థము (షహా సే) సహించుటయై యున్నది. కాని స్వయముగ నితరులను దుఃఖము నియ్యకుండుట, స్వయందుఃఖములను సహించుట "సహ్"ధాత్వర్థము. అత్రిమహాఋషియొక్క ప్రయత్నము శాంతి మరియు సహనశక్తితో యుక్తమై యుండెను. అనత్యాచారీ శాంతతపూర్ణమార్గముతలన వారికార్యము నడచుచుండెను. దీనియం దేశంకయును లేదు.

"అత్రిః అప్పణతః దస్యూన్ సాసహ్యాత్" ఈపదముల శబ్దముల అర్థము "అత్రి స్వార్థశత్రువులను సహించెను." అర్థాత్ స్వార్థపూర్వకా శత్రువుల అత్యాచారములను సహించెను. మరియు సహించుట ద్వారా స్వవిజయమును, శత్రుపరాజయమును జేసెను. "స్వయం కష్టములను సహించుట తన సహనశక్తివలన తనవిజయము, మరియు శత్రుపరాజయము జేయుట" ఇది బ్రాహ్మయుద్ధముయొక్క లక్షణమై యున్నది. ఈబ్రాహ్మణయుద్ధమునందు బ్రాహ్మబలము సర్వోపరి తెలిసికొనెడు వారెపుడును అత్యాచారములందు ప్రవృత్తులు గారు.

అత్రిమహాఋషియు వారియనుయాయులు నీప్రకారమైన బ్రాహ్మయుద్ధము జేసెడివారై యుండిరి. కాని వీరియుద్ధము రే అసురులతో నుండెనో, వారు శాంతికమార్గమునుండి నడచుచుండుట లేదు. అర్థాత్ అసురులపక్షమున అత్యాచారమును జేసెడివా రుండిరి. కాని అయినప్పటికి ఋషిపక్షమున పూరణతయా అనత్యాచార ముండెను. అసురులపక్షముయొక్క రాజనీతి యేప్రకారముగ నుండెనో ఈక్రిందివాక్యమువలన దెలియును.

అశివస్య దస్యోః మాయాః ఋగ్వే ౧.౧౧౭. 3.

"అశుభశత్రువులకు, మాయాః=కపటనీతియుండెను." ఈకపట రాజనీతికారణమున నయిదుజనులకు దుఃఖమగుచుండెను. కాబట్టి అయిదు జనులకు హితముజేయు నుద్దేశముతో నత్రిమహాఋషి తనసహచరుల సమేతముగ శాంతతపూర్ణ అనత్యాచారనటన నడిపించియుండెను. ఈ హేతువువలన రాక్షసులు, ఆఋషిని జైలునందు ఒందుజేసి యుండిరి. మరియు వారు వివిధమైన కష్టముల నిచ్చుచుండిరి.

అత్రిమహాఋషికి రెండవశత్రువులుకూడా నుండిరి. ఎవరి వర్ణన "ఇతః నహాన్ అత్రిః సాసహాస్యాత్" ఋగ్వే. ౫. ౭. ౧౦. ఈమంత్రమునం దనుచున్నదో, వారు భోగవిలాసులు. వారిని సహించుట అత్రిమహాఋషికి యావశ్యకమై యుండెను. ఈభోగవిలాస సుఖార్థుల కారణమున నేయేకష్టము లుత్పన్న మగుచుండెనో, వానిని సహించుట, మరియు శాంతముతో తనమార్గమును నాక్రమణజేయుట నత్రిమహాఋషి కార్యమై యుండెను. అర్థాత్ అసురులరాజ్యమునందు అసురులకుటిల నీతికారణమున మరియు భోగవిలాససుఖార్థుల కారణమున యేయేదుఃఖములను సహించుట యావశ్యక మగుచుండెనో, వారినన్నిటిని అత్రిమహాఋషి వారియనుచరులును భోగించుచుండిరి. మరియు వారికి విశ్వాస ముండెను. "ఈప్రకారముగ దుఃఖములను సహించుమార్గమువలను, శాంతిపథమువలనను, జనత్వమునకు హితము కాగలుగుచున్నది" అని.

ఇచ్చట స్పష్టము కాగలుగు చున్నది "ఋషుల మార్గ మెట్లు అనత్యాచారముగను, మరియు శాంతిపూర్ణముగ నుండెను. మరియు రాక్షసుల మార్గమెట్లు అత్యాచారముగ, మరియు ఘాతపాతముగనుండెను" అని పాఠకులు ఆశ్చర్య మానసు లగుదురు. "అత్యాచారమార్గముతో, అనత్యా చారవ్రతము గలవారు యెదుర్కొనుట యెట్లు కాగలుగుచున్నది." అని దీనియుదాహరణము పురాణములందు వశిష్ఠఋషి. విశ్వామిత్రరాజుయొక్క కథలో నుక్తప్రకారముగ జూపబడును. వసిష్ఠఋషి, ఆశ్రమముమీద రాజా విశ్వామిత్రుడు తనసైన్యముతో నెదుర్కొనెను. కాని వసిష్ఠమహాఋషి శాంతిమాత్రము ధరించెను. అంతమున అత్యాచారి విశ్వామిత్రరాజునకే ఓడిపోవుట తెలిసికొన

వలపివచ్చెను. మఱియు బ్రాహ్మబలమునకు విజయ మయ్యెను. ఈ ప్రకారముగ నసురుల మఱియు దస్యుల యొక్క క్రూరమైన అత్యాచారములతో ఋషులయొక్క తపము మఱియు శాంతియుశాస్త్రములే నడచుచుండెడును. చివఱకు శాంతి బ్రహ్మాస్త్రమునకే విజయ మగుచుండెను.

ఈ ప్రకారముగ విచారము జేయుటవలన నత్రిమహాఋషి నటన యొక్క స్వరూపము మఱియు వానివిరోధుల విరోధముయొక్క స్వరూపము ధ్యానమునందు వచ్చెను. మొదట నొకమంత్రము జూపియున్నది. "దేనివలన నత్రిమహాఋషి ప్రయత్నముకలన "శాస్త్రబలము. మఱియు ప్రతాప" ముత్పన్నమగుకల్పన స్పష్టమై యున్నదో" అది ఆమంత్రముతో నిర్ధారణముయొక్క సంగతి తగిలించుటవలన ఋషులమహాత్మ్యము ధ్యానమునందు రాగలుగుచున్నది. ఈవిషయమును నధికముగ స్పష్టము జేయుటకొరకు నీక్రింది మంత్రమును జూడుడు.

అత్రి మను స్వరాజ్యమగ్ని ముక్థాని వావృధుః
విశ్వా అధిశ్రియో దధే ॥ఋగ్వే. ౨. ౭. ౫.

అత్రి శత్రువులను భక్షణజేయువాడు, మఱియు స్వారాజ్యానుకూలప్రయత్నము జేయువాడు; అగ్నిసమానముగ తేజస్వి.

ఎవడు అత్తా అర్థాత్ భక్షణజేయువాడగుచున్నాడో, వానిని "అత్రి" అని జెప్పుచున్నారు. ఇచ్చట శాంతిపూర్ణ అనత్యాచార బ్రాహ్మయుద్ధములో శత్రుభక్షకుడు అర్థాత్ వారిని పూర్ణపరాభూతులను జేసినవాడెవడై యున్నాడో వానిపేరు అత్రియైయున్నది.

ఇప్పు డేమంత్రము పైన వ్రాసియున్నానో, దానియం దగ్నినామము, అత్రియేయై యున్నది. ఏల యన అగ్నియును బ్రాహ్మణ ఋషియై యున్నాడు. మఱియు తపస్వి. మఱియు నసురులను దూరము పారదోలువాడై యున్నాడు. అగ్నియే రక్షసులను తినుచున్నాడు. తపస్వియై యున్నాడు. ఏలయన వాడు స్వయంతపించుచున్నాడు. అగ్నిగుణములను జూడుడు.

వైశ్వానరో దస్యు మగ్ని ర్జఘన్వాన్ ఋగ్వే ౧.౫౯.౬

"వైశ్వానరాగ్ని దస్యులను హననము జేయుచున్నాడు"

ఇట్టి ప్రభావశాలియగు అత్రి మహాఋషి యెవరు అని ప్రశ్న రావచ్చును. ఇది సమాధానము.

అయం సదేవో అప్స్వన్తః సహస్రమూలః పు
రుశాకో అత్రిః యఇదం విశ్వం భువనం జజాన॥
అథర్వే. కాం. ౧౩. ౩. ౭౫.

జలమునందు విద్యమానుడై, అనేకమూలములతో యుక్తుడై, మఱియు వివిధశక్తులతో సంపన్నుడై యున్నాడో, మఱియు నెవడు సంపూర్ణభువనమును నుత్పత్తి జేయుచున్నాడో వారి ఈ ప్రకారము సంపూర్ణ జగదుత్పత్తి జేసెడి దేవుడుకూడా అత్రియై యున్నాడు. ఇట్లే చెప్పబడియున్నది. అసురులు ఘాతుకభావముతో జగత్కర్తయగు దేవునకు విరోధము జేయుచున్నారు కాని చివరకు అసురులకు పరాభవము దేవునకు విజయ మగుచున్నది.

# శాణసంఘర్షణము

## దిడుగు వేంకటనరసింహరావు గారు

జన్మమొందితి ధూళిధూ◆సరములందు
గాక కాంతిహీనపు మట్టి◆గడ్డలందు
గాక, మిన్కుమిన్కని గుప్త◆కళలతోడ
వెలుగుచుండు నమూల్యంపు◆ శిలలయందు.
రాలలోఁ బుట్టితిని సాన◆రాయిపైని
నల్గుచుంటి నిప్పుడు దాన◆ నవమణులను
వజ్రతేజమొ వైడూర్య◆ప్రభయొ నీల
కాంతియొ ప్రవాళతయొ నాకు◆ గల్గకున్నె
వజ్రమను కుతూహలమె హృ◆ద్వనజమందు
గల్గుటను సానఁబట్టెడు◆ కాలమందు
కెంత యోఱిమిడి గల్గిన◆ నెగిరి యుప్పు

బుట్టఁ బడబోను కారంపు◆ బుట్టబడను
కాని కొన్నిపట్టుల నన్ను◆ చేసె మఱచి
ఎగిరి పడియెద నోఱిమిడి◆ హెచ్చి యుప్పు
కుండనో చేతినో చింత◆పండునందో
పంచదారనో మజ్జిగ◆బానయందో
వినసాన నించుక నల్గి◆నట్టికతన
గలుగు కాంతిలేశమె తళ్కు◆తళుకు మనుచు
దాఁగఁజూచెదు నన్నొంటి◆ దాఁగనీక
బయటలుపఱచి యాంత్రికునకు◆ బట్టియిచ్చు
కావ నప్పుడప్పుడు బద్ధ◆కాన నేను
సానపై నుండి తొలఁగినం◆ గాని మిగత

కాలముల సర్వదా యది ♦ గల్ల జేయు
నొత్తిడిం బొందుచును యుంటి ♦ నొప్పితోడ
అందుచే రాయిగా వచ్చి♦నట్టి నేను
మఱల రాయిగనే వచ్చు♦మాట కల్ల
వజ్రమగు దశ పట్టినం ♦ బట్టకున్న
కడకు గను మత్తియమె మాని♦కంబో ధ్రువము
రాత్రులను యాంత్రికుండు పెఱ ♦ రాలతోడ
నన్ను హేమపేటికను బం♦ధనము జేయు
నపుడు నే వజ్రతను జేయు ♦ యత్నములను
దలచుకొని పొందుచుండు సం♦తసము మదిని

* * * *

కాని యది యేమి చిత్రమో ♦ కాని కొన్ని
వేల చిఱునవ్వుటలలలో ♦ తేలి తేలి
రత్నమగు వాంఛ తేల యీ♦రాల కందు
ఇటుల నొత్తిడి బడు కర్మ ♦ మేమి యందు
ప్రకృతితేజంబులో తృప్తి♦పడగ రాదో
అన్ని రాలు వజ్రము లగుట ♦ కలవి యగునో
కానితఱి తాము మాత్రమే ♦ తేనిపోని
వజ్రతావాంఛ లీరాలు♦ పడుట లేల
ఇటుల నేను లోలోనె నెంచు♦ చెంతేగి యెట్లో
నాకు నాయురత్నైకుఁడు ♦ నలిగి దివ్య
ప్రభలతో ధగధగ వెల్గు ♦ వజ్ర మొండు
పల్కకయె ఆత్మజ్యోత్స్నలం ♦ బల్కె నిట్లు.
"ఎల్లరాలు వజ్రము లౌట ♦ నిపుకు గాదు
ఎల్లరాలు వజ్రములుగా♦ వేళవేళ
కౌన క్రమత వజ్రపు ♦ గోడ గట్టవలయు
కీట్లు రెల్ల నొక్కట లేచు♦ టేటిమాట
అన్నిరాలు వజ్రములు గా♦కున్న నేమి
అన్నియును రాలుగనె యుంటు♦కన్న కొన్ని
వన్నె వజ్రంబులై తక్కు♦యున్న రాల
నన్నిదమ తేజమున ముంచు♦చున్న తప్పా!"

* * * *

అటుల స్వీయప్రభారాశి♦యందు నన్ను
ముంచుటనె మానవార్త లం♦పించు నట్టి
వజ్రమూర్తిసాన్నిధ్య ప్ర♦భావమునను
తుణికసంశయమేఘముల్ ♦ సమయుచుండు
ఒత్తిడికి కొంత యలవడి ♦ యున్న శిరము
సానఁ బడి నల్గుటకు నంత ♦ సంశయింప
దిపుడిపుడె సానఁబడుచున్న ♦ యితరదేహ
భాగములు తాలిమిని కష్ట♦పడుట కోడు
దాన నాదేహ మెల్లను ♦ దాచియుంచి
శిరమె యాంత్రికు దృష్టిని ♦ జేరునట్లు
బహుళయత్నంబుల నొనర్చు ♦ వాంఛ లప్పు
డపుడు నామాట వినక నే♦న్నాక్రమించు
శిరము బహిరంగముగ ప్రద♦ర్శించి యుంచి
కష్టపడనేరమి నొకింత ♦ కాంతియేని
గలుగ కల్లాడు దేహభా♦గముల దాచి
వజ్ర మన్పించుకొను దుష్ట♦వాంఛ లోదవు.

* * * *

కాని నేఁ జేరుకొనిన దివ్య♦ కాంతి యుతపు
వజ్రరాజంబె మరల నన్ ♦ బల్కరించి
కాయ కాంతి లేని శిరంపు ♦ కాంతి వ్యర్థ
మనుచు తనసర్వకాంతుల ♦ నట్టె చూపు.
"సైఁడిపూఁత లక్కఱలేక ♦ వన్నెవన్నె
యంబరపు ముడతలఁ జేరు ♦ నవసరముల
బడక బూదినైనను వెల్గు ♦ స్వప్రకాశ
మందు మీ బూటకపు వెల్గు ♦ లందనేల"
ఆమహావాక్యముల విని ♦ నంత నేను
మూలలం దాగుటలు మాని♦ ముందు కేగి
యాంత్రికుం డెట్టు లొత్తెడి ♦ నట్టులెల్ల
నలుగ సంసిద్ధమౌదు నా♦నందమునను
వజ్రరాజ మాక్రియ దాగు ♦ వాంఛ లణచ
ఈక్రియను స్వప్రభయె పట్టి ♦ యిమ్ముచుండ
శిరము దేహంబు నొత్తిడిం♦ జెందుగాని
ఇంక రాయిగనే యుండు ♦ టేటిమాట
రాయిదశ పోయి తేజంపు♦రాయి నైన
మీఁద ప్రియతమశిల లగు ♦ మీదు దివ్య
సన్నిధికి నరుదెంతు నా♦సమయమందు
కౌఁగిలు లొసంగుఁడీ రత్న♦కాంతితోడ.

# హైందవ రాజకీయ కక్షులు

కందుకూరి ఈశ్వరదత్తు గారు, బి. ఏ.

జనసామాన్యమునందు విద్య ప్రసరించిన కొలందిని, నాగరకత దినదినాభివృద్ధిఁ గాంచినకొలందిని దేశమునందు మాతృసేవా దీక్షాపరాయణు లగు మేధావంతు లుద్భవించినకొలందిని, అభిప్రాయ భేదంబులు జనించి, బుద్ధిమంతులు తమతమ యాదర్శనిర్వాహణార్థమై నూతనమార్గములఁ బట్టుదురు. 'పుఱ్ఱెకొక బుద్ధియు జిహ్వకొక రుచియు' ననికదా పెద్దలు వక్కాణింతురు! జనుల యభిప్రాయములందు భేదములు కలిగి నూతనసంచలన మొక్కటి కలుగుట - ఏకాభిప్రాయము కలుగువారు కక్షులుగా నేర్పడుట - ప్రతికక్షియు దేశకల్యాణమే యాదర్శముగఁ బెట్టుకొని దానిని కొనసాగించికొనుటకు వేఱువేఱు పథములఁ జనుట - మొదలగునవి నాగరకతఁ జెందిన పశ్చిమదేశవాసులయొక్క రాజ్యాంగతంత్రములయందు ప్రధానవిషయము లయ్యెను. రాజనీతి యందుఁ గల కక్షులను రాజనీతిశాస్త్రవేత్తలు నిరసింపరు. కక్షులు లేని రాజనీతి ఆవిరిలేనియంత్రము, ఆత్మలేని శరీరము.

పరహస్తగతమైన మన మాతృదేశమునందు స్వాతంత్ర్యరహితులమైన మనకు రాజకీయకక్షులు గూడనా? యను విచారమునకు కారణము లేదు. స్వాతంత్ర్యవిహీనులమైన మనము సత్వరస్వరాజ్యసిద్ధికై పాటుపడవలయును గదా! దానికొఱకే కదా దేశభక్తులు మార్గాన్వేషులై తమకుఁ దోచినంతవఱకు వివిధమార్గములఁ జూపుచున్నారు! అందువలననే దేశమునందు రాజకీయకక్షులు నేర్పడినవి.




**కక్షులయుత్పత్తి - దేశీయమహాజనసభ.**—పందొమ్మిదవశతాబ్ది పూర్వఖండమునందు విద్యాధికులును దేశభక్తిపూర్ణులు నగు మనపూర్వులయం దొకవిధమైన సంచలనము కలిగి దేశమునకును ప్రభుత్వమువా రొనరింపవలసిన కార్యముల మంచిచెడ్డ లను వారికి తెలుపుచుండుటకు నొకచోటఁ గూడుటకు వా రుద్దేశించిరి. 1885 వ సంవత్సరము డిశంబరు మాసమున బొంబాయినగరమందు భారతదేశప్రముఖులు కూడిరి. అప్పుడు కలిసికొనినవారలలో హ్యూమ్, సుబ్రహ్మణ్యయ్యర్ బోనర్జీ ముఖ్యులు. ఇదియే దేశీయమహాజనసభావృత్తాంతము. దానిచరిత్ర మనకు ప్రస్తుత మనవసరము. కాని యప్పటినుండియును హైందవరాజకీయచరిత్రమునందు నూతనశక మారంభమైనది.

దేశీయమహాజనసభాదర్శము లేక మతము నంగీకరించి, ప్రతిసంవత్సరము సభయం దొనర్పఁబడిన తీర్మానములనే కొనసాగించుట యందు నిమగ్నులైనవారు కాంగ్రెసుపక్షమువారు. ఈపక్షమువారే దేశమునం దధికసంఖ్యాకులు. జనసామాన్యమునందు గౌరవము కలవారు. దేశీయమహాజనసభకు స్వరాజ్యమే యాదర్శము. బ్రిటిషుసామ్రాజ్యాంతర్గతమా కాదా యనునది స్పష్టముగా నేర్పఱుపఁబడలేదు.

**శాసనసభాబహిష్కారములు.**—1922 వ సంవత్సరము కాంగ్రెసు గయానగరమునందు సమావేశమైనప్పుడు కాంగ్రెసునందు రెండుకక్షులు పుట్టినవి. శాసనసభాబహిష్కారవాదులు మొదటి కక్షకుఁ జెందినవారు. వీరినాయకుఁడు రాజగోపాలాచారి. వీరు మహాత్మా గాంధిగారి సిద్ధాంతముల నసిధారావ్రతముగ నాచరణములోనికిఁ దేవలెనను పట్టుదల కలవారు. ముఖ్యముగా బార్డోలీ తీర్మానములే వీరి యాదర్శములు.

**శాసనసభాప్రవేశవాదులు.**—గయా దేశీయ మహాజనసభాధ్యక్షుఁడైన దాసు వీరి నాయకుఁడు. వీరిసంఖ్య స్వల్పము. వీరు శాసనసభలయందు ప్రవేశించి ప్రభుత్వవిధానమును భగ్నపఱచుటయే వీరి యుద్దేశ్యము. కాని 'స్వరాజ్య' పత్రికయొక్క కలకత్తా విలేఖకుఁడు తెలిపినటులు వీరిలోనే సుమారు పదికక్షు లున్నవి. ఇరుకక్షులవారు సత్వరస్వరాజ్యసిద్ధిని కోరువారలే. రెండుతెగలవారును దౌర్జన్యరహిత సహాయనిరాకరణావలంబకులే! కాని కార్యనిర్వాహణమునందు అభిప్రాయభేదము లున్నవి. ఇది దేశకల్యాణమునకుఁ జనించెనో విధ్వంసమునకు వచ్చెనో ప్రస్తుతము చెప్పలేము. దాసు అల్పసంఖ్యాకులైన తమయొక్క యభిప్రాయముల నధికసంఖ్యాకులైన మొదటిపక్షమువా రంగీకరింపరో కాంగ్రెసునకు బదులుగా నింకొకసభను నిర్మించి,

కాంగ్రెసునుండి వెడలిపోయెద నని హైందవలోకమును భయపెట్టుచున్నాడు. ఈ రెండుపక్షములవారికిని అతివాదు లన్న నామ మున్నది. కాని వీరిని సహాయనిరాకరణావలంబకు లనియే పిలువవలెను. హైందవ రాజకీయ నిఘంటువునుండి అతివాద నామము నిటుపైని కొట్టివేయవలెను.

**మితవాదులు:**—మితవాదులు అతివాదులు అను బిరుద నామములు మన నాయకులకు ఆంగ్ల-హైందవపక్షమువా రొసంగినవి. 1907-వ సంవత్సరమున జరిగిన సూరతు కాంగ్రెసునం దీకక్షు లేర్పడినవి. లోకమాన్యతిలక్, లజపతిరాయి ప్రభృతు లప్పటినుండియును సభయం దడుగిడుట మానికొనిరి. మితవాదినాయకుల లోపలి తీర్మానములును సభాదర్శములును అతివాదినాయకులకు నచ్చలేదు. ప్రభుత్వమువారితో సరససల్లాపము లతివాదినాయకులకు నచ్చలేదు. అతివాదనాయకులు కాంగ్రెసునుండి చీలిపోయిరి. మితవాదులు వారికి కాంగ్రెసునందు ప్రవేశము లేకుండ జేసిరి. తిరుగ లక్ష్మణపురపు కాంగ్రెసునందు రెండు కక్షులకు సమ్మేళనము కావింపఁబడెను. బిసెంటు హైందవరాజకీయ రంగమునందు ప్రవేశించిన తరువాత రెండుతెగలవారికిని రాజీనామా కుదిర్చెను. కాని యచిరకాలములోనే రెండుతెగలవారును చీలిపోవలసి వచ్చెను. యుద్ధానంతరము ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిన రాజ్యాంగ సంస్కరణశాసనము కలహమునకు బీజ మయ్యెను. మితవాదులు ప్రభుత్వమువా రిచ్చిన దానితో సంతసించెద మనిరి. అతివాదులు చట్టము సత్వరబాధ్యతాయుతప్రభుత్వమునకు మార్గదర్శి కాదనిరి. పంజాబు హత్యలును, ఖిలాఫత్ సమస్యయును అతివాదనాయకుల దృక్పథ మూపరించెను. నిరంకుశప్రభుత్వ మంతమొందవలె నని వీరు పట్టుపట్టిరి. మితవాదులు కాంగ్రెసునుండి చీలిపోయిరి. మఱియొకసభను స్థాపించిరి. శ్రీనివాస శాస్త్రిగారు వీరికి నాయకులైరి. క్రొత్తచట్టముప్రకారము శాసనసభలలో ప్రవేశించి ప్రభుత్వమువారితో సహకార మవలంబించి వారిమన్ననల నందవలయు నని పూనికొనిరి. అదియే వీరి ప్రధానమతము. వీరును స్వరాజ్యము (అధినివేశముల రాజ్యాంగపద్ధతి) కావలయునందురు. వీరికి బ్రిటీషు సంబంధమే పరమావధి. కాని సత్వరస్వరాజ్యసిద్ధి మాత్రము కాదు. వీరిసంఖ్య స్వల్పమైనను మతభేదములు మెండు. మితవాదులలోఁ జెప్పఁదగిన గాంధీమహాత్ముఁడు పంజాబు ఖిలాఫత్ సమస్యల పరిష్కారార్థమై భారతీయులకు సహాయనిరాకరణమంత్రమును, సాత్త్వికనిరోధమును బోధించెను. ఆసేతుహిమాచలము ఆబాలగోపాల మామంత్రమునే స్వీకరించెను. వెంటనే గాంధియనుజ్ఞచొప్పున అతివాదు లందఱును సహాయనిరాకరణ మవలంబించిరి మితవాదులసంఖ్య తగ్గిపోయెను. గాంధీయను చరుబ బలమును జూచి ప్రభుత్వమువారును, వారి స్నేహితులగు మితవాదులును వెఱఁగొందఁజొచ్చిరి. దౌర్జన్యరహిత సహాయనిరాకరణము కాంగ్రెసుయొక్క మత మాయెను. మితవాదులు ప్రభుత్వమువారితో సహకార మవలంబించి సహాయనిరాకరణమును రూపుమాపుటయందు తోడ్పడి చిరకాలము 25000 మంది భారతీయులను గాంధీమహాత్ముని జెఱసాలలకు పంపించిరి. మీఁదుమిక్కిలి మితవాదనాయకులు వింతచర్యల నారంభించిరి. మద్రాసునగరమున మూఁడవమితవాదిసభ కధ్యక్షత వహించుచు శ్రీచింతామణిగారు తమయుపన్యాసమున "మితవాదులు తమసభకు దేశీయమహాజనసభానామము తీసివేసికొని, తమ (మితవాది) సభకే యానామ మొసంగిన సమంజసముగ నుండు"నని వింతయభిప్రాయమును వెలిపుచ్చిరి. 1921 వ సంవత్సరము ఏప్రిల్ మాసమున బొంబాయినగరమందు లాలా లజపతిరాయిగా రుపన్యసించుచు మితవాదినాయకులయవస్థ నిట్లు నిరసించెను: "దురదృష్టవశమున మితవాదులు రాజకీయముగ నాత్మహత్యఁ జేసికొనిరి. ప్రస్తుతము రెండే కక్షలున్నవి: 1 సహాయనిరాకరణావలంబులు, 2 పరిపాలకవర్గము. మితవాదులు పరిపాలకవర్గముతో మగ్నులౌటచే వారినిగూడ నట్లే పరిగణింపవలయును. మితవాదులు వందమంది యుందురో లేదో చెప్పలేము. కాని వీరిమతము వేయితలలపామువంటిది. వీరిలో వీరికి అభిప్రాయభేదములు చాల కలవు.

**పరిపాలకవర్గము:**—హిందూదేశమునందలి పరిపాలకవర్గము యొక్క యాదర్శ మేదియో నిశ్చయముగ జెప్పలేము. కొంతకాలమైన తరువాత దేశము దేశప్రజలకే యిచ్చి వారిచే రాజ్యతంత్రము నిర్వహింపుకొను మని చెప్పి తమసంబంధము వదలుకొని పోవుట కొందఱ యభిప్రాయము. వీరు మిగుల అల్పసంఖ్యాకులు. దైవసంకల్పమువలన భారతభూమి ఆంగ్లదేశములపాలఁ బడిన దనియును, వారలే యీ భరతభూమిని ఆచంద్రతారక మనుభవించి ప్రజలను తమ చేతులలో నుంచుకొనఁదగినవా రనియుఁ గొందఱ యభిప్రాయము. వీరలే యధికసంఖ్యాకులు. అడుగడుగునకును హైందవాభ్యుదయమున కడ్డువచ్చి విఘ్నము తలపెట్టుచుందురు. సీమయందు సిడెన్‌హాము ప్రభృతులును, మనదేశమునందు సివిల్ సర్వీసు ఉద్యోగస్థులును ఈవర్గమునకుఁ జెందినవారు. హైందవపరిశ్రమాభ్యుదయమునకుఁ గాని, విద్యాభివృద్ధికిని గాని, వ్యక్తిస్వాతంత్ర్యమునకును ఆత్మగౌరవమునకును భంగకరమైన యాయాశాసనము రద్దుచేయుటకుఁ గాని, ఉన్నతోద్యోగముల హైందవయువకుల కిచ్చుటయందుఁ గాని, భారతీయులను సైన్యమునందుఁ జేర్చికొనుటయందుఁ గాని, వీరు విముఖులు. ఆర్థికస్వాతంత్ర్యమున కొప్పరు. వీరిబలమే హైందవాభ్యుదయమునకును, హైందవజాతీయతకును ప్రతిబంధకము గానున్నది వీర లొనరించు మహాపకార మింకొకటి యున్నది. పరరాజ్యములందలి ప్రజలకు హిందూదేశమును గుఱించియు నందలి ప్రజలను గుఱించియు, విపరీతమైన సంగతులు కల్పించి సత్యమును గప్పిపుచ్చుచు ప్రచారముకూడ సల్పుచున్నారు. వీరి విపరీతప్రచారమును రూపుమాపి యితరదేశములందలి ప్రజలకు నిజమైన పరిస్థితులఁ దెలియఁ జేయుటకు దేశీయమహాజనసభ పూనుకొనవలయు నని హార్నిమన్ మొదలైనవారు సహిత మభిప్రాయపడుచున్నారు. దేశీయమహాజనసభ ప్రతిసంవత్సరమును కొందఱు ప్రతినిధులఁ బరదేశములకుఁ బంపించి యాదేశములందలి ప్రజలకు బ్రిటిషుప్రభుత్వమును గూర్చి; హైందవాకాంక్షితములఁ గూర్చి ఉపన్యాసము లిప్పించుచుండిన మిగుల బాగుండెడిది. హైందవాదర్శములు ఫలోన్ముఖములు గాకుండఁగ పరిపాలకవర్గమువారు సైంధవులవలె నడ్డుపడి నిలుచున్నారు ఇంకను నెంత కాల మిట్లు పానకములోని పుల్లలవలె నడ్డువచ్చెదరో?

ఆంగ్ల-హైందవవర్గము:— వీర లెప్పుడును పరిపాలకవర్గముప్రక్క నుండి తాళములై యుందురు. వారొనర్చునది సమర్థించుచు వారికి సాహాయ్యము చేయుటయే వీరి ప్రధానమతము. వీరు జన్మస్థలమును వదలి, యీదేశమునకు వచ్చి, డబ్బు పెట్టుబడి పెట్టి యుచ్చటనే స్థిరనివాసము నేర్పఱచుకొని, వర్తకమునందును పరిశ్రమలందును ప్రధానస్థానము నాక్రమించికొనియున్నారు. అస్సామునందలి తేయాకుతోటలు వీరియధీనము. దక్షిణదేశమునందలి కాఫీతోటలకీ వీరి యధికారములోనివి. కోలారుబంగారుగనులు వీరివశమునం దున్నవి. కలకత్తా జూట్ యంత్రములు పంచదారకర్మాగారములు, ఇతరములగు బొగ్గుగనులు వీరిస్వంతము. పరిశ్రమలు హిందూదేశమున హీనదశయం దున్న సంగతి సర్వజనాంగీకృతము. హిందూదేశమునందలి ప్రజలు రెండువంతులు వ్యవసాయమువలన జీవించువారు. పరిశ్రమాభివృద్ధికి ప్రభుత్వమువారి చేయూఁత తక్కువ. వీరు లక్షలార్జించి ప్రతిసంవత్సరమును స్వదేశమునకుఁ గొనిపోవుచున్నారు. వీరు ప్రాబల్యము సంపాదించి రాష్ట్రీయశాసనసభలయందును సామ్రాజ్యసభలయందును ప్రాతినిధ్యము గోరి సంపాదించి ప్రభుత్వమువారిపక్షముననే పని చేయుచుందురు. వీరు ముఖ్యముగా హైందవార్థికస్వాతంత్ర్యమున కొప్పరు. బ్రిటిషు పరిపాలన మవలంబించిన యనిర్బంధవ్యాపారమే వీరికి లాభకర మైనందున సంరక్షణసిద్ధాంతమున కొప్పుకొనరు. ముఖ్యముగా వీరి యభీష్టములనే ప్రభుత్వమువారు నెఱవేర్ప సంకల్పించుకొందురు. రాజ్యాంగస్వాతంత్ర్యమునకుఁ గూడ వీరు పరాఙ్ముఖులు. పరిపాలకవర్గమువారి యాశయములును వీరి యభిప్రాయములును కొంచె మించుమించుగా నొక్కటియే యని చెప్పనగును.

బిసెంటుపక్షము:— "పువ్వుఁబోఁడులహృదయంబు లెవ్వఁ డెఱుఁగు"? క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్" అని శ్రీనాథుఁడు పెద్దన్న చెప్పినట్లు జ్ఞాపకము. బిసెంటుపూర్వచరిత్ర మెఱింగినవారికి ప్రస్తుతస్థితి సుబోధమే. ఈమె 1914 సం॥రము అంతమున హైందవ రాజ్యాంగరంగమునందు ప్రవేశించి దేశమునందు స్వరాజ్యసమితులఁ గూర్చి, న్యూ ఇండియా పత్రికాధిపతియై దేశమునం దొకవిధమైన యాందోళనము సల్పెను. అప్పుడు భారతప్రజలందఱును ఈమె హైందవులపాలిటి భాగ్యదేవత యని యభిప్రాయపడి ఈమెకు సహాయ మొనర్చిరి. జాతీయవాదులకు మితవాదులకు రాజీ కుదిర్చి రెండుపక్షముల హైందవులకు కాంగ్రెసు సభామంటపమున కలియునట్లు చేసెను. ఇంతలో నీమె పెంట్లండు ప్రభువుగారి యాగ్రహమునకుఁ బాత్రురా లయ్యెను. భారతీయులు గొప్ప యాందోళనము గావించి యీమెను కారాగారవిముక్తఁగా నొనరించి, వెంటనే దేశీయమహాజనసభాధిపత్య మొసఁగిరి. వంగదేశజులు మాత్రము బిసెంటుగారి యంతరంగము పూర్తిగా నెఱింగినవా రగుటచే నీమెయాధిపత్యమును వల శంకించిరి. కాని కలకత్తాసభ జయప్రదముగ కొనసాగినది. తరువాత రాజ్యాంగసంస్కరణము విషయమై మితవాదులతోను ప్రభుత్వమువారితోను ఏకీభవించి, సహాయనిరాకరణోద్యమనిరసనమే ప్రధానమతముగాను గాంధీమహాత్ముని దూషించుటయే కార్యముగాను పని చేయుచున్నది. ఈమె మొదటస్థాపించిన స్వరాజ్యసమితులు కాంగ్రెసు మతము గ్రహించి పనిచేయుటచేతను, ఈమెయనుచరులలో పెక్కండ్రు కాంగ్రెసుపక్షములో కలసిపోవుటచేతను, హైందవజాతీయస్వరాజ్యకక్ష యను నూతనకక్ష కధినాయకురా లయ్యెను. ప్రస్తుతము ఈమె నొకపిచ్చి పట్టుకొని శోధించుచున్నది. మితవాదుల రాజనీతియందుఁ గాని, కాంగ్రెసు ఆదర్శమునందుఁ గాని, యీమెకు భారతభూమి మోక్షము గోచరము కాలేదు. కనుక నీమె హైందవనాయకుల నందఱ నొకచోఁ గూర్చి, వారి అందఱి యభిప్రాయానుసారముగా హైందవ రాజ్యాంగతంత్ర మొకటి తయారుచేసి, దానిప్రకారముగా ప్రభుత్వమువారిని ప్రస్తుతపరిపాలనాక్రమ మంతయు మార్పుఁడని కోరునటు. ఈమె కీవిషయమై సహాయముచేయుట కనుచరులు కలరు. మద్రాసునందు రామస్వామిఅయ్యరుగారును, బొంబాయియందు యమునాదాసు ద్వారకాదాసుగారును ముఖ్యులు. కాని ఈ సభోపయోగము వ్యర్థమని మితవాదులు సయితము తలంచుచున్నారు. ఈవిషయమై బిసెంటు ఢిల్లీకిపోయి హైందవసామ్రాజ్యశాసనసభ్యులఁ గొందఱిని దన వలలో వేసికొని యింకను ఈవిషయమై కృషి సల్పుచున్నది. ప్రస్తుతము ఈమె నడుపుచున్న న్యూఇండియాపత్రికకు 600 లేక 700 చందాదారు లున్నారు. న్యూఇండియాపత్రికకు మొదట 7000 వఱకు చందాదారు లుండెడివారఁట. దీనినిబట్టియే ప్రస్తుతము బిసెంటుగారికి దేశమునందు గల పలుకుబడి ప్రస్ఫుటము.

ఇండిపెండెంటు పక్షము:— దీనిని బొంబాయినగరమునందు నూతనముగా మహమ్మదాలీ జిన్నా మొదలగువారు స్థాపించిరి. ఈకక్షయొక్క యాదర్శము లేవో ఈపార్టీకిఁ జెందినవాఁ రెవరో పూర్తిగా తెలియదు. దౌర్జన్యరహితసహాయనిరాకరణ మన్న వీరికిని దలకెక్కదు. సహాయనిరాకరణమునకుఁ బూర్వము కాంగ్రెసు మత మెట్లుండెనో దానినే యనుసరింపఁగోరెడివారు. ఈకక్షవారు మితవాదులతో జేరరు. మితవాదులకును సహాయనిరాకరణావలంబకులకును మధ్యమార్గము ననుసరించెడివారు. వీరి యుద్దంత మేమో చేసెడి యాందోళన మేమో యీరికిని పత్రికల మూలముగా తెలియుట లేదు. నామరూపములు లేకుండ నడుగంటునవి కదా యిట్టికక్షలు!

జస్టిస్ పార్టీ:— ఈపార్టీ ముఖ్యముగా మద్రాసు రాజధానికిఁ జెందినది. కొంచెము బొంబాయిరాజధానియందుఁ గూడ తల చూపుచున్నది. ఈపార్టీకి బ్రాహ్మణేతరసంఘ మొక్కటియే చెందినది. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరసంఘమున కంతకు నొనరించిన వసుకొనెడు లోపములను అపకారములను దొలఁగించి బ్రాహ్మణేతరసంఘాభ్యుదయమునకై పుట్టినకక్ష. వీరినాయకుల యుపన్యాసములందును వీరి పత్రికలయందును వీరిసభలయందును బ్రాహ్మణదూషణము నిండియుండును. ఈపార్టీకి కీర్తిశేషులును దేశభక్తిపరాయణులు నైన డాక్టరు నాయర్

గారు పితరులు. బొంబాయిలో కొల్హాపూర్ మహారాజుగారు పట్టుగొమ్మ. శ్రీత్యాగరాయశ్రేష్ఠిగారు శంకరాచార్యులవారు. బ్రాహ్మణులు శాసనసభలలో నధికసంఖ్యాకులుగ నున్నారనియు నుద్యోగములలో బ్రాహ్మణేతరసంఖ్య చాల తక్కువ యనియు, దీనికంతకును బ్రాహ్మణులదగ్గఱ నున్న మాయలమారితనమే ప్రధానకారణ మనియు నూహించి, పట్టుదలయే కాని పగమార్గ మెట్టుండగకుండ బ్రాహ్మణులకెందును హెచ్చుము కలుగకుండ జేయవలెనని భగీరథయత్నములు సల్పుచున్నారు. ప్రత్యేకసంఘప్రాతినిధ్యము గోరి మద్రాసుశాసనసభయందు మిగుల నధికారముగలకక్షిగా నున్నారు. నిజముగా ప్రత్యేకసంఘప్రాతినిధ్యము కావలసినవారు బ్రాహ్మణులు. వోటర్లలో నూటికి తొంబదిమంది బ్రాహ్మణేతరులే. ధనవంతులును వారే. కొన్నియేండ్లకు బ్రాహ్మణప్రతినిధులు ఆశాసనసభయందు లేకుండ పోవచ్చును. వీరు ప్రభుత్వపక్షావలంబకులు. సహాయనిరాకరణమునందు బ్రాహ్మణేతర జనసామాన్యమే పట్టుదలతో పనిచేసి ప్రభుత్వమువారిని గడగడ వడంకజేసినది. స్వదేశవస్త్రధారణము త్రాగుడు మానుట అస్పృశ్యతానివారణము మొదలగునవి బ్రాహ్మణేతరసంఘాభ్యుదయమునకు మార్గములైనను బ్రాహ్మణేతరసంఘనాయకుల మని చెప్పుకొనెడివారు మాత్రము వీనిని గ్రహింపక మానిరి. గాంధిమహాత్మునిచే ప్రభుత్వవిధ్వంసమునకై కొనితేబడిన సహాయనిరాకరణమునందలి సూత్రము లగుటచేత తాము ప్రభుత్వపక్షావలంబకు లగుటచేత తా మిట్టివి సమర్థింపరు. బ్రాహ్మణేతరసంఘకక్షి అని పేరుపెట్టినను దాదాపు తేయిశాఖలు గల బ్రాహ్మణేతరసంఘ మంతయును దీనిలో జేరలేదు. నిమ్నజాత్యుద్ధరణమునకు నిజముగా వీరు పాటుపడినది తక్కువ. ఈమధ్య చెన్నపురియందు ఆదిద్రావిడులకును మిగిలిన బ్రాహ్మణేతరులలోని వారికిని జరిగిన కలహములలో బ్రాహ్మణేతరసంఘ నాయకులు ఆదిద్రావిడులపై పెట్టిన యాగ్రహమును జూపిరో పత్రికలను జదివినవారికి తెలియును.

మద్రాసుశాసనసభలో నిమ్నజాత్యుద్ధరణమునకై ప్రభుత్వమువారిచే స్థాపింపబడిన లేబర్ డిపార్టుమెంటు నెత్తివేయుటకు బ్రాహ్మణేతరనాయకులే తీర్మానము పెట్టిరి. కందస్వామిచెట్టిగారు మంత్రులగు రామారాయణింగారిపై దెచ్చిన యభియోగముకథ పూర్తిగా పెటింగినవారికి బ్రాహ్మణేతరసంఘనాయకులు తత్సంఘాభ్యుదయమునకై చేయుచున్న ప్రయత్నము లెట్లున్నవో తేటపడగలదు.

ఈమధ్య రాజమహేంద్రవరమునందు శ్రీత్యాగరాయశ్రేష్ఠిగారి యధ్యక్షతను గోదావరీమండలబ్రాహ్మణేతరసభలో గావింపబడిన తీర్మానముల జదివినచో ఆనాయకుల దృక్పథము గోచరించును.

భావి పరిస్థితులు:—అన్యహస్తగత మగు దేశములందు రాజకీయకక్షుల బాహుళ్యము దేశకల్యాణమునకు మార్గము లేదు. కీర్తిశేషులైన బ్రైస్‌దొరగారు తమ మోడరను డిమోక్రసీస్ అను గ్రంథమునందు పరాధీనదేశములందు రాజకీయకక్షుల బాహుళ్యము నిరసించెనని చెప్పినాడు. అట్టి కక్షులే బయలుదేరినయెడల ననర్థములు మెండు. అందు కొన్ని ఇవి:—(౧) దేశాభ్యుదయమునకై యంతటికిని గావలసిన ప్రధానసమస్య కొనసాగదు. అభిప్రాయభేదములు మెండుగా కలిగి యొకకక్షితో మఱియొకకక్షి కలహమాడుచున్నచో కాలమంతయు కలహములకే వినియోగపడి ప్రధానకార్యము వెనుకబడి పోవుచుండును. (౨) ఒకకక్షియందు దొకకక్షి కనుమానము కలిగి చిత అను దేశకల్యాణమునకై గాక దేశ విధ్వంసమునకై మార్గమేర్పడును. (౩) ఇట్టికక్షులు మెండుగా నున్నయెడల దేశమునందలి పాలకులకు చులకనై సంఘీభావము మెప్పటికైనను కలుగదు. (౪) ప్రభుత్వము ఒక కక్షిను లోబఱచుకొని పరస్పరము కలహము ద్వేషము పుట్టించెదరు. ఇట్టి యనర్థము లెన్నియో కలవు. కాన హైందవులందఱు నేకీభవించి, సత్వరస్వరాజ్యమునకై యాందోళనము కావించి దేశాభ్యుదయమునకై కంకణము కట్టుకొనినయెడల స్వరాజ్య మఱచేతి మాణిక్య మగును. దేశమునం దధికసంఖ్య కలిగి హైందవజనసామాన్య మంతయుం జేరిన కాంగ్రెసుపక్షమే ముఖ్యపక్షము కాగలిగి ప్రతివాదును కాంగ్రెసు ఆదర్శముల కొనసాగించిన స్వరాజ్యము తనంతటనే వచ్చును.

ఇండిపెండెంటు కక్షి:—ఈకక్షి నూతనముగా బయలుదేరినది. బొంబాయినగరమునందు మహమ్మదాలీ జిన్నా సర్ డిన్షా పెటీటు మొదలగువారు దీనిని స్థాపించిరి. కాని ఈకక్షియొక్క యాదర్శము లేవో ప్రస్తుతము ఈపార్టీకి చెందినవారెవరో పూర్తిగా తెలియదు. సహాయనిరాకరణావలంబన మన్న వీరికిని దలకెక్కదు. సహాయనిరాకరణమునకు బూర్వము కాంగ్రెసుమత మెట్లుండెనో దానినే అనుసరించెడి యుద్దేశ్యముకలవారు. ఈకక్షివారు మితవాదులతోం జేరరు. వీరు మితవాదులకును సహాయనిరాకరణావలంబకులకును మధ్యమార్గము ననుసరించెడివారు. అదియుంగాక ప్రస్తుతము వీరి లయుదంత మెట్టిదో, చేసెడి యాందోళన మెట్టిదో యేరికిని బత్రికల మూలముగా దెలియుట లేదు కక్షి యనుగంటిన దేమో!

జస్టిస్ పార్టీ:—ఈపార్టీ ముఖ్యముగా మద్రాసురాజధానికిం జెందినది. కొంతవఱకు బొంబాయిరాజధానిలోం గూడ వ్యాపించినది. ఈపార్టీకి ఒకబ్రాహ్మణేతరసంఘమే చేరినది. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరసంఘమున కొనరించిన దనుకొనెడు లోపములను అపకారములను దొలగించి బ్రాహ్మణేతరసంఘ మభివృద్ధిలోనికి దెచ్చుటయే ప్రధానమతముగల కక్షి. వీరినాయకులకును వీరిపత్రికలకును బ్రాహ్మణులను దూలనాడుటయే మతము, ప్రభుత్వపక్షావలంబకులు. సహాయనిరాకరణమన్న చాల నిరసించెడివారు. ఈపార్టీకి కీర్తిశేషులైన నాయర్‌గారు ప్రతిష్ఠాపకులు.

# జ్యోతిష విచారణము

సోదరి శ్రీమతి సూర్యమణి దేవి కవయిత్రి గారు, మాడుగుల

సచ్చిదానందస్వరూపుం డయి యూహాహాతీతమును అగోచరమును నగు స్వరూపమును గలిగి లోకాధారమూర్తియై యొప్పుచుండెడు పరమేశ్వరుండే పరబ్రహ్మము. అట్టిదియే కాలము. అట్టికాలమును దెలిసికొనుటయే జ్యోతిషము. "జ్యోతి" యనఁగా (ఆకాశమునందు) వెలుఁగునది. అదియే సూర్యుఁడు. ఆసూర్యుని తేజస్సే తక్కినగ్రహములును, నక్షత్రములు నై వెలుంగుచున్నవి. ఈ సూర్యుఁడు అష్టమూర్తులలో ప్రధానుఁడు. తక్కిన చంద్రాదిగ్రహములును అష్టమూర్తులలోనివే. ఇట్టిసూర్యుఁడు ధ్రువమండలము నాధారము చేసికొని లోకముల యోగక్షేమములకొఱకు తన స్వరూపంబును ద్వాదశవిధంబులుగ విభజించి వసంతాదిఋతువుల నాయా కాలవిశేషములయందుఁ గలుగఁజేయుచు జ్యోతిశ్చక్రాంతర్వర్తియై స్వకీయతేజఃపుంజదీపితాఖిలజ్యోతిర్గణంబులు గలవాఁడై ద్వాదశరాసులయందు నొకసంవత్సరంబుగ సంచరించుచుండును. అట్టి ఆదిపురుషుని గమనవిశేషకాలమును లోకులు - అయనర్తు మాస పక్ష తిథ్యాదులచే వ్యవహరించుచుందురు. చంద్ర కుజ బుధ గురు శుక్ర శని రాహువులు అష్టమూర్తులలోనివారు. అందు రాహువు తక్కఁ దక్కినగ్రహములు సూర్యు ననుసరించి- సూర్యునకు పైన ధ్రువునకు దిగువ-నుందురు. అనఁగా భూమికి 91430000 మైళ్ళ దూరమున సూర్యమండలమును, సూర్యమండలమునకుపైన లక్ష యోజనంబులదూరంబున చంద్రుండును, చంద్రునకు మూఁడులక్షల యోజనంబుల దూరంబున శుక్రుండును, శుక్రునకు రెండులక్షల యోజనంబుల దూరంబున బుధుండును, బుధునకు రెండులక్షలయోజనంబుల దూరంబునఁ గుజుండును, కుజునకు రెండులక్షలయోజనంబుల దూరంబున గురుండును, గురునకు రెండులక్షల యోజనంబుల దూరంబునశనియును, సూర్యునకు దిగువ సూర్యు ననుసరించి పదివేలయోజనంబుల దూరంబున అపసవ్యంబుగ రాహువును సంచరించుచుందురు. కేతువుగూడ సూర్యచంద్రాదులవలె శుభాశుభఫలముల నిచ్చుచుండఁగా అష్టమూర్తులలోఁ జేర్చి చెప్పకపోవుటకు కారణ మేమన ? రాహు కేతువులు మొదట నొకస్వరూపము గలవారు. ఆ స్వరూపము రాహు వనియే చెప్పఁబడెను. కారణాంతరమున శ్రీమహావిష్ణువుచే ఖండింపఁబడిన రాహువుయొక్క శిరస్సును రాహు వనియును, కంఠము మొదలధఃకాయమును కేతు వనియును వ్యవహరించుచున్నారు. "సర్వస్య గాత్రస్య శిరః ప్రధాన"మ్మను నార్యోక్తి ననుసరించి రాహువు అష్టమూర్తులలోనివాఁడుగ చెప్పఁబడెను. రాహు కేతువులు మొదట నొకరూప మగుటచేతనే రాహువు అంశాధికుం డైనకేతువు అంశాధికుం డగు. వీరిరువురిలో నొకరికంటె నొకరు రెప్పుటను అంశాధికులు గారు. కనుక కేతువును అష్టమూర్తులలో చేర్చి చెప్పక పోయినను రాహు కేతువు లొకటి యగుటవలన రాహువును చెప్పినారు. వీరిరువు రొకరికొకరు సమసప్తమంబుల నుందురు.

రవ్యాదిగ్రహంబు లన్నియు ద్వాదశరాసులలో సంచరించుచుండును. రవి యొకరాశియందు ముప్పది దినములును, చంద్రుఁడు రెండుదినముల పదునైదుఘడియలును, కుజుఁడు నలువదియైదు దినములును, బుధుఁడు పదునెనిమిదిదినములును, గురు వొకవత్సరంబును, శుక్రుం డిరువదియెనిమిదిదినములును, శని ముప్పదిమాసములును, రాహు కేతువులు పదునెనిమిదిమాసములు నుందురు. బుధుఁడు సూర్యుని నొకరాశికంటె నధికముగ వదలియుండఁడు. శుక్రుఁడు రెండు రాసులకు ముందుగాఁ గాని వెనుకగాఁ గాని శీఘ్ర మందగమనంబుల సూర్యు ననుసరించి యుండును. అధికముగ వదలియుండఁడు. ఈ ద్వాదశరాసులును ఇరువదియేడు నక్షత్రములవలన నేర్పడినవి. ఈ ఇరువదియేడు నీశ్వరస్వరూపములే.

మేషాదిద్వాదశరాసులకును రవ్యాదిగ్రహంబులకును మనుష్యులకును గల సంబంధ మేమి యనిన, మేషాదిద్వాదశరాసులు కాలపురుషుని యంగములు. అందు మేషము శిరస్సు. వృషభము ముఖము. మిథునము వక్షస్సు. కర్కాటకము హృదయము. సింహము కుక్షి.

కన్య కటి. తుల నాభి లింగమధ్య ప్రదేశము. వృశ్చికము లింగము. ధనుస్సు ఊరువులు. మకరము జానువులు. కుంభము జంఘలు. మీనము పాదములును. రవి ఆత్మ. చంద్రుఁడు మనస్సు. కుజుఁడు శక్తి. బుధుఁడు వాక్కు. గురువు జ్ఞానము. శుక్రుఁడు ఇంద్రియసుఖము. శని దుఃఖము. రాహువు ప్రతాపము. వీనికి కారకులై ద్వాదశ రాసులయందు సంచరించుచు పూర్వజన్మసంచిత శుభాశుభఫలముల నిచ్చుచుందురు. గ్రహముల గుణ రూపములను బట్టి మనుష్యులగుణరూపములు గలుగు చున్నవి. సూర్యాది గ్రహములయొక్కయును నక్షత్రముల యొక్కయును కిరణ ప్రసారములచేతను కాంతిచేతను వీక్షణాదులచేతను చీఁకటి వెన్నెలలచేతను కాలగతి చేతను శీతోష్ణములచేతను జీవకోటియు ఓషధులును వృక్షాదులును సస్యాదులును మంచి సెడ్డ వృద్ధి క్షయము లును గలిగి పుట్టుచు గిట్టుచు నున్నవి.

సర్వమయుండును కాలపురుషుండు నైన యీశ్వ రునిచే దొలుత లగధుఁడు పరాశరుఁడు గర్గుఁడు బ్రహ్మ సూర్యుఁడు వ్యాసుఁడు వసిష్ఠు ఆర్యభటుఁడు అత్రి కాశ్యపుఁడు నారదుఁడు మరీచి మనువు అంగిరసుఁడు యవనుఁడు భృగువు జైమిని బృహస్పతి రోమకుఁడు పైలవుఁడు భాస్కరుఁడు శౌనకుఁడు మొదలగు మహ ర్షులు తెలిసికొని లోకోపకారార్థము సిద్ధాంత జాతక ముహూర్త ప్రశ్నభాగములను నాల్గుభాగములు సూత్ర ప్రాయములుగా రచించిరి. అప్పటిమహర్షుల దివ్యజ్ఞానము గ్రహతారాములవఱకే వ్యాపించియుండెను. కనుకనే వా రందఱును గొప్పహోరా శాస్త్రవేత్తలయి యుండిరి. హోరాశాస్త్రము లన్నియును మహర్షులు వ్రాసినవే. వీని ననుసరించి తరువాతిమహాకవులు సంస్కృతమున ననేక గ్రంథములు రచియించిరి. అవియును తాళపత్రములలో వ్రాయుటవలన శిథిలమై పోఁగా మిగిలినవానిలోఁ గొన్ని టిని ఇటీవల కొందఱు మహనీయులు ముద్రింపించిరి.

జ్యోతిశ్శాస్త్రము వేదాంగములలో ప్రధానాంగ మై యున్నది.

"శ్లో. శబ్దశాస్త్రం ముఖం జ్యోతిషం చక్షుషీ శ్రోత్ర
మున్తం నిరుక్తంచ కల్పః కరౌ
యాతు శిక్షాస్య వేదస్య సా నాసికా పాద
పద్మద్వయం ఛంద ఆద్యైః బుధైః."

జ్యోతిశ్శాస్త్రము వేదమునకు నేత్ర మని చెప్పి యున్నారు. "సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్" అనునట్లు సర్వేంద్రియములకు నేత్రము లెట్లు ప్రధా నమో వేదమునకు జ్యోతిషము నట్టిదియే.

"శ్లో. యథా శిఖా మయూరాణాం నాగానాం మణయో యథా,
తథా వేదాంగశాస్త్రాణాం జ్యోతిషం మూర్ధ్ని స్థితమ్."

అని చెప్పఁబడియున్నది. వైదికకర్మముల కన్నింటి కిని జ్యోతిశ్శాస్త్రజ్ఞాన మావశ్యకము. కనుకనే దీనిని వేదాంగముగ గ్రహించిరి.

ఇట్టి జ్యోతిషము, సిద్ధాంతము జాతకము ముహూ ర్తము ప్రశ్నభాగము లని నాలుగుభాగములుగ విభజింపఁ బడియున్నవి. ఈ నాలుగుభాగములకు సిద్ధాంతభాగము ఆధారమయి యున్నది. ఈనాలుగుభాగములును స్వల్ప సంఖ్యాకులచే అభ్యసింపఁబడుచున్నవి. సిద్ధాంతభాగము తెలియక జాతకభాగము మాత్రమే అభ్యసించి వ్రాసిన ఫలములు ఎఱుకలసాముద్రికమువలె బుజువిచ్చును.

సిద్ధాంతభాగమువలన గ్రహగతులు గ్రహస్ఫుట ములు తిథి నక్షత్ర యోగ కరణ త్యాజ్య గ్రహయుద్ధ సమాగమ గ్రహణాది కాలపరిమాణజ్ఞానమును జాతక భాగమువలన జాతకునియొక్క పూర్వజన్మ కృత సుకృత దుష్కృతములవలన భూతభవిష్యద్వర్తమానములలోఁ గలుగు ఆయుర్దాయాది ద్వాదశ శుభాశుభఫలములును ముహూర్తభాగమువలన తా మాచరించు కార్యము లెట్టివేళలయం దాచరించిన నిర్విఘ్నంబుగ నెఱవేఱునో అట్టికాలమును ప్రశ్నభాగమువలన తమ కోరిక లెట్లు పరిణమించునో అదియును తెలిసికొననగును.

జ్యోతిశ్శాస్త్రమునందు నస్మాకము భరతఖండము నుండి చీనా బాబిలోనియా కాల్డియాదేశములకును అక్కడనుండి ఈజిప్టుదేశమునకును వ్యాపించెను. జ్యోతి శ్శాస్త్రమును బలరాముఁడు గ్రీసుదేశమున వ్యాపింపఁ జేసెను. గ్రీసుదేశమునుండి ఆశాస్త్రము యూరపుఖండ మం దంతటను వ్యాపించెను. ఇట్లు జ్యోతిశ్శాస్త్రము భరతఖండమునుండి ప్రపంచమందలి యితరభాగములకు వ్యాపించెను. జ్యోతిశ్శాస్త్రమే కాక గణితశాస్త్రమును మతమును మొదట భరతఖండమునుండియే యితరదేశ ములకు వ్యాపించెను. ఏషియాఖండమే కాక పాశ్చాత్య దేశములును ఇండియానుండియే శాస్త్రజ్ఞానమును పొంది

మును పొందినవి. బీజగణితము రేఖాగణితము హైందవులే కనిపెట్టిరి. అరేబియాదేశస్థులు హైందవులయొద్ద జ్యోతిశ్శాస్త్రము నేర్చుకొనిరి వీరేకాక మహమ్మదీయులుకూడ జ్యోతిశ్శాస్త్రము నిజమని నమ్మియుండిరి. ఇట్టి సర్వజనసమ్మతం బైనయీజ్యోతిశ్శాస్త్రమునకుమాతృదేశమైన మన భరతఖండమునందు నవనాగరకులు పెండై పూర్వజ్ఞానములను తలపెట్టకపోవుటవలన జ్యోతిషవిద్య నానాటికి క్షీణదశ నొందినది. కొందఱు జ్యోతిష్కులు సద్గురువునొద్ద నీశాస్త్ర మభ్యసింపకయే- అభ్యసించినను పూర్ణముగ నభ్యసింపకయే-శాస్త్రపరిశోధన చేయకపోవుటచేతను, ఎవ రైనను వారి జన్మపత్రికలనుజూపిన ధనాపేక్షచే అందలిపాపఫలములను శుభఫలములుగ చెప్పుచుండుటవలన నీజ్యోతిష్కులుచెప్పిన శుభఫలములు ఋజువీయకపోయినవి. ఇందుచే సర్వోత్తమంబగు నీజ్యోతిశ్శాస్త్రమును విశ్వసింపకయున్నారు. ఈ శాస్త్రమును సద్గురువునొద్ద పూర్తిగ నభ్యసించి శాస్త్రపరిశోధనము చేయగలవారు సరియయిన జనన కాలఘటికలు జాతకమును చక్కగఁ జూచి గ్రహబలాబలముల నరసి చెప్పిన ఫలములు తప్పక జరుగును. ఇత్యాది గ్రంథావలోకనంబుచేతను అనేక జాతకములు చూచుటచేతను నా యనుభవమువలనను జెప్పఁబడినది. ఇట్టి జ్యోతిశ్శాస్త్రమును పురుషు లభ్యసించి స్త్రీలకు సహితము చెప్పించి వారి అజ్ఞానాంధకారమును బాపి సుజ్ఞానవతులను జేయవలయును.

ప్రస్తుతము స్త్రీలు చదువనేకూడ దనియును చదివిన ప్రయోజనము లేదనియును చదివిన అనేకములు చిక్కులు తటస్థించు ననియును స్త్రీలు గృహకృత్యములు చేసిన చాలుననియును మనపూర్వపుస్త్రీలు చదువుకొని ఉద్యోగములు చేసి జీవించిరా యనియును స్త్రీల కేవిషయమునను స్వాతంత్ర్య మీయరా దనియును కొందఱు మహనీయులు వాదించుచున్నారు. స్త్రీలకు విద్యకూడ దనుట కేవలము హాస్యాస్పదము. స్త్రీ పురుషునియొక్క అర్థశరీర మగుటవలన కొంతభాగమునకు విద్యవచ్చి కొంతభాగమునకు విద్య రానియెడల శకటమున కొకప్రక్క బలమైనయెద్దును రెండవప్రక్క బలహీన మైనయెద్దును పూన్చిన శకటమును నడిపించిన నెటులు నడచునో అటులే ఈసంసార మనుశకటమును నడచును. విద్య యనునది స్త్రీలకుదుఃఖమును పురుషులకు సుఖమును కలుగఁజేయునది గాదు. విద్యావతులయినస్త్రీలు తమసంతతిని విద్యావంతులను జేయుటకు ప్రోత్సాహపఱచుచు గుణవంతులుగను ఆరోగ్యవంతులుగను జేయుచుండుటను, విద్యావిహీనలగు స్త్రీలు తమసంతతివా రెట్టియయుక్తమార్గప్రవర్తకు లైనను మరల్పలేక యేవిషయములోను యుక్తప్రవర్తకులను చేయఁజాలకుండుటను, స్త్రీలు విద్యనేర్చుకొనుటవలని ప్రయోజనమును సూచించుచున్నది. చిక్కులు తటస్థించుట వారిబుద్ధివలనఁగాని విద్యవలన నెంతమాత్రమును గాదు. ఖరకరకిరణములు సోఁకి హిమం బెట్లు కరఁగిపోవునో అటులే విద్యవలన అజ్ఞానాంధకారమువలనఁ గలుగు దుశ్చేష్టలు పోయి సుజ్ఞానవతు లగుదురు. కావున దేశసేవాతత్పరు లగు నో సోదర సోదరీమణులారా! పరబ్రహ్మమును గుర్తెఱుంగుటకు సోపానం బైన యీ యద్వితీయ జ్యోతిశ్శాస్త్రము ప్రతివిషయమునను ప్రతివారికిని ముఖ్యావసరము. ఇట్టి సర్వజనోపయోగమగు జ్యోతిశ్శాస్త్రమును ప్రతివారును ఆదరించి అభ్యసించి అభివృద్ధిలోనికిఁ దెచ్చెద రని విశ్వసించుచున్నాను.

# వేదాంత సాంఖ్యము

కార్పర్ల శ్రీనివాస రావు గారు

శ్లో. అపశ్యతాం హి యజ్జ్ఞానం ప్రపంచం భాతి సత్యవత్, ప్రపశ్యతాం హి యద్జ్ఞానం ప్రపంచం యాతి శూన్యతాం
తత్పూర్ణం నిర్వికారంచ వందే నారాయణం సదా, వేదాన్తం గణితం చాపి సంబధ్య కథయా మ్యహమ్
వేదాన్తసాంఖ్య శాస్త్రాఖ్యం వేదవ్యాసగురోః కృతం, తన్నిర్విఘ్నసమాప్త్యర్థం వన్దేహం విఘ్ననాయకం
శృణు వక్ష్యామి తే విద్వన్ గణితం మోక్షసాధనం, గణితజ్ఞైః ప్రయత్నేన చింతనీయం సమాహితైః
ముముక్షు ర్మోక్షమాప్నోతి జిజ్ఞాసు ర్జ్ఞానవాన్ భవేత్, వేదాన్తసాంఖ్యశాస్త్రేణ భక్తా స్సుశ్ఛిన్నసంశయాః.

దేనినైన నొక యిష్టాంకమును అదే యంకెచేత నెన్నిసారులైనను గుణించుటవలన వచ్చిన లబ్ధమునకు ఘాతాంక మని పేరు. దీనినే ఆంగ్లభాషయందు ఆ యిష్టాంకముయొక్క పవర్ అని చెప్పుదురు. ఎట్లన, $6 \times 6 \times 6 \times 6 \times 6 = 7776$. ఇక్కడ నిష్టాంకము 6. అయిదారులను మధ్యమధ్య గుణకారసంజ్ఞల నుంచి మొదటియారులను రెండవ 6 చేతను గుణించి యాఫలమును మూడవ 6 చేతను తరువాత నాల్గవ 6 చేతను, పిమ్మట అయిదవ 6 చేతను గుణింపగా వచ్చిన ఫలము (7776) ను 6 యొక్క ఘాతాంకమని చెప్పుదురు. రెండు 6 లను పుచ్చుకొని గుణింపగా వచ్చినఫలమును అనగా 36 ను ద్విఘాతాంకఫల మనియు, మూడు 6 లను పుచ్చుకొని గుణింపగా వచ్చిన ఫలము ననగా 216 ను త్రిఘాతాంకఫల మనియును ఇట్లే 1296 ను చతుర్ఘాతంకఫల మనియును, 7776 ను పంచఘాతాంకఫల మనియు ను చెప్పుదురు. 6 ను ఇన్నిసారులు పుచ్చుకొనగా వచ్చిన ఫలమును సూచించు 2, 3, 4, 5, అనుసంఖ్యలను వ్రాయుటలో 6 ను మొదలు వ్రాసి దాని ప్రక్కను కుడి వైపున కొంచెముపైగా వ్రాయుదురు.

ఎట్లన :— $6^4$ అనగా 6 ను నాలుగుసారులు పుచ్చుకొని గుణింపగా వచ్చినఫల మని సూచించును. ఇన్నిసారులు పుచ్చుకొనగా వచ్చినఫల మని సూచించు సంఖ్యను గణితపరిభాషలో ఘాతసూచి యని గాని ఘాతప్రకాశ మనిగాని చెప్పుదురు. గుణింపబడు సంఖ్యను మూలసంఖ్య యని చెప్పుదురు. ఈసందర్భములో నొక సంగతి చెప్పవలసి యున్నది ఏమనగా :—

$$6^5 = 6 \times 6 \times 6 \times 6 \times 6 = 7776$$
$$6^4 = 6 \times 6 \times 6 \times 6 = 1296$$
$$6^3 = 6 \times 6 \times 6 = 216$$
$$6^2 = 6 \times 6 = 36$$
$$6^1 = 6 = 6$$

ఇక్కడ $6^4$ యొక్కఫలము, $6^5$ యొక్కఫలమును 6 చే ననగా మూలసంఖ్యచే భాగించినయెడల వచ్చును. $6^3$ యొక్క ఫలము, $6^4$ యొక్క ఫలమును మూలసంఖ్యచే భాగించిన వచ్చును. అనగా ఘాతసూచిలో ఒకటిని తీసివేసినయెడల పైదాని ఫలమును మూలసంఖ్యచే ఒకమారు భాగింపవలెను. కనుక $6^1$ యొక్క ఫలము, $6^2$ యొక్క ఫలమును మూలసంఖ్యచే భాగింపగా వచ్చును. అనగా 36 ను 6 చే భాగించిన 6 వచ్చును. కనుక ఘాతప్రకాశము 1 యైనయెడల మూలసంఖ్య మార్పులేక మూలసంఖ్యగానే యుండును. దీనిని బట్టి $6^0$ యొక్కఫలము, $6^1$ యొక్క ఫలమును, 6 చే భాగింపగా రావలెను. అనగా మూలసంఖ్యను మూలసంఖ్యచే భాగింపవలెను. అనగా 1 వచ్చును. కనుక మూలసంఖ్య శూన్యము గాకుండ నేదైనను ఘాతప్రకాశము శూన్యమైనయెడల ఫలము 1 యే యగును. ఇక్కడ మూలసంఖ్య శూన్యముగాక మఱి యేయితరసంఖ్య యైనను అనుటవలన 1 అనుసంఖ్యకు కారణమైన సంఖ్య వ్యావహారికములో వాడబడు ఏకాద్యంకములు గాక గణితమాత్రప్రసిద్ధమైన పూర్ణాంకముగూడ గావచ్చును. వేదాంతశాస్త్రమందు పూర్ణమనగా సర్వవ్యాపియైన నిరాకార నిర్వికార సత్యజ్ఞానానందస్వరూప మని తెలియజేయును. ఈ పూర్ణస్వరూపము సర్వప్రపంచమునకు ఎట్లు కారణ మగుచున్నదో అటులే గణితములో పూర్ణ మశేషమైన అంకప్రపంచకమునకు కారణ మగుచున్నది. కనుక వేదాంతశాస్త్రమందు పూర్ణశబ్దమును అర్థముచేసికొనుటలో నెట్టిభావన చేయవలెనో అట్టిభావననే గణితశాస్త్రములోను పూర్ణశబ్దమునకు గూడ జేయవలెను. ఈ పూర్ణమునే యాంగ్లభాషలో ఇన్ఫినిటీ. అనగా అనంతమని చెప్పుదురు. ఈపూర్ణశబ్దమును భావనచేయుటలో 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అను ఉపనిషద్వాక్యార్థమును శ్రీకృష్ణభగవానులు అర్జునునకు సమాధిస్థితియం దున్నవానిలక్షణమును బోధించుసందర్భములో నుత్తరగీతలయందు చెప్పబడిన శ్లోకముల యర్థమును ఈశావాస్యములో చెప్పబడిన 'పూర్ణమదః పూర్ణ మిదం' అనువాక్యముయొక్క అర్థమును బహుజాగ్రత్తతో గమనింపవలెను. ఈవిధముగనే వేదాంతపరిభాషలో మాయయను పదమును సంఖ్యాశాస్త్రపరిభాషలో శూన్యమను పదమును ఒకటే యర్థమును బోధించుచున్నది. కనుక శూన్యమును మాయగా భావింపవలయును. ఇట్లు వేదాంతశాస్త్రము గణితశాస్త్రమను రెండుశాస్త్రములలో మానవుని పరమావధిని గ్రహించుట కుపయోగించు

రెండుసమానపదము లేకభావనతో ఒకటేయర్థమును బోధించుటకు సమర్థము లగుచుండగా పురుషుఁ డాశాస్త్రముల నభ్యసించుటకు సమాన ప్రయోజనమే పరమావధి యనుట సమంజసముగా నుండును గాని యీ రెండుశాస్త్రములకు సంబంధ మేమియు లేదనుట యుక్తి యుక్తము కాదు. బుద్ధికుశలతను గూడ సూచింపదు. మానవుడు క్రొత్త శాస్త్రములను కనిపెట్టుటవలన గలుగు లాభము లేకపోవుటయే గాక మానవజన్మమందలి యుత్కృష్టతగూడ కనపింపదు. హిందువులయొక్క ప్రతిశాస్త్రము పరమావధినే కలిగియున్నదని భరతవర్షమునందు బుట్టి భారతీయుల పరమావధులను సాంప్రదాయములను బాగుగ గుర్తెఱిగి యొకశాస్త్రమునైన నభ్యసించిన ప్రతిమానవుడును గ్రహింపకపోడు. ఇతరదేశీయులు కూడ నిట్టి యాదర్శమునే మనస్సునం దుంచుకొని శాస్త్రముల నన్నిటిని నభివృద్ధికి తెచ్చెదరుగాక.

వేనవేల సోదరజీవులను క్షణకాలములో నామరూపములు లేకుండ జేయుసమర్థత కలిగిన యంత్రములను కనిపెట్టుటయందు విని యోగించు కాలమును బుద్ధిబలమును ద్రవ్యమును శరీరశక్తిని మానవుడు పరమావధిని చేరుటకు సులభమార్గములను కనిపెట్టుటయం దుపయోగించె దరు గాక. ఈ పూర్ణమే సత్పదార్థము. ఇది రూపము లేని దగుటవలన పూర్ణమునకు రూప మని చెప్పబడు వృత్తము వ్యావహారికములో బోధకొఱకు కల్పితమని తలంపవలె ననుట లోకవిదితము. ఈయర్థమునే

'అధ్యారోపాపవాదాఖ్యాం నిష్ప్రపంచం ప్రపంచతే'

యను వాక్యము బోధించుచున్నది. మానవుడు తన మనోభావములను తెలియజేయుటకు ద్వైతభావమును సూచించు వాక్కే ముఖ్యసాధనమై యున్నది. పూర్ణస్వరూపమైన అద్వైతపరబ్రహ్మతత్వమును బోధించుటలో ప్రశ్నోత్తరముల కట్టివాక్కుయొక్క సహాయ మనివార్యము. కేవలాద్వైతబోధయందు మౌనమే శరణ మని దక్షిణామూర్తియవతారమే ప్రకటించుచున్నది. అందులకు నిదర్శనముగా

'చోద్యంవా పరిహారో వా క్రియతాం ద్వైతభాషయా
అద్వైతభావయా నైవ చోద్యం నాపి తదుత్తరం'

అని కూడ శాస్త్రములు ఘోషించుచున్నవి. పరబ్రహ్మ నిరాకారు డగుటవలనను ప్రకృతికి స్వతంత్రస్థితి లేకపోవుటవలనను ప్రకృతికి పరబ్రహ్మమే యాశ్రయ మగుటవలనను పూర్ణమునకు సంజ్ఞ యగు వృత్తము ప్రకృతిసంజ్ఞ యనుట యసందర్భము కాదు. సత్య దూరమును కాదు. సిద్ధాంతమునకు విరోధమును లేదు. ఈప్రకృతి రెండు విధములు- మాయయనియు నవిద్యయనియు. ఈ రెంటికిని శూన్యమనియే వ్యుత్పత్త్యర్థము. మాయయనునది శుద్ధసత్వప్రధాన. అవిద్య యనునది మలినసత్వప్రధాన పైనుదాహరించినఘాతము మూడువిధము లని నేను వ్రాసిన 'శ్రీదివ్యవహారము' అను గ్రంథమునందు ఆంగ్లభాషలో విపులముగ వ్రాయబడియున్నవి. అవి యేవియనఁగా వికోచమనియును సమ మనియును సంకోచమనియును మూడువిధములు. వికోచమనగా—సంఖ్య వృద్ధియగుచు వెళ్లుట, సమ మనగా—వృద్ధిక్షయములు లేక యున్నది యున్నట్లుండుట. సంకోచమనగా—తగ్గుచు వెళ్లుట. అవి యెట్లనః—

$(6<)^4=6\times7\times8\times9$

$(6=)^4=6\times6\times6\times6$ మనము సాధారణముగా వ్రాయు 64 అను అర్థము నిచ్చునదియే.

$(6>)^4=6\times5\times4\times3$

ఈ సంజ్ఞలను బట్టి మాయావిద్యలకు గల భేదమును కనిపెట్ట వలయును. ఎట్లనగా:—

$(6<)^4=6\times7\times8\times9$

$(6>)^3=6\times7\times8 = \dfrac{6\times7\times8\times9}{9} = \dfrac{(6<)^4}{6+4=}$

$(6<)^2=6\times7 = \dfrac{6\times7\times8}{8} = \dfrac{(6<)^3}{6+-1}$

$(6<)^1=6 = \dfrac{6\times7}{7} = \dfrac{(6<)^2}{6+2-1}$

$(6<)^0= \dfrac{(6<)^1}{6+1-1} = \dfrac{6}{6} = 1$

ఇటులనే

$(6>)^4=6\times5\times4\times3$

$(6Z)^3=6\times5\times\dfrac{4=6\times5\times4\times3}{3} = \dfrac{(6>)^4}{6-4+1}$

$(6<)^2=6\times5=\dfrac{6\times5\times4}{4}=\dfrac{(6>)^2}{6-3\times1}$

$(6>)^1=6=\dfrac{6\times5}{5}=\dfrac{(6>)^2}{6-2\times1}$

$(6>)^0=\dfrac{(6>)^1}{6-1+1}=\dfrac{6}{6}=1$

పైన $(6=)^0=1$ అని రుజువుపరుపఁబడెను. చూచితిరా శూన్య ఘాతముయొక్క విశేషము!

$(6<)^0=1\ ;\ (6=)^0=1\ ;\ (6>)^0=1$

ఇక్కడ 6 నుండి 1 యెట్లు వచ్చనదో గణితశాస్త్రరీతిచే ఋజువైనను భావనాతీతముగనే యున్నది. తరువాత :—$(6<)^1=6$, $(6=)^1=6$, $(6>)^1=6$) ఇక్కడ 6 అట్లగనే యుండి వికోచసంకోచములయొక్క భేదము వ్యక్తము గాక సమత్వమే స్పష్టమగుచున్నది.

$(6<)^2=6\times7\ ;\ (6=)^2=6\times6\ ;\ (6>)^2=6\times5$

ఇక్కడ నన్నిటో ఫలభేదముచేత త్రివిధఘాతములు పూర్తిగ వ్యక్తమగుచున్నవి. ఘాతము భావనాతీత మగుప్రథమావస్థయందు నవ్యక్త మగు ప్రకృతిలో సరిపోవుచున్నది. సమత్వమే స్పష్టమగు ద్వితీయావస్థయందు శుద్ధసత్వప్రధానయగు మాయలో సరిపోవుచున్నది. కేవల సమత్వమే గాక వికోచసంకోచములుగూడ వ్యక్తమగు తృతీయావస్థయందు మలినసత్వప్రధానయగు నవిద్యలో సరిపోవుచున్నవి.

వికోచసమసంకోచసంజ్ఞ లను మూటిని కలిపి వ్రాయుటవలన నేర్పడిన షట్కోణ మవిద్యకు సంజ్ఞయగును. మూడు గుణములు వ్యక్తమగు నవస్థ గనుక త్ర్యంకసంజ్ఞ కలదియగును. షట్కోణమందలి కోణము లవ్యక్తమైనయెడల దీర్ఘవృత్త (0) మేర్పడును. గనుక దీర్ఘవృత్తము మాయకు సంజ్ఞ యగును. ఒకగుణమే వ్యక్తమగు నవస్థగనుక ఏకాంకసంజ్ఞ కలదియు నగును.

(i) 6 + 6 + 6 + 6 = 24 (ii) 7 + 8 + 5 + 4 = 24.

ఇచ్చట రెంటింటిలోను గూడ సంకలనము స్పష్ట మగుచున్నది. అయితే మొదటిదానియందు సంఖ్యాసమత్వ ముండుటవలన నాలుగార్లని చెప్పవచ్చును. నాలుగార్లనునది గుణకారమును తెలియజేయును. గనుక గుణకారము సంఖ్యాసామ్యవ్యవస్థయందు గలిగిన సంకలనముయొక్క రూపాంతర మని చెప్పవచ్చును. రెండవదానియం దంకభేద ముండుటం బట్టి యట్లు చెప్ప వీలు లేదు. కేవలసంకలన మనియే చెప్పవలయును. కాబట్టి సంఖ్యాసామ్యవ్యవస్థను తెలియజేయు గుణకారము శుద్ధసత్వ ప్రధానయగు మాయకును విషమాంకప్రధాన యగు సంకలనము మలిన సత్వప్రధాన యగు నవిద్యకును సరిపోవును. వేదాంతశాస్త్రమందును గణితశాస్త్రమందునుగూడ స్వయంసిద్ధము లని చెప్పదగు నిన్ని విషయములలో సాదృశ్య మున్నందున ఆ రెండుశాస్త్రములకు సంబంధము విస్పష్టముగ గాన్పించుచున్నది. ఇట్టిసంబంధమును స్థిరపఱచుటకు ఈ దిగువ నిచ్చిన రెండుయంత్రములను జూడుడు. మొదటియంత్రము:—




ఈయంత్రము కాకినాడలో వెలువడు ఆర్యప్రభ యను పక్షపత్రికయొక్క 2-వ సంపుటము 1,2,3, సంచికలలో యంత్రమహత్తను శీర్షికక్రిందఁ జూడుడు. 2, 3, సంచికలలో యీయంత్రము ద్వారా మనము తెలిసికొనదగు చాల గణితవిశేషములు మాత్రము చెప్పబడియున్నవి. ఈయంత్రమునకు 'సదాశివ' యంత్ర మను నామ మీయబడెను. ఈయంత్రమువలన తెలిసికొనదగు మఱియొక ముఖ్యవిశేషమేది యనఁగా—

షట్కోణమందలి వికోచశకలము బ్రహ్మఖండ మనియును సమయన శకలము విష్ణుఖండమనియును సంకోచశకలము శివఖండమనియును నూహింపవలయును. సమస్తజీవులలో నుత్కృష్టుడైన మానవుని దేహమందు పైన చెప్పబడిన త్రిమూర్తుల భాగములను చూడనగును. అది యెట్లనఁగా వికోచమును తెలియజేయు ఆపాదకటిపర్యంతమును బ్రహ్మఖండ మనియును, సమసంజ్ఞను తెలియజేయు కట్యాదిభుజపర్యంతభాగమును విష్ణుఖండ మనియును సంకోచమును తెలియజేయు తదూర్ధ్వభాగము శివఖండ మనియును నెఱుంగునది. ఇట్టి విభాగము మానవుని నీతిమార్గము బోధించుచున్నది. ఎటులనఁగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు ముఖ్యలక్షణములు స్వసుధర్మశృంగారవైరాగ్యములు. ఈలక్షణములను సులభముగా జ్ఞాపకముంచుకొనుటకు నీతిశాస్త్రసారాంశములను ఈదిగువను శ్లోకరూపమున నిచ్చుచున్నాడను:—

శ్లో. స్వసుధర్మశ్చ శృంగారో వైరాగ్యం తద్గుణాః ఖలు
ధర్మమార్గ విభాగాశ్చ పశ్యే న్మూర్తిత్రయే క్రమాత్.
నీతిశాస్త్రస్య బీజాని హ్యేతాన్యేవ న సంశయః
సర్వా నవయవాం శ్చాపి సృష్టిస్థిలయాత్మకాన్.
శిష్టా యథార్థం గృహ్ణంతు యథాదేవం యథాగుణం
త్రిమూర్తీనాంచ ధర్మాంస్తు యథాభాగం సమన్వయేత్.
ప్రథమం ధాతృఖండేచ తృతీయం శాంభవే తథా
సమన్వయే ద్యథా ధర్మం తథానీతా సమాచరేత్.
నాతిక్రమ్యచ వైరాగ్యం స్వసుధర్మం తథైవచ
మధ్యస్థత్వాచ్చ శృంగారం భుంజీయా ద్బుద్ధిమా న్నరః.

ఈయంత్రమునందలి వేదాంతవిశేషములను తెలిసికొనుట కీదిగువ నిచ్చిన యమాయక యంత్రముకూడ నవసరముల ఆయంత్రమును వేయవలసినవిధానము 'సదాశివ' యంత్రమందలి చతుర్భుజాంకములు- అనగా 1, 6; 2, 3) 6 యొక్క గుణావయవములు (ఫ్యాక్టర్సు)- గనుక మాయాత్మకము లనియు నట్టిమాయను తొలగింపవలయునన్న ప్రతికోణాంకము నుండి తీసివేయవలయుననుటయును పరిధిమీదనున్న యంకములన్నియును సంకలనమువలన వచ్చినవి గనుక యవిద్యాత్మకము లనియును ఆయవిద్యను తొలగింపవలయు నన్న ప్రతియంకమునుండియును 3 తీసివేయవలయుననుటయును విస్పష్టమైన స్వయంసిద్ధి విషయములే. (ప్లెయిన్ ఎగ్జియమాటిక్ ఫాక్ట్సులు.) ఏలయన 'మహావాక్యదర్పణము'లో నీభావము నే ధ్రువపరచు రెండుశ్లోకముల నిచ్చట బొందుపరచుచున్నాను.

శ్లో. శైవాలమాత్రాపనయేపి పాన్థః కార్యప్రయత్నేనతు తోయసిద్ధో
తస్మిన్నపేతే స్వయమేవ తోయం శుద్ధం ప్రసన్నం విషయత్వమేతి
అవిద్యయా కల్పితనామరూప వ్యపోహ ఏవ ప్రయతేత విద్వాన్.
న బ్రహ్మబోధే తదపోహమాత్రా ద్బ్రహ్మైవభాతి స్వయమేవ సాక్షాత్.

ఈశ్లోకములను బట్టి పైయంత్రములో మాయావిద్యలను తొలగించినయెడల శుద్ధపరబ్రహ్మము నిలిచియుండవలయును. అట్టి యంత్రమేది యనఁగా—



ఈయంత్రమునకు పైనచెప్పిన సంగతులనుబట్టి దానివలన మనము తెలిసికొను విషయములనుబట్టి నారాయణపరబ్రహ్మయంత్ర మను నామకరణము నిచ్చెదము. ఈరెండుయంత్రములలో రాసులను పుచ్చుకొనుటలో నాద్యంతస్థాననిర్ణయమును విపర్యాసముగా చేయవలయును. మొదటియంత్రములోని యంకములను సవ్యముగను రెండవయంత్రములోని యంకముల నపసవ్యముగను పుచ్చుకొనవలయును. ఎట్లన మొదటి యంత్రములో పరిధిమీది యంకములను, 7854 అని పుచ్చుకొను నెడల రెండవదానిలో పరిధిమీది యంకములను 1254 అనియును దాని కను గుణముగ చతురశ్రముమీది యంకములను 0215 అనియును పుచ్చుకొనవలయును. ఈయంత్రములు బోధించుసంగతులను తెలిసికొనుటకై దిగువ నిచ్చిన పట్టికను బట్టి యాయాయక్షరములకు పైపంక్తిలోని యంకములను గ్రహింపవలయును.

| | * | | | * | | | * | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
| క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ | | | | | |
| య | ర | ల | వ | శ | ష | స | హ | | |
| అ | ఇ | ఉ | ఋ | ఌ | ఏ | ఓ | ఐ | ఔ | |

మనసంఖ్యానీకమునకు మూలాంకములు 10 గనుక పదేసి యక్షరములు లొక్కొక్క పంక్తిలో నీయబడినవి. అట్లు 5 వర్గములలో 4 వర్గములు రెండుపంక్తులలో సరిపోగా మిగిలిన పవర్గాక్షరము లైదును మూడవపంక్తిలో నీయబడినవి. అంతస్థములు ఊష్మములు నాల్గవ పంక్తిలో నీయబడినవి మాహేశ్వరసూత్రములలో నిచ్చినవరుసప్రకార మచ్చుల 5-వ పంక్తిలో నివ్వబడినది. హల్లులతోగూడిన యచ్చుల కేమియును విలువలేదు. ప్రత్యేకాచ్చులకు హ్రస్వదీర్ఘప్లుతాదిభేదములను పాటింపక మూలాక్షరముల యంకములను పుచ్చుకొనవచ్చును. సంయుక్తాక్షరముల కక్షరాంకయుతిని పుచ్చుకొనవలెను. ఎట్లన 'బ్ర' యను సంయుక్తాక్షరమునకు (బ=3; ర=2 గనుక బ్ర=3+2) అని పుచ్చుకొనవలయును. అట్లు కలిపినపిమ్మట రెండంకములసంఖ్య వచ్చెనేని యారెండంకములను మొత్తము చేయవలయును. ఎట్లనః-హ్మ యను సంయుక్తాక్షరమునకు హ=8; మ=5 గనుక) 13 వచ్చును. 13 అనునది రెండంకములసంఖ్య గనుక హ్మ యనుదానికి 1+3=4 అని పుచ్చుకొనవలయును. సమానార్థకములైనవివ మాక్షరములు గలశబ్దములను పుచ్చుకొను నపుడు ప్రతిశబ్దములోని యక్షరాంకయుతిని దీసికొనవలయును. ఆ మొత్తములు సరిపోయినయెడల సమానార్థకత్వము స్థిరపరుపవచ్చును. ఎట్లన నారాయణ =0+2 1+5=8; జ్ఞాన=8+0+0=7 వాగ=8 గలుక నా మూడు పదములకు సమానార్థత్వము సిద్ధింపజేయవచ్చును ఈయంత్రములయొక్క వేదాంతార్థములను తెల్పుటకు నాచే రచింపబడిన 'వేదాంతసాంఖ్యంకశాస్త్రము'లోని శ్లోకముల నీదిగువ నిచ్చుచున్నాడను.

శ్లో. ఉత్పాదయ ద్యత్ర్పనోతి బుద్ధిం నారాయణాధిష్ఠిత శైవయంత్రం
జీవేశ్వరైక్యం ప్రకటీకరోతి బ్రహ్మాత్మకం తద్గణితంచవందే,
"సదాశివా (7854) ఖ్య యంత్రాత్మన్ పరికల్పితరూపవన్,
బాలో స్మ్యేతేన యంత్రేణ జానాతి త్వాం సమాహితః

శ్లో. నారాయణ (215) పరబ్రహ్మ(1254) యంత్రబోధితరూపవాన్
ఏతద్యంత్రం స్మరన్ మూఢో జ్ఞానమాప్నోతి నాన్యథా
చతురశ్రభుజభ్యాం హి బ్రహ్మఖండం శివస్య చ
శైలాంకం(7)చాపి భూతాంకం(5)జాయేతే ఇతి దృశ్యతాం.
తస్మా దేకో భుజ స్స్రష్టా ద్వితీయ శ్శాంభవో భవేత్,
చతుర్భుజే ప్రపశ్యేత స్రష్టారం లయకారకం.
పితా(16) భవతి స్రష్టాచ యతో జన్మ దదాతి నః
గురు(32) ర్భవతి శంభుశ్చ మోక్షదాతృత్వహేతునా.
చతుర్ముఖస్య సంఖ్యాంక (4) మష్టమూర్తే(8)స్తథైవచ
షట్కోణేన ద్వితీయేన స్పష్టం భవతి ధీమతః
పితా(16)సిలోకస్యచరాచరస్యత్వమస్యవిశ్వస్యగురు(32)ర్గరీయాన్.
త్వమేవభర్తా(48)స్య ఖిలస్య స్రష్టా త్వమేవ శిష్యః(57)ఖిలజీవ (84)రూపః॥
త్వమేవమాతా(56) ఖలు శక్తి (57)రూపా తథైవమాయా(51)
త్వమేవ త ఖలు శూన్య(51)రూపా
స్యాంత్రిగుణాత్మికాయా మనేకరూపైః పరికల్పితోసి
త్వమేవ మూర్తిత్రయరూపధారీ త్వమేవ నారాయణ(0215) శబ్దవాచ్యః
త్వమేవ జ్ఞానం (8) ప్రణవం (75) త్వమేవ త్వమేవ వ్యాసః (57)ఖలు వేద (48) రూప
త్వమేవ పూర్ణం గణితేష్వనంతే త్వమేవ సాక్షా త్పరబ్రహ్మ (1254)రూపః
త్వమేవ మచ్చేతిత యంత్రమూర్తి స్త్వమేవ యంత్రంచ సదాశివా (7854)ఖ్యం
అవిచ్ఛిన్నం పరబ్రహ్మ (1254) భిన్నే ప్రకృతి రప్యథా
అవిచ్ఛిన్నేన పూర్ణస్య హ్యేకత్వం ప్రతిపాద్యతే.
తస్మిన్ బ్రహ్మణ్యహో భాతి మాయా (51)చ త్రిగుణాత్మికా
శక్తి (57)రూపాచ విచ్ఛిన్నా రజస్సత్వతమోగుణైః
తద్బ్రహ్మ శక్తిరూపేచ విచ్ఛిన్నే ప్రతిబింబితం.
నామ్నా రూపేణ వై బద్ధం స్త్రీపుంభేదేన మోహితమ్
తన్నామ జీవ (84) ఇత్యాహూ రూపం షట్కోణమేవచ
షట్కోణయుగళా దేవ హ్యేకత్వం శిష్య (57)జీ(84)యోః

అథాహం శబ్దవిచారః

సద్రూపోచ్ఛ్వాసనా త్సృష్టి ర్నిశ్వాసా జ్జగతో లయం
ఉచ్ఛ్వాససంజ్ఞికం సస్యార్ధం నిశ్వాస స్సమీరితః
ఉచ్ఛ్వాసం వ్యక్త మిత్యాహ్య మవ్యక్త మపరం భవేత్
ఉభయో ర్వర్ణయో స్తస్మా ద్యోగా దర్థం విచార్యతాం

అవ్యక్తం వ్యక్తతాం యాతం హంసశబ్దేన సూచితం.
తస్మాద్వై బ్రహ్మణః ప్రాజ్ఞై ర్ధ్యానం హంస ఇతీరితం
స ఇత్యత్ర విశేషోస్తి జ్ఞాతవ్యస్తత్వదర్శిభిః
సవ్యక్తః కేవలో నస్యా దవ్యక్తే వ్యక్తగర్భితః
తచ్ఛబ్దేనచ సంబంధా దవ్యక్తమపి సూచయన్.
స్యా న్నానుకరణం సాక్షా ద్ధంస త్రాజ్ఞై ర్నగృహ్యతాం
హంసఏవ విపర్యాసా త్సోహం భవతి నాన్యథా
సోహం కథ మితి ప్రశ్నే హ్యజ్ఞానం మూలకారణం
బ్రహ్మైవాస్మీతి వాక్యేన యజ్ఞాన మతిగమ్యతే
అహంశబ్ద విచారేణ తజ్ఞాన మతి బుధ్యతే,
అవిద్యాయా మకారస్తు నిషేదార్థక ఏవ హి
అజ్ఞానావృతహంరూప మహ మిత్యభిధీయతే
హంస్వరూపో గురు ర్జ్ఞేయో హ్యకారాచ్ఛ నిషేధితః
గురు ర్నారాయణః ప్రోక్త శ్శిష్యో జీవ ఇతిస్మృతః
జ్ఞానహం గురుపిత్రాది శబ్దా నారాయణార్థకాః
అవిద్యాకల్పితా కార శ్చాహం శిష్య ఇతీరితః
తస్మా జ్జీవం గురుం విద్యా దవిద్యా ప్రతిబింబితం
అహంశబ్దవిచార స్స్యా ద్గురుశిష్యైక్యబోధకః
సోహం బ్రహ్మ(7854)తివాక్యేన జీవబ్రహ్మైక్య ముచ్యతే
సోహం శివ(7854) స్తథైవ స్యా చ్ఛివజీవైక్యబోధకః
బుద్ధి ర్హం నేతి హంనేతి హ్యదో సంసృతికారణం
తస్మా త్సర్వ మహం న్నేతి హంహ మేవేతి నిశ్చిను
అక్షరాంకస్వరూపో హ మితి ధ్యేయం బుధై స్సదా.
అనేనైవ ప్రకారేణ వృత్తి ర్బ్రహ్మాత్మికా భవేత్

పైన చూపిన యంత్రములను దానివలన మనము గ్రహింపవలసిన గణితవేదాంతసంబంధములైన విశేషములను మీరు చూచియుంటిరి గదా. ఈయంత్రములు దైవనిర్మితశాసనములు గాని వినోదార్థమై మనుష్య కల్పిత గణితచమత్కృతులు గావని చెప్పకతప్పదు. బుద్ధిమంతులు ప్రస్తుతము వివాదములో నున్న కొన్ని చరిత్రాంశముల విషయమైనను యీవిని బట్టియే సందేహనివృత్తిని చేసికొనవచ్చును. అవియేవియనఁగా సంస్కృతము దేవభాష. దేవభాషయన కేవలముజేహామే యాత్మయను కొను మానవుల శరీరాలంకరణపోషణసంబంధమైన భాషముల నొండొరుఁడు వ్యక్తీకరించుకొనుటకు కవసరమైన మనుష్యకల్పిత సంజ్ఞలనదగు శబ్దసము దాయముగాక శబ్దశక్తికిని స్వరశక్తికి ననుగుణమగు ధర్మములుగలిగి శరీరికి దేహాత్మభేదజ్ఞానమును నిత్యానిత్యవస్తువివేకమును దానివలన కలుగ వలసిన వైరాగ్యాది సుగుణసంపత్తిని ప్రసాదించి యిహపర సాధనమై మానవుని పరమావధికి చేర్ప సమర్థతకలిగి నాశరహితు డైసర్వ రూపియగు భగవంతుని శక్తులయొక్క రూపాంతరము లని చెప్పదగు బీజాక్షరములయొక్క సార్థకప్రస్తారరూపమైన భాష. అట్టిభాష మనకెట్లు వచ్చెను? భగవంతుడు జగత్సృష్టిని సంకల్పించి తన శక్తి రూపములగు ప్రకృతిగుణములగు సృష్టిస్థితిలయములను ఒనరించుటలో మానవుని యందు సత్కృప్తత నుంచఁదలంచి యట్టిమానవుని దైవాంశ సంభూతునిగ జేసి తనలో నైక్యమగుటకు తాను జ్ఞానస్వరూపుండగుటంబట్టి జ్ఞానమును మోక్షసాధనముగ జేసి తిరిగి యట్టి జ్ఞానమునకు భక్తికర్మములను సాధనములుగ జేసి యీయుపసాధనముల క్రమముగ సాధించుటకు తగిన శరీరావయవముల నిచ్చి యట్టి జ్ఞానసంపాదనమునకు వ్యక్తప్రపంచసంబంధమై త్రిగుణ్యవిషయములైన వేదవేదాంగములను అనంతశాస్త్రములనెడు శాఖల నిర్మించి యట్టి శాఖలుగల వృక్షమునకు తా నవ్యక్తరూపమూలముగ నుండి జ్ఞానమే మోక్షసాధన మగుటం జేసి జ్ఞానవృక్షఫలమును మానవునకు నిషేధింపక యాఫలమును నరునకు ప్రసాదింపఁదలంచి తాను వేదవ్యాసాదిమహామంత్రద్రష్టల శరీరంబులతో నవతరించి బ్రహ్మజిజ్ఞాస కుచితమైన సంస్కృతభాషను నరునకు ప్రసాదించెను. కనుక సంస్కృతభాషను మాటలాడువా రామంత్రద్రష్టల సంతతివారే (౨) గణితము బ్రహ్మజిజ్ఞాసకు తగినరూపముతో సంస్కృతభాషతో కూడ భగవంతునివలన మనకు ప్రసాదింపబడినదే గాని యితరదేశములనుండి మనకు వచ్చినది కాదు (౩) మనుష్యునకు పదివ్రేళ్లుండుటవలన దాశమికసంఖ్యానీకము మనుష్యకల్పిత మని చెప్ప గొందఱు సాహసించుచున్నారు. కాని యది సరికాదు. మానవునకు దైవకల్పితములగు వ్రేళ్లు పది యుండుటచే దాశమికసంఖ్యానీకము దైవకల్పితము గాని మనుష్యకల్పితము గాదని రూఢి పడగలదు. ఇట్టిసంగతులను మానవులు నిష్పక్షపాతబుద్ధితో గ్రహించి సత్యాన్వేషణమం దాసక్తితో జ్ఞానసంపాదనముకొఱకు పాటుపడుదురుగాక.

# జగజ్జనని సావిత్రీదేవి

పొన్నలూరి సూర్యనారాయణశర్మ గారు

వెలవెల నౌచుఁ దారకల / పఙ్క్తులు పల్చనఁగా విరాజిలం
దెలతెల నౌచుఁ బ్రాగ్దిశను / దీప్తులు పొల్పు వహించుచుండఁగాఁ
గలరవముల్ విహంగముని / కాయము సేయఁ బ్రపంచ మెల్లఁ జూ
డ్కులకు నితాంతమోదమును / గూర్చెఁ బ్రభాతమునందు సాంద్రతన్.

సీ. తమ్మిమొగ్గలనుండి / తగవచ్చు పరిమళ,మ్ములతోడ భృంగముల్ / వెలయుచుండ
భ్రమరగానముల సం / పదలు వీనులవిందు, నొనరించు మలయవా / యువులు వడవ
మలయమారుతహతిఁ / జలియించు కిసలయ, సంతాన మొప్పునా / చంద మొందఁ
బల్లవంబులమీఁదఁ / బ్రాఁకెడు హిమబిందు, సందోహములఁ గాంతి / గ్రందుకొనఁగఁ
తే. గడుఁ బ్రశాంతమై ప్రకృతియొ / క్కడను లేని, యొక యపూర్వసౌందర్యంబు / నొందియుండ
నాదు మానసకమలంబు / నకు వికాస, మెంతగల్గెనో వివరింప / నెట్లు గలుగు!

తే. కొలఁకుజలముల స్నానము / సలిపి సంధ్య,వార్చి సవితృదేవునకుఁ ద / ర్పణము విడిచిఁ
ఋషుల స్మరియించి కౌతుక / హృదయుఁ డగుచు, జపము చేసితి మనమున / శక్తికొలఁది.

తే. సకలజగముల లోచనో / త్సవము సేయు, సాంజలులు విప్రు లతిభక్తి / సన్నుతింప
నలత్రిమూర్తులు దనయందు / నలరుచుండు, భానుదేవుండు మొదటఁ గ / న్పడఁగ నయ్యె

సీ. ముత్తియంబులడాలు / నొత్తివేయఁగఁ జాలు, కమనీయకాంతి యొ / క్కట వెలుఁగఁ
బగడంపుడాలుతో / జగడింపఁగా జాలు, కమ్రంపుఁ గాంతి యొ / క్కటఁ జెలంగ
బంగారపున్ డాలుఁ / జెంగింపఁగాఁ జాలు, పటుసౌమ్యకాంతి యొ / క్కట మలంగ
నీలంపు నికరంపు / డాలు నేలఁగఁ జాలు, గాఢసందీప్తి యొ / క్కట మలంగ
తే. రజతధవళిమఁ బోర నో / ర్వంగఁ జాలు, కమ్రతమదీప్తిఁ గూడ నొ / క్కట వెలుంగ
నద్భుతంబుఁ బ్రమోదద / మైన రూపు, భానుమండలమందుఁ గ / న్పట్టె నాకు.

తే. పంచశీర్షంబులును బది / బాహువులును, గనులు పదునైదు గలిగిన / కమ్రమూర్తి
విమలమణిదీప్త ఘనకిరీ / టములఁ దాల్చి, యామె యప్పుడు నాకుఁ బ్ర / త్యక్ష మయ్యె.

మ. వరదానం బభయంబునుం గశయు శు / భ్రంబౌ కపాలంబు స
త్సరసీజంబులు శంఖచక్రగద తో / త్రంబుల్ గరశ్రేణులం
దరుదారన్ ధరియించి హారముల నొ / య్యం దాల్చి యావచ్చు సుం
దరి గాయత్రియ కాక యెవ్వరు జగ / త్త్రాణైకదీక్షాస్థితిన్.

ఉ. ఆమహనీయమూర్తిఁ గని । సాంజలినై యిటులన్ నుతించితిన్
"మామకబుద్ధుల న్నెవఁడు మాటికిఁ । బ్రేరణచేయుచున్ నభ
స్సీమ వెలుంగు; నట్టి సర।సీభవమిత్రుని తేజ మీవ! త
ల్లీ! మముఁ బ్రోచి కోర్కులు ఫ।లింపఁగఁ జేయఁగదమ్మ భారతీ!

తే. ఓజము సహంబు బలమును । భ్రాజ మీవ, వేల్పులకు ధామ మీవ దే।వీమతల్లి!
విశ్వ మీవ కదమ్మ సా।విత్రిదేవి, యో సరస్వతి గాయత్రి! । యోమదంబ!

చ. మఱచితి మమ్మ నిన్ను గరి।మం బరదేవత లిత్తురంచు; హా
త్సరసిజసీమ నిన్ విడిచి స్రగ్గితి మమ్మ । మహోగ్రపాపపుం
బురదను జిక్కి; జ్ఞాన మది।పోయెను మాకు మదీయ పాపము
ల్విరియఁగఁ జేసి కోర్కులు ఫ।లింపఁగఁ జేయఁగదమ్మ భారతీ.

మ. క్షమియింపంగదవమ్మ మమ్ముదయతో । సావిత్రి! మాడెందపుం
గమలంబుల్ వికసింపఁ జేయఁ గదవే । గాయత్రి! మద్వాంఛలన్
సమకూర్పంగదవమ్మ కౌతుకముతో । జంద్రార్ధచూడామణీ!
సము లెవ్వారు! సరస్వతీ! జనని! భా।స్వన్మండలాభ్యాసినీ!

సీ. విశ్వంబు నిర్మించు । వేదమతముఁ బాసి, కొరలి యన్యములఁ జి।క్కితిమి తల్లి!
విశ్వప్రపంచంబు । వెలయించు నినుఁ బాసి, కొరలి యన్యులకుఁ జి।క్కితిమి తల్లి!
విశ్వంబునకు వెల్గు । విధియించు నినుఁ ద్రోసి, కిల్బిషంబులకుఁ జి।క్కితిమి తల్లి!
విశ్వగానము మేళ।వించు నినుంద్రోసి, మతిహైన్యమునకుఁ జి।క్కితిమి తల్లి!
తే. అంధకారావృతస్వాంతు।లైన మమ్ము నకట! పరులకుఁ బరతంత్రు।లైనమమ్ము
నాస లడుగంటి మూర్ఛిల్లు।నట్టి మమ్ము నరసి కృపఁ బ్రోవు మమ్మ! గా।యత్రిదేవి.

మ. కలువంపుం బువులందు వెల్వడెడు భృం।గశ్రేణిచందాన ని
ర్మల నీలచ్ఛవులై యపాంగములఁ జే।రంజాలు నీలంపుఁ జూ
డ్కులతో విశ్వముఁ బేర్మిమైఁ గనెడు నీ।కుం జ్రొక్కువాఁడన్; సము
జ్జ్వలమానీంద్ర హృదంబుజాసని! । రమా! సావిత్రి! నిన్ గొల్చెదన్.

శా. సావిత్రీజననీ! త్వదీయతనుతే।జస్స్ఫూర్తి గంభీరపుం
భావమ్మున్ మృదుళత్వమున్ సరసతా।బద్ధంబు శాంతత్వమున్
శ్రీవిన్ హర్షణమున్ జెలంగఁ గనుచుం।టిన్ విశ్వవిశ్వంభరా
దేవీ! పీఠమునందు నెల్లెడల దృ।గ్దీప్తుల్ విడంబింపఁగన్.

ఆ. హృదయకమలమందు । బ్రీతిమై వసియించి, జ్ఞానదీప్తి నొసఁగు । జ్ఞానమూర్తి!
నీమకతన విప్ర।నిచయంబు బ్రాహ్మణత్వంబు నొందుచుండుఁ । దథ్యముగను.

క. నిన్ను జపింపక విప్రుల।మన్నను శూద్రులమటన్న నది యొక్కటిగా
నెన్నెద సరస్వతీ! మ।మ్మున్నతపదమునకుఁ జేర్పు మోగాయత్రీ!

# శాంతినికేతనము-విశ్వభారతి *

యలమంచిలి వెంకట్రామయ్యా చౌదరి గారు

ఒకనాటి సంధ్యాకాలమందు, పక్షులు గూళ్లకేగుసమయమందు రవీంద్రనాథ ఠాకూరుగారి తండ్రి మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు గారు రాంపూరునుండి వచ్చుచుండ మార్గమధ్యం

**ఆశ్రమోత్పత్తి.**

బున ప్రార్థనాసమయం బయ్యెను. అప్పుడు మహర్షి అనతిదూరమునం దున్న ఆమ్లవృక్షముల తోపునం దొకచెట్టుక్రిందస్థానము నలంకరించి, సూర్యాస్తమయమును వీక్షించుచు, తపస్సునందు నిమగ్నుడయ్యెను. అం దాయన దైవసంబంధమైన యానందముపొందుచుండ సూర్యాస్తమయ మయ్యెను. ఇంతలో పలువైపులనుండి తమోమండలము క్రమ్మెను. కాని ఆయన దైవధ్యాన నిమగ్నుడై యుండెను. ఆరాత్రి యంతయు మేల్కొంచియుండెను. సూర్యోదయ మగుచున్నతరి మహర్షి సూర్యనమస్కారంబు లొనర్చి ఆస్థానమును వీడిపోయెను. ఆనాటినుండి ఆస్థలము మహర్షికి పవిత్రస్థానం బయ్యెను. కొన్నివేళలందు మహర్షి అక్కడ కేగి దైవప్రార్థన చేయుచుండెడివాడు. ఆసమయములందు ప్రాపంచకవిషయములను మఱచి పరమాత్మునితో లీనమగుచుండెడివారు. ఆస్థలము నెక్కుడుగ ప్రేమించుటచేత అక్కడొక చిన్నవనమును నిర్మించి దానియందు ప్రయాణికులవిశ్రాంతినిమిత్తమై ఒకగృహమును ఒకదేవాలయమును చలువరాతితో నిర్మించెను. ఆదేవాలయమునం దేవిధమైన విగ్రహమును లేదు. ఆయాశ్రమమునందు జీవహింస మొదలైన దుష్కృత్యములు నిషేధింపబడెను. మహర్షి స్వర్గారోహణ చేయకపూర్వమే ఆశ్రమముయొక్క సమస్తకార్యములు సమాప్తిచెందెను. మహర్షి వృద్ధాప్యమంతమందు ఆయన కడసారిపుత్రుడైన రవీంద్రనాథఠాకూరు తండ్రి నిట్లడిగెను. "నేను చిన్నబాలురకు పాఠములు బోధించు నిమిత్తమై ఇందొక పాఠశాలను నిర్మించుటకు నాజ్ఞపొందుటకు వచ్చియుంటిని." అందులకు మహర్షి సంతోషపూర్వకముగా సమ్మతించి ఈమంత్రమును నుపదేశించెను." It is an absolute death to depant f om this life, without re lising the Etennal Tre th of life " కాలానుసారముగా బోధ దేదీప్యమానముగ జరుగుచుండె. ఆకాలమున ఆశ్రమమందు జాతి మత వర్ణభేదము లేమియును లేవు.

ఆయన బాలురను వెంట తీసికొని వనమునందు సంచారము చేయుచు, సృష్టియొక్క వైచిత్ర్యమును వారికి చూపించుచు, పాఠములను బోధించుచుండెడివారు. పూర్వకాలపు ఋషులు నేవిధముగా విద్యను శిష్యులకు గఱపుచుండెడివారో అదేవిధముగా ఈయన తనయొక్క బాలురకు చువిద్యను బోధించుచుండెడివారు. వారు ప్రాతఃకాలముననే లేచి ఆశ్రమముయొక్క సమస్తకార్యములను నిర్వర్తించి, పూజకొఱకు పుష్పముల నిమిత్తమై వనమునకు పోవుచుండెడివారు. అప్పుడు ఆశ్రమమునందు విస్తారముగా జింకలును మయూరంబులును ఇంకా మొదలైన అడవి జంతువులతోను నిండి దానియొక్క శోభను ప్రకాశింపజేయుచుండెను. అవి యాశ్రమమునందు నిర్భయముగా సంచారము చేయుచు కొన్నివేళలయందు మహర్షి యాశ్రమమునకు వచ్చుచుండెడివి. ఈబాలురు వానితో ఆడుకొనెడివారు.

ఇట్లు మహర్షి రేయింబవళ్లు ఆమ్లతరుచ్ఛాయయందు దైవప్రార్థన చేయుచుండెను. ఆస్థలమునకు ననతిదూరమున బందిపోటుదొంగలు మొదలైన అడవిజాతులవారు నివసించుచుండెడివారు. వారిలో నాయకుడు ప్రతిదినము మహర్షిని చూచుచుండెడివాడు. ఏసమయమందు చూచినప్పటికిని ఆయన ఒకేస్థానము నలంకరించియుండెడివారు. అందుచే నాచోరుడు ఆస్థానముక్రింద బంగారు ధనము దాచియుంచె నని యూహించి మహర్షిని హత్య నొనరించుటకు నిశ్చయించుకొనెను. కాని ఈనాయకుడు మహర్షిని క్రూరస్వభావపుదృష్టితో సమీపించినంతనే ఆయన తపోధనమువలన లభించిన తేజస్సును శాంతమును నిర్మలతయును, చోరుని భావమును మార్చివైచెను. చోరుడు పశ్చాత్తాప మొందెను. మహర్షి యాచోరుని అత్యానందముతో నాశీర్వదించి కాగలించుకొనెను. ఆనాటినుండియు నాచోరుడు ఆయన ప్రియశిష్యుడయ్యెను. శాంతినికేతనము నిర్మించుటకు ఇదియొక మూలకారణము.

అటుతరువాత నీయాశ్రమము నిర్మించినస్థలముయొక్క జమీందారు తనంతటతానే వచ్చి మహర్షిపాదములమీద నొరిగి "నేను మీ యాశ్రమమునకు సంబంధించిన స్థలమును, దానిని ఆవరించియున్న వనములను మీ కొసంగుచున్నా" ననెను. దీని వైశాల్యము సుమారు నాలుగువందల యెకరము లుండును. అప్పుడు ఈ యాశ్రమము తరుచ్ఛాయలతోను, పలువిధములైన కుసుమంబులతోను, అనేకవిధములైన అడవిజంతువులతోను నిండి దానియొక్క శోభను వసంతునివలె దేదీప్యమానంబుగా ప్రకాశించుచుండెను. ఇట్టితరి మహర్షి దైవప్రార్థన చేయుచుండగా, శాంతినికేతనము అను మాట జ్ఞప్తికివచ్చి, తన యాశ్రమమున కా పేరుంచుటకు తలచెను. నాటినుండియు శాంతినికేతనమనం బడుచుండెను.

---

* ఈ యాశ్రమము కలకత్తాకు నూరుమైళ్లదూరమందు బోల్‌పూర్ స్టేషన్‌కు రెండుమైళ్లదూరములో నొక పెద్దవనమందు నిర్మింపబడియున్నది. దానియందొకప్రక్క "విశ్వభారతి" స్థాపింపబడియున్నది. విశ్వభారతి ఉత్తరవిభాగమనియు ఆశ్రమము పూర్వవిభాగమనియు నందురు

మహర్షి దేవేంద్రనాథఠాకూరు గారి స్వర్గారోహణానంతరము ఆయన తపస్సొనరించిన స్థలమునం దొక స్మారకచిహ్నము నిర్మింపబడెను. ఆమార్బిలురాతిమీద మహర్షియొక్క స్వహస్తముతో నొకపవిత్రమైన మంత్రము నిట్లు లిఖించియుండెను. ఆశ్రమవిద్యార్థులు తరుచుగ సాంధ్యవేళలయందును, నిండుపున్నమసమయముల యందును, ఆస్థలమున కేగి దైవప్రార్థన చేయుచుందురు.

## విశ్వభారతి ఆదర్శము

మహర్షియొక్క విశ్వజనైక్యాశయము ననుసరించి రవీంద్రనాథఠాకూరుగారు విశ్వభారతిని స్థాపించిరి హిందూదేశమునందు విద్యయును చిత్రకళలును సంపూర్ణముగా నాశన మొందినవని ఆయన అనుభవమువలన తెలిసికొని తిరిగి వాని సన్నిటిని పునరుద్ధారణచేయుటకు దీనిని నిర్మించిరి. ఐకమత్యముతోడను చిత్రకళావిద్యల నిపుణత్వముతోడను ఒకరికొకరు విద్యావ్యాసంగములను మార్చుకొనుచు పాశ్చాత్యుడు భారతీయుడను వైషమ్యము లేకుండ, మానవకోటియంతను ఏకముచేయుటయే దీనియొక్క ప్రధానోద్దేశ్యము. ఈరెండుఅర్ధగోళముల భావములయొక్క కలయికచేత వచ్చుసారాంశమును గ్రహించుటయే విశ్వభారతి విద్యార్థులయొక్క కర్తవ్యమై యున్నది. ఇది మత సాంఘిక సాహిత్య చరిత్ర శాస్త్ర కళావిద్యలయు కృషులయొక్కయు, బుద్ధ జైన ఇస్లాం సిఖ్కు క్రీస్తు మొదలైనజాతులయొక్క అన్యోన్యసంబంధమును గలుగజేసి వారివారియొక్క జాతి మత వర్ణ వైషమ్యములను నిర్మూలింపజేసి, యుక్తమైన విద్యను గఱపుట కిది కేంద్రస్థానమై యున్నది. ఈవిధముగా భారతవర్షము దానియొక్క పూర్వస్థితికి రాగలదనుట కెంతమాత్రమును సందేహము లేదు. అదేవిధముగా పాశ్చాత్యులుకూడ అంధకారమునుండి విముక్తులై అన్యజాతి సంపర్కమును పొందుదురు.

ఆశ్రమవిద్యార్థులు ప్రాతఃకాలమున లేచినతోడనే శ్రీరవీంద్రనాథఠాకూరుగారి పాటలను పాడుచుందురు. అటుపిమ్మట స్నానము మొదలైన కృత్యములను నిర్వర్తించి, వారివారి చిత్రాసనములను వెంట తీసికొని దైవప్రార్థననిమిత్తమై అరఘంటుసేపు వారివారి ప్రియమైన స్థలముల కేగుదురు. ఘంటకొట్టినతోడనే వచ్చి వలయాకారముగా చుట్టి, ఉపనిషత్తులలో నొక పవిత్రమైన మంత్రమును మహర్షి వల్ల ఎంచబడినదానిని గానముచేయుదురు. అటుపిమ్మట నల్పాహార మిచ్చినతోడనే వారివారి తరగతులలోనికి వెళ్లుదురు. తరగతులు వృక్షచ్ఛాయలక్రింద నేర్పాటుచేసిన రాతిసోపానములమీద జరుగును. ఉదయము సాయంకాలముకూడ నదేవిధముగా జరుగును. సంధ్యవేళ తిరిగి అరఘంటుసేపు దైవప్రార్థన యుండును. రాత్రివేళ ఉపాధ్యాయులు బాలురకు పాఠములయందు తెలియనిచోట్ల సాయపడుచుందురు. ప్రతి వసతిగృహమందును ఇద్దఱుపాధ్యాయు లుందురు. ఈ బ్రహ్మచర్యాశ్రమమందు పదిసంవత్సరముల వయస్సు మించని బాలురనుమాత్రమే చేర్చుకొందురు. ఈబాలురకు హిందూదేశచరిత్రయు భూగోళశాస్త్రమును పదార్థవిజ్ఞానశాస్త్రమును ప్రకృతిశాస్త్రమును బీజగణితము అంకగణితము రేఖాగణితము చిత్రలేఖనము—హిందీ సంస్కృతము గుజరాతి బెంగాలి మరాటి హిందూస్థాని ఫ్రెంచి జర్మన్ ఆంగ్లము పాలి సంగీతము (హిందీ - బెంగాలి ఇంగ్లీషు) మొదలైన వానిని బోధింతురు. సామాన్యముగా గవర్నమెంటు పాఠశాలలయందు చెప్పుచున్న విద్యకును ఈవిద్యకును అపారమైన భేదము కలదు. ఇక్కడి ఉపాధ్యాయులు బాలుర సహజమైన బుద్ధికుశలతకు ఎక్కువతోడ్పాటు చేయుటయే వారియొక్క ముఖ్యఉద్దేశ్యము. సతీశచంద్రరాయిగారు ప్రథమమున ఆశ్రమవిద్యార్థులను వెంట తీసికొని వనమునందు సంచారము చేయుచు, బెంగాలీ ఇంగ్లీషు మొదలైనభావలను బోధించుచు సృష్టియొక్క వైచిత్ర్యమును చూపించుచు, వారికి విద్యయందు రుచి పుట్టించిరి. ఆ తీర్థము నేటివఱకును అనర్గళముగా విద్యార్థులయందు ప్రవహించుచున్నది.

## విశ్వభారతి విద్యావిధానము

భాషలయందు హింది బెంగాలి హిందుస్థాని గుజరాతి మరాటి సింధి పాలి సంస్కృతం ఇంగ్లీషు ఫ్రెంచి జర్మన్ రష్యన్ పరిషియన్ చైనీస్ గ్రీక్ టిబెటిన్ మొదలైనవి బోధింపబడును. హిందూదేశచరిత్ర చిత్రకళలు సంగీతము కూడ బోధింపబడుచున్నవి. ప్రొఫెసర్ వింటర్నీస్ సహాయమువలన కొందఱు విద్యార్థులు హిందూదేశ పూర్వచరిత్ర పరిశోధనమును కూడ గావించుచున్నారు.

## వ్యవసాయపు శాఖ

ఈవ్యవసాయపు శాఖ ఆశ్రమమున కొకమైలుదూరమున పెద్దతోటయందు నిర్మింపబడియున్నది. ఇక్కడ వ్యవసాయము చేయుటకు సుళభమార్గములను బోధింతురు. చెట్లను ఎట్లు పెంచవలసినదియు, ఏయే చెట్టుకు ఏయేఎరువు వేయవలసినదియు ఏకాలమందు పంటకుచీడపట్టునో అది ఎట్లువచ్చునో భూమి సారవంత మని గ్రహించు టెట్లో మొదలైన విషయములను గురించి దానియొక్క ప్రధానోపాధ్యాయుడైన అమెరికాదేశపు హెల్మర్టసన్ గారు బోధించుదురు.

# నవయుగారంభము

వోలేటి నరసింహస్వామి గారు

శ్లో. యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే.

శ్రీమ భగవంతుని వాక్యము వ్యర్థము కానేరదు. ఏలయన నిప్పటి ప్రభుత్వమువారి చర్యలను బట్టి చూడ నీకాలమందు స్వామి అవతరింపక తీరదు అని తోచుచున్నది. అదిగాక యీ కాలము యుగసంక్రమ కాల మని కొందఱు జ్యోతిష్కులు తెలియజేయుచున్నారు. వారి పలుకులు రిత్త యని త్రోసిపుచ్చ రాదు. ప్రతియుగాంతమందును కొంత కదలిక యున్నట్టు పురాణములవలన గ్రహించుచున్నాము. కృతయుగాంతమందు గాని, త్రేతాయుగాంతమందు గాని లేక శ్రీ కృష్ణమూర్తి అవతరించిన ద్వాపరాంతమందు గాని యుద్ధములు జరిగి ప్రజాక్షయము చాల కలిగి యున్నది. అలాగుననే గడచిన యిరోపా సంగ్రామమును బట్టి చూచిన నీకాలము యుగాంతరకాల మనవచ్చును.

చతుర్యుగములలోను కృతయుగము 4800 దివ్య సంవత్సరము లనియు, త్రేతాయుగము 3600 దివ్యసంవత్సరము లనియు, ద్వాపరము 2400 దివ్యసంవత్సరము లనియు కలియుగము 1200 దివ్యసంవత్సరము లనియు పంచమవేద మగు భారతమందు సూచింపబడి యున్నది ఒక దివ్యసంవత్సరము 360 మానవసంవత్సరములకు సమానము గనుక నీయుగపరిమితి సురమానముగాని నరులమానము కాదు. కనుక మానవయుగముల పరిమితి భారతములో చెప్పబడినపరిమితి గాక వేఱుగా నుండకతీరదు. కనుక మానవకలియుగాంతరమందు ప్రళయము రా నవసరము లేదు. ఏల యనగాఁ బ్రళయము దివ్యకలియుగాంతరమందు వచ్చునని భారతమందు చెప్పబడియున్నది. పైయంశములను గమనించినచో యుగములు రెండువిధములుగ నున్న వనియును దివ్యయుగముల పరిమితి మానవయుగముల పరిమితికంటెను హెచ్చుగా నుండుననియును తెలియుచున్నది.

కాలమానమును బట్టి చూడ మానవకృతయుగాంతరమునందు మానవత్రేతాయుగము, తదనంతరము మానవద్వాపరము తరువాత మానవకృతయుగము రాక మానదు. కనుక నొక దివ్యయుగమున ఎన్నియో సారులు మానవయుగములు తిరుగును. అదిగాక మానవకలియుగపరిమాణము సుమారు 5000 సంవత్సరము లని నిర్ధారణచేసియున్నారు శ్రీకృష్ణమూర్తి క్రీస్తుముందు 3000 సంవత్సరముల క్రిందట జన్మించె నని జ్యోతిష్కులు తెలియజేసిరి. తిలకుమహాశయుఁడు కూడ దానినే వక్కాణించెను. గనుక నిప్పటికి శ్రీకృష్ణమూర్తి జన్మించి 5000 సంవత్సరము లయినది. రెండవభారతయుద్ధ మనెడు యిరోపామహాసంగ్రామము లక్షలకొలది ప్రజల నశింపజేసినది. 1919 సంవత్సరములో పంజాబునందు జనులు చాలమంది మడిసిరి. కఱవుబాధచే హిందూదేశమందును ఇతరదేశములందును చాలబాధ కలిగినది. జాడ్యములు ప్రబలినవి. లోకములో నేమూల చూచినను విచారమే కనబడుచున్నది. ఇంతకంటె వేఱె ప్రళయము రా నవసరము లేదు. గనుక కొందఱు జ్యోతిష్కులు చెప్పినట్టు సిద్ధార్థినామసంవత్సర ఆషాఢబ 30 తో ఈ యుగము అంతమొందె నని చెప్పవచ్చును. ఇకముందు రావలసిన యుగ మేదో ఆలోచనీయమై యున్నది. కాలమానముబట్టి మానవకృతయుగము రావలసియున్నది. అందులకు నిదర్శనములుగూడ కనిపించుచున్నవి. పరమవేదాంతియగు రవీంద్రుడు లోకమునంతయు ఏకీభవింపఁజేసి బోల్పూరునందు విశ్వవిద్యాలయమును స్థాపింప నుద్దేశించి నాడు. ఆత డసామాన్యుడు. అతడు తలపెట్టిన కార్యము సఫలము కాకతీరదు. ఈ విశ్వవిద్యాలయము అభివృద్ధి పొందు సూచనలు కూడ గలవు. హిందువులు మహమ్మదీయులు పార్శీలు మొదలగువా రందఱు ఏకీభవించి యీవిశ్వవిద్యాలయమునకు సహాయము చేయుచున్నారు. కనుక నీవిద్యాలయమువలన పాశ్చాత్త్యులకు మనకు స్నేహముబల మగుచున్నది.

ఒక్క రవీంద్రుడేగాక అరవిందుడుకూడ ప్రకాశించుచున్నాడు. అతడు ఆధ్యాత్మికశక్తిని వినియోగించి మానవకోటి నంతటిని ఆధ్యాత్మికములో మునుంగ జేయుచున్నాడు. ఇక ముందు ఒక గొప్ప మతము లేచి లోకమునందు గల ప్రజల నందఱిని ఆమతస్వీకరింప చేయును. ఆమతమందు ముఖ్యసూత్రము "ఆధ్యాత్మికము" అందువలన జ్ఞానము ప్రేమ దేశభక్తి మాతృభక్తి దైవభక్తి మొదలగు సుగుణములు మనుష్యులలో వృద్ధి నొందును. అట్టి మతోద్ధారకుడై యుండుటకే అరవిందుడు ప్రయత్నించుచున్నాడు. అట్టి ప్రయత్నము సఫలమగుటను దేవుని సదా మనము ప్రార్థింపవలయును.

లోకోత్తమపురుషుడని ప్రసిద్ధి చెందిన మహాత్ముడు యీ నవనాగరకతాపిశాచమును తొలగద్రోయు ప్రయత్నములు చేసినాడు. అందులో జయముకూడ పొందెనని చెప్పవచ్చును. ఏలయన గాంధిమహాత్ముడు భారతహృదయమునం దవ్యక్తముగ నున్న ఆధ్యాత్మికసాధనమునే అసహాయోద్యమస్వరూపమునను సువ్యక్తము చేసి భారతభూమియందును తదితరరాజ్యములందును, సుస్థిర శాంతిని స్థాపించుటకు బూనుకొనెను. భారతహృదయ స్వభావము నెఱుగని పాశ్చాత్యులకును, స్వదేశీయులకును గాంధిమహాత్ముని భావములు విపరీతములుగ దోచుచుండును గాని మహాత్ముని శక్తి నెఱిగిన పాశ్చాత్యులు సహితము అతనిని లోకోత్తమపురుషునిగా నెన్నుకొనిరి. కారాగృహమునందు జన్మమొంది- వేణునాదమును పూరించుచున్న- శ్రీగోపాలకృష్ణునివలె మహాత్ముడు కారాగృహభీతి లేక ధర్మనాదమును దిగంతములందు పూరించుచు విశ్వసమ్మోహమును కలిగించుచున్నాడు. మహాత్ముడు ధర్మవిజయస్థాపనమునకు ఘోరమైన ధనుర్ధారణమును వదలి సౌమ్యమైన చరకధారణమును నాదేశించుచు-నవయుగధర్మసంస్థాపనమును చేయుచున్నాడు. కనుక అట్టి సత్యమును ఎల్లయెడల వ్యాపించుచుండునట్టియు, "ఆత్మవత్సర్వభూతాని"యను నార్యోక్తి గమనింపజేయునట్టియు, "శాంతము భూషణము" అని తనకర్మచేత స్పష్టపఱచుచుండునట్టియు, కలియుగప్రహ్లాదుడైన గాంధిమహాత్ముని ప్రయత్నము విఫలము కాజాలదు.

ప్రస్తుతకాలమందు హిందూదేశములో నేమి పాశ్చాత్యదేశములలో నేమి ప్రజ లందఱు స్వేచ్ఛను వాంఛించుచున్నారు. స్వేచ్ఛగలుగుట సామాన్యవిషయము గాదు. స్వేచ్ఛగలుగుటకు త్యాగ మవసరము. అట్టిత్యాగము మహాత్ముని యుద్యమమువల్ల కలిగినది. ప్రజలందఱు త్యాగులై ధనార్జనమును విడచి చెరసాలలందు కష్టపడియైనను ధర్మమును సాధించుటకు బూనుకొనిరి. అట్టిదీక్ష గలిగినచో ఆధ్యాత్మికస్వేచ్ఛను కూడ పొందగలము. పరదేశస్థులు కూడ త్యాగధర్మమును వెల్లడిచేయుచున్నారు. మేక్స్వినియను ఐర్లండు దేశస్థుడు. 72 దినములు కారాగృహములో నుపవసించి తుదకు పరమపద మొందెను. ఆండ్రూసు స్టోక్సు మొదలగువారు కూడ ప్రజల స్వేచ్ఛకొఱకు పాటుపడుచున్నారు. మహాత్ముని యుద్యమమందు అహింస ముఖ్యసూత్రమై యున్నది. మనోవాక్కాయకర్మములందు అహింసయే సూత్రమై దీక్షతో పనిచేసిన అకాలీలు జయము పొందిరి. దొరతనమువారు చెఱపెట్టుటకు విసుగుచెంది సదరుపద్ధతిని మార్చుకొనిరి. అకాలీలకు జయము చేకూరినది. పశుబలరూపకమైన దొరతనమును తనవశము చేసికొనిన సత్యాగ్రహశక్తి మహిమ మెల్లరకు తేటతెల్లమయ్యెను. కనుక నిప్పుడు ప్రజలందఱు "సత్యమేజయ మను" నార్యోక్తిని కర్మవలన నిరూపించుచున్నారు.

మన సనాతనధర్మ సూత్రములలో పంచములనువారు లేరు. నాల్గుజాతులనే వేదములు భగవద్గీతలు, మొదలగు గ్రంథములు నిరూపించినవే గాని పంచములను పేర్కొనలేదు. అందువలన పంచమజాతి ఇటీవల నుద్భవించె నని యూహింపవచ్చును. ఇందుకు కారణము వారి ఆచారములే గాని వేఱుగావు. వారి దురాచారములను మహాత్ముడు పారద్రోలి అస్పృశ్యతను తొలగించు ప్రయత్నములు చేయుచున్నాడు. కనుక నిప్పుడు సనాతనధర్మస్థాపనము జరుగుచున్నది. ప్రతివారును ఆర్యుల ధర్మములు పరమోత్కృష్టము లని తలచి, నిర్వహించుచున్నారు. ఆవుపేడ పిండి ముగ్గులు నమలులోనికి వచ్చినవి. సంధ్యావందనము గాయత్రీజపము మొదలగు శిష్టాచారములను బ్రాహ్మణులు ఆచరించుచున్నారు. దేశమునందు నశించిన వృత్తులు మఱల మొలకలెత్తుచున్నవి. ప్రతిమానవుడును పరశక్తిని అపేక్షింపక స్వశక్తిమీదనే ఆధారపడుచున్నాడు. బ్రాహ్మణులకు పూర్వపు ఔన్నత్యము రానున్న దేమో యని తలచుటకు అవకాశములు గలుగుచున్నవి. సంస్కృతము భాషమైనది. అందువలన వేదాంతతత్వము విశదము కాగలదు. దాన ప్రజలకు ముక్తి గలదు.

కలియుగాంతమై కృతయుగము ప్రవేశించినను ఏల ప్రపంచమునందు అశాంతి ప్రబలియున్న దని కొందఱు ప్రశ్నింపవచ్చును. మాసమునందు శుక్ల కృష్ణపక్షము లని రెండుపక్షములు కలవుగదా! కృష్ణపక్షము అమావాస్యతో ముగిసి శుక్లపక్షము పాడ్యమితో ప్రవేశించునుగాని ఆనాడే మనకు చంద్రుడును వెన్నెలయును కనబడుట లేదు. రెండవనాడు చంద్రుడును ప్రథమమున కనబడుచున్నాడు. మనకు ఆనాటిమొదలు పౌర్ణమివఱకు అభివృద్ధిచెంది, పౌర్ణమి నాడు గుండ్రముగా ఎక్కువైన కాంతితో ప్రకాశించుచున్నాడు. అలాగుననే కలియుగము అంతమైనను తద్వాసన కొంత కాలమువఱకు నుండును. అందువలననే కృతయుగము ప్రవేశించినను అశాంతి ప్రబలియున్నది. ఆ అశాంతి, క్షామము వగైరాబాధలన్నియు కొలదిసంవత్సరములలోగా నశింపక తీరదు. తెలుగుమానము ప్రకారము సప్తగుణులు పోయిన యెడల ప్రజలు సుఖవంతులై యుందు రని తెలియుచున్నది. ఈపైయంశముల బట్టి కూడ ఆభావమే వెల్లడి యగుచున్నది. ఇదిగాక యీ యుగసంక్రమ కాలమందు 14 రు ప్రవక్తలు వచ్చెద రని కొందఱుజ్యోతిష్కులు తెలియజేయుచున్నారు. ఆయంశమునుగూర్చి విచారింపవలసియున్నది గాని గ్రంథవిస్తర భీతిచే నిపుడు చేయజాలకున్నాను.

# భారతీయ ప్రబోధము

## క్రొత్త వేంకటసుబ్బరాయ గుప్త గారు

అనుదినంబును సేవ । కావృత్తినే చేయు, మంచు బోధించెడి । యన్నలార
గాంధిత్రోవను నడువ । గా వల్దు మీ రంచు, ప్రజలకు బోధించు । భ్రాతలార!
శాసనసభలకు । జనియు నచ్చో మాట,లాడంగ నేరని । యన్నలార!
జాతీయవాదుల । న్జయిలుల కంపగా, దలలూపు హైందవ । తనయులార!
గీ. హిందుదేశమునం దుద । యించి మీరు, భారతీయులమని ఖ్యాతి । వడసియుండి
భారతీయోద్యమంబును । పాడుజేయ, దలచు టది పాడి కాదంచు । దెలుయుడికను.

సీ. చదువుసంధ్యలు నేర్చి । జన్మస్వాతంత్ర్యంబు, విడనాడఁబూనెడి । విబుధువరులు
నాగరకులమంచు । నగరవాసము చేయు, బూని పల్లెలవీడు । పుణ్యమతులు
చీటికిమాటికి । చెచ్చెర కోర్టెక్కి, వ్యయప్రయాసలు చెందు । వ్యర్థమతులు
బ్రాహ్మణులే మన । పాలి దయ్యము లంచు, నూరూర జెప్పెడి । యూర్జితులును
గీ. రెండ తెండఱో జనియించి । రింకమీద, నట్టివారెల్లరికి జ్ఞాన । మలవడగను
బోధచేయంగ భారత । పుత్రులార, బయలుదేరుడి మీరు లో । భ్రాతలార!

సీ. ఉదరపోషణముకై । నుద్యోగ మనుజేర, బానిసీలైనట్టి । బాబులార!
కోర్టులకై ధనము । కొల్లబెట్టు మటంచు, పల్కుచుండెడి న్యాయ । వాదులార!
పరదేశవస్తువుల్ । విరివిగా దెప్పించి, ధనవ్యయంబును జెందు । తండ్రులార!
నాగరీకంబంచు । నారసిల్కులు గట్టి, మురియుచునుండెడి । బుడుతలార!
గీ. ఇంకనైనను మీ మతం । బెల్ల వీడి, గాంధిమతమును గైకొని । ఘనమటంచు
ఖద్దరుధరించి స్వేచ్ఛకై । పెద్దగాను, కృషినొనర్పుడి భారత । కృషికులార!

# చరిత్రరచనము - దానిలాభములు

వంగూరి సుబ్బా రావు గారు

దేశచరిత్రము, జాతిచరిత్రము, సంఘచరిత్రము, కులచరిత్రము, జీవితచరిత్రము, వాఙ్మయచరిత్రము, భాషాచరిత్రము, శబ్దచరిత్రము నని చరిత్ర లనేకవిధములుగ నుండును. పుట్టి పెరిగి నశించు పరిణామావస్థగల ప్రతి స్థూలమగు నణువు మొదలు, కేవలసాంకేతిక నామములచే బ్రకృతిలో నుద్భవించు దేశ భాష కావ్యాది సమస్తపదార్థములకుఁ జరిత్ర యున్నది. మనము తెలిసికొనుచున్నను, తెలియకుండ నుపేక్ష చేసినను ప్రతియణువునకుఁ జరిత్ర యున్నది. మనము వ్రాసికొన్నను వ్రాయకున్నను జరిత్ర యున్నది. కవిత్వము మొదలగు చిత్రకళలు మానవసృష్టము లయ్యు కవిబ్రహ్మసృష్టిలోని కావ్యప్రపంచమునందుఁ గూడఁ గవిచరిత్రము, కావ్యచరిత్రమును గూడ నున్నది. ఒకమహాత్ముని పవిత్రజీవితము కొన్ని వేలయేండ్లక్రింద దేశోపకారజనకమై విరాజిల్లి ముగిసి విస్మృతమై యుండినను, ఆమహాత్ముని భావములు చర్యలు తలంపులు స్వజాతి కుపకార మొనరించి జనసామాన్యమునందలి నడవడుల మార్చి మనజాతిచరిత్రమునందు లీనమై యున్నది. ఆతని చరిత్రమే పురాణమునందుఁ గాని యేకావ్యమునందుఁ గాని వర్ణన నొందక యుండవచ్చును. దేశకాలపాత్రముల ననుసరించి యా మహాత్ముని చరిత్రము విస్మృతమై యుండవచ్చును. కాని సత్యముగ నామహాత్ముఁ డొనర్చిన చర్య లోకమునందుఁ జలనము గలిగించినదియైనచో నది యెప్పటికైన బహిర్గతము కాకమానదు. సామాన్యమానవుల భావనలు తలంపులుగూడ జాతియం దిమిడి మరణము లేకయుండుట తప్పదు. చలింపఁజేయు భావములను నవి మంచివా చెడ్డవా యను విచారణము కూడ నవసరము లేదు. చెడ్డవైనను మంచివైనను ఆభావములు చావకుండ జీవించియుండి జాతిచరిత్ర కంగములై యుండును. భావములు స్వల్పములై, బీదవారియెడల నవికూడ నమరత్వము నొందును గాని యవి స్ఫుటముగ ద్యోతకము గాక చిన్ననక్షత్రములవలెనైన నుండక మానవు. ఒక్క యుదాహరణముఁ జూపి యింతకంటె నీభావము వెల్లడింపఁ బ్రయత్నించెదను.

అణువునకుఁ గూడఁ జరిత్ర యున్నదంటివి కదా యది యెట్లు? దానిచరిత్రము తెలిసికొనుటవలన నేమి ప్రయోజన మున్నది? దానికై లోకములో బుద్ధిమంతు లెందఱో తమ నిశితమైన బుద్ధిని రాత్రింబవళ్లు వ్యయ మొనర్చి కష్టపడి బుద్ధిని నిరుపయోగ మొనర్పనేల అని మీరు నన్ను ప్రశ్నింపుదురు. నేను చెప్పున దేమనఁగా? ఒకయణువుచరిత్రము రచియించుట కష్టసాధ్యము కావచ్చును. వ్రాసిన ప్రయోజనము మన కిప్పు డప్రస్తుతమును నిరుపయోగమును గావచ్చును. అయినట్లు కనఁబడవచ్చును. కాని యది పరిశోధించి వ్రాయుటకుఁ బ్రయత్నించిన వానిది సత్ప్రయత్నమే. కాని ఖండింపఁదగిన చెడ్డప్రయత్నము మాత్రము కానేరదు. అగమ్యగోచరము లైనను దుస్సాధ్యము లైనను కష్టసాధ్యము లైనను మానవుఁడు వానికొఱకుఁ బ్రయత్నించుట చెడ్డపనిమాత్రము కాదు. ఏమందురా? అవాఙ్మానసగోచరమని మన పెద్దలు నిరూపించిన బ్రహ్మపదార్థము మనకు దొరకు ననియే శంకర రామానుజాది మతకర్తలు తలంచిరా? అది దొరకునది కాదని వారే యంగీకరించినారు. కాని యాత్మవిచారణము ప్రతివ్యక్తికి నవసరమనినారు. అట్లే యొకయణువుచరిత్రమును మనము కష్టసాధ్యమైనదని విడుచుట యేల. దానికై ప్రయత్నించుట యేల. ప్రయత్న మెప్పటికైన జయ మొందవచ్చును. ప్రయత్నము జయప్రద మగునా కాదా యని లెక్కలు వేసికొని దానిని సాధింపఁ గోరుటకుఁ గర్మవాదు లంగీకరింపరు. కర్మవాదులతో మన కేల యందురా? ప్రపంచమునందు మానవశక్తి కతీతమైన యేఘనకార్యమైనను మనము చూచినంతవఱకు చివరఫలితము నొందిన వారిచేతనే యారంభము కాలేదు. ఒకవేళ నట్టి యాదర్శము నొందిన యదృష్టశాలి కల డనుకొందము. ఆతఁడయిన విజయమును గణితము వేసికొని దానిపైఁ బ్రయత్న మారంభింపలేదు. అప్రయత్నముగ అనుభవజ్ఞానముచేత శాస్త్రజ్ఞానసహాయమునచే ప్రతిఘనకార్యమును నెగ్గినది. మనమాట యటుంచుఁడు. అంతగా నరిదియైన యాస్తికబుద్ధిలేక భౌతికశాస్త్రాభిమానులై పట్టుదలతోఁ బ్రకృతిని జయించెద మని కంకణము కట్టుకొని తమసర్వస్వము దానికై యర్పించు పాశ్చాత్యులఁ జూడుఁడు. వారు కనిపెట్టితి మనుకొనుచున్న విద్యుచ్ఛక్తి యోనమాలతరగతిలో నున్నారు. ఆ శక్తియనిన నేమియో దానివలన నింక నెన్ని పనులఁ జేయింపవచ్చునో వారికిఁ దెలియదు సరికదా దాని యాది యెట్లు తెలిసినదో కూడ సరిగఁ జెప్పలేరు. యవి పదియేండ్లక్రిత ముద్ద మనకు దుస్సాధ్యము. నేఁడది క్రీడావిశేషమై పోయినది. వీనికొఱకెందఱు ప్రయత్నించినారు. ఎందఱు ప్రయత్నించుచున్నారు. ఎందఱు మరణించినారు. ఎందఱు మరణించుచున్నారు. ఇదివఱకుఁ గలిగిన యభివృద్ధినే గమనించినచో నింక నొక్క త్రుటికాలములో మానవులు ఖేచరులై పోవుదు రని తోఁచుచున్నది. గరుడపక్షిని బోలు విమానారూఢుఁడగుటచే శ్రీవిష్ణువు గరుడగమన ఖేచరుఁడా? ఇదివఱకున్న పదునాల్గు లోకములకు బదులుగా వాయునగరములుకూడ వచ్చునని యూహింపవచ్చును. ఒక జప్లినుపై వ్యవసాయ మారంభించి యా జెప్లినుకు కావలసిన పెట్రోలు మొదలగు పదార్థములు భోజనపదార్థములు కృతుములు నందే సృష్టించుకొనుచు మానవుఁడు తన సంసారముతో ఖేచరుఁడై భూమి యే పాడుపడునో నిజము లు తెచ్చునా యని మనము భయపడవలసివచ్చు

దినములు రాకపోవు. అప్పుడు చెప్పిన పురములు అండే వివాహములు సంతానములు ఇఁక భూమిలో నవసర మేమున్నది? సృష్టిలో జరుగుచున్న మనకండ్లయెదుటి యీమార్పు మహాదారుణ మైనది. సృష్టికిఁ బ్రతిసృష్టికి ఘాతకముగ మన మెంతయో దూరమున లేమని తోఁచుచున్నది. కావున నొక ఘనకార్యము మనము సాధించుటకు ప్రయత్నమే సదారంభము. అట్లే వేమనవంటి యొక మహనీయుని చరిత్రము వ్రాయుటకుఁ బ్రయత్నించుట యొక నేరము కాదు. మొట్టమొదట సంపూర్ణజీవితచరిత్రము వ్రాయలేకపోవుట యొకబుద్ధిలోపము కాదు. కడచిన వ్రాఁతలకంటెఁ దా నధికవిషయములు వ్రాయఁగలుగుట పెద్ద విశేషము కాదు. కాని యాచరిత్రసౌధమున నొక్కొక్క మెట్టు కట్టిన వారెల్ల ధన్యు లనక తప్పదు.

## పరమాణుపుచరిత్రము

ఇన్నిమాటలు చెప్పుచున్నాను గాని మీకు వాగ్దాన మొనరించిన పరమాణువు చరిత్రము సాధ్యమా? ప్రయోజనమా? అను విషయములు చెప్పక యాలసించుచున్నాను. మీ రొకనాఁడు గోదావరినదికి పోయి తళతళలాడునట్టి యొకయణువునుజూచి పైకెత్తుదు రనుకొందము. అది దానివెంట నతికొన్ని సూర్యకాంతిలో ప్రజ్వలితములై కనిపించి మీదృష్టి నాకర్షింప మీరు కేవలవినోదార్థ మది పైకెత్తి యొక కాగితమునఁ జుట్టి యింటికివచ్చితి రనుకొందము. అది యేమిపదార్థమో మీకుఁ దెలియదు. ఖనిజమో గైరికమో లోహమో మీకుఁ దెలియదు. దాని చరిత్రము మీకుఁ దెలియవలయునని కుతూహలము కలిగినది. గోదావరినది పర్వతములు గనులు అరణ్యములు దాటివచ్చుచున్నది. దాని ప్రవాహముతో నా పుణ్యప్రవంతి యనేకపదార్థములఁ దెచ్చుచున్నది. మలినములు నున్నవి. పునీతములు నున్నవి. మంచివియు నున్నవి. చెడ్డవియు నున్నవి. వానిమాట యటుంచుఁడు. చందనతరువునందున్న పాముతోనే దానిని వ్రేళ్లతోఁ గూలఁద్రోసి తెచ్చుచున్న గోదావరీ ప్రవంతి నాచందన గంధమునకు మెచ్చనులేము. ఈకాకోదర విషానలములకు నిందింపనులేము. మంచిచెడ్డలసమ్మేళనమే సృష్టిధర్మము. ఆవిచారణ మటుంచి వృక్షజములగువస్తువులు, జంతుజములగు పదార్థములు మన కట్టివని తెలియును గావున వానిని విడిచి, సులభముగా నేమి యని విచారింపనివారికిఁ దెలియకుండ నుండునట్టి యిసుక నే విచారింతము. గోదావరి పొడుగున చెట్లు చేమలు ఆకులు అలము కొమ్మలు ఈకలు మొదలగువానివలె వరదతో తేలివచ్చి రాక, యంతర్వాహినితో వచ్చి యెల్లప్పుడు నా ప్రవంతి నాశ్రయించి సముద్రమునఁ గలియుచున్న నీయిసుక నదీగర్భ మేమి పదార్థము? ఎట్లువచ్చినది ? ఎక్కడకుఁ బోవుచున్నది ? అని లోతుగ విమర్శించిచూచి భూగోళశాస్త్రజ్ఞులది ఖనిజ గిరిజ జంతుజ మని కాఁబోలు నిర్ణయించిరి. ఈపరిజ్ఞానముతో - ఈశాస్త్రజ్ఞులమాటలయందు విశ్వాసముతో మీరు కాగితమునఁ జుట్టి తెచ్చిన యిసుకరేణువుల చరిత్రమును గనుఁగొనుటకుఁ బ్రయత్నించెదముగాక! "గోదావరి ప్రవహించుకొండలలోఁ గొన్ని తెల్లజాళ్లకొండలో-స్ఫటికపుకొండలో-యుండియుండవలయును. అట్టిజాళ్ల కొండలు నది యొరిపిడిచేఁ గొన్ని యణువుల రాల్చినది. అవి యీయిసుకతిప్పకుఁ జేరినవి. కావున నీయిసుక దొరకిన స్థలమునకుఁ బైన మనము ప్రయాణ మొనరించినచో నీకు స్ఫటికపు జాళ్లకొండ దొరకక మానదు." అని బుద్ధివిశేషము గల మీరు తలంచితిరి. ఈమాట ప్రసంగవశమున మీపుత్రునితోఁ జెప్పితిరి. అతఁడు పడుచువాఁడగుట మఱునాఁడే బయలుదేరి గోదావరి ప్రవాహమున కెదురు బయలుదేరి పాపికొండవఱకు నడిచిపోయి, యిఁక నడువలేక యచ్చటనున్న యొక పాలజాతికొండఁ జూచి యిదియే స్ఫటికపు జాళ్లకొండ యని నిర్ణయించి తిరిగివచ్చెను. అది మీమనుమఁడు చూచి యాపాలరాయిలె దొరకినరజను తళతళలేదని యొకపడవ తీసికొని బయలుదేరఁబోవ మీపుత్రుఁడు నీళ్లరాపిడిచేసిన ప్రకాశము హెచ్చినదని వాదించెను. కాదని మీమనుమఁడు మఱి నూఱుమైళ్లు పైకిఁబోయి, పాపికొండల కావల నొకజాళ్లగని నదియొడ్డునఁ గనుఁగొనివచ్చి యాజాళ్లఁ బరీక్షింపఁజేయ నది వజ్రములగని యయ్యెను. ఒకయణువుచరిత్రకై మీరుప్రయత్నింప నది మీమనుమని కోటీశ్వరత్వమునకుఁ గారణమైనది. మీమనుమని కోటీశ్వరత్వమునకు మీమొదటి యూహాలే బీజములై స్ఫటికపు జాళ్లకు బదులు వజ్రములు దొరకినవి.

ఇట్లే మీలో నొకచరిత్రకారుఁ డాంధ్రులు 2 00 యేండ్లనుండి యెట్టిదుస్తులు వేసిరి. ధరించిరి. సైనికులు చొక్కాయిలు తొడుగుకొనువారా? లేదా? ఎట్టివి? వారిరాజ్యాంగధర్మము లెవ్వి? అని ప్రయత్నించి యేదో బొంతవంటియాతుకులచరిత్రము వ్రాయ ననుకొనుఁడు. దానిననేకులు బుద్ధిమంతులు చదివి, వారికిఁ దెలిసిన సత్యములసాయమున, గ్రంథాధారముల బలమున సవరించి మఱియొక గ్రంథము వ్రాయుదురు. అదియే పదియంది వ్రాయుసరి కొక మహాగ్రంథము కావచ్చును. కావున మనపూర్వుల గ్రంథములు మన కాధారము లగుచున్నట్లే, యిప్పుడు దొరకుచున్న యాధారములతో మన మిప్పుడు వ్రాయుచున్న గ్రంథములు మనసంతతివారి కక్కఱకు రావచ్చును. కావునఁ జరిత్రరచనము ప్రయోజనకారి కావచ్చును. అగును.

## చరిత్ర ప్రయోజనము

అనేకులు పండితు లీకాలమున నేమనుచున్నా రనఁగా ? "సుమతిశతక మెవ్వఁడువ్రాసిన నేమి? ఏకాలమున వ్రాసిన నేమి? ఏకులమువాఁడు వ్రాసిన నేమి? దానియందలి పద్యములు ప్రతియాంధ్రుఁడును జదువుకొనవచ్చునే? అర్థభావములు గ్రహింపవచ్చునే? వ్రాసినవాఁడు కవియా? కాదా? యను విచారణ ముండవలెఁగాని, గ్రంథవిమర్శన ముండవలెఁగాని కవి వైదికుఁడా? నియోగియా? బ్రాహ్మణుఁడా? అబ్రాహ్మణుఁడా? అని విచారణ మేల? కలహమున కాకరము. ఒకకవి క్రీ॥ శ॥ 1200-1800 నడుమవాఁ డన్న లాభ మేమి? ఆఱువందల సంవత్సరముల యంగ వేసిన చరిత్ర మేమిప్రయోజనము? పోతన్న యొంటిమెట్టవాఁడైన నేమి? ఓరుఁగల్లువాఁ డైన నేమి? ఇన్ని బండ్లగ్రంథము లీ యనవసర విషయములపై నేలవ్యర్థము చేయవలయును? అనిప్రశ్నలవర్షమును గురియించి కవుల చరిత్రమనఁగాఁ దెలియని- తెలిసికొనుటకు వీలులేని స్థలములు కాలనిర్ణయాదులకై యేల వెచ్చింపవలెను? అని యిదిః అనున్న

కవుల చరిత్రముల గ్రహించి కవికావ్యవిమర్శనము లింతకంటెఁ బ్రయోజనకరము లని చరిత్రకారులకు హితబోధ కొందఱు మెల్లఁగా, కొంద ఱాగ్రహముతో, కొందఱు సత్యముగఁ గొంద ఱసత్యముగ వారివారి యభిప్రాయముల వెల్లడించుచున్నారు. ఈ మాటలు చెప్పువారు బుద్ధి లేనివారు కారు. పెద్దలే. పండితుల మనుకొనువారే. విద్యాశేఖరులే. శర్మాభిధానులే. దేశలాభము నపేక్షించి గ్రంథములు వ్రాయుచున్నా మని తలంచు మహాత్ములే! వారికి మనకవులచరిత్రము లపహాస్యజనకములుగఁ గనఁబడుచున్నవి. ఏమి చేయము? ఎల్లరకు నీ వాదము వినఁగనే సత్యమైన ఖండనముగనే కనఁబడును. కాని మనము కొంచెము లోతుగా విమర్శించుకొందము. మనకుఁ గావలసినది సత్యము, ప్రయోజనము. ఈ రెండును గవుల చరిత్రమునందు స్థల కుల కాలనిర్ణయాదుల యం దున్నవా? ఉండిన నేవి? అని చూచుకొందము.

## సత్యము

మనలోఁ జాలమంది యసత్యవాదుల మైనను సత్యప్రియులము. మానవుని యాదర్శము సత్యము కనుఁగొనుట తెలిసికొనుట ప్రయోజన పఱచుకొనుటయుఁ గదా! కావున సత్యము తెలియువఱకును సత్యమును దెలిసికొనవలయునని పెనఁగులాడుట ధర్మమే కాని ధర్మవిరుద్ధము కానేరదు. అదియే పరమధర్మమని కూడ మనపెద్దలు నిర్వచించియుండిరి. సత్యము తేలునా లేదా యను ప్రశ్నలు మనవి కావు. సత్యము తేల్పఁ బ్రయత్నమే మనది. అదియే పరమప్రయోజన మని యెంచి, యహంకారము విడిచి జితేంద్రియుఁడై జాతి కుల స్థలాభిమానముల విడిచి తనపనిసంతృప్తికొఱకు తన సంతతివారి యభివృద్ధికొఱకు నని చరిత్ర వ్రాయఁగలవాఁడే చరిత్రకారుఁడు. అహంభావముచే సత్యమునకు దూరమైనచరిత్రము వ్రాయువాఁడు కాఁడు. కావున సత్యప్రియు లందఱును జరిత్రప్రియులు కాకతప్పదు. మన చరిత్రము మనము వ్రాసికొనలేము గనుక మానవలయునను చరిత్రప్రియులు కానివారే చరిత్రమునైన నసహ్యముగఁ జూతురా? అట్టియిన సంపూర్ణతనొందని చరిత్రము లన్నియు వారు సర్వనాశన మొనర్చెదరా? ఆంగ్లేయులు వ్రాసిన చరిత్రము లన్నియు సమగ్రములా? జీవితమంతయు ధారవోసి వ్రాసిన విన్సెంటుస్మిత్ ప్రాచీనహిందూదేశచరిత్రమును, మఱియొకరు రోముచరిత్రమును సమగ్రములు కావే? ప్రతిదినము క్రొత్తవిషయముల పరిశోధకులు త్రవ్వుచున్నారే! ప్రతిదినము చరిత్రసిద్ధాంతములు మాఱుచున్నవే! కావునఁ జరిత్రము లనవసర మనవచ్చునా? మన విజ్ఞానము చరిత్రమువలననే యనేకవిషయములకు సాయపడి ప్రకాశమాన మగుచున్నది.

## స్థలనిర్ణయము

ఒకకవిచరిత్ర ప్రయోజనమును గుఱించియే నే నీవ్యాసమునం దెక్కువగఁ జర్చించెదను. ఈనడుమ నేను వేమనచరిత్రమును బ్రకటించి స్థలనిర్ణయ మొనరించితిని. అంతట దత్తమండలములవారు నెల్లూరివారు గుంటూరివారు గోదావరివారు తమ తమ పత్రికలలో వేమన మావాఁడు మావాఁ డని తగవులాడఁ జొచ్చిరి. ఈ తగవులు స్థలాభిమానముచే ముదిరి యసహ్యజనకము లగుమాట సత్యమే! ఇవి వాంఛనీయములు కాకపోయినను నివార్యములు కావు. వీనినిఁ జూచి, తగవుల కాకరమైన యీస్థలనిర్ణయాదులు వాంఛనీయములు కావని చరిత్రరచనమునందలి యానందమును జవిచూడ భాగ్యములేని మహాపండితులు చరిత్రరచనమే యనవసర మనుచున్నారు. ఇది ధర్మమా? అగ్ని యున్నచోటనే పొగ లేచును. పొగబాధ పడలేక యగ్నిని హేయభావముతో జూచుట నీతియా? కావున స్థలనిర్ణయప్రయోజనమును జూపెదను. కవిత బుద్ధిమంతుల సొమ్ము. కొన్ని పవిత్రస్రవంతులజలములఁ గ్రోలిన మేధావంతు లుదయించెద రని మనకు నమ్మకము లున్నవి. గొప్పమేధావంతుల స్థలనిర్ణయమువలన నట్టిస్థలములఁ దెలిసికొనవచ్చును. వానియందలి గౌరవము పవిత్రతను గోరి మన మచ్చటకు యాత్రలు పోయి, యకారణబంధువు లగు కవులయెడ నాజాతి తన కృతజ్ఞతను జూపవచ్చును. కేవలభావసంబంధమైన యీ ప్రయోజనములే గాక కావ్యము చదువుకొని దాని నర్థము చేసికొనుటకును కవిస్థలనిర్ణయ మవసరము.

కావ్యము శబ్దార్థసంపుటీకరణము. శబ్దములు చదివి యర్థముచేసికొని భావముల గ్రహించి రససిద్ధిచే నానందము నొందవలెను. శబ్దము కావ్యమునకు శరీరమువంటిది. దాని యర్థము మండలము మండలమునకు మాఱుచున్నది. మాండలికములగు శబ్దములు అన్వయములు వేఱుపడుచున్నవి. అవి తెలిసినఁగాని కవిగుణదోషములు తెలియవు. కృష్ణాప్రాంతములయందు "చెప్పంపు" అను జాతీయమగు క్రియ ప్రభావతీప్రద్యుమ్నకర్త వాడిన గుణమును బ్రశంసింపవలసిన వ్యాఖ్యాత, దానినే త్వార్థకేకారసంధి యని దోషముగా గోదావరీమండలమునఁ దీర్మాన మొనరించెను. 'పడద్రొబ్బు' ప్రయోగ మొకచోట బూతు. పోతన్నగారికి రసప్రకటనమున కవసరమైనసాధన మైనది. కావునఁ గావ్యమునందలి కొన్నిశబ్దముల విశేషార్థములే గాక కవిహృదయమును దెలియఁజేయు మాండలికములు గ్రాంథికవాదులకు ననివార్యముగఁ బడకమానవు. అట్టివానిఁ దెలియవలె నన్న నాకవి పుట్టి పెరిగి వసియించిన స్థలము నెఱిఁగి తీరవలెఁగాదా?

## కులనిర్ణయము

ఇందువలన నేకులమునందు మేధావంతు లుదయించిరి? దానికిఁ గారణము లున్నవా? తక్కినవా రేలవిద్యాభివృద్ధి నొందరైరి? ఆంధ్రవాఙ్మయము నూటికిఁ దొంబదిపాళ్లు నియోగులే నిర్మించుటకుఁ గారణము లేమి? అని చర్చించుకొనుటవలన నెన్నియో సిద్ధాంతములు సత్యములు బయలుదేఱును. కులాభిమానముచేఁ జర్చలు ననివార్యములే. కాని కేవల వ్యక్తిగతదూషణములు నింద్యము లైనను వాదుల యుక్తిప్రయుక్తులు చరిత్రకర్త కుపయోగకరములుగనే పరిణమించును. ఇట్టి వాదులు చరిత్రకర్తలు కారు, వాదులు న్యాయాధిపతులు గారు. దేశములోఁ బుట్టిన కవుల్లు దస్తావేజులు నోట్లు తప్పక పుట్టినవన్నియు న్యాయస్థానమున కెక్కునా? ఏదో వైచిత్ర్యమున్నవే వచ్చును. అట్టివాని విమర్శించి న్యాయముతీర్చుట న్యాయాధిపతిపని. ఉభయపక్షముల న్యాయవాదుల యుక్తిప్రయుక్తులను న్యాయనిర్ణయమునకుఁ

దొడ్డపుడునే కాని యవి న్యాయాధిపతిజడ్జిమెంట్లు కావు. మనవారి న్యాయవాదులయుక్తి ప్రయుక్తుల గడబిడలే చరిత్రలనుకొని, సత్య చరిత్రములే యనవసర మనుచున్నారు. చరిత్రలు జడ్జిమెంట్లవంటివి. ఇంకఁ గులనిర్ణయ ప్రయోజనము చూతము. మాండలికము లగు శబ్దజాల మున్నట్లే భాషలోని స్వరము ఉచ్చారణము హ్రస్వ దీర్ఘ గురు లఘుస్వరూపములు అర్థభేదములనుగూడ మాఱుచున్నవి. అవి మండలమునకు జాతికి కులమునకుఁ గూడ మాఱుచున్నవి. బ్రాహ్మణోచ్చారణమునకు కమ్మవారి యుచ్చారణకు కోమటియుచ్చారణమునకు భేద మున్నది. మనము సాధారణముగా నుచ్చారణమునుబట్టి జాతిని నిర్ణయింపఁగలము. ఇట్లే భాషలో - దానివాక్యక్రమములో - శబ్దజాలములో - అర్థభేదములో - కులక్రమముగ స్వల్పముగనైన మార్పులు చూపవచ్చును. "అవుపోసన" శబ్దము మావైపున జనసామాన్యమునందు గర్భాధాన మనునర్థమున వాడుకలో నున్నది. ఇది బ్రాహ్మణులలో వేఱర్థమున నున్నది. ఈశబ్దమే బ్రాహ్మణకవి వాడినప్పుడొక యర్థము బ్రాహ్మణేతరకవి వాడినప్పుడింకొకయర్థము నీయదా? కావున సత్యనిర్ణయమునకే గాక, కవివిద్య పరిస్థితులు వీనినిం దెలిసికొని యవి కవి కెట్టిభావము లుదయింపఁ గారకములైనవి అవి తనకుల నందలి యేయేపరిస్థితులలోనుండి, తన యనుభవముల లోకమున కీయఁ గలిగెనని సత్యమైన కావ్యాత్మను దెలిసికొనఁగోరు పండితులకు సాయపడును.

## కాలనిర్ణయము

వేమన్న పద్యములే సుమతిశతకమున నున్నవి. శ్రీనాథుని వర్ణనలే పెద్దన్న యనుకరించెను. ఇం దెవరు దొంగ? ఎవరు దొర? ఎవఁడు సత్కవి? ఎవఁడు భావ భాషాచౌర్యముల నొనరించెను? అని తెలిసికొనవలదా? సత్కవి యెవ్వఁడో వానినే పూజింపవలదా? అశ్వఘోషుని బుద్ధచరిత్రము కాళిదాసునికిఁ బూర్వపుదే యైనచో రఘువంశము బుద్ధచరిత్రముకంటె ఘనమైన దనవచ్చునా? భావ సమాసములు వాక్యక్రమము వీనిదొంగతనము నటుంచుఁడు. భావచౌర్యముగతి యేమి? మేము కవిని గౌరవింపము. కావ్యగతమైన కవితాపదార్థమునే గౌరవించెద మందురా? మంచిది. శబ్దముల యర్థముకూడఁ గాలానుగతమై యున్నది. శబ్దములయర్థము కాలానుసారము మాఱుచు వచ్చినది. నన్నెచోడుఁడు "కంపు" అను శబ్దము, 'సువాసన' యనునర్థమున వాడెను. 'కప్రమగుచు మల్లెకంపు నిచ్చు'' అని యొకకవి వాడె ననుకొందము. మల్లెపూవేమి, కంపుగొట్టుటయేమి కవి పిచ్చవాఁ డనమా? అంతట నే ముద్రాపకుని పండితుడో "కప్రమగుచు మల్లి కంపుగొట్టు'' అని సంస్కరించును. అంతట వ్యాఖ్యాత "ఉల్లికంపు'' సందర్భములేకుండ వర్ణించినాఁడు. కవిదాని యతికొఱకు "కప్రమగుచు'' అని యొక యనవసరశబ్దమును వాడె నిది పాదపూరణము. పడికట్టురాయి" అని నిర్ణయింపవలసినదా? మన మాకవికాలము నెఱింగినచో నప్పటి కా శబ్దమునకు 'సువాసన' యను నర్థమున్నట్లు గ్రహించి ఆ శబ్దచరిత్రముచే నా ప్రయోగము మంచిదనియే తలంచి, ఏయుపమాలంకారసహాయమునతో దాని భావమును గ్రహించినప్పుడే కాదా కావ్యానందము పూర్తిగా దొరకుచున్నది. కవికాలనిర్ణయము వారియెడ మన కృతజ్ఞతను జూపు జయంతివార్షికోత్సవములకే గాక యాకాలమునందలి చరిత్రసాయమున రాజకీయ మత సాంఘిక స్థితులఁ దెలిసికొని కావ్యానందమును బొంద వీలున్నవి. కావునఁ గాలనిర్ణయ మన్నిటికంటెఁ బ్రధానము. అదియే పరమప్రయోజనము కాకపోయినను దానిని ప్రయోజనములలో నొకటి యనక తీరదు. కవిస్థలము కులము కాలము వీనిజ్ఞానము కావ్యవస్తువును సులభముగాఁ బొందుటకు సాధనములుగా మనవారు చేసికొనలేక వాని ప్రయోజనమును గూడ సందేహించు దుస్థితిలో నుండుట శోచనీయమైన విషయము. కావ్యవిమర్శనమునకు రుచిభేదమునుబట్టి విమర్శకుని కావ్యస్వరూపపరిజ్ఞానమునుబట్టి మార్పులుండును. ఒకనికిఁ దిక్కన్నకవిత నచ్చు. ఇంకొక పండితునికిఁ బోతన్న శబ్దాలంకారములు ప్రీతి. ఒకనికి నాచనసోముఁడు సర్వజ్ఞుఁడు. ఇంకొకనికి శంభుదాసుఁడు సర్వస్వతంత్రుఁడు. ఒకనికి రాఘవపాండవీయ మిష్టము. ఇంకొకనికిఁ బ్రబంధరాజము పదును కావలెను. కావునఁ గావ్యవిమర్శనము నభివృద్ధిని గోరు స్వాతంత్ర్యప్రియుఁడు సహజప్రతిభ గల పండితుఁడు శాసనముగ నంగీకరింపఁడు. విద్యార్థి కూడఁ దనకై పెద్దపండితుఁడు వ్రాసియుంచిన వివరములే తీసికొనవలెఁగాని, సిద్ధాంతముల వల్లెవేయరాదు. వేఱటీవిమర్శనము వర్ణించిన బి. ఏ. లును, మల్లినాథసూరివ్యాఖ్యానవిమర్శనములు వర్ణించిన ప్రాఁతపండితులును గూడఁ బండితులు కాలేదు. వారిని పండితు లనుకొనుట కొసవెఱ్ఱి పన్ని. అట్టి పండితులు లోకమున కనవసరము. నీటిలోఁ దిరిగెడు తామరవలెఁ గావ్యమునందలిరసానుభవము నొంది విమర్శనముల సాగించు సాహిత్యప్రియులకు కవిచరిత్రమునందలి తెలిసినంతవఱకు వివరము లవసరము కాని కావ్యగుణదోషములపట్టిక లవసరము కాని సిద్ధాంతములు కానేరవు. నేఁటివఱకు ఘనుఁ డనిన శ్రీహర్షుని పాలి ద్వర్ణనమును జూచి యొక పండితుఁడ ననుకొను బుద్ధిమంతుఁ డాతని బుద్ధిహీనునిగాఁ జేసివేయఁ బ్రయత్నించి తానే బుద్ధిలేనివాఁడైనట్లు కావ్యవిమర్శనము చరిత్రముకంటెఁ బ్రధాన మనుకొనుట తప్పు. చరిత్రము సాత్యముగ నుండవలెను. విమర్శనమునకు ననఁగా సిద్ధాంతములకు దేశకాలపాత్రల ననుసరించి మార్పులుండును. కావ్య విమర్శన మొనరించువాఁడు శ్రీహర్షుని కాలము - అప్పటి పరిస్థితులు గమనింపవలెను గాని యిప్పటి యీ క్రైస్తవధర్మములనో ఆధారముచేసికొని శృంగారము దూష్యమని ఖండించి, యిదియే ఘనకార్యమనుకొనుట తెలివిమాలినపని. శృంగారరసమే కానిండు. మఱియొక రసమే కానిండు. కావ్యము రససమంజసమా యని పరీక్షకునికార్యము కాని రస ముచితమా? కాదా? యను విచారణము కాదు. కావునఁ జరిత్రప్రయోజనమును మఱవకుందురని, దానిని నిరసించువారికి బ్రత్యుత్తరముగ నిది వ్రాసితిని.

# గాంధీ మహాత్ముని ప్రశంస

రాజా మంత్రిప్రగడ భుజంగరావు గారు

వాసి నెసంగి నానాసస్యసాఫల్య, ముదము నెసంగు । పెన్నదులతోడ
లలిత ప్రసూన పల్లవఫలామోదంబు, వెలయించు కాననావళులతోడ
నుచిత శీతోష్ణ సౌఖ్యోల్లాసములఁ గూర్చు, నమితమనోజ్ఞ శైలములతోడ
రజతకాంచనదివ్యరత్నరాసులతోడఁ, గనులు పండువుసేయు । గనులతోడ

గీ. సంతతాష్టాంగయోగ నిష్ఠాగరిష్ఠులై యఘంబులఁ ద్రుంచు సంయమములతోడ
సకలరోగ నివారణౌషధులతోడ డంబుమీఱెను భరతఖండంబునందు.

చ. భువనజనంబు పాపపరిపూర్ణత స్రుక్కెడువేళ భక్తభాం
ధవుఁ డగు నాపరాత్పరుఁ డుదాత్తదయాగుణసత్యశౌచవై
భవముల లోకధైర్యగతిఁ । బాప మహాపురుషావతారుఁడై
యవని జనించుచుండును గదా యనివారత కార్యదీక్షచేన్.

మ. అల రామానుజ బుద్ధ శంకరులు మహమ్మద్ క్రీస్తు వాషింగుట
న్నులిసెన్ టాలుస్టాయి రోమెనురోలాండున్ మున్నుగాఁ గల్గు పూ
జ్యులు పెక్కండ్రిల నీశ్వరాంశమునఁ దేజోమూర్తులై పుట్టి యి
మ్ముల నాముష్మికమార్గ మైహికపథంబుం జూపి రక్షింపరే?

మ. అరయం దొల్లిటివారి పోలిక నిరూఢాధ్యాత్మతత్త్వావలో
కరతిం గాంచి తదీయమార్గ మిహలోకప్రక్రియాసాధ్యమై
పరఁగన్ రెంటికి నైక్యము న్నెరపి విద్యాన్యాయ చాతుర్యబం
ధురుఁడౌ గాంధిమహాశయుం డిల మహాత్ముండంట యాశ్చర్యమే!

క. కీర్తింపఁదగిన యుత్తమ, వర్తనలం । దీనలోకవాత్సల్యమునం
బూర్తిగ నీతఁడు మీరట, మూర్తిం గను క్రీస్తుఁబోలె । భువి నలరారున్.

సీ. తనయందు నహితవర్తనులైన జనులందు, మిత్రభావముతోడ । మెలఁగు టొకటి
ప్రభువునందైనను । బ్రజలయందైనన, క్రమచర్య లున్నఁ బోకార్చు టొకటి
ఇతరులు తన్నెంత । హింసించుచుండిన, రెచ్చి పైఁబడక సైరించు టొకటి
అతులిత దుస్తరోద్యమముల నైన సా, త్త్వికనిరోధమున సాధించు టొకటి

గీ. శత్రుదౌర్జన్య మధ్యాత్మశక్తి నమయఁ, జేసి వారల లజ్జింపఁజేయు టొకటి
దూరదర్శన మొకటి క్రీస్తునకుఁ బోలె, గాంధికినిగూడ నైసర్గికములు గావె.

ఉ. ప్రోదినెసంగు సాత్త్వికనిరోధము దుర్దమసాధనక్రియల్
పాదుగ నిల్చు నీపశుబలంబు నెదుర్పఁగఁజాల దందురే

మో దయమాలి రక్కసుఁడు । ము న్నతినిర్ణయము ల్పొనర్పఁ బ్ర
హ్లాదుఁడు గెల్చెఁగాదె! పదిలంబగు నిర్భరశాంతిసంపదన్.

చ. తలకొను నీర్ష్యతో సవతితల్లి వచించు కఠోరవాక్యముల్
ములుకులభంగి గాడ, మనముం జలియింపఁగ నేకశాంతి సం
ధిల వనభూముల న్నియమదీక్షఁ దపం బొనరించి యాధ్రువుం
డలఘుతరోన్నతిం దనరు । నవ్యయ దివ్యపదంబుఁ జెందఁడే.

చ. క్రమగతిఁ జాంపిరాను, కెయినానగరంబుల దక్షిణాఫ్రికా
ప్రముఖము లైన దేశముల । వారల సాత్త్వికశక్తి దేఁపి ని
త్యము ననివార్యధైర్యసముదారులఁ జేసి మనోరథంబు ల
బ్రముగ ఘటించి మించి జయపత్రముఁ గాంచె మహాత్ముఁ డెంతయున్.

చ. పదపడి యాతఁడే బలము । భారతవర్షమునందుఁ గూడ న
భ్యుదయము నందఁ జేసి విజయోన్ముఖుఁడై యెసలారు నిష్ఠ దే
సదమలశక్తి నెంతరభసంబున వెల్వడఁజేయ నంత శీ
ఘ్రుదశ లభింప నేర్తురు స్వరాజ్యపదంబు ముదంబునం బ్రజల్.

క. ఆతని నిర్మలసూక్తులు ఖ్యాతము లగు దూరదర్శియంత్రంబులుగా
నీతఱి భారతపుత్రుల, చేతోదృక్కుల స్వరాజ్యచిహ్నము దోఁచెన్.

శా. భావాతీతకుశాగ్రబుద్ధియును, దీవ్యద్దైవసద్భక్తి, వి
ద్యావైశద్యము, దేశసేవయును, స్వార్థత్యాగమున్, ధర్మకా
ర్యావిర్భూతనయంబునున్, స్వజనసౌహార్దంబు, దీనావన
ప్రావీణ్యంబును గల్గు ధీరుని చరిత్రం జెప్పఁగాఁ జెల్లదే?

చ. తతగుణసాంద్రుఁ డైన సముదారుని గాంధి తపఃప్రభావ మా
యతగతి సర్వలోకహృదయంబులయందలి యాత్మశక్తి ను
న్నతి వెలుఁగంగఁజేసిన విధానము నాత్మ నెఱింగి పాలకుల్
వెతలఁ దొలంగఁజేసి సరవిన్ ఘటియింపఁదగున్ స్వరాజ్యమున్.

ఉ. ధారుణి లోకబాంధవవిధానము ప్రస్ఫుటమై నటింప దు
ర్వారపరోపకారము నిరంతరమున్ బొనరింపఁ జూచు నా
ధీరుని శాంతిశాసన మతిక్రమణం బొనరింపఁ బోక మా
భారతపుత్రు లెల్లఁ బ్రతిభన్ గడియింపఁదగున్ స్వరాజ్యమున్.

చ. స్తుతమతియైన శాంతిగుణశూరుని గాంధిమహాత్ము సాత్త్విక
వ్రతము ఫలింప, శాంతులగు । భారతపుత్త్రుల కోర్కెదీర, మా
నితనయకోవిదాంగ్ల ధరణీధవచిత్తములం గరంచి సాం
ప్రతము పరాత్పరుండు భగవానుఁ డొసంగెడుతన్ స్వరాజ్యమున్.

# మన ఆదర్శము

పంగనామముల వేంకటకృష్ణారావు గారు, బి. ఏ.

సృష్టియందు మానవుఁడు జంతువులకన్న నెక్కువ యని యనుచున్నాము. మనస్సు గలవాఁ డగుటచే మానవుఁ డనుచున్నాము. (మనుసంతతివాఁడు కావున మానవుఁ డనియు నందురు.) అయిన జంతువులకు మనస్సు లేదా? యని యడుగవచ్చును. పాశ్చాత్యులు మొన్నటివరకును జంతువులకు మనష్యునికి గల 'బుద్ధి' లేదనియే భావించిరి. కాని యిటీవల తత్త్వశాస్త్రజ్ఞులు శాస్త్రపరిశోధనవలన జంతువులలోఁగూడ గలదనియు నది మానవునియందు వ్యక్తమైనట్లు వ్యక్తముకాక దాఁగియున్నదనియు నూహింపమొదలిడిరి. ఇఁక వృక్షజాతిని పాశ్చాత్యులు (అచేతనములు)గ తలంచిరి. కాని మనదేశీయుఁడు శ్రీజగదీశచంద్రవసు వృక్షజాతియందు చైతన్యమున్నటులు నిదర్శనముల జూపినపిదప వారీభావమును మార్చుకొనుచున్నారు. శ్రీజగదీశచంద్రవసు తెల్పినటుల యీసత్యము ననేకయేండ్లక్రిందట మనపూర్వులు—ఆర్యులే యోగదృష్టివలన కనుగొనిరి. వృక్షజాతియందే కాదు – నిర్జీవములగు జడపదార్థములందును, పాశ్చాత్యతత్త్వశాస్త్రజ్ఞులు 'వస్తువులు' అను వానియందునుగూడ చైతన్యము ముడివడియున్న దని యామహానుభావులు చూచిరి. కావుననే వారు జగత్తంతయు నొక్క చైతన్యరూపమనిరి. ఈచైతన్యమే సర్వేశ్వరునియొక్క యంశము. సత్తు, ఆనందము ఈతని యితర అంశములు. సర్వేశ్వరుఁడు సచ్చిదానందమూర్తి. సత్ ఉండుటయే. ఉండుట యెందులకు? ఆనందముకొఱకు. ఉండుటలోనేయానందమా? ఉండుటలో నానందము. కాని భగవంతుఁడు సత్ మాత్రమే కాదు. తన్నుదా వెదకుకొనుచున్నాఁడు. తన్నుదా దెలిసికొనుట యన నేమి? తన్ను తా మరచిపోయెనా? అతఁడేమి మూఢుడా? కాదు. తెలిసికొనుట యేమో దృష్టాంతమును గైకొందము. ఒక చిత్రకారుని మనమునం దేదో తోఁచును. ఇది యాతని కాహ్లాదము కల్గించును. కాని యీ యాహ్లాద మాతని భావము బాహ్యరూపము దాల్చినగాని పరిపూర్ణత జెందదు. చిత్తరువు చిత్రకారుని మనమునం దున్నదాని ప్రతిబింబము. భగవానుఁడును పరిపూర్ణుఁడయ్యును, అనంతుఁడయ్యును, ఆనందమయుఁడయ్యును తన ఆనందపరిపూర్ణతకై రూపమును దాల్చుచున్నాడు. జగత్తంతయు నాతని వివిధరూపముల ప్రదర్శింపయత్నించుచున్నది. జీవు లన్నియు నాతని యంశములే. ఒక్కఁడగు నాతఁడు వివిధరూపముల దాల్చెను. ఇందువలన నాతని కేకొఱతయు లేదు. ఏలయనఁగ నిది యంతయు నాతని లీల, ఆతని మాయ యనియు ననవచ్చును. కాని 'మాయ' యన మిథ్య కాదు. భగవంతుఁడు జగత్తునందు రూపములను పొందుటవలన భ్రమించుచున్నాఁడని గాని కలగనుచున్నాఁడని గాని యనరాదు. ఆతఁడు సర్వజ్ఞుఁడు. ఆతని జ్ఞానశక్తిచేతనే ఆతఁ డనేకస్థలముల అనేకవిధముల అనేకకాలములందు వ్యక్తమగుచున్నాఁడు. కావున మాయ అనుటకన్న లీల యనుట మంచిది. ఇదియే సృష్టిస్థితిలయములతోఁ గూడిన జగన్నాటకముయొక్క రహస్యము. అంతయు నాతనిలీల. ఈలీలకు ఆద్యంతములు ఆనందము. తనంతతాను పరిపూర్ణుఁడగు పరమేశ్వరుఁడు సృష్టి, స్థితి, లయకారణుఁడని తెల్పితిమి. ఇఁక యీసృష్టియందలి జీవులకును ఆతనికిని సంబంధ మేమి? జీవులన్నియు నాతని యంశములంటిమి. ఐన జీవుల స్వభావమునకును ఆతని స్వభావమునకును భేద మేమి? జీవులును పరిపూర్ణులా? కాదు. ఏజీవిగాని దైవాంశసంభూత మయ్యును అనేకజన్మము లెత్తినగాని అనేకదేహముల జొచ్చినగాని; అనేకకర్మము లాచరించినగాని పరిపూర్ణత జెందదు – పరమావధిని జెందదు – పరమాత్మను పొందదు. పరమాత్మమును పొందుటయన పరమాత్మ జీవునికి భిన్నముగా నున్నాఁడనుట కాదు. జీవ మన ప్రకృతిచే కట్టుబడిన ఆత్మయే.

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.

హృదయమునందు పరమాత్మ యుండనేయున్నాఁడు. కాని పూర్తిగ వ్యక్తము కాలేదు. ఈశ్వరునిదైన దివ్యభావమును పొందుటకే జీవు లనేక జన్మము లెత్తుచున్నవి. రాయి, మొక్క, క్రిమి, జంతువు, మనుష్యుఁడు, దేవతలు – వీనియందు క్రమముగా దేవస్వభావము వ్యక్తమగుటకు యత్నించుచున్నది. చైతన్య మంతకంతకు వికాసము గాంచుచున్నది. జీవ మంతకంతకు విముక్తి జెందుచున్నది. రాయిలో చైతన్యము జడత్వమున బడియున్నది. వృక్షజాతియందు ప్రాణరూపమున వ్యక్తమగుచున్నది. జంతువులందు ప్రాణరూపమునను ముఖ్యముగ బాహ్యేంద్రియరూపమునను వ్యక్తమగుచున్నది. మృగములందు మనస్సున్నను తెరమరుగున నున్నట్లుండి వాటిజీవితమును నడుపుచున్నది. కావుననే పాశ్చాత్యతత్త్వశాస్త్రజ్ఞులు జంతువుల నడవడిక (instinct) వలన ననుచున్నారు. మనుష్యునియందు ప్రాణము, మనస్సు, బుద్ధి (అంతఃకరణయందము)–వీటిరూపమున చైతన్యము వ్యక్తమగుచున్నది. కాని మనస్సు మాత్రమే సామాన్యమానవులయందు వికాసము గాంచినది. మానవులందు విశుద్ధబుద్ధి యింకను అరుదు. కొలదిమందిలో మాత్రము పూర్తిగ వికసించినది. బుద్ధికి అతీతమగుశక్తు లింకను మనయందు నిద్రించుచునే యున్నవి. బుద్ధి మన కింకను అందరాని స్వర్గమును జూపి సామాన్యమానవజీవితమునెడల నసంతృప్తి కల్గించి ఆశయమును రవుల్కొల్పుచున్నది. మననిజస్వభావ మిది కాదనియు మనయందు దనంతశక్తి నిబిడీకృతమై యున్నదనియు ఈజీవితము

మనదివ్యస్వభావముయొక్క వికృతరూపమనియు సాధ్యమగునంత శీఘ్రముగ మన మాదివ్యభావమును సమీపించి మన జీవితమంతయు ఆదివ్యభావస్వరూపముగ మార్చుకొనవలె ననియు, నిదియే పరమోత్కృష్ట ధర్మమనియు, ఆదర్శమనియు బుద్ధిరూపమున మనయందు సర్వదా వసించు పరమేశ్వరుఁడు పల్కుచున్నాఁడు. ఇంద్రియములను, మనస్సును సంయమించి చూచువారి కీసత్యము గోచరించును. ఇఁక నీయాదర్శనమును పొందుటకును ఆగురుఁడే సాధనముల జూపించును.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే.

మన కీపదవి లభించుట యోగముమూలముననే ఇక్కాలికాలమున కుచితమైనదియు, సులభమైనదియు నగు యోగసాధన శ్రీకృష్ణభగవానుఁడు గీతలలోఁ దెల్పియున్నాఁడు.

ఈయోగసాధన ప్రస్తుతపరిస్థితులలో చేయఁవలెను. బాహ్యపరిస్థితులు పూర్వపువి మరలి రావు. ఎంతక్లిష్టముగా కనఁబడినను యీ ఆధునిక పరిస్థితులు మనల నిర్బంధింపఁజాలవు.

పాశ్చాత్యులు మానవుని సౌఖ్యమునకును సదుపాయమునకును ఉపయోగపడునట్లు బాహ్యప్రకృతిని వశపఱచుకొనఁజూచిరి. గృహములు, వస్తువాహనములు, వేషములు చిత్రచిత్రములుగ మార్పఁజూచుచున్నారు. సౌఖ్యము నొనగూర్చు అద్భుతయంత్రముల నెన్నియేని కల్పించుచున్నారు. కాని యివేవియు నిశ్చలానందము నియ్యఁజాలవు. తాత్కాలికమగు హర్షమును మాత్ర మియ్యఁగల్గును. శాంతి, ఆనందము బాహ్యస్థితిగతులు మాఱినంతమాత్రమున గలుగవు. మానవప్రకృతియే మార్పు చెందవలెను. పాశ్చాత్యప్రపంచము అనేకవత్సరములుగ, శతాబ్దములుగ భౌతికప్రపంచములో నాటలాడుచు కాలము గడపినది. సుఖదుఃఖముల ననుభవించినది. ఇప్పుడిప్పుడే దృష్టినిలోపలకుమరల్చుచున్నది.

ఆర్యు లన్ననో తమలో ప్రకృతిని వశపఱచుకొనఁజూచిరి. సుఖదుఃఖములను విడిచి నిత్యానందమును వెదకఁజొచ్చిరి. వర్తమానమందును, భవిష్యత్తునందును మానవకోటి తమపూర్వు లందఱియొక్క విజ్ఞానసముదాయమును పొంది వారి యనుభవముయొక్క లాభము నొంది భ్రాతృభావముతో ఆత్మస్వరాజ్యమునకును సామ్రాజ్యమునకును, భూలోకస్వర్గమునకును పాటుపడుదురు గాక!

# మహాత్ముని సంకీర్తనము

అద్దేపల్లి కుటుంబరావు గారు

సీ. పైని కోపించు । పాపతముల పట్ల, కరుణారసముఁ జూపిఁ । గ్రాలినావు
నినుఁ దూలనాడినఁ । నీచతములయెడ, సొరిది శాంతరసంబుఁ । జూపినావు
నిను సన్నుతు ల్సేయు । జనులతోడుత నీశ్వ, రేచ్ఛయంచును నెలఁ । విచ్చినావు
నిజనందనులయెడఁ । ప్రజయెడ నొకభంగి, కృపఁజూపి సతము ర।క్షించినావు

గీ. భళిర నినుబోలు మహనీయుఁ । బ్రతిదినంబు, దలఁచినంతనె దురితము । ద్రోలఁగి సుఖము
చేకుఱు ననంగ నిలలోనఁ । జిత్రమేమి, ధీనిధీ! శాంతమూర్తి గాం।ధీమహాత్మ!

సీ. ఏయూరఁ జూచిన । నీయుద్యమము సాగి, వర్ధిల్లు ననెడి సం।భాషణంబె
ఏవీథిఁ జూచిన । దైవసముఁడు గాంధి, యనుచు భాషించు స।జ్జనగణంబె
ఏపల్లెఁ జూచినఁ । నీపటంబు ల్వీథి, వీథి నూరేగించు । విబుధగణమె
ఏయింటఁ జూచిన । నీయువతిని నిన్ను, పూజించి పాడెడి । పూవుఁబోండ్లె.

గీ. పలుకు లిఁక వేయునేల నీ । ప్రాభవంబు, నిండె నీయాంధ్రదేశాన । నిశ్చయముగ
బళిర నీదగు మహిమం?ఆ । వశమె పొగడ, ధీనిధీ శాంతమూర్తి గాం।ధీమహాత్మ!

# తురుష్క-జాతీయ పునరుద్ధరణము

వె. వేం. కృ. రావు గారు

శ్వేతజాతులచే నిన్న మొన్నటివఱకు "యూరపు దేశపు రోగి" యని పరిహసింపబడుచున్న తుర్కీరాజ్యము నేడు వారెల్లరిచే మహోన్నతరాజ్యాంగసభలకు పిలువఁబడి, మన్ననల నొందుచు తనమాట చెల్లించుకొనుచున్నది. దీని కంతకును కారణ మేమి? ఐరోపాప్రాంతపు నేషియాదేశములో (అనగా ఆసియా మైనరులో) తురుష్కులకును, గ్రీకులకును జరిగిన యుద్ధమునందు ఈశ్వరధర్మప్రేరిత మగు నవతురుష్కము తన మానప్రాణములకై చూపిన యనన్యసామాన్యపరాక్రమమును తుదకు గాంచిన యఖండవిజయమును ఇందులకు గారణములు. లాసేనుసభయందలి చర్యలు తురుష్కవిజయమువలన తుర్కీకి జేకూరిన యున్నతపదవిని తత్ఫలముగా తుర్కీయెడల నైరోపారాష్ట్రముల దృక్పథమునందు గలిగిన మార్పును విశదము చేయుచున్నవి. ఇట్టి యపూర్వపరిణామమునకు కారకుఁడెవరు? ఘాజీముస్తాఫా కెమల్ పాషాయే!!

ఈ మహావీరుని పేర్కొనని తురుష్కజాతీయ పునరుద్ధరణచరిత్ర నిజముగా రాముడు లేని రామాయణము ట్లుండును. ఈధీరోదాత్తుని పవిత్రనామము తుర్కీదేశచరిత్రయందు మాత్రమే కాదు మానవలోకచారిత్రమునందు-స్వర్ణాక్షరములతో లిఖింపబడు ననుటకు సందియము లేదు. యోధులలో యోధుఁడు. రాజ్యాంగవేత్తలలో రాజ్యాంగవేత్త. దేశోద్ధారకులలో దేశోద్ధారకుఁడు. ఈ సార్థకజన్ముని చరిత్ర ప్రజానాయకుల కెల్ల నాదర్శప్రాయము. ప్రపంచమున నూతనశకకర్తలలో నొకఁడగు నీ మహనీయుడు సుమారు నలువదియేండ్లక్రిందట సలోనికాలో నొక బీదకుటుంబమున జన్మించెను. దేశకాలాది బంధములు సామాన్యులకే కాని యిట్టి యసామాన్యప్రతిభాశాలురకు వర్తింపవు. ఆ కారణమున నితడు తనయం దున్న యమోఘశక్తివలన త్వరలోఁ బ్రాముఖ్యమునకు రాఁగల్గెను. ఈతఁడు తన రణవిద్యాభ్యాసము నంతను తన జన్మభూమియందే స్వీకరించినను స్వప్రతిభావిశేషమున నెపోలియనువంటి ప్రపంచయోధాగ్రేసరులతో సరిసమానుఁ డయ్యెను. ఐరోపామహాసంగ్రామమునందు 1915 వ సంవత్సరములో నితడు గల్లిపొలీలో తురుష్కసేనలయం దొకభాగమునకు నాయకుఁడుగా నుండి చూపిన రణకౌశలమే బ్రిటిషువారి కచ్చట సంభవమైన పరాజయమునకు గారణము.

కెమాల్ "ఆదర్శప్రాయుఁడగు సేనాధిపతి" యని ఆతనిక్రింద పనిజేసిన ఒక జర్మను సైనికోద్యోగి చెప్పుచున్నాఁడు ఆతడు కెమాల్ అధీనమం దున్న కొన్ని తురుష్కసేనలలో గల లోపములను సవరించుటకై జర్మను ముఖ్యసేనాధిపతిచే నియమింపబడినవాఁడు. మఱి యొకసేనానాయకుఁడైనచో నితరులు సైనికవిషయములదనకు సలహానిచ్చుటయా యని యాతని నిరసించి, వెనుకకు బంపియుండును. కాని కెమాల్ అతనిని బహుగౌరవమున నాదరించి, యాతని సలహాలను బాగుగా నాలోచించి తన సేనల నాప్రకారము సంస్కరించెను.

ఐరోపా సంగ్రామమునందు తనదేశము జర్మనీపక్షమును జేరుట ఈరాజనీతికోవిదున కిష్టము లేదు. అయినను ప్రభునాజ్ఞను శిరసావహించి; తన వీరధర్మమును అప్రతిమానవిధముగ నెరవేర్చి, శూరాగ్రేసరుడనిపించుకొనెను. ఇతడు ధైర్యశాలి యనుటకంటె, ధైర్యమే ఈపురుషరూపమును దాల్చెనని చెప్పనొప్పును. గల్లిపొలీలో ముఖ్యసేనాధిపతి కార్యస్థానమును; బసలును శత్రువులకు గానరాకుండునట్లు చెట్లచాటునను పొదలమాటునను ఏర్పాటు చేయబడియుండగా కెమాలు తన గుడారము నొక కొండప్రక్క నాంగ్లఫిరంగుల కెదురుగా వేయించుకొనెను. నలువైపులను గుండ్లు రివ్వున నెగురుచుండెను. కాని యం దొక్కటియు నీ దివ్యశక్తిసంరక్షితుని తాకజాలదయ్యెను! అథమము మూడుసారులైనను శత్రువుల గూఢచారులతని ప్రాణముల గొనుటకు ప్రయత్నించిరి. అందొకసారి యీతని గడియారముగుం

డును నెట్టివేసెను. ఎల్లప్పుడు నజేయ మగు నొక యదృశ్య విధి ఈమహాపురుషున కెట్టిహానియు గలుగనీయుట లేదు.

ఒకనాటిరాత్రి ఆకస్మికముగా గురిసిన పెనువానచే దురుష్క-కందకములు నీటితో నిండి సైనికులు కొట్టుకొనిపోవుచున్నప్పుడు ఈధీరోదాత్తుడు తనప్రాణమును దృణప్రాయముగా నెంచి, పొంగి పొరలుచున్న వరదలలో దుమికి తన సహచరుల ప్రాణముల రక్షించెను. చదరంగపు బెత్తులలోని కాయలవలె ననుచరులను స్వప్రయోజనార్థము వినియోగించి పిదప సదృష్టదేవతయొక్క కటాక్షవీక్షణముల కొప్పజెప్పు ప్రజానాయకు లితనిని జూచి యుదారవర్తనమును నేర్చుకొనదగును.

ఐరోపా సంగ్రామాంతమునుండియును మాతృదేశ గౌరవ సంరక్షణకై యీపుణ్యచరిత్రుడు చేయని సాహసమును పడని శ్రమయును లేవని చెప్పిన నతిశయోక్తి కాజాలదు. జాతీయ లక్ష్యమగు నిజదేశస్వాతంత్ర్యమును నితడు దుస్సాధ్యములగు నాదర్శములచేతను, నాచరణయోగ్యములు కాని నీతులచేతను బంధింపక, తన శత్రువులమార్గములనే వారికంటె ప్రశస్తతరముగ నుపయోగించి, యనివార్యము లగు స్వపరజనుల కష్టనష్టముల కణుమాత్రమును జలింపక వీరుడై రణరంగమున రక్తవాహినులలో నీదులాడి తన జీవితోద్దేశమును సాధించెను. ఇట్టి మహనీయులే కదా అవతారపురుషులు!

కెమల్ పాషా రణనీతియం దెంత కుశలుడో రాజనీతియందుగూడ నంత కుశలు డనుటకు రుషియా ఇటలీ ఫ్రాన్సుమున్నగు మహాదేశముల సానుభూతి నతడు సంపాదించిన విధమే సాక్షి. లాయిడుజార్జి మంత్రి యొక్క పతనమునకు గూడ నింగ్లాండునం దీ ధీశాలి జరిపించిన ప్రచారమే కారణ మని లోకులు చెప్పుకొనుచున్నారు.

పూర్వాచారపరాయణు లగు తురుష్కులయం దీతడు గలిగించిన ప్రబోధమునకు యుద్ధసమయమున తురుష్క-స్త్రీ లొనర్చిన యమూల్యసేవయే తార్కాణము. సామాన్యస్త్రీలు తపాలా తంతి మొదలగు పౌరశాఖలయందును, ధనికురాండ్రు సైనికులకు నాహారాది సదుపాయముల నందిచ్చుటయందును గృషిసల్పిరి. ఇంతయేల? మాతృదేశమునకు పరిపూర్ణ విజయము చేకూరు వఱకును తురుష్క-స్త్రీలు విశ్రాంతి నొందలేదు. తమ పురుషుల విశ్రాంతి నొందనీయలేదు. ఆహా! ఇట్టి వీరమాత లున్ననాడే కదా జాతికి గౌరవమును, దేశమునకు స్వాతంత్ర్యమును జేకూరును!

స్త్రీల నెట్లాదరింపవలయునో ప్రాచ్యులకు తెలియదనియును తామే స్త్రీస్వాతంత్ర్యప్రియులమనియును దంభోక్తులు పలుకు పాశ్చాత్యజాతులెల్ల తమస్త్రీలకు ప్రభుత్వమునం దెన్నికహక్కు నిచ్చుట కిప్పటికిని జంకుచున్నారు. ప్రబుద్ధతురుష్కము మెమ్. ఎడిచ్. ఖానమ్‌వంటి విదుషీమణికి తన ప్రభుత్వమునందు మంత్రిపదవి నిచ్చి పాశ్చాత్యనాగరక ప్రభుత్వముల కెల్ల బుద్ధిసెప్పుచున్నది. తురుష్క-జాతియందు కెమాల్ పాషా చేసిన ఆమూలాగ్ర సంస్కారమున కిది యొక నిదర్శనమే చాలును.

ఉపసంహారము

ఇంతకును తురుష్క పురుషులును, స్త్రీలును ధర్మబద్ధులై యహోరాత్రము లేకదీక్షగా నాత్మసంరక్షణార్థము కృషిసల్పినారు. కనుకనే కెమాల్ పాషా విజయమును జేకూర్పగలిగెను. అట్లు కాక విద్యాధికులును ధనవంతులునగు ప్రజలు గౌరవశూన్యులై పరాశ్రయమును గోరు పురుషులుగను, వ్యర్థాలంకారమునే ప్రధానముగా నెంచి సంచరించు స్త్రీలుగను నున్న యెడల, కెమా లేమి చేయును? ఈశ్వరు డేమిచేయును? అట్టివారిగతి యధోగతియే. లాసేను సంధిసభయొక్క పర్యవసాన మేమగునో ముం దేమి కానున్నదో మనుష్యమాత్రులకు తెలియదు కాని ఆఫ్ఘనుస్థానమునందేమి ఈజిప్టునందేమి తుర్కీయందేమి ముసల్మానులయందు గలిగిన ప్రబోధమును జూడ, భూమిపై సర్వమానవసౌభ్రాత్రమును నెలకొల్పుటకు తురుష్క-జాతి మరల నుత్కృష్టదశయం దుండుట ఈశ్వరసంకల్ప మైనట్లు తోచును. ధర్మమే జయమొందుగాక!




# గాంధిశకము

వింజమూరి భావనాచార్యులు గారు

ఆద్యంతములు లేని కాలములో కొంతకాలమయినను మనము తెలిసికొనక తీరదు. అట్లు తెలిసికొనటకుగాను కాలమందు మధ్యమధ్య హద్దు లుండవలయును. ఆహద్దుకు పూర్వమిన్ని సంవత్సరముల క్రింద లేక దరిమిలా నిన్ని సంవత్సరములకు దర్వాత ఫలానిసంగతి జరిగినదని వాడుకొనుచుందుము. ఆహద్దు నిర్ణయించుకొన్నప్పుడు ఏదో జగద్విదితమయిన సంగతిని సూచించెదము. లేదా యొక జగద్విఖ్యాత పురుషుని బేర్కొని ఆయనపేరితో శకమని వాడుచున్నాము. సృష్ట్యాది, కలియుగాది, క్రీస్తుశకము, మహమ్మదీయశకము, శాలివాహనశకము, విక్రమార్కశకము, కేరళశకము మొదలగున విట్టివియే!.

రాజ్యస్థాపనలోగాని మతప్రవర్తనములోగాని ప్రాముఖ్యము బొందినవారిని శకపురుషులుగ భావించుచున్నాము. గాని రాజ్యస్థాపకు

**శకంపురుషులు.**

లందఱును లేక మతప్రవర్తకు లందఱును శకపురుషులుగా భావింపబడుటలేదు. అట్లు భావించుటకే వీలులేదు. అట్లు భావించునెడల శకసంఖ్యయపరిమితమై గందరగోళమగును. కాబట్టి శకపురుషు లరుదుగనేయుందురు. శకపురుషులకుండ వలసిన మిదమిత్థమని చెప్పుటకు వీలులేదు కాని యిదివఱకుండు శకపురుషులనుబట్టి యేకారణముచే వారి కీపదవి లభించినదో చెప్పుట దుస్సాధ్యముకాదు. అయిన నాకారణము లన్నియు నిందు వివరించుట యవసరము లేదు. ప్రస్తావవశముగ స్థాలీపులాకన్యాయముగ కొన్ని మాత్ర మించుక విన్నవించెదను.

ఈ ప్రపంచ మెప్పుడు సృష్టింపబడినది కనుగొను దాఖలా లేమియు లేవుగాని ఏలెక్కనుబట్టియో లేక యేకారణమునుబట్టియో వివిధదేశస్థులు

**సృష్ట్యాది**

పలువిధములుగా సృష్ట్యాదికాలమునకు పరిమితి యిచ్చుచున్నారు. క్రైస్తవులు సృష్టి సుమారైదువేలసంవత్సరముల క్రింద జరిగిన దని భావించుచున్నారు. ఇది బైబిలునుబట్టి తేల్చిన సంవత్సరముల లెక్క. అయితే యీలెక్కయెంతమాత్రము సరిగాదని శాస్త్రజ్ఞులు ఏకగ్రీవముగ జెప్పుచున్నారు. హిందూదేశస్థులు చెప్పు కాలపరిమితి కూడ కాకులలెక్కవంటిదే యనవచ్చును గాని వారు చెప్పు ప్రకారము సృష్టి యనేకలక్షలసంవత్సరముల క్రింద జరిగినట్లు చెప్పుట సమంజసముగ నున్నది. హిందువులు కాలమును యుగములుగ భావించి యాయుగముల కనేకలక్షలసంవత్సరముల పరిమితి నేర్పరచి అట్టియుగము లనేకలక్షలుగడచినగాని సృష్ట్యంతము కాదని చెప్పుచున్నారు. అయిదువేల వత్సరముల క్రిందట కలియుగము ప్రవేశించినట్లు వారి పంచాంగములలో గణించుచున్నారు. ఈ కలియుగాదిని శ్రీకృష్ణనిర్యాణమని భారతాదిగ్రంథములలోనున్నది. చిరకాలమునుండి నాగరకత గలిగియున్న హిందువులలెక్కయే నిజమైయుండిన నుండవచ్చును. కలియుగాదిని సృష్ట్యాది యని యూధులు భావించియుందురు.

బైబిలుగ్రంథమును జదివినవారందఱు ఏసుక్రీస్తు మహాపురుషుడని యొప్పుకొనక తప్పదు. ఆయనమతము భారతీయులకు దృప్తినిజేయ

**క్రీస్తుశకము**

దగినది కాకపోయినను స్వల్పకాలముక్రింద నాగరకతను బొందిన యాటవిక జాతులకు నింతకంటె తృప్తి గలుగజేయు మత మింకొకటి లేదనినను అనవచ్చును.

ఇప్పు డామతావలంబకులలో బహుమంది క్రీస్తుమతస్థులని చెప్పుటకు దగిన వారు కాకపోయినను క్రైస్తవులందఱును క్రీస్తుయాజ్ఞప్రకారము ప్రవర్తింతురేని భూలోకము స్వర్గలోకమే యగును.

క్రీస్తుమతస్థులని పేరుబెట్టుకొన్నవారినడత యెట్లున్నను ఆయన శాంతము, భూతదయ, స్వార్థత్యాగము అనిర్వాచ్యములు. ఆయన శిలువమీదనిర్భయముగ బ్రాణము విడుచుటజూచి యప్పటియధికారవర్గమువారే యాయన మహాపురుషుడని యెంచసాగిరి. ఆమత మిప్పుడు జనసామాన్యములో 5-వ వంతువారిచే నంగీకరింపబడుచున్నది. కాని నిజముగానాచరణమునందు క్రైస్తవులుగా నుండువారు స్వల్పసంఖ్యాకులే యయియున్నారు. ఆంగ్లేయులు జర్మనులు మొదలగు యూరోపుఖండవాసులు పేరునకు క్రీస్తువు లయినను జీవహింసకు వెనుదీయుట లేదు. ఈమహనీయుని యవతార మిప్పటికి 1922 సంవత్సరముల క్రిందట గలిగెనది. క్రీస్తుశక మీమహనీయుని పేరనె పరగుచున్నది. కాని దీనిని స్థాపించినది క్రీస్తు మరణించిన 600 సంవత్సరములకై యున్నది. దరిమిలా 400 సంవత్సరములవరకు నది వ్యాప్తికాలేదు. క్రీస్తు పుట్టినదే యబద్ధమని చెప్పువారిది యొక నిదర్శనముగ నూహించుచున్నారు.

మహమ్మదీయమతస్థాపకు డగు మహమ్మదుగారు సుమారు 1850 సంవత్సరముల నాడు అరేబియాదేశములో జన్మించి యప్పటికి క్రూర

**మహమ్మదీయశకము**

జంతువులవలెనుండు అరేబియాదేశస్థులందు దైవభక్తిని బురికొల్పి మహోపకారముచేసిన మహానుభావుడు. వీరిమతము బహుదేశములందు వ్యాపించి యున్నది. వీరు శత్రుబాధ తప్పించుకొనుటకు మక్కానుండి మదీనాకు పారిపోయినారు. దీనికి హిజేరాయనిపేరు. వీరిశకము నాటినుండియే లెక్కింపబడి పలుదేశములలో మహమ్మదీయులవల్ల వాడబడుచున్నది.

శాలివాహన విక్రమార్కశకములు హిందూదేశమందు కొన్ని భాగములలో వాడబడుచున్నవి. కాని క్రీస్తుమహమ్మదీయులశకములకున్నంత

**శాలివాహనశకము**

**విక్రమార్కశకము**

ప్రాముఖ్యము వీనికి లేదు. వేయిసంవత్సరముల పయికాలమునుండి పరదేశస్థులకులోబడి దాసప్రాయులుగనున్న భరతఖండవాసులు తమ్ముదాము మరచి వేషభాషాదులలో మార్పు జెందుచుండుటచే వారిశకములు నామావశిష్టములైనవని చెప్పవచ్చును. మఱియు, నీశకపురుషులు చేసిన మహాకా

ర్యములు చరిత్రాత్మకముగ విపులతను బొందలేదు. వీరివంశములా లేవు. వీరు చేసిన ధర్మశాస్త్రములు గాని మఱి యేఘనకార్యములు గాని కనుపించుటలేదు. వీరు మతవ్యాపకులా కారు పరదేశస్థులను పారంద్రోలుటలో వీరు కనంబరచిన శూరత వీ రాకాలములో జేసినధర్మములు, వీరిని శకపురుషులుగ జేయుటకు హేతువు లయి యుండవచ్చును గాని, యీ రెండుశకములకు నంతరము మిక్కిలితక్కువ. దీనికి కారణమేమో చెప్ప శక్యముకాదు. విక్రమార్కుని శాలివాహనుడు చంపి తాను శకపురుషుడయినట్లు గాథలున్నవి. యవి యెంతవరకు నిజమో చెప్పజాలను. ఏది యెటులున్నను ఈశకములు భరతఖండములో నెక్కుడనో యొక మూల నడుగియున్నవి. కలియుగాబ్దములు బహు సంఖ్యాకములయి నందున నవి నిత్యవ్యవహారములకు బనికిరావు.

పూర్వము భరతఖండము పలుదేశములు గలిగి వేఱువేఱు రాజులకు లోబడి భిన్నభాషలు కలిగియుండుటచే వారివారి యిష్టానుసార

**క్రొత్తశకమవసరమా?**

మేదో యొకవిధమయిన కాలపరిమితిని గణించుచుండెడివారు. ఒకదేశస్థునితో మఱియొకదేశస్థునికంతగా సంబంధములేదు. వ్యవహారములలో నటుండ నిత్యనైమిత్తిక కర్మలలో గూడ భేద ముండెడిది. కర్మానుష్ఠానములలో నెటు లున్నను దైనికవ్యవహారములలో మాత్ర మొక్క కాలగణితియే యవసరము. ఇప్పటి స్థితులనుబట్టి దేశ మంతటికి సామాన్యభాష యెట్టి యవసరమో సామాన్యపంచాంగముకూడ నట్టి యవసరమే. ప్రస్తుతమున నాంధ్రులు వాడునది చాంద్రమానము వింధ్యోత్తర దేశమునందు బార్హస్పత్యమానము. ద్రవిడదేశమందు సౌరమానము. మళయాళమునందు కేరళశకము. బంగాళాలో మరియొకశకము. ఒకదాని సంవత్సరాదితో మరియొకదానికి సంబంధము లేదు. ఆంధ్రుల సంవత్సరాది చైత్రశుద్ధ పాడ్యమి. మార్వాడీ గుజరాతీల సంవత్సరాది ఆశ్వీజ బహుళ అమావాస్య. ద్రవిడుల సంవత్సరాది చిత్రనెల ౧-వ తేది. ఇట్లే యొకదేశ సంవత్సరమునకు మరియొక దేశసంవత్సరమునకు సంబంధములేదు. ఇదివ్యవహారములో ననేకచిక్కులుగ నున్నది. నా నలుబదిసంవత్సరముల ప్లీడరీ యుద్యోగానుభవములో ననేకచిక్కులు కనిపెట్టినాను. ఇందు కొక దృష్టాంతము. తెలుగుదేశమునందు వర్తకుడు చాంద్రమాన మాసములను తేదీలను వాడుటచే తాను తిరుచునాపల్లికి సరకులు పంపినప్పుడు వైశాఖ శుద్ధ పంచమీ గురువారమునాడు ఖర్చువ్రాసినాడనుకొందము. ఈ సరకులను తిరుచనాపల్లివర్తకుడు ఏదోయొక అరవమాసం యేదో తేదిన జమ కట్టుకొనును. వీరు లెక్కలు చూచుకొనునప్పుడు - వానిలెక్క వీనికి వీనిలెక్క వానికి - తెలియదు. అప్పుడు క్రీస్తుశక మేగతి! వారివారి తేదులకు సమానమయిన క్రీస్తుశకపుతేదీలను చూచి వారివారి లెక్కలు పరిష్కరించుకొనవలసివచ్చును. మనము ధరించు వస్త్రాదికమునిమిత్తము పరదేశములపై నాధారపడునట్లే మనలెక్కలు పరదేశశకములమీద నాధారపడవలసిన గతి వచ్చినది. మన బాలురకు నాంగ్లేయమాసములు గరపుచున్నామే గాని మన దేశీయమాసములను గరపుటలేదు. ఇప్పుడు దేశమున కలతనొకభాష నేర్పుటకు నెట్లు ప్రయత్నించుచున్నామో దేశమంతట ఖద్దరువస్త్రములను దాల్చుట కెట్లు యాతురతతో నున్నామో అట్టి ప్రయత్నము - అట్టియాతురత - దేశైకశకస్థాపనయందును తద్వ్యాపకము నం దుంచుట భారతీయులందరికి విధియై యున్నది.

సృష్ట్యాదినుండి యితర జంతువులమాట యటుండ మానవుని చరితము భగవదిచ్ఛకు వ్యతిరేకముగ నున్నదనక తీరదు. భగవంతుడు మానవ

**క్రొత్తశకమునకు నారంభముగా నుండదగిన జగద్విఖ్యాత కార్య మిప్పుడేది?**

జాతిని సృష్టించకపూర్వమే యితని యాకలి తీర్చుకొనుటకు దివ్యమైన ఫలాదులు - చక్కని ధాన్యములు - త్రాగుటకు తియ్యని నీరు - తిరుగుటకు రమ్యమయిన బయళ్లు - చలిదీర్చుకొనుటకు వస్త్రాదికముల కుపయోగపడు ఉన్ని - దూది నారఆకులు - వంటచేసికొనుటకు నిప్పు - ఉచ్ఛ్వాస నిశ్వాసములకు చక్కని గాలి - అవసరమయిన యుష్ణము - మరింక నెన్నియో సృజించియున్నాడు. వాని ననుభవించి తమ కాలమును గడుపుకొనుటకు బదులు వారి కిచ్చిన బుద్ధిని దుర్వినియోగపరచి యొకరి నొకరు హింసించుట కారంభించినారు. కుక్కలు తమలో తాము పోట్లాడి విస్తరి చించుకొన్నట్లు మనుష్యులు నయిలేము తమలో తాము పోట్లాడి యెన్ని మంచిపదార్థములనో పోగొట్టుకొనుచున్నారు. వేదములలోను పురాణములలోను ఇతిహాసములలోను చరిత్రలలోను యుద్ధములనుగురించి వర్ణనలుగలవు.

ఈయుద్ధములలో జయకాంక్ష గోరుచు పోట్లాడు జనమును సేకరించి మంచి మారణాయుధములను బోగుచేసి యొకరి నొకరు హింసించుకొని మడియుచున్నారు. దేవదానవ యుద్ధము మహాభారత యుద్ధము - రామరావణయుద్ధము - నెపోలియను యుద్ధములు - మహమ్మదు గజని దండయాత్రలు మహమ్మదు తొగ్లకుహింసలు - ఇంగ్లాండు స్కాట్లండు యుద్ధములు - హిందూదేశములోని సిపాయి కలహము - యూరోపు మహాయుద్ధము - నిన్న మొన్న జరిగిన గ్రీసు టర్కీ యుద్ధము - ఇంక నెన్నో జరిగిన జరగనున్న యుద్ధములలో చేయునది తాము చచ్చుటయు నెదుటివారిని జంపుటయు నేకదా?

ప్రకృతిశాస్త్రజ్ఞులు తమ తెలివితేటల నుపయోగించి చేసిన క్రొప్పుఫిరంగులు ఆకాశవిమానములు బాంబులు యుద్ధములలో జననాశమును దగ్గించుటకు సాధన మగునని దలంచిరి గాని యవి యన్నియడియాసలయినవి. ఇందులకు దృష్టాంతము జర్మనుయుద్ధమే. ఇట్టి యుద్ధములు ముందు జరగునెడల సుందోపసుందయుద్ధములో నిరువురు నశించినట్లు జనమంతయు నశించి ప్రపంచము నిర్మానుష్యమయినను కావచ్చును. ఐరోపాయుద్ధమందు జయము బొందిన యాంగ్లేయులు ఫ్రాంసువారు మొదలగు స్నేహరాజ్యములవారు తమ బలముచే బ్రపంచములో యుద్ధములవల్ల మరణములు లేకుండ చేయగలుగుదు మని మురియుచున్నారు గాని యది వట్టి కల్ల. టర్కీ గ్రీకుయుద్ధము నాపగలిగిరా? లేదు. ముందాపగలుగుటయు నంతే! నిప్పు నీరుచే నార్పబడునుగాని నిప్పు నిప్పుచే నారదు. అట్లే ద్వేషమును ద్వేషము చంపలేదు. శాంతముచే ద్వేషము హరించును. కాబట్టి యికముందు యుద్ధముచే జయించుటకుబదులు శాంతమే జయించవలెను. మన దేశదృష్టాంత

మును తీసికొందము. భరతఖండముపై చిరకాలమునుండి పరదేశవాసులు దండెత్తి నానాబాధలను గలుగజేసిరి. ఈబాధలను తప్పించుకొనుట కనేకయుద్ధప్రయత్నములు చేసియుంటిమి. దానివలన కలిగిన ఫలిత మేమి ? జననాశనముచే మఱింత బలహీనులమైనాము. ప్రస్తుతపరిపాలకులుగనున్న యాంగ్లేయుల ప్రభుత్వము సరిగ లేదని జనులకు తోచినప్పుడు వారిని కాన్పూరు మొదలగుచోట్ల; గొంతులు కోసినారు. ఆంగ్లేయుల నడంచగలిగిరా ? లేదు. బంగాళావిభాగముకొఱకై గాదాలో బాంబులను తయారుచేసి హింసించుటకు బ్రయత్నించినారు. జయించగలిగిరా? లేదు. ఏమికారణము? మనము హింసచేయదలంచినాము. కనుక బ్రభుత్వమువారును హింసచేసినారు. తెల్లవారికి లోబడ్డ దేశములు జపానుకు లోబడ్డ కొరియా మొదలగు అన్ని యస్వతంత్రదేశముల గతి యు నిట్టిదియే. ఆచంద్రార్కము దేశముల గతి యింతేనా? ఎప్పటికైన విముక్తియున్నదా? అట్లున్నయెడల సాధన మేమి ? ఈ ప్రశ్నల కన్నిటికి నొక్కటియే జవాబు. అదేది ? అహింసతో కూడిన అసహాయము. (Non-Roulett, Non co-operation) ముమ్మాటి కిదియే. ఈ యుద్యమము జయము పొంద గలుగు ననుటకు నిప్పుడు ప్రభుత్వమువారు పడుచున్న కల్లోలమే సాక్షి. అకాలీలజయమే సాక్షి. అన్నిటికంటె ప్రథమసాక్షి అసహాయోద్యమ మంత్ర ముప దేశించి జగద్గురు గాంధిగారిని చెరసాలలో నుంచుటయే సాక్షి.

వెంటనే గాని యెప్పటికైనగాని బలహీనమగు జాతులు శాంత స్వభావులగు జాతులు. క్రూరుల బారినుండి విడదలగుటకు సిద్ధౌషధ మిదియే. ప్రపంచములో నందరిలోను బలవంతులమని విఱ్ఱవీగు నాంగ్లేయ ప్రభుత్వమువారితో నిప్పటికి 18 మాసములనుండి పోరుచున్నాము. అనేకకోట్ల క్రుప్పుఫిరంగులు వాయువిమానములు విషవాయువులతో బోరాడిన జర్మనులతో యుద్ధము చేయుట సులభముగ దలంచిన యీ మహాబలులగు నాంగ్లేయులు మనతో శాంతయుద్ధము చేయలేక తహతహ పడుచున్నారు. ప్రపంచమునకు నూతనమార్గము దొరికినది. ఈ సంగతి జగద్విఖ్యాతమయిన సంగతి యనుటకు సందేహము లేదు. ఈ యుద్యమమంత త్వరలో జగమంతట వ్యాపించిన యుద్యమ మింకొక్కటిలేదు. కాన నది ప్రపంచమునకు నొక శకారంభము. దీని కేమి పేరుపెట్టెదము ?

**గాంధిశకము.**

ఈ మహామంత్రోపదేశికు డైన జగద్గురు మహాత్మగాంధిగారే యీ శకాధిపతి. ఈ మహామహుని దివ్యచరిత్రము విపులముగ వ్రాయుట చర్వితచర్వణముకంటిది. కండ్లు గలవారిలో సూర్యునెరుగని వారెట్లు లేరో వివేకముగలవారిలో వీరి నెరుగనివారు వీరి చరితామృతమును గ్రోలనివారట్లేలేరు. ప్రపంచములో జీవించియున్న వారిలో వీ రగ్రగణ్యు లని ప్రాజ్ఞులందఱు ఒప్పుకొనుచున్నారు. చరిత్రలలో దెలసినంతవరకు బ్రపంచములో బుట్టిన మహనీయులలో వీ రొక్కరనుట నిర్వివాదాంశము. యేసుక్రీస్తుపై రాజద్రోహము బోధించిన ట్లభియోగము వచ్చినప్పుడు వారు తా మానేరము చేసితిమని యొప్పుకొనలేదు. కాని వీ రట్లుకాదు. మనుష్యులు చేసిన శాస్త్రప్రకారము నేరముచేసితి ననియు శిక్షార్హుల మనియు వా రొప్పుకొని శాస్త్రము విధించునంతవరకు శిక్షను విధింపుడని కోరిరి. వా రీశిక్ష నెందుకు పొందిరి ? హిందూదేశముయొక్క విముక్తికొఱకే కాకుండ ప్రపంచమందన్ని జాతుల స్వాతంత్ర్యముకొఱకు అన్ని జాతుల స్వరాజ్య స్థాపనకు. కనుకనే వీరిని జగుద్గురు వని చెప్పవలసియున్నది. "యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం" అని భగవద్గీతలలో జెప్పిన యవతారములలో మహాత్ముఁ డొక యవతార మనవచ్చును. కాబట్టి నూతనశకమునకు గాంధిశక మని పేరుపెట్టుదము.

**ఈ శకమును స్థాపించుటవల్ల ప్రయోజనమేమి ?**

ఈ వ్యాసములోని 7 వ పేరాలో నుదాహరించిన ప్రయోజనములే గాక యీ క్రింది ప్రయోజనములు కూడ గలవు.

(అ) ఈ శకము ప్రపంచమునకంతయు నుపయోగించును.

(ఆ) వీరియందు మనదేశమునకు గల గౌరవమును వేయి విధముల చాటును.

(ఇ) వీరి పేరు ప్రతిదినమున దినచర్యలో నుచ్చరింపబడుచుండుటచే ఆయన సర్వదా జ్ఞాపకమునకు వచ్చి యాయనయుద్యమము సర్వదా జనుల మనఃపీఠము నలంకరించును.

(ఈ) ఈ యుద్యమమందు బ్రజలలో నుత్సాహము హెచ్చును.

(ఉ) ఈ మహామహుని పవిత్రనామము వీరి పవిత్రోద్యమము చరిత్రాత్మక మగును.

(ఊ) సుగుణసంపత్తిని తరుచు దలంచుచుండుటచే జనుల గుణములయందు మంచిమార్పు గలుగును.

(ఋ) వీరు మనకు చేసిన మహోపకారమునకు మన కృతజ్ఞతను జూపినవార మగుదుము.

మహాత్మగాంధిగారు కారాగృహప్రవేశమయిన 1922 సంవత్సరము 18 మార్చి తేది యీశకారంభము. కాబట్టి 1923 సంవత్సరం ది

**ఈశకము నుపయోగించు టెట్లు?**

17 మార్చితో ప్రథమసంవత్సర మంతమగును. ఆ సంవత్సరం 18 తేది ద్వితీయ సంవత్సర ప్రారంభము. కాబట్టి ప్రథమ సంవత్సరమందు 365 దినములుండును. ఇంగ్లీషు ఫిబ్రవరి నెలలో 29 రోజులున్నపుడు గాంధి సంవత్సరములో 366 దినములుండును. 1924 సం॥ ఫిబ్రవరికి 29 రోజు లున్నందునను ఆనెల గాంధిశక 2 సంవత్సరములో చేరును గనుకను ఆ సంవత్సరం 366 రోజులు కలిగియుండును. ఇంగ్లీషు ఫిబ్రవరు నెలలో 17 తేదీ లగాయతు గాంధిసంవత్సరం 12 వ నెలలోనగా "తత్త్వమసి" మాసమునందు చేరును గనుక ఫిబ్రవరి నెల కెన్ని రోజులుండునో దాని కన్నిరోజులే యుండును. ప్రతి యింగ్లీషు మాసము 18 తేది గాంధిమాసము 1 వ తేది గాను తర్వాతి నెల 17 తేది ఆ నెలాఖరు తేదిగా గణించునది.

### మాసములపేర్లు వానికి నిర్ణీతమయిన దినములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | స్వరాజ్యమాసము | ౩౧ | మార్చి నెల | 18 | తేదిన ఆరంభించి |
| 2. | శాంతిమాసము | ౩౦ | ఏప్రిల్ | 18 | ఏప్రిల్ 17 |
| 3. | భక్తిమాసము | ౩౧ | మే | 18 | తేదితో అంత |
| 4. | చరకమాసము | ౩౦ | జూన్ | 18 | మగును |
| 5. | అహింసమాసము | ౩౧ | జూలై | 18 | |
| 6. | సర్వసమమాసము | ౩౧ | ఆగస్టు | 18 | |
| 7. | ప్రేమమాసము | ౩౦ | సెప్టంబరు | 18 | |
| 8. | భూతదయమాసము | ౩౧ | అక్టోబరు | 18 | |
| 9. | తృప్తిమాసము | ౩౦ | నవంబరు | 18 | |
| 10. | ధైర్యమాసము | ౩౧ | డిశెంబరు | 18 | |
| 11. | స్వార్థత్యాగమాసము | ౩౧ | జనవరి | 18 | |
| 12. | తత్త్వమసిమాసము | ౨౯ | ఫిబ్రవరి | 18 | |

**ఈమాసము లేమి సూచించును ?**

మొదటిమాసం స్వరాజ్యంనిమిత్తం శిక్షనుబొందుట యనగా స్వరాజ్యసదన ప్రవేశమును 4 వ మాసం ఖద్దరును 1 వ మాసం బంధవిమోచనమును తక్కిన మాసములు మహాత్మా గాంధిగారి సుగుణములను సూచించును.

**ప్రార్థనము**

స్వరాజ్యస్థాపనకై నేను చేసిన చేయుచున్న కృషి స్వల్పము. గాంధిమహాత్ముని శిష్యులలో బోల్చినయెడల నేను కించిజ్ఞుడను. అయినను నా మనస్సాక్షి పురికొల్పుటచే నేను దీనికి ప్రారంభకుడ నగుభాగ్యము నాకు లభించినది. ఈయుద్యమము దీపమువంటిది. నేను దీపము చేఁబట్టుకొని పోయువాడను. వెలుగు నిచ్చునది దీపముగాని పోయువాడు కాడు. పోయువానిగుణముల విమర్శించుట యనవసరము గాన దీని నంద రవలంబించెదరని ప్రార్థించుచున్నాను.

**రెండవసంవత్సరం గాంధిశక పంచాంగము**

రుధిరోద్గారి సంవత్సర చైత్ర శు ౧ రోజున ౧౯౨౩ సంవత్సరము మార్చి ౧౮ తేది యనగా గాంధిశక ౨వ సంవత్సరమున కారంభము. అదియే సంవత్సరాది.

# ఆశాపిశాచము

## రామదాసు గారు

ఎంతటిదానవే గడుసరి మము సిగ్గుల నెన్నొ బెట్టి యా
వంతయుఁ దృప్తిపొంద వహహా । నినుగెల్వగ యోగికైన గో
రంత వశంబె యాత్మసమరంబును గూర్తువు నిన్ను గొల్చినన్
వంతలు దప్ప వెవ్వరికి । వారిజగర్భునకైన తృష్ణ గో.

ఉ. త్యాగము సున్న ధర్మము నధర్మమునుం బరికింపనీయ వు
ద్యోగమొ పాపచింతను నెదో క్రియ నీహ ఫలింపఁజేయుటల్
భోగము సున్న రాగ మనఁ । బోయిక నిస్వరియింపఁజేసినన్
చాఁగిలి మ్రొక్క జేసెదవు । సర్వజనాళికి కార్యసిద్ధికిన్.

ఉ. నీ వొక దయ్యమన్న నది । నిక్కము నిక్కము కాక యుండినన్
దేవుఁ డొసంగువారి గని । తృప్తి వహింపక యన్యకాంక్షచే
జీవము బాముగూర్చి । చెడుచేతల నాత్మ నెఱుంగలేక నీ
కైవసమై త్రపారహితుఁడై చరియించును యెల్లవేళలన్.

సీ. మీరు వొసంగిన । మేలుమే లనుచుండు, కాసు నిమ్మన్నచోఁ । గసరుచుండు
దేశసేవ యటన్న । చూచెద మనుచుండు, పరుల కుపకృతి యనఁ । బలుకకుండు
నీచ మటన్నచో । నేచిక్కి యనుచుండు, ధనప్రాణముల జెంకి । మనుపుచుండు
మోక్ష మటన్నను । మోము విరిచుచునుండు, పరమ పాపమ్మని బిట్టు । పల్కుచుండు

గీ. కోరెనా దేనినైన నేకొలదికైన, వశముచేయక స్వాంతమ్ము । వశముకాదు
నీవు పట్టినవారికో । నీరజాక్షి, ఆశ నిజము పిశాచ మేమన్నగాని.

riyut Sarvabhuta Dayal Anjaneya Dass



శ్రీయుత సర్వభూతదయాళు ఆంజనేయ దాసు

Sriyuta Satavadhanis Chella Pilla Venkatasastry and Kasi Krishnachary



శ్రీయుత శతావధానులు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి కాశీ కృష్ణాచార్యులు

Sriyut Jinwala, Rangoon



శ్రీయుత జిన్వాలా, రంగూను

Canon Rev. D. Anantham, Bezwada



కానన్ రెవరెండ్

[illegible] అనంతం, బెజవాడ

Vidwan K. Seshasastry A V. S.



విద్వాన్ కే. శేషశాస్త్రి ఏ. వి. ఎస్.

Sriyut Babu Moti Lal Rey



శ్రీయుత బాబూ మోతీలాలు రాయి

Professor Hanumad bhakta Belluri Narasimharao



ప్రొఫెసరు హనుమద్భక్త బెల్లూరి నరసింహారావు

Temple Main Tower at Yelamarru Village Gudivada Taluq, Kristna Dt.



గుడివాడతాలూకాలోని యెలమఱ్ఱుగ్రామమునందలి గాలిగోపురము

Arya Vysya Chowltry; Kshemeswaraghat, Benares city



కాశీలో క్షేమేశ్వరఘట్టమునందలి ఆర్యవైశ్యసత్రము

Artist Simhachelam



చిత్రకారుడు సింహాచలం

Sarada Vilasa Readingroom, Antervedipalom



శారదావిలాస పఠనమందిరము, అంతర్వేదిపాలెం

Late Tata Venkata Ramanayya



కీ॥ శే॥ తాతా వెంకటరమణయ్య

# స్వదేశ శాస్త్రీయమైన అనుభవ సాధనములు; వెల సరసము

ఇంకో ఎసెన్సు:—అసలగా సిరాధృతి. 2 ఔన్సులు గల సీసాలు స్టీలు పాళ్ పెన్ పేనాలతో వ్రాయువారికి ఎక్కువ ఉపయోగము. ఈ 2 ఔన్సుల సిరాధృతిలో 24 ఔన్సుల నీరు కలుపవచ్చును. (అనగా 12 వంతుల నీళ్లు) బ్లూ-బ్లాక్ లేక రెడ్ సిరా ధర సీసా 1-కి రు 1—2—0.

ఇత్తడి క్రొవ్వువత్తి దీపములు:—అనేకమాదిరీలు, పలువిధకొలతలలో నున్నవి. సాధారణరకము రు 2-0-0. మర కలిగినది రు 2-4-0, స్పెషల్ స్టాండులు రు 5-0-0, స్పెషల్ గోడకుతగిలించునవి, రు 5-4-0. సగమువత్తి స్టాండులు రు 2-8-0, గోడకు తగిలించు రకం రు 3-0-0. రెండు కలిగినవి రు 8-0-0. 5 స్టాండులు కలిగినవి రు 25-0-0, స్ప్రింగ్సు 3 సం॥ల గారంటీ. Pencil Stand for Colone Candles Rs. 1-0-0.

పన్నీరు:—యంత్రసహాయమువలన మూమ్ముడు వడియకట్టినది. సీసా 1-కి ధర రు 1-8-0.

## టి. కె. గజ్జారుగారి సుప్రసిద్ధమైన కుటుంబ ఔషధములు

మహామ్మారి ద్రావకం 0-10-0, కలరా ద్రావకం 0-10-0, మలేరియా ద్రావకం 0-10-0, ఇన్ఫ్లూయెంజా ద్రావకం 1-0-0. దగ్గుమాత్రలు 0-8-0, తామరతైలము 0-5-0, మూలశంకతైలము 0-5-0, పాముకాటుమందు 1-0-0, తేలుమందుసాల్యూషన్ 0-5-0, మంచి టానిక్ మందులు, పండ్లపొడి రకములు, అత్తరువులు ఇంకను మీకు ఏరకములు కావలసినను సప్లయిచేయబడును. మంచి రకములు గ్యారంటీ చౌకధరలకు పంపెదము. బిడ్డలకు బాలామృతము, హీలింగుబాం, స్నానతైలములు, వెంద్రుక తైలములు. N. B. వర్తకులకు చౌకధరలకు ఇయ్యబడును.

N. P. We undertake to supply all kinds of goods to merchants.

**ఎస్. వైద్య అండు కంపెని,** నెం. 6, బందరువీథి, మద్రాసు. **S. VAIDYA & Co.,** No. 6, Bunder Street, MADRAS

# చదువదగిన ప్రకటన

## శ్రీ సీతారామాంజనేయ సంవాదము

టీకాతాత్పర్యసహితము రు 3-4-0

వసుచరిత్ర:—రు. 4 ప్రబోధచంద్రోదయము రు 2, శృంగారనైషధము రు. 3. ఆంధ్రరఘువంశము రు.1. రాఘవపాండవీయము రు. 2.

బాలురపుస్తకములు:—సావిత్రి - సులోచన - కౌసల్య- దమయంతి- ప్రహ్లాద- అంబరీష- ధ్రువ- విశ్వామిత్ర ప్రతి 1 కి రు 0 1-6, తోటదినచర్య- పాఠశాలలందు తోట పని నేర్పుటకును ప్రతివిద్యార్థికిని నుపయుక్తమైన పుస్తకము ప్రతి 1 కి రు 0-3-0, శంకరవిజయము, చంద్రరేఖ, ప్రతి 1 కి రు 0-8-0, కాదంబరిలోనిది- చంద్రపీడజననము రు 0-8-0.

ఈ పుస్తకములే కాక స్కూల్లకు వలయు సమస్తగ్రంథములు, (లైబ్రరీ) పుస్తకములు, నోటుబుక్కులు, ఫౌంటన్ పేనాలు సరసమైన వెలలకు సకాలమునకు బంపెదము.

యస్. వేంకటరాయలు అండు సన్,

87 రామస్వామివీధి, ముత్యాలపేట, మద్రాసు.

# వేగుంజుక్క గ్రంథమాల

| ఇదివరకుప్రచురింపబడినగ్రంథములు | చందాదారులకు | | | ఇతరులకు | | |
|---|---|---|---|---|---|---|
| 1. ఉషఃకాలము | 1 | 8 | 0 | 1 | 8 | 0 |
| 2. వాండేవీండు | 1 | 0 | 0 | 1 | 4 | 0 |
| 3. ప్రేమము | 0 | 8 | 0 | 0 | 12 | 0 |
| 4. సుహృల్లత | 0 | 12 | 0 | 1 | 4 | 0 |
| 5. పద్మినీపరిణయము | 0 | 1 | 0 | 1 | 4 | 0 |
| 6. విలాసార్జునము | 0 | 8 | 0 | 0 | 12 | 0 |
| 7. సగుణ (మొదటిభాగము) | 1 | 4 | 0 | 1 | 8 | 0 |
| 8. ,, (రెండవభాగము) | 0 | 10 | 0 | 9 | 12 | 0 |
| 9. ,, (మూడవభాగము) | 0 | 10 | 0 | 0 | 12 | 0 |
| 10. క్రొవ్వుడాళ్ళు | 1 | 0 | 0 | 1 | 4 | 0 |
| 11. వేంకటరావు | 1 | 0 | 0 | 1 | 8 | 0 |
| 12. నేనే. వాండేవీండునకు 2-వ భా॥ | 1 | 0 | 0 | 1 | 6 | 0 |
| 13. కోటీశతనయ (నిరూపకనగల) | 1 | 0 | 0 | 1 | 4 | 0 |
| 14. కాలూరాయ | 1 | 4 | 0 | 1 | 8 | 0 |

116/-,58/-,29/- బహుమానమొసగిన పరీక్షాపఠనీయగ్రంథము. (1923 సం॥ మే- జూన్- నెలలలో జరగబోవు బహుమాన పరీక్షా పఠనీయగ్రంథము.) 'వాండే వీండు.' 'నేనే' లతరువాయికథ.

VEGU-JUKKA OFFICE, BERHAMPORE, 9th Sept. 1922, } **D. V. Krishnarao,** *Secretary.*

## గర్భామృత చూర్ణము

ముఖ్యముగా స్త్రీలకు మిక్కిలి యుపయోగమైనది. స్త్రీల గర్భాశయముయొక్క బాధలను నివర్తించి గర్భధారణశక్తి నిచ్చుచున్నది. అత్యార్తవము, దుఃఖార్తవము అల్పార్తవము మొదలగు దూషితఋతువును బాగుచేసి ముట్టును క్రమముగ తెచ్చును. వంధ్యాదోషము మృతవత్సాదోషము మొదలగువాటిని వశింపజేసి పుట్టుసంతతిని చక్కగా పోషించి కాంతిగలదిగా చేయుచున్నది. గర్భిణీస్త్రీలు ఈయౌషధమును పుచ్చుకొనిన యెడల పుష్టియును ఆరోగ్యమును కలిగినశిశువు పుట్టును. బిడ్డలులేని స్త్రీలు ఈ యౌషధమును పుచ్చుకొనిన యెడల బిడ్డలు పుట్టుదురు. ధర తులములు పదికి రూ. 2-0-0

## బాలపుష్టికరణ వటిక

బిడ్డలకు సంజీవివంటిది.

ఈ అద్భుతమయిన యౌషధము బిడ్డలయొక్క జీర్ణశక్తిని క్రమపఱచి జ్వరము, కాలునొప్పి, ప్రక్కనొప్పి, దగ్గు, కడుపునొప్పి మొదలగు బాలుర వ్యాధులను చక్కగా ఖండించి, మన్ను తినుటవలన పుట్టుదోషములను అడుగుతో నిర్మూలించి దేహమునకు బలము, కాంతి, ఆరోగ్యము తెచ్చును. మఱియు ఇది బిడ్డకు మహత్త్వమున్న, శక్తియును యిచ్చి ఆరోగ్యముగా నుండునట్లు చేయుటకు ప్రసిద్ధిచెందిన యౌషధము. ఇది ఒకటే కాబట్టి తమబిడ్డలయొక్క మేలును వ్యాదగులంచింటిన తప్పక యీ యౌషధమును తమబిడ్డలకు ఉపయోగించవలెనని శిఫారసు చేయుచున్నాము. ధర 120 మాత్రలకు రూ. 1-0-0

## మేహామర్దన చూర్ణము

ఈచూర్ణము పుచ్చుకొనిన మూడుమూడుజాలలోనే మూత్రముందలి మంటలు నిలిచిపోయి నీరు ధారాళముగా దిగును. మరియు చాలకాలముగా దేహమంతట వ్యాపించియుండు వెవ్వేలు ప్రమేహరోగములన్నియును స్వల్పకాలసేవనంబుచేతనే నశించుచున్నవి. అట్లే కాకసంబంధమైన నొప్పులు దీనియుపయోగముచేత తీరును. ధర తులాలు 10-కి రూ. 1-0-0

## అనంగ ప్రభాయాకుతి

శీలాధారమైన ఈయాకుతి, కస్తూరి, బంగారుతగడు మొదలగు అధిక వెలగల వస్తువులచే చేయబడి యున్నది. అనేక ధనికులు, మహారాజులు, రాజులు, జమీందారులున్న ఇతరులున్న ఈమందును చాలకాలమునుండి వాడుచున్నారు. వారు ఈమందుయొక్క లాభమును అందురును పొందునట్లు చేయవలెనని ప్రేరేపించినప్రకారం మేము ఇప్పుడు ఈమందును ప్రచారము చేయుటకు తలచినాము. 60 మా. డబ్బి క్రయ రూ 10-0-0.

రాజవైద్య నారాయణజీ కేశవజీ,

27 చైనాబజార్, మదరాసు

## విస్మృతకవులు

సకలనీతిసమ్మతము:— పడికిపింగళి కార్యసంకలితము 1-8-0

అర్థశాస్త్రము:— సుప్రాముఖ్యాది గ్రంథములలో నుండి పద్యములు చెప్పబడెను.

కుమారసంభవము-రెండుభాగములు 2-4-0

క్రీడాభిరామము-శ్రీనాథకృతము 1-0-0

శ్రీరంగమహాత్త్యము 1-0-0

సంస్కృతగ్రంథములు (నాగరాక్షరముద్రితము)

చతుర్భాణీ:-విచిత్రవములకు వాలుప్రాచీనభాణములు 2-0-0

కుందమాలా:—(దిఙ్నాచార్యకృతము ఉత్తరరామాయణకథ చాలరసవంతము } 1-8-0

చెన్నపురి టంకసాలవీధి 336 నెంబరింటిలో మా. రామకృష్ణకవి గారియొద్ద లభించును.

## మమ్ములనొకసారి పరీక్షింపుడు

"మొదటిరకము గుణము ఆహారము"

నలుగగొట్టబడిన ఆస్ట్రేలియన్, మీరట్ ఓట్లు, ప్రత్యేకముగా అన్నియు కలుపబడి నలుగగొట్టిన ఆహారము, గోదుమరవ్వ, ఉలవలు, ఆస్ట్రేలియన్ కసువు, అమృతసంజీవిని బ్లడ్‌సాల్టు అను మంచి ఆరోగ్యము నిచ్చు పొడి మున్నగువాటిని ఒకసారి కొని పరీక్షింపకోరెదము.

ఉత్తరము వ్రాసిన ధరలపట్టీ పంపబడును.

అమృతసంజీవి అందుకో

నెం 3, నారాయణనాయకన్ వీధి,

సోమశేశ్వరం పేట, మద్రాసు.

# SHARBET AKSEER OR THE INSURANCE OF LIFE.



## Interesting dialogue. (refering the above picture.)

OLD MAN.—" Why are you laying yourself down on the rails behold, the train is coming and you will be run over and killed in a moment."

YOUNG MAN.—" Go away, Go away, O, Old man I am quite tired of my life, and now I want to make an end of my life."

OLD MAN.—" Well, what is the matter with you, and why you are giving your life it will never come back again—so come,on, and don't be foolish."

YOUNG MAN.—" No, No, I will not give the idea of killing myself, O, Old man, I cannot,—I really cannot, tell you what is the wrong with my life."

OLD MAN.—" Young fool, tell me every thing, I am an old man and have much experience than yourself, it is quite possible I may relieve you of your misseries and troubles."

YOUNG MAN.—" Well, then, if you are inclined to hear my pathetic story, I shall tell you all, I have been suffering from spermottoreah, loss of vigour. Discharges unwillingly and unfeelingly at night or at tools. This disease has ruined my life since my early youth, and during the past two years I have undergone the bittest experience of hardships and miseries, O, Old man, if you will cut out any part of my body you will not—surely, will not find a drop of blood. My parents do not know of all these, and they are going to marry me tomorrow, with a pretty young girl. Ah ! Alas ! I shall be no good to the poor girl, I will rather simply ruin her whole life as I have ruined myself. Now, let me die, and let me be free of all these, troubles."

OLD MAN.—" Come on, Come on, I tell you my child, I have also been one of the sufferers of the same disease as yourself, and I used this Valuable Medicine Sharbet Akseer, it relieved me like magic. It saved me from the hands of death because I also oncet ried to kill myself."

YOUNG MAN.—" Again the medicine ! No, I will not take it, I have spent thousands of rupees and have used hundreds of medicine, but they all failed to do me any good. I tell you O ! leave my hand and let me die."

OLD MAN.—" Well, just believe my words, try this medicine, this has cured me, and will cure you also, it is not medicine but a divine gift. Try this a week and if you are afraid of your marriage, just postpone it for a time. During the course of the first week you will see by yourself, what marvallous effects has been obtained by this medicine, then use it for sometime and you will get permanent cure."

YOUNG MAN.—" Alright, I am believing your words, I will use it I have heard the name before and I know that it has cured many of my friends but unfotunately I have not used up to now. My conscience says I will be cured by this Sharbet Akseer, but first tell why do you keep this medicine with you."

OLD MAN.—" When I was 36 years old I got this disease and after nine years I got this medicine from a holy man, and after I have been cured, I keep some phials of Sharbet Akseer always with myself. I am now 74 years old and am distributing free since last 29 years this Sharbet Akseer to sufferers of this disease whom I met. This medicine produces blood, gives strength, and the retentive power."

YOUNG MAN.—" But when I will finish this one phial? where can I get this medicine,"

OLD MAN.—" Well just drop one letter to MESSRS. S. A. B. BAKHSHI & Co , Post Box No. 114. 70 Colootola Street, Calcutta. They are the sole manufacturers of this Sharbet Akseer, and they will send you per V. P. P. The price of each phial is Re. 1 only. Packing and Postage extra.

Sole Inventor & Manufacturers,

## S. A. B. BAKHSHI & Co.

(A) Post Box No 114, [No 70, Colootola Street, CALCUTTA.]

*Notice* ! All Communications must be written in ENGLISH.

# శిశుకల్పనాశక్తి

కె. హెచ్. వి. యన్. నారాయణ గారు, బి. ఏ., యల్. టి.

చిన్నపిల్లల చిత్తవృత్తులు చిత్రములుగా నుండు నని తల్లిదండ్రులకేగాక శిశువులతో నేపాటిసంపర్కముగలవారికైనను తోపక మానదు. శిశువు లెక్కువగ నూహాప్రపంచమందే వసించి దానినే వారి యానందమునకు నాధారము చేసికొనుటచే వారు సుషుప్త్యవస్థయందున్నవారివలె నుందురు. వారిచేష్టలు పలుకులు వీనిమూలమున ఈయంశము మనకు గోచరించును. ఇందు వివాదాంశ మెంతమాత్రము లేదు. వారి చిత్తవృత్తులు వివిధగతుల మెలంగుటచే నవి మనపరిశీలనమునకును ఆలోచనమునకును ఆస్పదములుగ నున్నవి.

ఒకపిల్ల యొరులు తీయువఱకును కూర్చుండబెట్టిన చోటనే కూర్చుండియుండును. ఇంకొకపిల్ల తనతల్లి విసుగుకొనునంతటి యల్లరి చేయును. వేఱొక పిల్ల గంతులు వేయకుండ కొంతసేపయిన నుండ లేదు. మఱొకపిల్ల వసపోసిన పిట్టవలె వాగుచునే యుండును. కొందఱేడ్వకుండ నుండనే యుండరు. ఇకకొందఱు ఎంత నలిపినను నవ్వుచునే యుందురు. వేఱొకకొందఱెప్పుడు తీక్ష్ణముగ యోచించుచుందురు. మఱికొందఱు ఆటపాటల మఱిగి బువ్వమాటయే మఱచి తల్లిపిలచినను 'రాను, పో' అనుచు నాటలదృష్టినే యుందురు.

ఇట్టిభేదములు కానవచ్చినను ప్రతిశిశువు నూహాప్రపంచమందు కొంతకాలమయిన నుండక మానదు. కాని కొందఱ కీయూహా మిక్కుటముగ నుండి కొన్నియేండ్లవఱకును నుండును. సామాన్యముగ శిశువులు తాము చూచుచున్న వస్తువులను యథారూపముగ గ్రహింపరు. పిట్టకథలను వినినప్పుడును చిత్తరువులను చూచినపుడును వారి యందలి యూహాలువిజృంభించి వారి నానందమున మునుఁగునట్లు చేయును. ఈశైశవస్వభావము కొన్నిపట్టుల యేండ్లువచ్చినవారియందును గాంచనగును. వారి యెడల నుండు ఇట్టి శైశవస్వభావమును చూచి 'కుఱ్ఱతనము' 'పిల్లాటలు' మొదలగు మాటలను కొందఱు వాడుచుండుట మన కెఱుకయే.

బాహ్యప్రపంచమునకును ఊహాప్రపంచమునకును సంబంధము లేకపోలేదు. బాహ్యప్రపంచజ్ఞానము ఊహాప్రపంచజ్ఞానమున కాధారమయి యున్నది. ప్రపంచమందలి వస్తువులను వాని గుణములను మేదస్సు పంచేంద్రియములమూలమున గ్రహించుచున్నది. ఇట్టిగ్రహణశక్తి మేదస్సునకు మాత్రమే కలదు. దీనికే ఆలోచనశక్తి కూడ గలదు. శిశువులకు జన్మకాలమున మేదస్సున నూహాపోహము లేవియును లేక శుభ్రఫలకమువలె నుండును. బాహ్యప్రపంచము పంచేంద్రియములు మేదస్సునివి ప్రతిశిశువునకు సమానము లయి యుండుటచే జననకాల మాదిగ కొంతకాలమువఱకు వారి యూహాలు ఒకేరీతిగ నుండు నని మన మనుకొనవచ్చును. కాని లోకానుభవము వేఱురీతిని చూపట్టుచున్నది.

సమానవయస్సు గల పిల్లలను దీపావళినాఁడు బాణసంచాను గాల్చుచోట నిలువఁబెట్టినచో నొకపిల్ల బాణముఁ ధామ్మని ప్రేలినతోడనే అమితానందమును బొంది గంతులు వేయును. ఆశబ్దమును వినినతోడనే గుక్కపట్టి యేడ్వసాగును మఱొకతె. కాని యీపిల్లకు మతాబుల గాల్చిన పట్టరాని సంతోషము. వీనివైపున కయిన మొదటిపిల్ల చూడక ధామ్మని శబ్దించు బాణములనే చూచుచుండును. జట్కాబండి పోవుచో దానిని చూచు పిల్లలలో నొకడు గుఱ్ఱము వడిగా పోవుటను చూచి యాశ్చర్యపడును. ఇంకొకడు ఆకుపచ్చనికప్పుపై వేయబడిన చిత్రమునే అవలోకించుచుండును. వేఱొకడు చక్రభ్రమణమును దిలకించుచు దాని శబ్దమునే వినుచుండును. ఒక్కొకబాలున కొక్కొక్క యింద్రియము సూక్ష్మముగ నుండును. ఆ యాయింద్రియములద్వారా బాలురు జ్ఞానమును త్వరగలో గ్రహింపగలరు.

మేఘములను జూపి మూడేండ్లవయస్సుగల పిల్లల నిది యేమి యని యడిగినచో వాన పొగ యనియు జెండా యనియు బూచివాఁ డనియు వివిధనామముల ప్రయోగించి చెప్పుదురు. ఇటుల నొకేవస్తువు పిల్లల యందు వేర్వేఱు భావములను అపేక్షలను ఊహాలను జనింపఁజేయుచుండును.

అయినను పిల్లలందఱకును సామాన్యముగ ప్రీతిని గలుగఁజేయునవి అనేకము లున్నవి. 'అనఁగా ఒకరాజు ఆరాజు కేడుగురు కొడుకులు' ఈకథను ఎన్నిమారులు చెప్పినను శ్రద్ధగా విని-చీమచెప్పు జవాబువద్దకు వచ్చుసరికి నవ్వకుండ నుండగలిగిన పిల్లను నేను జూచియెఱుఁగను. ఈచిన్నకథలో నెన్నో భావప్రదర్శనము లిమిడియున్నవి. ఎన్నియో వేర్వేఱు ఊహాలను త్వరితముగా పుట్టించు విషయము లిందున్నవి. రాజుతో ప్రారంభమయి చీమతో అంతమయినది ఈకథ. ఈమధ్య ఎన్ని వస్తువులు కార్యములు గుణములు ప్రదర్శింపబడినవో! ఎక్కువ విషయముల గ్రహించు నభిలాష పిల్లలకుండుటచేత వారు ఒకదానిమీదనే బుద్ధిని నిలుపలేరు. వేర్వేరు విషయముల నొకదానివెంట నొకటి ప్రదర్శింపబడుటచేత వానిని బాలుడు చుఱుకుగా గ్రహించును. ఈ చుఱుకుదనమే కుతూహలము పుట్టుటకు కారణము.

శిశువుల యూహాలు వారు గ్రహింపబోవు వస్తువుల తత్వమును బట్టియే గాక వారివారి నైజగుణములనుబట్టికూడ నుండును. ఇట్టి స్వభావము కొంతవరకు పైతృకమైయుండును. ఇంతియేగాక నేదైన నొక వస్తువును శిశువులు చూచినపుడు తత్కాలమున వారిమనస్సునందేయేయూహాలు ఆక్రమించియుండునో వానినిబట్టికూడ ఆవస్తువుల గుణములను వారు గ్రహింతురు. వయస్సువచ్చినవారియెడలగూడ నై

విషయములు వర్తించును. అర్ధరాత్రివేళ వీథివెంబడి హోరని వర్షము కురియుచున్నపుడు హరిశ్చంద్రనాటకమును జూచి యింటికి వచ్చుచున్నవానికి దూరమునున్న మ్యునిసిపల్ దీపము కొఱవిదయ్యమువలె కనబడవచ్చును. ప్రియమిత్రునిరాకకై నిరీక్షించుచు కూర్చుండియున్నవానికేమాత్రము తలుపుచప్పుడయినను తనస్నేహితుడే వచ్చెనని యనుకొనును గదా! కొందఱుబాలురు సుందరమై యాహ్లాదకరమగు వస్తుచయముతోనే దినమంతయును నాడుకొనుచు నానందించుచుందురు. మఱికొందఱు సాధారణముగ చీమ మొదలగువానిని హింసించుటయం దాసక్తి గలిగియుందురు.

పిల్లలయం దన్నిటికంటెను ఎక్కువఅద్భుతముగ మనకు గనిపించునది వారి కల్పనాశక్తి. దానినే కవిత యనవచ్చును. "ఏనాడీశ్వరుడు ప్రపంచమును నిర్మింప సంకల్పించెనో ఆనాడే కవిత్వ ముద్భవించినది." ఆకవితాశక్తి మెండుగానున్న శిశువులయందు దేవుడు రూపునంది యున్నాడని చెప్పుట యుచితమే కదా!

శిశువులకు వారి చుట్టుపట్టులనుండు వస్తువులనుగూర్చి నేర్చుకొనవలయునను కాంక్ష మెండు. మనకు చెప్పుటకు ఓపిక శిశుమానవృత్తిని గ్రహింప శక్తియు నుండవలయునే గాని శిశువులు 'అదియేమి, ఇదియేమి?' అని విసుగు విరామములేక ఆశ్చర్యమును ప్రకటించు చూపులతో ప్రశ్నించుచునే యుందురు. ఇంద్రియములద్వారా తెలియబడు వస్తుసముదాయమును గుఱించి నేర్చుకొను కాంక్షతోపాటు క్రొత్త వస్తువులను వెదకికొను కాంక్షకూడ హెచ్చుగ కలుగును. అందుచేతనే పిల్లల యింద్రియము లెక్కువచురుకుగా నుండును. ఇంతియేగాక నొక యింద్రియముచే నెఱిగినదానిని మఱియొక యింద్రియమూలమున నెఱుగవలయుననికూడ వారు ప్రయత్నించుచుందురు. చూచినవానినెల్లను తాకబోదురు తాకినవానిని రుచిచూడబోదురు. దక్కా నొకదానిని మన చేతిలోనుండులను పిల్లలె చూచిన దాని నందికొన చేతుల జాచును, తనచేతుల బట్టికొని నోట బెట్టుకొనును. పిదప చేతతట్టిగాని నేలపై గొట్టిగాని శబ్దమును విననూచును. వయస్సు వచ్చినకొలది లోకవ్యవహారములయందు తగిలియుండుటచేత మనమున నిట్టి కోరిక యడుగంటును. పసిపిల్లలకు లోకమునం దన్నియు సమానమైన యాశ్చర్యమును గొల్పును. ప్రతివస్తువు పిల్లలవాంఛను తీర్చుటయందు వారి కుపయోగించును. కనుక నవి యన్నియును వారికి చెలికాండ్రే. వాని నన్నిటిని శిశువు ప్రేమించును. రాను రాను ఐహికోపయోగమును బట్టి వాని వేఱుచేయ నుపక్రమించును.

కవియందు ప్రజ్వలించు ప్రేమ శిశువులందు నిష్కళంకమై తనరుచున్నది. క్రమక్రమముగా పరవస్తువులనుండి ప్రేమను తొలగించి తన్నుదా ప్రేమించుకొన నేర్చుకొనును. ప్రేమపూరితము లగు హృదయములు గల యిట్టిశిశువుల మఱుపుదనమును గ్రహించి యానందించు మహాభాగ్యమును విడనాడి అల్లరిచేయుదు రను మిషచే వారి నెత్తుకొని యాడించుటకై నిరంతరము దాదులకు ఒప్పగించు తలిదండ్రులను జూచిన జాలి పుట్టకమానదు.

శిశువు వస్తువులను గ్రహించునపుడు వానిలో వాని కేదేని సంబంధ ముండిన దాని శీఘ్రముగ కనిపెట్టును. ఒకవేళ సంబంధ మంతగా లేకపోయినను దానిని కొంతవఱకు కల్పించుశక్తికూడ శిశువునకు కలదు. ఇట్టిశక్తి శిశువునకు నైజమయియుండవచ్చును. లేక యావశ్యకతను బట్టి యది గలుగవచ్చును. పరస్పరసంబంధముగల వస్తుచయమును జ్ఞప్తియందుంచుకొనుట, అట్టిసంబంధము లేనివానిని గ్రహించుటకంటె మిక్కిలి సులభము. ఇంతియేగాక ఏదేని ఒకవస్తువును తెలిసికొనినపిమ్మట దానికి సంబంధించినవానిని గ్రహించుట సులభము. గనుక అట్టిసంబంధమును కలుగజేసి యయినను లోకమందలి పదార్థముల నొకదానివెంబడి నొకదానిని తెలిసికొన శిశువు ప్రయత్నించును. పెద్దతుల్లిపాయను చూచి అది బొంగరమని తలచి త్రిప్పుచుందురు. ఉసిరికకాయలతో పిల్లలు గోలీలయాట నాడుదురు. వస్తువుల యాకారమందలి పరస్పరసంబంధమునుబట్టి వానిగుణములందును అట్టిసంబంధము గల దని యూహించును శిశువు. బ్రహ్మజెముడుపొదను జూచిన నది జడిసికొనును. దీనియందు క్రౌర్యభావము శిశువునకు స్పష్టపడునేమో!

క్రొత్తవస్తు వేదేని మనము చూచినపుడును దానియందు ఇదివఱకు మనము చూచియున్న వస్తువును బోలియుండు భాగమే మనమనస్సునకు మొదట తట్టును. పిమ్మట తదితరభాగములు పొడగట్టును. అటులనే శిశువులయందును కానివస్తువులందలి వ్యత్యాసమును గురుతించు శక్తి శిశువుల కంతగా లేకుండుటచేత పలువస్తువులను వారు ఒక్కపేరిటనే పిలుచుట తటస్థించును.

శిశువు నెఱిగియుండు వస్తువులు కొన్నియే యై యుండును. కాన అది క్రొత్తగా గ్రహింపబోవు వస్తువునకును పూర్వ మెఱిగియున్న వానికిని సులభముగ సంబంధ మేర్పఱుపగలదు. వయసు వచ్చుకొలది శిశువు గ్రహించినవస్తువులసంఖ్య హెచ్చుచుండును గాన ఇట్టిపోలికలను కనుగొనుట అంతగ సాధ్యము కాకుండును.

శిశువులకు వస్తువులలో కొన్ని వాని యాకారముచేత గాని, రంగుచేతగాని రుచిచేత గాని ఇంపుగొల్పి వారిమనముల నాకర్షించును. వానిని కుతూహలముతో ప్రథమదర్శనముననే గ్రహింతురు. ఇట్టివానితో సంబంధము కల్పించి మిగిలినవానిని గ్రహించును. వస్తుజ్ఞానము వృద్ధియగుటకు ఇది యొకమార్గము.

ఇట్లు గ్రహించిన క్రొత్తవస్తువులకు వచ్చియురాని మాటలతో పేళ్లు పెట్టినపుడు శిశువు తా నిదివఱకు గ్రహించిన యేవస్తువుతో మెండుగ నుండునో దానిపేరనే నూతనవస్తువును పిలుచును. ఇట్టిపేళ్లు చాలవఱకు మిక్కిలి యుచితముగ నుండును. కవులు వర్ణనలలో నుపయోగించు నలంకారములు తమంతటతామె అప్రయత్నముగ శిశువులందు వెలువడుచుండును. సంధ్యాసమయమందు ఆకాశమందున్న ఎఱుపురంగును చూచి జేగురుమన్ను అని పిల్ల నుడివి యెవ రచ్చట దానినుంచిరో యని యోచించును.

మూడునాలుగేండ్లవయసు గల్గినపిల్ల ప్రాతవస్తువునకును క్రొత్తగ చూచిన వస్తువునకును భేదమును గమనించి యీరెండువస్తువులు నొక

టీకా వనితయు క్రొత్తది ప్రాతదానిని పోలియున్నదని గ్రహించి ఉపమాలంకారమును ఉపయోగించి మాట్లాడుచుండును. తెలుగు అక్షరములలో 'అ ఆ' లను తొట్టిపడవలని పిల్లలు పిలుచుట కలదు. కొంతకాలమయినపిమ్మట 'అ ఆ' లు తొట్టిపడవలవలె నున్నవని చెప్పుదురు. కొన్నివస్తువులను సంజ్ఞలను జంతువుల పిలుచునట్లు పేళ్లుపెట్టి పిలుచుటయుకలదు 'ఒ ఓ' లను కొంగలనియు, 'ఋ' అను అక్షరమును రైలుబండియనియు కొందఱు పిల్లలనుట వినియుందుము. 'ఱ' ను 'బండిఱ' అనుటకు కారణ మూహింపవచ్చును.

తరగతులుగా వస్తువులను విభజించి యేర్పఱచు నవస్థ తరువాతిది. ఒక్కొకప్పుడు శిశువులు కనిపెట్టు పోలికలు మిక్కిలి దుడుకుగా నుండును. నక్షత్రముల జూచి దేవునికుంపటినుండి వచ్చు నిప్పుకణములని ధైర్యముగా చెప్పుట శిశువుయొక్క గుండెనిబ్బరమును చాటించి మన కాశ్చర్యమును గొల్పదా! వర్షముకురిసి వెలిసినపిమ్మట చెట్లయాకుల నుండి నీటిబొట్లు కారుటచూచి చెట్లు ఏడ్చుచున్నవని శిశువు భావించి కరుణరస ముట్టిపడుచూపులతో దానివైపు దృష్టి నిల్పి చెట్టుయొక్క విచారమునుబాపు తలంపుతో ఏల యేడ్చుచున్నదని ప్రక్కనున్నవారి నడుగుట గలదు.

అర్థాలంకారములే కాకుండ శబ్దాలంకారముల సయితము పెక్కుమంది శిశువు లుపయోగింతురు. ఇతరులు వాని నుపయోగించిన గ్రహించి యానందింతురు. పదములమాదిరి పదములగూర్చి సందర్భానుసారము ప్రయోగించుశక్తికూడ వారికిగలదు 'దాయి దాయి రావే!' అన్నపాటలో 'వెండిగిన్నె తేవే' అని తల్లి చెప్పుచుండగా మూడేండ్లపిల్లయొకతె 'మొండిచేట తేవే' అని చెప్పి నవ్వెను. వెండిగిన్నెకంటె మొండిచేటయే ఆపిల్ల తఱుచు చూచుచుండుటచే గాబోలు నట్లనెను! 'మంగళహారతీయవే' అని పాటఁ బాడుచుండగా మజ్జిగనమ్ముమనిషి లోనికివచ్చుటను జూచి 'మజ్జిగనా డడుగోనే' అని వెనుకపాటలో కలిపిపాడెను మూడుసంవత్సరములు గడచినపిల్ల.

మత్తకోకిల కవిరాజవిరాజితము తరల మొదలయిన వృత్తముల మనము చదువునపుడు పిల్ల లతిజాగ్రత్తతో వానిని వినుచు సక్రమముగ లయవేయుచు దల నూచుచు కనుపాపల కదల్చుచు నృత్యముచేయుటకూడ కలదు. కొన్ని అక్షరములధ్వని పిల్లల నెక్కువగ నాకర్షించును. 'లాంతరు' అనుటకు బదులు 'తీంతరు' అనుట కొందఱు పిల్లలకు సులభముగ కనిపించును. కొందఱు 'చీకటి' కి 'చీటకి' అందురు. అట్లు కాదని ఎంతచెప్పినను ఆపదములనే యుపయోగింతురు. ఎందుచేతనో!

కీచుపిట్ట యని విసుగుచేత నొకపిల్లను పిలిచిన అది ఎంతయో సంతసించి ఆమాటనే తరుచుగా కొన్నిరోజులవఱకు ఆనందముతో ఉచ్చరించుచుండుట నే నెఱుగుదును. 'కీచు కీచు' మని ధ్వని ఈపదమున నుండుటయే దీనికి కారణమయి యుండనోపు.

ఊహాప్రపంచమందలి త్రోవలు కొన్ని మన కగమ్యగోచరములని మన మొప్పుకొనక తప్పదు. ఒకమనిషియొక్క పేరును మనము వినినప్పుడును పుస్తకములందు చదివినపుడును వాని యాకారము మనమనస్సునకు స్ఫురించును. కాని యందఱికిని ఒకేవిగ్రహము స్ఫురింపక పోవచ్చును. శిశుస్థలయం దింతకంటెను వైపరీత్యములు పొడగట్టును. శబ్దముల వినిన రంగును రంగును చూచిన రుచియును రుచినిబట్టి భావమును శిశువుల మనస్సులకు తోచునని వారివిషయమయి తలపోసినవా రెఱుగకపోరు. పూర్వవస్తువుతోసంబంధము కలుగజేయు శక్తియే యిట్టి యూహలకు కారణ మయి యుండవచ్చును.

ఒక్కొకప్పుడు శిశువులందు కల్పనాశక్తి మితిలేని దయి యుండి వారల భ్రమింపజేయును. ఒకపిల్ల ఆర్ద్రపురుగును చూచి దానిరంగు, కచ్చెరువంది ఆనందాబ్ధిని మునిఁగి భ్రమించి దాని నోట వేసికొనె నట

ఇట్లు ఊహాప్రపంచమందు విచ్చలవిడిగసంచరించు శిశువులజూచి మనమే యానందమును బొంద, స్వయముగా ననుభవించు శిశువులయానందమునకు మేరయుండునా ? వారికి వయసు వచ్చినకొలఁది ఐహికబంధము లెక్కువయి బిగు వగును. వారినిఊహాప్రపంచమునుండి తొలగించి ధనము కీర్తి సౌఖ్యము - వీనిసంపాదనమందె వారిమనస్సును లగ్నము చేయించును. బ్రదుకుతెరువుల వెదకుటయందు ఇచ్ఛ యెక్కువగును. కఠినమైన ప్రపంచవ్యవహారముల నెఱిగి వానినాచరించు వారంతో సాంగత్య మెక్కువైనకొలది శైశవమునందలి కల్పనాశక్తి క్షీణించును.

# బాలెంతరాలు

సాహిత్యసరస్వతి సీకిపి ఆంజనేయులు గారు

వ్రాసము లైన కాలగతి । మాసెను జీవిక చెల్లె నక్కటా! వ్య
త్యాసము చేసెఁగాక రుజ; । యాతన లన్నిటినిన్ సహించి, నీ
కోసము కాదె ప్రాణములఁ । గూడ భరించుట యింతదవ్వు, నా
యాస నిరాశ యయ్యె; జగ । మంతయు శూన్యము కా సుతాగ్రణీ!

మ. పదుమూఁడేఁడులు నిండె నే గృహిణి నై । ప్రార్థింపఁగా లేదు నె
మ్మది నొక్కింతయు నేని సంతతికినై; । మాకుం బ్రియం బొప్ప నీ
వె, దయాతత్పరతం గుమారు నిడి, యెం । తే మోదమున్ గొల్పి, యా
పద నొందించి, హతాత్ముగా నిసుఁగుఁ బా । పన్ బాడియే దైవమా!

చ. అనుచుఁ బ్రసూత యోర్తు, భవ । నాంతరమందలి శయ్యపై సతీ
జనసముదాయమధ్యమున । సంతతదుఃఖపరీతచిత్త యై
తనువును జేర్చి, రోగమును । దాపము హెచ్చుకొలంది సైఁచి, లో
న నెసఁగుఁ బుత్రశోకము స । హించుకొనంగ నశక్త యయ్యె, హా!

క.వి. అలజడి నొందకు । మమ్మరో! నీకది । యత్యశుభమ్మన । కాస్పదమౌ
గలుగదె సంతు సు । ఖమ్ముగ నుంచినఁ । గాలము మించెనె? । కష్టములన్
దలఁచి వగర్పక । తాళికనొందు ము । తమ్మొ హితమ్మని । ధర్మకథా
వళులను దెల్పిరి । వారిజనేత్రలు । వారికిఁ దోఁచిన । వైఖరితోన్.

మ. ఉపచారమ్ములు సల్పువారు సతి కెం । తో శక్తియుక్తిన్, గుమా
రుపయిన్ నెక్కొను భ్రాంతిఁ బోనడఁచువా । రున్, బోలమున్ గాంచుఁ బ
ధ్యపదార్థమ్ములఁ గూర్చువారును, నితాం । తాయాసమున్ దీర్చి తీ
వ్రపరీతాప మడంచువారు నయి, చె । ల్వల్ పొల్చి రప్పట్టునన్.

ఉ. మానిని వారిసేవఁ గొన । మానెను; వీడదు ప్రేమ పట్టిపై;
పూనదు ధైర్య; మౌషధము । ముట్టదు; లంఘనవృత్తి నుండియుం
దా నెలుఁగెత్తి బిట్టఱచు; । ధారగ రాల్చును శోకబాష్పముల్;
సూనునిఁ జూడ నెంచుఁ; దన । చూడ్కిని నల్దెసలన్ వెలార్చుచున్.

క. కనుఁగొని యీచర్యల నె, మ్మనమున భీతియును జింత । మల్లడిఁగొన 'నీ
వనితామణి మనఁ గల్గునె?', యనుచు వితర్కించి రచటి । యతివలు కడిఁదిన్.

తే. తెవులు హెచ్చిల్లె, నలఁతయుఁ । దీవ్రమయ్యెఁ, గంఠనాళము శ్లేష్మయు । క్తముగ మాఱె,
మాట లడఁగెను, దృష్టియు । మాంద్యమయ్యెఁ, దలఁపు వేఱయ్యె, నసువులఁ । దొలఁగనింతి.

తే. కన్నతల్లికి సంతుపైఁ । గల్గు కూర్మి, యగును బ్రాణాధికం బట్టు । లగుట, మాత
జీవములనైన లీల వ । ర్జింపఁ గలదు; గాని గర్భశోకాబ్ధినిఁ । గడవలేదు.

తే. పుత్రశోకాగ్నిఁ గ్రాఁగుట । పోలునొక్కొ! మాతకేనియుఁ బితకేని । మర్త్యులెందు
నీశ్వరాదేశము నతిక్ర । మించువారె? స్వప్నగతి లోక మగుట వి । చార మేల?

# శవవహనము

## మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ గారు

"అనాథప్రేతసంస్కారాత్ కోటియజ్ఞఫలం లభేత్" అను న్యాయానుసరణముగా శవవాహకత్వము ముఖ్యాచరణీయ మని శాస్త్రములు చెప్పుచుండ, నీ కాలమున నియ్యది ముఖ్యముగ బ్రాహ్మణాదిజాతులలో కొన్నిచోట్ల నిరాకరింపఁబడి యెంతటి స్వచ్ఛపురుషకళేబరమైనను సంస్కారమునకు వాహకులు లేక మిక్కిలి ప్రయాసపడుటయే కాక కొన్ని సమయములం దన్యజాతులవారిచే సంస్కరింపఁబడుచు వచ్చుచున్నవి. ఈ విషయము జూడ వాహకత్వనిరాకరణావలంబులలో ప్రప్రథములు బ్రాహ్మణులు. వాహకత్వావలంబులలో ప్రప్రథములు మహమ్మదీయులు. తక్కినవారన్న మధ్యములుగఁ జెప్పవచ్చును. ఈకృత్యమును కొందఱికి నిరాకరింపవలె నని ముఖ్యాభిప్రాయము లేకున్నను - వాహకులు నక్షత్రదర్శనపర్యంతము ఆశౌచమునుబట్టి యుపవాస ముండి యజ్ఞోపవీతముల ధరింపనిది భుజింపగూడ దని శాస్త్రనిబంధన ముండుటచే నట్లు చేయుటకు మనస్కరింపక బద్ధకించి సోమరులై కొందఱును వియ్యపువారైనచో వియ్యపుజిడ్డు వియ్యపువారు మోయగూడ దను మిష పెట్టుకొని కేవల వియ్యపువారైనను వారి కెంతయో దూరస్థులైనను తొలంగిపోయి కొందఱును తప్పించుకొనుచున్నారు. పెండ్లిండ్లలో వియ్యపువారమని విఱ్ఱవీగి పెద్దపీటలు వేయించుకొని గౌరవము లంది భుజించు వియ్యపువారు ప్రేత కిది తప్ప వేఱొండు సేవ చేయజాలనట్టియు వాహకులకై యిబ్బందిపడునట్టియు సమయమున సాయపడుటకు బుద్ధిపుట్టక పనికి రామని చెప్పి జాఱుకొనుచున్నారు. వాహకత్వమును నిరాకరించిన మోమోటమి వచ్చు నని యెంచి యావైపునకైన పోకయును పోయినను సమయమునకు ముఖము తప్పించుచు కొందఱును తప్పించుకొను చున్నారు. సమయమున నుండియు నిరాకరించుచు కొందఱును తొలగుచున్నారు. ఇందువలన లోకమునఁ గల్గుచుండిన యిబ్బంది లట్లుండ మీదుమిక్కిలి అశాస్త్రీయముగ నన్యజాతులవారే వీరిని తిట్టుచు మోసికొనిపోవుటయును తటస్థించుచున్నది. ఇయ్యది వారికిఁ బ్రత్యక్షమయ్యును వీక్షించి మిన్నకుండుటయును గల్గుచున్నది—ఈఘోరనిరాకరణము ముఖ్యముగ విషూచికాదివ్యాధిపీడితశవములపట్ల జరుగుచున్నది. ఇట్టివేళలందు దీనులును శ్మశానబాంధవులును నగు నంత్యజాతిసోదరులే దిక్కగుచున్నారు. వారి కెట్టి ప్రాణభీతియు లేదట, వీరికిఁ గలదట, పై వ్యాధులు వీరికన్న వారికే సులభముగ రాగలవు. అట్టియెడ నేమి యెఱుంగని పంచములకుఁ గల ధైర్యసాహసము లెన్నియో యెఱుంగుదు మన్నవీరి కేల నుండరాదో? స్వమతములం దభిమాన మెంత యుండినను పైనమగాము వచ్చినప్పుడు మాత్రము ఈ విషయమును విడనాడి స్వచ్ఛమగు నుత్తమజాతికళేబరములను పంచములపాలు చేయుచు పాతకమున కొడిగట్టుచున్నారు. ఇట్టి యంటువ్యాధి కలుగని శవముల పట్లను నిరాకరించుటకు ఉపవాసయజ్ఞోపవీతధారణాదులు ముఖ్యకారణములు. ఇంతమాత్రమున తమమతమునబుట్టి తమలో సమానముగానుండి చనిపోయినవానివిషయమైయిట్లుచేయుటధర్మమా? శాస్త్రకారులుగూడ ప్రతివిషయమునను నిబంధనల నేర్పఱచియు నిక్కాలమున నబలమనస్కులు పుట్టగలరనియెంచి ధర్మములకు ధర్మసూక్ష్మముల నేర్పఱచినారు.—

పైని చెప్పినరీతిని ఉపవాసాశౌచాదుల బట్టవలసియుండినను నిజముగు దుర్బలు లట్లుండలేనిచో ఆజ్యాపోశనము చేసి యజ్ఞోపవీతముల ధరించి భుజింపవచ్చు నని ధర్మసూక్ష్మము నేర్పరిచినారు. ఇది యెఱింగియు నిరాకరించు మహానుభావులు కొందఱు గలరు. ఈ కాలమున మతోద్ధారకుల మని బయలువెడలి మతవిషయముల బోధించుచు కర్మాచరణకై పాటుపడుచుంటిమని చెప్పికొను సంస్కర్తలు కూడ నెన్నియో చెప్పుదురు. కాని యెఱింగియున్న సంగతినే యెత్తికొనరు. అక్కటా వారికైన ఈ నీచదశ తొలంగింప మనసు రాదయ్యెను.

ఈ వాహకత్వ నిరాకరణోద్యమము రమారమి 80 యేండ్ల క్రిందట నెక్కుడు వ్యాప్తముగ నుండెడిది. ఇప్పుడో మిగుల కర్మఠులు కాకున్నను ఈ కాలపు యువకులు కొందఱు నీచకృత్యములకు పాల్పడక వాహకత్వ మన భుజమిచ్చుచున్నారు. ఇది యెంతయు సంతోషకరము. కాని యింకొక దురభ్యాసము కలదు. ఎద్దియన, నెవ్వడైన బుద్ధిమంతుడు పాల్పడియుండినచో శవమున కెట్టి సంబంధబాంధవ్యము లున్నను చేరక ప్రప్రథమముననే వీనిపాలఁ బడుదురు. ఇది యెట్టి చిత్రమో చూడుడు - మృతినొందినవానికి సంబంధులు ముఖ్యముగ నిల్చి అట్లు లేనిచో నితరుల కాశింపవలసినది కాని ముందే యొరులపైఁ బడుట యధర్మము. దైవ మెల్లరకు నొకడే. సంచితప్రారబ్ధంబు లందఱికిని నొకటే. రానున్నది రాకమానదు. సంస్కరణ యన నిదియే. ప్రథమమార్గము కాన నీసాహసమె యెల్లరు పూని మహమ్మదీయాదులవలె శవవాహకత్వమున నభిముఖులై నడిచి నెరవేర్చి కృతకృత్యు లగుదురు గాక!

# రాణి సారంధ

## యడ్లపాటి వేంకటసుబ్బారావు గారు

ఏదినరో పలికిన ♦ బంగారు కమ్మ
పాటపాడెడి నన్న ♦ పలుకకుండెదవు
మాటాడకుండుటే ♦ మనసాయె నీకు
మాయన్న యీరాత్రి ♦ మరలి రాడంచు
ఊరక చింతతో ♦ నుండెద వేల
నమ్మను లేవమ్మ ♦ వనట పొందకుము
అని శీతలాతోడ ♦ హాస్యంబులాడు
సారంధ అటుచూచి ♦ సంభ్రమ మొందవ
"అన్నయ్య! ఇది యేమి! ♦ అర్ధరాత్రమున
తడిసిన వస్త్రాల ♦ తత్తరంబునను
అస్త్రహీనుడ వగుచు ♦ నరుగుదెంచితివి
అని పల్కు చెల్లెలి నట్టె ♦ తాఁ జూచి
"అరులపాలను బడె ♦ వస్త్రశస్త్రా
నది దాటి వచ్చితి ♦ నాప్రాణభీతి"
అనియెడు సోదరు ♦ ననిరుద్ధు గాంచి
భావతీక్ష్ణత్వము ♦ వదనపద్మమున
అరుణకాంతులు గ్రక్క ♦ నాత్మగౌరవము
దీపింప సారంధ ♦ దిగ్గున లేచి
"వంశమర్యాదను ♦ పాడుచేసితివి
సార్థకనామంబు ♦ చట్టుచేసితివి"
అని తీక్ష్ణదృష్టుల ♦ నతనిపైఁ బఱప
సిగ్గున తల వంచి ♦ "చెల్లెలా! నేడు
జీవితాంతముదాక ♦ స్పృహలోన నుండు
వేదపాఠము నాకు ♦ వినిపించినావు"
అని చెప్పుచును నేగె ♦ అంధకారమున.

* * * *

"వంశమర్యాదంచు ♦ పడిపోయె నేల
నాప్రాణకాంతుని ♦ నడిరాత్రి యిట్లు
తూలనాడుచు నిల్లు ♦ తొలఁగి పోవఁగను
చేసితి నీ విట్టి ♦ స్థితిలోన నుండ
హృదయపేటికయందు ♦ హృదయేశు నునిచి
కాపాడకుండువే ♦ కనకంబువోలె
పల్లకిలో నుంచి ♦ భద్రమ్ముగాను"
అనుచును శీతల ♦ అశ్రుల రాల్ప
కాసనాక్షరముల ♦ సారంధ పలికె
"ఇటువంటి స్థితిలోన ♦ నే నుండునెడల
హృదయము ఖడ్గాన ♦ వ్రీలగాఁ జేతు
పల్లకిలోన నే ♦ ప్రాణంబు గొందు"
"ప్రేయసీ! సారంధ! ♦ ప్రియ మొల్కుచుండి
పూర్ణిమాచంద్రునిఁ ♦ బురుడించుచుండు
నీముద్దుముఖ మేమొ ♦ నే చూడఁ జూడ
మేఘావృతం బైన ♦ మిహిరాంశువోలె
దీనభావంబును ♦ తెలుపుచు నుండె
చిఱునవ్వు పెదవుల ♦ చెలువంబు బాసె
కురులతో దువ్వవు ♦ కోమలతనువు
రమ్యభూషలచేత ♦ రాణింప నీవు
పూఁబోణి డిల్లీన ♦ బుందేలునందు
నీవు కాంచినయంత ♦ నిస్తులసుఖము
కాంచగా నుండమి ♦ కారణ మేమి"
"కారణ మడుగంగ ♦ కారణ మేమి?
ఓర్ఛాపురంబున ♦ నుంటి రాణిగను
తప్పక డిల్లీని ♦ దాసిగా నుంటి
జాగీరుదారుని ♦ జాయ నే నైతి
సుల్తాను నాడించు ♦ శూరులు మీరు
సుల్తానుచే నిప్డు ♦ జోకొట్టఁబడిరి
బుందేలుసింహంబు ♦ బోనులోఁ జొచ్చె
సంతోష మేరీతి ♦ చవిచూడఁ గలను
చిత్తసంక్షోభంబు ♦ చేకూరె నాకు"

* * * *

పచ్చని తోరణాల్ ♦ బావుటా లెగుర
ప్రజల యానందంబు ♦ పిల్లటిల్లంగ
జీరజు దుర్గంబు ♦ చిందులుద్రొక్క
స్వాతంత్ర్యభావంబు ♦ నాహ్యాళి సలుప
సారంధముఖమున ♦ సంతోషరేఖ
తాండవించుచు భావ ♦ దర్పమ్ము తెలుప
రాణివాసమ్మును ♦ రమణి గ్రహింప
చంపతురాయఁడు ♦ స్వస్థానమందు
సింహాసనంబున ♦ చెలఁగుచునుండె
బుందేలుఖండంబు ♦ పొంగుచునుండె
"సారంధ ముందు నీ ♦ సలహాను గొనక
ఏపనిగాని నే ♦ నెప్పుడు చేయ
చేంబలునదియొద్ద ♦ చేరియున్నట్టి
ఢిల్లీశు సేనను ♦ ఢీకొనలేక
మొహియుద్దీను మురాదు ♦ ముఖ్యులు నన్ను
శరణంబువేడిరి ♦ సాహాయ్యపడఁగ
ఏమిచేయఁగవచ్చు ♦ నీస్థితియందు
నన విని సారంధ ♦ యాలోచ నేల
ప్రాణంబులను గూడ ♦ వదలుచు నైన
శరణాగతులను ర♦క్షణచేయవలయు
బుందేలువీరుల ♦ పూతరక్తంబు
చేంబలునదియందు ♦ చేరఁగవలయు
శరణాగతత్రాణ ♦ సంసర్గమందు

ప్రవహించు బంగేలు ♦ రక్తవాహినులు
బిరుదవాదనముతోడ ♦ పేరెక్కినవియు
నూనూగుమీసాల ♦ నూత్నయౌవనులు
నిమ్మపండును మీఁద ♦ నిలుపంగఁ జాలు
మెలికలు తిరిగిన ♦ మీసాలవారు
కాలసర్పముఁ బోలు ♦ గడ్డాలవారు
ఎత్తైనభుజముల ♦ నింతంతవారు
ఆజానుబాహుల ♦ నలరెడు వారు
వెడఁదయౌ రొమ్ముల ♦ పేరెక్కువారు.
ఈటెలపోటుల ♦ హెచ్చైనవారు
కరవాలసాముల ♦ ఘనులైనవారు
విల్లునమ్ములధాటి ♦ పేర్వాసివారు
కోమరొప్పు పైఠాణి ♦ గుఱ్ఱాలవారు
బుందేలువీరులు ♦ పుడమి మీనిసట్లు
రణరంగకౌతుక ♦ రాగంబు వెడల
ఉత్సాహవాక్యముల్ ♦ యుక్తుల వెడల
తమదు ప్రతాపముల్ ♦ తాఁ జాటుకొంచు
చంపతురాయఁడు ♦ సైన్యంబె నడుప
మొహియుద్దీనుని సైన్య♦మును గూడికొంచు
కదలిరి ఘణఘణ ♦ కదనరంగమున

* * * *

పోరు ఘోరంబాయె ♦ పుడమిపైఁ బడరి
ఇరుపక్షములవారు ♦ నెంతరో మంది
కాలుసేతులు పోవ ♦ కడు నేడ్చువారు
పొట్టప్రేవులు వెళ్ల ♦ పొరలెడివారు
తలగత్తిపోటుల ♦ తారాడువారు
చంపవచ్చిన వారి ♦ చరణంబులంటి
బ్రతిమాలియుఁ భంగ♦పడుచుండువారు
లేవఁగశక్తియు ♦ లేశంబు లేక
హృదయరోషంబున ♦ హెచ్చగుతమిని
పటపట యనుచును ♦ పండ్లను కొఱికి
హుంకార మొనరించి ♦ యూపిరివిడిచి
వీరశయనంబున ♦ వెలిఁగెడివారు

* * * *

ఎవ రిది చెప్పుమా? ♦ ఈసేన చూడ
ఆపత్తు దప్పింప ♦ నడ్డమై నిల్చి
చక్రవర్తిని త్రోలి ♦ జయము చేకూర్చ
దళనాయకుం డెంత ♦ ధైర్యవంతుండో
స్వల్పసైన్యముతోడ ♦ వైరుల దాఁకె
ఆహా! ఏమని చెప్ప ♦ ఆతనిశక్తి
సైన్యంబు పురికొల్పి ♦ శత్రుమధ్యమున
వెనుదీయకే నిల్పె ♦ వింతయౌ రణము
నవయౌవనముతోడ ♦ నగుమోముతోడ
అడుగో వచ్చుచునుండె ♦ ఆశౌర్యమూర్తి
అని రాజు తలపోసి ♦ అటు చూచునంత
పురుషవేషము దాల్చి ♦ పొలుపొందు పొలఁతి
నమ్రతఁ దలవంచి ♦ నవ్వుచు నిలిచె
ప్రేయసి సారంధి ♦ ప్రియు మార చూచి

చంపతురాయండు ♦ చకితుండు నాయె.
ఢిల్లీపురాంగన ♦ శీవితో వచ్చి
ఔరంగజీబుని ♦ హస్తంబు పట్టె
చంపతురాయండు ♦ జాగీరు పడసె
శాహజారిత్వ ♦ పదవిని పొందె
సింహాంబుబోనులో ♦ చిక్కెను మరల
సారంధముఖమున ♦ సంతోష మెడలె

* * *

"అమ్మ గుఱ్ఱంబును ♦ ఆ వలీఖాను
బలవంతమున లాగె ♦ పలువురిలోన
ఒక్కండ నౌటను ♦ ఊరకయుంటి"
అని చెప్పు సుతుఁ డిట్లు ♦ ఆననంబందు
రోషారుణరుచులు ♦ రూఢవిక్రాంతి
పర్వుచునుండంగ ♦ బాలునిఁ జూచి
"గుఱ్ఱంబు పోయిన ♦ కొదవ లేదు కాని
నినుఁజూడ దుఃఖమ్ము ♦ నిలువెల్లఁ గ్రమ్మె
బుందేలువీరుల ♦ పూజ్యరక్తంబు
నీదు నాళంబుల ♦ నిస్తేజ మాయె
శౌర్యహీనుండవై ♦ చానయువోలె
చానతో చెప్పంగ ♦ చనుదెంచినావు
కరవాల మేమాయె ♦ కరమున నీకు
చవిచూపకుంటివి ♦ సహజమౌ శక్తి"
అని పురుషాకృతి ♦ నశ్వంబు నెక్కి
కరవాల మొఱనుండి ♦ గ్రక్కునదీసి
వీరనికాసంబు ♦ వెనువెంట రాఁగ
దర్బారు చేరంగఁ ♦ దరుణి తా నడరె

* * * *

"ఖానుగారూ! మీరు ♦ కడుశౌర్యధనులు
పసివాని బెదరించి ♦ పలువురు గూడి
గుఱ్ఱంబు హరియించి ♦ కులుకుచున్నారు
రణభూమియందును ♦ ప్రాణావసాన
స్థితిలోన మీరుండ ♦ చిక్కె నా కిదియు
నాసొత్తు దీనిని ♦ న్యాయంబు దప్పి
దౌర్జన్యవృత్తితో ♦ తాఁగసిల్లితిరి
బుందేలురక్తంబు ♦ పొరలుచునున్న
వీరనారీమణి ♦ వెఱవఁగఁ బోదు
రక్తపాతంబున ♦ రవ్వంతయైన
చలియింపఁగాఁబోదు ♦ సారంధరాణి
ఖానుఁడు అశ్వంబు ♦ క్రమ్మఱనీయ
ననుచును చెప్పంగ ♦ నటులైన నింక
రక్తధారలె దాని ♦ రప్పించు ననుచు
కరవాలములు తీసి ♦ కడఁకతో నున్న
బుందేలువీరుల ♦ పూనిక చూచి
ఔరంగజీ బిట్లు ♦ అతివతో ననియె
"అశ్వంబు నిప్పింతు ♦ అందుకు మీరు
చెల్లించు వెల యెంతో ♦ చింతింపవచ్చు"
అన విని సారంధ ♦ అణుమాత్రమైన
చలియింప కిట్లనె ♦ సాహస మొప్ప

"వెల యింత యనుచును ♦ భీతిల్లనేల
జాగీరు మన్నబుల్ ♦ సర్వంబు విడుతు
రాజ్యంబు విడుతును ♦ ప్రాణంబు విడుతు
ఆత్మగౌరవమున ♦ నన్నియు విడుతు
ఆత్మగౌరవము మా ♦ కాధ్యాత్మికంబు
దానికొఱ కెంతైన ♦ ధారవోసెదను"

* * *

ధిక్కారముల్ బొంది ♦ తీండ్రించుచున్న
ఔరంగజీబుని ♦ ఆహవదళము
ఓర్ఛాపురంబునం ♦ దూర్జితశక్తి
ముట్టడివేసెను ♦ మూడువారములు
ఎన్నియో పోరులు ♦ నిట్టిసేనలను
ముప్పుత్రిప్పలు పెట్టి ♦ పోద్రోలినట్టి
చంపతుసింహంబు ♦ జ్వరబాధచేత
మంచంబుపట్టెను ♦ మనను వేధింప
శత్రుధాటియు చాల ♦ జ్వలితమౌచుండె
కోటగోడలు వెసం ♦ గూలునటంచు
హృదయమందున నెంచి ♦ ప్రేయసి కనిరో
"జాగీరు మన్నబుల్ ♦ సర్వంబు పోవ
చింత లేశంబును ♦ చేర్పంగనైతి
ప్రజలనిప్పుడు గావ ♦ పటుశక్తిలేమి
పరితాపహృదయంబు ♦ పగులుచునుండె
శృంఖలాబద్ధత ♦ చెఱసాలయందు
ఏరీతి నుందును ♦ హీనపుబ్రతుకు
దుర్గంబు వీడిన ♦ తోడివారలను
అరివీరకరవాల ♦ మాహుతిగొనంగ
ఈప్రాణ ముండిన ♦ నేమిఫలంబు
విశ్వాసపాత్రులై ♦ ప్రేమచే గొలుచు
భటసంఘ మే నెట్లు ♦ పాయంగనేర్తు"
అనుచును చింతించు ♦ ప్రాణేశు చూచి
సారంధ నీరీతి ♦ సలహాను నిచ్చె
"అరినాయకుండు విన ♦ అనుచరులందు
మిత్రభావంబున ♦ మెలంగును రేని
హృదయశాంతిని మీరు ♦ ఈచోటు విడిచి
ఉండంగలరని నే ♦ నూహించుదాన
అది సానుకూల మౌ ♦ నటుల నేం జేతు"

* * * *

సారంధ! అటుచూడు ♦ సైన్యంబు లవిగో
మనల వెంటాడుచు ♦ మానక వచ్చె
వాగ్దత్తముల్ వీడి ♦ వచ్చుచున్నారు
ఈమాత్రమున కీవు ♦ ఇచ్చితి గాదె
పుత్రుని ఛత్రసాల్ ♦ పురుషసింహంబు
వార్తగొనిపోవ ♦ వాని నే పంచి
అరులచేతులలోన ♦ నప్పగించితివి
బుందేలులక్ష్మిని ♦ పొందంగ వాడు
అర్హుండటంచును ♦ అలగారి యుంటి
ఆశ లన్నియు నాకు ♦ అడుగంటిపోయె
ఆరణ్యమధ్యాన ♦ అందలమందు
పరిపంధిచేతుల ♦ బంధింపబడుదు
నాకండ్లముందర ♦ నాసతీమణిని
నీచులు బంధింప ♦ కనోపంజాల
సమయ మేతెంచెను ♦ సారంధ నీకు
వీరనారీమణి ♦ పేర్వాసి గాంచ
సతిపతిధర్మంబు ♦ సలుపంగవలయు
హృదయేశు కోరిక ♦ నీడేర్పవలయు
అవమానభారంబు ♦ నందగాం జాల
నే గౌరవమును నీ ♦ వీయవలయు
కడపోర్కి చెల్లించి ♦ కడు ధన్య వగుము
ఇచ్చెద నను నాస ♦ నెఱిగింతు నీకు
శూరమూర్తి వటంచు ♦ చూడ్కులు తెలుపు
హృదయము ఖడ్గాన ♦ ప్రీలంగ జేయు
పల్లకీలోన నే ♦ ప్రాణంబు గొనుము
శత్రులు నను బట్టు ♦ సమయంబులోనె
నీదు కరవాలంబు ♦ నిర్భీతితోడ
నావక్షమందున ♦ నాట్యంబు సలుప
వేగమే పూనుము ♦ వేడెద నిన్ను"
అన విని సారంధ ♦ అశ్రులు రాల్చి
"హా, నాధ! ఇది యేటి ♦ అన్యాయ మకట!
ఎందైనం గంటికే ♦ ఈరీతి పతిని
విగతజీవుని చేయు ♦ వెలందిని భువిని
మన్మనోరధముల ♦ మాన్యంబు నగుచు
యౌవనసౌఖ్యంబుల ♦ కాటపట్టగుచు
ప్రేమవిస్ఫూర్తికి ♦ ప్రియధామ' మౌచు
సంతోషకరిచుతు ♦ సహచర్య మగుచు
పాలుపొందు వక్షంబు ♦ పొడుతు నెట్లు!"
అనుచుండ నంతలో ♦ అరివీరచయము
తోడి బుందేలుల ♦ త్రుంచుచు వేగ
ప్రభువును పట్టంగ ♦ వచ్చుచునుండ
"చూచెద వేల నే ♦ సుదతి నీ విపుడు
మానంబు కాపాడ ♦ మనసు లే దేమొ
వంశమర్యాద కా♦పాడంగ రాదొ!"
అనుచును తనుచూచు ♦ ప్రాణేశు చూచి
"శీతలా అన్నాడు ♦ చీకటిరాత్రి
నీతోడి పంతంబు ♦ నెఱవేర్ప నేడు
సమయ మేతెంచెను ♦ జాగేల" ననెడి
దారుణవాక్యముల్ ♦ తన నోట వెడల
ప్రాణేశుహృదయాన ♦ రక్తంబు వెడలె

* * * *

చిఱునవ్వుముఖసీమ ♦ చెలగుచునుండ
చంపతుగాయని ♦ చక్షుద్వయంబు
ముకుళించులోపల ♦ పుణ్యచారిత్ర
వీరనారీమణి ♦ వెలందుల మిన్న
సారంధనిజఖడ్గ ♦ సంగ మంది
ప్రాణకాంతుని దివ్య♦పాదాబ్జయుగవు
మొలకనవ్వులతోడ ♦ ముద్దునం గ్రోలె.

# పుష్పాంజలి

## ఉపవేదములు — గ్రంథసూచిక

మానవల్లి రామకృష్ణ కవి గారు, ఎం. ఏ.

మనుష్యుఁడు నేర్చుకొనఁదగిన విద్యయు వేదములలోనే కలదనియు నది యనాదియై ప్రత్యక్షాది ప్రమాణముల కతీతమై స్వతః ప్రమాణసిద్ధ మని మనయార్యులెల్ల నంగీకరించిరియుఁ. తదర్థవాదభాష్యవివరణ రూపములుగా బహుగ్రంథములు బహుముఖములుగా వెలువడియు నున్నవి కదా. ఉపవేదములు షడంగములు విద్యలు కళలు మొదలుగా విద్యావిభాగములు పెక్కులు గానవచ్చుచున్నవి. ఈచిన్న వ్యాసమున నుపవేదము లేవో వానిలో నేయేగ్రంథములు మనకు లభించునవి గలవో యించుక విచారించెదము. ఒక్కొక్కయుపవేదమునైన లోఁ గలవిషయముల నెత్తి యాంధ్రమునఁ గ్రోడీకరించి వ్రాసినను వేయిపుటలైనఁ దప్పక పట్టును. ఇందు గ్రంథముల పేరులు మాత్రమే సూచించినను స్థలసంకోచము నిక్కముగాఁ గలుగవచ్చును. ఋగ్యజుస్సామాథర్వణముల మథించి బ్రహ్మ నాలు గుపవేదముల సృజించెనఁట.

"ఆయుషం ధనుషం చైవ గాంధర్వం చార్థమేవచ
సర్వలోకోపకారార్థ ముపవేదాన్సృగాదయః"

అని యామలాష్టకతంత్రమునఁ గలదు. ఆయుర్వేదము ధనుర్వేదము గాంధర్వవేదము అర్థవేదము అని నాలుగు. వీనిలో నర్థవేదస్థానమునఁ గొందఱు స్థాపత్యమనియు(శిల్పము) తంత్రమనియుఁ బఠించెదరు. ప్రపంచహృదయమునఁ బై నాలుగింటికే తద్గ్రంథకర్త పేర్కొనియె. ఆయుర్వేద మన వైద్యశాస్త్రము. ధనుర్వేదము విలువిద్య. గాంధర్వము సంగీతనాట్యములఁ బ్రతిపాదించునది. అర్థవేదము ద్రవ్యసంపాదనరక్షణక్రమముల నెఱింగించు నర్థశాస్త్రము. ఈ నాలుగింటిలో నొక్కొకటియుఁ జతుర్వేదముల సారమని గ్రహింపవలయు. గాంధర్వమునుగూర్చి భరతుఁడు—

"జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్సామభ్యో గీతమేవ చ
యజుర్వేదా దభినయం రసానాథర్వణాదపి.

అని పాత్రసంభాషణాదుల ఋగ్వేదమువలనను, అభినయకరణాంగహారవేషరచనాదుల యజుర్వేదమువలనను, గీతతాళధ్రువాదు లగు స్వరకాలయోగవిశేషమును సామవేదమువలనను, భావరసముల నథర్వవేదమువలనను బ్రహ్మగ్రహించి గాంధర్వవేదమును లోకమున నవతరింపఁ జేసెనని చెప్పుచున్నాఁడు. ఇట్లే తక్కిన యుపవేదముల విభాగము చతుర్వేదసంభూత మని తెలఁపవలసి యున్నది.

ఈయుపవేదకర్తలు మహర్షులు పెక్కండ్రు గలరు. వారిగ్రంథములు పెక్కులు పేరులేకయుఁ గొన్ని నామావశిష్టములుగా నశించినవి. కొన్నిమాత్రమే లభించుచున్నవి. మొట్టమొదట బ్రహ్మ సృష్టింపఁగా నాలుగును గలసి లక్షగ్రంథపరిమాణమే కలదియయ్యె. గ్రంథమనఁగా 82 అక్షరములపరిమితి గలపంక్తి. ఆయుర్వేదము ముప్పదియాఱువేల గ్రంథముగా బహువిషయములు నిర్ణయించునట్టిది బ్రహ్మచేతను పిదప నలువదినల్వురు ఋషులచేతను వివిధగాఁ గూర్పఁబడియె.

ఆయుస్త్రింశత్సహస్రం స్యాద్గ్రంథస్య పరిసంఖ్యయా
యత్రైవ హి ప్రదృశ్యన్తే శిష్టోత్పత్త్యాదిలక్షణమ్:
ఆయుర్వినిర్ణయాధ్యాయః ప్రకృతిజ్ఞానమేవ చ
నాడీధాతునిదానం చ వస్తుదోషనిరూపణమ్.
శారీరగుణవిజ్ఞాన మౌషధోత్పాదనక్రమః
గజాశ్వ నర గోగాది చికిత్సాకరణక్రియాః
రసాగ్ని మూలికా రక్తపాక రేకక్రమాత్మనామ్
నిదానం సచ్చికిత్సానాం వ్యాధేర్గుణనిరూపణం
పూర్వాపూర్వాయువిజ్ఞానం కర్మదోషప్రదర్శనమ్
ఏవమాదీని భూయాంసి సంత్యాయుషి సహస్రశః
ప్రత్యక్షఫలదో స్వాఖ్యా మాయుర్వేదః ప్రదర్శితః

ఆగర్భాధానపిండోత్పత్తిమరణము గలుగు శరీరాభివర్ధనక్షయ లక్షణములును ఆయుర్నిర్ణయము వాతపిత్తశ్లేష్మాది ప్రకృతియుఁ గాలస్వరూపమును నాడీధాతువుల తత్త్వమును భోజ్యానుభోజ్యవస్తువుల గుణాగుణములును, కాలవయోభ్యాస సాహచర్యాచారభోజనాదుల గలుగు శారీరవికారములును ఔషధకరణవిధియు గజాదిమృగవైద్యమును రసాదుల యౌషధయోగములును ఘటభేదములును మూలికాజ్ఞానతత్సంగ్రహ క్రమములును రసాదులచే లోహముల రాగాభివర్ధనమును ఔషధపాకక్రమమును వ్యాధిలక్షణములును జన్మాంతరకర్మదోషముల నెఱింగి తత్తద్వ్యాధిచికిత్స నుపదేశించుటయు మొదలుగాఁ బెక్కువిషయము లాయుర్వేదమునఁ గలవు. ఇం దాయుర్వేదసూత్రము (వేదభాగము)ను, చరకసుశ్రుతభేళకృతము లగుసంహితలును, వృద్ధవాగ్భట ద్వితీయవాగ్భటుల యష్టాంగసంగ్రహహృదయములును శార్ఙ్గధరబసవరాజానంతాదుల ప్రకరణగ్రంథములును సహస్రములు గలవు. ఇవి యెల్లరకు విదితమే. కావున నించుక దుర్లభ్యము లగువాని గుఱించి కొంత వచించెదము.

కైలాసకారక మను మూలికావిచారగ్రంథము మంథానభైరవతంత్రములోనుండి గ్రహింపఁబడినది. ఇందు మూలికల సిద్ధౌషధీ, దివ్యౌషధీ మహౌషధీ రసౌషధీ విభాగములు సూచింపఁబడియె. సిద్ధౌషధులు దేహలోహవేధల కుపయుక్త మగు రసమును సద్యోమరణమున భస్మీకరించునట్టివి లోకమున ముప్పదిరెండే కలవఁట.

"రక్తస్నుహీసోమలతా రుదంతీ కృష్ణచిత్రకమ్"

నాలుగుపలకల యొత్తుజెముడు, చంద్రకళలతో వృద్ధిక్షీణములం జెందు సోమలతయు నడవిసెనగయు, నల్లనిచిత్రమూలము మొదలగు ముప్పదిరెండింటి లక్షణములు ప్రయోగములు నిందుఁ గలవు.

సిద్ధరసార్ణవము రససాధనమును లోహసాధనమును రసాయనౌషధకరణసేవాక్రమమును విస్తరముగా నెఱింగించు సంగ్రహగ్రంథము. దీని నతినిపుణముగాఁ బరీక్షించిన రసతత్త్వ మంతయుఁ దెల్ల మగు. ఇందు నిప్పును జూచిన నావిరియై పోవుస్వభావము గల రసాగ్నుల రెంటికిఁ బరమ మిత్ర మగు కాంచనమును నిత్యద్రవరూపమునకుఁ దెచ్చి సోమానల యంత్రమున రసకాంచనములఁ బొసఁగించినచో నగ్నికి రసము పాఱకుండు నని సూత్రరూపముగా నొకయంశము చెప్పఁబడినది. ఇట్లే రసవాదవిద్యకు మూలభూతముగ సకలధాతులోహములకును "రాగములు" (units of energy which radiates light) గల వనియు నేవి యేవి కెన్ని గలవో వివరించి యొకదానినుండి మఱియొకటికి రాగములు మార్చుతెఱంగు చెప్పి లక్షరాగములు గల రసమునకు వజ్రాది ధాతువుల రాగసంఖ్య నెక్కించి "సారణ" యనుమార్గము నుపదేశించి సిద్ధరసమును దేహలోహవేధకు సిద్ధు లుపయోగింతు రని చెప్పఁబడియె. రసరత్నాకర మనుపంచఖండాత్మక మగు గ్రంథము నిత్యనాథసిద్ధునిచే రచింపఁబడియె. ఇందు సామాన్యముగా రసలోహధాతువుల స్వరూపమును భస్మీకరణవిధానమును బ్రథమ మగు రసఖండమునఁ జెప్పఁబడియె. ఈ భాగముమాత్ర ముత్తరదేశమున ముద్రిత మయ్యె. రెండవది యగు రసవాదఖండము 19 ఉపదేశములతో రసమునకుఁ బదునెనిమిదిసంస్కారములును, సకలలోహములును నిత్యద్రవీకరణ భస్మీకరణ విధానములును భూమిలో నెచ్చటెచ్చటనో లభించు రక్తస్నుహి మొదలగు సిద్ధౌషధుల లక్షణములును స్వర్ణముక్తాప్రవాళ పద్మరాగకరణ ప్రకారములును వివరింపఁబడి మనోహరముగా నుండును. రసాయనఖండము మూఁడవది. దీనిలో దేహమును దీర్ఘజీవిగాఁ జేసికొనుటకు నౌషధసేవాక్రమములు గలవు. రసేంద్రఖండమున బసవరాజీయ చింతామణి గ్రంథములలోని సకల రసలోహధాతు మిశ్రౌషధములఁ జేయు ప్రకారములును నైదవది యగు సిద్ధఖండమున సకలయంత్రములును నింద్రజాల చిత్రౌషధ విషయములును గలవు. ఈనైదుఖండములును లభించుచున్నవి. మంథానభైరవ తంత్ర మను నద్భుతగ్రంథము సంపూర్ణముగా లభింపకున్నను సుమారు 10 వేలగ్రంథము చిక్కుచున్నది. దీనిలో నమృతీకరణవిశ్రాంతియు రసాయనవిశ్రాంతియు "ఆనందకంద" మను పేర వెలయుచున్నందున నీగ్రంథమును రసానందకంద మనియు నానందకంద మనియుఁ బేర్కొందురు. మంథానభైరవుఁడు చిరంజీవు లగు ముప్పదిరెండుసిద్ధులలో నొక్కఁ డని హఠయోగ ప్రదీపికలోఁ బరిగణింపఁబడియె. ఇతఁడు శ్రీశైలప్రాంతములఁ దపస్సు చేయుచుండఁగా సింహళాధీశ్వరుఁ డగు మహేంద్రుఁడు శ్రీముఖములఁ బంపి పిలిపించి సింహళద్వీపమున (అనూరాధపురమున?) గొప్ప ధర్మవైద్యశాల మృగమనుష్యసంపాలనమున కనుకూలముగా నిర్మించి దానిపై మంథానభైరవున కధికార మేర్పఱచి ప్రతిదినము రోగులస్థితిఁ బరీక్షించుచుండె నని సింహళచరిత్రమున నున్నది. కావున నితఁడు క్రీ.శ.200 ప్రాంతములవాఁడు. ఈ మహాతంత్రము రసవాదమునకు రసాయనమునకు సామాన్యవైద్యలోకమునకును గామధేనువువంటిది. అత్యద్భుతముగాఁ బ్రక్రియావిషయము సంపూర్ణముగాఁ జెప్పఁబడినది. రసాష్టాదశసంస్కారములు సకలలోహధాతుస్వరూపమారణములును ఓషధీతత్త్వములు రసాయనసేవాక్రమములు సిద్ధౌషధు లగు సోమలతాదులసేవాక్రమములు గంధకకల్పాద్యద్భుతరసాయనప్రయోగములును మనుష్యుని నిత్యచర్యావిధానమును దీర్ఘాయుర్విధానమును కాకిణీస్త్రీకరణోపచారవిధియు మొదలగునవి పెక్కు లంశములు వివరింపఁబడియున్నవి. ఈగ్రంథసహాయము లేక సిద్ధరసార్ణవము రసరత్నాకరము రససారము రసరత్నసముచ్చయము మొదలగు గ్రంథములలోని రహస్యములు పూర్ణముగా నన్వయింపవు.

ధాతువాదమున సుమారు వేయిగ్రంథమాత్రమే లభించు ధాతుకల్ప మనుభాగము రుద్రయామళతంత్రము తంజాపురసరస్వతీభండారమునను లండన్ నగరగ్రంథభండారమునను సులభముగా లభించుచున్నది. దీనిలో సకలధాతువులు ఇంగిలీకము, మనశ్శిల తాళకము మొదలగువాని చిత్రప్రయోగములు గలవు. ఖండకాపాలికము (నేత్రచికిత్స) కల్యాణకారకము మొదలగు మంచిప్రకరణగ్రంథము లోషధులతోడనే నిత్యకృత్యములకు వలసిన యౌషధములు చేసికొను మార్గములు వివరింపఁబడినవియుఁ గలవు. సుప్రసిద్ధము లగు మహాగ్రంథములఁ జెప్పక విడిచితిమి. ఈయాయుర్వేద మెనిమిదికాండములుగా ఋషులు విభజించిరి.

"రసేశ్వరంతు ప్రథమం వానస్పత్యం తతఃపరమ్
తృతీయం గుణపాఠాఖ్యం శారీరం తుర్య ముచ్యతే
వ్యాధితత్త్వపరిజ్ఞానం పంచమం చ రసాయనం॥
రుఙ్నిదానం క్రియాకాండ మాయుర్వేదే ప్రకీర్త్యతే"

అని సూచింప బడియె.

## అర్థవేదము II

అర్థసంపాదనరక్షణక్రమముల నుపదేశించునది యర్థవేదము. ఇందు రాజధర్మములును అర్థార్జనరక్షణక్రమములును గలసి బ్రహ్మ లక్షయధ్యాయములుగాను రుద్రుఁడు 50000, స్కంధుఁడు 25000, ఇంద్రుఁడు 12000, వాల్మీకి 6000, బృహస్పతి 300 , శుక్రుఁడు 1000, అధ్యాయములుగా గ్రంథములు రచించిరఁట. భయంకరములగు నీ పెద్దగ్రంథములు తిన్నఁగా భుజింప నవకాశము చాలని మన కాలమునకు రాక నశించిపోయినవి. వీనిని సంగ్రహించి భారద్వాజుఁడు 700 అధ్యాయములలోను, గౌరశిరుఁ డను ముని 500 అధ్యాయములుగాను, వ్యాసులు 300 అధ్యాయములుగా నర్థశాస్త్రములు రచించిరఁట. అవియుఁ బైవానిగతియే చెందినవి. అర్థవేదము సంగ్రహరూపముగాఁ బదునాలుగువేల శ్లోకములతో రచింపఁబడినది. అందుఁ బెక్కువిషయములు నిరూపింపఁబడినవి.

"చతుర్దశసహస్రాణి హ్యర్థవేదః ప్రమాణతః
యత్రైవాష్టాదశాధ్యాయాః సంతి ప్రత్యక్షసిద్ధిదాః

కల్పాధ్యాయో రసాధ్యాయః ప్రయోగాధ్యాయ ఏవ చ
ధాతుధ్మానక్రియాధ్యాయో రత్నాధ్యాయస్తథైవచ
త్రపుసీసజయాధ్యాయో లోహాధ్యాయస్తతః పరమ్
మూషావ్యల్లోణితిగరాధ్యాయో వాదజయస్తతః
హేమసంపాదనాధ్యాయః సిద్ధాధ్యాయో౽ఖిలార్థదః
మూలికాశోధనాధ్యాయః పుటాధ్యాయో మహత్తరః
నాగాభ్రచంద్రికాధ్యాయో యోగాధ్యాయో౽ర్థదాయకః
కాలపాకక్రియాధ్యాయః సంభిన్నాధ్యాయ ఏవ చ
విక్రియాకరణాధ్యాయా ఏతే సర్వార్థదాయకాః"

అని యామళతంత్రమున నున్నది (ఇందు నాగాభ్రములఁ జంద్రిక యనునది దోషము) వీనిలోఁ బెక్కు విషయము లాయుర్వేదమున రసతంత్రమునకుఁ జేర్చుకొనిరి. కావున నర్థవేదము క్షీణించి ధర్మార్థశాస్త్రరూపములుగా సంగ్రహింపఁబడియె. రెండును నర్థరక్షణక్రమమే చెప్పును. అం దర్థశాస్త్ర మను నామముతోనే రాజనీతి ప్రధానముగాఁ జెప్పఁబడియె. శుక్ర బృహస్పతి విశాలాక్ష బాహుదంతి భీష్మోద్ధవ చాణక్య ప్రభృతులు విస్తరముగా రచించిన రాజనీతిశాస్త్రములలోఁ జాణక్యుని కౌటిలీయము మాత్రమే లభించుచున్నది. బార్హస్పత్యసూత్రము లని యిటీవల ముద్రిత మైనదియు, లఘుచాణక్యసూత్రము లను గ్రంథమును సామాన్యము లైనవి. యాధునికము లని మాయభిప్రాయము. శుక్రబృహస్పతుల గ్రంథములకు శుక్రనీతిసార మనియు, బార్హస్పత్యనీతిసారమనియుఁ జాణక్యుని కౌటిలీయమునకుఁ గామందకకృతినీతిసారమును సంగ్రహగ్రంథములు గలవు. ఇవి యన్నియు నాంధ్రభాషలోఁ బూర్వమే తెనిఁగింపఁబడి యున్నను మనకు లభింపవయ్యె 1784 క్రీ. శ. లో రచింపఁబడిన తెలుఁగు కామందకము మాత్ర మున్నది. బార్హస్పత్యము రుద్రదేవుఁడు తెనిఁగించె నని తోఁచుచున్నది. ఈగ్రంథములలోని పద్యములు సుమారు వేయింటిని గూర్చి మడికిసింగన సకలనీతిసమ్మతము రచించెను. (అది ముద్రితమై యాంధ్రపత్రికా కార్యాలయమున లభించుచున్నది.) శుక్రనీతిసార మూలము ననుసరింపక యథేచ్ఛప్రక్షిప్తకముగాఁ గలగూరగంపవలెనున్నది. బార్హస్పత్యమున గజాశ్వాదిశాస్త్రములును ధనుర్వేదమును గలసియున్నవి. కౌటిలీయము కేవలము రాజనీతిని దెలుపును. ఇది పదునైదధికరణములుగా 180 అధ్యాయములలో రాజవిద్యావినయ గృహాత్మరక్షణములును, అధ్యక్షులవిధానమును (దుర్గము పట్టణములు కప్పము సుంకము కోశము శాసనము గోవులు గజాశ్వములు భోజనశాల ముద్ర మొదలగువిషయములపై నధికారు లధ్యక్షులు) వ్యవహారస్వరూపమును దిక్పరిష్కారమును, రాజ్యములో నుండు నంతశ్శత్రుశోధనము, సేవకాదిపరిపాలనవిధి, ప్రజాసంపత్తును, దేశసంపత్తును, యానాసనసంశ్రయణద్వైధీభావసంధివిగ్రహస్వరూపములును, ప్రజాపురుషసేనామిత్రరక్షణవ్యసనము, దండయాత్రాక్రమము, యుద్ధప్రకారము, సంఘవిధియు, బలవజ్జయోపాయక్రమము, దుర్గలాభోపాయము, ఇంద్రజాలమాయాక్రమములును వరుసగా వివరింపఁబడినవి. దీనిపైఁ బ్రభావతి యను బౌద్ధభిక్షువు చాణక్యటీకయు, శంకరాచార్యులు జయమంగళయు, మాధవమిశ్రయజ్వ నయచంద్రికయు, భట్టస్వామి ప్రతిపదపంచికయు వ్యాఖ్యానములుగా రచించిరి. వానిలోఁ గొంతకొంతభాగములు లభించుచున్నవి. భిక్షుమాధవులవ్యాఖ్యానములు మంచివి. భట్టస్వామిది హీనరచనము. అయినను దీనిని ద్రవిడులును గేరళులును దమతమభాషలలోనికి ననువదించుకొనిరి. (ఇన్ని వ్యాఖ్యలతోఁ గౌటిలీయము నాంధ్రీకరింపమూరు నభిలాషయుఁ జాపల్యముఁ గలుగఁగా నేదో యొకరీతిగా గాని నడపుచున్నారము.) ఆంధ్రభాషలోఁ గేవలము కావ్యము మాత్రమే వృద్ధిపఱచి తక్కినవాఙ్మయాంగముల నాంధ్రులు వదించి రని పెక్కండ్రు తలంచుచున్నారు. ఆంధ్రుల కెల్ల గీర్వాణభాషయుఁ దెనుఁగున గ్రాంథికభాషయుఁ దుల్యస్థానములై యున్నందున వస్తునిర్వచననిష్కృష్టికిని బహుదేశవ్యాప్తికి ననుకూల మగుసంస్కృతమును విషయపరిశోధన ధర్మతత్త్వనిరూపణములకు సాధకభాషగాను, హృదయమును గరఁగించు రసభావములఁ బ్రత్యక్షపాంచాలాదిరీతుల నెత్తిచూపి చదివించుట కనుకూల మగుమాతృభాష యగు తెనుఁగును గావ్యభాషగాను మనవారాదరించిరి. అయినను మనుమంచిభట్టు,గోకర్ణుఁడు, మల్లన్న, యెల్లన్న, దామరాజుసోమన్న, గోవిందన్న మొదలగువారు క్రమముగా హయగణిత భరత సంగీతశాస్త్రములును శకుంతలాపరిణయకర్త యగు కృష్ణకవి ధనుర్విద్యావిలాసమును రచించియున్నారు. 1400 క్రీ. శకమునకుఁ బూర్వమే యర్థశాస్త్రప్రబంధములు తెనిఁగింపఁబడియె. చాణక్యసప్తతిని భద్రభూపాలుఁడు నీతిశాస్త్రముక్తావళి పేరను, బార్హస్పత్యమును రుద్రదేవుఁడు నీతిసార మను పేరను, శివదేవయ్య పురుషార్థసారమనియు, రచించినవి గాక నీతిభూషణము (ఆంధ్ర క్షేమేంద్రుని) ముద్రామాత్యము, నీతితారావళి మొదలగునవియు నుండినవి.

## ధనుర్వేదము III

ధనుశ్శబ్దము వింటికి రూఢమైనను ముక్తము అముక్తము, ముక్తాముక్తము యంత్రముక్తము - అను చతుర్విధ ప్రహరణముల వర్తించుచు ధనుర్వేదము శత్రుదండరూప మగుసమస్తప్రయోగసామగ్రితత్త్వమును బ్రతిపాదించును. అది యిరువదివేల శ్లోకములతో నీశానసంహిత యను పేరితో శివునిచేఁ బార్వతి కుపదేశింపఁబడియె. అందు—

వింశత్సహస్రమానస్తు ధనుర్వేదో౽పి కీర్తితః
యస్మిన్ నిగద్యతే సర్వలోకతత్త్వం వరాననే
బలాపాదనకాధ్యాయః స్థానాధ్యాయః ప్రవర్ధనమ్,
ధౌతికాపాదనాధ్యాయః సంధివిక్షేపణం తథా
అశ్రమోర్జ్జీవనో౽ధ్యాయః శ్రమప్రాప్తే ప్రలక్షణమ్
ఆయుధగ్రహణం శిక్షాక్రమ స్తత్పరిశోధనమ్
సన్నాహ స్థాన చలన మపసవ్యస్థితిక్రమః
ఆశ్లేషావాంతగాలంబ హస్తాటన పటుక్రియా
ముష్టిబంధ స్థానబంధో ధృష్టతాపాదనం తథా
సంగ్రామవిద్యావిజ్ఞానం సర్వాయుధవిలంఘనమ్
సూత్రాధ్యాయః పరీక్షా చ పాదపాయూపఘట్టనమ్
రథాశ్వేభ ద్యవస్థాన లక్షణాధ్యాయ ఏవ చ

(విలుంఠనం పోటనం చ భ్రమణం పరిశీలనమ్
ఆయుర్జ్ఞానం మోహనం చ భిన్నముల్లాసితం తథా)
చాపాదిలక్షణజ్ఞాన వస్త్రాణాం కరణం తథా
అస్త్రమంత్రపరీక్షా సాధ్యాయో, మదవినిర్గమః
ఏవమాద్యా ధనుర్వేదే విద్యాః సంతి సహస్రశః

అను నిరువదితొమ్మిదియంశములు విస్తరింపఁబడినవి. ధనుర్వేద సూత్రములు పరశురామకృతములై శాండిల్యభాష్యవివృతములై కేరళ దేశమున లభించుచున్న వని తెలియుచున్నది. అది నాలుగుపాదములు గలది ప్రథమము దీక్షాపాదము. రెండవది సంగ్రహపాదము. మూఁడవది సిద్ధిపాదము. నాల్గవది ప్రయోగపాదము. ధనుశ్శబ్దము సర్వ ప్రహారణముల వర్తించు. అది ముక్తాదిచతుర్భేదకము. ముక్త మనఁగాఁ జక్ర వజ్ర వలయ శక్తి తోమర కుంత పాషాణాదికము. అముక్త మనఁగా నంకుశ పాశ క్షురికా అసి గదా ముసల దండాదికము. ముక్తాముక్త మనఁ బాశ వాగురా రజ్జు వలయాదికము. యంత్రముక్త మనఁ జాప శతఘ్నీ శల్యక మంజూషా ర్క వర్ణాదికము. మనశాస్త్రాను సారముగా సర్వశస్త్రములలో ధనువు శ్రేష్ఠము. వింటిపంగములు బాణము అర్ధచంద్రము శిలీముఖము నారాచము మోచకము మొదల గునవి. అస్త్రము మంత్రాక్షరప్రతిలోమపఠితమై యధిదైవతప్రేరితమై యుండును. మంత్ర దేవతాభేదముల ననుసరించి, బ్రాహ్మము ప్రాజాపత్యము వైష్ణవము శైవము ఐంద్రము వారుణము ఆగ్నేయము వాయవ్యము సౌమ్యము (చంద్రదైవతకము) ఆదిత్యము దౌర్గము (దుర్గాదైవతకము) గాణేశ్వరము (వినాయకాధిదైవతకము) స్కాందము శాక్తేయము యాక్షము రాక్షసము నాగము గారుడము గాంధర్వము పైశాచము పైత్రము (పితృదైవతకము) పార్థివము ఆప్యము (జలాధిదైవతకము) తైజసము పావనము నాభసము (ఈ కడపటివైదును బంచభూతములఁ గ్రమముగా స్తంభింపఁజేయునఁట) సౌమ్యము పార్వతము గాయత్రము త్రైష్టుభ మానస్తుభము మొదల గునవి (కడపటిమూఁడును ఛందోదైవతకము లగుమంత్రములు ప్రయోగములుగాఁ గలవి.) ఈయాయుధశిక్ష కధికారులు క్షత్రియులును బ్రాహ్మణులును దక్షనుయాయులును నగుదురు. రథగజతురగపదాతులె వాని కధికరణములు. ఈసూత్రపాఠమునఁ బ్రథమపాదమున ధనుర్వేదాభ్యాసమునకు దీక్షాభిషేకశకునమంగల్యకరణాదికము వివరింపఁబడెను. రెండవది యగుసంగ్రహపాదమున సకలాస్త్రశస్త్రముల సంగ్రహవిధియు మూఁడవది యగుసిద్ధిపాదమున సంగ్రహించిన యస్త్రములకుఁ బునఃపునరభ్యాసమున మంత్రదేవతానియమజప హోమోపాసన క్రియలును విస్తరింపఁబడియె. మంత్రదేవత సకలయనియు నిష్కళ యనియు నిరుదెఱంగులం బరఁగు. అదియు చేతనావత్త్వము, ఇచ్ఛావిగ్రహత్వము, యష్టవ్యత్వము, తుష్టిమత్త్వము, ఫలదాతృత్వము, అనునైదుగుణములు గల దని పూజాహోమోపాసనాదుల సాధకులు నడపుదురు. షోడశోపచారములచే సిద్ధసేవత మిచ్చుఫలదానముచే సాధకుఁ డస్త్రప్రయోగము నొనర్చుట నాల్గవపాదమున విస్తరింపఁబడినది. శస్త్రగ్రహమునకు ధనుర్వేదమున నియమముగలదు— సామదానభేదములచే నసాధ్యుఁడయి దుర్వినీతుఁ డగుపురుషునిఁగాని, బహుప్రజాసంగక్షణాగ్రము తత్పాతకునిఁగాని, దేశకాలావస్థోచితముగాఁ గర్తృకరణశక్తి కనుగుణముగా నాపత్కాలమునను, సర్వదా ధర్మరక్షణమునను, దండము విధేయ మని శాస్త్రజ్ఞులు గ్రహించిరి.

ఈధనుర్వేదమున ముక్తాముక్తాదిచతుర్భేదములుగాక నియుద్ధ మని పంచమభేదమును దివ్యాతిశాస్త్రజ్ఞులు గ్రహించిరి. తద్భేదముల న్నియు మల్లయుద్ధములలోఁ బ్రయోగింపఁబడునవి. నాచనసోమనాథాదులు యుద్ధప్రక్రియల నుత్తరహరివంశాదుల వర్ణించియుండుట యెల్లరకు విదితమేగదా.

ధనుర్వేదదైవతస్వరూపమంత్రముల వైశంపాయనుఁడు తననీతి ప్రకాశికలో ని ట్లుపవర్ణించుచున్నాఁడు.

"చతుష్పాచ్చ ధనుర్వేదో రక్తవర్ణ శ్చతుర్ముఖః
అష్టబాహు స్త్రినేత్రశ్చ సాంఖ్యాయనసగోత్రవాన్
వజ్రం ఖడ్గో ధనుశ్చక్రం దక్షిణే భుజమండలే
శతఘ్నీ చ గదా శూలం పట్టిసం వామబాహుషు
ప్రయోగకోటీరయుతో నిత్యాంగో మంత్రకంచుకః
ఉపసంహారహృదయః శస్త్రాస్త్రోభయకుండలః
అనేకవల్గితాకారభూషణః పింగళేక్షణః
జయమాలాపరివృతో వృషారూఢ స్స ఉచ్యతే.

అని స్వరూపప్రతిపాదనానంతరము—

తన్మంత్రం చ ప్రవక్ష్యామి వైరిజాలనికృంతనం
ఆత్మసైన్యస్వపక్షాణా మాత్మన శ్చాభిరక్షకమ్
ఆదౌ ప్రణవముచ్చార్య నమ ఇత్యక్షరే తతః
వ శేతి భగపూర్వంతు ధనుర్వేదాయ చోచ్చరేత్
మాం రక్ష రక్షేత్యుచ్చార్య మమ శత్రూన్ వధేతిచ
భక్షయేతి ద్విరుచ్చార్య హుం ఫట్ స్వాహే త్యథోచ్చరేత్.
అహమేవ ఋషి శ్చాస్య గాయత్రీచ్ఛంద ఉచ్యతే
మహేశ్వరో దేవతాస్య వినియోగోఽరినిగ్రహే
ద్వాత్రింశద్వర్ణకమనుం వర్ణసంఖ్యాసహస్రకైః
జపిత్వా సిద్ధిమాప్నోతి రిపూంశ్చాప్యధితిష్ఠతి,

అని మంత్రలక్షణము నుపదేశించెను. ముక్తాదిభేదములు గాక ధనుర్వేదము మతాంతరముగా—

ఆధానం చైవ సంధానం విమోక్షః సంహృతి స్తథా
ధనుర్వేద శ్చతుర్థేతి వదంతీతి పరే జగుః

అని బాణము నెత్తుటయు ఎక్కు పెట్టుటయు తెగగొని యేయుటయు లక్ష్యవేధము అని నాల్గుక్రియల నుద్ద్యోతించువిభాగములు గల వని కొందఱు ఊహింతురు. మఱి యొందఱు శస్త్రము ప్రతిశస్త్రము అస్త్రము పరమాస్త్రము-అని చతుర్విధముగా విభజించిరి. వసిష్ఠసంహితయు సాంగధనుని వీరచింతామణి కోదండచతుర్భుజము కోదండమండనము వాశిష్ఠధనుర్వేదము ధాజవిజయము వైశంపాయననీతిప్రకా

కంటెను వేయింతలు వికటభీషణవేషంబునం బ్రజ్వలించుధనుర్వేదంబు గాని, దర్శనీయకైలాసోద్యానంబుల నేకాంతసుభగుండగు పరమశివుచే నవిచ్ఛిన్నానురాగభావబంధురంబుగ నుపదేశంబు నొందిన పార్వతీదేవికి సుకుమారకళయై; నందనవనసౌరభంబులకు సహచారంబుఁ గల్పించి దేవేంద్రుకొలువులోని మహార్హులసయిదము సాలభంజికలవలె బొమలెత్తి నిలుపంజాలిన యుర్వశీ ప్రభృతులకు ముల్లోకంబుల విజయించి తెచ్చు మచ్చునందునై, మురళీనినాదమధురం బగుయమునాసైకతలంబునఁ గృష్ణుని భువనమోహనరూపంబు మాచుమ శివమెత్తి మదనోన్మాదమదవిభ్రమంబుల శుకాటులనైన భ్రమింపఁజేయ నాడిన గోపికాజనంబునకు జీవనామృతంబును నైనగాంధర్వవేదమున కీడు రాఁగల దని యెవ్వరు తలంతురు? ఇట్టిగాంధర్వంబు నృత్తగీతవాద్యభేదంబుల మూఁడుతెఱంగుల భరతనారదాదిబహుప్రస్థానవిస్తీర్ణమై, సౌరాష్ట్ర మాళవ లాట కాశ్మీర కర్ణాటాంధ్ర మగధ వంగోత్కల ద్రవిడరాజులచేత నె యుపలాలితంబై పరరాజధాటికి నిలువఁజాలక స్వస్వరూపవిశేషంబులం బాసి శాస్త్ర మొకప్రక్కపథమున, సభ్యాసము వేఱొకప్రక్కత్రోవను, ఉపదేశము మఱియొకమార్గమునను బాఱుచుండఁ బవిత్ర మగుగంగాప్రవాహమునుబోలెఁ ద్రిపథగాప్రభావంబై రానురాను నిమ్నపదవిం ద్రొక్కఁ-చుఁ బాతాళమున నడుగంటుచున్నది. అహో భారతీదుర్విలాసము! యామళాష్టకతంత్రమున—

గాంధర్వవేదః షట్త్రింశత్సహస్రగ్రంథసమ్మితః
యత్ర సప్తస్వరోత్పత్తికథనం పరికీర్త్యతే
వీణాతంత్రం కలాతంత్రం రాగతంత్ర మనుత్తమమ్
మిశ్రతంత్రం తాళతంత్రం గీతికాతంత్రమేవ చ
లాసికోల్లాసికాతంత్రం మేళతంత్రం మహత్తరమ్
జాతిగ్రహాలయస్థానం మార్గాంగప్రక్రియా క్రియా
కాలజ్ఞానం వాద్యవల్లీ త్రిభిస్సాధ్యాయ ఏవ చ
తురంగ రతిసారంగ సింహలీలావిజృంభణం
అంగహార ప్రవిక్షేపాధ్యాయ స్సంక్షోభణక్రియా,
ఏవమాదీని గాంధర్వవేదే సంతి సహస్రశః

అని 36000 శ్లోకపరిమితి గల యమామహేశ్వరసంహిత సూచింపఁబడియె (తంత్ర మనఁగా విద్య - షష్టితంత్ర మనఁగా నఱువది విషయములు విశదీకరింపఁబడినసాంఖ్యశాస్త్రము.)

2. తంత్రము లని చెప్పఁబడినవానిలో శైవ, వైష్ణవ, పాశుపత, వైఖానస, శాక్తేయ, యామళాదితంత్రములు పెక్కులు గలవు. వానిలోఁ బరస్పరమతభేదనులు గలవు. తంత్రములలో సకలవిద్యాప్రశంసలు వచ్చుచుండును. గాంధర్వము శైవశాక్తేయయామళతంత్రములలో సాధారణముగా వర్ణింపఁబడి నృత్తగీతవాద్యములలోఁ గొన్నిటికిఁ బ్రాముఖ్యము చూపఁబడును. యామళతంత్రములు ముప్పదిరెండింటిలో—

ఏకోనవింశం వీణాఖ్యతంత్రం లక్షప్రమాణకమ్
నాదబ్రహ్మానందసిద్ధిర్యేన సిద్ధ్యతి వై నృణామ్
నిషాదాదిస్వరోత్పత్తి ర్గీతోత్పత్తిశ్చ లక్షణమ్
రాగాణాం భేదకథనం రాగకాలానుకీర్తనమ్
ధ్వనిప్రభేదకథనం మిశ్రామిశ్రావవర్ణనమ్
తాలశ్రుతిలయాదీనా ముద్భవ శ్శోభవర్ణనమ్
చతుర్విధానాం వీణానాం లక్షణం తంత్రి (?) లక్షణమ్
కిన్నరస్వరయంత్రాదిలక్షణం మేళలక్షణమ్ (కిన్నెర, స్వరమండలము లనునవి వీణలు)
షడ్గీతాదిప్రకథనముత్పత్తిస్థానవర్ణనమ్
ఏవమాదీని కీర్త్యంతే యస్మిన్ తంత్రే సహస్రశః

అని పందొమ్మిదవది యగు వీణాతంత్రము లక్షగ్రంథపరిమితమై సంగీతశాస్త్రము సంపూర్ణముగా వివరింపఁబడినగ్రంథమఁట. తొమ్మిదవది యగు కళాసారతంత్రమున రసభావనాట్యనాటకలక్షణ కామశాస్త్రాదివిషయములు గలవందురు. పదునెనిమిదవది కుండీశ్వరతంత్రము—

అష్టాదశం లక్షమానం కుండీశ్వరమతాహ్వయమ్
యత్రానేకవిధానాం తు విద్యానా ముపవర్ణనమ్
నానానాటకవిద్యానా మలంకారానువర్ణనమ్
సంగ్రామవిద్యా బేతాళవిద్యా లోకాద్భుతావహా
సూదవిద్యా చ గాంధర్వవిద్యాశ్చర్యవిధాయినీ
వీణావేణుమృదంగానాం తాళనర్తనయో రపి
విద్యా సంగీతవిద్యా చ సర్వశ్రోత్రమనోహరా
చిత్రకర్మకరీ విద్యా చిత్రార్థస్య విధాయినీ
చిత్రాభాసా లేఖనికా విద్యాదృశ్యవిధాయినీ
రసవాదకరీ విద్యా విద్యా ధాతుజయావహా
పరకాయా వేశకరీ సర్వాశ్చర్యవిధాయినీ
నానావిధానాం గంధానా మాకర్షణవిధాయినీ
జనయిత్రీ నరాంగేషు విద్యా సంమోహకారిణీ
ఏవమాద్యా మహావిద్యాః కథ్యంతే యత్ర కోటిశః

అని యందు గాంధర్వచిత్రలేఖనమాయేంద్రజాలవిద్యలు గలవఁట.

3. ఇరువదొమిదవ త్రోతాళతంత్రమున

"త్రోతాళనామకం తంత్రమష్టావింశం సలక్షకమ్
యస్మిన్ భరతసర్వస్వం సాక్షాచ్ఛివముఖోద్గతమ్
లక్షణం తాళభేదానా మంకశోన్మానలక్షణమ్
మార్గక్రియాంగజాతీనాం కలాగ్రహ లయోద్భవః
ధ్రువాది ప్రతాళానాం తద్భేదానాం చ లక్షణమ్
వైనాయకానా మైశానాం వాగ్భవానాం చ లక్షణమ్
అన్యేషాం తాళకోటీనాం దేశీయానాం చ లక్షణమ్
చచ్చత్పుటాదితాళానాం శివాగమభువాం తథా
విధా త్రిభిన్నలీలానాం యస్మిన్ తంత్రే ప్రకీర్త్యతే"

అని నాట్యతాళవిషయములు మాత్రమే లక్షగ్రంథమున వర్ణింపఁబడెనఁట. ఈతంత్రగ్రంథము లేవియు మనకు లభింపవయ్యె. అనుదినము చిత్రవిచిత్రములుగా నతిప్రాచీనగ్రంథములు లభించుచున్న

మన కివియెల్ల నబద్ధపంచాంగములోనివర్జ్యము లని తలంచుసాహసము జనింపఁజాలదు. శాక్తేయతంత్రములలో నుడ్డీశమహోదయ మను గ్రంథమున శివపూజాఘట్టమున వాద్యలక్షణము లానుషంగికముగా వర్ణింపఁబడియుండుట మనకు లభించుచున్నది. అందు

ప్రథమం తాళనిలయం ద్వితీయం ఝల్లరీ తథా
పంచమం భేరివిజ్ఞానం షష్ఠంతు తిమిలా తథా.
సప్తమం తు హుడుక్కా చ తథాష్టమమిడక్కికా
నవమం డమరుకం చైవ దశమం మురవం తథా
ఏకాదశోఽంగులిస్ఫోటో ద్వాదశం వీణికా తథా
ఆలావణి స్తథా వాద్యం త్రయోదశమతః పరమ్
చతుర్దశం చ సంప్రోక్తం జ్ఞేయం రావ. హ స్తకమ్
పంచాదశక ముద్యంతం విద్యా ద్ఘోషవతీ తథా
షోడశం బ్రహ్మకంకాళమేతైరధ్యాయషోడశైః
క్రమేణ వాద్యవిజ్ఞానం విస్తరేణ వదామి తే

అని పదునాఱువాద్యలక్షణములు పదునాఱధ్యాయముల నిక్కడు లభించుచున్నవి. అవి తంత్రమునడుమ వచ్చుచున్నవి. గ్రంథకర్త యొక్కటికి విస్తరముగా దత్కరణప్రయోగవిధుల నిచ్చియున్నాఁడు. జర్ఝరి నాఱుతెగలుగా వర్ణించి—

ఇతి పరమవిధానం విస్తృతం జర్ఝరీణాం
ప్రతి ఖలు వివిధానాం వాద్యభేదాన్ నిశమ్య
సరసతినిలయే వా దేవగేహే మనుష్యే
సురమునిహితవాద్యం విశ్రుతం మంగళోదయమ్॥

అని నారదమతానుసార మని ముగింపఁబడియె. ఇట్లే తంత్రములు లేవండె నని చెప్పుట సాహసము.

గాంధర్వవిద్యలోఁ బ్రస్థానములు పెక్కులు గలవు.
"సదాశివస్య శివయో గౌర్యాముతం వాసుకేః

వాగ్దేవ్యా అపి నారదస్య చముకేః కుంభోద్భవ వ్యాసయోః శిష్యాణాం భరతస్య"

అనినందికేశ్వర ఉమామహేశ్వర వాసుకి సరస్వతీ నారదాగస్త్య వ్యాసమతములు గలవని శారదాతనయుఁడు పేర్కొనియె. ప్రస్థానభేదములుగా—నందీశ్వర దుర్గా యాష్టిక దత్తిల నారద భరతమతము లాఱును మనకుఁ గొంత తెలియుచున్నవి. నందీశ్వరసంహిత ౨౫౦ సంవత్సరములకుఁ బూర్వము తంజాపురీరఘునాథనివసకు లభించియుండె. నేఁడు గానరాదు. దానిలోనిసార మగు "ఔమాపతము" భరతనారదాదిమతములకు విలక్షణముగా నున్నది. ఆరఘునాథుడు సంగీతసుధలో—

"సమీక్ష్య నందీశ్వరసంహితాం తామాలోక్య శాస్త్రం భరతప్రణీతమ్
గ్రంథం బృహద్దేశ్యభిధం మతంగమునిప్రణీతం నిపుణం విలోక్య
విచార్య తాం యాష్టికసంహితాం చ జ్ఞాత్వాంజనానందనసంహితాం చ
ఉమాపతేరాధునికస్య తంత్రముద్వీక్ష్య నందీశమతానుసారి
సంగీతసారం సమవేక్ష్య విద్యారణ్యాభిధశ్రీచరణప్రణీతమ్
నిశామ్య సంగీతకచంద్రికాఖ్యాం కృతిం చ భట్టాదిమమాధవస్య
శ్రీశార్ఙ్గదేవేన కృతాం చ సప్తాధ్యాయీం తథా లక్ష్మవిరోధి ష్యామ్

(సప్తాధ్యాయీతి సంగీతరత్నాకరః)

ఏనాం స్ఫుటీకర్తు మిహ ప్రవృత్తౌ తౌ బ్రాహ్మణౌ కేశవకల్లినాథౌ
టీకాద్వయేనాపి కృతా న తాభ్యామబోధితాః స్పష్టపదార్థభేదాః"

అని నందీశమతమున ఉమాపతి (1850 క్రీ. శ) రచిత మగు నౌమాపతము సంగ్రహరూప మని యేర్పడును. ఇది 40 అధ్యాయములలో నతిసంగ్రహవిషయకముగా లభించుచున్నది. వైనుధలోఁ బేర్కొన్న మతంగుఁడు బృహద్దేశి యను నద్భుతగ్రంథము రచించెను. దానిలో 6 పరిచ్ఛేదములుగా ౨౮00 గ్రంథము గలభాగముమాత్రమే యనంతశయనమున లభించుచున్నది. అందు స్వరోత్పత్తిశ్రుతిభేదములనిర్ణయము మాత్రము కలదు. శిష్టభాగములభించునేని లోకమునకుఁ జాల మేలగు. మతంగుఁడు ప్రాయశః భరతమతానుసారి. యాష్టికమతసారము 200 శ్లోకములలోఁ గానవచ్చుచున్నది. నారదమతమునకు నారదశిక్ష యను సామవేదశిక్ష గలదు. నారదసంహిత మాకు లభించినది కాదు. బృహన్నారదీయపురాణమునను నారదోపనిషత్తునను నారదమతసార మీఁబడియె. సంగీతమకరందము నారదప్రోక్తముగా ముద్రింపఁబడినది. దానిని నారదమతసారముగా నెవ్వఁడో తన్నామమునసే రచించియుండును. ఏలయనఁగా గీతదోషములు వివరించుచు "మహామహేశ్వరేణోక్తః సదోషో గాయకాధమః" (IV పాదము-89 శ్లో.) అని మహామహేశ్వరాచార్యాభినవగుప్తుఁ (1000 క్రీ. శ) దద్గ్రంథకర్త స్మరించుచున్నాఁడు. ఈగీతదోషములు చక్కఁగా వివరించినవారు భోజాభినవగుప్తులే యని శారదాతనయుఁడు—

ముదితం చ ద్రుతంచైవ దోషాః సప్తైవ గీతిజాః
ఈదృక్స్వరూపం భోజాద్యైః స్వప్రబంధేషు వర్ణితమ్
భట్టాభినవ గుప్తాఖ్యపాదై రేతత్ప్రదర్శితమ్
మయాపి శారదీయాఖ్యే ప్రబంధే సుష్ఠు దర్శితమ్

అని చెప్పెను. నారదశిక్షకు నాచార్యశుభంకరుఁడు సుందరమైనవ్యాఖ్య రచించె. ఈరెండును దన్మతమును జక్కఁగా దెలుఁగుటకు మనకు లభించుచున్నవి. రాగసాగర మనుపేర దత్తిలనారదసంవాదరూపముగా నొకగ్రంథము కలదు. అది సుమారు ౭00 సంవత్సరముల నాఁటి దనియుఁ దన్మతముల వ్యక్తీకరింప సుసార్థ్యము చాల దనియు మా యభిప్రాయము.

సంగీతరత్నాకరకారుఁడు భరతమతమును సాధారణముగా నవలంబించినను దుర్గాదత్తిలమతములను గొంత గ్రహించె. గీతవిభాగమున "శుద్ధా చ భిన్నా చ తథైవ గౌడీ స్యాద్వేసర స్తత్ర భవేచ్చతుర్థీ
సాధారణీ పంచమికా తు గీతి ర్దుర్గామతజ్ఞైరితి పంచధోక్తా
ఆశ్రిత్య దుర్గామతమేవ సమ్యక్తాః శార్ఙ్గదేవేన తు పంచధోక్తాః
తిస్రస్తు తా యాష్టికసంమతాః స్యుః భాషైవ శార్దూలమతే తు గీతిః"

అని రఘునాథుఁడు వివిధమతములు చెప్పి శార్ఙ్గదేవుఁడు దుర్గా మతమును గ్రహించె నని తన దళధావిభాగమును నెలకొల్పెను. శార్దూలమత మనఁగాఁ గోహలీయమతమునకు నామము. కోహలుఁడును శార్దూలమునియు సంవాదము సలిపినట్లే కోహలీయము నడచుచున్నది.

2. నైమతములలో నెల్లఁ గాలపరీక్షకు నిలచి విద్వాంసులు చేయాడినది భరతప్రస్థానమే. బ్రహ్మవలన భరతుం డెఱింగి గాంధర్వ మంతయు నృత్తగీతవాద్యవిభాగముగా రెండుగ్రంథముల ద్వాదశసహస్రగ్రంథముగాఁ బెద్ద దొక్కటియు షట్సహస్రి యనుచిన్న దొక్కటి రచించె. అందు పెద్దది యిప్పుడు కానరాదు. శారదాతనయుఁడు—

"నాట్యవేదాచ్చ భరతః సారముద్ధృత్య సూత్రతః
సంగ్రహం సంప్రయోగార్హం మునునా ప్రార్థితం వ్యధః
ఏకం ద్వాదశసాహస్రైః శ్లోకైరేకం తదర్థతః
షడ్భిః శ్లోకసహస్రైర్యో నాట్యవేదస్య సంభవః
భరతైః స్నామతస్తేషాం ప్రఖ్యాతో భరతాహ్వయః"

అని రెండువిధగ్రంథముల నుపయోగించెను. శారదాతనయుఁడు క్రీ. శ 1150 లో నుండినవాఁడు. క్రీ. శ 1200 కాలమున నుండిన బహురూపమిశ్రుఁడు తనదశరూపవ్యాఖ్యలో—అంకావతార మను సంధిస్వరూపమును వర్ణించుచు

"సమాప్యమాన ఏకస్మిన్నంకే ఽవ్యార్థత్వ సూచనమ్
సమాప్యతే హి నాట్యజ్ఞై రంకావతార ఇష్యతే

ఇతి ద్వాదశసహస్రీకారః, యథా మాళవికాగ్నిమిత్రే ప్రథమాంకావసానే" అని యుదాహరించినందున 1200 క్రీస్తుశకమువఱకు వృద్ధభరతము పఠనములో నుండె నని తోచుచున్నది. భరతశిష్యుఁడు కోహలుఁడు భరతునిగ్రంథమున స్థూలముగాఁ జెప్పఁబడిన పదునొకొండంశములఁ బెంచి యవాంతరభేదసహస్రములు గల్పించి పదుమూఁడు విషయంబులఁ బెద్దగ్రంథము రచించె నని వ్యాఖ్యాతలు చెప్పుచున్నారు. సుమారు 200 సంవత్సరములపూర్వము కోహలీయము సంపూర్ణముగా లభించుచుండె మన కదుఁ దాళాధ్యాయముమాత్రమే దక్కినది. భరత కోహళమతము లల్పభేదములు గలవైనను నేకప్రస్థానసమ్మతములు. ప్రాచీనుఁడు నఖకుట్టకాచార్యుఁడు నాట్యశాస్త్రము రచించె నందు రది యుత్సన్నమయ్యె. బహురూపమిశ్రుఁడు తోటక మనురూపకవిశేషము నాటకములో నంతర్భూత మని "తథాతోటకస్యాపి నఖకుట్టాదిభిర్నాటకాంతర్భావేనైవ లక్షణముక్తమ్, 'దివ్యమానవసంయోగస్తోటకం నాటకానుగమ్' ఇతి నఖకుట్టః" అని యుదాహరించె. ఈవిషయమునే ప్రశంసించుచు శారదాతనయుఁడు "దివ్యమానుషసంయోగో యత్రాంకైరవిదూషకైః। తదేవ తోటకం భేదో నాటకస్యేతి హర్షవాక్" అని హర్షునిమతము పేర్కొనుటచే హర్షనఖకుట్టు లొక్కరా యని సందియము కలుగవచ్చును. బ్రహ్మమత మని భరతప్రస్థానము కంటెఁ బ్రాచీనమైనది యొకటి గలదు. వరరుచికాలమునకు బ్రహ్మమతమే ముఖ్యము. భరతుఁడును బ్రహ్మమతము నుదాహరించె.

భరతమతంబె యడుగంటక నిలచియున్నందునఁ దన్మతావలంబకము లగుగ్రంథములలో గొన్నిఁటి విచారింతము. భారతీయమునకు రాహులకుఁ డను బౌద్ధుఁడు (200 క్రీ. శ 400?) భిన్నవృత్తజాతిక మగు కారికారూపముగ నొకవృత్తియు శ్రీహర్షదేవుఁడు (క్రీ. శ 400?) ఆర్యాప్రాయముగ నొకకారికయు, భట్టలొల్లటుఁడును (650 క్రీ. శ), మయూరునిపుత్రుఁ డగుశంకుకుఁడును (670 క్రీ. శ), కాంచీపతి మహేంద్రవిక్రమునియాస్థానకవిరత్నము రుద్రటాచార్యుఁడును (620 క్రీ. శ), ఉద్భటుఁడును (800), ఘంటుకుఁడును (?), హృదయదర్పణ మనుపేర భట్టనాయకుండును (920 క్రీ), ప్రౌఢవ్యాఖ్యలు రచించిరి. ఇవి యన్నియుఁ గాలభాగమున నశించినవి. అభినవగుప్త (1000 క్రీ. శ) వ్యాఖ్యానకేత (1020) భావ్యములుమాత్రమే పూర్ణముగా లభించుచున్నవి. భరతునినాట్యశాస్త్రము సర్వసులభముగా నాటాలసోపాల మగ్గ మగుచున్నట్లు తోచినను లభించినవ్యాఖ్యలతోఁ జదివినప్పుడు మాత్ర మది సుదుర్గ్రాహ్య మనియుఁ గేవలసంప్రదాయవిద్యమానబహుప్రస్ఫుటకంబనియుఁ దశాస్త్రజ్ఞులకు నైతము స్ఫురింపకమానదు. భారతీయమునఁ గ్రమముగా నాటకరంగస్థలనిర్మాణక్రమము కరణాంగహారనిరూపణము రసభావస్వరూపము చతుర్విధాభినయలక్షణము ఛందోభాషాలంకారరామణీయకము దశరూపకవిధానము భారత్యాదివృత్తిసంధ్యంగతత్త్వము వేషరచనయు పాత్రపరస్పరోపచారప్రకారము గీతతద్వాసంవేశనవిధియుఁ జక్కఁగా వివరింపఁబడెను. కోహలుఁడు వీనిలో నొక్కొక్కటియుఁ బెంచి యవాంతరభేదములఁ గూర్చి విస్తరించె. నందికేశ్వరుఁడు వివాహపట్టాభిషేకదేవతోత్సవాదుల మంగళ్యమగునృత్తసరణి విస్తరించి భిన్నప్రస్థానముగాఁ భిన్నపరిభాషాబంధురంబుగ రచియించె. ఉదాహరణముగా నంది చెప్పినప్రేంఖణము పేరణి కుండలి జక్కిణి శ్యాముల దండలిక మొదలగుపదియు భారతీయమునఁ గాన రావు, ఇవియన్నియు నధునాతనభక్తికోద్భూతము లని మాయభిప్రాయము.

"కుండలీ భోగవతా ం తు కల్పితా మాండకర్ణినా
అయోధ్యాయాం కృతా పూర్వం పేరణిర్వాయుసూనునా।
ఘూర్జరీద్వారవత్యాం తు కల్పితా బాణకన్యయా॥
కాళికాయాః కృతేజాతా మంగ్యేవ జక్కిణీ"

ఇత్యాది లక్షణోత్పత్తియుఁ, జిందునుగుఱించి (చిందులు త్రొక్కుట యని యాంధ్రభాషాజాతీయము)

"మృదంగకరటాకాంస్యతాళకాహళవాదకైః॥
వాద్యమానేషు వాద్యేషు ప్రతిప్రహరణాదిషు
రుద్రాక్షాభరణైః శ్లక్ష్ణక్తధూత్రిపుండ్రకా
శివైకతత్పరా భక్తా నరా నారీజనోఽథవా
శ్రేణీభూతాః ప్రమోదేన గాయంతశ్చంద్రశేఖరమ్
అంగైరత్యర్థోచితైః పాదైర్లాస్యాంగైర్గతిసంయుతైః
అన్యోన్యాభిముఖీభూయ ద్విధాభూతాః కదాచన

కదా చిన్మండలీభూతా యుక్తిభిర్బహుభంగిభిః
శివోత్సవేషు కర్తవ్యం నృత్తమేతచ్ఛివప్రియమ్
కరతాళయుతోపేతైర్వాద్యైర్వక్త్రభవైః సహ
పాదైర్లలితలాస్యాంగైశ్చారిభిర్గతిభిస్తథా
గీతాభినయనోపేతైర్ద్విపదైశ్చిందుసంజ్ఞకైః
చిందునృత్తమితి ప్రోక్తమిదం ద్రవిడవల్లభైః" అన్నట్లు వైలక్షణము చెడకుండ నాఁడును నేఁడును బాంధ్యకవాటిక యగు పయణిమలమీఁదఁ గుమారస్వామియెదుట నాడిపాడిభక్తజనులకు శివసాయుజ్యము ముహూర్తమాత్రమేని యీఁజాలినయీనృత్తవిశేషమును"
కల్యాణకటుకే పూర్వం భూతమాతృమహోత్సవే
సోమేశః కౌతుకీం కాంచిద్భిల్లీవేషముపేయుషీమ్
నృత్యంతీమథ గాయంతీం స్వయం ప్రేక్ష్య మనోహరమ్
ప్రీతో నిర్మితవాంశ్చిత్రం గొండలీవిధమద్భుతమ్
తతో భిల్లీ మహారాష్ట్రైర్గొండలీత్యభిధీయతే"
అనునట్లు చాళుక్యసోమేశ్వరుఁడు (1129 క్రీ. శ) కల్పించెనన్న గొండ్లి (గొండలీభేదము) నృత్తమును మొదలుగా నవాంతరభేదములనంది పరిగ్రహించి వెలయించెనని యూహింపఁదగియున్నది. ఆంధ్రరాజులసభలలో నీనవీనప్రస్థానమే యెక్కువ యాదరింపఁబడియెననుటకుఁ దత్పారిభాషికపదములు వాఙ్మయభాషలో నోట మెదగుచుండుటయే సాక్ష్యము. వాగడము—
పిశాచవానరాదీనాం వేషచేష్టానుకారకమ్
వికృతైరాననోష్ఠాక్షిరుక్షివాక్చరణాదిభిః
వితాళం వికృతం నృత్తం హాస్యకృద్వికటం విదుః
కైశ్చిద్వాగడమిత్యుక్తం హాసకానాం ప్రసిద్ధితః"
అని వికృతచేష్టాసూచక మగు శబ్దమును పాటపాట, కోలాటము (వీరరసవ్యంజకము), గొండ్లి, చిందులు మొదలగుపదములు కావ్యములలో సాధారణము లయ్యె.
"సర్వంసహాకాంత పేరణము సూప"
"ఉఱ్ఱూఁతలూఁగెడునుదయాస్తగిరులచే నాకాశలక్ష్మి కోలాటమాడ"
"కమలసంభవుఁడు పెక్కణ మొనర్ప," అని సోముఁడును
"ఏకసక్కముగ నాడు నేదైననొకమాట పాడు సొయ్యనపాట పాటపాట"
"ఉఱుమచప్పుళ్ళకును బిళ్లఁదొరుల మ్రోఁత" (జక్కనీలక్షకము).
"గొండ్లి యాడించుచున్నారు గోరికపడుచు"
"మత్తల్లిమహానృత్యముల్" అని శ్రీనాథుఁడును మొదలుగా నెల్లరు గ్రహించిరి.

ఇట్లు గీతనృత్తతాళముల మూఁటను నవనవోన్మేషప్రతిభావిలాసమునకు భారతీయ మందక పోవుటచే విచిత్రతాళపరంపరలును మూఁటిసమ్మేళనమునఁ బ్రబంధవిశేషములును లెక్కలేక జన్మించినవి. కావున భారతీయము కేవలము జ్ఞానాభివృద్ధికేకాని ప్రథమశిక్షకు నుపయోగింపదని తోచుచున్నది. అభినవగుప్తవాఖ్యతో రసభావాధ్యాయవివరణము మహాప్రౌఢమై విద్వాదాదరణీయమై యున్నది. కానిసేయాలంకారికులెల్ల సాధారణముగాఁ గొని తమతమబుద్ధివైచిత్రిని బ్రకటించిరి. భారతీయామృతసరస్సునుండి తీసినపిల్లకాలువల నించుక పరిగణింతము.

గీతస్కంధమున నాగార్జునునిగ్రంథభాగము ప్రాచీనమైనది (క్రీ. శ. 100) లభించుచున్నది. క్రీ. 1000 కిఁ దరువాతిగ్రంథములలో నభినవగుప్తునిభరతవ్యాఖ్య నిరుపమానమై యతిప్రౌఢమై బహుప్రస్థానపరిశుకంబై యున్నది. అతనినాట్యలోచనము లభించినదికాదు. త్రిలోచనునినాట్యలోచనభాగము దొరకును. పార్థవిజయ మను నద్భుతనాటకము రచించినత్రిలోచనుఁడే దీని రచియించియుండిన నిది రాజశేఖరునకుఁ (900 క్రీ. శ.) బూర్వగ్రంథ మగును. ఇది నృత్తమునే ప్రతిపాదించుచున్నది. క్రీ. శ. 1120 లో బాశ్చాత్యసోమేశుఁ డభిలషితార్థచింతామణిలో నృత్తవాద్యప్రబంధలక్షణముల విస్తరించి సుష్ఠువుగా విరచించె. 1210 ప్రాంతములఁ ద్రివిధగాంధర్వముఁ బ్రతిపాదింపఁ గలసంగీతరత్నాకరమును శార్ఙ్గదేవుఁడు రచియించె. ఇతఁడు కర్ణాటరాజగు సింగణునిసభలో గాయకరత్నము. దీనిపై సంగీతకౌస్తుభ మను నల్పవ్యాఖ్యయుఁ, గల్లినాథుని ప్రౌఢవ్యాఖ్యయుఁ గలవు. 1160 ప్రాంతములఁ గాకతీయరుద్రదేవునిసభాలంకార మగువీరభల్లటదేశికుఁడు నాట్యశేఖరము రచించెనఁట. అది యిప్పుడు గానరాదు. నాట్యసంగీతగ్రంథకారులలోఁ బెక్కండ్రు సన్న్యాసులు శైవాచార్యులు అస్ఖలితబ్రహ్మచారులు శాక్తేయులు నగుట విచిత్రముగానున్నది. క్రీ. శ. 1236 ఆనందవర్షమునం గాకతీయగణపతిదేవుని గజసైన్యాధిపతియు బావమఱఁదియు నగు జాయసేనాపతి నృత్తరత్నావళియని యెనిమిదిపరిచ్ఛేదముల మార్గదేశీరీతులరెంటను నృత్తలక్షణముపూర్ణముగా రచించె. ఇది లభించుచున్నది. 1300 కాలమునఁ బార్శ్వదేవుఁడు జైనకర్ణాటకవి సంగీతసమయసారమున గీతస్కంధమునే మార్గదేశీరీతుల వివరించెను. ఇతఁడు భోజసోమేశ్వరాదులఁ జాల ననుసరించె. 1330 కాలమున భల్లాళరాజగు ప్రతాపచక్రవర్తిజగదేకమల్లునిచే సంగీతచూడామణి నృత్తగీతాధ్యాయములు పుష్కలముగా వాద్యలక్షణము న్యూనముగాను రచింపఁబడియె. 1200 (?) కాలమున మగధేశుఁ డగుకుంభకర్ణనరేంద్రుఁ డద్భుతముగా సంగీతరాజ మనుపేరఁ ద్రివిధగాంధర్వమున నన్నిమతములఁ గ్రోడీకరించి 17000 గ్రంథముగాఁ గూర్చెను. అందు 12000 మాత్రమె లభించును. కాని నృత్తాధ్యాయము గానరాదు. 1220 (?) కాలమునఁ జాళుక్యహరిభూపాలుఁడు సంగీతసుధాకరమును శ్రీరంగమున నాడువేశ్యలకొఱకు రచియించినగీతనృత్తాత్మకలఘుగ్రంథము దొరకును. 1340 (?) కాలమున నష్టావధానవిఖ్యాతుఁ డగుసోమనార్యుఁ డను నాంధ్రుఁడు నాట్యచూడామణియనుపేర గీతనృత్తముల నవీనప్రస్థానకముగా విరచించె. ఇతఁడే నాచనసోముఁడా యని సందియము కలుగుచున్నది. 1360 ప్రాంతమున విద్యారణ్యులు సంగీతసారము రచించిరి. అది ప్రాచీనగ్రంథములలోని దోషములను విరోధములను బరిహరించి విలక్షణముగా రచియింపఁబడియుండు నని తెలియుచున్నది.

"నిరూపితా లక్షణతో వివిచ్య రాగాశ్చతుః షష్ట్యధికం శతే ద్వే
కర్ణాటసింహాసనభాగ్యవిద్యారణ్యాభిధశ్రీచరణాగ్రణీభ్యః"

సంగీతసుధ.

**మాకు** లభించినసంగీతసారము లఘువిషయకమై వైలక్షణ్యమందుఁ గాననగుచున్నందున విద్యారణ్యులనిబంధ మింకను వెదకవలసియే యున్నది. 1420 కాలమున దేవణభట్టను విద్యానగరాస్థానపండితుఁడు సంగీతముక్తావళి యని నృత్తగీతలక్షణముల సామాన్యరూపముగా రచించె. ఆకాలముననే శ్రీనాథవామనభట్టాదులకుఁ జేయూఁతయై రసికసార్వభౌముఁ డగుపెద్దకోమటివేమన సంగీత-చింతామణి యను నృత్తగీతలక్షణగ్రంథము రచించె. అది యిప్పుడు సనంతశయనమున లభించుచున్నది. ఈకాలముననే రేచెర్లవంశమణి యగుసింగయ్యమాధవేంద్రునిసభాలంకార మగునాంధ్రకవి గౌరన లక్షణదీపిక యనుపేర సంగీతభాగమును జిత్రవిషయకముగాఁ గూర్చినది కలదు. 1360 (?) కాలమున దామిరాజుసోమన భారతీయమంతయుఁ దెనిగించినట్లు కానవచ్చుఁ గాని యది సంపూర్ణముగా లభింపదయ్యె. 1600 (?) ప్రాంతమునఁ గర్ణాటసంగీతమునకు భిన్నప్రస్థానముగా నాసికప్రాంతవాసి యగుపుండరీకవిఠ్ఠలుఁడు నర్తకనిర్ణయ మని నృత్తగీతాధ్యాయముల రమణీయముగాఁ గూర్ప నౌత్తరీయులు దానిఁ జేయూఁతగాఁ గొనిరి. వీణావాదనమున నుపకారిగాఁ గర్ణాటరామ "యలయాస్థానభూషణ మగురామామాత్యుఁడు స్వరమేళకళానిధి యని సంగీతలక్షణమె చక్కఁగా వివరించె. మేళవిషయమున దోషపరిపూరిత మని గ్రహించి దీనిని తంజాపురిరఘునాథునిశిష్యుఁ డగువేంకటమఖి యను మీమాంసకుఁడు తనచతుర్దండిప్రకాశికలోఁ గఠోరముగాఁ దిట్టినను రామామాత్యునిమేళలక్షణమే నిర్దుష్ట మని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు. 1600 కాలమున నహోబలుఁడు సంగీతపారిజాత మనుపేర నిర్దుష్టముగ గీతభాగమును లఘురూపమున వివరించె. ఇతఁడు రామామాత్యుని మేళలక్షణముల సమర్థించుచుండును.

1620 ప్రాంతమున "సుజ్ఞానజనకుం" డనుబిరుదము వహించిన తంజాపురీరఘునాథరాజు నాశ్రయించి తత్సభలో సంగీతసాహిత్యముల సామరస్యముఁ జూపి యచ్చరలకేవలగాంధర్వకౌశలముఁ బరిహసింపఁజాలుమధురవాణి, రామభద్రాంబ, రంగాజి మొదలగుభోగినీజనుల పుట్టుమైలను గడిగివైచి వారికిఁ గీర్తిసౌరభముఁ దేఁజాలినగాంధర్వవిద్యాధిదేవత చోళదేశమును నిజపీఠముగాఁ జేసికొని త్యాగరాజాదుల యపూర్వగీతగమకములకు ననువాదినీయంత్రములసైతము స్ఫురితకంపితములఁ దెల్పింపఁజాలె ననుట యచ్చెరువు కాదు. అట్టిరఘునాథుఁడు రచించినసంగీతసుధ యనునిరుపమానగ్రంథములో నాల్గధ్యాయములు మాత్రమే స్వరశ్రుతిరాగప్రబంధలక్షణములు గలవి లభించుచున్నవి. నృత్తతాళాధ్యాయములు లభింపవయ్యె. శాస్త్రలక్షణరహస్యములు తెలియఁగోరువారు దీనిం జదువక మానరు. ఇందు భిన్నప్రస్థానముల మతవిశేషములును వివరింపఁబడియె. లక్ష్య లక్షణవిరోధములఁ దీర్చి శ్రుతిరాగస్వరూపము నొక్కొక్కటి వినినంత మనసులో నాటుకొనున ట్లీరాజకవి యతిస్ఫుటముగా విమర్శను చేయుచుండును. 1640 లో నితని శిష్యులలో నొక్కఁ డగు మహామీమాంసకుఁ డని కీర్తి గన్న వేంకటమఖి తన చతుర్దండిప్రకాశికలో వీణాలక్షణమును శ్రుతిస్వరూపరాగస్వరమేళనము నూతన పక్కికగా విశదీకరించె; రఘునాథవేంకటమఖు లియ్యిరువురు క్రొత్తవీణల సృష్టించి వాడుకలోకిఁ దెచ్చిరి.

ఓఢ్రదేశపురాజులు శాస్త్రసాహిత్యములందే కాక సంగీతమునను గ్రంథరచన పోషించిరి. భట్టశుభంకరుని నారదశిక్షావ్యాఖ్యయు, నతని సంగీతదామోదరమును, (పర్లాకిమిడి) గజపతినారాయణదేవుని సంగీతనారాయణమును, కలాంకురనిబంధమును, సంగీతసరణియు మొదలగునవి యోఢ్రులభారతీసేవను బ్రకటించుచున్నవి. ఇవియన్నియు నేకప్రస్థానగాములై చాలలోఁతునకు దిగక సామాన్యముగా గాంధర్వప్రక్రియ నెత్తిచెప్పఁజాలు.

ఈశాస్త్రావతారక్రమము నించుక యవధరించి చూచిన మొదట సౌరాష్ట్రమున జనించి కర్ణాటచాళుక్యరాజుల చల్లఁజూపులఁ బెరిగి యాంధ్రరాజు లగుకాకతీయరెడ్డివిద్యానగరతంజాపురీరాజులకరావలంబమున సౌభాగ్యము వహించి భావరసగర్భితము లగుక్షేత్రయపదాదులకు విచిత్రవైఖరిం గూర్చునంధ్రభాషతోడనె యేకసఖీత్వము గన్న గాంధర్వవిద్య యాంధ్రులగర్వాభిమానములఁ బురికొల్పుననుట యేమి యసమంజసము! ఇట్టిదివ్యవిద్యనుగూర్చి యాకాశవిమానగామి భూమండలము మీఁదివైపునుపుఁ జూపించినట్లు శాస్త్రగహనంబుఁ జొరక వాదజ్వరము సోఁకెనేని ముసటుభంగ మగునేమో యని వెఱచుచుఁ బ్రకలో స్థలము సంకోచ మయ్యె నని మిష చూపి మాయజ్ఞానమును గప్పిపుచ్చుకొనుటకు మమ్ము విజ్ఞులు క్షమింతురు గాక.

ఈయుపవేదముల నాలుగింటికి నాలు గంగవేదములు పిల్లలు గలవు.

"ఆయుః శిల్పం జ్యోతిషాఖ్యో ధాతుద్యోతస్తు వై క్రమాత్."

అందు శిల్పధాతుద్యోతములగుఱించి మతభేదములును గ్రంథనామములును స్థలాంతరమున వివరించెదము.

# శ్రీ నగరాజకుమారికా పరిణయము

బ్రహ్మశ్రీ పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులవారు

### ౧. ఓం శ్రీమాతా.

క. శ్రీమాత! మణిద్వీప, స్వామిని! కామేశ్వరమ్మ! ♦ చయ్యన నన్నున్
జామాతగఁ జేయుము గిరి, భూమీశున కీవివాహ ♦ పుణ్యదినములలోన్.

### ౪. ఓం చిదగ్నికుండసంభూతా.

ఉ. జీతము బత్తెముం గొనక ♦ చెప్పినచొప్పున వెట్టి చేయుచుం
టే తనధర్మమంచు విధి ♦ యించితి మాత! చిదగ్నికుండసం
భూతతఁ జేసి యాపలుకు ♦ పూర్తిగఁ జూపితి చూచుచుంటి నా
చేతములోన నెప్డు వ ♦ సించుచు నాపొసరించుచుండు బల్
చేత లొకప్పుడైన "ఇది ♦ చేసితి నియ్యది యా" యటంచు నిన్
కాతరతానిదానముగఁ ♦ గంపము నొందుచు వేడికొంటకై
చేతులు దోయిలింపమిని ♦ చెప్పుట యొందుల కన్ని యైనత
ర్వాతను వేడుచుంటి నల ♦ పర్వతరాజహృదగ్నికుండసం
భూత సుధీవినీత ననుఁ ♦ బూర్తిగ నమ్మినయెమ్మెలాఁడి నా
కై తనచిత్తమున్ తనువు ♦ కాన్కగఁ బట్టినదిట్టురాలు నా
చేతములోన నుండెడి ♦ విశేషము లన్నియుఁ జూచుకొన్న ద
బ్బో! తనవంటిదంట యగు ♦ బోటి లభించుటె పున్నె మంచు నా
చేతము నమ్మునట్టులుగఁ ♦ జేసిన భాసురగాత్రి నైజమా
చేతమురీతి యందలివి ♦ శేషములన్ సరిజూచె కాక త
న్మాతసమేతముగ్ నిరస ♦ మానము గాఁగ నెఱుంగునట్లు ప్ర
ఖ్యాతము చేసినట్టి "అహ ♦ హా! ఇటువంటికృతార్థ యుండునే
యీతలిరాపుఁబోణిహృద ♦ యేశ్వరుఁ డీశ్వరు డంట! ఈవిధిన్
మాతయుఁ దాతయుం గలిసి ♦ మంచిదె యందురుగాక వెంటనే
యీతరుణిం దదీశ్వరున ♦ కీతరుణమ్మున నిచ్చి పెండ్లి చే
చేతురుగాక" అంచుఁ దన ♦ చెల్లెలిపిండును చెల్మికత్తెలున్
"నాతొలిపట్టి కిట్టిలల ♦ నామణి కట్టినుగండు గల్గ నా
ధాత లిఖించునే? యిది య ♦ థార్థమొ స్వప్నమొ? నిక్కమైనచో
నాతొలుబాములందలి య ♦ నంతతపమ్ము ఫలించినట్లు గాఁ
జేతములోన నెంచుదున ♦ శ్రీహరి కూఁతుమనోరథమ్ముఁ ద
త్తాతమనమ్మునన్ నిలిచి ♦ తప్పక తీర్చును గాత" యంచుఁ ద
న్మాతయు నంతరంగముల ♦ మాటికి నెంచఁగఁ జేయుచున్న దా
భీతకురంగనేత్ర నీకుఁ ♦ బెండిలికూఁతుఁగఁ జేసిపెట్టు మిం
తే తలితల్లి! నిన్నడుగ ♦ నెంచిన దీ వొసరింపఁ దగ్గదిన్.

### ౭. ఓం చతుర్బాహుసమన్వితా.

ఉ. బాహులు రెండు గల్గియు నె ♦ బాసన నిచ్చెద రెల్లరున్ జతు
ర్బాహులు గల్గి వెల్గు నినుఁ ♦ బ్రాంజలినై యిటు వేడుచున్న నా
దాహము నెట్లు తీర్చెదవొ? ♦ తల్లిరొ! మెల్లఁగ దానితండ్రి దు
ర్మోహముఁ బాపి నాహృదయ ♦ మోహిని గేహిని నెట్లు దెచ్చెదో?

### ౯. ఓం క్రోధాకారాంకుశోజ్జ్వలా.

ఉ. క్రోధము పేరియంకుశముఁ ♦ గొండొకచేత ధరింతువంబ! ఆ
భూధరరాజకన్యకత ♦ పోవిధికై నను జాలిఁ దాల్చి నీ
క్రోధమిషాంకుశమ్మనను ♦ కుంజరతుల్యుఁడు దానితండ్రికిన్
బోధముఁ బుట్టఁజేసి తన ♦ పుత్త్రిని దెచ్చి యొసంగఁ జేయుమా!

### ౧౨. నిజారుణప్రభాపూరమజ్జద్బ్రహ్మాండమండలా.

ఉ. ఖండితభండ! తన్వరుణ ♦ కాంతిమహాపరివాహమందు బ్ర
హ్మాండము లన్నియున్ మునుఁగు ♦ నట్టు లొనర్చి తనర్చునంబ! ఆ
కొండలరాజుగారి పెద ♦ కూఁతురు మూఁడవకన్నుతోడిబల్
పండితురాలు "నన్నుఁ దమ ♦ భార్యఁగ ధుర్యఁగ నార్యపుత్త్ర! కై
కొందురు కంత యేల? తమ ♦ కోసము దాఁచినయట్టిసొమ్మదిన్
గుండెయుఁ బిండిగాఁ జితుకఁ ♦ గొట్టుచు అట్టడి చేయుచున్నవా
రండి! దయామయా! 'అబల' ♦ అంచయినన్ కనికార ముంచి వే
ఱొండువిచారమున్ విడిచి ♦ యొప్పుగ ధైర్యము సాహసమ్ముఁ గై
కొం డిఁక దేవి మీకు న ♦ కూలయె కావున నెట్టులేని మీ
భండనపాండితిం దెలిపి ♦ భండపురాతనుఁ డాదిరైనయా
దుండగులన్ ప్రియా! మనసు ♦ ద్రోహముచేయుచునుండుగండలన్
గం డడఁగించి పట్టుకొను ♦ కట్టుకొనుం డిటు చిత్తగింపుఁ డి
యుండె యొసంగుదాన నిది ♦ యొక్కఁడె సేయదె పెక్కుకోటు లె
న్నండు తమర్ తృతీయనయ ♦ నమ్మను నాకు నొసంగి లోన "శ్రీ
మండలిలోన సర్వగుణ ♦ మాన్యవు క" యమ్మని యాశివమ్మొ కా
కుండినచో—అమోఘవర ♦ మో దయచేసితిరో వినుండి యు
న్నండె చుడీ నిజమ్ముగ మ ♦ నమ్మను మీకు నొసంగికొంటి "నె
న్నండును తీసికో" నని మ ♦ నమ్మున నమ్ముఁడు మీకుఁ జిత్తమున్
పండువుగాఁగ నిచ్చుకొని ♦ బాపురె! మాజనకుండు మూర్ఖుఁడై
యుండెలుగాఁగఁ గోసి వధి ♦ యింపఁదలంచిన—అట్లె చేసికొ
నిండు శరీర మింకొకని ♦ కిచ్చెదనే? అది వట్టిమాట; కా

* (బ్రహ్మశ్రీ పండిత పురాణం సూర్యనారాయణతీర్థులవారిచే రచింపఁబడిన పైప్రబంధములోని రెండవభాగమగు "ఈశ్వరాక్రందనము—లేక—ఫాలనేత్రాధ్యాయము" లోని కొన్ని పద్యములు ఇందు ప్రకటింపబడినవి. ఈ యాశ్వాసము శ్రీలలితాసహస్రనామములతో సంపుటితము.

నిండు మదీయవాంఛ్రతిన ♦ యీజననమ్మునఁ గాకయున్న వే
ఱొండగు జన్మమందయిన ♦ నొప్పరికింపక మీక భార్యనై
యుండెద మీరు న న్మఱవ♦కుండుఁడు నే మిము నమ్మికొంటి నో
పండితదర్శనీయ! కవి♦వంద్య! విభూ!" అని మాటఁ దెల్పుచున్
నిండినమామకీసరగ♦నీరధిలోనికిఁ గాలు జాఱియో
ఒందెను బుద్ధిపూర్వముగనో ♦ పడిపోయి "ఒహో! శతుండు కో
ము డిటు ద్రోసివైచె" నని ♦ మున్గుచుఁ దేలుచు గట్టుమీఁదఁ గూ
ర్చుండి తపస్సు చేసికొను♦చుండెడినక్ తనరాగవార్ధిలో
నుండి మ ఱెన్ని జన్మముల ♦ కొడ్డున కెక్కఁగ నాకు వీలు గా
కుండెడునట్లు—అట్లు తన ♦ ఓరిమి నీరముచేయు నిట్టుకో
దండునితోడ నేకమయి ♦ తాఱుచు డగ్గఱి ముందువెన్కలన్
కొండొకడైనఁ జూడ కతి ♦ కోపముతోఁ బడఁద్రోసె నందు; తా
గుండెది శ్లాకయుండునొకో ♦ గట్టులకేనికిఁ బుట్టినట్టి నా
దుండి యెటైన దాని నిటఁ ♦ దోడ్కొని ర మ్మల దానిగుబ్బలన్
కుండలమీఁదఁ బండుకొని ♦ కొంచెము తెప్పతి యీఁదుకొంచు నే
వెండియు-ఒడ్డు చేరుదున ♦ వేగమ తోడ్కొని రమ్ము; చెల్లరే!
తండిరి బుద్ధిపూర్వముగ ♦ దాని నొసంగుట కెట్లు నిచ్చగిం
పండ! శతుండు వానియెద ♦ బండ గదమ్మ! కరంగు నెట్టు లా
చండకి నీవ యెట్లయిన ♦ సాహసధైర్యము లీయవమ్మ! నా
దండఁ గలట్టిపాశమున ♦ దానిని గట్టిగఁ గట్టుమమ్మ! నా
యండకు వచ్చునందనుక ♦ నంకుశముం దగిలించి లాగు మే
దురిడగు లడ్డువచ్చినను ♦ తుండునుకల్ పొనరింప నిట్టుకో
దండముఁ బూవుటమ్ములును ♦ దానికిఁ గన్పడునట్లు పట్టుకో
చండిరో! నీవ కొంచె మిటు ♦ శాంతము వీడినఁ గాని వట్టిదీ
నుండన డైననాదగును♦నోరథ మెట్టులు పూర్తియౌను; వే
దండము లమ్మ! నీశుభప♦దమ్ములకున్ మదరాలివర్గమున్
దండనపాలు చేయువలె ♦ దానికి నాకును కిన్క తీఱఁగన్
కొండికనాఁటునుండి నినుఁ ♦ గొల్చుచునుండెడి పూర్వకాలభ
క్తుండను నిన్నె నమ్మికొని ♦ గొంతెమకోరిక కోరియుంటి? నా
యండజయాన నా కొసఁగు ♦ మప్పటినుండియు నీవు మేము బల్
కుండువు చేయుచుండెదను ♦ పాడుచునుందుము నీజయాంకముల్.

33. ఓం కామేశ్వరప్రేమరత్నమణిప్రతిపణస్తనీ.

తే. గీ. అమ్మ! కామేశ్వరునకు స్తనమ్ము లిచ్చి
యతనిప్రేమను పుచ్చుకొ♦న్నట్టిదాన
వచ్చలాపాంగ నాయొద్దఁ ♦ బుచ్చుకొన్న
ప్రేమకున్ దాని స్తనము లి♦ప్పింపుమమ్మ!

౮౦. కరాంగుళినఖోత్పన్ననారాయణదశాకృతిః.

క. ఎన్నఁ గరాంగుళినఖరో,
త్పన్న శ్రీహరిదశావ♦తారవు తానో
వెన్ననిపదిరూపు లొకొ్కక,
చన్ననఁ జూపింపఁ జాలు జాణ సుమమ్మా!

౮౫. ఓం శ్రీమద్వాగ్భవ కూటైకస్వరూపముఖపంకజా.

శా. శ్రీమద్వాగ్భవకూటముఖ్యవిలస♦చ్ఛ్రీచమన్ముఖాంభోరుహా!
శ్రీమాతా! ఇఁకనైన నాపయిని నీ♦చిత్తమ్ము రానిచ్చి వే
శ్రీమల్లోచనఖంజరీటవిలస♦చ్ఛ్రీచమన్ముఖాంభోజ నా
రామన్ జన్ జతగూర్చి తన్మదనసా♦మ్రాజ్యమ్ము నేలింపుమా!

౯౪. ఓం అకులా.

క. అకుల వయిన కామేశ్వరి!,
సకలము నీ కెఱుక విధివ♦శమ్మున భార్యా
వికలత గలిగిన నా కా,
సకలన్ సకలేందుముఖిని ♦ సరగునఁ దెమ్మా!

౧౪౦. ఓం నిష్కళా.

క. నిష్కళ వగు కామేశ్వరి!
దుష్కర్మం బైనను మద్వ♦ధూపిత మగు మా
నిష్కళ మగునట్టులుగా,
నిష్కృతిఁ గావింప దాని♦నిం దేవమ్మా!

౧౪౭. ఓం నిరాశ్రయా.

క. దేవి! నిరాశ్రయ! నీవలె,
నా వెలఁదియు నేనును నిరాశ్రయులము మ
మ్మీ వనో్యన్యాశ్రయులను,
గావించి యొసంగుమా! అఖండసుఖమ్మున్.